శ్రీ ర స్తు.

# శ్రీ కృ ష్ణ రా మా య ణ ము




గ్రం థ క ర్త,

మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ
వేదవిద్యావిశారద, అభినవవ్యాస, కవిరాజ, కవిసార్వభౌమ
ప్రసన్నవాల్మీకి

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు








ప్ర కా శ కు లు:

వేం క ట్రా మ అం డ్ కో.,

బెజవాడ - మద్రాసు

1948




[ వెల రు 8—0—0

# అవతారిక

" ఆదికావ్యవిశేషము లరసి తెలుఁగు
వ్యత్యయములందు సామరస్యమును గూర్చు
గనఁగవచ్చుజుగుప్సలఁ గడకుఁ ద్రోయు
నార్యహితము శ్రీకృష్ణరామాయణంబు."

"నా నృషిః కురుతే కావ్యమ్" అను వాక్కు జ్యోతిర్మయమైన భారతవాఙ్మయవీథియందు సహస్రాబ్దములనుండి ప్రతిధ్వనించుచున్నది. మనుష్యహృదయమందలి అనంతశక్తులు తపస్సువలన విజృంభించును. ఆదికవియైన వాల్మీకి తపసున బద్ధదీక్షితుఁడైనపుడే సృష్టి చిత్రములు నిలుచునంతకాలము వెలయఁగలు రామాయణ మహాకావ్యమును జగతికి ప్రసాదింపఁ జాలెను. వాల్మీకిననుసరించి మహనీయ గుణగరిష్ఠులైన మహాకవులు తమ జీవితక్షేత్రములను తపోభూములుగ నొనరించు కొనినవారే ! ఈ క్షేత్రములందు ఫలించిన రంగారు బంగారుపంట వ్యవసాయాత్మికబుద్ధి గల ప్రపంచ పథికుల దృష్టి నాకర్షించినది. సాహితీసీమంతిని నలరించినది. ముక్తిదూతలను తనిపినది. మునికులమున నుదయించి, మహిమోపేతఋషి సంప్రదాయముపై మనసుంచి, మహర్షియై, మహత్తర భావబంధురములైన గ్రంథ రాజములను రచించినవారు కవిసార్వభౌములైన శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలుగారు, మాతృస్తన్యముతో పాటు వీరు వైదికవాఙ్మయ దుగ్ధమును గ్రోలిరి. దివ్యజ్యోతులవలె సుధారాశులుములు వీరి మానస నేత్రము ముందు తేజరిల్లెను. తమ పూజామందిరమున నధివసించి యాజ్యోతిర్లలకు జేజేలు పాడి, వీరు తమయుపాసన యారంభించిరి. సౌందర్యోపాసన వీరి జీవితపరమావధి యయ్యెను. సత్యవ్రతము వీరి నిత్యారాధనమయ్యెను. 'శివమ్' అను నాశయము దివ్యదీప కళికయై వీరి పూజాపీఠమున వెలుఁగొందినది. ఉపనిషన్మధువు నాపోశన మొనరించి మంత్రద్రష్టయై అంతర్దృష్టితో హృదయస్థ సచ్చిదానందము నవలోకించి "శాంతమ్" "అద్వైతమ్" "అనంతమ్" అను

భావభరితశబ్దముల నుచ్చరించి అజాండమువంపునలె నాపదములు స్వీయహృదయ గర్భాలయమున ప్రతిధ్వనింపఁ దన్మయత్వమునవాత్మ విస్మృతుఁడై మధురమంజుల నిస్వనముతో బహుళగేయముల నాలపించుచు, హృద్యమైన పద్యసహస్రముల నుచ్చరించుచు, నిజ జీవితోద్యానమును బృందావన మొనరించి బృందావన విహారియైన శ్రీకృష్ణమూర్తియై మురళికి తమ లేఖినిని సహపాఠిని గావించి, మనసు ననిధిధ్యాస ధ్యానసమాధులందు తమ కాలమున నద్వితీయుడై తేజస్వియై మునీంద్రుఁడైన కవీంద్రుడై ప్రస్తుతయుగ ప్రణతుల నందుచున్న భాగ్యశాలి శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిలుగారు——

సత్య మొకయుగమున పరంజ్యోతియై తేజరిల్లి వేఱొకయుగమున నిర్వాణము నొందదు. కాలపథము క్రమక్రమముగా విశాలమగును గాని సన్నముకాదు. నవనవోన్మేషశాలిని యైనప్రజ్ఞ నైసర్గిక ప్రతిభయై యేహృదయమున దివ్యప్రదీపమై పరిఢవిల్లునో ఏయుగమందైనను ఆ హృదయమునుండి దివ్యమరీచికానిచయము దశదిశల ప్రసరించుచునే యుండును. జగదీశు డొకయుగమున మనుష్యహృదయమున కాపురముండి మఱొకయుగమున దానిని పాడుకొంపఁజేసి పోవడు. ఒకప్పుడు కాలసీమంతిని వీరప్రసవయై వేఱొకప్పుడు గొడ్రాలు కాదు. తపసులో సిద్ధహస్తులైన మహాపురుషులు సమస్తయుగములందును గలరనుటకు పెక్కుతార్కాణములుకలవు. సత్యము నన్వేషించి, సత్యము నారాధించి, సత్యనిర్వచన మొనరించుటకై బద్ధకంకణులైన విమర్శకులు మన కవిసార్వభౌములు. ప్రస్తుతయుగమున నాంధ్రధరిత్రిలో నుద్భవించిన ఋషివతంసుఁడైనమహారచయితయని వీరిని గ్రహింపకపోరు. విశాలదృష్టితో విజ్ఞానదృష్టితో వీరిగ్రంథరాజములను పరిశీలించు జిజ్ఞాసువులు ఏయుగమందలి మహాకవికిని వీరు తీసిపోరని గ్రహింపకపోరు. ఇచ్ఛాశక్తి, దృఢనిశ్చయము, వజ్రసంకల్పము, స్థితప్రజ్ఞ, వీరిసొమ్ములు. వీరిహృదయమున నొకతలంపు తలయెత్తినచో నించుకైన కాలహరణ మొనరింపక దాని చరితార్థతకై వీరు సర్వశక్తులను ముందంజవేసి యుద్దేశసిద్ధి నందినపుడే వీ రించుక విశ్రాంతి నొందెదరు. వీరిగ్రంథసృష్టి వీరితపస్సున పండినపంటయే! నూటయేబది

యుద్గ్రంథములు వీరి కఠోరదీక్షయంచు నుద్భవించినవి. భాషాపోష కిన్నిభూషణములను సమర్పించినను తమజీవితాశయము సిద్ధించిన దని తనిని జెందక ఆలోకసందీపిత కనకవసన సుందరియైన ఆంధ్రశారద కింకను వెలలేనిక్రొ సేతలను సమర్పింప నిశ్చయించి తలచినమాత్రమున నింకను గురుతర గ్రంథసృష్టి గావించుచు వాణీసేవఁ జేయుతటి కాయ క్లేశమును గణింపక వీరు దేశభ్రమణ మొనరించు చుందురు. ప్రపంచ మహాగ్రంథములలో నగ్రగణ్యమైన పంచమవేదమును ముగ్గురు మహాకవులు మూడుశతాబ్దములలో నాంధ్రీకరించిన మహాభారతమును కొలది సంవత్సరములలో పూర్వగ్రంథముకన్న రెట్టింపుగ మూలానుసారముగ వీరు తెనిగించి తెలుగుతల్లికి సమర్పించిరి. శ్రీకృష్ణ భారతమును రచియించినట్లే శ్రీకృష్ణ రామాయణమును దివ్యప్రతిభతో వీరు రచించిరి. మఱియు శ్రీకృష్ణభాగవతమున విశేషభాగమును పూర్తిచేసిరి. వివిధయుగములందు పలువురు మహాకవులు నిర్వహించిన కావ్యరచనమును వీరొక్కరు ఘనతర మహిమతో గావించుట చూచినప్పుడు ఏవ్యక్తి హృదయమున అద్భుతానందము లుప్పొంగవు ?

అనువాద, అనుకరణ, అనుసరణములు వీరిజీవిత పరమావధులని తలంపఁజెల్లదు. వీరి గ్రంథములలో వివిధఘట్టములందు సహజశక్తి స్పష్టముగా గోచరించును.

స్వతంత్ర సామర్థ్యము వీరిరచనమున పెక్కుదిక్కులందు జిజ్ఞాసువులదృష్టి నాకర్షించును. వీరిమధురవిజయము సూరనార్యుని కళాపూర్ణోదయమునకు దీసిపోని కల్పితోద్గ్రంథము. వ్యంగ్యభూయిష్ఠమై రసభరితమై, ఔచిత్య సమన్వితమై, ప్రతిభా ప్రదీప్తమై, సువ్యుత్పత్తి విరాజితమై, ధ్వనిగర్భితమై, రమణీయార్థ సంశోభితమై, ఉత్కృష్టాదర్శ ప్రదీప్తమై, సౌందర్య సందీప్తమై, సత్యవిలసితమై, శ్లేష గర్భితమై, భావపీయూష భరితమైనది కావ్యరచనమని యెఱింగి, తాత్త్వికవిభూతికి కవిత్వసంపదను తోడొనరించి, ప్రాచీన మహాకవుల కంజలి ఘటించియు, కవిసార్వభౌములు శ్రీకృష్ణ రామాయణమును రచించి ధన్యులైరి. వీరపూజ మహత్తరమైనదే; కాని వీరపూజ నెవ్వరును కనులు మూసికొని చేయరాదు కదా!

ప్రాచీనకాలమున నెట్టియుద్గ్రంథములు సృష్టియైనను, అవి యంతేవాసుల కంఠములందు ప్రవేశించెడివి. కర్ణస్థాంశములు గళస్థము లయ్యెడివి. గురుపరంపరనుండి పరను గురుపరంపరను, శిష్యపరంపర నుండి ప్రశిష్యపరంపరను వైజ్ఞానిక విషయములు చేరుతటి కొన్ని లుప్తము లగుచుండెడివి; కొన్ని ప్రక్షిప్తములు ప్రవేశించెడివి. నీతి శాస్త్ర, తర్కశాస్త్ర, తత్వశాస్త్ర, యోగశాస్త్ర, ధర్మశాస్త్ర అలంకార శాస్త్రములకు విరుద్ధములైన ఘట్టములు, కవియుద్దేశమునకు ప్రతికూలములైనవిషయములు, రచయితప్రతిభకు తలవంపులు తెచ్చు కల్పనలు ప్రాచీన కావ్యములందు ఒరులచేతులు దూరినపుడు పొడచూపినవి. సత్యారాధనము విమర్శకుని పవిత్రధర్మ మగునపుడు, పూజ్యులైన ప్రాచీనకవుల గ్రంథములందు ప్రక్షిప్తములు గోచరించి నపుడు వానిని వేలెత్తిచూపుటకును, తొలగించుటకును ఆతడు జంకడు. విషయ విమర్శనము నెఱుగనివా కేమనుకొనినను, సత్యారాధకులిట్టి విమర్శకుని కర్జమును ప్రశంసింతురు.

ఈవరలో ప్రచలితమైన రామాయణ గ్రంథములను శ్రీకవి సార్వభౌములు విశేషశ్రద్ధతో, విమర్శకదృష్టితో పరీక్షించిరి. సత్యముపై చూపు నిలిపి, ఔచిత్యముపై మనసుంచి వారు శ్రీకృష్ణ రామాయణమును రచించిరి.

భారతదేశమందలి కావ్యసృష్టికిని అన్యదేశములందలి కావ్య సృష్టికిని విశేష వ్యత్యాసమున్నది. తత్వశాస్త్ర మతశాస్త్రములు భారతసాహిత్య హృదయగోళమున నిమిడినవి. వేదములు మన సీమ యందు కేవలము సనాతన మతమునకు మాత్రమే కాక పురాణసృష్టి కిని కావ్యసృష్టికిని భావశబలతను చేకూర్చును. ఇతర దేశములందు వేదములు లేవు, అపౌరుషేయము లని పలువురు విజ్ఞానులచే విశ్వసింప బడు శ్రుతులు లేవు. అచటి పురాణములం దతిలోకచిత్రములు కొన్ని యున్నను మతాంశములం దవి ప్రస్ఫుటింపలేదు. ప్రతీచీసీమలందలి బైబిల్ (Bible) చారిత్రక యుగమందే పుట్టెను. బైబిలునెడల విశేష మైన మక్కువగల మిల్టన్‌కవి అందలి కథలను కలలలోకూడ గానం

జాలీ పేరడైజు లాస్టు (Paradise lost) రచించుట నిక్కమే కాని, వాని రచన ప్రాచీనవాఙ్మయ మని తలంపఁ జెల్లదు.

భారతకవులు చూపిన తెలుఁగుమార్గము ననుసరించి ప్రవర్తించుచు నగ్రేసరులైన యితరకవులు కొందఱు మాత్రమే యున్నారు.

మతవిశ్వాసము ననుసరించి కావ్యసృష్టి యగునట్లే ఆదర్శ జీవితవిధానమును సృష్టి యగును. గుండెలోని ప్రేవు లాయువుపట్టున నుండుటచే ప్రేవులను త్రెంపినప్పు డెట్లుపరమాయువు పటాపంచలగునో మతప్రోక్తాంశములు జీవిత నిర్మాణమునందును, కావ్యరచనమందును నెలకొనుటచే వానినుండి యవి తొలగింపఁబడుచో ఆనిర్మాణ మీరచనముతో ధూళ్యవలుంఠితమగును.

సనాతన మతసంబద్ధసాహితికిని ఆ మతసూత్రముల నెఱుంగక నూతనగ్రంథరచన మొనరించువారి సాహితికిని భేద మున్నది. కావున భారతకావ్యకర్తల దృక్పథమునకును, వారి కాంతరంగికముగ దూరస్థులైన ప్రతీచీకవుల దృక్పథమునకును వ్యత్యాసము గోచరించుచున్నది.

కర్మసిద్ధాంతము హిందూమతమునకు స్వతస్సిద్ధమైనది. భవ పరంపరలో సంబంధసూత్రము కల దని హిందూమతానుయాయులు గుర్తింతురు. జన్మపరంపరలో నంతర్యాతమైన కారణకార్యసూత్రము యోగదృష్టికి గోచరించునుగాని స్థూలదృష్టికి కాదు. ఆత్మశక్తికి తోచునుగాని యింద్రియశక్తికిని మానసికశక్తికిని గాదు. ప్రస్తుత భవమును ప్రచలిత మొనరించు వాసనలును, ఊహలును, బుద్ధులును భవ పరంపరాను భూతిననుసరించి పొడసూపి వర్తమాన జన్మమందలి శిక్షణ తపసులనుబట్టి పరిణతి నందును. భారతకావ్యములను పరిశీలించి కావ్యపాత్రములచరిత్రలను సమీక్ష చేయునపుడు కర్మసిద్ధాంతమును దృష్టి నిడుకొనుట విమర్శకునివిధి. ఈ సిద్ధాంతమున విశ్వాసము లేని ప్రతీచీ కవులకృతులను వారివారి ధార్మికసిద్ధాంతముల ననుసరించియు సాంఘికాచారముల ననుగమించియు విమర్శింపవలెను.

దుష్టశిష్టశక్తుల సంఘర్షణము ప్రపంచ మహాకావ్యమునందు చిత్రింపబడినది. రామాయణ భారతములం దీయంశము స్పష్టముగ గోచరించుచున్నది. శ్రీరామ యుధిష్ఠిరులు శిష్టశక్తిని, రావణదుర్యోధనులు దుష్టశక్తిని దృష్టాంత రీకరించు వ్యక్తులు. షేక్స్పియరు (Shakespeare) గెతే (Goethe), షిల్లరు (Schiller), మిల్టన్ (Milton మున్నగు పాశ్చాత్యకవులు కూడ ఇట్టి పాత్రములను తమ తమ కావ్య రంగములందు నిలిపిరి. షేక్స్పియరు సృష్టించిన అయాగో (Iago), ఎడ్మండ్ (Edmund), లేడీ మేక్‌బెత్ (Lady Macbeth,) మూడవ రిచర్డు (RichardIII) మున్నగు దుష్టపాత్రములును, గెతే మహాకవి సృష్టించిన మెఫిస్టోఫెలిస్ (Mephistopheles) పాత్రమును, షిల్లరు సృజించిన రాబర్ (Rober) పాత్రమును, మిల్టన్ తన కావ్యమున జూపిన సేటన్ (Satan) పాత్రమును ఒక్కదిక్కున నిలిచియుండ, వాల్మీకి సృష్టించిన రావణుండును, వ్యాసకవి సృజించిన దుర్యోధనుండును వేఱొక్కదిక్కున నిలిచిరి, ఆదుష్టులకును, ఈదుష్టులకును కొన్ని ముఖ్యాంశములందు వ్యత్యాసము కలదు. సూక్ష్మదృష్టి పరిశీలనము వలన గ్రహింతుము. భారతీయ సంస్కృతినుండి వెలారువెలుంగుపై చూపునిలిపి విమర్శకులు భారతీయ కావ్యములను పరిశీలింపవలెను.

పూర్వోక్తాంశములను దృష్టి నిడుకొని శ్రీ కవిసార్వభౌములు ప్రస్తుత గ్రంథమున సృష్టించిన పాత్రములను పాఠకు లవలోకింపవలెను. సనాతనధర్మసూత్రములను, ఉదాత్తతాత్త్విక సిద్ధాంతములను, ఉత్తమ కావ్యలక్షణములను జీర్ణించుకొనిన మహామహోపాధ్యాయులు కవి సార్వభౌములు. ఈలక్షణములను ఆ సూత్రములను గ్రహించినరచయిత లొండొరుల ఛాయాచిత్రము (Photographs) లని తలపఁ జెల్లదు. వారి రచనములందు ప్రత్యేకవ్యక్తిత్వము ప్రస్ఫుటించుట తథ్యము. ప్రస్తుతగ్రంథములోని ప్రతిఘట్టమందును కళాప్రపూర్ణులైన శ్రీశాస్త్రి గారి సహజశక్తి వ్యక్తమగుచున్నది. ఆదికవియైనవాల్మీకికి నమస్కరించినను ప్రతివిషయమందును ఆ మహాకవి వెనుక వీరు నిలిచి "భళా భళి!" యనలేదు. పాశ్చాత్యకవులు సృజించిన పాత్రములకును వీరు సృష్టించినపాత్రములకును వ్యత్యాసము స్పష్టముగా గోచరించుచున్నది.

గతభవములందలి రావణుని పుట్టుపూర్వోత్తరములను పరిశీలించి యీతని చరిత్ర నవలోకింప వలెను. రమాధవపార్శ్వవర్తులైన జయవిజయులలో నీతఁడొక్కఁడు. వైకుంఠధామద్వారమున నీతడు పాలకుడై యుండెను. విష్ణుమందిరమున తొలుత భక్తప్రవరుడై వెలసెను గాని మిల్టన్ సృష్టించిన సేటన్‌వలె భయదనిరయకుండమున (Stygian pool) మ్రగ్గినదుష్టుడితడు కాదు. విష్ణుకింకరుడు మునిశాపమునకు గురియై విశ్వరంగమున కొండొకవడి విష్ణువట్లు గోచరించి అనంతరమున స్వకీయమైన పరమపదమును పడసెను.

పూర్వజన్మజ్ఞాన మెఱిగిన రావణుడు సాయుజ్యమోక్షమును కాంక్షించినట్లు కవి సార్వభౌములు స్పష్టముగా తెలిపిరి. ఈ పంక్తులను పరిశీలింపుడు.

"దశకంఠుడు ... ... యొక్కనాఁ డేకాంతంబున నొక్కరుండ కూరుచుండి తన జన్మంబునకుం జింతించుచుఁ దనలోనః—

చ. సనక సనందనాదిమునిచంద్రుల శాపము కారణంబుగా
వనటఁ బడంగనై యిట సుపర్వత వోవ నపర్వజన్మమున్
గొనినను క్రూరభావమునకుం గుదురై త్రిజగజ్జనైవ్యామై
కనదగువర్తనిన్ మెలఁగఁగా నయి యుంటి విధి ప్రసంగతిన్.

క. హరివరము కలదు వైర
స్ఫురణంబునఁ మూడుజన్మములు చనుసంతన్
దొరకును సాయుజ్యం బని
చిరకాలం బెట్లు నెట్లుచేయఁగ నగునో.

ఆ. హరికి వేఁడిపుట్టునట్టి కార్యంబులు
చేసి కినుక పెంచి శీఘ్రకాల
మంద చావుకొఱకు మందు సంపాదించి
విడిచిపెట్టవలయు నొడలు వడిగ.

"లోకరక్షకుండు నన్నుఁ జంప రఘువంశంబున నవతరించును."

(బాలకాండము – తృతీయాశ్వాసము–పుటలు 116–117)

ఈ వాక్యములవలన రావణుఁ డాత్మజ్ఞానము కలవాఁడని స్పష్ట పడుచున్నది. సీత నాతఁడు స్పృశింపలేదు. ఆమెను తన యంతః పురములో నిలుపక నశోకవనమున నుంచెను. రామునిపై,— ఆత్మా రామునిపై నాధారపడిన యాత్మకు నశోకస్థితి చేకురునుగాని శోకము కాదు.

సీతాదేవి పలికిన యీ వచనముల నవలోకించునపుడు రావ ణునిచరిత్ర యెట్టిదో స్పష్టమగును

"............వీనివంక నాకుఁ

బుత్ర భావంబునం జాలిపుట్టు వినుఁడు.

సీ. ఋషివేషమున వచ్చి యే మూర్ఛ మునిఁగిన
తఱి నన్ను ముట్టక ధరఁ బెకల్చి
కొనిపోయె నాదలఁ గొనఁ గాని దారిలో
నేయింత తప్పును జేయఁ డయ్యెఁ
దనయింటిలోఁ బెట్టుకొనినఁ దప్పగు నని
యుపవనంబున యుందు నునిచి మనిచె
నాదు రక్షణమున కేదిలోపములేని
గతిఁ గూర్చెఁ ద్రిజటాదిసతుల నిల్పి

తే. ఎన్ని యెన్నియొ వారము లేగుడెంచి
బెదరు వడునట్లు లేవియో వదరుఁ గాక
యొక్కనాఁడును దుష్టత్వ మొంది కాని
పనికి జతనింపఁ డయ్యె నీవ ర్తిగళుఁడు.

క. ననుమాతృభావముం గొని
కనుఁగొనెనే కాని తప్పుగతి కేనాఁడున్
మనముం జేసి యెఱుంగఁడు
ఘనుఁ డాతం డందుఁ గాని ఖలుఁ డన నయ్యెన్."

(ఉత్తరకాండము–ప్రథమాశ్వాసము–పుటలు 894-895)

మఱియు రావణుండు మందోదరితోఁ బ్రసంగించిన విషయము మును వాని మనో నిశ్చయమును వెల్లడించుచున్నది.

మ. చెఱఁబట్టెం జనకాత్మజాత నని కోంచెం జేసియుం గానకి
త్తెఱఁగుల్ పల్కుచునుండ్రు లోకు లెద నింతే దోష మూహింప నే
నెఱుఁగం జాలుదు నన్నుఁ గన్నతలి యై యేవేళ నే బిడ్డనై
యెఱఁగం బోవుదుఁ గాని యొండుగతిగా నేఁ బో నెఱుంగం జుమీ.

క. ఎఱిఁగియె చేసితి నింతయు
నెఱుఁగుదు జనకాత్మజాత నిందిర యని నే
నెఱుఁగుదు రాముఁడు హరియని
యెఱుఁగుదు నాచావు నిక్కమే యని గరితా.

(యుద్ధకాండము - తృతీయాశ్వాసము పుట 311.)

ధర్మమునకు హాని గలిగింపఁ బ్రతికూల పరిస్థితులు విజృంభించి నను, అట్టివిపత్తును తల యెత్తనీయకుండువారు మహాత్ములైన భారత కవులు. సీతపై దుష్టునిచేయి పడినచో ధర్మము నేలఁ గూలు ననియు, లోకమే మంటఁ గలియు ననియు, ఆత్మజ్ఞానము గలవారు విశ్వసింతురు. లోకహృదయమున కారాటము గలిగింపక సుగంధసేచన మున కెనయైన సాంత్వనమును దానికి బ్రసాదించి పున్నెము కట్టు కొనినవారు కవిసార్వభౌములు. దుష్టపరిస్థితులందు జిక్కినను, సీతాదేవి చరిత్ర నిర్మలమై మహత్తరమై యున్నదని మనుష్య లోకముత్రోల కంఠమెత్తి వచింపవలె ననిన అత్యాచారమునకు గడంగుటకు సమర్థుఁడైన రావణుఁడు హద్దు మీఱి విజృంభింపక సంయమియై, ఆత్మజ్ఞానము గలిగిన వ్యక్తియై యుండెనని రూఢిచేసికొని తీరవలెను. రావణునికొఱకై కాకమాని, సీతకొఱకే రావణునిపాత్రను నిట్లు చిత్రించిన కవిసార్వభౌముని విశాలదృష్టిని, విజ్ఞానదృష్టిని సభ్య ప్రపంచము సర్వకాలములందు బ్రశంసించితీరును. ప్రాచీనసాహితీ గౌరవమును కాపాడిన మహనీయులు శాస్త్రిగారని సహృదయులు వారిపై పూలు చల్లక మానరు.

సీత పాత్ర చరిత్రమునకు తన స్వాతంత్ర్యశక్తిని పురస్కరించుకొని వారు ఘనతరమహిమను చేకూర్చిరి.

ప్రాచీ ప్రతీచీకవులు సౌందర్యమును వేఱువేఱు దృక్పథములతో పరిశీలించిరి పాశ్చాత్య సాహిత్యదృష్టికి మేలుబంతిని జూపినవారు గ్రీసుదేశస్థులు. బాహ్య సౌందర్యోపాసన (Hellinims) లో * వా రారితేరిరి. మత్తుపుట్టించు పానీయమున వారికి ప్రీతిమెండు. ఈ పానీయమును నైవేద్యముగ స్వీకరించువారి వేల్పు బేచెస్ (Bacches) భారతీయ సాహిత్యప్రపథ వేఱొకతీఱున నున్నది. 'అమృతస్యపుత్రు' లనంబరగిన భారతీయులు సుధాపూరిత హృదయులై తమ రచనములను పీయూషభరితము లొనరించిరి. బాహ్యసౌందర్యముపై చూపు నిలిపినను, ఆంతరంగిక సౌందర్యము గుణసౌందర్యము (Mysticism) మహత్తరమైనదని వారు గ్రహించిరి. ఈ ముఖ్యాంశముపై మనసు నిలుపుటచే మన కళాప్రపూర్ణులు సీతాదేవి పాత్రమునకు ఘనతింత వన్నె దెచ్చిరి. శ్రీరామునిచే సీతను వారిట్లభివర్ణింపఁ జేసిరి.

క. మెఱమెఱలాడెడు మే నీ
తెఱవకు మబ్బునను మిగులఁ దేఱి తొలఁకరిన్
మెఱసెడు మెఱుఁగుల ప్రోవను
తెఱఁగునఁ బరికింప నొప్పుఁ దేజస్స్ఫూర్తిన్.

(బాలకాండము - చతుర్థాశ్వాసము. పుట 193.)

అంతటితో నూరకొనక ఆమె సౌందర్యమును వర్ణించుచు కవిసార్వభౌము లిట్లు వచించిరి.

"తే. జానుగల శ్రీల్ పిఱుందుల దా నడుమున
శా నుకుటఁ గ్రార పొక్కిటిలోన బొట్టు
ఘ్రాణమున నొత్తు కేల దీర్ఘములు దోప
రమణి బుధులెంతు రకర బ్రహ్మ మనుచు.

* వారి విధానము ననుసరించిన కీట్స్ (Keats) 'కవి సుందరవస్తువు ప్రమోదదాయక' మనెను. (A thing of beauty is a joy for ever).

తే. నడుము మాయ కేదారము నాభి కుచయు
గంబు శ్రీగిరి కూర్మము కాళ్ళమీఁదు
మోవి మధురాంక మని కాంచి పువ్వుఁబోఁడిఁ
దైర్థికులు తలంచెదరు క్షేత్రచయ మనుచు."

(బాలకాండము – చతుర్థాశ్వాసము, పుట 180-181.)

గ్రంథమండలి గంభీర భావబంధుర వాక్యాలలో నివి కడుంగడు ముఖ్యములని నాయభిప్రాయము. *

అగ్నిపరీక్ష లెన్ని యెదుర్కొనినను ఆధ్యాత్మికశక్తి చరితార్థత నంది తీరవలెనని మన ధార్మిక కావ్యసంప్రదాయము కంఠమెత్తి వచించుచున్నది.

రామాయణకథతో కొంత పోలికగల కథను గ్రీసుసీమలోని ఆదికవియైన హోమరు రచించినను అపమృతియైన హెలెన్ప్రోల నగ్నిపరీక్షనుగాని, అసిధారావ్రతమునుగాని ఆతఁడు నిలుపలేదు. స్పార్టా (Sparta) ప్రభువున కతిథియైవచ్చి సుందరియైన హెలెన్ (Helen) గొనిపోయిన దుష్టుఁడు రావణునిబోలిన సంయమికాడు. ఆతనివలె నాత్మజ్ఞానముకలవాడుకాడు. ధర్మమహాత్వ నిరూపణము హోమరుకవి పరమాశయముకాదు. స్థూలదృష్టితో పరీక్షించినపుడు ప్రాచీప్రతీచీకావ్యములందు కొన్ని పోలిక లగపడుచున్నను సూక్ష్మదృష్టితో సమీక్షచేసినపుడు ప్రత్యేక కావ్యసృష్టియందు వ్యత్యాసము గోచరించుచున్నది.

---

* సౌందర్యోపాసనకు సంబంధించిన పూర్వోక్తప్రాచ్య సంప్రదాయమును ఆంగ్ల మహాకవియైన షేక్స్పియరు గుర్తించియే సీతసమీపమున నిలువ నర్హత సంపాదించిన డెస్డిమోనా (Desdemona) పాత్రమును సృష్టించినాడు.

"A paragon of beauty that excelled the Quirks of blazoning pens" కవుల పలుకులకందని ఆమె శారీరక సౌందర్యము నభివర్ణించిన యా యాంగ్లకవిసమ్రాట్టు ఉదాత్త సౌందర్యాతిశయమెట్టిదియో ఇట్లు చెప్పించెను.

"తండ్రీ నాప్రాణపతి సౌందర్యము నాతని హృదయమందే యవలోకించితిని." (Father! I have seen the beauty of my lord in his heart.)

గ్రీసువాసులందఱు తమతమ వైషమ్యములను విస్మరించి పది సంవత్సరములు దేశగౌరవ సంరక్షణమునకై జాతిమర్యాదల సముద్ధరణమునకై ట్రోజను యుద్ధముసలిపెనని హోమరుకవి తెలిపెను. ఆతని యుద్ధవర్ణన మద్భుతముగా నుండెను. ఒకవైపున ఎఖిలిస్ (Achilis) వేరొకవంక హెక్టర్ (Hector) అను మహాయోధుల నాతడు కదనాంగణమున నిలిపెను. కాని రామునిం బోలు అవతారపూరుషుని గాని హనుమంతునిబోలు భక్తవరేణ్యుడైన మహావీరునిగాని. హెలెన్ సీతవంటిదాని నిరూపింపజాలని ప్రతీచీకవి సృష్టింపలేకపోయెను.

హెలినిక్ వసుంధరలోని యోధవరులు ట్రోజనుయుద్ధములో పాల్గొనిరి. శ్రీరాముని అనుయాయులు భక్తిభరితహృదయులైన వనచరులు మాత్రమే. ఈ భక్తిశక్తిని వ్యక్తీకరించుట భారతకవి పరమాశయము కాని గ్రీకుకవి యుద్దేశము కాదు. ఈ యాధ్యాత్మిక శక్తియే అద్భుతసేతు నిర్మాణమునకు హేతు వయ్యెను. కవిసార్వభౌముల వాక్కులను పరిశీలింపుడు.

తే. వేలుపులు దాని మెచ్చి ఓహ్వోళ నద్ది
గగనమందు నక్షత్రమార్గంబు స్వాతి
మార్గమునదది దీపించు మాద్రిఁ గడలి
మీఁద సేతువు దీపించె మోద మిడుచు.

(యుద్ధకాండము - ప్రథమాశ్వాసము, పే 162)

దైవసంపదచే విజయధ్వజ మెత్తించుట భారతఋషి కవుల యాశయము ఆత్మశక్తి సమక్షమున పశుబలము పనికి రా దని వారు వేర్వేరు కావ్యఘట్టములందు నిరూపింతురు. పంచభూతములు సమున్నత మాత్మశక్తికి లొంగి తీరునని ముక్తకంఠములతో వారు రూఢి చేయుదురు. శ్రీరామునిలోని దైవీశక్తి ప్రమోల కడలి కంపించె నని రామాయణ మహాకావ్యమున విలోకింతుము. మన మహామహోపాధ్యాయుల వచనములు పరిశీలింపుడు.

తే. ఎంత ప్రార్థించినం గాని పంతగించి
నట్లు మిన్నులు ముట్టు నీయబ్ధి వీని

త్రు ళ్ళడంచెద నిప్డు నాదోర్బలమున
ననుచు బ్రహ్మాస్త్ర మరి వేసె నట్టియెడల.

మ. ధర గంపించెఁ బయోధులుం గలఁగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె ది
క్కరులున్ మ్రొగ్గె ననంతుఁడుంబడియె జిక్కల్ రాలె భూమీధ్రముల్
విరిసెన్ విష్ణుపదంబు వ్రేలి పగిలెన్ వేవెల్గు రేవెల్గు నం
దిర మేదం గతిఁదప్పి రెల్లకడలం దీపించెఁ బెంజీకటుల్. ౧

(యుద్ధకాండము – ప్రథమాశ్వాసము. పే 160)

పంచభూతములను సయితము పదదళిత మొనరింపఁజాలుశక్తి యొకటి కలదని ప్రతీచీకవులు విశ్వసించినట్లు వారి సారస్వతమున దృష్టాంతము లగపడవు. భీషణ పరిస్థితులకు లొంగి ఆత్మార్పణ మొనరించుకొనిన కొందఱు వ్యక్తులను వారిరంగస్థలము లందలి కుశీలవులతో మనము విలోకింతుము: కావుననే విషాదాంత నాటకములను (Tragedies) పాశ్చాత్య సాహిత్యమున నవలోకింతుము. శీలముపై, ధర్మముపై దెబ్బ పడనిచ్చునది మనసాహితి కాదు. కష్టము కత్తి నెత్తవచ్చును.. వ్రేటు పడినను, అది పూలమాలయై ప్రత్యక్షమగును. లేదా విధినియమము త్రిశూలపాణియై సాక్షాత్కరించి కత్తిని బూనిన కరమును వెనుకనుండి గట్టిగా పట్టుకొనును కడగండ్ల నెదిరించిన సాధకుని "భళీ!" యని మెచ్చుకొనును. సాధకుని మ్రోల నగ్నిపరీక్ష ప్రత్యక్షమగుటయు నిక్కమే! నిప్పులగుండములో నావ్యక్తి లంఘించి నప్పు డాయగ్ని పగడపురాశియైతీరును. లేదా రక్తకుసుమములకుప్పయై గోచరించును. ఉదాత్తాశయసిద్ధికై జీవితము గడపినవ్యక్తి అనల కుండమున నవధర్మశలాకవలె జూపట్టును. ఈ ఘట్టము నెఱిగిన కవిసార్వభౌములు "యెల్లరు నివ్వెఱపడి చూచుచుండ గుభుల్లున నగ్నిహోత్రంబునఁ బడిన" సీత నెట్లువర్ణించిరో వీక్షింపుడు.

చ. వెలయఁ బ్రవర్గ్యమందు వలె వెల్గుచితాగ్నిచయాంతరంబునన్
నిలిచి కరంబులన్ మొగిచి నింగి గనుంగొను నామె కీలలన్
గలయఁగఁ బర్వనై కళలఁ గ్రాలెడు బంగరుబొమ్మ నాఁగనై
వెలుఁగులలోన నొక్కఁడగు వెల్గన వెల్గె మహాద్భుతంబుగన్.

(యుద్ధకాండము - చతుర్థాశ్వాసము పుట 888.)

కొన్ని కొన్ని సందర్భములలో షేక్స్పియరు తనపూర్వులైన ప్రతీచీకవులు నిర్ణయించిన స్థలసమయ నియమముల (Unities of Space and time) నుల్లంఘించి స్వతంత్రమార్గము ననుసరించి యగ్రేసరుడైనను అందందు భారతీయసారస్వత సంప్రదాయము నాతఁడు గుర్తించె ననుటకు దృష్టాంతము లాతని రచనమున గోచరించినను భారతఋషికవుల రచనావిధుల నాతఁడొజ్జబంతులు చేసికొనెనని తలపఁ జెల్లదు. "కష్టవార్థిని కత్తితో నెదుర్కొనుట" (Taking up arms-against a sea of troubles)అను వాక్యమాతడు హేమ్‌లెట్ (Hamlet) నాటకములో ప్రయోగించుట నిక్కమే. సముద్రునిపై శ్రీరాముఁడు బ్రహ్మాస్త్ర మడరించుటవంటి దీయాంగ్లనాటకమందలి సన్నివేశ మని మన మూహింపరాదు. ధర్మమూర్తి భయదములైన అరిష్టములను జయధ్వజము నెత్తజాలు నాత్మవిశ్వాసముతో మార్కొను వైజ్ఞానిక సందర్భమిందు లేదు షేక్స్పియరు కవి యీ ఘట్టమున కావించిన రూపకప్రయోగములో దోషమున్నదని కష్టసైన్యమనుటకు మాఱు కష్టవార్థి యని యాతఁ డనుటచే నట్టి యాలంకారిక దోషము ఘటిల్లెను. గాని రామాయణ కర్తవలె నా సందర్భమున నుత్కృష్టాధ్యాత్మికశక్తి విజృంభణమును దృష్టాంతీకరింపనాతఁడెంచెనని మన మూహింపరాదు.

పంచభూతములపై ప్రభుత్వమును నెలకొల్పుశక్తి దైవాత్మకు గలదని భారతకవి నిరూపించిన విషయము ఇలియడ్ ఒడిస్యూస్ (Iliad Odesseus) గ్రంథములను రచించిన ప్రతీచీ ప్రథమకవికిని ఆతని యనుయాయులకునుదురూహ్యమైనదియనుటకునుదాహరణములనేకము లుకలవు. అపహృతయైన హెలెన్ సంరక్షణకై అగ్రేసరులైన యోధప్రవరులలో అగమెమ్నన్ (Agimemnon) శ్రీరాముని గమనమును సింధువు నిరోధించినట్లు ఆతనిగతిని సముద్రదేవత నిరోధించెను. మహోదధిని శాసించుశక్తి అవతారపురుషుఁడైన శ్రీరాముని కుండెనుగాని కేవల మానవుడే యైన గ్రీకుయోధునికి లేదు. మహోదధిని గడగడ వడికింపఁ జాలు బ్రహ్మాస్త్రము వీని చేతులందు లేకుండెను. సముద్రదేవతకు ప్రీతి గొల్పుటకై ముద్దుకూతురైన ఇఫిజీనియా (Iphigenia) నీతఁడు బలి గానింప వలసి వచ్చెను. దేశ గౌరవసంరక్షణమునకై ముందంజవేసిన

యోధుఁడు దుహిత సహితశక్తికి సమర్పించెను. ఇది యాత్మార్పణ మనుట నిస్సంశయమే. ప్రతీచీసారస్వతమున నాత్మార్పణము మహోత్కృష్టమైన యాదర్శమై యొప్పుచున్నది. హోమరుకవి యనంతరము శతాబ్దములు కడచిన పిదప నీ యాదర్శమునకు తన బోధ దృష్టాంతములందు విశేషప్రాముఖ్యము నొసగిన ప్రవక్త యేసు. ఆత్మవిజయమునే ప్రాచీసాహితి ఉగ్గడించు టెఱిగిన కవిసార్వభౌములు రామాదుల ప్రభావమును తమ గ్రంథమున నభివర్ణించిరి.

కవిసార్వభౌములు కైకపాత్రమును కరుణతో వీక్షించిరి. ప్రత్యక్ష ప్రపంచమున స్థూలదృష్టికి గోచరింపని కొన్నిశక్తుల ప్రేరణ ననుసరించి జీవితరంగమందలి ఘట్టములు పొడసూపుననియు వ్యక్తిగత శక్తి విజృంభణమునకును, పురుషకారమునకును, అవకాశము లున్నను, ఆశక్తులను త్రోసిరాజన రాదనియు మనము విశ్వసింపవలెను. "నిమిత్తమాత్రంభవ సవ్యసాచిన్" అను వాక్యము మనము విస్మరింపరాదు. దుష్టశిక్షణ శిష్టరక్షణ ధర్మసంస్థాపనములు ధర్మమునకు గ్లాని కలుగునపుడు జగతిపై నెలకొనవలెను. * ఇది యీశ్వరేచ్ఛ. ఈ యిచ్ఛ విజృంభించుటకు వలసిన సన్నివేశములు పృథ్వీరంగమున గోచరించి తీరును. రాక్షస సంహారము జరుగవలెను. శ్రీవిష్ణువు శ్రీరాముఁడై విశ్వరంగమున నిలిచెను. అయోధ్యలో పట్టాభిషిక్తుఁడై మణిస్థగిత స్వర్ణసింహాసనమున సుఖాసీనుఁడై భాగ్య భోగ్యముల ననుభవించుటకై భగవంతుఁడు వైకుంఠమునుండి యవతరింపలేదు. ఆతఁడు త్యాగియై వనసీమకుఁదరలనిచో రాక్షస వినాశము జరుగదు. ఈ కర్తవ్య నిర్వహణమును బురికొల్పు హేతువు అయోధ్యలోగాక సాంద్రగహనమునఁ దలయెత్తవలెను. స్థూలదృష్టికి గోచరింపనిశక్తి స్వస్థలమునకు దూరస్థమైన ప్రదేశములో తనయాట పందిరిని సృష్టించుకొనెను. ఈయాట పందిరిదెస శ్రీరాముని నడపుటకై పూర్వోక్తశక్తి కైకను నిమిత్తమాత్ర మొనరించుకొనెను.

---

* "యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం" "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"

తా త్త్వికసత్యము కవితావసుమతిలో స్వరూపము దాల్చి నిలువ వలెను. కావ్యరంగమున శాస్త్రవిషయ నిర్వచనము ప్రబోధ మట్లు ప్రకటితము కాదు. మానసనేత్రము మ్రోల గోచరించు కావ్యఘట్ట ములనుండి రంగస్థలమందలి వివిధదృశ్యసమన్విత కార్యకలాపము నుండి పాత్రముల హావభావములనుండి పాఠకలోకము పాఠమును గ్రహింపవలెను. విషయచిత్రలేఖనము కవీంద్రుని యుద్దేశము కాని విషయమును గురించిన గురు గంభీరోపన్యాసము కాదు. మేధను దృష్టి నిడుకొని శాస్త్రము బోధనము నారంభించును. హృదయమును దృష్టి గొని కళ రససృష్టిని గావించును. చర్చగాని బోధగాని రసమును సృజింపవు; రసభరితఘట్టముల కవి చెరుపు దెచ్చినను దెచ్చును; పాఠకుల క్షివి విసుపు గలిగించినను గలిగించును. కావ్యాశయము కేవలము పండితబృందమును మాత్రమే కాక పామరసముదాయమును సయితము తన పాఠక ప్రపంచకమునం జేర్చుకొనును. ఈ యాశయ చరితార్థతకై అది తనకు స్వతస్సిద్ధమైనచరితార్థమునే యవలంబించును.

శాస్త్రవేత్త భాష్యకారుడు కాజాలును. కావ్యకర్త సృష్టికర్త యనుట నిస్సంశయము. సృష్టికర్త స్థూలదృష్టికి గోచరింపడు గదా ఆతడు మన యెదుటనిలిచి యుపన్యసింపడు. తార్కికసూత్రములను పురస్కరించుకొని ఘనపాండితి విజృంభణమునకై గ్రుక్కిళ్ళుమ్రింగుచు మనకాతడే విషయమునైనను నచ్చజెప్పడు. వసుమతిరంగమునం దాతడు సృజించు వివిధ దృశ్యములందును, రసభరిత సన్నివేశము లందును వానియూహలను మనము గ్రహింపవలెను. కవీంద్రుడై నిలుచు సృష్టికర్త యుద్దేశములను మనమిట్లే యూహింపవలెను.

మనకవి సార్వభౌముని సృష్టిలో పూర్వోక్తమైన విధినియ మమును మనము గుర్తింపవలెను. అజ్ఞప్రేరిత సన్నివేశమును మనమీ వచనములం దవలోకింప గలము.

తే. అపల నయ్యజ్ఞప్రేరిత మైనవాణి
కైకహృదయంబునం జొచ్చి కప్పెం దొంటి

బుద్ధినంతయు నంతలోఁ బొందితి మదికిఁ
జెప్ప లేనంత యావేశ మప్పు డొదవె.

(అయోధ్యాకాండము-ప్రథమాశ్వాసము-పుట 220.)

విధినియమమునకు నిమిత్తమైన కైక దోషాకృత్యకృత్తి యని మన మూహింప రాదని శ్రీ శాస్త్రిగారి యుద్దేశము. కైక సహజముగ పూతచరితయే యని వారు నిరూపించిరి. కైకచే వారు చెప్పించిన పల్కులను పరిశీలింపుడు :

"తే. రాముఁడు గుణాభిరాముఁడు రాముఁ డగ్ర
పుత్త్రుఁ డాతఁడు రాజయి భూతలంబు
నేల నగుఁ గాని మఱియొక్కఁ డేల యర్హుఁ
డగు యథాన్యాయపథ మిది యగును గాదె."

"ఉ. తమ్ములనంగ నాకెని కెదం గల వత్సలత న్వచింప లే
మమ్మహితాత్ముఁ డయ్యనుజు లందఱకంటెను బెద్దతమ్ముఁ డం
చెమ్మెయి మీఱ నాభరతునే కను చుండును వానికై శరీ
రమ్మది యైనఁ బీడు నల రాముని వేఱొకరీతి నెంతురే."

"ఆ. రామచంద్రుఁ డామె నేమాడ్కిఁ దల్లిగా
ననుచుఁ గొలుచునట్లు నను సుమిత్ర
గన్న తల్లులంచు గారవంబునఁ గాంచి
కొలుచుచుండు నెపుడు గుణి యతండు."

(అయోధ్యాకాండము—ప్రథమాశ్వాసము—పుటలు 220-219.)

మంథరను గర్హించుచు కైక వాకొనిన నుడువులను చదువరు లీపుటలందు విలోకింపఁ గలరు.

శ్రీరాముని వనవాసవేషమును జూచి కైక దుఃఖించుచు పలికిన మాటలను చదువరు లెఱిఁగినచో నామె నైసర్గికగుణ మెద్దియో యూహింప జాలుదురు.

"ఉ. ఏమిర తండ్రి! నీ విటులు హీనగతిన్ మునిపుత్రవేషమున్
గోమలితోడ దాచుకొని కొంచెముగాని విరాగ మేర్పడఁ

మామకహృత్సరోజమును మాడిచివేయు మహావ్యథాభరం
బీమెయిఁ గూర్చువాఁడ వయి తేమి విపద్దశ వచ్చెఁ జెప్పుమా!
(అయోధ్యాకాండము—ప్రథమాశ్వాసము—పుట 233)

కవిసార్వభౌముల విజ్ఞానదృష్టికి విశాలదృష్టి తోడయ్యెనని, వారినైసర్గిక ప్రతిభకు నవ్యసంకల్పము నెచ్చెలి యయ్యెనని, వారిసహజ శక్తికి కారుణ్యసంపద సహకారి యయ్యెనని, మేధావిభూతికి హృదయైశ్వర్యము సహపాఠి యయ్యెనని మనము గుర్తించినపుడే పాత్రచరిత్ర గ్రథనవిధానమందలి వారి మహిమను మనము గుర్తింపఁజాలుదుము. రావణాదికపాత్రలను ప్రత్యేకదృష్టితో పరిశీలించినట్లే అహల్యాపాత్రను వీక్షించిరి. డిఫెన్సులాయరువలె యీ వ్యక్తుల చెయువులను వీరు సమర్థించ లేదు. కవితావైభవమునకు తాత్త్వికవిభూతిని తోడొనరించి తమ యద్భుతభావ చిత్రలేఖనమున వీరు వ్యక్తిగతశక్తిని ప్రకటించిరి. అహల్య కులటయని దొందతెందతో యూహించుసను, అపనిందనుండి ఆమెను వీరు రక్షించిరి. మునిపత్ని నీతికి నీరువదలునని యూహింపఁ జెల్లునా ?

సంగమమన స్పర్శ యననొప్పును. కావున బిడౌజుఁ డహల్యను స్పృశించెననియే యూహింపవలెనని శ్రీశాస్త్రిగారి యుద్దేశము. ఈస్పర్శ బాలకస్పర్శ. గౌతముని గృహమున బాలకరూపమున నింద్రుఁడు ప్రవేశించెనని వారెఱిఁగించిరి.

పతిలేనిసమయమున నిలుచొచ్చినవానిని తేఱిచూచి అహల్య-

"ఉ. ఎవ్వఁడ వోరి నీవిటు లొకింతయు కొంచక మౌనిపత్ని న
న్నివ్విధి నంటగా నగునె యియ్యది పాపముఁనాఁ దలంపవే
కొవ్వినా నిన్ను నే నిపుడు కొంచెము నేఁ గృపలేని దాననై
త్రెవ్వఁగఁ జేయుదానఁ... ... ..."

(బాలకాండము - తృతీయాశ్వాసము, పుట 162)

అని పలికినట్లు వారు తెలిపిరి.

శాపవిమోక్షంబైనపిదప అహల్య శ్రీరామునుద్దేశించి తెలిపిన పలుకులను పరిశీలింపుఁడు :

"చ. త్రికరణశుద్ధిగా మెలఁగితిన్ వృజినం బొక యింతయేని నా
దుకడ వచింప లేరెవరు తోయజనాభ! మదీయ కర్మ మూ
చక మయి దుర్యశంబిటు లెసంగె నెటుల్ భరియింప నేతు నా
కికఁ గడతేఱుమార్గ మెదియో వచియింపుము నీకు మ్రొక్కెదన్."

(బాలకాండము - తృతీయాశ్వాసము పుట 165)

శ్రీరాముని ప్రత్యుత్తరమును గమనింపుడు:

"ఆ. అనిన రామచంద్రుఁడనియె నోతల్లి! నీ
వెఱుఁగ వెట్టిదోష మెఱుక లేక
యెవ్వఁ డెవ్విధంబు నే నిన్నుఁ బలికినఁ
బాపభాజి యగుచు బడలువడును.

"తే. పంచకన్యలలో నీవు ప్రథమగణ్య
వగుచు దీపించెదవు నీదునామధేయంబు
దలఁచినంత మహాపాపములు నశించు
ననుచు వర మిచ్చె రాముఁ డహల్యకపుడు".

(బాలకాండము - తృతీయాశ్వాసము, పుట 165-166)

"అపుడు దేవదుందుభులు మ్రోసె; పుష్పవర్షంబు గురిసె. దేవతలు దివినుండి దిగి వచ్చి యహల్య నభినందించిరి. గౌతముండు నంతలో నట వచ్చి రామపూజితుఁడై తచ్చాసనంబునఁ బత్నిం బరిగ్రహించి, రాముని దీవించి సభార్యుండై తపోవనంబునకుం జనియె."

(బాలకాండము, పుట 166)

ఉత్తరకాండమున శ్రీ శాస్త్రిగారు అహల్య పూతచరిత్ర యని మరల స్పష్టపరచిరి. సీతావాల్మీకుల ప్రసంగోదంతమును పరిశీలింపుడు:

"చ. జగమున నీయహల్య యొకసాధ్వి యటంచును గన్యయంచుఁ జె
ప్పఁగ వినుచుందు మిట్టిసతి స్వఃపతితోడ రమించె నంచు ని
ష్ఠ్ఠాగి వినినంత నాదుమన మొప్పక యున్నది మాని మీదికిన్
దగఁ జను మన్న నాతఁడు ముదం బఱి జానకిఁ జూచి యిట్లనున్.

తే. తల్లిరో ! నాదువ్రాఁతలఁ దప్పు వడదు
గరిత కర మంటె నోరు డంట దురిత మగుట
నట్లు వర్ణించుటే కాని యమరవిభుఁడు
కలసె నని తలంచుట తప్పె తెలియ వినుము"

(ఉత్తరకాండము - ప్రథమాశ్వాసము, పుట 392)

గ్రంథమండలి కడుంగడు పవిత్రము లైన ఘట్టములలో నిది యొకటి.

ప్రతిభాస్పర్శ నందినపుడు, రసభరితమైనపుడు సామాన్యాంశము సయితము మనోహరమై పాఠకుల హృదయముల నానందాంబుధి నుప్పొంగించును. కవీంద్రునిచేఁబడిన పాంసుపటలము జాంబూనద వైభవము నందితీరును. స్వతస్సిద్ధముగ నుదారాశయబంధుర మైన యితివృత్తము కవిచంద్రుని భావనాశక్తి సంసర్గమువలన మహోత్కృష్టమై యొప్పును.

ఒక్కొక కళోపాసకునకు వ్యక్తిగతమైన శక్తి యుండును. వాల్మీకి, భవభూతికవు లొకరి కొకరు తీసిపోని ప్రతిభావంతులు. ఇరువురదృష్టిని రామచంద్రుఁ డాకర్షించెను. తమతమ నైసర్గిక ప్రతిభను పురస్కరించుకొని, రామకథను వారు రచించిరి. వ్యాసకాళిదాసులు మహాకవులు. శకుంతలాదుల పాత్రములను వారు ప్రత్యేకకౌశలముతో చిత్రించిరి. శ్రీకృష్ణరామాయణము రచించిన కళాప్రపూర్ణులు సహజశక్తి ననుసరించి అందలిపాత్రములను తమకావ్యరంగ స్థలమున నిలిపిరి: ధైర్యసాహసములతో వీరు తమతెలివి ననుసరించి ముందంజ వేసిరి కాని వాల్మీకిరచనము ననువదింపలేదు.

వాల్మీకిరామాయణములో శాంతవిషయ మంతగా కానరాదు. కవిసార్వభౌముల గ్రంథమున శాంతాఋష్యశృంగుల విపులకథనము కలదు. దశరథునిశౌర్య మిందు విశేషముగా వర్ణింపబడినది. మనుష్య లోకమున మాత్రమే కాక నాకలోకమునసయితము మాతనిశక్తి విజృంభించెను.

"చ. ఇలఁగల శత్రుసంతతుల నేరి జయించుటె కాక నాకభూ
తలపతిసఖ్యముం గలుగుదాన నటం బకుచుండు పోరులం
బిలువఁగ నై దివంబునకు బీర మెసంగఁగ నేగి దేవవై
రులఁ గడతేర్చి వచ్చెడు నరుంతుడుఁడాతఁ డనంతకీర్తిమై."

(బాలకాండము - ప్రథమాశ్వాసము. పుట ౩౭.)

గజభ్రాంతి నాతఁడు మునికుమారుని గూల్చిన వృత్తాంతమును తెలుపుతటి కరుణరస భరితములైన పదముల నుచ్చరించిరి.

పరశురాముఁ డీగ్రంథమున రాముని తో బవర మొనరించుటకై కాక తన తేజస్సు నాతని కిచ్చుటకై వచ్చినట్లు తెలుపఁబడినది.

"శా. ఆకర్షించి తదీయ వైష్ణవ మహేష్వాసంబు దత్తేజమున్
లోకం బెన్నఁగ నెక్కువెట్టి త్రుటిలో లోలోన సంతోషమున్
గైకొంచు న్వడి మౌర్విఁబట్టి రవమున్ గావించుచుండ న్మహో
వాకంబున్ ఘటియించి భార్గవుఁ డనుం బ్రస్తావమున్ జేయుచున్.

ఉ. ఈవు పురాణపూరుషుఁడ వే మును నిన్ను నెఱుంగుదున్ జగ
ద్భావితభక్తియుక్తిని దపంబొనరించెడునాఁడు పొల్చి ల
క్ష్మీవరుఁ డిచ్చె నా మెడలఁ జేరిచి వైష్ణవ తేజ మీ విలన్
గావరులన్ వధించెదవు గావుత మంచు వచించి వెండియున్.

ఉ. నే రఘురాముఁడై ధర జనించెద నప్పుడు నాదు తేజమున్
జేరిన నా కొసంగుమని చెప్పుట చే నిటు కార్ముకంబుతో
గూరిచి నీదు తేజమును గోరిక లీరిక లెత్త ని త్తఱిన్
జేరిచినాడ నీ కిదిగొ చేకొన వేఁడెద జానకీపతీ!"

(బాలకాండము - చతుర్థాశ్వాసము - పుట 210)

కైకపాత్రము నాదరదృష్టితో వీక్షించుటచే శ్రీశాస్త్రిగారు మెచ్చే రామాదులకు నారచీర లిప్పించలేదు. చక్రవర్తికాక సంయమియై వనమునకు తరలునపుడు శ్రీరాముడు తేరెక్కక కాలినడకను సాగిపోయెను. ఈయంశములందు కవిసార్వభౌములు వాల్మీకి ననుసరింపలే దనుట స్పష్టము.

అనసూయాప్రదత్తమైన అంగరాగమహిమ మీ గ్రంథమున గాన వచ్చుచున్నది.

"ద్విప. అనసూయ సీతకు నంగరాగంబు
మును తనదర్శనంబున కేగి నప్పు
డనుకంప నొసఁగిన దనియును దానిఁ
గొని యామె మైఁ బూసికొనె ననివింటి.

క. ఇది సీతాదేహోదిత
సదమల పరిమళముగాని సామాన్యముగా
దదె వనము దానియందుఁ
బొడలేదు జనకాత్మజాత పోయెదనటకున్."

(సుందరకాండము—ప్రథమాశ్వాసము—పుట 95)

వాలిని శ్రీరాముఁడు వధించుట ధర్మమునకు ప్రతికూలము కాదని మన కళాప్రపూర్ణులు ఋజువుచేసిరి. ఈ క్రిందిపంక్తులను పరికింపుఁడు :

"సీ. తినరాని మృగమును దెగవేయరా దంటి
వది వేటకారుల కైనమాట
నిన్ను వేటాడంగ నే వచ్చి చంపను
చంపుదు ధర్మరక్షణముపొంటె
పగ లేదు నాకంటి వగు నగు ధర్మవు
నకు బగతుఁడవైన నాకుఁగావె
భ్రాతృభార్య హరించి పాపివైతివి నీవు
మరణదండన నీకు మనువు చెప్పె

తే. ఎదుటఁ బడువారిబలము నీ కదుకవచ్చు
వరము కల దది చెల్లింపవలయు నిన్నుఁ
జంపవలయుఁ గావున నిట్లు సలుపనయ్యె
దాన దోసము శంకింపఁ దగవుగాదు.

తే. అన్న తండ్రికినెన యగు ననఁజనకుసు
నీకు సుగ్రీవుఁ డనుజన్ముఁడై కొడుకగు
వానిసతి గోడలును గూఁతు రౌను దాని
నంటి శిక్షార్హుఁడైతి వో యగచరేంద్ర!

శా. శిక్షార్హుం డవుగాన రాజు నిను శిక్షింపం దగున్ నేను త
త్పక్షంబున్ గొని నిన్ను జంపితిని చెప్పన్‌వచ్చు రాద్ధర్మ మీ
శిక్షం జెప్పెను నీకుఁ దప్పనుచు వాచింపంగనౌఁదప్పయై
ఋక్షాధీశ్వర! కన్నువిచ్చి యిపుడే నీక్షింపుమా ధర్మముల్.

(కిష్కింధాకాండము—ప్రథమాశ్వాసము—పుట 26).

పశ్చాత్తప్తహృదయుఁడై రాముసుద్దేశించి వాలి యిట్లు పలికెను:

"సీ. సత్యపూతములు నీసదమలవాక్యముల్
సర్వజ్ఞుఁడవు నీవు సన్నుతాత్మ
యజ్ఞానవశమున నస్త్రబాధంజేసి
మతిచెడి యేమేమొ మాటలంటి
నను సైచి మన్నింపు మని వేడు చుంటిని
సర్వేశ్వరుఁడ వెన్న సాధురక్ష
గావింపఁ బుట్టితి వీవు వైకుంఠుఁడ
వే నెఱుంగుదు నీదునేత్రిఱ యది

తే. ధర్మబాహ్యుఁడ నగు నన్ను దయఁ దలంచి
కాచి పుచ్చితి నను మేను గాశ్యపీంద్ర
శిక్షితుఁడ నయి పూతుఁడై చెన్ను మిగిలి
యుంటి నని చెప్పుచుంటి నో యుర్వరేశ!"

(కిష్కింధాకాండము - ప్రథమాశ్వాసము పుట 27.)

ఈశ్వరనియమమును ననుసరించియే జగన్నాటకరంగమున వివిధ పాత్రధారులు తమతమకర్తవ్యములను నిర్వహించుచుందురు. ఉపాసకుని తపసునకును, వీరుని సామరికశక్తివిజృంభణమునకును (నీతిశాస్త్రము * వాకొనినట్లు) సముచితమైన అవకాశము లున్నను,

* See chapter on 'Free will' in any book on Ethics.

పూర్వోక్తనియమము సారథియై, వారిచే తనకర్జునుని నెఱపించు చుండును. "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అని వాకొనిన గీతాచార్యుండు నరునిమోలల చూపినవిశ్వరూపమున నీ సత్యమును దృష్టాంతీకరించెను. దుష్టశిక్షణ శిష్టరక్షణమును నాశయసిద్ధికై రామాయణ రంగము సృష్టి యాయెను. స్థూలదృష్టికి కథాఘట్టములు పదపడి గోచరించినను, ఈశ్వరోద్దేశ్యము ననుసరించి కథ సాగుచునే యుండెను. కావుననే యీ కథను సీతారామ హనుమంతులకు కవిసార్వభౌములు వినిపించిరి. చూడుండు:—

"తే. మగువ మగండు నొండొకరత్నమహితదీప
కాసమూహమునందు రత్నాసనములఁ
గూరుచుండిరి మగఁడప్డు కొంతలోన
విను మనుచు నొక్కగ్రంథము విప్పి చదివె.

ఉ. పావని సాగరం బతిజవంబున దాటి నిమేషమాత్రలో
నావల లంకిణిం దెగెడునట్లుగఁ జేసి పురంబు సొచ్చి నల్
త్రేవల జానకిం వెదకి ఖిన్నత నొందిన చిత్తవృత్తితోఁ
బోవుచు రావణానుజుని ప్రోల మెలంగెడువాఁడయై తగెన్.

క. అని చదివి యెదుట గనుఁగొని
వనితా! యదె వచ్చె వాయువరపుత్రుఁడు గ
న్గొను మన వనితామణి యటఁ
గని కాదది చిత్రపటము గాదొకొ తెలియన్.

మ. అని యాజంపతు లాడుకొన్న నుడు లా ప్రాంతంబునం దున్న పా
వని యాలించి నను న్గ్రహించిరొకొ వీ రంచింత చింతించియున్
వనితావాక్యమునన్ గ్రహింప రని లోభావించి వీ రెవ్వరో
కని రామాదులచిత్రముల్ గృహమునన్ గౌతూహలావిష్టుఁడై.

మ. తనమేన్ డాపగ నాశ్రయం బయిన చిత్రం బెన్నఁ దా నొటయున్
గని యాతండు విభీషణుండు సతికిం రామాయణగ్రంథమున్
వినిపించుం గథ ప్రస్తుతంబ యయి సందేహంబు సంధించె నా
మనమం దింతుక శాంతి కయ్యె నిట రామస్వామి నామస్మృతిన్.

వ. మఱియు వీరిసంభాషణం బెట్లుండునో యాలకించి పోవుద మని పటంబు వెనుకం డాగియుండె నపుడు విభీషణుండు వెండియును.

తే. వెదకి సీతను రావణుసదనమందు
విక్రమముం జూపి రాక్షసవీరవరుల
నని మొనం గూల్చి పెక్కుర నంతఁ బోక
ప్రోలు రగిలించి పోవు నా గాలికొడుకు.

వ. మఱియు నోకాంతా!

ఉ. రావణుఁ డిట్లు కార్యగతి రాముసతిం గొని వచ్చె నందునన్
దేవవిరోధివర్గములు ద్రెళ్ళక మానవు రామచంద్రుఁ డో
కేవల మర్త్యుఁడంచుఁ బలికించుట పోలదు దేవదేవుఁ డా
శ్రీవరు డాతనిన్ దొడరి చేస్పడి పోయెను రావణుం డనిన్.

క. నే నారాముని భక్తిం
ధ్యానించెడువాఁడ నతని దర్శించి ననున్
నూనునిగఁ జూచి ప్రోవన్
గా నుల్లము సేయు మనుచుఁ గ్రై మొద్దు సతీ!"

(సుందరకాండము – ప్రథమాశ్వాసము – పుటలు 89-91)

ఉ. "అనవుడు సీత యిట్లనియె నార్య చరిత్ర మదెల్లఁ బుట్టకుం
డినమునుపే రచించి తని నే విని యుంటిని జూచినట్టు లే
యనువునఁ జేసి యుంటి వెట నైన విభేద పదంబు లయ్యె నే
కనుఁగొన నబ్బ యిట్టి పని కావ్య మొనర్చితి రీర లెంతలో.

తే. అనిన వాల్మీకి యనుఁదల్లి! హరి జనించు
టకు నయుతవర్షములకు ము న్నొక దినమున
బ్రహ్మ నాకడ కరుదెంచి పలికె నెల్లఁ
బూసగ్రుచ్చిన యచ్చునఁ బుణ్యచరిత!

క. కరబదర సదృశముగనే
నరసి రఘూద్వహుని చరితమంతయుఁ గృతిగా

విరచించినాఁడ నెందే
నెరసంతయు నెరసుఁ జూప నేరరు వేఱున్.

(ఉత్తరకాండము – ప్రథమాశ్వాసము, పుట 390)

హనుమంతుఁడు లంకలో సీత కంగుళీయకము నిచ్చినపుడు ఆమె హృదయమున నెట్టి యుద్రేక ముదయించెనో కవిసార్వభౌముల హృదయమున నట్టి యుద్రేకమే జనించెను. కవిహృదయ సముద్భవ భావనావేశమే కావ్యవసుంధరలో పెక్కుదృశ్యములను సృజించునని తెలుపఁజెల్లును. ఇట్టి సన్నివేశములందు కవీంద్రుని లేఖని అపూర్వశక్తి నంది, భావబంధురఘట్టములను సృష్టించి పాఠకలోకము ప్రమోదాల నిలుపును. ఈ దృశ్యములను పరిశీలించినప్పుడు పఠితల హృదయములందు రసరత్నాకర ముప్పొంగును. ప్రస్తుతగ్రంథమున నీసందర్భము శోక రసపూరితమై యున్నది. మనశ్శాస్త్రము (Psychology) న నిర్వచింపబడిన సంసర్గసూత్రము (Law of association) ననుసరించి శ్రీరాముని యంగుళీయకమును జానకి విలోకించినపుడు వారి గాఢ సఖ్యోదంత మామె మానసయవనికపై తళ్కొత్తెను. కవిసార్వభౌముఁ డీ దృశ్యమును చిత్రించినపుడు అది పాఠకలోకచిత్తజవనికపై తళ్కొత్తెననుట నిస్సంశయము. ఇట్టి తళ్కులందు అద్భుత కవిత్వశక్తి వ్యక్తమగునుకదా! వ్యాఖ్యాభోలు విపులవిషయ కథనమునగాక, ధ్వనిభూయిష్టమైన వాక్కునందును, భావనాశక్తి సముద్భవ దృశ్యమందును మహత్వ కవిత్వ పటుత్వసంపద ప్రకటితమగును.

పరస్పర ప్రేమబంధమున నిమిడిన రెండు హృదయములు దుర్విధివలన నొకదానికొకటి దూరమై, వియోగ యాతన ననుభవించుతఱి తొల్లింటి సఖ్యమును జ్ఞప్తికి దెచ్చు ఘట్టము కట్టెదుట గోచరించుచో ఆ హృదయము లెట్లు చలింపవు? వానిని విలోకించిన వారి హృదయము లెట్లు కదలవు? ఈ పద్యములు కఠినశిలలను సహితము ద్రవింపఁజేయవా?

"చ. అది తనతండ్రి రామునకు హస్తపరిగ్రహవేళ నీయ నై
నది ఋషినిర్మితంబు నిమి కాది లభించినదంచు నెంచి స

మ్మదముఁనఁ గొంచుఁ గన్నుఁగవ మాటికిమాటికి నద్దికొంచుఁ జ
ల్లని నము మేనికిం గలుగు లాగని నొదలఁదాల్చె దాసినిన్.

ఉ. అంతటిలోన హ స్తమున యందు ధరించి రఘూద్వహున్ గడున్
స్వాంతమునం దలంచుచును జక్కగనుంగొని యింత సేపు దా
నింతనరాని దుఃఖమున నేడువసాగె సమీరనందనుం
డెంతయు దద్దరిల్లుచు నిదే మిదియేమి యటంచు ప్రాన్పడెన్."

(సుందరకాండము, ప్రథమాశ్వాసము పుటలు 110–111)

సీత యిడిన రత్నమును హనుమంతుఁడు శ్రీరాముని హ స్త
మున బెట్టినపుడు దానిని కన్నుల కద్దుకొని, యాతఁడనిన నుడువులను
గూడ పాఠకులు పరిశీలింపగలరు :

"తే. ఇది మదీయ వివాహము విదితముగను
జరుగుచున్నప్డు జనకభూజాని వాని
సతియు నీ రత్నమును దెచ్చి జానకి శిర
మందుఁ గట్టిరి దీని మహత్వమొప్ప.

వ. అని రామచంద్రుం డా శిరోరత్న దర్శనంబున సీతాదర్శనంబు
చేసినట్లు సంతసించుచు వాయుపుత్రా ! నీవు ప్రాణప్రదానంబు చేసిన
మిత్రుండవు నిన్నెన్నటికి మఱచియుండను."

(సుందరకాండము – ద్వితీయాశ్వాసము పుట 140)

హృదయకుధర శిఖరమునుండి ప్రేమభాగీరథి వెలారునపుడు
కావ్యఘట్టములు పునీతము లగును. తన్మయత్వమున తమ్ము తాము
మఱచి కవికుంజరులిట్టి ఘట్టములను అనల్పశ క్తితో చిత్రించుచుందురు.
సీతారాముల హృదయ సరోజములు వికసించి అనురాగ మరంద
భరితములగుటకు నిమి త్తములైన సన్నివేశములను వర్ణించినపుడు మన
కళాప్రపూర్ణుల కవిత్వశ క్తి చక్కగా వ్య క్తమాయెను.

శ్రీరామచంద్రుఁడు యాగసంరక్షణమునకై విశ్వామిత్రమహర్షి
యాశ్రమమున కరిగినపుడు (హంససందేశమునకు వీనులొగ్గినతఱినలుని
వృత్తాంతము నెఱింగిన దమయంతీ హృదయము ప్రణయపూరితమై
నట్లు) ఆతని యుదంతమును వినిన మంగళముహూ ర్తమునందే జానకి

హృదయ మనురాగ భరితమాయెను. పదపడి ఆరామమున నారామ రాము నవలోకించినపుడు ఆ ప్రణయము ఘనతరమాయెను. ప్రేమ బంధుర స్వర్ణకిరణ స్పర్శకతన శతపత్రసుందరి ప్రఫుల్లముఖయై దిశా కాంతల నలరించునట్లు జానకీహృదయపుండరీకము వికసించి సౌందర్య సందీపితమై విలసిల్లెను. యువతీ యువకుల ప్రణయంపు దృక్కుల కౌఁగిలింత నభివర్ణించిన ప్రపంచకవులు రాగరంజిత హృదయులై పాఠకబృందముల నెడందలను ప్రణయ ప్రదీప్తము లొనరించిరి. "మర్చెంట్ ఆఫ్ వెనిస్" ("Merchant of Venice") నాటకమున షేక్స్పియర్ మహాకవి తెలిపిన "నుడువెఱుఁగని సందేశములు" (Speech-less messages) "రోమియో అండ్ జూలియట్" ("Romeo and Juliet") నాటకమున నాయువకుడును, నీయువతియును రమ్యోద్యాన మున నొండొరులకు కొంతదూరమున నిలిచినపుడు పరస్పర సంశ్లేష మున చొక్కిన వీరి చూపులను ఆ యాంగ్లమహాకవి అనిర్వచనీయ మైన కౌశలమున వర్ణించెను. విశ్వామిత్రునితో మిథిలాపురమునకు శ్రీరామ లక్ష్మణు లరిగినపుడు కడుంగడు కమనీయమైన ఉద్యాన భవనమున వారు విడిసిరి. ఆసమయమున—

"సీ. జలకంబులాడి క్రొంజిలుఁగు పచ్చనిపట్టు
పుట్టంబుధరియించి జుట్టుముడిచి
మోమునం గస్తూరిబొట్టొప్పగాఁబెట్టి
కందోయిఁ గాటుక పొందొనర్చి
కాంతులీనెడు రూపు కంతసీమను వ్రేలఁ
బసపు గుంకుమయును సాంబ్రాణిపూలు
పత్త్రియుం గలపళ్ళెర మొకచేత
నొకచేత జలపాత్రమొయ్యఁబూని
తే. చెలులు ముందును వెనుకను జేరినడువ
రామతారక మంత్రమ్ముగాల నాల్క
నుపవనంబున నీశ్వరియున్నకడకు
బోయె సీతామహాదేవి పూజసేయ".

(బాలకాండము - చతుర్థాశ్వాసము - పుట 189)

సీతారాముల పరస్పర వీక్షణములను కవిసార్వభౌములు అనల్ప మైన నేరిమితో వర్ణించిరి. గ్రంథమున వారు సృజియించిన కడుంగడు సుందరములైన దృశ్యములలో నిది యొకటి. పాశ్చాత్య కవుల దృక్ప థమునకును ప్రాచీకవుల దృక్పథమునకును గల భేదమింకొకటి యిందు గానవచ్చుచున్నది. ఆధ్యాత్మికదృష్టి గలవారు భారతీయ కవులు. భవానీదేవి నారాధించియే భారతీయ వధువు వరునరయును; ఇందుధర సుందరిని సేవించియే రుక్మిణి శ్రీకృష్ణుని బడసెను. 'రామతారక మంత్రము నాల్కగ్రాల' నీశ్వరుని గొలిచి సీత శ్రీరాముని పడసెనని మన కళాప్రపూర్ణులు తెల్పుట సంతోషకరము.

మదమాతంగము నధిష్ఠించి రామచంద్రుడు నగరున కరిగి నపుడు ఒకచో నా భద్రగజంబు ఘీంకృతులతో నొక్కంజయే వేయ నొల్లక గీపెట్టుచునుండ,

"తే. నంతలో నంతిపురినుండి యడుగుదారి
నరుగుదెంచి జానకి హర్మ్యమందు నిలిచి
రామునింగని పైనుండి ప్రసవసరము
హా స్తిపై బడ వేయించె నాళిచేత."

"జానకిరాక కిట్లుగా మొఱకుతనంబుఁ జూపె
నని పూవులదండ మెఱుంగఁ జేసెడిన్."

గ్రంథమున నిదియొక యబ్బురంపు ప్రణయసన్నివేశము.

దేవమానవులకును, సమస్తభూతములకును నిత్యజీవితమున సంపర్కము కలదని తెలుపుచు విశ్వవిస్తృత సాంఘిక మర్యాదను వ్యక్తీకరించు మహోదారులు భారతీయకవులు. ఈ యాశయమును దృష్టి నిడుకొని, దివికిని భువికిని వారు రహదారు లేర్పఱచిరి. రామ చంద్రుడు ఖరదూషణాదులను సంహరించిన పిదప నింద్రుపంపున దేవ దూతలు పూదండలు తెచ్చి రామునకిచ్చినట్లు తెలిపి, శ్రీ శాస్త్రిగారు వానిచే నిట్లు చెప్పించిరి:

"మ. ఇవి మీ ముప్వురు దాల్చువారయిన క్షుత్తృష్ణా శ్రమల్ శీతవా
త విరుద్ధాతపబాధలుగ్ర మృగబాధల్ మీ కరణ్యాన్తములన్
దప్పం బోపివి వాడ వెప్పుడును గంధంబు న్వెలార్చు న్మహో
త్సవమున్ గూర్చును సర్వకాలము మహాత్మా! స్వీకరింపంగ దే.

(అరణ్యకాండము – ద్వితీయాశ్వాసము – పుట ౩౫౫)

విశ్వవిస్తృతమైన ప్రేమమహత్వము నుగ్గడించునవి మన మహాకావ్యములు. ప్రేమస్రవంతి అంతర్వాహినియై సమస్త భువనములందు వెలారుచుండునని మన తత్వశాస్త్రము తెలుపు గంభీరవాక్కులోని భావశబలతను గ్రహించి, ఉదాత్తపాత్ర సృష్టియందు ప్రపంచ కవులు దానిని దృష్టాంతీకరించిరి. ఈ యాశయముపై దెబ్బ పడినేని కావ్యసామ్రాజ్యము కలుషితమగుట నిశ్చయము. కావున నుత్కృష్టాశయ జ్యోతిర్లీలకు జేజేలు పాడిన మహాకవులు అప్రమత్తులై తమ కలములను సాగించిరి.

రామాయణమందలి శంబూకవధను గుఱించినకథ పూర్వోక్తాదర్శమునకు విరుద్ధముగ నుండుటచే విమర్శకలోకమున గొంత కల్లోల ముద్భవించెను. రాజకీయప్రాంగణమందుమాత్రమే కాక, సాంఘిక జీవితాంగణమందుకూడ ప్రజాస్వామ్య ప్రభుత్వము పరిఢవిల్లవలెనని ప్రపంచనేతలు కంఠమెత్తి నేడు వచించుచుండుటచే ప్రస్తుత యుగమున నీ విషయము తీవ్రరూపముదాల్చినది. వనచరుల ననుచరుల గావించుకొనిన శ్రీరాముడు, గుహుని కౌగిలించుకొని యాదరించిన శ్రీరాముడు, సర్వభువనప్రకరమును సమస్త ప్రాణిలోకమును అనురాగ పరిష్వంగమున నిముడ్చుకొనిన శ్రీరాముడు, రుచినెఱిగి శబరి ప్రసాదించిన యెంగిలిపళ్లను భుజించి భక్తురాలి నలరించి కరుణాశరధి యనిపించుకొనిన శ్రీరాముడు, శంబూక వధ గావించెనని తెలిపిన నులికిపడువారు సభ్యవసుంధరలో పలువురుండకపోరు. సత్యాన్వేషణ, సత్యారాధన, సత్యనిర్వచనము లను జీవితపరమాశయము లొనరించుకొనువారు ఆత్మవిశ్వాసమును వ్యక్తీకరించుటకు సంశయింపరు. పూర్వోల్లిఖితవిషయము ప్రక్షిప్తాంశమని యూహించుటకు శ్రీ శాస్త్రిగారు శంకింపలేదు. ప్రస్తుతకాల పరిస్థితులపై కన్నుంచి,

స్వీయధర్మనిర్వహణ మొనరించు కవిసార్వభౌములు ఈదృశాంశముల నప్రమత్తులై, సమీక్షచేసియే ఈ మహాగ్రంథమును రచించి దేశాటనమునకై పంపుచుండిరి.

సీతాదేవిని శ్రీరాముడు వనమున కంపెనను ఉత్తరరామాయణోదంతమును గుఱించి అభిప్రాయభేదములు విమర్శకలోకమున తీవ్రముగ విజృంభించుచున్నవి. ఇందక్కజమేమియు లేదు. ప్రపంచ ప్రశస్తిని వడసిన మహాగ్రంథములు తీవ్రసమీక్షనుండి వెడలినవే! డాంటే (Dante), హోమరు (Homer), షేక్స్పియర్ (Shakespeare), గెటే (Goethe) మున్నగు మహాకవుల కృతులు బహుళవిమర్శనలతో విరాజిల్లియే కాలవియత్తలమున నక్షత్రపుంజములై విలసిల్లుచున్నవి. ప్రస్తుతయుగము విశేషించి విమర్శనమునకు ప్రాముఖ్య మొసగుచున్నది. ఈ ముఖ్యాంశమున కవగతులై, విమర్శకదృష్టితో రామాయణ కథాంశములను కవిసార్వభౌములు పరిశీలించియే ప్రస్తుతగ్రంథరచనమునకై కలము చేబూనిరి. ఉత్తరరామాయణ వృత్తాంతము వీరి నిశితపరిశీలనమునకు గుఱియగుటలో నాశ్చర్యము లేదు

మాయాకురంగము ననుసరించిపోయి పర్ణశాలకు మఱలినపుడు జానకిని గానక ఊకనిప్పులో నొడలు కాలుతఱి మిగుల బొగులు వ్యక్తివలె వేదనపడిన శ్రీరాముఁడు నిష్ఠురుడై ఆమెను రామాయణోత్తరభాగమున భయదకాననమున కెట్లప్పగించుననియు, భీషణమైన అగ్నిపరీక్షలో నెగ్గి తన శీలసంపదను భువనప్రకరము మ్రోల ప్రకటించిన లోకమాతను, చూలాలైన యిల్లాలిని భయానక గహనాంతర పరిస్థితులందు పడద్రోయుట ఎట్టి చేతయనియు విమర్శించినవారు జగతిలో నెందఱో కలరు. ప్రజాభిప్రాయము ననుసరించి పాలన మొనరించుట జీవిత పరమాశయమని యెంచిన రఘూద్వహుఁడు తన యర్ధాంగలక్ష్మి శీలమున నెట్టి నెరసులేదని గుఱితించియు నామె నడవులకు నెట్టించెననియు, సీతాత్యాగ మాత్మత్యాగమే యనియు త్యాగమూర్తియైన శ్రీరాముడు ఉత్కృష్టాశయసిద్ధికై నిష్ఠురమైన అట్టి చెయువునకు చేయి జేసికొనెననియు కొందఱనుచుందురు. రామ

రాజ్యమున ప్రజాభిప్రాయము విశేష ప్రాముఖ్యము నందెననుట నిస్సంశయము. భద్రునివలన చాకలివాని వృత్తాంతమును విని అట్టి చేతకు రామభద్రుఁడు కడంగెనందుమా? తప్పుత్రాగి, పెండ్లామును హింసించు చాకలివానిమాట ప్రజావాక్కనిగాని, ప్రమాణవాక్కని గాని రామచంద్రుఁ డెట్లూహించును? వివేకసందీపిత చిత్తుఁడైన మహాత్ముఁడు, నిశితబుద్ధికల సార్వభౌముఁడు, లోక కల్యాణార్థము జీవితము గడపిన మహనీయగుణగరిష్ఠుఁడు భాస్వదాశయ విలసిత జీవనమును యుగములకును మహాయుగములకును మహోజ్వలమైన మేలుబంతి గావించిన అవతార పురుషుఁడు పూర్వోక్త క్రియను కావించెనని తలంచుటెట్లు సాధ్యమగును? ఈ యుత్తర రామాయ ణోదంతము ప్రక్షిప్తమని యూహించిన మేధావులు జగతిలో గలరు. వీరి సమీపమున నిలిచిన శ్రీ శాస్త్రిగారు వారియట్లే యూహించి ఆ వృత్తాంతమును తమ గ్రంథమున ప్రవేశపెట్టలేదు. సీత నడవికి పంపక అయోధ్యయందే వారు నిల్పిరి; బంగారు సీతనుగాక, రంగారు బంగారు బొమ్మనుబోలు జానకిని ప్రాణపతిచెంత నునిచి పున్నెము గట్టుకొనిరి. ఉత్కృష్టములైన వైజ్ఞానికాశయములను మనసున నిడికొనియే శ్రీ శాస్త్రిగారు యీ గ్రంథమందలి ఘట్టములను సృష్టించిరి.

విజ్ఞాన విభూతిని, సుజ్ఞానశక్తిని, ప్రజ్ఞాన ప్రభావమును భక్త వరేణ్యులైన మహాపురుషులు మాతృ గర్భమునం దున్నప్పుడును, మాతృస్తన్యమును గ్రోలునపుడును మాతృక్రోడతలమున నధివసించి నపుడును గ్రహించినట్లు మన యుద్గ్రంథములు తెలుపుచున్నవి. మాతృగర్భమందలి ప్రహ్లాదుఁడు నారదోపదేశమునకు చెవులొగ్గినట్లు, జననీ గర్భమందలి అభిమన్యుఁడు భారతోదంతమున పద్మవ్యూహ విధానమును కొంతకు గొంతవినినట్లు, సీతాగర్భమందలి కుశలవులు తమ జనయిత్రికి వాల్మీకి మహర్షి రామాయణమును బోధించుతఱి నాయుదంతమునకు చెవులొగ్గిరని కవిసార్వభౌములు తెలుపుట యానందకరము. వారి వచనముల నవలోకింపుడు:

“ఇంచుకించుకఁ జదివి రామాయణకావ్యం బంతయు సమాప్తి నొందించి శాంతింగావించె నంత సీతాదేవికి నవమాసంబులు నిండ

నొక నిశాసమయంబున నవగ్రహంబు లేకాదశస్థానఫలంబు లిచ్చుచుండ నొక్క శుభలగ్నంబునఁ గుమారయుగ్మంబుం గాంచెనంత."

(ఉత్తరకాండము—ప్రథమాశ్వాసము—పుటలు 396-397)

పెక్కుతావులం దీగ్రంథవిశిష్టత వెలయుట చదువరులు వీక్షింప జాలుదురు. రావణపాత్రమునకు సంబంధించిన పూర్వోక్త వృత్తాంతమును సీతాదేవిపూతచారిత్రోదంతమును కర్మసిద్ధాంతమునకు సంబంధించిన నిర్వచనమును పరిశీలించిన పాఠకులు వేదవతీ వృత్తాంతము గ్రంథస్థమగుట గమనించి కవిహృదయము నవలీలగా గుఱుతింపగలరు.

కథాసంతతిని సముచితగతి బోనిచ్చుచు కవిసార్వభౌములు సందర్భశుద్ధి ననుసరించి ప్రాచీన హైందవనాగరకతను దృష్టాంతీకరించు ఘట్టములను ఈ గ్రంథరాజమున నెలకొల్పిరి. స్త్రీల నాటకశాలలను గుఱించిన వృత్తాంతమును, శతఘ్నుల యుదంతము నిందుగాంచిన పాఠకులు తొల్లింటి భారతీయుల సంస్కృతీవైభవమును గుర్తింపజాలుదురు. జాతీయసభ్యతపై, స్వీయమతముపై, ప్రాచీన తాత్త్విక విభూతిపై, స్వధర్మముపై, భారతీయసంప్రదాయముపై ప్రాచీసారస్వతసంజనిత సౌందర్యలహరిపై శ్రీ శాస్త్రిగారి కెట్టి మక్కువగలదో చదువరు లవలీలగ గ్రహింపజాలుదురు. వేదవిద్యావిశారదులగుట, శ్రౌతమును చక్కగా నెఱిగిన పండితులగుట వైదికకర్మవర్ణన నతికౌశలముతో వీరు కావించిరి. ఇందలి యశ్వమేధవర్ణన చదువరులదృష్టి నాకర్షించుతఱి వారి యంశమును దృష్టియం దుంచుకొనగలరు. నైసర్గిక ప్రతిభకు, నవనవోన్మేషశాలినియైన ప్రజ్ఞకు, వ్యుత్పత్తిశక్తికి ఆత్మానుభూతి తోడగుచో ఆదర్శకవిత తలచూపునని జిజ్ఞాసువులు భావభరితములై రసప్లావితములై, రమణీయార్థ బంధురములైన సన్నివేశముల నిందు వీక్షించుతఱి గ్రహింపజాలుదురు.

ఉపనిషన్మధువును నాపోశనము పట్టిన సాధకులగుటచే మహిత వేదాంత సూత్రములను వివిధకావ్య సన్నివేశములందు కళాసౌందర్యమునకు, కావ్యనిర్మాణమునకు భంగమురాని తీఱున వీరు వ్యక్తీకరించిరి. శాస్త్రచర్చకు కడంగక, కళోపాసకుఁడు వ్యంగ్య భూయిష్ఠ

సృష్టియందు తన యుదారాశయములను విజ్ఞానలోకమునకు తెలుపు గదా !

"యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి
తస్యాఽహం న ప్రణశ్యామి సచమే న ప్రణశ్యతి."

అను గీతావాక్కు సభ్యప్రపంచమున సహస్రాబ్దములనుండి గంభీర ప్రతిధ్వనులను బుట్టించుచున్నది. ఉదాత్త చైతన్యలహరి సర్వప్రాణులందు జాల్వారుచున్నది. ఇట్లని గుర్తించిన మనుష్యులే "వసుధైవ కుటుంబకమ్" అనియును, "ఆత్మవత్ సర్వభూతాని" యనియు "తత్త్వమసి" యనియు "అహంబ్రహ్మాస్మి" యనియు మహిత భావబంధురమహావాక్యముల నుచ్చరించిరి. అంతర్వాహినివలె వేదాంత భావము ఏకావ్యములందు నొప్పుచుండునో అవియే అనంతకాల వియత్తలముగ నెన్నడు నస్తమింపని యుడుగములై వెలుగొందును.

శ్రీరాముని గతికి పశుపక్ష్యాదులు వగచెననియు (అయోధ్య కాండము పుట 240) రామవియోగంబున ప్రకృతిసొంపు చెడెననియు (అయోధ్యాకాండము - పుట 266) తెలిపిన కవిసార్వభౌముల యాశయముపై ననుల్లేఖింపబడిన వేదాంతసూత్రమును వ్యక్తీకరించుచున్నదని బుద్ధిమంతు లవలీలగ గ్రహింపకపోరు.

మనుష్యజీవితమును మహిమోపేత మొనరించునది స్వార్థ రహితమైన సాధనయనియు, సాధనసముద్భవభావశబలత క్రియాసఫలతకు కన్నతల్లియగుననియు, నిది కళాసామ్రాజ్యమును, ప్రత్యక్షజగతిని భాస్వరాశయ సందీపిత మొనరించుననియు, విశ్వసించిన మహనీయులు కావున శ్రీశాస్త్రిగారు అనసూయవంటి పావనగుణశోభిత మహిమను, అగస్త్యునిబోలు మహర్షిప్రభావమును వర్ణించిరి.

ఒక్కొకయుగమున ప్రచలితమైన సాంఘికాచారములను, దైనిక జీవితాశయములను రచయితలు దృష్టినిడుకొనుచుందురు. కృతయుగమున, కాలదోషసమయము పదునేనేండ్లనియు, త్రేతాయుగమున

పదునాలుగేండ్లనియు*, ద్వాపరమున పదుమూడేండ్లనియు*, కలియుగమున పదురెండేండ్లనియు* గ్రహించిన కవిసార్వభౌములు త్రేతాయుగాది కాలనిర్ణయమును వివరించిరి. కైక యిట్లొనరించిన విషయమును శ్రీరాముడు భరతునితో తెలిపెను. స్థలకాలములకు సంబంధించిన సూక్ష్మాంశములపై సయితము చూపునిలుపుట విశాల కావ్య ప్రపంచమున ముందంజ వేయునపుడు మఱువని శాస్త్రిగారి మేధాసంపద ప్రశంసనీయమైనది.

నీతి సందీపిత జీవితము కడపుట మానవధర్మమని ఆదర్శపాత్ర సృష్టివలన తెలిపిన ఆదికావ్యము రామాయణము. ఈ మహాకావ్య సృష్టిని గనిన సంస్కృతి సహస్రాబ్దములకు మున్ను మన పుణ్యభూమి యందు వరలెను. తక్కిన ప్రపంచము తమసావృతమై యున్నపుడు, నాగరకత తమసొమ్మని నేడు వినువీధికెగయువారు పశువులకు సహపాఠులై సాంద్రగహనములందు వర్తించువేళ మహోన్నత వైజ్ఞానిక మహీంద్రచూడమున నిలిచి, మంత్రద్రష్టలై బీజాక్షరయుత మహావాక్యముల నుచ్చరించినవారు భారతీయులు. ఈ సభ్యతా వైభవము కవీంద్రుల హృదయమున నద్భుతతన్మయత నుద్భవింపజేయ వారి రసనలనుండి వియన్నదీ సదృగ్ధారాళ వాగ్ఝరి వెలారి భువన నిచయమును పునీత మొనరించెను. కావుననే సర్వదిక్కులనుండి బహుళ ప్రణతులను భక్తి కుసుమాంజలితో జగద్ధాత్రిబోలు భారత జనయిత్రికి సమర్పించుచు, విజ్ఞానయాత్రికులు ప్రమోద భరితస్వాంతు లగుచుందురు. కళోపాసకులకు, ఆనందవ్రతులకు, సత్యనిష్ఠాగరిష్ఠులకు, తాత్త్వికులకు, జిజ్ఞాసువులకు సాధకులకు, రామాయణ మెట్టివైజ్ఞానిక భిక్షపెట్టెనో మఱి యేగ్రంథము నట్టిదానిని పెట్టలేదు. పుత్రప్రేమ, పితృభక్తి, భ్రాతృభక్తి, పతిభక్తి, పత్నీసేవ, మాతృప్రేమ మున్నగు ఉదారాశయములు ఈ మహాగ్రంథమందలి పాత్రములందు వ్యక్తమాయెను. గురుగుణవిభూతిని కవిసార్వభౌములు తమపాత్రములందు సాటిలేని నేరిమితో వ్యక్తీకరించిరి.

1. *శ్రీరామవనవాసము చెప్పును. 2. *పాండవ వనవాసాదికము ఋజావు చేయును; 3. *మనకు తెలిసియేయున్నది.

ఆదర్శభ్రాతయైన భరతునిచరితమును వీరు చక్కగ చిత్రించిరి. "వర్షములు తప్పిదయిమును డొల్లిపోయెను" రఘూద్వహుండు రాని కతన భరతుడు నట్టూర్పువిడచి (కమల ప్రసూనభరిత కాసారమున కలహంస చివాలున లంఘించునట్లు) చితిలో దుముక గమకించు చుండ భరద్వాజాశ్రమమున విడిసియుండిన రామచంద్రునిచే పంపబడిన హనుమంతు డడ్డుపడి, సీతారామలక్ష్మణులు అచిరకాలములో చనుదెంతు రని తెలిపినపుడు 'భరతుఁడానంద భరితాంతరంగుఁడై వహ్ని ప్రవేశోద్యమంబున విముఖుడయ్యెను.'

'రాజ్యమిచ్చెదవా లేదా యని' రాముఁడు తమ్మునిని యొద్దకు కబురంపలేదు. శ్రీరాముఁడు తమ్మునెట్టి వాత్సల్యముతో వీక్షించెనో, భరతుఁడగ్రజునెట్ట భక్తితో జూచెనో శ్రీశాస్త్రిగారు చక్కగ వ్యక్తీకరించిరి.' (ఇట రాజ్యమిచ్చునో, లేదోయని తెలిసికొని రావలెనని రాముఁడు చెప్పినది ప్రక్షిప్తమని నిర్ణయించిరి.)

(యుద్ధకాండము – చతుర్థాశ్వాసము – పుట 349.)

గుహునిభక్తిని, హనుమంతుని క్రియాసక్తిని, సేవానురక్తిని, మహితభక్తిని గూడ మన కవిప్రవర్ణు లెంతో నైపుణ్యముతో వ్యక్తపఱచిరి. శ్రీరామ పాదరజము తన తరణిని సోకినచో, అది యహల్య బోలు వనితయగునేమోయని యడలి, రఘూద్వహుని పాదంబులు కడిగి 'తీర్థంబు స్వీకరించి, శిరంబునఁ జల్లుకొని' తనవారి కందఱకును బాదతీర్థంబిచ్చిన గుహుని యస్తోకభక్తిని పాఠకమహాశయు లవలీలగ నూహింపగలరు.

(అయోధ్యాకాండము – ప్రథమాశ్వాసము – పుట 252)

తన కుపహారముగ ప్రసాదింపబడిన హారమున రామనామమును కనుటకై హనుమంతుఁడు దానిని పగులగొట్టినపుడు సుగ్రీవుఁడు "ఱాతిలో, అప్పులో రామనామముండునని యంతే నీలోనను ఁడు నోయి ?" చెప్పుమనినపుడు మారుతి—

"చ. తనహృదయంబు గోరుల నుదారతఁ జీఱి కనుండటంచుఁ జూ
పిన నటనున్న యెల్లరును వేడుకఁ జూచిరి సూర్యపుత్రుఁడున్

హనుమశరీరభాగ మదియంతయు రామమయంబుగాఁ గనుఁ
గొని కడువిస్మయం పడుచుఁ గౌఁగిలించెను రాముఁడుఁబోలె నాతనిన్."
(యుద్ధకాండము - చతుర్థాశ్వాసము - పుట 360)

గ్రంథమందలి యద్భుతఘట్టములలో నిది యొకటి. ఇందలి తాత్త్వికవిభూతికి, కవిత్వసంపద యీడై యొప్పుచున్నది. ఈ పంక్తు లందలి భావవిభూతిని వ్యక్తీకరింపవలెననిన రామాయణమును బోలు వేఱొక విమర్శక గ్రంథమును సృష్టింపవలెను.

శరీరనాళమునందు రక్తమెట్లు ప్రవహించునో భక్తప్రవరుల హృదంతరాళమున భక్తిపూరమట్లు వెలారును. స్తంభమున సహితము ఈశ్వర చైతన్యముకలదని నిరూపించు హైందవ తత్త్వశాస్త్రము మనుష్యహృదయ మీశ్వరమందిరమనియు ఈశ్వరనామమందు అనవరతము ముఖరితమగుననియు రూఢిచేయుటలో నక్కటమేమియు లేదు. కేవల విషయసర్వచనము శాస్త్రాశయము; వ్యక్తిజీవితమున ప్రత్యక్ష దృష్టాంతమును జూపుట కళాదర్శము. ఈవిధానమున మనమహామహోపాధ్యాయులు సిద్ధహస్తులని రూఢిచేయు ఘట్టములలో నిది యొకటి.

అన్నదానముచేయని వారిగతి యెట్టిదగునో దండికుని వృత్తాంతమున గానవగును. ఎన్నెన్నియో సత్క్రియలొనరించివను, "ఎట్టిప్రాణి కేనాడుగాని యింతయన్నము పెట్టుట నెఱుంగనట్లు కాకపోయితి"నని దివినుండి శ్మశానవాటికకు దిగివచ్చి స్వీయశవభక్షణ మొనరింపవలసిన గతి తనకుపట్టినదని యాతఁడు తెలిపెను. హిందూతత్త్వశాస్త్రము వాకొను కర్మసిద్ధాంత మీ కథయందు వ్యక్తమాయెను.

గ్రంథస్థాంశములను విపులముగ సమీక్షచేయవలెననిన వేఱొక యుద్గ్రంథమును సృష్టించవలెను. సంక్షేపవివరణమే యీ యవతారికలో నాకు సాధ్యమాయెను. కవిసార్వభౌముని కవితావైభవము దృష్టాంతీకరించు ఘట్టములు బహుళముగ ని గ్రంథమున గలవు. వ్యక్తివర్ణన, ప్రకృతివర్ణన, ఋతువర్ణన మున్నగు కావ్యఘట్టములు అత్యద్భుత కవిత్వసంపదతో విలసిల్లుచున్నవి.

ఈ పంక్తులను పరిశీలింపుడు:

ఉ. ధూమపరీవృతంబగుచుఁ దోఁపగవచ్చెడు వహ్నికేల నాఁ
గోమలమేఘభిత్తి పరిగుంఫితమై చను చంద్రరేఖనా
భూమిరజోవృతంబగుచుఁ బొల్చెడు రత్నశలాక నాఁగ న
క్కామిని ధూళిధూసరిత కాయముతోఁ గనవచ్చె నచ్చటన్.

(బాలకాండము - తృతీయాశ్వాసము - పుట 165)

"సీ. మావి పూఁదేనెల మత్తిల్లి యలిగాయ
కాళినుస్వరముల నోలిఁబాడ
... ... ... ... ... వెలయుచున్నట్టి వనలక్ష్మిఁ బెండ్లియాడె."

(బాలకాండము - ద్వితీయాశ్వాసము - పుట 78)

"తే. రజత భూధరాదులను నిరాకరించి
నీరజాండ కటాహంబు నించిదెసల
ముంచి ధరణీతలం బాక్రమించి మించె
బండువెన్నెల కన్నులపండువగుచు,"

(బాలకాండము - చతుర్థాశ్వాసము - పుట 189)

"తే. నలినగర్భమరందపాన ప్రమత్త
భృంగసంగీతనాద మెసంగె దెసల
భూమిఁ దికిడ్డ మేటి వింజామరములు
నాఁగఁ దగె జెల్లుపూల్ శరదాగమమున."

(కిష్కింధాకాండము - ద్వితీయాశ్వాసము - పుట 41)

మ. ఎలమిం గార్తికమాధవుండు త్రిజగద్వీతాపరస్వాంతుఁడై
యిలపై మెట్టఁగ రాఁ దదీయు లపు డెంతేభక్తి భావించి ర
త్తులసీకాంత సహస్రదీపములతోఁ దోతెచ్చె నెత్తమ్మి పూల్
సెలఁగం జల్లె ననంటి పండ్లిడె వహించెన్ జెల్లు వింజామరల్.

(కిష్కింధాకాండము - ద్వితీయాశ్వాసము - పుట 41)

"చ. వర సరయూనదీపులినభాగ సమంచిత హంసతూలికా
స్తరణదుకూలజాల విలసన్నవ దంపతు లుష్ణరాత్రులన్
దరగలవోలె మాటికిని దక్షిణదిగ్గతవాత పోతముల్
పఱపుచు నూత్న శీకరములం బయిపీవ సుఖింతు రెంతయున్."

(బాలకాండము - ప్రథమాశ్వాసము - పుట 88)

"సీ. చందురుఁ గఱఁగించి కందు వేసలియందు
వేసి నెమ్మోముల వెలయఁజేసి

... ... ... ... ... ... ... ...

యనెడు రట్టును బోఁగొట్టుకొనియెనవుడు"

(బాలకాండము – ప్రథమాశ్వాసము – పుట 33–34)

"చ. ఇలపయి నెల్లవర్ణములు నేకవిధంబయి తన్నుఁజేర దా
నలరెడు బ్రహ్మమాయనఁగ నంతటనిండి విశుద్ధకాంతిమై
వెలసి సమస్తజీవులకు వేడుకఁ గూర్చుచుఁ దీర్చికాసె రేల్
నలిగఁ జకోరపాళి కశనంబయి శారదచంద్ర చంద్రికల్."

(కిష్కింధాకాండము – ద్వితీయాశ్వాసము – పుట 41)

"ఉ. వారిద సంభృతాసిత నభస్థఁమందు మణీగణప్రభా
సారసముజ్జ్వలంబయి యొసంగు సురాధిపచాపమూర్తిపైఁ
దీరి స్ఫురించెనోయనఁగఁ దేజరిలున్ సురగోప గోష్పమై
భూరితరప్రభూత తృణపుంజసమంచిత భాగమత్తఱిన్."

(కిష్కింధాకాండము – ప్రథమాశ్వాసము పుట 33)

"సీ. ... ... ... ... ... ... ... ... ... ... ... ...

చిక్కని వృక్షముల్ క్షితిధరంబులుగల్గి
నేలకు నింగికిం జాలికొనియె,

తే. అట్టి క్రౌంచవనంబున నన్నదమ్ము
లట్టు నిట్టును మెట్టుచు నరుగుచుండ
నచటఁ బాతాళమట్లు లోతైనయొక్క
కొండగుహా గానవచ్చె రాకొమరులకును."

(అరణ్యకాండము – ద్వితీయాశ్వాసము – పుట 379)

"చ. పెనఁగి జగంబులల్లు మగబిడ్డను బొడ్డునఁగన్న దొడ్డ వే
ల్పున కిడివిచ్చి బ్రచ్చుతనముద్దులకన్నియఁ బెండ్లిచేసి బెం
పనుబడఁ గూఁతుతోఁడ దనయల్లుని నిల్లటముంచుకొంటినే
నని కడు సంతసించు నన నంబుధి మిన్నులు ముట్టె బెట్టుగన్.

(కిష్కింధాకాండము– ద్వితీయాశ్వాసము, పుట 69)

తన భావనాశక్తిని పురస్కరించుకొని కవి పదునాల్గు భువనము లందును విహరించును. భావాంబరవీధి విశ్రుతవిహారియై అతఁడనేక దృశ్యముల నవలోకించును. భావనాసముద్భవ విమానము నారోహించి, విహాయస వీధియందు మసలుచు కాళిదాసమహాకవి బహుళ దృశ్యములను అనిర్వచనీయ కౌశలముతో నభివర్ణించెను. తన విమాన మన కెనయైన పుష్పకమున సీతారాముల నధివసింపజేసి వారిచే వియత్తలమున పయనింపజేసిన ప్రజ్ఞాధురీణుఁడాతఁడు. తనవాక్కులను రామచంద్రునిచే కాళిదాసు జెప్పించెను. వైదేహీసహితుఁడై దివ్య పుష్పకమున నధిరోహించి వినువీధియందు ప్రయాణము సలిపిన రఘూద్వహుఁడు చరచర గన్నులబడి తరలిపోవు సుందరదృశ్య పరంపరను వర్ణించి జానకి సలరించెను. ప్రపంచ సాహిత్య గ్రంథములయం దా పంక్తుల కీడైన వాక్కులెన్నో లేవు. స్వీయపుష్పకమున పయనించిన మన కళాప్రపూర్ణులు తమ మాటలనే శ్రీరామునిచే (సతీసహితముగ నాతఁడు మఱలివచ్చుతఱి) జానకికి చెప్పించిరి. చూడుడు :

"క. కైలాసంబున కెత్తయి
త్రాలుఁ ద్రికూటాద్రి విశ్వకర్మ పొనర్చెన్
శ్రీలం బొల్చెడు నిదె కను
మా లంకాపురము సర్వమాన్యంబయగున్."

(యుద్ధకాండము - చతుర్థాశ్వాసము - పుట 843)

యీ పుటలలోను, తరువాతి పుటలలోను యీ దృశ్య పద్యములను పఠితలు పరిశీలింపగలరు.

మనోహరములైన యిట్టి వర్ణనలు గ్రంథమున విశేషముగా గానవచ్చుచున్నవి. వ్యక్తిగత భావనాశక్తి ననుసరించి, వైజ్ఞానిక ప్రజ్ఞననుసరించి, రససృష్టిజేయు ప్రతిభ ననుసరించి, చిత్రలేఖనా కౌశలము ననుసరించి, శిల్పశక్తి ననుసరించి, వర్ణనమందలి వైభవము, శయ్యలోని సౌందర్యము, శైలిలోని ప్రభావము వెలయును.

పర్వతములకును, స్రవంతులకును, సముద్రములకును, నిలింపులకును, మనుజులకును, ఆంతరంగికమైన బాంధవ్యమును, గాఢమైన

నేసమును చూపి విశ్వకుటుంబ మహత్వమును చాటునది మన సాహితియే! సర్వదృశ్యములును, సర్వజీవులును దైవాత్మప్రదీప్తములని కాలశిఖరముపై నిల్చి అది కంఠమెత్తి వచించును. శైలసుత శివుని ధర్మపత్నియని, గంగాపుత్రుడు భీష్ముడని, సింధుకన్యాపతి శ్రీవిష్ణువని భారతసారస్వతము తెల్పుచున్నది. మేఘము, హంస, కీరము, మయూరము మున్నగునవి దూతలై ప్రేమసందేశములను గొనిపోవునవి. *ప్రాచీ ప్రతీచీ కవుల దృక్పథములందలి వ్యత్యాసమును జలదమును కాళిదాసు వీక్షించిన విధమందును ('మేఘసందేశమును' చూడుడు) షెల్లీ (Shelly) కవి యవలోకించిన విధములోను పాఠకులు పరిశీలింపజాలుదురు. ప్రస్తుతగ్రంథమున నంబుధిని వర్ణించిన కవిసార్వభౌముల దృక్పథమునకును, "సముద్రమా! పొంగి పొరలుము! పొరలుము!" (Roll! Great Ocean! Roll!) అని గంభీరసింధువును వర్ణించిన బైరన్ మున్నగు ప్రతీచీకవుల దృక్పథమునకును గల వ్యత్యాసమును నిశితదృష్టిగల చదువరులు పరిశీలింపగలరు.

ప్రపంచ మహాకవులు కొందఱు యమలోకవర్ణన గావించిరి. ఇటలీ దేశమందలి మహాకవి డాంటే (Dante), ఆంగ్లమహాకవియైన మిల్టన్ (Milton) అట్లొనరించిన పాశ్చాత్యకవులలో ముఖ్యులు. కవిసార్వభౌములు ప్రస్తుతగ్రంథమున యమలోకమును అనల్పశక్తితో వర్ణించిరి. వారు తెలిపిన నిష్ఫలయేఱు మిల్టన్ వర్ణించిన భయదనిరయ సరస్సును (Stygian Pool) దలపునకు దెచ్చును.

(ఉత్తరకాండము - ప్రథమాశ్వాసము - పుట - ౪౪౩)

గ్రంథమున ప్రతిఘట్టమందును, ప్రతిసన్నివేశమందును శ్రీరామ గుణప్రభావము పరంజ్యోతివలె పరిఢవిల్లుచున్నది. గ్రంథస్థమైన ప్రత్యక్షరము శ్రీరామమందిరమని చెప్పఁజెల్లును. మహితమందిర మండితమైన ఈగ్రంథమహత్వ మనిర్వచనీయముకదా!

---

* కాళిదాసు మహాకవి మేఘసందేశము రచించిన తరువాత బహుళకవులాతని యనుయాయులై, అనేక సందేశగ్రంథములను ("పికసందేశము", "మారుతి సందేశము", "వికిర సందేశము" మున్నగువానిని) రచించిరి.

వేదప్రోక్త వైదికక్రియాకలాపమును నిర్వహించుచు ధర్మపరిపాలన మొనరించిన ఏలిక రామచంద్రుఁడని పాఠకలోక మవలీలగ గ్రహించునట్లు మన కళాప్రపూర్ణులు తగు నుదాహరణములను పాఠకుల కన్నులకు గట్టినట్లు వివరించిరి.

గ్రంథమంతయు గంభీరభావవిలసితమై, సర్వాంగసుందరమై, భాస్వదాశయసందీప్తమై తేజరిల్లుచున్నది. తెలుఁగుతల్లి మనియున్నంత కాలము, ఆంధ్రభారతి సారస్వతోపాసకుల పూజామందిరములందు సౌందర్యతిలకమై వెలయునంతకాలము, పదునాల్గు భువనములందు భక్తవరేణ్యుల హృదయములు రామనామముతో ప్రతిధ్వనించునంత కాలము, శీలసంపద, ఆధ్యాత్మికప్రజ్ఞ విశ్వమున పరిఢవిల్లునంతకాలము, హిందూమతజనయిత్రి జగతిపై వఱలునంతకాలము, భారతీయసంస్కృతి భువిపై వెలుగొందునంతకాలము, తమ ప్రాచీసభ్యత జ్ఞానపథమున విఁసిల్లునంతకాలము, జగదీశునిలీలకు వసుమతి ఆటపందిరియై పరగునంతకాలము ఈదృశమహాగ్రంథములు పాఠకప్రపంచమున వెలయుచు సాధకులకును, జిజ్ఞాసువులకును, కళోపాసకులకును, విజ్ఞానయాత్రికులకును, సుజ్ఞానమును, విజ్ఞానమును, ప్రజ్ఞానమును ప్రసాదించుట నిశ్చయము.

స్వాధ్యాయ ప్రవచనములను పరమావధులొనరించుకొని తమ జీవితక్షేత్రమును తపోభూమి గావించుకొని ధన్యులైన మహాపురుషులు శ్రీకవిసార్వభౌములు. మఱే కవికిని సాధ్యముకాని కృషిని గావించిన ప్రజ్ఞాధురీణులు వీరు !

"మాన మభిమానమునుగల్గి మంచివృత్తి
నొరులప్రాపున కాశింపకుండ నెంచి
భరత వర్షంబునన్ బుట్టి భారతీయు
లైన దేశాభిమానుల కంజలి యిది"

అను వీరి బొబ్బిలి నాటకములోని పద్యమును పరిశీలించినపుడు వీరి హృదయగ్రథన మెట్టిదో మనకు బోధపడగలదు. ఆత్మగౌరవముపై, దేశాభిమానముపై, లోకసంగ్రహముపై, మానవ కళ్యాణ

ముపై మనసుంచు మహనీయులు గావున వీరిహృదయము నవనవాటికకెనదై వెలయుచున్నది. ఇట్టి హృదయమున నుద్భవించిన కృతులు దివ్య తేజస్సుతో వెలుగొందుట అక్కజముకాదు.

ఈ పవిత్ర గ్రంథమందలి పరమార్థమును గ్రహించి, బహుళ సంఖ్యాకులు తరింపగలరని విశ్వసించుచున్నాను.

మహితగుణ సంశోభితులైన శ్రీ ఈదర వేంకట్రావుపంతులు గారు ఈ కృతిని స్వీకరించుట ముదావహము. స్వయంకృషివలన నున్నత పదవుల నలంకరింపజాలిన మహాపురుషులు వారు. వారి మహోన్నతికి హేతువైనది వారిక్రమనిష్ఠయే ! ఐహికార్థముతోపాటు పరమార్థమును చేజిక్కించుకొనిన తపస్విన్యై సహధర్మచారిణి శ్రీ సుబ్బమ్మాదేవి తన్ననుసరింప ననల్పదీక్షతో నిరతాన్నదానము చేయుచు శ్రీ వేంకట్రావు పంతులుగారు సారస్వతపోషణ మొనరించుచున్నారు. అర్థము ధర్మసంబద్ధమైనపుడు పూతజీవితవిధానమునకు తోడుపడగలదు. నియమమునుండి దూరస్థులుకాక తమ వృత్తిని నెఱపుచు లోకహితార్థము జీవితము గడపుచు యశస్తిలకులై వారు వెలయుచున్నారు. శ్రీరామగాథకు కృతిపతియగుటకు శ్రీరామభక్తునకే యర్హతకలదుగదా! రామభక్తులైన మహనీయు లీపవిత్రకృతి స్వీకరించుట ముదావహము.

మహాపురుషులైన కృతికర్త కృతిభర్తలను హృదయపూర్వకముగా నభినందించుచున్నాను. కృతిగ్రహణమహోత్సవమున ప్రారంభోపన్యాసము నొసఁగుభాగ్యమును నాకు చేకూర్చి, గ్రంథప్రశస్తి నుగ్గడించు నవకాశమును ప్రసాదించిన శ్రీ వేంకట్రావు పంతులుగారికిని, ఈ మహాగ్రంథమునకు నవతారిక వ్రాయు మహాభాగ్యమును నాకు చేకూర్చిన కవిసార్వభౌములకును హృదయపూర్వకముగ సహస్రధన్యవాదములను సమర్పించుచున్నాను.

ఏలూరు
14-1-1948
(సంక్రాంతి)

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి
ఎం. ఏ., బి. ఎల్.

# శ్రీకృష్ణ రామాయణాంకిత మహోత్సవము

కృతికర్త : శ్రీ కవిసార్వభౌములు

కృతిభర్త : శ్రీ ఈదర వేంకట్రావు పంతులుగారు

5-1-'48 ఉదయం మహా మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసార్వభౌమ, అభినవ శ్రీనాథ, వేదవిద్యావిశారద, ఆంధ్రవ్యాస, ప్రసన్నవాల్మీకి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు రచించిన "శ్రీకృష్ణ రామాయణమును" వేంకట్రామ కంపెని యజమానులు, విద్యోద్ధారకులు, ఆశ్రితపారిజాత శ్రీ ఈదర వేంకట్రావు పంతులుగారికి కృతిమహోత్సవము మహావైభవముగ జరిగెను. శ్రీ వేంకట్రావు దంపతులు యథాశాస్త్రీయముగ తొలుత గణపతిని పూజించి, నవగ్రహపూజచేసి, పిదప సరస్వతి నారాధించి శ్రీ కవిసార్వభౌమ దంపతులను ఉచితరీతిని పూజించి నూతన వస్త్రాలంకృతుల గావించి రెండువేల నూటపదియారు రూప్యముల సొమ్మును, విలువగల వస్త్రములను బహూకరించిరి. కవిసార్వభౌములు తమ రామాయణమును స్వయముగ మధ్యంతములవరకు చదివి శ్రీ ఈదర వేంకట్రావు గారికి అంకితముగావించిరి. శ్రీ పంతులుగారు కవులకు, పండితులకు విలువైన వస్త్రములు, సేలువలు, సంభావనలనిచ్చిరి.

సాయంకాలము శ్రీ పంతులుగారి మేడమీద హాలులో బ్రహ్మశ్రీ మండలీక. పెదవేంకటశాస్త్రిగారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి M. A. B. L. గారు శ్రీ కవిసార్వభౌము లొనరించిన రచనలు మహత్తరములు, రసవంతములు, ఆదర్శప్రాయములనియు, మహాభారతమును ఒక్కరే ఆంధ్రీకరించిన ఆంధ్రవ్యాసులనియు వాల్మీకి రామాయణమును మక్కికి మక్కిగా తర్జుమా కాకుండా తమయొక్క విచక్షణానైపుణ్య మవసరమయిన ఘట్టములలో పూర్ణముగ స్వశక్తి వినియోగించి ఆధునిక పాఠకులకు రమ్యమై ఆదర్శప్రాయమై ప్రజారంజకమైన రీతిని రచించిరనియు ఉద్ఘాటించిరి.

శ్రీ జటావల్లభుల పురుషోత్తం M. A., గారు శ్రీ వేంకట్రావు పంతులుగారియొక్క కళాపోషణ, ఉదారస్వభావము, ధార్మికచింత, భూతదయ, దైవభక్తి, గోసంరక్షణ మొదలగు సుగుణములను ప్రశంసించిరి. శ్రీ కవిసార్వభౌములు ఇంత పెద్దవయస్సులో వికసితబుద్ధి విశేషముచేత ఈ మహాకావ్యమును బహుశ్రావ్యముగ వ్రాసి ఆంధ్రభాషకమూల్యము నిచ్చిరని ప్రశంసించిరి. అధ్యక్షులు ఈ గ్రంథ ప్రాశస్త్యమును వివరించి తెల్పిరి. కవిపండితు లాశీస్సులొసగిరి. నాడుమొదలు 28-1-48 తేదీవరకు శ్రీకృష్ణరామాయణమును సమగ్రముగ పురాణకాలక్షేపము చేసి, శ్రీరామపట్టాభిషేక మహోత్సవ మొనర్చి కవిసార్వభౌములకు మఱియు 216 రూప్యములు వస్త్రముల నొసంగి, పురాణపఠనము గావించిన శ్రీ హోతా వెంకట్రామశాస్త్రిగారికి 116 రూప్యములు, వస్త్రము లొసంగి పెక్కుమందికి సమారాధన గావించిరి. స్వస్తి. శ్రీ శ్రీ శ్రీ

ఇట్లు,

ఏలూరు, జనవరి 1948.

పాలుట్ల పాలంకయ్య.

# విజ్ఞాపనము

ఇదివఱకు నేను గావ్యములు, నాటకములు, ప్రబంధములు, చరిత్రములు, స్థలపురాణములు, విమర్శనములు లోనగు పెక్కుగ్రంథము లొనరించితిని గాని పురాణములు రచింపలేదను కారణమున గణేశ పురాణము రచించి, పదంపడి భవిష్యమహాపురాణము ప్రారంభించి, కొన్ని యాశ్వాసములు ముగించితినిగాని గ్రంథముపూర్తి కాలేదు. ఈలో నిప్పటికి సుమారు రెండుసంవత్సరములక్రిందట "ఆశ్రితపారిజాత" మని ప్రసిద్ధిగాంచిన శ్రీఈదర వేంకటరావుపంతులుగారు తాము రామ భక్తి భరితులగుటంజేసి నన్నాహ్వానించి శ్రీరామచరిత్రము సులభ శైలిని సర్వజనసమ్మతంబుగా నుండునట్లు రచించి తనకంకితముచేయుం డని కోరుటంజేసి నే నీ రామాయణ మారంభించి రెండుమాసముల పదునైదుదినములలో నిట్లు సంగ్రహించి రచించితి నని విన్నవించు చున్నాను.

ఇప్పటికిఁ దెలుఁగులో మహాకవులు భాస్కరాదులు రచించిన రామాయణములు పెక్కులు సర్వజనశ్లాఘాపాత్రములై యున్నవి. ఇట్టిచో నా రచించిన యీ రామాయణము లోకమును మెప్పింపఁ జాలునని నేఁ దలంపను. అయినను వేంకటరావుపంతులుగారి కోరికననుస రించి కొన్నికొన్ని రామాయణగ్రంథములం బరిశీలించి యిట్లు రచిం చితిని. ఇది సర్వత్రమూలరామాయణము ననుసరించుననిచెప్పఁజాలను. కొన్నికొన్ని స్థలములందు కొన్నికొన్ని మార్పులు చేర్పులుం జేసి యుంటిని. తక్కిన భాగములన్నియు మూలముననుసరించియే యుండు నని చెప్పఁజాలుదును.

మూలరామాయణోత్తరకాండములోఁ జెప్పఁబడిన రావణాది జన్మాదికము లోనగునవి యిందు బాలకాండముననె చేర్చితిని. రావ ణాదు లెవ్వరో యెట్టివారో మునుమున్న మనకుఁ దెలిసినపిమ్మటనే వారి వృత్తాంతము వినుట మంచిదని యిట్లుచేసితిని. శ్రీరామునంతవానిం

గన్న దశరథుఁ డెట్టివాఁడో తెలియుట సమంజసమని దేవలోకము నందలి వానియుద్ధము నాదియందే వర్ణించితిని. దీనివలనఁ గైక కిడిన వరద్వయమెట్టిదో తెలియవచ్చును.

అట్లే వేఁటయు శాపమును సూచించితిని. మఱియు ఋష్యశృంగాదుల చరిత్రములును, శాంతా జన్మాదికమును వివరించితిని. రామాయణగ్రంథకర్తయగు వాల్మీకులవృత్తాంత మాదిలోనుండుట లొప్పునని తచ్చరిత్రము నుదాహరించితిని. ఇదిగాక రామావతారమునకు మూలభూతమైన రావణాసురుఁ డేకారణమున సీతాపహరణము చేసెనో యెట్టకేనటనే మనకుఁ దెలియుట ముఖ్యము గావునఁ దద్రూపమంతయు నాదియందే చిత్రించితిని. రావణుఁడు మహాజ్ఞాని యనియు, సీతయెడ మాతృభావము చేసియున్నవాఁడనియు స్పష్టీకరించితిని.

ఇందు మంథరాకైకేయులు రాముసెడఁ బరమద్రోహము చేసినారని లోకమునంగల యపప్రథ తొలంగునట్లు వారిపట్ల దోషమిసుమంతయు లేదనియు, వారు సర్వలోకోపకారము చేసినవారనియు నిరూపించితిని. ఇది మూలవిరుద్ధమని కొందఱనవచ్చును గాని యిది మూలవిరుద్ధము కాదనియు, మూలస్థమే యనవచ్చుననియు, నందలి కథాసందర్భమును బట్టియుఁ, జిత్రకూట పర్వతమందు శ్రీరాముఁడు భరతునితోఁ గైకంగూర్చి ప్రసంగించిన దానింబట్టియు నాయీకల్పనము మూలవిరుద్ధము కాదనియు, వాల్మీకుల యభిప్రాయమిట్టిదే యనియు రూఢికాఁగలదు. అట్లే యహల్యావృత్తాంతమును అహల్య యింద్రునితో సంగమించిన దనుచో మన భారతధర్మమే చెడిపోయి భారతీయు లధములే యగుదురుగదా! ఇంద్రుఁడు కరస్పర్శమే చేసెను. అదియే యట్లు సంగమముగా మూలము పేర్కొన్నది. ఆమె మహాపతివ్రతాశిఖామణియని శాపమోక్షకాలమందు వాల్మీకులే విశ్వామిత్రునిచేఁ బలికించినాఁడు. ఇట్టిస్థితిలో నిప్పటి కింకవులు కొందఱు దేవేంద్రాహల్యల సంభోగముం జెప్పుచు నుపరతులుకూడ విపులముగా వర్ణించి మహాపతివ్రతను మట్టింగలిపి మన దేశమున కపఖ్యాతిం

గలిగించిన పాపు లగుచున్నారు. ఇత్యాదులు పెక్కు లిందుఁ గాన వచ్చెడి నవి చక్కఁగాఁ బరిశీలింపఁ గోరుచున్నాను.

మఱియు మూలభిన్నములై కొన్నిస్థలములు చూపట్టుచున్నవి. అవిలోకవిరుద్ధములనియు, మూలకవిరచించినవి కావనియు, ప్రక్షిప్తము లనియుం జెప్పుచున్నాను జిత్తగింపుడు:-వనవాసమునకుఁ బోవునప్పుడు కైకయే సీతారాములకు వల్కలము లిచ్చినట్లు మూలముననున్నది. ఆవల్కలములు శ్రీరాముఁడట ధరింపక గంగాకూలమునందు ధరించి నట్లున్నది. అట్లుగాక నా యీ రామాయణములో సీతారాము లయోధ్యలోనే మునివేషములు వేసికొనినట్లును, రథమధిష్ఠింపక కాలి నడకనే పురమువిడిచి పోయినట్లును మార్చితిని. ఏదినమున నెన్ని ఘటి కలమీఁద శ్రీరాముఁడు మునివేషము ధరించి యరణ్యమునకుఁ బోయెనో ఆదిన మన్ని ఘటికలకే పదునాలుగు సంవత్సరములు పూర్తియగుచున్నవి. తదుత్తర క్షణముననే రాముఁడువచ్చి పట్ట భద్రుఁడు కాదగునని మన మూహింపవచ్చును. ఆక్షణము దాఁటినచో భరతుఁ డగ్నిప్రవేశము చేయున ట్లామూలమే చెప్పుచున్నది. కావున శ్రీరాముఁడు రథమెక్కి మేళతాళములతోఁ బురము వెడలిపోయె ననియు, గంగాకూలమున మునివేషము ధరించెననియు వ్రాయుట సమంజసముకాదు. వీరు బయలుదేరిన కాలమునకును, జడలుధరించిన కాలమునకు, నడుమ రెండుదినములు వ్యత్యాసమున్నది. కావున నయో ధ్యలోనే మునివేషము వేసికొనినాఁడని చెప్పుట లొప్పును. కైక నారచీర లిచ్చినతోడనే రాముఁడు వానినప్పుడు ధరింపక గంగాకూలమందు ధరించెననుట తగదు. సీతమాత్ర మయోధ్యలోనే మునిపత్నీవేషమును వేసికొనెననియు ఆమె నారచీఱ కట్టుకొనలేని యప్పుడు శ్రీరాముఁడే కట్టెనని వ్రాయుటయుఁ దప్పే. ఇత్యాదు లన్నియు బ్రక్షిప్తములని మనము స్పష్టముగా నూహింప వచ్చును. మహాకవులు రామాయణ వ్యాఖ్యాతలు రామాయణములో ననేక స్థలములఁ బ్రక్షిప్తములు పడెనని చెప్పుటయేకాక యుత్తరకాండమంతయుఁ బ్రక్షిప్తమని చెప్పుచున్నారు. కావున నే నిట్లు వ్రాయుటకు విజ్ఞులు గర్హింపరని నాతునోనిశ్చయము.

మఱియు లంకాపురమునుండి మరలివచ్చునప్పుడు భరద్వాజాశ్రమమందుండి రాముఁడు హనుమంతు నయోధ్యకుం బుచ్చుచు నాకురాజ్యమిచ్చు నభిప్రాయముతో భరతుఁడుండెనో లేదో తెలిసికొని రమ్మనినట్లు మూలమునన్నది. అది ప్రక్షిప్తమే కానియెడల రాముఁడుత్తమ నాయకుఁడు కాక సామాన్యుఁడే యగుచున్నాఁడు. భరతుఁడెట్టివాఁడో, తనపై నెట్టి భక్తితో నుండునో యెన్నోపర్యాయములు రాముఁడేచెప్పినట్లు రామాయణమే చెప్పుచున్నది. అట్లు రామునిచేఁ జెప్పించిన వాల్మీకి యిక్కడ నిట్లు చెప్పించునని మనమూహించుట తప్పు. కావున నిది ప్రక్షిప్తమేయనుట ఒప్పు.

మఱియు రావణాసురునింటనుండిన సీతాదేవి యెట్టి యాలువు గలదో నామె తనలోఁ బ్రవేశించుటంజేసి తాను పూతుఁడనయితినని సంతసించుచు సీతందెచ్చి రామునకిచ్చిన యగ్నిహోత్రుఁడు సాక్ష్యమిచ్చుచున్నాఁడు. బ్రహ్మదేవుఁడు, శంకరుఁడు, ఇంద్రుఁడు లోనగువారును, రామునకుఁ దండ్రియగు దశరథుఁడును, సీత నిర్దోషురాలు, మహాపతివ్రత, నీ వేసందేహము నొందక యేలుకొమ్మని రామచంద్రునకుం జెప్పినారు. అప్పుడాతఁడామెను స్వీకరించినాఁడు. అట్టిచో నెవ్వఁడో యొకచాకి తప్పద్రావి మత్తెక్కి యేమో ప్రేలినమాత్రమున నిండుచూలాలి నామె వనులకుంబంపిన రాముఁడు రఘురాముఁడు గాడు. రఘురాముఁడని యూహించుట పాపమనకతప్పదు. ఇక్ష్వాకు వంశజులైనరాజులు ప్రజాపతు మవలంబించువారుగావునఁ బ్రజలలోనం జేరిన రజకుని పలుకులు వినుటంజేసి సీతాచరిత్ర మెఱింగినవాఁడయ్యు రాముఁడు సీతను విడువవలసి వచ్చినదని కొంద ఱందురేమో? అట్లయినచో నామె నెప్పటికిని విడిచిపెట్ట వలసినదియే కాని యట్లు జరుగలేదు. మరల నామె యయోధ్యకువచ్చి రామునితోఁ గాపురము చేసినట్లు మూలరామాయణే చెప్పుచున్నది. కావున నిట్టిమహాదోషము గుణగణఖనియగు రామచంద్రున కంటఁగట్టుటకు మనంబొప్పక యొక విధముగా దానిన్మార్చి సంవిధానము చక్కఁజేసితిననియు రాముఁడట్లు చేయలేదనియు నిది కల్పితమనియుఁ గంఠోక్తిగాఁ జెప్పుచున్నాను.

కుశలవులు వాల్మీక్యాశ్రమములోఁ బుట్టిరనియు, వాల్మీకులు వారిం బోషించి వారిచే రామాయణము గానము చేయించిరనియు మనము మూలగ్రంథములో వినుచుందుము. అట్లుగాక సాకేతము లోనే వారు పుట్టినట్లును, రామాయణ కథోపదేశము వాల్మీకులే చేసినట్లును సందర్భముగా నిందుఁ జేర్చువాఁడనై యుత్తరరామ చరితములో భవభూతి కల్పించినట్లు బొమ్మల రామాయణ గ్రంథముం దెచ్చి వాల్మీకి సీతకు రామకథం జెప్పినట్లు, గర్భస్థులైన కుశలవు లా కథ నాకర్ణించిరనియు లోనగు పెద్దకథ యీశ్వరోపదేశమున నిం దభి వర్ణించితిననియు నిది యుక్తమే యనియు నా యంతరాత్మ చెప్పుటం జేసి యిట్లు చెప్పితిని. దీనికిఁ బెద్దలు మన్నింతురుగాక!

ఉత్తర రామాయణములోని శంబూకవధము జాతివైరముం గలిగించునట్టిదై గ్రంథకర్తయగు వాల్మీకినేగాక వసిష్ఠాదులను శ్రీరామ చంద్రునింగూడఁ దిట్టింపఁజేయునట్టి దగుచున్నది. ఇట్టికథలు ప్రబలుటం జేసియే పరస్పర విద్వేషములు పెచ్చుటకుం గారణమగుచుండును. కావున నట్టివి మహాగ్రంథముఁ దిపుడుండుట లొప్పదు. ఈ కథ యం ప్రక్షిప్తమేయైనను జాతికథవోలెజగద్విఖ్యాతంబగుటంజేసి యిందు విడువక శంబూకుఁడొనర్చు తపస్సు ఘోరమైనదనియు, నది యెట్టివాఁ నాచరింపరాదనియు నెంచి వానిచేయు నాతపస్సును వారించుటయే శిక్షించుటయని తపోవిఘ్నము మాత్రము చేసినట్లు వ్రాసితిని. మఱియు నిందు స్వర్ణ సీతాసమేతుఁడై రాముఁడధ్వరము చేయుటయు, సీతా భూగర్భ ప్రవేశములోనగునవి వ్రాయఁబడలేదు. శ్రీ ఈదర వేంకట రావు పంతులుగారు కృతితాంబూలమిచ్చు నప్పుడు మీరు రచించు రామాయణములో నుత్తరకాండము వ్రాయవలదు. అందునమంగళ ములు పెక్కులున్నవని చెప్పియున్నారు. అయినను నేనుత్తరకాండము పూర్తిగావిడుచుట కిష్టములేనివాఁడనై యమంగళవిషయములగు సీతా భూగర్భ ప్రవేశాదులు విసర్జించితి నని మనవి చేయుచున్నాను.

ఇట్లు నాచే రామాయణము వ్రాయించిన ఈదర వేంకటరావు పంతులుగారు సన్నెంతో ఆదరించి మిక్కిలి బహూకరించిరని నా సంతోషమును దెలుపుకొనుచున్నాను. నాచే రామాయణము

వ్రాయించి కృతినొందిన వేంకటరావు పంతులుగారు ధన్యులగుటయే కాక రామాయణము రచించుటంజేసి నన్నుఁగూడ బునీతుంగావించి రని తలంచుచున్నాను. ఇట్లు రచించిన నా గ్రంథమున కెవ్వరిచేతనైనఁ బీఠికను వ్రాయింపవలయునని యభిప్రాయముపుట్టె. నాకుఁ జిరమిత్రము లును సంస్కృతాంగ్లేయాంధ్ర విద్యావిశారదులును, సర్వభారతదేశ పర్యటనముచేసిన వారును, లోకజ్ఞాన సంపన్నులును, ఉపన్యాస కేసరి బిరుద విరాజమానులునగు శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ., బి. ఎల్., గారు నా కోరికంజేసి తమ కింతయుం దీఱుబాటు లేకున్నను వల్లెయని నాయందు వారికింగల యవ్యాజప్రేమం బురస్క రించుకొని లోకోత్తరమహోత్తరంబుగ విమర్శపూర్వకంబగు పీఠికన్ వ్రాసి నా గ్రంథమునకుఁ బ్రాశస్త్యముం గలిగించినందులకు డెందంబున నానందించుచు వారి కాయురారోగ్య భాగ్యంబులు సీతారాములు ప్రసాదింతురుగాక యని కోరుచున్నాను.

ఇట్లు,
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
గ్రంథకర్త

తాజా: పాఠకమహాశయులారా! నా దురదృష్టమునఁ జేసి యీ గ్రంథముద్రణమునం దనేక స్ఖాలిత్యములు పడియున్నవి. కొన్నికొన్ని ప్రాసములు, యతులు గణములుంగూడఁ దప్పినవి. అవి ద్వితీయ ముద్రణమునందు సవరింతును. ఇందుఁగొన్ని తప్పొప్పుల పట్టికలో సవరించితిని. తక్కిన తప్పులిప్పటికిఁ బాఠకులే సవరించుకొనగలరని నా విన్నపము.

శ్రీ. కృ.

Printed at Ajanta Art Printers,
and Kavitilaka Press, Bezwada.
Preface Etc. Pages Printed at
Vemkatram Power Press, Ellore.
T. P. No. 424 A. 8034/47—5-11-'47 1000 Copies January '48

# INTRODUCTION

Literary creations, which constitute the most resplendent constellation in the firmament of time do not rise in wits but in the perennial light of the spirit in moments of ineffable inspiration. Seers and poet-philosophers hold communion with the universal Spirit, fix their gaze on the transcendental values of life, revolve sublime thoughts in their hearts, dance with unspeakable ecstasy, when they view mystic, mysterious and marvellous visions and give vent from the height of beatitude to the rich contents of their experience in words of exquisite beauty and eternal melody. These words, known as divine utterances, inspire all ages and urge mankind to advance in the path of virtue. The bards of the world bequeath the fruits of self-realisation to hungering minds and aspiring souls in the path of time. The message of Asia has emanated from the lyre of the minstrel, the tongue of the philosopher, the pen of the poet, the chisel of the sculptor, the brush of the painter, and the rhythmic measure of the dancer from the solitude of the hermitage. Sages like Valmeeky and Vyasa spent their precious time in sylvan depth widening their mental horizon, raising ethical standards of life, garnering their hearts with spiritual treasures, deifying Truth, Beauty and Goodness and giving expression to lofty thoughts in mellifluous strains.

Kavisarvabhouma Sreepada Krishna Murty Sastry Garu, an outstanding personality in the vineyard of Telugu Literature, is one of the most distinguished representatives of Eastern culture. His inflexible will and immaculate character, native talent and assiduous application enabled him to apotheosize Muse for nearly six decades and to produce more than hundred and fifty books which covered a wide range of literary topics. His qualities as a poet place him apart from other writers. Versed in Vedas and brought up in the traditional methods of instruction in the sacred precincts of the Godavari, he plied his pen with remarkable mental fecundity and made himself a transcendentalist in philosophy. He has always hitched his waggen to the stars, demonstrated great determination to occupy the pre-eminent position among poets of

his age and worked with ardour and alacrity for the realisation of his noble aspiration. Albeit he showed deference to ancient authority, he has not evinced tendency to eclecticism. Tradition he hails with delight and devotion ; but he does not hug with unction any precedent or accept absurdity as 'Gospel truth, though, clothed in colourful linguistic habiliment, it masquirades as a brilliant theological principle. Like many of his contemporaries and pre-decessors, he made head-way in the translation of classics ; but he chose to vindicate the majesty of his independent outlook in all his artistic disquisitions or poetic creations. He has a profound and abiding confidence in his native genius. From the vast expanse of his literary productions, we can pick innumerable poems which reveal singular beauty and distinction of style which shows that he has command of the keys of language. His diction is free from pedantry and is conspicuous for spontaneity in word and phrase.

His magnumopus is the translation of Mahabharata which, in the words of Maurice Maeterlinck, is the greatest epic in the whole world, into Telugu. What three poets, who received royal patronage, performed within three centuries could be completed within a decade by Manamahopadhyaya Krishna Murty Sastriji when literature ceased to flourish under such encouragement, albeit it remained a calling in the erudite circles of our society. Sastriji entered on his vocation with enthusiasm though he could not visualise a sinecure place in the most dreary part of the century, when foreign domination paid little thought to the advancement of national literature, when authors, notwithstanding their eminent merit, were constrained to hold the chalice of misery. Whereas his predecessors incorporated modification, amplification, adaptation and epitomization within their work, Sastryji chose to give the true translation of the great epic.

His performance is really astounding. His translation though, in fact, is literal, called forth varied talents and marvellous literary equipment. We are struck by the technical skill and the poetic power which are visible in this magnificent production.

Tikkanna's rendering is like the star-bespangled heaven whose splendour excels the quirks of blazoning pens. We do not know why he deleted Gita from his magnificent work. It might be contended that metaphysics, abstract and abstruse,

militates against the free flow of poesy. Gita, however, is not hard rock stationed in the spontaneous current of Bharata. Krishna. the artist, embarked on his matchless disquisition concretising abstract and eternal truths and lifting listening humanity, represented by Arjuna, through a process of sublimation to the acme of perfection.

Kavisarvabhouma has realised that deletion of Gita from his purview would be deleterious to his translation. While scaling the majestic heights of Metaphysics and divining the pacific depth of poetry, he realised the deep significance of The Song Belestial in the most momentous context of Bharata and wove the philosophical poem in the many-threaded tapestry of his translation. His production is like the heaven, rendered beautiful by the presence of the full moon.

With deep devotion he has been writing Sreekrishnabhagavatam, delineating the character of Sree Krishna with great skill.

His 'Madhukara Vijayam' reveals his powers of originality and stands on a par with Pingali Suranna's famous book 'Kalapoornodayam' and his 'Bobbili Natika' replete with stirring episodes inspired Andhradesa for a numbers of decades. The multifarious types of literature which a galaxy of writers in various periods performed have been successfully adopted by Kalaprapurna Sastriji as his heart beats with the noble sense of power and duty and as his ideas steeped in verse became incisive and brilliant.

It is a matter of wonder to know that Sastryji maintains a vigorous and virile mind even when he has seen thousand months of his glorious life. The present book is one of his most brilliant productions.

The Savants of the world have recognised the fact that Ramayana was the first epic which appeared on the face of earth. It sprang from the marvellous civilization and cultural eminence of India when the Occident was groping in the Cimmerian gloom of ignorance. The highest standards of Ethics were expressed in the finest delicacies of Aesthatics. The rich ideology of Indian philosophy and Hindu Religion was deftly woven into the artistic texture of Ramayana. The characters of a dutiful son, ideal wife,

obedient brother. and selfless devotee were ably portrayed by Valmeeky in his splendid gallery. There is, however, a consensus of opinion that some interpolations, which detrimentally affect certain contexts, have, in the march of time, crept into Ramayana. Kalapropurna Krishna Murty Sastryji, who has an unerring eye on truth has, withour demur or hesitation jettisoned what palpably appeared as adventitious incorporation in the book.

(It is indeed difficult to rebel against an insertion which, with the mark of an established circumstance, is enthroned in sacrosanct tradition. Devotion and deification which are native to Hindu mind, would not suffer any critic to institute meticulous scrutiny into the rationale and propriety of any eontext in a book which is hailed as the greatest literary Pantheon in the world. Logic, in truth, has its play in literary criticism; but it cannot ruthlessly and recklessly hold sway in the demesne of aesthetics whose values are quite different from the empirical and utilitarian considerations of mere science. Co-ordination of cognition, emotion and volition, of imagination, cogitation and vision, of truth, Beauty and Goodness, of idealism, inspiration and creative urge invest a work of art with divine afflatus.)

Kavisarvabhouma, who is an adept in the apotheosis of sublime idealogy enshrined in moving tradition, has entered the temple of Ramayana as a great devotee pronouncing the usual paternoster and proceeded with his magnificent work abrogating interpolations, augmenting the ethical grandeur of the characters drawing on his creative telent, keeping true to the kindred points of idealism and realism and exhibiting the resplendent values of life on the magic carpet of his words.

The story of Uttharararamayana wherein the heart-rending episode of Sita's plight in the forest was described was construed as an interpolation. To believe that a pregnant lady, who proved her innocence by going through the fiery ordeal before the world should have been committed by her loving lord to sylvan horrors is to attribute unspeakable cruelty to the most righteous king who was hailed as God's incarnation on earth. Some people would, aver that Rama ruled in consonance with the opinion of the people, that he sent his lovely lady to the forest to vindicate the majesty of democrasy. Though he believed, as the world believed

after her fiery ordeal in Lanka, that her character was immaculate and beautiful like the cluster of dew-drops embellishing the cheeks of a smiling lotus, bathed in the auroral splendours of the East and that the expatriation of his noble better-half, which engendered excruciating agony in his mind, should be deemed as an act of self-sacrifice, how could we pursuade ourselves to believe that an ideal king like Sree Rama should have distilled public opinion in the ejaculations of inebriation and infatuation within the premises of a washerman ? The eminent author of this book has boldly deleted this episode and kept Sita with her noble consort after their return from Lanka.

The rich ideology of our scriptures is illustrated in the lives of our heroes and sages. Rama was the moving monument of the lofty ideal of life. He felt kinship with all beings. Divine consciousness flows through all phenomena. The sublime touch of Rama's feet enabled the potential idea moving in the heart of a stone to spring up into perfection. "An intimate and happy relation ship subsists between these beings, these birds and trees and my-self." Rama himself averred these wods. He knew the magni-ficience of-Guha's heart and bound himself with the silken ties of his love. He appreciated the principle of taste and trust when he accepted the fruits given by Sabari with deep devotion. His love towards the forest tribe has been one of the most stirring themes which inspired poets since the birth of literature in the world.

Rama drew the whole universe into his loving embrace, deriving ineffable joy from the spontaneous expression of affection of his devotees. After paying careful thought to these out-standing traits in Rama's character which rendered his life superbly beautiful and spiritually brilliant, we cannot put credence in the story of Sambhuka's end, at his hands. Sastryji's power of descrimination urged him to omit this incident in the able delinea-tion of Rama's character on his canvas. At a time when democ-ratic thought gained an unique and universal prominence in the affairs of men, when the ideals of equity and equality, liberty and fraternity won supreme recognition in all strata of seciety, people would not hesitate to question the veracity and propriety of the incident adverted to. With an eye on the spirit of times, the author has plied his pen with remarkable discretion and rare dexterity and with catholic conception of human values.

Hindu religion believes in the doctrine of transmigration and in the manifestation of Divine will in mundane affairs. Freewill and self-determination, as Ethics says, have their play in human actions. Inner urge propels deeds by its driving force. Motive and means constitute, as philosophical treatises assert, Intention which counts most in ethical judgments.

Empirical data or legal exhibits alone cannot account for the development or degradation of man. There are many things above the reach of owl-winged calculation and beyond the range of a Horatio's philosophy. Great as are the uses of inductive methods, they cannot transcend the possibilities of sense. The measure of the senses is one, the measure of the soul is another. Investigation based on hypothesis may lead a scientist to a logical theory, but it does not lift his mind to the acme of metaphysical understanding. Ratiocination veers round the laboratory or perches on the witness box, but it cannot ply its wings above the purlieus of the phenomenal world. Those minds which are cribbed, cabined and confined within a test-tube cannot glean the treasures of beatitude. Matter and mind are not the only stuff requisitioned in the make-up of a human being. Material facts and mental concepts alone do not constitute the contents of human history.

Body is only a vehicle in which the soul travels in its march to the goal of perfection. The power and purpose of each vehicle is commensurate with the degree and stage of evolution. The biography of soul does not end as long as the cycle of births whirls with its revolutions. Each career constitutes a particular chapter in that marvellous biography which indeed is a comprehensive history of the various experiences of the soul. To believe that one life alone marks the end of soul's journey is to disbelieve in the infinite powers which are inherent in the soul and which express themselves in graded manifestation and revelation. God's grace renders the Soul's march facile and victorious. Following the heels of Hinduism, Jainism and Buddhism proclaimed the deep implications of the Karma theory. There is a good deal of evidence in the Bible which enables research to prove that Jesus believed in the doctrine of transmigration. It is not my present purpose to embark on an elaborate dissertation on the opportunities which he seized to understand the implica-

tions of Buddhism and Hinduism. Buddhism established itself in Asia Minor. Nazarath, Galileo and Jerusalem and found its place in the cultural history of Asia even before Jesus saw the light of the day. We cannot say that the span of his life was laid on arid ground and that he distilled the nectar of his ideology from sterile precedents. No account appears regarding his career from the twenty-ninth year of his life for a peroid of three years. Some scholars aver that he was then at Taxila, a great seat of learning and had access to Buddhistic thought and some students maintain that he was a student in a Hindu hermitage in Nepal and that he visited Benares and Rajagriha The Russian and French accounts which revealed these incidents were suppressed. These details apart, let us maintain that Jesus, as a pilgrim of knowledge and wisdom, had oportunities to be cognizant of the ideals of the great religions of Asia since they were disseminated in various climes by able hierophants and apostles from time to time. It is unfortunate that several of his followers do not believe in the law of *Karma* though their teacher, as Prof. Radhakrishna says (Vide "The Heart of Hindustan") believed in its truth. This disbelief clipped the wing of their investigation and inhibited its march into regions beyond the precincts of the sublumary region. Ideal literature receives its sustenance and inspiration from the motherly breast of Religion. Western literature, indeed magnificient in may ways, had to limit its scope and ideology according to wrong conception of the restricted march of the soul and it had perforce to glean the stuff for its warp and woof within the clogged sphere of research. Eastern Literature is free from such faulty conception and the bounds of its vineyard are conterminous with the bounds of the universe. Our great literature reveals the kernel of Indian Philosophy which is characterised by an integral purpose as it reveals the quintessence of Hindu Religion which speaks of man's search for ultimate values. Our scriptures subordinate the knowledge of facts to the knowledge of values, empirical generaliasation to enternal truth They proclaim from their lofty pulpit that human freedom is really consistent with Divine will and law. The glory of human freedom lies in its subordination to the Divine will through love. The individual becomes a robot or an automaton if he is to submit himself to a will less than the very highest. Our mystics are emphatic in their observation that submission to the will of God

leads man to the peak of *Sreyas*. In the series of births sufficient number of opportunities is vouchsafed to the individual to gain the requisite experience for self-knowledge and sel-realisation. Going up the ladder of lives gradually, he invokes Light and enjoys perfection.

The distinguished author of this book has a clear and fundamental grasp of the main stream of Indian tradition. His mind is galvanised by the thought that he should give the best exposition of its spirit in the delineation of the prominent characters of *Sree krishna-Ramayana*. What the great savants of the East, by virtue of their comprehensive understanding of the purpose of life, their mystic vision of the glories of soul, their intuitive faculty in perceiving the truth imbedded in the heart of things, their marvellous power of abstracting the phenomenal mind to view the substance, revealed in their literary productions was noticed with unspeakable devotion by *Kavisarva-Bhauma*.

Eminent savants of the West have appreciated the eastern approach to human problems. "I am constrained" says Emerson "every moment to acknowledge a higher origin for events than the will I call mine. As with events, so is it with thoughts."

Such approach is native to the genius of Mahamahopadhyaya Sastryji. Paying considerable thought to the play of the various powers, visible and invisible which exercise their influence on human life, he portrayed different characters. He has exonerated Ravana, Kaika and Ahalya from the grip of opprobrium. Ravana could not be compared to the villains who appeared in the wide range of occidental literature.

Mephistopheles created by Goethe and Robber, the villain of Schiller's creation, could not be found in the world of Realism. The myriad-minded Shakespeare held up the mirror to Nature. His fictions as Bradley says, are true. Gloucester (Richar III). Lady Macbeth, Edmund, and Iago famous in Shakespearean literature are not fictitious characters. While endeavouring to justify the strength of Realism, the Western writer would not incorporate a preternatural power in the affairs of mankind to cashier an ominous effect from its ambit but would suffer the cause, malignant though, to exhibit its power although it inevit-

ably drags a noble character into the vortex of disaster. Tragedy is permitted to have its play on the stage of a western drama as on the stage of life though the evil force is not allowed to chuckle in triumph as it is soon throttled within the grip of Nemesis. Ideal characters like Othello, and Desdemona, Romeo and Juliet Cordelia and Lear, had to meet a tragic end.

The wicked characters responsible for this tragedy were not allowed to escape. Even Iago, the prince of villains, had perforce to yield to the inevitable consequences of his hellish design.

The Eastern poets follow a different path. Heroes and heroines created by them are constrained to face fiery ordeal. They jostle with malevolent circumstances and step on with the nimbus of victory shining round their heads. Self-sacrifice is accompanied by conquest according to Eastern conception. Malignant facts however, allow the dust of ignominy to kiss the fair face of a hero or heroine. "To be great" says Emerson "is to be misunderstood" and Rabindranath says that the dust of ignominy becomes in course of time the gold of glory.

Draupadi, Savitri and Sita had to face terrible trials. The Eastern savant has not allowed them to be devoured by the malign incidents which faced them. Draupadi received God's grace in the most tragic moment of her life when she resigned herself to the perennial love of the supreme principle which governs all affairs terrestrial and celestial. Before Savitry's spiritual power the God of Death was powerless. The devoted wife could extricate her loving lord from the clutches of Death.

Death has no horrors for the hero or heroine or for the pilgrim of knowledge and wisdom. *Kathopanishad* says how the boy *Nackiketa* was treated to a magnificient metaphysical discourse by Yama, the god of Death. Our Upanishads extol the infinite powers exhibited by *Amirtasyaputra*.

Readers of the present book know that Sita was face to face with fiery ordeal and that she passed through the ordeal with remarkable success. Kavisarvabhauma has depicted her character with extraordinary skill. Following the noble path shown by the great mystics of the East, he spoke of her inner beauty without keeping quiet after describing her fine physical features.

Eastern tradition would not allow any person except the loving husband to touch a lady. Ravana never touched Sita. She was not confined in any of the beautiful apartments of Ravana. She was kept afar in the *Asokavana*. The splendour of the Eastern ideal is vindicated not only in the delineation of Sita's divine purity but also in the careful description of Ravana's character.



# విషయసూచిక

## బాలకాండము

## అయోధ్యాకాండము

## ఆ ర ణ్య కాం డ ము

## కిష్కింధాకాండము

## సుందరకాండము

## యుద్ధకాండము

## ఉత్తరకాండము

శ్రీరస్తు.

# శ్రీకృష్ణరామాయణము

## బాలకాండము

### ప్రథమాశ్వాసము.

శా. శ్రీమద్భూమిశుభోదరప్రభవ యై చెన్నొందుశ్రీదేవిచే
యామోదంబునఁ గొంచు "నాతిచరితవ్యా" యంచు వాక్రుచ్చుశ్రీ
రాముం డాశ్రితపారిజాతము మహాప్రారంభశుంభన్మనః
ప్రేమన్ వేంకటరామమంత్రివరునిన్ శ్రీ లిచ్చి రక్షించుతన్. 1

ఉ. ప్రీతియు నీతి రీతియును బ్రేముడి వే ముడి వీడి యాడఁగా
"నాతిచరామి" యంచు బదులాడుచు వేడుక లోడిగిల్లఁ గ్రొం
జోతుల నీనునవ్వులను జూపెడుకన్గవ నోరఁ జూచునా
సీత దయాసమేత యయి శ్రీ లిడి వేంకటరాము నేలుతన్. 2

చ. జనకవరోరు వెక్కి శరజన్మగతం బగునంబికాంకమున్
జననితోడ న్మెలంగుచు గజాననుఁ డందినశంకరాంకమున్
గొన గమకించుబిడ్డలకుఁ గోరిక దీఱఁగ గౌరి నంటినన్
గని మొఱయంగ గంగఁ దలఁ గట్టినవేల్పు కృతీశు నేలుతన్. 3

చ. అరుణశరీరకాంతి దెస లంతర మింతయు లేక నిండుకోఁ
గరముల నాల్గిటన్ గశయుఁ గంజముఁ బుస్తక మక్షమాలయున్
బరఁగ శివాంకసంస్థ యయి బాలిక వైఖరి భక్తకోటులన్
సురుచిరలీల నేల్త్రిపురసుందరి వేంకటరాము నోముతన్. 4

ఉ. సామము షడ్జమశ్రుతినిఁ జాపుయుఁ దానుఁ బఠించుచు న్మునుల్
స్తోమము లాచరించుచును సూరెల నుండఁగ భూతజాతమున్

---

స్తోమములు—స్తోత్రములు; సూరెలు—పార్శ్వములు.

వేమఱు సృష్టిఁజేయువిధి విద్వదభిష్టుతు సీదరాఖ్యవం
శామృతవార్ధిచంద్రునిఁ జిరాయురుపేతునిఁ జేయుఁ గావుతన్.

శా. తన్నే వేళను గోసిపెట్ట నగునత్తన్ గెల్వ లో నెంచి శా
ర్వ్యాన్నత్యంబునఁ బుస్తకాకృతిని దా నయ్యాదరార్యాకమం
దు న్నిచ్చం దగి లచ్చిఁ దెచ్చి తనకుం దోడ్పాటుగా నిల్ప నై
యెన్న న్వచ్చెడువాణి మాకృతిపతి న్వీక్షించి రక్షించుతన్.

తే. గణపతినిఁ గొల్చి శారదఁ బ్రణుతి చేసి
త్రిపురసుందరి స్మరియించి శ్రీ భజించి
కులగురునిఁ గౌశికుఁ దలంచి లలితకావ్య
విరచనాయత్తదృఢచిత్తవృత్తి నగుచు.

—♦ కృ తి ప్ర శం స ♦—

మ. స్తవ మొందన్ శక మద్రి ఋ త్విభ ధరా సంఖ్యం బ్రవర్తిల్లఁ బా
ర్థివనామాబ్దమునందుఁ జైత్రమున వర్ధిష్ణుండు చుండూరివం
శవిభుం డున్నతసన్నుతామల యశోంచత్సర్వభూభాగుఁ డై
తవు శ్రీ వేంకటరెడ్డి నావలన గ్రంథం బొండు చేయించియున్. 8

తరళము. విజయవాడ మహోత్సవంబును విస్తరిల్లఁగఁ జేయుచున్
సుజను లెల్లరు మేలు మే లని స్తోత్రముల్ పచరింపఁ గా
విజయసూచక హేమకిరీటము వేలు నాల్గు ధనంబు స
ర్వజనసమ్ముఖమం దొసంగె సభన్ భజించుచు నెంచుచున్. 9

ఉ. వేవురతోడఁ గూడుకొని వేడుకఁ గూర్చెడుతత్సభాస్థలిన్
శ్రీ వెలయంగ నొక్కకడఁ జేరువ గా నివసించి సర్వమున్
వే విని యీదరాన్వయుఁడు వేంకటరా వొకనూఱునుం బదార్
చేవ నొసంగె నాకపుడు చిత్తము మెత్తన గాఁగ నత్తఱిన్. 10

సీ. విడిది కేగి యతండు కడు నెడ నడరిన
సంతసంబునఁజేసి సందడించి

* "శక మద్రి, ఋ, త్విభ, ధరాసంఖ్య-శాలివాహనశకము 1867"

పొలుపొంద ఫాలాంకు భావ! రమ్మని మనో
రథ మంతయు న్వింతరచనఁ బలికి
కవిసార్వభౌము నీ వెవ రనుకొనుచుంటొ
మణికిరీటముఁ గొన్నమహితయశుఁడు
పంచమశ్రుతి పరికించి సేయుటె కాక
సలిపెఁ గృతుల్ సార్ధశతము మఱియు

తే. శృతియు శ్రోత మెఱింగినచతురుఁ డతని
వలన నొకకృతి నొంద నే వలచినాఁడ
దాన నిహపరంబుల మేలు దలఁచి నాఁడ
నితరకృతు లెవ్వి కావని యెంచి నాఁడ. 11

తే. అనుడు నాతఁ డు మేలు మే లతఁడు సుకవి
యగు టొకఁడె కాదు మంత్రమునందు నిపుణుఁ
డతనికిన్ బాల ప్రత్యక్ష మగు నటంచు
నే నెఱుంగుదు భావ! మే లెంచి తీవు. 12

మ. కృతికిం జాలినసత్క్రియల్ జగమునం గీర్తింప లే వన్యముల్
కృతులం జేసియు భోజముఖ్యులకథల్ క్షీణింపఁ బో కుండుటల్
కృతి నొందం దలపెట్టినాఁడవు భవత్కీర్తిప్రభల్ పర్వెడిన్
గృతి సర్వోత్తమ మై తలిర్ప నగు లోకైకప్రశస్తంబు నై. 13

శా. దీనం జేసి త్వదన్వవాయము పవిత్రీభూత మై ఖ్యాత మై
సానందంబుగ సర్వసౌఖ్యములతో నాచంద్రతారార్క మై
మా నొందున్ ధరణీతలంబునను సమ్మానింప నై నీపితృల్
గాన న్వత్తురు బ్రహ్మలోకవసతిం గాంచు న్గలై భావుకా. 14

తే. అనిన నతఁడు నీవు వినిచితి మేల్ నేఁడు
సార్వభౌమకవికి స్వాగతంబు
పలికి పిలిచి పూజ సలిపి సన్మానించి
కృతికి వేఁడుకొంద మతులితగతి. 15

వ. అని యయ్యాచరవేంకటరావుపంతులు సపరివారుండై విజయవాటి కాపురంబునఁ ద్రిలింగవిద్యాపీఠంబున నేను నివసించి యుంట యెఱింగి నన్నరయ వచ్చి పరిసరోన్నతప్రదేశంబున విశ్రమించి యచ్చటికి. 16

సీ. నను శ్రీపదాన్వయజనితుని వేంకట
సోమయాజికి సుబ్బసోమిదమకు
నాత్మజునిఁ జతుర్విధాంచితసుకవిత్వ
తత్త్వవిజ్ఞుని భారతప్రభృతి శ
తాధికగ్రంథకృత్యాత్తనాముని శ్రౌత
విద్యావిశారదు వేదవిదునిఁ
గవిసార్వభౌమవిఖ్యాతు మహామహో
పాధ్యాయముఖబిరుదాంచితాఖ్యు
తే. గండపెండేరధారి గంగాజలాది
సక్తకనకాభిషిక్తుని శతవధాన
చణుఁ గళాప్రపూర్ణుని గృష్ణశాస్త్రిఁ బిల్వఁ
బంచి యిట్లని పల్కె సమంచితముగ. 17

మ. నిను నేఁ బేర్వనియే యెఱుంగుదును గానీ మొన్న రెడ్డి ప్రభుం
డనుమోదంబునఁ జేసినట్టిబహుమానాకల్పితోద్యత్సభన్
ఘను లెల్లన్ భవదీయకావ్యగరిమన్ గంఠోక్తిగాఁ దెల్పుచున్
వినుతుల్ సేయుచు రత్నభూషణము లీ వీక్షించితి న్వేడుకన్. 18

మ. మనపూర్వుల్ కవివర్యు లెందఱో జగన్మాన్యుల్ మహాగ్రంథముల్
దనరం జేసి బహూకృతు ల్వడసి రే ధన్యుండు నిన్ బోలి కాం
చనరత్నాంచిత మహాకిరీటమును శీర్షంబందుఁ బూనంగఁ జా
లినవాఁడై కనిపట్టనే జగతి నీలీల ల్కవీడ్వర్ణ్యముల్. 19

క. కవిసార్వభౌమ! నే నొక
ప్రవిమలకృతి నిన్ను వేఁడి పడయఁ దలఁచితిన్
భువనత్రయసంభావిత
మగున ట్లది తనరవలయు నతిపుణ్యద మై. 20

—♦ కృతి రామాయణమే ♦—

ఉ. రాముఁడె సర్వరక్షకుఁడు రాముఁడె సర్వసురేంద్రవంద్యుఁడున్
రాముఁడె లోకపావనుఁడు రాముఁడె దిక్కు జగజ్జనాళికిన్
రామునిసచ్చరిత్రమును రమ్యతరం బగుకావ్యరాజముం
గా మహిమోన్నతిం సలిపి గాదిలి నా కిడ నేటికో ళ్ళివే. 21

క. రాముఁడె నాకు న్నాపూ
ర్వామాత్యులకుం గులక్రమాగతదైవం
బై మించి యుండెఁ గావున
రామాయణ మే గ్రహింప రమణఁ దలంతున్. 22

మ. అన నే నాతనిఁ గాంచి నీ వనినయ ట్లా రామచారిత్ర మొ
ప్పును లోకత్రయపావనంబు త్రిజగత్పూజ్యం బగుం గాన దా
ని ననేకుల్ కవితల్లజుల్ కృతులుగా నిర్మించి రే నొక్కఁ డి
ట్లొనరింపం గవివల్లభేద్య మయి యింపొందంగ నై యుండునే. 23

సీ. వాల్మీకియు వసిష్ఠవాచంయమీంద్రుండు
ఘనుఁడు విశ్వామిత్రమునివరుండు
వాజసనేయుండు భోజభూపతియును
గాళిదాసుఁడు మున్ను గాఁగ నైన
వా రాదిభాషలో భాస్కరాదులు తెల్గు
భాషలోఁ జవు లూరుప్రక్రమముల
రామాయణంబులు రచియించి యుండి రే
నందులో నే లెక్కకైన వాఁడ

తే. నేను రామాయణ మొనర్ప నేరు చూతు
రేరు మే లని మెత్తు రోభూరితేజ!
యిట్టిచో నాపరిశ్రమ మెల్ల వ్యర్థ
మగునో యని సంశయించెద స్వాంతమందు. 24

క. విను మొక్కరహస్య మ్మది
మనుపటిరచయితలు కళలఁ బూర్ణప్రజ్ఞం
గొనియుండువార లిప్పటి
ఘను లన్ననో తెనా న మా లు గానని వారే. 25

క. కావున నో నని పింపఁగ
నే వలఁతిని గాను రామకృతి యొనరింపన్
నావుడు భావితకర్తవు
నీవే యిట్లన్న నింక నే నే మందున్. 26

క. వలఁతి వయి చేయఁ గల నను
పలు కిద్ది యటంచు నేను భావింతుఁ గవీ
ట్తిలకమ! కా దనక కృతిన్
గలిగింపుము రామకథనె కవు లగ్గింపన్. 27

క. తెలుఁగున సంస్కృతమున నూ
ఱులు మూ ణ్ణా ల్గయిదుగా నెఱుంగఁగ వచ్చున్
విలసద్రామాయణములు
కలయం బరికించి వానిఁ గథ గూర్ప నగున్. 28

ఆ. అనిన నేను వల్లెయని నేర్చినట్లుగాఁ
గృతి యొనర్చి నీకు నిడుదు నంటి
నా నతండు మిగుల నానందమును బొంది
నట్టిమనముతోడ నభినుతించి. 29

వ. నన్నుఁ దనవెంటం బెట్టుకొని తనవిడిదికిం గొనిపోయి యటఁ బండితపరివన్మధ్యంబున సరస్వతీపూజ గావించి పదంపడి నన్నుఁ బూజించి జాంబూనదాంబరాదులతో నూటపదియాఱురూప్యంబులతోఁ గర్పూరతాంబూలం బొసంగి షడ్రసోపేతభోజనంబు పెట్టిన నే నెంతయు సంతసించుచు గృహంబున కరుదెంచి గ్రంథారంభమునకు ముందు మంగళాచరణంబుగా నమ్మంత్రివరునివంశావతారం బభివర్ణించెద. 30

—♦ కృతిపతివంశావతారము ♦—

సీ. శ్రీరమణీమణీజీవితేశ్వరునాభి
సరసిజ మేస్వామి జన్మభూమి
తలవాఁకిట మెలంగఁ గలిగి లోకము లేలు
తరళాక్షి యేవేల్పు ధర్మపత్ని

క్షీరనీరవిభాగ మారసి చేసెడు
పక్షి యేదేవర యెక్కిరింత
దేవమునీంద్రులు దీపించునిక్కపు
జగ మేమహాత్మునిఁ దగినటెంకి

తే. అతఁడు నలువొందు శ్రీకాయజాగ్రజుండు
బ్రదుకుఁబ్రొద్దుల నొసళుల వ్రాయువేల్పు
వేల్పులకుఁ బెద్ద వెలిదమ్మి వెలుఁగు మేటి
జగములం జేయుదిట్ట మేల్ జన్నిగట్టు. 31

క. ఆతనివంగసమందున్
భూతి భరద్వాజుఁ డనఁగ మునిపుంగవుఁ డై
ఖ్యాతిం గనెఁ దద్గోత్రో
ద్భూతులు పెక్కండ్రు ద్విజులు పొలిచిరి పృథివిన్. 32

చ. ధరణి సమానవృత్తుల ముదంపుఁ బ్రాహ్మణు లెల్లఁ గారణాం
తరమున మాఱి రెన్న ద్వివిధంబుగ నందునఁ బెక్కు రొప్పినా
రురుతరవైదికంబున నియోగమునం దగి రాజువేలు భూ
సురు లది గాన నత్తెగకుఁ జొప్పడెఁ బేరపు డాఱువేలునాన్. 33

సీ. రాజాధిరాజవిరాజితషాడ్గుణ్య
విద్యావిచారు లార్వేలవారు
శిబికర్ణముఖదాతృశేఖరసదృశాతి
వితరణసారు లార్వేలవారు
కావ్యజీవకుమారఘనశస్త్రనిస్తుల
విజ్ఞానధీరు లార్వేలవారు
వేదసమ్మతలౌక్య వైదికవ్యవహార
విధిసమాచారు లార్వేలవారు

తే. వివిధసద్గుణాగారు లార్వేలవారు
వినుతజనవంద్యవీరు లార్వేలవారు
విమలకీర్తివిహారు లార్వేలవారు
విజ్ఞతాగుణహారు లార్వేలవారు. 34

వ. వారు నానాదేశంబులం జేరి నందవరీకులు ప్రాజ్ఞాటివారు లోనగు భేదంబులం బొంది రాజాస్థానంబుల మంత్రులై కవులై మహి మోన్నతిం బొంది రన్నియోగిబ్రాహ్మణులయందు. 35

సీ. కొమ్మనామాత్యునికొడుకు తిక్కాధ్వరి
మంత్రి యై కవి యయి మహిమఁ గాంచె
రాయనిభాస్కరరాయమంత్రీంద్రుండు
దాత యై నేత యై ఖ్యాతి నొందె
ఢిల్లిసుల్తాను నోడించి యుగంధరుఁ
డాద్యుఁ డై జగదేకవేద్యుఁ డయ్యె
రాయలసామ్రాజ్యరమకుఁ దిమ్మర్సాల
వాలమై మూలమై వన్నె కెక్కె

తే. మఱియు నెందఱెందఱో మహామహులు కవులు
ఘనులు దాతలు నేతలు గాయకులును
మంత్రులై మహిమోన్నతి మట్టుమీఱి
క్షితి నవతరించి ప్రవిమలకీర్తిఁ గనిరి. 36

తే. వారిలోపలఁ బెక్కండ్రు వఱలుచుండు
రందు నీదర యనిమొదునట్టిగ్రామ
మందు ము న్నుంట నీదర యనెడునింటి
పేర నొప్పిరి కొంద ఱార్వేలవారు.

సీ. అయ్యాదరాన్వయములందు మల్లమరాజు 37
మూలపూరుషుఁ డయి పొలువుమిగిలి
లక్ష్మణరాజు నా లక్షింపనగు పుత్రుఁ
గనియె నా లక్ష్మణాఖ్యునకు సుతులు
తేజరిల్లిరి పద్మరాజు వేంకమరాజు
లింగమరాజు నా సంగతిఁగొని
వేంకటరాజందు విఖ్యాతినిం గాంచి
రామరాజను పుత్రరత్నముఁ గనెఁ

తే. ప్రబలుఁడై రామరాజు పుత్రకులఁగనియె
ముదముపొదలఁ బోలంరాజు, బుగ్గరాజు
సుబ్బరా జను వారి నీక్షోణి నత్రి
మున్ను మూర్తిత్రయంబును గన్నయట్లు. 38

శా. పోలంరాజను నాద్యుఁడందు ఘనుఁడై పోలింపనై రంగమన్
గ్రాలుంగంటినిఁ బెండ్లియాడి జగతిం బ్రఖ్యాతిమై నొప్పి వి
ద్యాలక్ష్మీయుతు రాము, వేంకయను, భద్రయ్యన్ జగంబెన్న వా
రాలక్షింపఁగనైరి భూతలమునం దా మూడుమూర్తుల్ బలెన్. 39

తే. అందు రామయ్యపంతు లత్యగ్రజుండు
వెలసె దాతృత్వశోభి కవిప్రభుండు
విష్ణుభక్తుఁడు విజ్ఞాని వేంకటగిరి
వారి సంస్థానమున మొఖాస్దారుఁ డగుచు. 40

సీ. విద్యాప్రియుండయి విద్వాంసులం బ్రోచెఁ
గవియై కవీంద్రులఁ గరుణఁ జూచె
గణకాగ్రసరుఁడయి గణితపద్ధతు లెల్లఁ
బద్యరూపంబుగాఁ బ్రస్తరించె
రామభక్తుండయి రామాలయము గట్టి
తత్పూజకై భూమి దాన మొసఁగె
వైష్ణవభక్తుఁడై వైకుంఠపుర మను
గ్రామము గట్టించె గ్రామణి యయి

తే. అందుఁ గాపురముండి సిద్ధాద్రివత్స
రమునఁ గాసార మొక్కఁ డాగ్రామముకడ
దానినీటను గొన్ని నూఱ్ఱ న యెకర
ముల పుడమి పండు ధాన్యము పుట్లకొలఁది. 41

క. నిచ్చలు వేగురు పాఱులు
వచ్చిన సహపంక్తి నతఁడు పరమాన్నంబుల్

పచ్చళ్ళు పిండివంటలు
హెచ్చగుకూరలును గూర్చి యొసఁగం బెట్టుఁగా. 42

ఉ. రామయమంత్రియింటి నలుప్రక్కల ధాన్యపుగాదు లెన్నియే
మే మిది క్రిందిలోకమున మీఁదగులోకమునందు నెప్పుడుఁగా
క్షామను లేనియట్టులు ప్రకాశర్చిద మంచు వచించు నా నటన్
వేమరు విఘ్ననాయకుని వీతులశబ్దము వి స్తరిల్లెడున్. 43

తే. పోకలుం గొబ్బరియు ధాన్యమును నతండు
కడప నెల్లూరులోనగుకడల కంపి
తెచ్చి వ్యాపారమొనరించి హెచ్చుధనము
నెంతయేఁ గూర్చె నర్థిసాత్కృతముగాఁగ. 44

సీ. చెఱువులు త్రొవ్వించె క్షేత్రముల్ గల్పించె
ధనము నిక్షేపించె దారులందు
నగ్రజన్ములకు గృహములు గట్టించె సు
రాలయంబు లనేకొ పోఁడేసెఁ
దోటలువేయించె బాటలు నిర్మించెఁ
గృతు లెన్నియోచేసి కీర్తిగాంచె
వివిధదేశములందు వేలనువెచ్చించి
కూపముల్ నెలకొల్పెఁ గొన్నికొన్ని

తే. అన్నసత్రములం బెట్టె నవని నతఁడు
కల్పవృక్షమటంచును ఖ్యాతిగాంచె
నర్థులకుఁ గొంగుబంగారమై తలిర్చె
రంగమాపుత్రరత్న మారామమంత్రి. 45

పసితోఁ గ్రిక్కిఱియంగనై యతనియావాసంబునం దెన్నియేఁ
బొసఁగున్ గోష్ఠము లందు లేఁగలు వృషంబుల్ గోవు లంభారవం
బెసఁగం జేయుచునుండుఁ దద్గృహములం దెల్లప్పుడున్ లక్ష్మి యే
ధనకుం బోయినఁ దాండవించు ననుచుం దెల్పంగవచ్చుంజుఁడీ. 46

చ. వరదలు వచ్చి రామసచివప్రభుత్వమున చెర్వుకట్ట స
త్వరముగఁ ద్రెస్సి పోవుతఱిఁ దజ్జను లందఱుఁ బుచ్చి ధాన్యపుం
బరువులు తూర కడ్డముగఁ బర్వఁగఁ జేసె నటంచుఁ బెద్ద లన్న
దురు హరి భక్తియుక్తులకుఁ దోడయి యుండుట సాజమేకదా! 47

శా. ఆవైకుంఠపురంబుచుట్టు నలరామామాత్యుఁ డెంతేనియున్
ఠీవిం గోటను గట్టి నాల్గుకడలన్ బెట్టించి ద్వారంబులన్
జేవల్ దేరెడునాయుధావళులతో నిర్మించి పెంబుర్జు లం
దేవేళం బరివారముల్ గొలువఁ దా నింపొందు భూస్వామియై. 48

తే. ఆతఁ డొకయేడు శ్రీశైలయాత్ర కేగి
దారిలో నీరుపట్టునఁ దహతహపడి
యచటఁ ద్రవ్వించె వేయిరూప్యములు పెట్టి
బావి యొక్కండు రహదారిప్రక్కయందు. 49

చ. అతఁ డొకనాఁ డరణ్యమునయందుఁ బ్రయాణము నొంటిఁజేయుచో
జతపడె రాత్రి చీఁకటియు సాయ మొకింతయు లేదు దొంగ ల
ప్డతనిని జుట్టుముట్టుకొన నార్జవముం గలఁడై మృదూక్తులన్
హితు లిదెమాట దేవుఁడిట నేర్పరియుండె నటంచుఁ బల్కుడున్.

వ. వాండ్రు వానిమాటలు విశ్వసించి పాదాక్రాంతులై దేవుఁ డనుభావంబున వాని నయ్యడవిం దాఁటించి సెలవు గొని పోయి రఁట యిట్లనేకాద్భుతకార్యంబు లాతండు గావించి ప్రశంసనీయుండై ప్రఖ్యాతిం గాలంబు గడపుచు సౌభాగ్యవతి యగు మంగమ్మ యను సతియందుఁ బట్టాభిరామయ, రామకృష్ణయ, లక్ష్మీనారాయణప్ప, పట్టాభిరామయ్య యను నల్వురు పుత్రులను శేషమ రామలక్ష్మమ మహాలక్ష్మమ యాదిలక్ష్మమ యను నల్వురు పుత్రికలం గని వైకుంఠపురంబునఁ గాపురంబు సేయుచు మనుమల మనుమరాండ్రం బడసి వృద్ధుండై తన భాగ్యం బంతయుఁ ధాన పట్టుకొని పరంధామం బగు వైకుంఠపురంబునకు నిర్గమించె నంత న్నారామయామాత్యుని పుత్రులలో ద్వితీయుండగు రామకృష్ణయ్య రామ

లక్ష్మమ్మ యను సాధ్విం బెండ్లియాడి యామె వలన శ్రీరాములు
రామదాసు ఆదినారాయణుఁడు సీతారామయ్య రామచంద్రుఁడు
రామయ్యయను నార్గుఱుపుత్రులను లక్ష్మిదేవమ్మ యను పుత్రికం
గాంచి యామె రామచంద్రునిరామయ్య యను మాన్యచరిత్రు
నకుఁ గన్యాదానంబుగావించి పరంధామంబునొందె నవ్వల రామ
మంత్రి తృతీయపుత్రుఁడగు లక్ష్మీనారాయణప్ప సుబ్బరాయండను
కొడుకుంగాంచె నంత. 51

క. కొడుకులు నల్వురలోనం
గడ నగుపట్టాభిరామ ఘనుఁ డున్నతుఁడై
పుడమి నగుపెట్టుచెట్టను
వడువున విలసిల్లె నతఁడు బాల్యమునందున్. 52

ఉ. దాత దరిద్రుఁ డన్ననుడి తప్పని దాట నతండు తండ్రులన్
దాతలు గూర్చినట్టివితతం బగువిత్త మదెల్లఁ జెల్లుటన్
జేతము ధర్మకార్యములచెంతకుఁ బోయినఁ జేయ నర్థముల్
చేతికి రామి సంకుచితచిత్తము గల్గి మెలంగు సంసృతిన్. 53

క. అన్నలు నాతఁడుఁ దల్లియు
సున్నదియే తాము తినుచు నొరులకు నిడుచున్
మన్ననల కగుచుఁ గులగురు
త న్నెఱిఁ గాపాడు కొనుచుఁ దనరిరి ధరణిన్. 54

వ. అట్లుప్రవర్తించుచుండు పట్టాభిరామామాత్యుండుభగవద్భక్తితత్ప
రుండై ప్రసిద్ధిం గాంచిన రామచంద్రునిరామమంత్రి పుత్రిక యగు
లక్ష్మీనరసమాంబను వివాహమయ్యె నయ్యమ్మఁగన్న రామమంత్రి.

తే. రాచమల్లు కొండయకూఁతు రమ్యచరిత
సుందరాంబ నుద్వాహమై సుతులఁ గాంచె
వరుల లక్ష్మీనరుసు శేషగిరిని సుబ్బ
రాయు మువ్వుర సజ్జనగేయుఁ డగుచు. 56

వ. మఱియు నాతండు లక్ష్మీనరసమ్మ శేషమ్మ వేంకటనరసమ్మ యను మూవురు పుత్రికలంగాంచి వారిలో లక్ష్మీనరసమ్మ నీదర పట్టాభిరామయకును శేషాంబ నీదరచంద్రయ్యకును వేంకటనరసాంబ రాచమల్లు కొండయామాత్యునకిచ్చి పరిణయంబులు గావించెనందు లక్ష్మీనరసమాంబ. 57

తే. కల్లకపటము లెఱుంగనితల్లి సుగుణ
గణములకుఁ బేటి యీలువు గలిగి మెలఁగు
గరితమిన్న యరుంధతికరణిఁ దనరుఁ
బతిని దైవముగాఁ గొల్చు భవ్యచరిత. 58

ఆ. ఒరుల కలిమిఁజూచి యోర్చు స్వభావము
దైవభక్తి సత్య తత్పరతయు
సాధువర్తనంబు సజ్జనప్రియతయుఁ
గలిగినట్టిదగుచు నలరునామె. 59

మ. ఎవ రెట్లన్ననుగాని మా అనుట కాయిల్లాలు వాంఛింపఁ బో
దవు కాదంచును వాదులాడ దెపుడుం బ్రాణేశ్వరుండే సదా
శివుఁడంచున్ భజియించు నర్థిజనులం జిత్తంబునం బ్రోవ నెం
చు వసించున్ సుకృతాఢ్యమం దెపుడు సంశుద్ధ స్వభావంబునన్. 60

ఆ. తాను గన్నకూఁతులో నాఁగఁ గోడండ్ర
నెల్లవేళ నామె యెంచుకొనుచు
వాతియొద్దదైన వారికిం బెట్టుచు
నాదరించు నెల్ల రా ననంగ. 61

మత్త. రాజభోగము లంతరించెను రామయార్యునితోడ మున్
రాజు లట్లు మెలంగువారికి రాఁబడుల్ కడుసన్నమై
పో జగంబునఁ గల్గువారలపోల్కిఁ గాలముఁ ద్రోయుచున్
రాజమాన్యులు వారు సంస్కృతి రాజిలంగఁ బొనర్చుచున్. 62

వ. అట్లు సామాన్యలోకస్థితిం బొలుపొందులక్ష్మీనరసమాంబా పట్టాభి
రామదంపతులకు రామయ్య, వేంకటరావు, వెలింగొండ్రాయుఁడు
వేంకయ, యను నలువురు కొమాళ్ళు పుట్టి రందు 63

సీ. అలవెలిగొండరాయఁడు పసితనమందె
భౌతికదేహంబు వాసి చనియె
నయిదేండ్లవాఁడు రామయ్య మూఁడేడుల
వాఁడు వేంకటరావు వారిఁ గొనుచు
గర్భస్థుఁ డగుచు వేంకయ యుండ సతితోడ
రామేశ్వరపుయాత్ర రహి నొనర్పఁ
గదలి పోవుచును మార్గమున నొ కానొక
కుగ్రామమం దెదో కూడికొనఁగ

తే. ముప్పదేడులపట్టాభి ముప్పఁ జెందె
నచటికరణము వారివృత్తాంత మెఱిఁగి
రామచంద్రరామయకు వార్తం బొనర్ప
నాతఁ డరుదెంచి వారల నాదరించి. 64

వ. వెంటఁ గొని పోయి తనయింటం బెట్టుకొని పోషించె. 65

సీ. కరణ మాతఁడు కొన్నిగ్రామములకుఁ బాడి
పంట లాతనియింట బహుళము లగు
ధర్మతత్పరుఁ డనృత మన నెట్లుండు నొ
యెఱుఁగఁ డేనాఁడు మునీంద్రసముఁడు
వాక్పరుషత్వ మవ్వానినాల్కకు లేదు
నిరతాన్నదానతత్పరుఁడు వరుఁడు
దైవభక్తుఁడు జగత్కల్యాణకాంక్షి స
త్పుత్రవంతుఁడు జగత్పూజ్యయశుఁడు

తే. అతఁడు తనపుత్రికాపుత్రులందు వారి
నొక్కరిగఁ బెట్టుకొనుచుఁ ద మ్మోమచుండ

వేంకయ జనించె నంతలో వెలఁదిమిన్న
బిడ్డలం గూడి యట వారిఁ బెంచుచుండె. 66

వ. అపుడు రామచంద్రుని రామయామాత్యుఁడు తన దౌహిత్రులపితృస్థానంబునం గలపాత్రసామగ్రియుఁ బసువులుమున్నగువానిం దనయింటికిం దెప్పించుకొని వారిపాలంబులం బరిశీలించుచు విద్యాబుద్ధులం గఱపి కంకణంపాటిగ్రామంబున నొక వసతిం గల్పించి వారిలోఁ బెద్దవాఁడైన రామయ్యకుఁ బదునొకండవయేట నుపనయనంబు గావించె నంతరంబ. 67

తే. అతఁడు వాడేల రాఘవయ్యకు సుతయగు
సుందరమ్మను బెండ్లాడి సుతులఁ గనియె
ఘనులఁ బట్టాభిరామ రాఘవులునాఁగ
నలరు వారల నిద్దఱ నవల మఱియు. 68

వ. పద్మావతి, రాజ్యలక్ష్మి, సత్యవతి, యను మువ్వురు కూఁతులం గాంచి పరంధామంబు నొందెనంత. 69

తే. రాముని సుతుండు పట్టాభిరాముఁ డెదన
పూడి సూర్యనారాయణ పుత్రికయయి
యలరు పద్మావతిని బెండ్లియాడి కూఁతుఁ
గనియె భ్రమరాంబయను నామెఁ గౌతుకమున. 70

సీ. రామయ తమ్ముఁడై రహిమించు వేంకయ
వేడ్కమైఁ బార్వతిం బెండ్లియాడి
రమణ శ్రీపట్టాభిరామశర్మను బుత్రు
నవల లక్ష్మీనరసాంబఁ బుత్రి
కనుఁ గాంచి యామెను ఘనుఁడు శ్రీ భోగరా
డ్లక్ష్మీనృసింహుఁడు లక్ష్మమ్మ తనుజఁగ
నైన వేంకటలక్ష్మియందుఁ గాంచినపుత్రుఁ
డై మించు బుచ్చిరామయ్య కిచ్చె

తే. అవలఁ బట్టాభి శ్రీరాముఁ డధికుఁ డగుచు
సనఘు మారెళ్ళ మాచిరాజాత్మజాత
యైన లక్ష్మీనరసమాంబ యందు సుతునిఁ
బడసెఁ బావనవేంకటేశ్వరుని మిత్రు. 71

తే. అనఘుఁ డతఁడు తేజోవల్లి యనెడు కూఁతు
నవలఁ బార్వతి యనియెడు నాత్మజాత
నళినశారదయను సుతఁ గనియె ముదము
పొదల నెల్లరు సంతోషమునఁ దలిర్ప. 72

వ. పట్టాభిరామయ ద్వితీయ పుత్రుండగు మన వేంకటరాయండు. 73

చ. మిథునము లగ్నమై తనర మీనమునం గుజుఁ డావృషంబునన్
బుధ రవి చంద్ర కేతులు సముత్సుకతం గొనియుండ మేషమున్
బుధగురు, మందభార్గవులు పొంద నిలేభవసూర్యసంఖ్యనై (1881)
ప్రథగొను హూణవర్షమునఁ బర్వెను మేనెల నిర్వదేడ్తిథిన్. 74

తే. అగ్నిగగనేభభూసంఖ్యనై శకంబు (౧౮౦3)
పరఁగ వృషవర్షవైశాఖ బహుళమంద
మాసతిథిఁ గృత్తికం బుట్టి మాననీయుఁ
డయ్యె నంత నైదేండ్ల వాఁ డగునయపుడు. 75

సీ. అక్షరాభ్యాస మైనంత వేంకటరావు
చదువుచు నెట్టెటో చదువు విడిచి
పొలములకుం జని కలుపు తీయుచు గడ్డి
గోయుచుఁ గట్టెలు కొట్టికొనుచుఁ
జేమాట లాగుచుఁ జేలకుఁ గనిమలు
గట్టి నీర్వెట్టుచుఁ బిట్ట గాయు
చడపిపందులు లోని కడుగు పెట్టకయుండఁ
గంచె బిగించుచు నంచితముగఁ

తే. గాయగూరలు తోటలోఁ గలవు వానిఁ
గోసికొని వచ్చి విస్తళ్ళు కుట్టి మఱియు

గలుగుపను లెల్లఁ జేయుచుఁ బాలను పనులె
వ్రతముగా నుండె వేంకటరాయఁ డపుడు. 76

శా. గోసేవం బొనరించు టాతనికి నుగ్గుంబాలతో నబ్బెసం
బై సొంపొందినవిద్దె యై తనరు న ట్లానాఁడు మాతామహా
గ్లాసస్థానమునందు నుండి పొలముల్ పాలించుచున్ నిచ్చలున్
గోసంరక్షణ మాచరించుపనిలోఁ గొన్నాళ్ళు వర్తించుచున్. 77

ఉ. తూరుపు తెల్లవారె నని తోఁచినయప్పుడ లేచి కృత్యముల్
తీరిచి చద్దిబువ్వ దిని తీరికపైఁ దిన నింత గొం చతం
దూరికి మూడుమైళ్ళపయి నుండినకొండకుఁ బోయి గోవులన్
గోరిక మేపుచుండు నల గోపకుమారుఁడు కృష్ణుఁడో యనన్. 78

ఉ. గోవుల వెంబడిన్ బిలన గ్రోవిని నూఁదుచుఁ బాట పాడుచున్
ద్రోవఁ జరించుచున్ దనకుఁ దోడ్పడుగోవులతోడ నాడుచున్
జేవ నెసంగుచుం బసినిఁ జిక్కనిచక్కని బీళ్ళ మేపుచున్
బావనమూర్తి యీదరసువంశభవుం డతఁ డప్పు డొప్పెడున్. 79

తే. గోపబాలురతో నాఁడు గూడి కృష్ణుఁ
డడవిలోపలఁ జలుదుల నారగించు
కరణి శిక్యాన్న మొకచెర్వుగట్టుమీఁదఁ
గూరుచుండి భుజించు నాగోపవిభుఁడు. 80

ఆ. చిన్ననాఁటఁ దాను జేసినపని గానఁ
బెద్దనాఁటఁ దనకుఁ బెరిమ గరిమఁ
గూర్చునట్టిదగుట గోసేవ సేయ నా
యాదరాన్వవాయుఁ డిచ్చ సేయు. 81

సీ. గోపుఁడై యపుడప్పు కొంత విద్యాభ్యాస
మాచరించుచునుండు నవలఁ బదియు
నొకఁడగునేటిలో నుపనయనము మేన
మామ పొనర్చె నామాన్యునకును

'బదుమూఁడువర్షముల్ వచ్చెడువఱకు మా
తామహగృహమంద తా నెసంగెఁ
బదపడి యేలూరుపత్తనంబున కేగు
దెంచె బంధులఁ జూడ నెంచి యతఁడు

తే. అంతఁ గొన్నాళ్ళకాబంధు లవలిమండ
లముల నుద్యోగపదముల నమరినపుడు
సత్తిరాజు కృష్ణారావు చానబాప
నమ్మయును నామె చెల్లె సుబ్బమ్మయునట. 82

సీ. వేంకటరాయనిం బ్రేమఁ జూచుచుఁ దమ
సదనమం దిడికొని సతము ర్యాలి
సుబ్బరాయని మిడిల్‌స్కూలునం జేర్పించి
యట నుపాధ్యాయుఁడై యలరుతనదు
సుతుఁడు వేంకటరత్న సూరిచే విద్య నే
ర్పంజేసె నతఁడట వాసరములు
సలుపు కొనుచు మూఁడు సమలలో మూఁడవ
ఫారమునం దారితేరె నవల

తే. మోతేవారి సత్రమ్మున భోజనమ్ము
చేయు చటఁ బౌరశాలలోఁ జేరి స్కూలు
ఫైనలు పరీక్షవఱకును బాటుపడియు
చదివె నింగ్లీషు వ్యవహార సరణికిఁ దగ. 83

వ. ఇట్లు స్కూలుఫైనల్ పరీక్షకుం జదువుకాలంబున సత్తిరాజు బాపనమ్మకు సోదరు లాచంట సుబ్బరాజ గోపాలకృష్ణులును వారి భార్యలు సుబ్బమా కామేశ్వరమ్మలును వారి సోదరి సుబ్బాంబయు మన వేంకటరావుం దమయింటం బెట్టుకొని పుత్త్రప్రేమం జేసి యాదరించి రపుడు శ్రీ మోతే వేంకటస్వామి జమీందారుగారు విద్యార్థులకు మాత్రమగు తమ సత్రంబున నతనికి భోజనవసతిం గలిగించి రాసమయంబున మన కృతినాయకుండు స్కూలుఫయినలు పరీక్షకుం జదువుచుఁ బదితొమ్మిదివందల నాల్గవ సంవత్సరంబున. 84

సీ. ఏలూరుపురమందు నేకకంఠంబుగా
నాల్గవతరగతి నాఁటినుండి
సహపాఠిగా మిత్రసంగతిఁ గొనియున్న
వాఁడును చెలికాఁడు వాసిఁగలఁడు
శ్రీ గ్రంథి వేంకటాద్రికి మహాలక్ష్మికి
సుతుఁడు సీతారామ పతియునైన
రామమూర్తియనంగఁ గ్రాలు వణిగ్గత్న
మతని విడువలేని జుట్టెడగుచు

తే. జన్మభూమికిఁ బోకుండ సంస్థయొక్కఁ
డేలురి పురమ్మునన్ బెట్టియెపుడు విడువ
నట్టి రీతులు గల్పింప నాత్మనెంచి
ప్రెగడ వేంకటరాయునిఁ బిలిచియనిరొ. 85

ఉ. మిత్రమ నీవు నన్విడిచి మీపురికేఁగుట పోలునొక్కొ యే
మాత్రపుఁబొచ్చెమున్ గననిమాడ్కి మెలంగుదు మొక్కఁగొంతుగా
నాత్రము నొందుచుంటి మనమందొక మాటవచింతు నీకు నీ
ధాత్రి నొరున్ భజించుటకు తత్పరతల్ గనరావెఱుంగుదున్. 86

ద్విపద. పురమునందిట నొక్క పుస్తకశాల
గరిమ మీఱఁగ నిల్పఁగలవాఁడ దాని
వరుమాన మంతయు వరువడి నీవు
పరివారమును బొందవచ్చును దెలియ. 87

ఉ. ఏఁగలవాఁడఁ గొంతధనమిచ్చెదఁ దెచ్చి తదర్థసంగతిన్
బాగుగఁ బుస్తకంబులను వర్తకముం బొనరింపు మందునన్
రాఁగల దెంతయేధనము రాజువలెన్ మెలఁగంగ వచ్చు నీ
యోగము మంచిదా నొరుల యొద్దకుఁ బోవఁగనుండ వక్కఱల్.

వ. అని వేంకటరావు నొప్పించి యప్పు డాసంస్థ కేనామకరణంబు
చేయుదుమని తర్కించుచుండ వేంకటరావు తన తాత పేరును
దండ్రిపేరును నన్న పేరును మాతామహుని పేరును బితామహుని

పేరును మిత్రుఁడగు నా సహాధ్యాయిపేరును వాని భార్యపేరును రామాంకితం బగుటం జేసియు తమ కులదైవంబు రాముండగుటం జేసియు నాసంస్థనప్పుడు రామనామాంకితంబు గావింప శుభం బగునని నిశ్చయించి శుభముహూర్తంబున రామనామకరణంబు చేసి వ్యాపారము సాగించెనంత. 89

తే. అన్నరామయ బడిపంతులై మెలంగఁ
దమ్ముఁ వేంకయ నెల్లూర్పురమ్మునకును
గోరి కొని తెచ్చి మూడవఫారమువఱ
కాంగ్లభాష నేర్పించె సమ్యనఘుఁ డపుడు 90

తే. తనదుతల్లికి గారాబు తనయుఁడగుచుఁ
దనదు పినతల్లి శేషమ్మ తనయుఁడైన
వాని సుందరరామయ వాంఛఁ బిలిచి
విద్యచెప్పించె నెల్లూరు వీటియందు. 91

మ. అలలక్ష్మీనరసాంబపుత్రకులలో నగ్రోద్భవుం డైనరా
ములు దేశాటన మాచరించుటకు నై పోయెం గనన్ రామి న
త్తలి దుఃఖించుచు నాద్వితీయసుతునిం దర్శించి యోతండ్రి! నా
కెలమిం గూర్చెడురాముఁ డేగె నెటకో యే మయ్యెనో తానయో.

వ. నీవు వాని వెదకి తెచ్చి నామనోవ్యథం దీర్చి వానికిం బెండ్లిచేసి నీవు పెండ్లిచేసికొను మనిన నతం డట్ల యగుం గావుత మని తన యన్న బైరాగియై కొల్లాపురంబునకుఁ జెంతనున్న వెల్లూరుగుట్టపై నున్న వీరభోగవసంతరాయనికడ నుండెనని విని వానిం గనఁబయ నంబై కతిపయప్రయాణంబుల నటకుం జని యన్నం గని సంత సించుచు మునిదిక్కు మొగంబై. 93

మ. అనఘా యీతఁడు నాకు భ్రాత తగ విం తైన నమ్మదిం బూన క
జ్జననిం దమ్ముల మమ్ము వీడి యిటు నిచ్ఛామాత్రసంకల్పుఁడై
చనుదెంచెం గరుణించి మాజననికిన్ స్వాంతంబు శాంతంబుగా
బోనరింపం గలవై వెడంగు నితనిం బో నాడి పంపం గదే 94

తే. ఇతఁడు పెండిలియాడినయేని నేను
వెనుకవాఁడును బెండ్లాడ వేచి యుంటి
మయ్య! కరుణింపు మన నాతఁ డతనిఁ బదరి
పొమ్ము నీయింటి కీ వని పుచ్చె నపుడు. 95

వ. అంత మనవేంకటరావు వానిం దోడితెచ్చి తల్లి కిచ్చిన పదంపడి సూరేపల్లివాస్తవ్యుం డగువాడేలరాఘవామాత్యునినాలవకూఁతుం దెచ్చి వైకుంఠపురములోని భూములకు వచ్చిన కంపెనుశేషన్ సొమ్మంతయు వెచ్చించి యన్నకుం బెండ్లిగావించి కొంత స్థిరాస్థి గల్పించి యేలూరులో నొక గృహంబు గట్టించియిచ్చి నివసింపం జేసి తాను దన యిరువదియేడవయేట వివాహ మాడనెంచె నప్పుడు.

సీ. దోనకొండ రైలుస్టేషనున కొకింతలో
నొద్దిపాడను గ్రామ మొండు గలుగు
నాగ్రామవాస్తవ్యుఁ డైనగోపాలుని
వేంకటనరసయాభిఖ్యుఁ డతఁడు
తనశ్యాలకుఁడు చెప్ప విని మదిహర్షించి
కూఁతు సుబ్బమదేవి నాతని కిడఁ
దలపోసి తనసహధర్మచారిణి సీత
మాంబకు వచియించి యాననంగ

తే. వచ్చి వేంకటరావుకీఁ బలికి శుభము
హూర్తమునఁ బెండ్లిచేసె నోహో యనంగఁ
దల్లి లక్ష్మీనరసమాంబ తద్వివాహ
మునకు నెంతయు సంతోషమున మునింగె. 97

వ. ఆ సీతమానరసాఖ్యులకు జానకీరామ వేంకటశేషయలను నిర్వురు కుమాళ్ళును, వేంకటనరసమ్మ, సీతమ్మ, శేషమ్మ, సుబ్బమాదేవి, మహాలక్ష్మమ్మ యను నేవురు కొమార్తెలును, జన్మించి రందు సుబ్బమాదేవియే మన కృతినాయకుని ధర్మపత్ని. 98

సీ. నరసాహ్వయుఁడు తన నాలవకూఁతురౌ
సుబ్బమాదేవినిం బబ్బముగను
నత్తవారింటికి నంపుచోఁదోడుగా
జానకీరాముని సాగనంపె
నతని నేలూరిలో నాఁగి విద్యాబుద్ధు
లలరించి వేదనేత్రాజభూమి (1924)
సంఖ్యనానేటఁ బుస్తకశాల బెజవాడ
నెలకొల్పియందు వానిని నిలంగఁ
తే. నలుప నాతఁడు మిక్కిలి తెలివి గలిగి
దానినభివృద్ధికిందెచ్చి తగె నతనికి
వేంకమాంబికయందున వెలయఁ గనియెఁ
గొడుకు వేంకటనరసయ్యఁ గూఁతు సీత. 99

వ. అతని తమ్ముండును గృతిపతిశ్యాలకుండునగు వేంకటశేషయ్య నొద్ది
పాటినుండి పిలువంబంచి చదువుచెప్పించి మన కృతినాయకుండు
తానంతకుమున్న పదితొమ్మిదివందల పదిరెండవయేట నెలకొల్పిన
రామాభిధాన ముద్రాలయంబున నెల్లవ్యవహారంబులుం జూడ
నియమించె నతండును భక్తిశ్రద్ధాసమన్వితుండయి కష్టజీవి, లోకోప
కారి, స్వామిభక్తితత్పరుండునై కార్యంబుల నిర్వహించుచుం బేర్మిఁ
గాంచి యేలూరు పురంబున భూవసతియు గృహనిర్మాణంబును
గావించుకొని యీదర రామామాత్యుని పుత్రికయగు మహాలక్ష్మిం
బరిణయంబై శ్రీరామ చంద్రమూర్తి, శ్రీకృష్ణుండను నిద్దఱు
కొమాళ్ళను, వేంకట సీతామహాలక్ష్మియను కుమారితంగని. భావు
కునకుం గుడిభుజంబై యుండెనంత వేంకటరామ ధర్మపత్నియగు
సుబ్బమాదేవియు. 100

సీ. విద్యయు వినయవివేకసౌశీల్యముల్
గలిగినగుణవతీతిలక మామె
సత్యదయాశౌచసద్గుణగణనీయ
సాధుజనావనసన్నుతమతి

వర్చస్విని యశఃప్రపన్న మనస్విని
సాధ్వీజనమతల్లి సదమలాంగి
సతతసమాశ్రితార్థితతికల్పకవల్లి
పతిదేవతాగ్రసంస్తుతచరిత్ర

తే. పతిమనము పట్టి మెలఁగెడుభద్రమూర్తి
పలికి బొంకనివ్రతమునఁ బరఁగుమేటి
పరమకరుణారసార్ద్రహృత్పద్మ పద్మ
సుబ్బమాదేవి శ్రీదేవి సొంపుమీఱు. 101

మ. తనకుం దొమ్మిదియేండ్లు వచ్చినపుడే తా వచ్చి శ్వశ్రూగృహం
బునయందున్ నివసించి యుత్తమోడ నెప్డున్ మాతృభావంబు నా
థునిపట్లం బరమాత్మభావమును సంతోషంబునం జేయుచున్
మనమున్ దీశ్వరభక్తియుం గలిగి సంభాషించు సత్యార్థముల్. 102

సీ. శ్రీరామభక్తి యాశ్రిత పోషకత్వము
గృహకృత్య నిర్వాహణోద్ధమతియు
దాతృత్వగుణమును దైవచింతనయును
న్యాయచింతనయు విజ్ఞానగరిమ
దీనవత్సలతయు మాననీయస్వభా
వము కష్టజీవిత్వ మమృతవాక్కు-
సాధ్వీగుణంబును సాధురక్షణమును
బాంధవప్రేమయు భావశుద్ధి

తే. కలుషరాహిత్యమును ధానకలన సాధు
శీలము వివేకమును విద్య చెల్వ మాస్తి
కతయు శమమును దమమును గలిగి కొనఁగ
సుబ్బమాదేవి శ్రీదేవి సొబగుఁ గాంచు. 103

తే. అతిథు లభ్యాగతులు బంధుతతియు దినము
దినము తనయింటికిన్ రాగ మనమునందు
సంతసించుచు నెటువంటి సమయమునను
వండిపెట్టును సుబ్బాంబ వత్సలతను. 104

ఉ. ఈమెనుఁ జెట్టబట్టినదియే మొదలై మన యాదరాన్వయ
గ్రామణి వేంకటార్యసకుఁ గల్గెను సంపద నాఁడు నాఁటికిన్
వేమడుగుల్ విశేషమయి విత్తము మొత్తముగాఁగఁగూడనై
తామరతంపరై సిరియుఁ దాండవమాడుచు నుండె నింటిలోన్.

మ. పతికిం దోపనిపట్లఁ దా నెపుడు తత్ప్రాంతంబున న్మెట్టుచున్.
హితమున్ బథ్యము తథ్యమున్ వరగుణాన్వీతంబు పూతంబు శా
శ్వతసౌఖ్యప్రద మిద్దియంచుఁ దెలియ న్వాక్రుచ్చుచున్ భర్తృ సం
స్తుతికిం దా[illegible] మేనిసీడవలె నా సుబ్బాంబ యెల్లప్పుడున్. 106

తే. ఎంత విత్తముగలిగిన నేదియున్న
నిల్లు లేకున్న సౌఖ్యము కల్ల యనుచుఁ
బతికి బోధించి సౌధనిర్మితిఁ బొనర్ప
సలిపెఁ దనపేర నది ప్రశస్తతనుగాంచె. 107

తే. గృహమునకు నెట్టిదై తాను గీర్తిగనునో
కోడ లట్టిదయనియు నాకోడలె తమ
కులము నుద్ధరించెదునని తలఁచి తాను
నామె వే అనిమొంచదా యతివ మిన్న. 108

సీ. సుగుణి వేంకటరావు సుబ్బమాదేవినిఁ
పెండ్లియాడినదాది పేర్మిఁ గాంచె
ధన మెంతయును హెచ్చె ఘనసౌధనిర్మాణ
మొనరింపఁగాఁ జొచ్చె హాయలు మెఱయ
ముద్రణాలయ మొండు భూరివిత్తం బిచ్చి
కొనియెఁ బుస్తకములధనము హెచ్చె
వడుగులు పెండ్లిండ్లు పదులు వరుసగాఁగఁ
జేయించెఁ దనచేతిశ్రీ రాణసంగి

తే. పుస్తకాలయశాఖలు పొందుపడియె
దేశదేశములందు సందేహరహితుఁ
డతఁడు తనపేర సతిపేర నతులితముగఁ
బాఠశాలలు నిర్మించెఁ బ్రాజ్ఞుఁ డగుచు. 109

తే. నిలిపెఁ బ్రారంభవిద్య నా వెలయుపత్రి
కావతంసము గోరక్షణాదిసంఘ
ములకు వేఁతు వేల్వి త్తమును నొసంగె
సలిపెఁ దనపేర నొకపేఁట సలలితముగ. 110

తే. రామముఖ్యదేవాలయరాజములను
బెక్కుచోటులఁ గట్టించెఁ బెక్కులేండ్లు
మ్యునిసిపాలిటిమెంబరై పురజనులకుఁ
బెక్కుసాయము లొనరించెఁ బేర్మి మించె. 111

తే. పదియుఁ దొమ్మిది నూర్లు నిర్వదియు నొకఁడు
నయినవర్షమునందు సుబ్బాంబయందు
సుతుని నాతఁడు గనియె నాసుతుఁడు సీత
రామగోపాలుఁ డనుపేరఁ గ్రాల నగుచు. 112

వ. ఆదంపతులయింట నాఱుమాసములు మాత్రముండి పదంపడి వేలు
పులయింటికిం బోయె నాలో వేంకటరాయుని తోడియల్లుండగు
వాలిచర్ల కొండయామాత్యుండు కడుంకడుం బీదరికం బనుభవిం
చుచుండం దెలిసి సకుటుంబముగ వానిం దెచ్చి తనయింటం బెట్టు
కొని పోషించుచు వానిపుత్రులకు విద్య గఱపించుచుం గొంతకాల
మున్నంత వేంకటరావు తన కవ్వల నౌరససంతానప్రాప్తి లేదని
యెఱింగి తన యన్నకును దమ్మునికి నేకైకపుత్ర సంతానంబు
గలిగియుంటంజేసి చిన్నతనమునుండియుఁ దనయింటం బెఱుగుచున్న
కొండయామాత్యుని ద్వితీయపుత్రుం డగు వేంకటరామయం గోరి
పదితొమ్మిది నూర్లయిరువదియాఱవ హూణవత్సరమున దత్త
హోమవిధిం జేసి పుత్త్రునిగ స్వీకరించె నతండును 113

తే. పరమశాంతుఁడు సునిశితప్రజ్ఞ గలఁడు
నిండుకుండ దయారసాన్వితహృదయుఁడు
పట్టుదల మెండు బీకామువఱకుఁ జదివెఁ
దల్లిదండ్రులపేర్మి కాతండు నెలవు. 114

ఉ. ఔరసపుత్రుఁ డెట్టులగు నట్టులె దత్తుఁడునంచు నెంచుచున్
శ్రీరఘురామ భక్తుఁడయి చెన్నలరారెడు రాయఁ డన్వయ
శ్రీ రమణింపఁజేయ మతిఁజేయుచు వేంకటరామనామునిన్
జేరఁగఁదీసి విద్యలనుఁజెప్పి గ్రహించెను గన్నపుత్రుఁగన్. 115

ఆ. కన్న తల్లిదండ్రు లెన్న నెట్టివారి
కన్నమిన్నలనుచుఁ గొన్నతల్లి
దండ్రులం దలంచి తాత్పర్యమునఁజేసి
కొలుచుచుండు పుత్రకుం డతండు. 116

మ. తనుగ్రాద్యేట్టయి యుండియున్ వివిధసద్ధర్మ స్వరూపంబుల
న్వాని విజ్ఞానవరిష్ఠుఁడయ్యుఁ దనతండ్రి న్వేంకటామాత్యునిన్
గనినంత న్వినయంబును న్నయముఁగల్గన్ ద త్తపుత్రుండు దే
వుని భాతింగనుఁగొంచు మించినగతిం బూజించు నెల్లప్పుడున్.

క. సర్వసమర్థుండయ్యున్
గర్వం బొక యింతలేక కార్యము లెవియే
నిర్వర్తిల్లఁగఁ జేయుఁడు
పూర్వహుఁడగు తండ్రి యొుకతోఁగాకెపుడున్. 118

తే. అతఁడు వైశాఖపురియందు నాథ్యులైన
వారు పాలూరివా రందుఁ బ్రవరుఁడు హను
మంతరావు సువర్చలాంబయును గనిన
కృష్ణవేణినిఁ బెండ్లాడెఁ గీర్తిమెఱయ. 119

తే. ప్రాణనాథునియందు నెట్టి భక్తిగలదో
య త్తమామలయందును నాఁడుబిడ్డ
లందు నట్టి భక్తినిగల్గి యల్ల కృష్ణ
వేణి దీపించు శ్రీరామ రాణి నాఁగ. 120

చ. మగనికి స త్తమామలకు మాటబడిం బరిచర్యనేయుచున్
మగనికి మేనినీడయయి మామను దండ్రివలెన్ దలంచుచున్

దగునటు నత్తతోఁగలసి తత్పరతన్ దనమేను నాకు మే
నగు నొకఁడేయటంచుఁ బ్రజలాడఁగఁ గోడలు పోడిమిం గనున్. 121

వ. అవ్వాల నావేంకటరాయండు. 122

సీ. తల్లియున్ భార్యయుఁ దనవెంట రాఁ గాశి
యును గయయుఁ బ్రియాగమును మొదలగు
నుత్తరయాత్రల నొగి నేగి సేవించి
దక్షిణయాత్రలు దవిలి తిరిగి
రామేశ్వరాదితీర్థములందు బహువిధ
దానంబు లొనరించి ధర్మకార్య
ముల నెన్నియేఁ జేసి పురమున కేతెంచి
బ్రహ్మమహంబును బ్రస్తరించె

తే. అతఁడు నేఁటేట రామకళ్యాణమహము
నధికవిభవాభిశోభిత మగు తెఱఁగున
నలువుఁ బండితు లరుదేర సత్కరించు
నూఱులు న్వేలు నిరతంబు వారి కిచ్చి. 123

సీ. వేంకటరాయండు విక్రమాబ్దమునందు
నొనరించె షష్టిపూర్త్యుత్సవంబు
ఋత్విగ్జనంబుచే మృత్యుంజయుజపంబు
నుగ్రరథునిశాంతి నొనరఁ జేసి
భూదాన గోదాన ముఖ్యషోడశదాన
ములు దశదానముల్ సలిపి మఱియుఁ
గలశముల్ వస్త్రముల్ ధర్మసురులకు నిచ్చి
పండితకవులకు బహుమతు లిడి

తే. పదిదినంబులు నాలుగువర్ణములకు
భోజనము షడ్రసోపేతముగను బెట్టి
కృతులు గైకొని తనబంధుతతికి నెన్న
వసతు లెన్నేని కల్పించె వరదుఁ డతఁడు. 124

సీ. అఖిలప్రజోపయోగార్థము చెఱువులు
నూతులు నిర్మించె నాతఁ డవని
నడుమున నడలేనియట్టి బాటలయందు
వేయించె రోడ్లు సువిస్తృతముగ
బీదవిద్యార్థుల నాదరించుచు వారి
భోజనాదులు జీతములు నొసంగెఁ
దనవారికే గా కితరుల కెందఱ కేని
పెండ్లిండ్లు చేయించెఁ బేర్మి నించె
తే. ఇరువదొకఁడవ హూణవత్సరమునందు
నెఱి నతం డుప్పరలపల్లె నిమ్నజాతి
బాలబాలికలకు నొకపాఠశాలఁ
బెట్టి పెక్కేండ్లు సాఁగించి వృద్ధిచేసె. 125

తే. తనదుముద్రణాలయమునఁ బనిరొనర్చు
వారి యభివృద్ధి కొకరాత్రిపాఠశాల
పెట్టి పెరవారికిం గూడ విద్యలందు
నుచితముగను జెప్పించె నాసుచరితుఁడు. 126

తే. తోడపాటి గ్రామంబునఁ బొందువడఁగ
నిమ్నజాతి బాలురకు వర్ణింపఁ దగిన
క్రమమున ననాథశరణాలయమునుగట్టి
దానియభివృద్ధి గావింపఁ బూనెనతఁడు. 127

మత్త. రామకోటిసమాజ మేలుకుగ్రామమం దగు దాని కా
రామభక్తుఁడు కార్యదర్శిగ రక్షకుండుగ నై సదా
రామనామసహస్రకోటుల వ్రాయఁ జేయుచు వ్రాయుచున్
రామభక్తి జగన్నుతంబయి క్రాలునట్లు పొనర్చెడున్. 128

సీ. మేటి వేంకటరావుపేటలో నాంజనే
యున కొక్కయాలయమును సమీప
మందుసీతారాము నాలయంబును గట్టి
తత్పూజ కెంతయే ధన మొసంగెఁ

బత్తెబాదునఁ గట్టె భజనమందిరమును
సార్ధసాహస్రరూప్యములు వెట్టి
యట జీర్ణ మగునీశ్వరాలయమును వేలు
రూప్యముల్ వెచ్చింప రూపు చూపె

తే. మ్యునిసిపాలిటిలోఁ జేరి మూడునాల్గు
వేలధనము ప్రజాసేవకై లలి నిడె
నితఁడు చేసినదానము లింతవఱకు
సర్వదేఁబది వేల్ లెక్కకై తలిర్చె. 129

తే. అతఁడు పినతల్లి శేషమ కల్లుఁడగుచు
రమణ వాడేల సుందర రామయకును
భుక్తికై నిల్పె నెల్లూరు పురములోన
తర్లపాడునసిల్లు పుస్తములపాపు. 130

తే. మఱియుఁ బినతల్లి తనయుఁ డీదరకులీనుఁ
డైన సుందర రామయ నాదరించి
పరిణయముచేసి జీవనోపాధినొంటె
నమరిచెఁ దెనాలిలోఁ బుస్తకములపాపు. 131

సీ. వాడేల రామయ బాలసుందరరామ
యలచేత బెజవాడయను పురమున
మారుతిరామను మహిత నామంబున
గ్రంథ విక్రయశాలఁ గలుగఁజేసెఁ
దనయన్న కూఁతులకును గొమారునకును
బరిణయంబులు చేసె స్వధనమునను
శ్రితకోటికినిబంధు తతికిఁ బీదలకును
జీవనోపాధులు చేసెఁగలుగఁ

తే. బదియు తొమ్మిదినూర్ల నల్వదియగుసమఁ
గారణాంతరమునను నేలూరినుండి

విజయవాడకుఁ దనదు కంపెనినిమార్చి
చేసె వ్యాపార మెంతయుఁ జెన్నుమీఱ 132

చ. నలువది యేండ్లనుండియు ఘనంబుగ నేలురియందు సాఁగును
జ్వలమగుసంస్థ యొండుకడ సాగునో సాగదొయన్న బీతునన్
గలఁగియు రాముఁడే కలఁడు గాయని వానిభజించి తత్కృపం
గలుగుటఁ దొంటికంటె నధికంబయి వృద్ధికినయ్యె నయ్యెడన్. 133

సీ. ఆంధ్ర దేశమునందు నన్నిచోటులఁ బాఠ
శాలలఁ బఠియించు బాలకులకుఁ
బాఠ్యపుస్తకములు వలసినవన్నియుఁ
జెన్నపురంబున నున్నయింగి
లీష్కంపెనీలవార్ లీలఁ దెలుఁగువారి
వలనఁ బుస్తకములు వ్రాయఁజేసి
విక్రయ మొనరించి వేనవేల్గణియించి
రిది మన కృతిపతియెఱిఁగి వాని

తే. యందు హిందుమతోప యోగార్థ ధర్మ
ములు కనంబడకుండుట తెలిసి తెలిసి
వేనవేలు ధనంబిచ్చి విజ్ఞవరులఁ
బుచ్చి వ్రాయించె బహువిధ పుస్తకములు. 134

వ. అవియె మన యాంధ్ర దేశంబున మొట్టమొదట వెలసిన పుస్తకం
బులై యొకటవ తరగతి మొదలుకొని స్కూలుఫయినలు వఱకుం
బాఠ్యపుస్తకములై విరాజిల్లుచు నన్ని మండలంబులఁ బ్రశస్తిం
గాంచుచున్నవి. తొల్లింటి కంపెనీలవారి పుస్తకంబుల విలువ
క్రమక్రమంబునఁ దగ్గుదలకు వచ్చినది. మఱియు మనకృతీశ్వరుని
ముద్రణాలయంబున ననేక లోకోపకారక గ్రంథరాజంబు లుత్ప
న్నంబులై పండిత పామరుల నలరించుచునట్టి వగుచున్నవి. రంగూన్
సింగపూర్ సిలోన్ లోనగు రాష్ట్రంబులంగూడ నలంకరించు
చున్నవి. 135

తే. ప్రబలు నీదర వేంకటరాయ సంస్థ
యందు నిమ్నాగ్రగురు పరివాంఢ్రుందు రేటి
కెనుఁబడియుఁ దొంఁబడియు వేల ధనము జీత
నాతములకు వ్యయింపనౌ నీతరుణము.  136

వ. రామనామాంకితంబగు వేంకటరాయని పుస్తకవ్యాపారసంస్థయిపుడు విజయవాడయందె కాక రాజమహేంద్రవరము, పాలకొల్లు, తాడేపల్లిగూడెము, తెనాలి, గుంటూరు, కంభము, వంగవోలు, నెల్లూరు, కుర్నూలు, కడప, చిత్తూరు, చెన్నపురము, వరంగల్లు, సికిందరాబాదులందును బొంబడి మహోన్నతస్థితిం గాంచి సమృద్ధంబై దీపించుచున్న దాకర్ణింపుఁడు.

శా. ఆదిన్ దీనిని నిర్వహింపఁజేయుటకు సత్యార్థంబు గల్పించి సం
మోదంబుం గలిగించిపెట్టి ధనికున్ బూతాత్ముఁడున్ గ్రంథి వం
శోదారుండగు రామమూర్తి విధి చెయ్యింజేసి వ్యాపారమం
దేవోన్నప్రిపాసంగ దైన్యమునకై యింపేదియున్నంతటన్.  138

చ. కృతము నెఱింగియుంట మనకృత్యధినాథుఁడు రామమూర్తి నా
వృతిఁగని యోడకుంటు మని యెంతయుఁ బ్రేముడి నాదరించి వ
స్త్రతతుల వర్తకంబు వితతంబగునట్లుగఁజేసి వెండియున్
స్థితిగలవానిఁ జేసి మునిచెం దనచెల్మి సదెల్లఁ జూపుచున్.  139

తె. కృష్ణపుష్కరమున నదికెలన నుండ
నీదరాన్వయునకు ముని యేగుదెంచి
శైవపంచాక్షరిం జెప్పి చనియె వాసు
దాసు శ్రీరామ మంత్రము తగవచించె.  140

సీ. అతఁడు ప్రభాతమునంద మేల్కని కాల్య
కృత్యమ్ములం దీర్చి ప్రత్యహంబు
స్నాన సంధ్యాద్యనుష్ఠానముల్ నెఱవేర్చి
సావిత్రి జపియించి సవితఁగొలిచి

శైవ పంచాక్షరీజపమును రామతా
రకమంత్రజపమును రహఃణసలిపి
పృథుభక్తినాదిత్య హృదయము విష్ణుస
హస్రనామములు గీతాగమంబు

తే. దినము పారాయణమొనర్చి దేవతార్చ
నయుఁ బొనర్చియుఁ నతిథుల నియతిఁగొలిచి
యుష్టమృష్టాన్నభోజన మొలమిఁబెట్టి
కొలుచు విప్రుల సోదర కులజుఁడెవ్వడు. 141

తే. అంతరంగిక శత్రువు లతనివంక
నరయఁజాలరు భూతదయాంతరంగు
డితరులకు గీడుసేయని వ్రతమువాఁడు
పరులమేల్ తన మేలుగా నరయునతఁడు. 142

సీ. కష్టమోర్చింగిన శిష్టజనుఁడు గానఁ
బలుక నెల్లరుఁ గష్టపడుఁడటంచు
సోమరిపోతులఁ జూచి సహింపఁడు
కష్టీఫలీయని కడకఁబలుకుఁ
దనకార్యదీక్ష యిం తనరాదు పట్టిన
పట్టు విడం డగువటికునద్ది
పలికి బొంకఁడు ధర్మపరుఁడు కృతజ్ఞుఁడు
వ్యాపారమున మోసమున సహింపఁ

తే. దధికులం దధికుఁడు పేదలందుఁ బేద
యట్టులగుచు సమస్తకార్యములు తాన
చేసికొను నెట్టి యభిమాన మేసమయము
నందునేఁ బూనఁ డాయీదరాన్వయుండు. 143

క. సుకమున్ దుఃఖము నొక గతి
నకలంకమనస్కుఁ డాతఁ డౌనని మెచ్చున్

దీకమకలు పడఁడు మనమున
సకలమునకు రాముఁడనుచు సంభాషించున్. 144

క. మనమునఁ దలఁచిన యది పలి
కినయది చేసినది యొక్క-క్రేవన యుండున్
ఘనుఁ డాగుణభూషణుఁ డా
తని నియమము వ్రతము పలుకఁదగు నెవ్వరికిన్. 145

తే. నడచినను గూరుచున్నను గుడుచుచున్న
నిదుర నొంకుచునుండిన నిరతము రఘు
రామమంత్రమె స్మరియించు నా మహాత్ముఁ
డందునం గాదె యింతవాఁ డయ్యె నతఁడు. 146

సీ. తన జననికి నొక తరుణమున నపాయ
కరమగు జాడ్యము కలిగినపుడు
వైద్యులెల్ల నిరాశ ప్రకటించి నప్పుడు
పదుగురు భక్తులఁ బలికి పిలిచి
తాళమృదంగాదు లోలిమ్రోయఁగ రామ
రామయన్ నామమే యామెకడను
శబ్దింపఁగాఁజేయ సర్వము రామమ
యంబుగాఁదోఁచె నయ్యవసరమునఁ

తే. గొంతలోపలఁ గనువిచ్చి యంతమొంద
నున్న యాతల్లి మెలమెల్ల యుల్లమందు
రామనామాక్షరంబుల రచననిలిపి
యమపురి ప్రయాణముఁ మానినట్టిదయ్యె. 147

తే. శ్యాలకుఁడు శేషయ కొకప్డు ప్రాణసంక
టము గలిగినప్డు రామనామము స్మరించెఁ
జెవులు చిల్లులువోవన ప్డైవరావచ్చి
మం దిడి గమించె నంతలో బ్రతికెనతఁడు, 148

మ. ఒకకాలంబున నీదరాన్వయు చెవిన్ హోర్మించుఁ జీమూతి నె
త్తికిఁ బోటెక్కుడు లోనఁగుళ్ళై నిది మిత్తింగూర్చునం చెల్లరున్
సకలాత్మ న్వచియింప నాతఁడు రఘు స్వామివ్మది న్నిల్పి నా
కికఁ నీవేగతియంచు వేఁడుకొనుచో నేవైద్యుఁడో వచ్చి వా
నికి మందిచ్చె క్షణంబులోనఁ గుదిరెన్ శీర్షామయం బబ్రమై. 149

సీ. తన దత్తపుత్త్రుని యనుజ సుభద్రమ
యను నామెఁ దనయింటియందె పెనిచి
రామచంద్రునివంశ రామయకును సుబ్బ
మాంబకుఁ దనయుఁడై యలరుపట్టి
శేషాచలమునకిచ్చియు వారిఁదమచెంత
నే నిల్పుకొని సంతలోన దైవ
ఘటన శేషాచల మిటనొక సుతుఁగాంచి
దాను వేల్పులఁగొల్వఁ దరలిపోయె

తే. అపుడు వేంకటరావల్లయాత్మ జాత
నామె సుతుని వేంకట నరసాఖ్యు బాలు
గడువునం బెట్టుకొని ప్రోచి కాచుచుండు
వీరియభివృద్ధి తనమీదఁ బెట్టుకొనుచు. 150

తే. తనదు సుతునకు నన్నయై తగిన వాలి
చెర్ల వేంకట సుబ్బయ చిన్నతనము
నంద పరమంద వానిభార్య మహాలక్ష్మి
సుతలు శ్రీసత్యవతియును సుబ్బలక్ష్మి. 151

క. అను నిరువురతోఁ గష్టము
లను బొందుచునుండ వారి లాలించి ప్రియం
బునవారిఁ బ్రోచుచుండెన్
దనయులకున్ బెండ్లితాన తగసలుపగనై. 152

శా. పెక్కుల్ రామకృతుల్ బఠించి కృతి గావించెన్ విచిత్రాఖ్యనై
లశాకావర్ఘుల కృష్ణశాస్త్రి విబుధుల్ భాషించుభాషన్ ఘనం

బక్కావ్యంబును రామచంద్రునకు నీయం జేసి భాసిల్లెఁ బెం
పెక్కన్ వేంకటరాయఁ డక్కవికి నెంతే సత్కృతిం జేయుచున్ 92

మ. కర మాశ్చర్యకరంబు శంకరయతీట్కల్యాణచారిత్రమున్
విరచింపన్ బొనరించి తెల్గునుడులన్ వెంపాల సూర్యార్యచేఁ
బరమార్థంబు నొసంగు రాఘవునకున్ భక్తిన్ సమర్పించె నీ
దరవంశాబ్ధిశశాంకుఁ డిచ్చిపరమార్థం బర్థి సేవించుచున్. 93

## షష్ఠ్యంతములు

క. ఏతాదృగ్విధగుణ వి
ఖ్యాతునకున్ సకలసుకవిగణవినుతయశః
స్ఫీతునకున్ మంత్రికులో
ద్భూతునకున్ రాజమాన్యపురుషీతునకున్ 94

కం. వేంకటనాథార్యాకల
నాంకితభావునకు సుబ్బమాంబావరహృ
త్పంకజదేవున కీదర
వేంకటరావునకుఁ గాశ్యపీదేవునకున్. 95

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనినరామాయణ సారసర్వస్వం బను శ్రీకృష్ణరామాయణంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన నైమిశారణ్యపుణ్యక్షేత్రనివాసు లగుశౌనకాదిమహార్షులు హర్షోత్కర్షంబున రోమహర్షణతనూజాతుం డైనసూతుని వలన ననేకపురాతనేతిహాసపుణ్యకథల నాకర్ణించుచు నొక్కనాఁ డతనిం గాంచి యి ట్లనిరి. 96

—♦ కథాప్రారంభము ♦—

ఉ. ఆదికవీంద్రుఁ డై శ్రుతులయందలిఛందముల్ గ్రహించుచున్
బ్రోదిగ రామచంద్రుకథ మున్ను ప్రచేతసుఁ డన్న పేర వి
ద్యాదయితుం డొనర్చె నది యంతయు వేదజనిత్రిమంత్రసం
చోదిత మంచు వింటి మిల సూరివరేణ్యులు చెప్పుచుండఁగన్. 97

క. మున్నా వాల్మీకునికథ
విన్నట్టులు కన్నయట్లు వివరించి జగ
త్సన్నుతరామాయణముఁ
విన్ననువొప్పంగఁ జెప్పవే సూతసుతా. 98

వ. అనిన సూతుం డి ట్లనియె. 99

—♦ వాల్మీకుల చరిత్రము ♦—

సీ. వినుఁడు వాల్మీకులవృత్తాంత మానాఁడు
దేవలోకమునందు దేవవరులు
ముప్పదికోటులు మూఁడుకోటులు గల
పేరోలగమునకు సౌరనారు
లిరువదినాల్గువేవురు వచ్చి తమతమ
లావణ్య మెల్ల వెలార్చి రపుడు
కనుచున్నబ్రహ్మకు స్ఖలన మయ్యె స్వీర్య
మది చూతు రనెడిమందాకమునను

తే. బ్రహ్మ దానిఁ బదంబున రాసె రాసి
నంతలో నర్వదొక్కవే లైనచిద్రుప
లయ్యె నవ్వీర్య మెల్లరు నరయుచుండ
వాలుకాసంగమంబునఁ గ్రాల నగుచు. 100

వ. అం దొక్కండు భూతలంబునం బడియెఁ దక్కినయఱువదివేలును వాలుకాసంశ్రయంబునంజేసి వాలఖిల్యమహర్షులై యంగుష్ఠమాత్రపురుషు లైరి క్రిందఁబడినచిద్రుపలు ప్రచేతసుండు నా ఋషియై బ్రహ్మకడకు వచ్చి యెల్లరు విన ని ట్లనియె. 101

తే. చిద్రుపలై నీదువీర్యము క్షితినిఁ బడియె
నొకచిద్రుపలను నే నిట్టు లుదయమొంది
వచ్చితినిఁ దండ్రిఁ జూడంగ వాంఛఁజేసి
నాకు గతి యేమి చెప్పవే లోకనాథ. 102

ఉ. నావుడుఁ గ్రుద్ధుఁడై యజుఁడు నాదగుదోషము నిండుకొల్వులోఁ
గావరుఁడై వచించితివి గావున నీ వొక పుల్కసుండవై
భూవలయంబునం బడుము పొమ్మనుచున్ శపియింప నార్తి వా
పోవుచు నాతఁ డిట్లనియె మ్రొక్కినకాళ్ళకె వెండి మ్రొక్కుచున్.

క. నీకుం బుట్టిననే నా
లోకమునం బుల్కసుఁ డయి లొగ్గడిఁ బడుచున్
వీఁకమెయి నెట్లు బ్రదుకుదు
లోకేశా! నన్నుఁ బ్రోవ లోఁ గొనుము కృపన్. 104

ఆ. అనిన గనికరించి యతఁడు పుల్కసుఁడవై
పుట్టి రామమంత్రపూతుఁడ వయి
ఘనుఁడ వై మహత్త్వమున నొప్పి సాయుజ్య
మందఁ గల వటంచు నజుఁడు వలికె. 105

వ. అంతలో నాప్రాచేతసుండు భూతలంబున నవతరించి పుల్కసావ
తారంబు నొందె నాకర్ణింపుఁడు. 106

—♦ వాల్మీకి బోయయై వనముల సంచరించుట ♦—

చ. ఖలుఁ డలబోయ కాననము కాపుర మై తగ నాలుబిడ్డలం
గలిగి ఖరస్వరూపుఁ డయి కారడవిం గలజంతుకోట్లకున్
దెలియఁగఁ గాలమృత్యు వయి తెక్కలికాఁ డయి తెర్వు గొట్టుచున్
బులులకు జంక కెల్లపొలముల్ చని వచ్చుచు నిచ్చ పెంపునన్ 107

క. మృగములను జంపి తినుచును
మృగయుండై వాఁడు కత్తు లీటెలు నమ్ముల్
తగఁ దాల్చి వనచరుండై
పొగ రెక్కినవృషభమట్లు పొంపిరిపోవున్. 108

వ. ఇట్లున్నంతఁ గొంతకాలంబున నొక్కనాఁడు. 109

ఉ. దేశము లెల్ల మెట్టుచును దివ్యమునీంద్రులు కొందఱవ్వనో
ద్దేశపథంబు వట్టి చనుదేఁ గని క్రూరకిరాతుఁ డొక్కచోఁ
గోశమునుండి ఖడ్గమునుఁ గొంచు చరుదెంచి యముండు వోలె సం
దేశము చేసె నిల్వుఁ డని డెప్పరమై పడునట్టివాకులన్. 110

క. మునివరులు కలఁగి కలఁగక
చనుచుండిరి దారి వట్టి జం కొకయింతే
మనములను నిలువఁ బెట్టక
తనువులపై నాస్థ లేనితాపసు లగుటన్. 111

చ. లగుడము త్రిప్పుకొంచుఁ గరలాఘవ మేర్పడఁ బెద్దకొండ నాఁ
దగి తనుకాంతిఁ జీఁకటుల దార్కొనఁ జేయుచుఁ బెద్దపెట్టునన్
బగులఁగఁ గొండ లార్చుచును బాపకిరాతుఁడు దారి కడ్డమై
డెగిపడి వారిపైఁ గవిసె ధింధిమిశబ్దము పుట్ట మెట్టుచున్. 112

క. పరవళ్లు ద్రొక్కుకొంచుం
బర తెంచెడువానిఁ జూచి పరమర్షు లెదన్
బరిశాంతిఁ గాంచి సాంత్వన
పురస్సరంబుగఁ బలికిరి బోయకుఁ డెలియన్. 113

క. మునులము మాదెస నేమియుఁ
గొన నుండవు చిప్ప కఱ్ఱ గోఁచియుఁ గా కో
వనచర! నిక్కము చెప్పితి
మనుమానము లేదు చూడు మని చూపి మఱిన్. 114

వ. కొంత శాంతించియున్నవానిం గాంచి నీ వెవ్వండవు నీవృత్తాంతంబు సెప్పు మనుటయు నతండు తనవ్యాఘ్రరూపంబు విడిచి మనుష్యుండై. 115

ఆ. కావిపుట్టగోఁచిఁ గట్టినజడదారు
లార! నేను వ్యాధులందుఁ జేరి
నట్టివాఁడ నిందు నాలుబిడ్డలతోడఁ
జెల్లి కాపురంబు సేయుచుంటి. 116

ఉ. పందుల లేళ్ళ దుప్పులను బట్టి వధించి తదీయమాంసముల్
తిందుము నేను నాప్రజలు లేవడి మా కొకయింత లేదు నే
నెందఱినో వధించి ధన మెంతయు సంతనచేసి యుంటి నా
ముందఱఁ బడ్డప్రాణు లెవి ముందఱ బడ్డవి లేవు చూడఁగన్. 117

—♦ వాల్మీకికి ఋషులు దర్శన మిచ్చుట ♦—

చ. పదుగురు వచ్చుచుండి రొకబారున సొమ్ము గణించుకొందు సం
చెద ముద మంద నేఁ డిచటఁ నే విఁసు దోచుకొనంగ నడ్డితిన్
దుద కది వ్యర్థ మయ్యె నొకదొప్పెడుగంజికి నైన మీకడన్
గుదురక పోయె రిత్త చనఁ గోపన నాసతి యేమి చేయునో. 118

వ. అని పలుకుచున్నంత మునులు వానిం గరుణింప నెంచి కనికరంబు
తో ని ట్లనిరి. 119

శా. ఆలిం బిడ్డలఁ బ్రోవనే కద కిరాతా యిన్నిప్రాణంబులన్
లీలం దీయుచునుంటి ప్రత్యహము పోలె న్నీకు నీపాపముల్
పా లందంగలరో భవజ్జనులు నీపాలం బడం గల్గునో
పోలం జూచి వచింపు మన్న దురితాత్ముం డక్కిరాతుం డనున్.

తే. ఇంటికిం బోయి వచ్చి నే నింతలోన
మీకుఁ జెప్పెద నంతకు మీరు నిలిచి
యుండుఁ డని మిమ్ము వేఁడుచునుంటి ననుచు
నాజ్ఞ గొని పోయెఁ దనటెంకి కతఁడు వడిగ. 121

వ. పోయి తనయింటియాబిడం బిలిచి యి ట్లనియె. 122

తే. ఓసి పెండ్లామ! మృగముల నేసి తెత్తు
ననుదినంబును మీకయి జనులఁ జంపి
వత్తు నాపాపమున నీవు వంతు గొందె
యనుచు వానికి వనిత యి ట్లనియెఁ గనలి. 123

ఆ. జనులఁ జంపి తెత్తొ చంపక తెత్తువో
యెవరి కెఱుక నీకు నెట్టులైన
తెచ్చుపనియు నాకుఁ దెచ్చినదానిని
వండి పెట్టు పనియు నుండినదియ. 124

వ. ఇంతియ కాని నేను నీచేసినపాపంబు పంచుకొనుదానం గా నని నిస్సం
శయంబుగం జెప్పిన నప్పు డక్కిరాతుండు తనూజాతులం బిలిచి

దాని నడిగిన ట్లడిగిన వారు నట్ల చెప్పుటయు నట్టివాఁడైన నతండు
మహామునీంద్రదర్శన సంభాషణంబులం జేసి వైరాగ్యవంతుండై
సంసారంబు నిస్సారం బని రోసి తనమనంబున. 125

చ. జనుల వధించి తెచ్చి ధనసంచయ మిచ్చిన నాలుబిడ్డలున్
దినుటకు నుందు రంట మఱి దేనికిఁ గానియు నుండ రంట యి
ట్లను వఱి యుండుసంసృతి సుఖావహ మంచుఁ దలంచి యొడ్లకై
ఘనతరపాతకంబులను గట్టిఁడినై యొనరించితిం గటా. 126

ఉ. బాటలు గొట్టితిం బ్రజకు బాధ యొనర్చితి నెల్లవేళలన్
మేటులఁ జెందనాడితిని మీఁదులు గానక సాధుజంతులన్
గోటులఁ దున్మితిం బసులకున్ మఱి పక్షులకున్ యముండనై
పాటిలితిన్ మహాఘములపా లయి పోతి నిఁ కేమి సేయుదున్. 127

ఉ. ఎన్నియొ పాపకార్యముల నే నొనరించినవాఁడ గావునన్
నన్ను జముండు పట్టుకొని నాలుకఁ గోసెడి గ్రుడ్లు తీసెడిన్
వెన్నెముకల్ సడల్చెడిని వ్రేసెడి నిప్పుల ముప్పుఁ దెచ్చెడిన్
జెన్నఁటినై మహావ్యథలఁ జెందఁగఁ జేసెడి దుష్టజన్మముల్. 128

క. నా కట్టినార కాధులు
గాకుండఁగఁ జేసి కొనెడుగతి గల దొక్కో
లేకుండ లేదు మునివరు
లాకడఁ గల రాశ్రయింప నగు నిపు డనుచున్. 129

—♦ వాల్మీకికి ఋషులు మంత్రోపదేశము సేయుట ♦—

వ. వడివడిం బఱతెంచి వారిపాదంబుల వ్రాలి నే బాలిశుండన న్ననుగ్ర
హింపుఁ డని ప్రార్థించుచుఁ బశ్చాత్తాపతప్తుం డగు వాని దైన్యంబు
నకు వగచి వారు వానిం గరుణించి. 130

ఉ. చింతలఁ బోకు మీవు మును చేసినదానికి మానసంబునన్
జింత యొనర్చి శుద్ధుఁ డని చెప్పఁగ నొప్పితి విప్పు డేము నీ
స్వాంతము చేర మంత్రము నొసంగెద మందున నిందు నందునన్
జింతలు దీఱ సద్గతులఁ జేరఁగ నయ్యెడు నయ్య చయ్యనన్. 131

వ. అని వానిం జరితార్థుం జేయం దలంచి రామమంత్రోపదేశంబు సేయువారై వ్యాధుండు గావున వ్యత్యయంబు గావించి మరా యని యుపదేశించి దీని నజస్రంబు జపించుచుండు మని బోధించి యథేచ్ఛం జని రంతఁ గిరాతుండును విరాగి యయ్యెఁ గావున నాహారనిద్రాదులం బరిత్యజించి యమ్మహారణ్యంబునం దొకగిరి గహ్వరంబున నొరు లెఱుంగకుండ నాసీనుండై. 132

—♦ కిరాతుండైనవాల్మీకి రామమంత్రము జపించుట. ♦—

పంచ. మరా మరా మరా యటంచు మాన కెల్లవేళలన్
బరాత్పరుం బరాపవాదభంజనున్ నిరంజనున్
నిరంతరంబు స్వాంతమందు నిల్పి పొల్పు మీఱఁ గా
నిరామయుండు నై జపించె నిత్యనిర్వికారుఁడై. 133

వ. ఇట్లు పరమనిష్ఠాగరిష్ఠుండై కిరాతశ్రేష్ఠుండు తనపైఁ బుట్టలువాఱ నేండ్లు పూండ్లుగా రామమంత్రానుష్ఠానంబు గావించి తత్ప్రభావం బున మహానుభావుండును మహామునీంద్రుండును నిఖిలవిద్యావిశా రదుండును బ్రహ్మతేజోవిరాజితుండును ద్రిభువనైకమాన్యుండును ధన్యుండు నై వల్మీకభవుం డగుటంజేసి 'వాల్మీకి నా. మహాకవి యునై భరద్వాజాదిశిష్యులం గూర్చుకొని పేర్చినవైరాగ్యం బను భాగ్యంబునం దేలి ప్రాజ్ఞుండై పూజ్యం బైనవిష్ణుసాయుజ్యంబు నొందె నమ్మహానుభావుండు. 134

—♦ వాల్మీకికి నారదుఁడు రామాయణ ముపదేశించుట ♦—

ఉత్సాహము:—

వామలూరుతనయుఁ డట్లు ప్రాలుమాల కెంతయే
రామనామమంత్రజపము రాత్రులుం బవళ్లు నా
కామెయింబొనర్చుచుండు నప్డురావణుఁ వధింపఁగా
రాముఁ డవతరించు నంచు నారదుండెఱుంగుటన్. 135

ఆ. పుట్టలోన నున్నపుడు నారదుఁడు వచ్చి
పృథివి 'రాముఁ డవతరించు నంచుఁ

దనకుఁ దెలిపి పోవఁ దలపోసి తలపోసి
రామచరిత మెల్ల వ్రాయ నెంచె. 136

మ. తమసాతీర్థము లాడు నిచ్చ గలఁడై తానుఁ భరద్వాజుఁడున్
గ్రమపాఠంబొనరించుచుం జనిరి నిష్కాలుష్యకూలప్రదే
శము నాచెంగటఁ గ్రౌంచయుగ్మము రతిం జాగించుచుండంగ దు
ష్టమనస్కుండు నిషాదుఁడందుమగక్రౌంచంబుం దెగన్ వ్రేయుఁడున్.

—♦ వా ల్మీ కి ని షా దు ని శ పి ం చు ట ♦—

ఉ. ఆడుది తోడు నీడ యగునామగపక్షి నికృత్తశీర్షమై
కూడిక వీడి నేలపయిఁ గూలఁ గనుంగొని యెంతయేనియున్
గోడున నేడ్చి రాలుపడఁ గుయ్యిడఁ గాంచి కృపాంతరంగుఁడై
బోడబుఁ డాతఁ డామృగయు వంకమొగం బయి పల్కె నల్కమై.

"శ్లో. మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచమిథు నాదేక మవధీః కామమోహితమ్" 139

ఆ. క్రౌంచమిథునమందుఁ గామమోహితమగు
నొక్కదానిఁ జంపి యుంటికాన
శాశ్వతంబులైన సమలు ప్రతిష్ఠ నీ
వూనియుండవ వినుమానిషాద. 140

వ. అని పలికి పలికినపలుకులు పలుమాఱు తలంచుచు శిష్యుం డగు
భరద్వాజుం గాంచి యి ట్లనియె. 141

తే. వ్యాధునిం గూర్చి పలికినపలుకు లెల్ల
పాదబద్ధాక్షరసమంబు పద్య మయ్యె
శాప మేకాక యిది రామచంద్రుచరిత
మంతయును దోపఁ జేసెడునట్టి దయ్యె. 142

వ. అని చెప్పినభరద్వాజుం డాపదంబు లన్నియుం ద్వ్యర్థిగలనై రామా
యణకథం బోధించునట్టివియ కాక ముప్పదిరెం డక్షరంబులసమశ్లో
కం బగుటకు సంతసించె ననంతరంబ గురుశిష్యు లిరువురును దమ

సాజలంబుల స్నానంబు గావించి మించిన వేడ్కఁ నయ్యర్థంబుల నే చింతించుచు నాశ్రమంబునకుం జనుదెంచి రంత నిధ్యానని ష్ఠాగరిష్ఠుండై వాల్మీకి బద్ధపద్మాసనాసీనుండై ధ్యానించుచున్న సమయంబున స్వయంభువు సాక్షాత్కరించి పూజితుండై విశ్ర మించి వాల్మీకిం గాంచి నారదోక్తం బగురామాయణార్థంబ సూ చించుచు నప్రయత్నంబుగ నీకాశ్లోకరూపంబున సరస్వతి ప్రసన్న యై నీజిహ్వాగ్రరంగంబునన్నాట్యమాడెం గావున నీవు నేటికిం బది వేలవత్సరంబులకురానున్న రామచరిత్రంబురామాయణకావ్యంబు గావింపుము నీ కందలిసత్యరహస్యంబు లన్నియుం గరతలామల కంబు లగు నని వరం బిచ్చి యచ్చటుయుం దిరోహితుం డయ్యె నంతఁ బ్రాచేతసుండును జలోపస్పర్శనంబు చేసి ప్రాచీనాగ్రంబు లగుదర్భలపై నాశీనుండై శతకోటిప్రవిస్తరంబు గను జతుర్వింశతి విస్తృతంబు గను గ్రంథంబు గావించె. 143

—♦ రామాయణమహత్త్వవ్యాప్తి ♦—

సీ. శతకోటివిస్తరకృత మహాకావ్యము
ప్రాచేతసునివరాశ్రమమునందుఁ
బ్రతిదినంబును మునుల్ పారాయణ మొనర్చు
వారైరి జయజయార్భటులు లెసంగఁ
దెలిసి వేల్పులు వచ్చి దివినుండి వినుచుండ్రు
క్రమముగా నిది యెల్లకడల మోసె
మాకు మా కని మూఁడులోకములం గల
వారు పో ర్వోటి రాభూరికృతికి

తే. అపుడు విష్ణువు దాని మూఁడంశములుగఁ
జేసి ముల్లోకముల కిచ్చి శిష్ట మైన
రామ యనునక్షరద్వయి వాసుదేవుఁ
డడుగ నిచ్చె మహామంత్ర మగుటఁ జేసి. 144

ఉ. తారక మద్ది శంకరుఁడు తాను బఠించుచు వేడికోలు గా
గౌరికిఁ జెప్పె నప్పిదపఁ గాశికఁ జచ్చెడుప్రాణికోటికిం

గోరి యొసంగి మోక్షమునకున్ దెఱువుల్ పొనరంగఁ జేయువాఁ
డై రహి మించె మంత్రమహిమాతిశయంబున సర్వపూజ్యుఁ డై 145

తే. శతము మూఁడవస్థానమై చనును గోటి
యెనిమిదవస్థాన మగు వానిహెచ్చువ నగు
నిరువదియు నాల్గు శ్రుతిమాత్ర కెనయునట్లు
సలిపె వేలుగ వెంకియు సంయమి కృతి. 146

క. శతకోటి విస్తరంబై
క్రతుభుక్శ్లోకముల నెసఁగురామాయణమం
దతికినవిషయము లెన్నో
యితరకృతిన్ సంగ్రహించె ఋషివరుఁ డెలమిన్. 147

మ. అది రామాయణ మేడుకాండములలో నారామవృత్తాంత మ
య్యది యెల్లం గలదై మహామహిమ గాయత్రీమహామంత్రసం
పదకుం దావలమై సమస్తజనసేవ్యంబై జగత్పాపతూ
లదవంబై పరమార్థదం బయి ధరన్ లక్షింపఁగా నయ్యెడిన్. 148

శా. ఆరామాయణకావ్య మెల్ల కడలన్ వ్యాఖ్యానముం జేయుచున్
వారు న్వీరు పఠింపఁ జొచ్చి రమరుల్ వర్ణింపనై రప్పు డం
కారాజ్యంబున నప్పులస్త్యముని వేడ్కం జేసి పారాయణం
బారంభించి పొనర్ప రావణుఁడు దా నాలించె నాద్యంతమున్

క. విని తనరాక్షసజన్మముఁ
జినఁ జేసి జయుం బొనర్పఁ జాలి నరుండై
జనియించు విష్ణుదేవుం
డనిమనమునయందు మిగుల హర్షము నొందెన్. 150

చ. నలువురు నాలకించునటు నాలినరుం డగురాముఁ డేడ? నన్
గలన వధించు టేడ? యిది కల్పితకావ్యము దీని ముజ్జగం
బుల నెవ రేఁ బఠించుటకుఁ బూనఁగ రా దటు చేయ రేని వా
రలతల లుండఁ బో వనుచు రాజసభన్ బ్రకటించెఁ గించునాన్.

వ. ఇట్లు శాసనంబు గావించి సాకేతంబునం గలుగునైయ్యోకులతోడి వైరంబు ప్రకటించుచు రామావతారం బెప్పు డెప్పు డని యువ్విళ్లూరుచిత్తంబునం దత్తన్మార్గంబు లన్వేషించుచుండె. 152

తరు.సతతము సాకేతసంస్థానమెట్లు
సంవర్ధితం బగుతన్మ్రపాలు రెవరు
పతు లైరి వే రెట్టివా రెట్లు రాష్ట్ర
పద్ధతుల్ నడపింతురు వారివృత్తాంత
మతం డెఱుంగుచు లోన నయ్యది యిష్ట
మైన ననిష్టత యగపడునట్లు
ప్రతిపదంబును బల్కి ప్రతిఘం జూపుచుం బ్ర
వర్తించుచుండెం బూర్వపుకాలమందు 153

—♦ ఇతరకవుల రామాయణములు ♦—

వ. ఇట్లు రామాయణకావ్యంబు సర్వలోకప్రసిద్ధంబై ప్రవృద్ధిం గాంచె నది యంతయు సవిస్తరంబుగం జెప్పెద నవధరింపుం డని. 154

శా॥ వల్మీకప్రభువుం డొనర్చినపయిన్ దాచంయమీంద్రుల్ ఘను
త్వే త్వే లంచు నుతించుచందమున శ్రీ లీలంగం జేరంగవ
ప్రాల్మెల్కల్లనునట్లు కట్టిరి తగన్ రామాయణంబుల్ జగం
బుల్ మోదింపంగం బెక్కుమార్గముల సంబోధించుచున్ బోధముల్.

వ. అందు వసిష్ఠరామాయణము నధ్యాత్మరామాయణము నారద రామాయణము నగస్త్యరామాయణము హనుమద్రామాయణము లఘురామాయణ సంగ్రహరామాయణము బృహద్రామాయణము సారరామాయణము దేహరామాయణము వృత్తరామాయణము బ్రహ్మరామాయణము భరద్వాజరామాయణము శివరామాయణము భరతరామాయణము కౌంచరామాయణము జైమినిరామాయణము యాజ్ఞవల్క్యరామాయణ మాత్మరామాయణము జటాయురామాయణము రవిరామాయణము పులస్త్యరామాయణము దేవీరామాయణము గుహ్యరామాయణము మంగ

శరామాయణము సుతీక్ష్ణరామాయణము సుగ్రీవరామాయణము
విభీషణరామాయణ మానందరామాయణము లోనగువేనవేలు
రామాయణంబులు సంస్కృతంబునను భాస్కర.కందాదిరామా
యణంబులు వేనవేలు దేశభాషలందును వెలుఁగొందుచుండు. 156

ఉ. అన్నిటిలోని చిత్రము ల నన్నియు నొక్కటి గాఁగఁ జేర్చుచున్
విన్ననువొప్ప రామకథ వీనులవిం దగునట్లు చేసి మా
మన్నన లీవు పొందు మని మామునిసంఘము కోరుచుండె నో
సన్నుతమూర్తి! నీ విపుడు స్వస్థుఁడవై వచియింపు మింపుగన్ 157

తే. ఓమనోరమ! రామ! శ్రీరామ రామ
రామ యని వల్కు మా రామనామ మితర
నామసాహస్రతుల్యమై ననుచు ననుచు
శివుఁడు మునుఁ బార్వతికిఁ గూర్చి చెప్పెఁ గాదె. 158

తే. రా యనుడు లోనిపాపముల్ పాయు వెలికి
నంత నవి లోనికి న్వెండి నరుగకుండ
మా కవాటము వై మూయు మార్గము నది
రామనామమహత్త్వ మీరహిఁ దలిర్చు. 159

వ. అట్టిరామనామము మావీనులలం బడునట్లు నేఁడు మాకు రామాయ
ణసారసర్వంబు జెప్పు మనుటయును. 160

తే. అతఁడు వారలఁ గనుఁగొని యనియె నిట్లు
నూఱుకోట్లు ప్రవిస్తరమై రహించి
రామకథ పెక్కువిధములఁ గ్రాలు దాని
సర్వమును మీకు నేఁ జెప్పఁ జాలఁ గలనొ. 161

తే. అయిన నముఁ బెద్ద చేసి మీ రడిగితి రని
సర్వరామాయణంబులసార మేను
సంగ్రహించి వచించెద సదయహృదయు
లార! కరుణించి వినుఁ డిదే ప్రార్థనంబు. 162

## —♦ అయోధ్యాపురవర్ణనము ♦—

మ. సరయూతుంగతరంగిణీతటలసత్సౌధోపరిస్థాపితో
త్తరవజ్రోపలఘూర్ణమచ్ఛ్రిత మహోదగ్రప్రభాదిత్యమై
వరణా భావిశదీకృతక్షణదమై భాసిల్లు సాకేతమన్
పుర మొక్కం డలకోసలక్షితిగళస్ఫూర్జత్సురత్నంబు నాన్. 163

క. ఉత్తరకోసలములలో
నుత్తమమై పేరు గాంచి ద్యుమణిమహోవం
శోత్తరసంస్థానం బై
పత్తనరాజం బయోధ్య పరఁగుచు నుండున్. 164

తే. మోక్షదములలో ము న్నెన్నఁ బొసఁగుప్రోలు
ప్రోలువలె నొప్పువీథులచాలు చాలు
చాలు ననునన్ని పాలిచ్చునాలు నాలు
బిడ్డల నెసంగు గేస్తులదొడ్డమేలు. 165

తే. గోపురము నాఁపునాపురగోపురములఁ
జెలఁగుసౌవర్ణసాలభంజికలు ప్రోలి
మేలుసింగారమును జూచి మేను మఱచి
మాఱునువడి యున్నయచ్చరచాన లనఁగ. 166

మ. వరసరయూనదీపులినభాగ సమంచిత హంసతూలికా
స్తరణదుకూలజాల విలసన్నవదంపతు లుష్ణరాత్రులన్
దరగలు వోలె మాటికిని దక్షిణదిగ్గతవాతపోతముల్
పఱపుచు సూక్ష్మశీకరములం బయి వీవ సుఖంతు రెంతయున్.167

సీ. చందురుఁ గఱఁగించి కందు వేసలియందు
వేసి నెమ్మోములు వెలయఁ జేసి
చిందంబులను నల్చి యందలి తెలి నవ్వు
లం దిడి గొంతు లింపొందఁ జేసి
మించుల జతకూర్చి చంచలత్వము చూపు
లం దుంచి మేనుల నాచరించి

తమ్మిమొగ్గలు నేర్చి కమ్మతేనెలు వాకు
లం బూన్చి చన్గవ లింబుపఱచి
తే. బమ్మ యవ్వీటికొమ్మల నెమ్మిఁ జేసి
పురుగు గొఱికినకట్టి నక్కఱ మొకండు
తేలు నటు లచ్చిచేత యాదృచ్ఛికంబ
యనెడుదట్టును బోఁగొట్టుకొ . యె నపుడు. 168

మ. సురలోకాదులకన్న మిన్న యగుసీత్కోణీస్థలిం బొల్చునా
సరయూతీరమునందుఁ బొందుగ నివాసంబుం బొనర్పంగ మున్
హరిదశ్వాన్వయసంభవుండు మను వత్యంతేచ్ఛ నిర్మించెఁ బో
లరికిన్ గెల్వఁగ రానియ ట్లయి యయోధ్యాఖ్యాతికిన్ బ్రాతియై.

తే. పొడుగు పండ్రెండుయోజనంబులు వెడల్పు
మూడుయోజనములు గల్గి ముదము వెంచు
సొబగునన్ సువిభక్తమై సోమసూర్య
వీథులం బొల్చెడు నయోధ్య విపులరథ్య. 170

సీ. నలుగడం బన్నిటఁ గలయంపి గావించి
పూలు చల్లుదురు రేపులును మాపు
లట సర్వయంత్రాయుధావళియు శతఘ్ను
లం దందు నిలుపుదు రబ్రె మెసఁగ
నత్యున్నతాట్టాలకాదులు తోరణ
ధ్వజము లప్పురి నాల్గుదారుల నగు
స్త్రీలనాటకసంఘశాలలు పెక్కు లా
వీటి కలంకృతి వెంచుచుండు

తే. దుర్గగంభీరపరిఖయు ద్యుతి నెసంగు
నున్నతోన్నతసాలము నురుతరారి
జనమనోభీః ప్రదం బయి కనఁగ వచ్చు
హయగజోష్ట్రఖరాపూర్ణ మాపురమ్ము. 171

మ. బలికర్మావృతులై నిరంతర మటన్ వర్తింతురి సామంతరా
జులు నానాస్థలవాసులైనవణిజుల్ జోహారు లర్పించుచున్
విలసద్రత్నచయమ్ము లమ్మెదురు తద్వీథీతలాగారముల్
బలభిత్పత్తనమధ్యభాగవిలసత్ప్రాసాదముల్ నాఁ దగున్. 172

శా. కూటాగారము లెన్నియేనియు జగిం గోల్కొంచెఁ బిసాళించెడున్
మేటుల్ వారవధూటు లప్పురమునన్ మేలాడుచు న్వేడుకన్
బాటల్ పాడుచు సంచరించెద రటన్ బ్రాహ్మణోపరాహ్ణంబులం
గోటు ల్కోటులు శాలితండులము లేగో డందు లే దెందునున్. 173

తే. సాంగవేదపారంగతుల్ సాగ్నిహోత్రు
లయినవిప్రులు నిశితశస్త్రాస్త్రవిదులు
క్షత్రియులు కోట్లకుం బడగలను బెట్టు
వైశ్యు లుత్తము లట శూద్రవరులు గలరు. 174

తే. సత్యవాదులు ధార్మికుల్ సజ్జను లట
నుందు రే కాని నాస్తికుల్ మందమతులు
క్రూరకర్ములు పాపులు లే రటంచుఁ
జెప్ప నొప్పు నతిశయోక్తి చేర దందు. 175

క. నాలుగుజాతులయందుం
స్త్రీ లైనను బురుషులైన దేవాతిథిపూ
జాలాలసులై సత్యగు
ణాలంకారములు గలిగి యలరుదు రందుం. 176

—♦ అయోధ్యాపుర రాజకథనము ♦—

వ. ఏతాదృశమహిమాతివిశాలంబై భూతలంబున విఖ్యాతి వడసిన సాకేతంబున కధినేతలై ఖద్యోతవంశసంభూతు లెసంగి రవ్వారి ననుక్రమంబుగం జెప్పెద నాకర్ణింపుఁ డాదినారాయణునినాభీపద్మంబునఁ బరమేష్ఠి యవతరించె నతనికి మరీచి జన్మించె మరీచికిఁ గశ్యపుఁడు పుత్రుం డయ్యె నతనికి సూర్యుం డుదితుండయ్యె నాత

నికి వైవస్వతుండు పుట్టె మనువయ్యె మనువున కిక్ష్వాకుం డతని పేర సూర్యవంశ మిక్ష్వాకువంశంబు నాఁబడె నిక్ష్వాకునకు వికుక్షి వికుక్షికిఁ బురంజయుండు పురంజయునకుఁ గకుత్స్థుండు పుట్టెరి కకుత్స్థుని పేర సూర్యాన్వయభవు లెల్లరుం గాకుత్స్థులు నాఁబడి రక్కకుత్స్థునకు ననేనుండు నాతనికి బృథుచక్రవర్తి పుట్టె నతనికి యువనాశ్వుండు నాతనికి శాంబస్తుఁడు. శాంబస్తునకు బృహదశ్వుండు వానికిఁ గువలయాశ్వుండు కువలయాశ్వునకు దృఢాశ్వుండు నతనికి హర్యశ్వుఁడు వానికి నికుంభుఁడు నికుంభునకు బర్హాణాశ్వుఁడు వానికిఁ గృతాశ్వుఁడు వానికి శ్యేనజిత్తు వానికి యువనాశ్వుఁ డతనికిఁ మాంధాతయు మాంధాతకుఁ బురుకుత్సుండు పురుకుత్సుండు చక్రవర్తియై ప్రఖ్యాతిం గాంచె నతనికి రెండవత్రసదశ్వుఁడు వాని కనరణ్యుండు నతనికి హర్యశ్వుఁడు హర్యశ్వునకు నరుణుండు నరుణునకుఁ ద్రిబంధనుండు నతనికి సత్యవ్రతుం డనంబడు త్రిశంకుఁ డుదితుం డయ్యె నతని కారణంబునన విశ్వామిత్రుండు స్వర్గంబునకు మఱియొక స్వర్గంబు నిర్మించె నా త్రిశంకునకు హరిశ్చంద్రుం డతండు సత్యవాదియై స్వర్గంబునకు నిర్గమించి పదునాలుగు వేల మన్వంతరములింద్రు నర్ధాసనంబున నాశీనుండుగా నయ్యె నా హరిశ్చంద్రునకు లోహితుండు వానికి హరితుఁడు హరితునకు జంపుఁడు జంపునకు సుదేవుండు సుదేవునకు విజయుండు విజయునకు భరుకుఁడు భరుకునకు వృకుఁడు వృకునకు బాహుకుఁడు బాహుకునకు సగరుం డతని కారణంబున సాగరు లఱువదివేగురు కపిలుకోపానలంబున దగ్ధులగుటయు సముద్రమునకు సాగర మని పేరు వచ్చుటయును సంభవించె నా సగరునకు నసమంజసుండు వాని కంశుమంతుఁడు వానికి దిలీపుండు వానికి భగీరథుం డితండు నిజతపఃప్రభావంబున దేవదేవుని మెప్పించి గంగానదిం దెచ్చి పితృదేవతలకుఁ దర్పణంబు గావించె నతని పేరనే గంగ భాగీరథి నాఁబడె నా భగీరథునకు శ్రుతుండు సుతుం డయ్యె శ్రుతునకు నాభి నాభికి సింధుద్వీపుఁడు సింధుద్వీపునకు నయుతాయు వతనికి ఋతుపర్ణుండు వానికిఁ గల్మాషపాదుండు నాఁబడు సుదాసుండు సుదాసునకు నశ్మకుండు వానికి మూలకుఁడు

వానికి దశరథుండు వానికి నైడబిడుఁడు వానికి విశ్వసహుఁడు విశ్వసహునకు ఖట్వాంగుఁడు ఖట్వాంగునకు దీర్ఘబాహుఁడు దీర్ఘబాహునకు దిలీపుఁడు దిలీపునకు రఘుమహారాజు జనించి చేసినమహోన్నతకార్యంబులం జేసి సర్వోన్నతుం డయ్యె నిక్ష్వాకు వంశంబు రఘువంశంబు నాఁబడె నారఘువున కజమహారాజు పుట్టె నిట్లుపుట్టినవారు చక్రవర్తులు మహానుభావులు నఖండకీర్తికాంతా లలాములు నై పరమపదంబు నొందిరి వారియనంతరం బజమహా రాజపుత్రుండై త్రేతాయుగాలంకారుండై. 177

—♦ దశరథునివృత్తాంతము ♦—

చ. దశహరిదంతరాచలదుదంచయ కీర్తిరమాలలాముఁడుం
బశుపతిభక్తికాముఁడు సమస్తనరేశ్వర సుప్రశస్తరు
గ్విశదమణీకిరీట పరివేష్టితసాధుపతాభిరాముఁడున్
దశరథనాముఁ డొప్పు వసుధ న్విబుధాహితదుర్విరాముఁడై. 178

సీ. విబుధకోటుల నేలుబిరుదరాజేంద్రుండు
వరజాతవేదుఁడై వఱలుశుచియుఁ
దగవుల సమవర్తి యగుధర్మముఖ్యుండు
పూర్ణకర్బుర మబ్బుపుణ్యజనుఁడు
నపరాశఁ బూరింప నగుభువనేశుండు
సజ్జగత్ప్రాణుఁ డౌ సత్వమూర్తి
యొనర సర్వజ్ఞప్రియుం డైనధనదుండు
ద్విజరాజు శిరముపైఁ దేల్చునీశుఁ

తే. డీమహామహుఁ డష్టదిగీశమాత్ర
లంది జనియించె నని జగమందు మిగుల
వినుతికెక్కెను జగదేకవీరుఁ డగుచు
దశదిశాంచితరథుఁ డ ల్లదశరథుండు. 179

శా. వేలుఱ లక్షలు పంక్తులై రథము లాపృథ్వీతలాధీశ్వరా
భీలాయోధనరంగమం దెపుడు నుద్వేలంబుగా నిల్చి వై

ర్యాలోకాతిభయంకరంబు లగుచున్ హర్వొందుటం జేసి భూ
పాలుం డాతఁడు పేర్పడెన్ దశరథప్రఖ్యాతికిం బాత్రమై. 180

తరళము. అతిరథుండు మహర్షికల్పుఁ డనంతవిక్రమసారని
ర్జితసపత్నచయుండు ధన్యుఁడు శీలవంతుఁడు శాంతుఁ డా
ర్జితయశస్కుఁడు శక్రతుల్యుఁడు జీవసన్నిభబుద్ధిసం
యుతుఁడు పంక్తిరథుండు రాజయి యుండె నమ్మనువుం బలెన్.

సీ. సత్సంతుల నిల్పునాత్మకుఁడు సర్వ
చక్రంబులను నేలుసత్ప్రభుండు
దోషాకరుఁడు గాని యోషధీశుం డెప్డు
సన్నగింపని కళాశస్తమూర్తి
యకలంకుఁ డైనమహావిధుం డెందు ని
శాటత్వ మొందనియట్టిరాజు
గురుగద మొందనికువలయమిత్రుండు
విషరాశిఁ బొడమనివిశదకీర్తి

తే. అతఁ డనఁ బిత్రుపైతామహమైనరాజ్య
మును దమము వోవఁ బాలించుచును ధరిత్రి
నఖిలధర్మపరాయణుం డగుచు దశర
థావనీనాథచంద్రముం డలరుచుండు. 182

చ. ఇలఁ గలశత్రుసంతతుల నేరి జయించుటె కాక నాకభూ
తలపతిసఖ్యముం గలుగుదాన నటం బసుచుండుపోరులం
బిలువఁగ నై దివంబునకు బీర మెసంగఁగ నేగి దేవవై
రులఁ గడతేర్చి వచ్చెడు నరుంతుదుఁ డాతఁ డనంతకీర్తియై. 183

తే. తండ్రిపిమ్మట రాజయి దశరథుండు
మంత్రిసామంతముఖ్యుల మంతనమున
ధరణి యేలుచుఁ బెండ్లాడఁ దగిన యీడు
గలిగి మెలఁగుచు నుండె నక్కాలమందు. 184

వ. అట్లు రాజ్యరమాధురంధరుండై ధరిత్రీతలంబున ధర్మావతారం
బని పేరుపొందినదశరథుండు రాజ్యాంగరక్షకులు దక్షులు మంత్రజ్ఞు
లింగితజ్ఞు లగువారు ధృష్టి జయంతుఁడు విజయుఁడు సిద్ధార్థుఁడు
నర్థసాధకుఁడు నశోకుఁడు మంత్రపాలుఁడు సుమంత్రుఁ డనునెనమం
డ్రగునమాత్యశేఖరుల రాజకృత్యానువర్తులం దనచెంత నుంచు
కొని సుయజ్ఞ జాబాలి కాశ్యప గౌతమ మార్కండేయ కాత్యా
యన ప్రభృతిమహర్షుల నాశీర్వాదంబు లందుచు వసిష్ఠవామదేవులు
గురువులు పురోహితులుగ నై తన్నుఁ గంటికి ఱెప్పవలెనై కాచి
రక్షించుచుండఁ బిడుగుపిల్ల లనం బోలి యాలంబుల నోలం బాస
గొనకుండువారు కోటానఁగోటులు వీరాధివీరభటులు గలిగి సకల
ప్రజారంజకుండై రాజ్యపాలనంబు గావించుచుండె నప్పుడు. 185

—♦ దశరథునివివాహసందర్భము ♦—

సీ. సాకేతపురరాజ్యసన్నికృష్టంబున
దక్షిణకోసలస్థాన మలరు
నట రాజు కోసలాహ్వాయుఁడు కౌసల్య యన్
తనకన్య నజపుత్రునకు నొసంగఁ
దలఁచి చెప్పుటయు నాతఁడు బందుగులతోడఁ
దరలి వచ్చెను శుభముహూర్తమున కపుడు
నౌక దాటుచునుండ రావణుం డరుదెంచి
ముంచి నావను గన్యఁ గొంచుఁ బోయి

తే. పెట్టెలోఁ బెట్టి సంద్రమం దట్టె వైచె
దశరథుం డెట్లొ మున్నీటి దరినిఁ జేరి
యరసెఁ బేటిక నచ్చటఁ దెరచి దాని
లోనఁ గాంతామణింగాంచి లోన నలరి. 186

వ. కాంతామణివృత్తాంతం బంతయు నాలకించి తాను దశరథుండ
నని తనవృత్తాంతం బెఱింగించి పాణిగ్రహణంబు చేసి పైకి లేవ నెత్తి

సేద దేర్చుచుండె నంతలో నలుగడల రోయుచుఁ బరివారపరివృ
తుం డగు సుమంత్రుండు వచ్చి వారి నరసి రాజధానికిం గొని
పోయి కోసలాధిపతికిం జెప్పిన నతండు సంతసించుచు వారికి వివా
హమహోత్సవంబుగావించి తనరాజ్యం బల్లున కరణంబుగ నిచ్చి
తాను దపోవనంబున కరిగె నది మొదలు దక్షిణకోసలంబులును
సూర్యాన్వయరాజుల కయ్యె ననంతరంబ మగధరాజతనయ యగు
సుమిత్రను గేకయరాజపుత్రిక యగు కైకేయినిం గరగ్రహణంబు
గావించి పెండ్లియాడి వేడుకమెయి నవల నర్ధసప్తశతాంగనలం
దెచ్చి పరిణయం బయ్యె. 187

ఉ. లోకములోని సుందరులలోపలఁ గైక సురూపసంపదన్
గైకొని యుండె నంచు వినఁ గల్గినఁ పంక్తిరథుండు వేఁడుకన్
గైకను బెండ్లియాడుతటిఁ గైకకుఁ బుట్టినపట్టిఁ గోసల
క్ష్మాకధినాథుఁ జేయ నుడి సల్పెఁ బ్రమాణగతు ల్బ్రసంగఁగన్.

వ. ఇట్లు వివాహితుం డైనదశరథుండు పూజ్యసామ్రాజ్యంబేలుచు.

ఉ. పాడియుఁ బంటయుం గలిగి బల్సిరులం దులదూఁగుచుండునా
ఱేఁడు సభార్యుఁడై తగుతటిం గురియ న్నెల మూఁడువాన లే
గోడును లేక భూప్రజకుఁ గోరుసుఖంబులు దొప్పదోఁగఁ దాఁ
బాడిగ రాజ్య మేలుచును భాసిలుచుండె మహీతలంబునన్. 190

వ. అని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని
సూతు నడుగుటయును. 191

ఆశ్వాసాంతము.

ఉ నాకును నాదుతండ్రికిని నాదగుతల్లికి నాదుతాతకు
న్నాకొక రామభక్తియ ఘనం బగుఁ గావున నాదుపేర లో
కైకవిభుండు రాముకథనే రచియింపు మటంచు వేఁడుసు
శ్లోకుఁడు పొల్చునీదరకులుం డగువేంకటరాయఁ డున్నతిన్. 192

క. మేలని మెచ్చుగఁ గృతితాం
బూలం బిడి సభను నన్నుఁ బూజించినవి
ద్యాలోలుఁడు వేంకటరా
వేలూర న్మేటి యగుచు నెసకమెసంగున్. 193

గద్యము

ఇది శ్రీమహామహోపాధ్యాయ కలాప్రపూర్ణ కవిరాజ
కవిసార్వభౌ మాంధ్రవ్యా సాభినవశ్రీనాథ వేదవిద్యా
విశారద శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతం
బైనశ్రీకృష్ణరామాయణంబునందు
బాలకాండమునఁ బ్రథమాశ్వాసము.
శ్రీశ్రీశ్రీ

శ్రీరస్తు.

# శ్రీ కృష్ణరామాయణము

## బాలకాండము

### ద్వితీయాశ్వాసము.





క. శ్రీమద్రామాయణకృతీ
గామించి ప్రయత్నపూర్వకంబుగఁ గృష్ణుం
బ్రేమించిన వేంకటరా
యామాత్యుఁడు భాగ్యవైభవాన్వితుఁ డగుతన్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు దశరథుండు మహోన్నతంబుగా రాజ్యపాలనంబు గావించుచున్న కాలంబున దేవలోకంబున. 2

—• దశరథుఁడు కైకతో దేవలోకమున కరుగుట •—

మత్త. దేవదానవయుద్ధ మప్పుడు తీవ్రమై కన నయ్యె నా
దేవవల్లభుఁ డింద్రుఁ డారఘుదీపకుం బిలువంగ నా
భూవరుండు చతుర్విధం బగుభూరివాహినితోడఁ దాఁ
బోవ నుంట యెఱింగి కైక సముత్సుకత్వముఁ జూపుచున్. 3

వ. ప్రాణేశ్వరుం జేరఁ బోయి యిట్లనియె. 4

మ. సురలోకంబున దేవదానవులసంస్ఫోటంబు మేటిల్లె నం
దిరువాఁగున్ సరితూఁగి పోరుకొనుచో నింద్రుండు మీసాయముం
గర మర్థించుట మీరు సైనికులు వేగం జూచుచున్నా రటం
చరగా వింటిని నిక్కమేని తను రా నర్థాంగి వాంఛించెడిన్. 5

ఉ. ఎన్నఁడు గోరదేమియు మహీపతిపుత్రిక గానఁ గయ్యముం
గన్నులఁ జూడఁ గోరెడిని గాంక్షితము న్నెఱవేర్పఁ డంచుఁ దా
నెన్నియొ చెప్పవచ్చె నన నేలిక దానికి నింతయేటి కో
సన్నతగాత్రి ర మ్మటఁచె స్వర్గముఁ జూచుటయున్ లభించెడిన్.

తరు. అని పల్కి దశరథుం డావనజాక్షి
నరదంబుపై నెక్కు మని సైన్యములను
గొని స్వర్గపురమునకుం జని యచట
ఘోరయుద్ధము జరుగుచునున్నఁగాంచి
తనవాహినియుఁ దాను దైవతపతియు
దళముతోఁ గూడి యాదైత్యులతోడ
ఘనరణ మొనరించెఁ గైవడి మెఱయఁ
గఱకుటమ్ములు నైచి ఖలులను రాచె. 7

తే. రాచి సునిశితబాణము లేచి చిత్త
జల్లుగా రక్కసులమీఁదఁ జల్లుటయును
నిలువఁ జాలక వారెల్లఁ గలను విడిచి
చెట్టొకఁడు గాఁగఁ బాఱిరి చేవ దక్కి. 8

—♦ దే వ దా న వ యు ద్ధ ము ♦—

ఉ. పాఱెడువేళ వారిదళవాయి సెబాసిటు లుండునే నిసీ!
పోరను బ్రాణభీతి గొని పో నయశం బగుఁ గాక మృత్యు వా
పాఱెడుచోట లేదె విధివ్రా లెటు లేనియుఁ దప్పునోటు మీ
వారలకీర్తియే నరసి పాడుకొనుం డన సోఁకుమూఁకలున్. 9

తే. మానమున నాఁగి క్రుక్కెడుప్రాణ మరయ
నెట్లు పోవునో పోవు న దేమి దిరము
యనిఁ దెరలి పాఱ నయశ మా ననుచు మరలి
మఱి కవిసి రొక్కపరి చీమపరి యనంగ. 10

వ. కరిసి తోమర భిండివాల కరవాల పరశు పట్టస గదాసి కుంత
పరిఘాదిసాధనంబుల నొక్కపెట్టునం జుట్టుముట్టి తెట్టులు గట్టునట్టు

గొట్టుటయు నట్టియెడ నన్నరనాథుండును నిబిడఘనాఘనచ్ఛ
న్నదినవాథునివిధంబునఁ బథం బెఱుంగకుండియు బెండువోక కొక్కిం
తవడికి నుక్కుమిగిలి మొక్కలంబుగాఁ దెరపియీని బాణపరంపరల
నరులం జించి చెండాడునప్పు డుభయబలంబులు నభయపరాక్ర
మంబునం డీకొనియె నందు నింద్రుని మదాంధుండును, నగ్ని
నగ్నిరోముండును, ప్రేతపతి భూతవాహుండును, నిరృతి నవిర
తియు, వరుణు నుగ్రకరుండును గాలిఁ గాలపాశియుఁ గుబేరు గభీ
రుండును, నీశానుం గీశేశుండును, దశరథభూతలాధిపతి నముచి
భ్రాత లగుయాతుధానులును, దక్కనుం గలరథుల రథులును,
హాస్తిపకుల హాస్తిపకులును, సాదుల సాదులును, సుభటుల
సుభటులును, గదిసి బలోద్ధితపరాగపటలంబు పటువిశిఖక్షతసము
ద్భూతకీలాలం బడంప ధనుర్విముక్తబాణ పరంపరామేఘసంఘా
తాంధకారంబు కరవాలప్రభాజాలం బపనయింప రథులు విరథు
లుగ సారథులు వీతమనోరథులుగ నేనుంగులు పీనుంగులుగఁ
దురంగంబులు వికలాంగంబులుగఁ బత్తులు విపత్తింబడ డొక్కలు
ముక్కలుగఁ బదంబులు తెగిపడఁ గాళులు కీలూడి నేలపాలుగ
నడుములు విఱుగఁ జేతు లూడఁ గుత్తుక లుత్తరించుకొనఁ దలలు
తిలప్రాయంబులుగఁ గేక లనేకంబులు నాకంబు ముట్ట నట్టహాసం
బులు బిట్టడరఁ గరవాలతోమరభిండివాలాదిసాధనంబుల నసాధా
రణవిక్రమక్రమంబునఁ బోరినపోరు ఘోరం బయ్యె నయ్యెడఁ గేశ
శైవాలంబులు నధరప్రవాళంబులును బాహులతలును జంఘామక
రంబులును నఖరరత్నంబులును గీలాలకీలాలంబును గలిగి సంగ
రాంగణంబు గంగాప్రవాహంబుపగిది రథహస్తిపత్తితురంగాది కళే
బరంబుల మోచుకొని ప్రవహించె నట్టియవసరంబున. 11

క. ఇంద్రాదులఁ గదిసినదై
త్యేంద్రులు దా రుక్కుమిగిలి యెక్కటికలనన్
సాంద్రాంబకములఁ బరపియుఁ
దంద్రత గొని పోరి పాఱఁ దఱిమిరి రిపులన్. 12

—♦ దశరథుఁడు దానవుల నుక్కడంచుట ♦—

ఆ. దశరథావనీంద్రుఁ డాఁకినసోఁకుల
మూఁక లెల్ల వీఁకఁ బోరి పోరి
ఘోరతరము లైననారాచశస్త్రాస్త్ర
ములను మునిఁగి తేలి పొలిచి రపుడు. 13

మ. నియతి న్వింట సమంత్రకంబుగను నాగ్నేయాస్త్రసంధాన మొం
తయుఁ గావించి పరాక్రమంబున నయోధ్యానాథుపై నేసి భూ
డయితా! వచ్చెడు కాచికొ మ్మనుచు నౌద్ధత్యంబుమై దానవుల్
వియదంతస్థలులెల్ల భేదిలఁ గడుం బెల్లార్చి రొక్కుమ్మడిన్. 14

శా. ఆదివ్యాస్త్రము విస్ఫులింగవిసరం బాభీలకీలౌఘముల్
రోదస్యంతర మంత నిండఁగఁ గడున్ ఘోరక్రియన్ రాఁగ నం
దాదిత్యుల్ శలభాయమాను లగుచున్ హా భూమినాథా! మమున్
స్వాదుస్వాంతులఁ బ్రోవుమం బొదిగి పశ్చాద్భాగముం జేరుడున్.

మ. వెరకుం డేఁ గల నంచు భూమిపతి వేవే వచ్చునచ్చిచ్చుటం
పర ధైర్యమ్మున వారుణాస్త్రమునఁ దా వారించి పైపై పరం
పరలై వచ్చెడురాక్షసాస్త్రము లొగిన్ బ్రత్యస్త్రముల్ వైచి సం
హారణంబుం బొనరించి తోఁచె నరుల న్నాకౌకసుల్ మెచ్చఁగన్.

శా. చండప్రక్రియ నట్లు దోర్బలలసచ్ఛౌర్యం బవార్యంబుగా
దండుం దర్లఁగఁ జేయుచున్ నృపతి కోదండోగ్రమౌర్వీరవో
ద్దండారావమునన్ దెసన్ పదియు నత్యంతంబు మార్మ్రోయ ను
గ్రుండో నా నెటఁ జూడఁ దాన యగుచున్ గోరాడి పోరాడుచున్.

మ. సముచిభ్రాతలు వీఁక దాఁకి శరసంధానంబు గావించి వి
క్రమ మొప్పం బృథివీశ్వరుం బొదివి వర్షం బాఁగున ట్లేయుచున్
సమయం బేదియ నెల్ల రొక్కపరి తచ్చక్రంబు నొనేయ వీఁ
గి మహిం దే రొరుగంగ నాయితపడె న్గీర్వాణు లయ్యో యనన్.

క. రణసంభ్రమమున నొఱుగుట
లణుమాత్ర నృపుం డెఱుంగఁ డాకైక వడిన్

ప్రణుతింపఁ బాణి నాఁగ రఁ
మణఁ జక్రి మవక్రవిక్రమ క్రియ మొప్పఁగన్. 19

తే. అసురబాణాహతిం జేసి ప్రాణవిభుని
రథమునక్షము విఱుఁగ నారథము నోడి
గిల్లులో నామె తనచేయిఁ గ్రిందిదెసకుఁ
జాచి పట్టెను బడకుండ స్యందనంబు. 20

శా. దానం జేసి యథాస్థితిన్ రథ మిలన్ దండప్రణామంబు గా
కానందంబుగఁ జక్కనై నిలువ గోత్రాధీశ్వరుం డమ్ములం
బౌనఃపున్యము గాఁగఁ [illegible]కసముని భ్రాత్రాదులన్ శత్రులన్
దా నాసంయమనీపురాతిథులఁగా దర్పంబునం జేయుచున్. 21

మ. రథులున్ సారథులున్ గరుల్ హయులు రారాజుల్ పదాతుల్మహా
రథముల్ సాదినిషాదులు న్నశిసిపోఁ ద్రస్తాత్ములై తక్కువా
ర్పృథులార్తిం బఱవంగఁ బో రడఁగె నవ్వేళ న్నృపర్యుల్మనో
రథసిద్ధిం గొని మెచ్చి రా దశరథుల్ రాజాధిరాట్సారథుల్. 22

క. ఈతీఱున విజయముఁ గొని
భూతలపతి దేవతాప్రపూజ్యుం డగుచున్
గౌతుకమున వీడ్కొని సా
కేతంబున కరిగె మహిషి కెలకులఁ బొదలన్. 23

వ. అరిగి నగరుకడ నవతరణంబు సేయునప్పుడు రథం బొడిగిల్లుటం
గని రాజతల్లజుండు డిల్లపడి యప్పల్లవాధరిం గని యిది చిత్రం
బనిన నామె యిట్లనియె. 24

తే. చిన్ననాఁట నే నొకమునిశేఖరునకుఁ
గరములన్ భారమును బూనఁ గలిగి సేవ
చేసితిని దాన నతఁడు నీచేతు లరయ
వజ్రసారము లగు నని వర మొసంగె. 25

చ. దుర మొనరించునప్డిఱుసు త్రుళ్ళిపడెన్ బనునప్డు తే రిలన్
దొరగకమున్న నే నరసి తోడన నాచెయి వెట్టినిల్పితిన్

సరవర! చూడ వీ వని ననారతముం మదిఁ జొన్పియుంట నా
దొర విని సంతసంబు మది దొప్పలుదోరలు గాఁగ ని ట్లనున్. 26

మ. అతివా! నీకతనం గదా రణమునం దాదిత్యశత్రుక్షయం
బతిశౌర్యంబునఁ జేసి వాసి విబుధేంద్రార్ధాసనస్థుండ నై
స్తుతియింపంబడి దేవదత్తకుసుమస్తోమేష్టగంధంబు ది
క్తతిఁ బర్వం జనుదెంచినా నిట కమర్త్యప్రాభవం బేర్పడన్. 27

అ. సకియ నీదుసాహసమునకు మది మెచ్చు
వచ్చె రెండువరము లిచ్చువాఁడ
వేఁడు మనిన వెలఁది వేఁడెద వలసిన
యప్పు డంతదనుక నట్టె యుంచు. 28

వ. అనిన నట్లు కావుత మని వరం బొసంగి మహిపీ త్రయసమన్వి
తుండై పూజ్యసామ్రాజ్యం బేలుచు సుఖం బుండె నాసమయం
బున నొక్కదివసంబున. 29

—♦ దశరథునికడకు చెంచుఱేఁడు వచ్చుట ♦—

మ. కలపం బద్దిననీలికొక తలపాగా పీలిపూఁదావళం
బులు సింగంబులచుంచు దండకడియంబుల్ లేడి లేఁదోలు కా
సెలు విండ్లమ్ములు కత్తు లీటె లలరుం జేకట్లు పెన్నెమ్మికుం
చెలునుం గల్గినచెంచుఱేఁ డొకఁడు వచ్చెన్ అచ్చకు న్మెచ్చుటన్.

వ. వచ్చి రాజదర్శనంబు గావించి జల్లులునుం బునుఁగుఁబిల్లులును
లేడిపిల్లలును పికిలిగరుల నల్లినబాణంబులును గస్తూరియుఁ గుస్తుం
భరియుఁ జారపప్పు వెదురుబియ్యము దేనెపెరలు లోనగు కానన
సంపాదితంబు లగునవి కానుకలు వట్టి నెట్టుకొన మోఁపుఁగేలు
ఫాలంబునం జేర్చి పేర్చినభక్తి ని ట్లని విన్నవించె. 31

ఉ. జియ్యా! హసాదు నామనవి చేకొని చిత్తమునం దలంపు మా
యయ్యలకొండఁ గారడవి నాఁడుల నల్లినయిండ్ల గూడెమం
దెయ్యెడ నైన మీకరుణనే సత మంచుఁ దలంచుచుండునన్
బయ్యనచెంచు చెంచుదొర బల్వగునేర్పు గలాడ వేటలన్. 32

శా. సామీ! యోమని దీమసం బగుచునెంచం జెల్లి ముక్కారు లే
మామిళ్ళందలిపూవుఁ దేనె చివురుం బండ్లుం గడున్ మెక్కి మ
త్తామెఁ దేటులు కోయిలల్ చిలుకలున్ దాదాపుగాఁ గూయుచో
మే మెప్పున్నడయాడుచుందు మడవిన్ మీసేమముం గోరుచున్. 33

సీ. తుంటిరాపులఁ గట్టి నంటినకస్తూరి
యసలు నెమ్మెనుల నలఁది యలఁది
సింగంబుదెబ్బ విచ్చినకరితల రాలు
ముత్తెంపుటెత్తుల హత్తిహత్తి
యేకలంబులమోఱ మెగతోళ్ళపులను గూలు
వెదురుబియ్యము గూడు పోదవి పోదవి
మెలుగులు దీసి మాయింట్లఁ బెట్టినపుట్ట
జున్నులు చవిపుట్ట జుట్టి జుట్టి

తే. సుదతులను చూడి యనఁటులకదుపులందు
నిసుకతిన్నెలఁ బులిపొదరిండ్లఁ దరుల
నాఁకుటెండుల సుకముగా ననుదినంబు
నాటలాడుచు నుందు మోయయ్య మేము. 34

మ. ఒడయండా! విను నాదువంగసమునం దొక్కొక్కఁడున్ వేటకై
నడయాడం జనునప్డు సింగ మెదురైనం బాఱి వేఁబట్టి పైఁ
బడి చుంచుం గొని మేనిచెమ్మటలిలం బాఱంగ నూర్పుల్కడున్
బొడమం గాట సవారు చేసెడు మది నోమ్రదంబు రా డంబునన్.

ఉ. వేటల నేర్పరుల్ జనులు వేగురు నానడి నుండి కొల్వఁగాఁ
దోటకు వీటి కెంతయును దోడని వీడనివేడ్క బిడ్డలం
బోటులఁ గూడి సౌఖ్యమునఁ బొందుచు గూడెము గట్టికొంటి మే
నాఁటికి వేటవంక నయినన్ దయ సేయక పోతిగా దొరా. 36

—♦ ద శ ర థుఁ డు వే ట క రు గు ట ♦—

వ. అనిన మనంబున నానందంబు పెనంగొన దశరథుం డెల్లి వేటకై
మీతోట కరుదెంచెదఁ బొదుం డని బహుబహుమతు లిచ్చి యంపి

పుచ్చి నాఁడు గడపి మరునాఁ డరుణోదయంబున సాకల్యంబుగఁ గాల్యకరణీయంబులు నిర్వర్తించి మించినవేడ్క నశేషవిశేషాలంకృతుండై గంధవాహబాంధవం బగునొక్కమహాసైంధవంబు నెక్కి కొని పెక్కురు వేటకాండ్రు సివ్వంగుల బోనులు నురులు విచ్చుకత్తి లీటెలు మేటు లగుజాగిలంపుఁగుక్కలు డేగలు లోనగువాఖేటనసాధనంబులు గొని బలసి నడువ నడవిదారిం బడి నడచి ఢక్కాహుడుక్కాదులం బట్టి యడవిం దోలించిన మృగాదులు బయలు వెడలె నపుడు మృగయులు ఘోరసారమేయంబులబాఱం బడిన కోలంబుల శూలంబుల నొంచియు డేగల డీకొలిపి పిట్టలం బట్టియు నురు లురు వడించి హరిణాదులం జదిపియు జివ్వంగుల విడిచి మృగంబుల వధియించియు ననేకవిధంబుల వేటలాడుచుండి రాసమయంబున. 37

గీ. డేగ బారినిఁ బడక వేఁవేగ బాఱు
పారువమ్ము నక్కై వమ్ము పాఱి పాఱి
భీరుఁ డూర్చుచుఁ దెలిపిన భూరమణుఁడు
ధరణినీడనుఁ బట్టియ దాని నడఁచె. 38

మ. బలుతాచాటుగఁ బీటవెట్టి యుసి కొల్వర్ సింగముల్ బోనిజా
గిలపుంగుక్కలు రెండు రెండుకడలన్ గీపెట్టుచున్ బట్ట రా
నలకంతే నవకాశ మీక కడిమిన్ గవ్వించు చెవ్వారికిన్
జలు పెక్కించెడు పంది దూరగతుఁడై చానేసె రా జమ్మనన్. 39

కం. వెడవేఁటుం బడి కోల్పులి
వడిఁ గాండ్రని పాఱియొకనిఁ బట్టుడుఁ గని వేఁ
ల్మిడిఁ జని వీఁకం బెబ్బులి
నడిదంబున నడఁచె నొడయఁ డౌరా యనఁగన్ 40

క. ఆకొన్నసింగ మొక్కఁడు
వీఁకం బతిమీఁదఁ బడుడు విచ్చుంగత్తిన్
లోకులు మెచ్చగ దానిం
దేకువఁ జెడఁ గోసె నొడలు తిల లంతలుగన్. 41

వ. ఇట్లు వివిధమృగవిహంగమవధం బాచరించియు నాఖేటఖేలనంబునం
దనివి సన కవ్వసుంధరాధురంధరుం డవ్వనంబునం బాఱునొకనదికిం
గురువడిం గట్టించి యాలో నాలోనికి నీరువట్టునం జేరినమృగం
బుల నేలమాటునం బొంచి వధించుచుండు నవసరంబున. 42

—♦ దశరథుండు గజభ్రాంతి మునిపుత్రుం గూల నేయుట ♦—

శా. గంగాస్నానము సేయఁబోవుచుఁ గడుం గాంతారమార్గంబులం
దుం గష్టంబుల కోర్చి మెట్టుకొనుచున్ దూరంబునందుండి సా
రంగవ్యాఘ్రమృగాదనాదిమృగఘోరం బయ్యరణ్యంబుఁ జే
రంగావచ్చెఁగుమారుఁ డొక్కరుఁడు దోరాఁ దల్లియుందండ్రియున్.

ఆ. అల్లకారుటడవి మెల్లన సుతుఁ డూఁత
గాఁగ నడుచునపుడుఁ గనక వినక
పొక్కుచుండునట్టిముక్కాలిముదుకలు
బడుగు లిట్టు లనిరి కొడుకు నరసి. 44

మ. కొడుకా! నేఁ డతిదూరము న్నడచుటం గోడయ్యెఁ బాదంబులం
గడునెల్లంబడెఁ బొక్కులెక్కదగయున్ రానయ్యె మే మింక నొ
క్కడుగేని న్నడలేము గావున వనం బం దాగి పో నొప్పు ని
య్యెడ నంచు న్వడి నేలఁ గూలఁబడి వా యెండంగ బిట్టార్చుచున్.

ఉ. వెంటనె బిడ్డ కంటఁ దడివెట్టుచుఁ గన్గొని దుఃఖితాత్ముఁడై
కంటకభూములందుఁ గడుక ష్టిమెయి న్నడిపించుచుంటి మీ
వంటిమహాత్ములన్ సుజనవంద్యుల నంధులఁ దల్లిదండ్రులన్
వింటకు శక్తి లేనియతివృద్ధుల నిద్దఱ నక్కటక్కటా. 46

తే. బడుగులను దల్లిదండ్రుల నడవినడుమ
వడిగ నడిపించుచుంటిగా కొడుక ననుచుఁ
గ్రూరచిత్తుఁడ నే నని కుటిలగుడుచు
సుతునిఁ గన్గొని పల్కి రాసతియుఁ బతియు. 47

వ. కుమారా! నీమూలంబునంగదా కన్నులునుం గాళులును లేనిమాకుం గాశీవిశ్వనాథు నర్చింపం గలిగెడు దాన నగునాపుణ్యంబు నీయదియు మమ్ము నడిపించుటం జేసి క్రూరాత్ముండ నని కుతిలంగుడువం బని లేదు వినుము. 48

క. వాసిగ పుణ్యస్థలములు
కాసింబడి పోవ ఫలము ఘన మగు ననుటన్
రోసి చనుమాకు మార్గా
యాసము సుఖమీయ మూల మగుం గాదె సుతా. 49

ఉ. ఎప్పుడు కాశివిశ్వపతి నెప్పుడు చూచెద మన్నపూర్ణ మే
మెప్పుడు కాలభైరవుని నెప్పుడు చూతుము జహ్నుకన్య నిం
కెప్పు డిం కెప్పు డెప్పు డని యే కద వచ్చితి మింతదవ్వు లే
నప్పుడు గుడ్డివార మడు గైనను రాం గలమే కుమారకా. 50

వ. అని యూరడం బలికి నోరెండుకొనం బిపాసాకులితమానసులై మఱియును. 51

గీ. అలంతిపల్లె పథశ్రమ మపనయింపం
జనుదు మనుకొన్నం బెండగ జనంగ నీదు
జీవనంబులు వోసి మాజీవనములు
వెడలనీ కిప్డు నిలుపవే కొడుకుకుఱ. 52

వ. అని పలుకుచు వడ దాకి వాకు లేక పడియున్నకన్నవారిం గాంచి దుఃఖాక్రాంతచిత్తుండై తత్తరంపడి యత్తఱి గుమారుండు చే నొక కమండలువు వట్టికొనికూతవేటుమూరంబున నున్ననదికిం జని బుడ బుడ మనురవంబు వొడమ నొంగి నీరు పట్టునట్టియెడ. 53

ఉ. మాటున డాగి దూరమున మ్రాంగను వెట్టియ చూచుచున్నయా
ఖేటనలోలుం డానృపతి కి మ్మని నెమ్మది పృచ్ఛ సేయ కా
రాటము గాంగ నమ్మునివరాత్మజు హా త్తి యటంచు నెంచి నో
నాటగ నేసె నమ్మున ననం దగునాయువుపట్టునందునన్, 54

క. అచ్చోటు భూపతిబాణము
చిచ్చుఅపిడు గట్లు వచ్చి చెవి దాకుఁడు హా!
చచ్చితి నెవఁడవురా యని
గ్రచ్చుఱ జలమందుఁ గూలెఁ గడు ఘూర్ణిలుచున్. 55

వ. అట్లు పడి మూర్ఛిల్లి కొంతవడికిం దెలిసి యి ట్లనియె. 56

——♦ మునిపుత్రుఁడు దుఃఖించుచుఁదమవృత్తాంతముఁజెప్పుట ♦——

ఉ. ఏకుర నీవు రక్కసుఁడ వే! యది నిక్కవ మైన నన్ను నా
గోడునుఁ గన్న విన్న దయకుం దగువాఁ డని తోఁప కుండునే
వేడుక కైన నేను బృథివీస్థలి నేరికిఁ గీడు సేయ న
న్నీడను జాఁగ నేయుటకు నేమి యొనర్చితి నీకుఁ జెప్పరా. 57

ఆ. ఎప్పు డిట్టిబాధ చెప్పగా వినఁ గన
నిప్పుతాకుకన్న గొప్ప దిదియ
వేగ నసువు లేగ వేగతిఁ దాళుదుఁ
జావఁ జేసి నల్లఁ ద్రావు వచ్చి. 58

చ. అనవుడు డిల్లపోయి హృదయంబున శోకము వెగ్గలంబు గా
జనపతి మోస మయ్యె నని చయ్యన నయ్యతిసూతిచెంతకుం
జనియు మహాపరాధ మిది సైఁచి దురాత్ముని నన్ను బ్రహ్మఘా
తినిఁ గరుణింపవే యని మదిం దయ పుట్టెడునట్టు వేఁడియున్. 59

క. వసుధాపతినై మృగయా
వ్యసనంబున వచ్చి నీరు వట్టెడు నిన్నున్
బసరమనై గజ మని యీ
దెస గలిగించితి నటంచు తెలిపి మఱి యనున్. 60

వ. మహాత్మా! నీజలంబులు గ్రహించుతెఱం గరయ దగ గొన్న నేరికో దాహంబు దీర్ప నని తోఁచెడిని. మీా రెవరు? మీావృత్తాంతం బించుక వచింపు మనుఃష నతం డుస్సు రని నిట్టూర్పు నిగిడించి నీవు కన విన నన్హ్యాండ నైన నాకుం బ్రాణోత్క్రమణసమయంబు గానఁ జెప్పెద వినుము నేను వైశ్రవసుం డనుమునికుమారుండ

ముదిసినమాతల్లిదండ్రులఁ గాశికిం గొనిపోవువాఁడ నట వారికి
బెట్టఁగ నీరువట్టునంజేసి నే నిట్టియెడకుం జలంబులు గొంపో వచ్చి
నాపాలిమృత్యువ వై వచ్చిననీచే నిటు లయితి నని వెండియును.

శా. ఏకాలంబున కేనిఁ బ్రాణులకుఁ జావే నిక్కమౌఁ గావునన్
నాకై శోకము నొందఁ గాని వినుమా నాపోష్యముం గోరి వృ
ద్ధాకారంబునఁ గన్నులం గనక దుఃఖాయత్తులై మద్గురుల్
శోకం బందెద రంచు లోన వగతున్ లోకైకరత్నానిధీ. 62

శా. అష్టైశ్వర్యము లేది కానఁ బడి దుఃఖాయత్తులౌ వా రయో
మృష్టాన్నంబు మెసంగ రారు గదె నేఁ డేకందమూలంబు లే
దృష్టిం బొందమి నెట్లు వేగుదురొ కాదే యష్టకష్టంబులన్
గష్టా త్కష్టతరం క్షుధా యనుట క్షుత్కష్టంబె కష్టం బిలన్. 63

ఉ. పుట్టిననాటనుండియును భూపతి! వింటివె నేఁటిదాక యె
వ్వట్టున నైన వారలను బాసి యొకండన యింతసేపు నే
నెట్టిది యైన నుండ నిపు డి ట్టయి పోవుట కార్తి నొంది వా
రెట్టివిపద్దశం బడిరొ యెట్టుల యుండిరొ యేమి యైరొకో. 64

వ. అని పలుఁదెఱంగులం బలవించుచు పలవించుచుఁ బ్రాణంబులు
వాసె నంత భూకాంతుం డత్యంతదుఃఖాక్రాంతుండై. 65

చ. వనముల కేల వచ్చితిని వచ్చితి వెంటన పోక వేఁట స
ల్పను మన నేల పట్టితి బట్టితి నంతన పోక యేన్గులన్
గనుఁగొన నేల కాచితిని గాచితి నేనిక యంచు నమ్మహా
త్ముని ముని నేల తుంచితిని దుంచితి నిం కెటు లౌదు దైవమా.

—♦ మునిదంపతులు పుత్రునికై వగచుట. ♦—

వ. అని చింతించుచుఁ గుమారసూచితమార్గంబు వట్టి మునిదంపతుల
కడకరిగె నంతలో వారు కొడుకు నుద్దేశించి. 67

ఉ. ఏమిరతండ్రి! పెందగ వహించి తపించెదుతల్లిఁదండ్రి మ
మ్మేమె యొఱుఁ గానపాల్పఱచి యే జలముల్ గొనివత్తు నంచు నీ

వేమటి యింతసే పచట నిట్లు విళంబన మున్న వేగుమ
మోమ్మెమెడువారు లే రెవ రయో చనుచున్నవి ప్రాణవాయువుల్.

చ. మలమలలాడు వేళ నను మాత్రము నీళ్ళకుఁ బుచ్చ నేల యం
చలగితివో నినున్ మృగము లాఁకొని వాచవి సేసికొన్నవో
జలముల డిగ్గజారితో నిశాచరు లారసి తెర్లి నేసిరో
తెలియఁగ రాదు కారణము ధీనిధి! యింతకు రాకయుంటకున్. 69

వ. అని యనేకవిధంబుల విలపించుచున్నవృద్ధదంపతులయొద్దకు దశర
థుండు మెల్లన నడుగు లిడుచు నడచుటయుఁ బాదవిన్యాసశబ్దంబున
వారు కుమారుండు వచ్చె నని వాని నుద్దేశించి. 70

మ. కన వేరా మముఁ గన్నతండ్రి! తడయంగాఁ గారణం బేమిరా?
ఘనుదాహంబున వేగుచుంటిమిర నీవే మాకు దిక్కౌతిరా
కనులుం గాళులు లేనిమాపయిఁ గృధాకారంబు నీ కేలరా
యనుకంపం గనకున్న నిల్తుమిర మే మారా కుమారోత్తరా. 71

వ. అని వగచువారిచెంతకుంజనిదశరథుండు నమస్కారం బనుటయును.

ఉ. మాటసారంబునం దమకుమారుఁడు గా డని నిశ్చయించి యా
రాటముతో మహీశు మునిరాజు దలంకుచుఁబల్కె నెవ్వ రీ
వేటికివచ్చినాఁడ వెట నేని మదాత్మజు నాత్మ వేది ఘో
రాటవి నీటికై చనెడునాతనిఁ జూచితివే మహామహా. 73

తర. అనుడు రా జను నే నయోధ్యపురాధిరాజును వేటకై
వనికి వచ్చితి నచ్చ టచ్చట వార కేగుచునుండ మీ
తనయుని న్నయవేదిఁ జూచితిఁ దత్కథాక్రమ మెల్ల నే
వినుతు మెల్లన చల్లసీరిది పీఁగఁ బెందగ ద్రావుఁడీ. 74

చ. అన సభయుండు భూపతి నయంబునఁ బల్కెడు డిల్లపోయి య
మ్మునిని సుతవార్త యేమి యని పొ ల్పలఁ దెల్పెదనంచు కించమైఁ
దనయునివృత్తము న్వినినదాక జలంబులఁ గ్రోల నంతయుణ్
మనమున జంకు వోఁ దెలుపుమా నిను విన్న భయంబు పుట్టెడుణ్.

వ. అనిన నద్ధరణీకాంతుం డత్యంతసాధ్వసంబున గడగడ వడంకుచుం గొంటి యుంచ కంతయు నెఱింగించిన విని హాహాకారంబు సేయుచు ధరణి కొఱఁగి మూర్ఛపోయి కొంతవడికి నృపాశ్వాసితులై తెప్పి ఱిల్లి యప్పరమదంపతు లప్పుత్రుం దలంచుకొని. 76

చ. పుడిసెడునీళ్లు పోసి మనపున్నెపుదారికి మెట్లుగట్టు నీ
కొడు కని నీవు పుట్టినదికోలెఁ గడుంగడు సంతసంబునన్
బడియెద మింత కిప్పు డలపాపపుదైవము సైప లేక పా
పఁడ! నిను మమ్ముఁ బాపి యిటు బాములపాల్పడ మార్చెనక్కటా.

వ. అని గోలుగోలునం గంటికి మంటికి నేకధారగా నేడ్చుచు రాజు దిక్కు మొగంబై. 78

—♦ మునిదంపతులు రాజును శపించుట. ♦—

తే. ఓరిరాజాధమా! గ్రుడ్డియును జెవుడును
బొంది వృద్ధుల మగుమాసుపుత్రు నొకని
నఱికి ముప్పూర నఱికినదురిత మంది
తింటికంబము దెగ నేయ నిల్లు వడదె. 79

వ. అనుచు నత్యంతామర్షంబున నీవును మావలెఁ బుత్రవియోగంబునం బాడవడంగు మని శపించి వా రాదుఃఖంబున దురపిల్లుచుం గాల ధర్మంబు నొంది రంత దశరథుండును శోకవ్యాకులితచిత్తుండై యత్తఱి నత్తాపసత్రయంబున కగ్నిసంస్కారాద్యుత్తరక్రియ లాచరించి వేట చాలించి పురంబునకుం గమించి కులగురుం డగువసిష్ఠు నాహ్వానంబు గావించిజరిగినదంతయు నెఱింగించి మఱియును. 80

ఉ. హా త్రియటంచు మానిసుతు నట్టె వధించితి నేలఱేఁడ నం
చి త్తఱి నేమొగంబునను నేను మెలంగఁగ నేతు భూస్థలిన్
జి త్తము త త్తఱించెడిని జెప్పఁగ నేటికి నామనోవ్యథల్
చత్తునొ యంచు నెంచెదను జంపితి ముప్పురఁ జంపి యొక్కనిన్.

తే. బాణహతుఁ డైనపుత్రునిపలుకు బడులు
తల్లిదండ్రులయేడ్పులు తలఁపఁ దలఁప

నాదుహృదయంబు బ్రద్దలై పోదు ననుచు
నేడ్చుచున్నది యేమందు ఋషివరేణ్య. 82

తే. అనిన నతఁడను నెఱుఁగక హత్తి యనుచు
నేసితివి దీన దోష మదింతియ యగు
దీనికిం గల్గు నిష్కృతి దీన నీకుఁ
బుత్రు లుదయింతు రంచును బోలఁ దోఁచె. 83

వ. నీవు మానవలెఁ బుత్రవియోగంబునఁబొడవడంగుమనిమునిదంపతుల
వచనంబు గావున నీకుఁ బుత్రులు పుట్టుట నిశ్చయంబ చింతింపకు
మనిన నింత శాంతించి దశరథుఁడు వెండియు. 84

—♦ దశరథుఁడు వసిష్ఠునికడ తనవిచార మెఱింగించుట. ♦—

చ. కులగురు! నాకు నింద్రునకుఁ గొంచెము గాని సఖిత్వ ముండుటన్
నెల కొకవాసరం బయిన నే నమరావతి కేగి వచ్చుచున్
దెలిసి భజింతు నెప్పుడును దేవగవిన్ విను మొక్కనాఁ డటుల్
కొలువక వేగిరించుమతిఁ గొండిక నై చనుదెంచితిన్ గటా. 85

ఆ. దాన నలిగి కామధేనువు సంతతి
నీకు లేకపోవుఁ గాక యనుచు
శాప మొసఁగె నంత శప్తుఁడ నైనేను
దాని కాళ్లఁ బడితి దీనుఁడ నయి. 86

ఉ. ఆయమ నాదుదీనతకు నక్కటికంబు వహించినట్టిదై
యోయి నృపాల! నీపయి ననూనకృపం గలదాన నైతి నీ
కీయెడ నాదునంశమున నేకకుమారిక పుట్టు నవ్వలం
బాయనిపేర్మినల్వురు కుమారులు పుట్టెదరయ్య భూపతీ. 87

తే. అనుచు వర మిచ్చె గోదేవి కనికరించి
సద్వరప్రభావమునఁ గౌసల్యగర్భ
మును ధరించి సుతం గాంచె మునివరేణ్య!
విన్నవించితి నంతయు విశదముగను, 88

చ. అనుడు వసిష్ఠుఁ డిట్లనియె నో నివి యంతయు నే నెఱుంగుదుఁ
దనయకు జాతకర్మము మునంబునఁ జేసిన వెన్క నంతయుం
బానరెడు నట్లు చేసికొనఁ బోలు నటంచు వచించి వామదే
వున కెఱిఁగించి యెల్లద్విజపుంగవులం బిలిపించి యంతటన్. 89

—♦ శాంతాదేవి వృత్తాంతము ♦—

సీ. నాక ధేన్వంశమునం బ్రభవించిన
కన్యామణికి జాతకర్మ మైన
వెనుక శాంతాదేవి యనినామకరణము
సలిపె వసిష్ఠుఁ డాసమయమందు
గంద్రగోష్ఠలి కేలఁ గ్రాల రాముం డాగ్ర
హంబునం జనుదెంచి యధిపుఁ గాంచి
నీకూఁతు రాజున కీక బ్రాహ్మణునకు
ని మ్మట్టు లీకుంటి వేని మీఁద
తే. న న్నెఱుంగుదు వని కోపనయనుఁ డగుచుఁ
బలుకుచుండ వసిష్ఠుఁడు వచ్చి వాని
శాంతునిఁగఁ జేసి నీనుడి శాంత దీని
బ్రాహ్మణున కిచ్చు నని పల్కి పంపె నతని. 90
తే. కోసలంబుల కెల్ల నాల్గుపదు లైన
యోజనంబుల దూరమం దుండునంగ
దేశ మెంతియు నొప్పు నా దేశవిభుఁడు
రోమపాదుఁడు నాఁబడి భూమి నెసఁగు. 91
ఉ. ఆతఁడు సారిఘూర్వాహుఁడు నా ష్టసుఖత్వముఁ గొన్నవారు వా
రేతటి నొక్కకంఠముగ నేకతఁ గొన్నమహీకళత్రు లా
ప్రీతియు నాయనుగ్రహావివేకము వారిక కాక వేరికిఁ
భూతలమందు లే దనుచు భూజనకోటి కెఱుంగ నయ్యెడిన్. 92
ఆ. అతఁడు సంతు లేనియట్టిఁడు గావునఁ
దనదుసఖునికన్నతనయఁ గొను

నిచ్చఁజేసి వచ్చి యెంతయుఁ బ్రేమించి
తనదుబిడ్డ యనుచు దానిఁ బిలిచె. 93

వ. అంత నారాజు రాజదంపతులం గాంచి యి ట్లనియె. 94

ఉ. మీసుత యైనయప్పు డీది మిమ్మును బోలె ననుం దలంచెడిన్
నాసుత యంచు నేనును మనంబున సంతస మందు చుందు నో
కోసలరాజపుత్రి! కయికొ మ్మనుదమ్మ! సుహృద్వరా! భవ
ద్భాసురభావ మెట్టిదియొ వాకొను మయ్య వినం దలంచితిన్. 95

ఆ. అనిన వార లిర్వు రాజేనిఁ గని దీని
కింత యేటి కయ్యె యిక్కమారి
యీగృహమున నున్న నెంత సంతోషమో
యాగృహమున నున్న నంతె సుమ్మి. 96

వ. నీ కభిమతం బనియేని దీనిం గొనిపోయి పెద్దదానిం జేసి బ్రాహ్మ
ణునకుం బెండ్లి సేయు మని చెప్పి వా రప్పసిపాప నారోమపాదుని
పాణితలంబునం బెట్టి రంత నతండు మహామేరువు దొరికినంత సం
తోషంబునం బొంది వారి నామంత్రణంబు గావించి స్వదేశంబు
నకుం జనియె నంత. 97

ఉ. శాంతను రోమపాదనృపచంద్రునకున్ సుతఁగా నొసంగి భూ
కాంతు డతండు కారడవి గొ రని మానికుమారుఁ ద్రుంచుటన్
స్వాంతమునందుఁ జింతిలుచు శాపభయంబున సంచలించుచున్
శాంతి యొకింత లేమిఁ బ్రభుశాసనముం గొనఁ జాల నట్టిఁడై. 98

—♦ దశరథుఁడు శాంతి లేక యంతిపురి విడకుండుట ♦—

తే. మదిని విశ్రాంతి గోరి యమ్మానవేంద్రుఁ
డాత్మసచివులపై భారమంతయు నిడి
పడులతోడఁ బ్రసంగించుపక్కి విడిచి
యంతిపురియందు నొకరుఁడై యధివసించె. 99

క. పేరోలగమ్మునకు నా
ధారమణుఁడు రానినాఁడు మొదలుగ నాప్రోల్

సారవిహీనంబై తే
జోరమకుం గానియట్లు చూడఁగ నయ్యెన్. 100

సీ. ఏమహానసమందు నేప్రొద్దు ప్రాయి రాజి
న లెటింగినవార లపుడు లేరు
పసి మేత మేయ కంభారవంబులతోడ
నూరెల్లఁ దిరుగాడుచుండె నెపుడు
నేవీథియందు సమీక్షించినంతఁ బ్ర
శాంతమై చూపట్టు జనచయంబు
వేణువీణాదివిక్వాణంబు లెప్పుడు
జానుదుగం బడ వేని కేని

తే. ఢామడాంబరాదులచేఁ బ్రజల్ గలంగి
వలసపో రిత్తయై నట్లు తెలియఁ బడుచుఁ
గళయుఁ గాంతియు లేనట్టిగతికి నగుచు
నపుడు కన నయ్యె నయ్యయోధ్యాపురంబు. 101

క. తేజోవిహీనమై పర
రాజులు కనువేయుగతికి రానై శ్రీలన్
రాజిల్లెడుసాకేత మ
రాజకమై యపుడు దోఁచె రమణ దొరగుటన్. 102

మ. పరుకంటన్ బడకుండ నంతిపురిలో భక్తంబును నిద్రయున్
బరివర్జించి విచారమగ్నుఁ డగుచున్ స్వాంతంబునం బత్నులన్
బరివారమ్మును భూప్రజన్ సచివులన్ బాటింప కెల్లప్పుడున్
ధరణిం బండి మహీకళత్రుఁడు తపస్తప్తుండు నాఁ జొప్పడెన్. 103

సీ॥ సామంతరాజులు చనుదెంచి రాజద
ర్శనము చేయఁగ లేక చనిరి తరలి
ఋషివర్యు లరుదెంచి నృపతి లోనగళులఁ
గన రాకయుండుట విని వెడలిరి
త్రిదివంబునందుండి దేవరాజాహ్వాన
ములు వచ్చి యొకచోట నిలిచి యుండెఁ

ప్రభువరాంగీకృతిం బడయంగనై యెన్ని
మోహాస్త్రములఁ బడి యుంటి నవలఁ

తే. పెద్దలఁ బొసఁగ సేవలాడు వారలు లేరు
పేరుచుండిరి యేను లేవేళ నిట్లు
వచ్చునో యని భీతున వాసి చేసి
తినక దాఁకక రాజున్న దినములందు, 104

—♦ వశిష్ఠవామదేవు లశ్వమేధము చేయుమని చెప్పుట ♦—

వ. అట్టి యవసరంబున వసిష్ఠవామదేవులు రాజపత్నీప్రేరితులై రాజు కడకుం జని తత్ప్రకటింగించి నమస్కరించినం దీవించి యిట్లనిరి.

ఉ. ప్రాకృతునట్ల నీ వవనిరాజ్యభరం బది వీడనాడి లో
నైకనుత ప్రభుత్వమున కెంతయు వింతగ లోటు వాటిలన్
లోకమువంక జూడ కిటు లోనగ రే గతిగా నిజక్రియల్
గైకొన కిట్లు దుర్వ్రతము గైకొని యుండుట పోలునే ప్రభూ. 106

క. నీలోనిచింత యంతయు
మాలోఁ దోఁపంగ వచ్చె మానవనాథా
పోలించి చెప్పుచుంటిమి
మేలొనఁగూడెడిని నీకు మీఁద నెఱుంగన్. 107

క. శూద్రఋషిపుత్రు నెఱుంగక
భద్రగజం బంచు నెంచి వధియించితి వా
ఛిద్రము నీఱఁగ పుత్రులు
భద్రగతిం గలుగఁ జేయు వలయుఁ సవముఁ. 108

క. అది వాజిమేధ మనఁదగు
నది దానిం జేయఁ బాపహార మగు పుత్ర
ప్రదమగుఁ దత్సంభారము
లు దగం గూర్పంగ వలయు లోకాధీశా. 109

సీ. పృథివీశ! విని యుందు వీవు స్వాయంభువ
మనుచరిత్ర మతండు మహి నెసంగి

శతరూప యనుసతి సహధర్మచారిణి
గా నొంది పుత్త్రులఁ గాంచె నామె
యందు నుత్తానపాదాఖ్యుఁ బ్రియవ్రత
ఖ్యాతు నవ్వల దేవహూతి నాకూతి
నామెఁ గర్దమునకు నాలుగా నిడె వారి
కుదయించెఁ గపిలుఁ డత్యుత్తముండు

తే. మనువు రాజ్య మదంతయుఁ దనయుల కిడి
తానుభక్తియు ధేనుమతీరదిక్ష
వనమునం దుండి వేనవే ల్వత్సరములు
తపము గావించె హరి మెచ్చఁ దన్పులఁ జేసి. 110

వ. అంతఁ గొంతకాలంబునకు. 111

శా. శ్వేతద్వీపమునం బ్రకాశిలెనునాదిత్యుండు ప్రత్యక్షుఁడై
చేతోమోద మెసంగ ని ట్లనియె నో క్షితీశాగ్రణీ! నీసమ్యక్
ప్రీతిం జేసితిఁ గోరుకొమ్ము వర మర్థి న్నీకు నే నిత్తు నా
నీతోఁ దుల్యునిఁ బుత్త్రు నిమ్మని స్పృహం దెల్పెన్ మహీజానియున్.

వ. అని వేఁడినం బ్రసన్నుండై లక్ష్మీసహితుం డగునాదినారాయ
ణుండు మనువుదిక్కు మొగంబై. 113

శా. నాకు న్నీవె సమానుఁడన్ వెరల నెవ్వం డేల నీకోర్కి మై
నీకుం బుట్టెద నేన పుత్త్రుఁ డయి నిర్నిద్రాత్మవిజ్ఞాన! నీ
వీకాలంబున స్వర్గసౌఖ్యములు నెన్నేఁ బొందియు న్వారక భూ
లోకంబందు జనింతు వీవు సతితో లో నన్ను వర్ణించుచున్. 114

తే. అజున కీవు కుమారుఁడ వగుదు నీమె
కోసలేశునికూఁతురై కుతలమందుఁ
బుట్టెదురు మీరు మీకు నేఁ బుత్త్రుఁడ నయి
పుట్టఁ గల లచ్చి సీతయై పుట్టఁ బుడమి. 115

వ. అని శ్రీమహావిష్ణువాక్యంబు గావున నీవు చింత దక్కి వాజిమేధ
యాగప్రయత్నంబు గావింపు మనినఁ బంక్తిరథుండును. 116

చ. తనగురువుల్ వచించినది తథ్యము పథ్యము నంచు నెంచి లో
వనటఁ దొఱంగి వారలకు వందనముల్ పొనరించి పుచ్చి భో
జన మొనరించి మిత్రులను జక్కటికిం జనుదేరఁ బిల్చి నే
నొనరుతు నశ్వమేధసవ మున్నతరీతుల నెన్నికం బడన్. 117

వ. మీ రెల్లసంభారంబుల సమకట్టుఁడు. 118

క. అని చెప్పిపుచ్చె నంతన
చని మంత్రులు సర్వకార్యసంఘటనంబుం
బొనరించి రపుడు సూతుం
డనఁ బడెడు సుమంత్రుఁ డిట్టు లనియె నృపతికిన్. 119

—♦ సుమంత్రుఁడుదశరథునకుఁ బూర్వవృత్తాంతము చెప్పుట. ♦—

సీ. ము న్నొకప్పుడు నీకు బుత్రాగమముఁ గూర్చి
ప్రస్తావ మేగుడేఁ బ్రాజ్ఞులైన
ఋషులసన్నిధిని సమిద్ధతేజుండు స
నత్కుమారుఁడు చెప్పె నల్వురు విన
ఋశ్యశృంగుం డను ఋషికుమారునిఁ బిల్చి
తత్సమక్షమున నధ్వర మొనర్ప
వానిప్రభావమువలనఁ బుత్రులు దశ
స్యందనునకుఁ బుట్ట నుందు రనియె

తే. అంగదేశాధిపతి రోమ పాఁగుపొంతె
నతనినిం బిల్చి శాంత నాయనకు నిచ్చు
దాన సర్వానుకూలత నానృపాలుఁ
డందు నని చెప్పె నని వింటి నవనినాథ. 120

వ. ఆకర్ణింపు మిప్పు డయ్యంగదేశరాజ్యంబు. 121

తే. రాష్ట్రకృతపాప మంతయు రాజునంటు
ననుటఁ బ్రజలు చేసినపాపమునను జిటుకు
మని చినుకురాల కుండె నైదాఋవత్స
రములనుండి మహారోమరాజ్య మయ్యె. 122

క. చెఱువులు బావులు నదులుఁ
సరసులు జల మింకఁ బాఱి సలసల మనుచుఁ
గర ముడికి యుడికి యెండల
కఱిముఱి యై యెండిపోయె నగ్గి కిరవులై. 123

వ. ఇ ట్లొక్కజంబుగ నొక్కదిక్కు నన్నైనం బొటుక్కు మని చినుకు రాలని యవ్వేండకాలంబున మెండుగ మండిన గ్లిండి యుండిన తరుగుల్మలతాదులును బగ్గుమని మండునగ్గితెఱంగున నుండుపుడమిం బడి మలమలమాడి వేఁడిం గొట్టుకొనుచు నల్లు లనం బెల్లుగ నసువు లూడుచుజంతుజాలంబులును దిత్తులకొలిమిం గఱంగు నయోమయరసంబువలె బుసబుస మని కొంతదనుకం బొంగి నార్కొడంబు లగిరింప వచ్చునన్న ట్లింకి యెండువాపీకూపతటాకాది జలాశయంబులం బయల్పడి యొడలితోడం బుణ్యాగతికిం బోవువారి వడువున నాకారంబునుం గానరాక యాతపంబున భస్మీభూతంబు లగుజలచరంబులుం గలిగి నిఖిలభూతభయోత్పాతం బగునాఘోర దినంబుల నొక్కనాఁడు దేశాధీశుం డగురోమపాదుండు దుఃఖసమన్వితుండై శతవృద్ధులు శ్రుతవృద్ధులు నగుభూసురాగ్రగణ్యులం బిలిచి యి ట్లనియె. 124

—♦ అంగదేశమునందలి క్షామము ♦—

చ. కటకట యేమి చెప్పుదు నొకానొకనాఁటికి భూతలంబునం
బొటుకునఁ జినుకు రాలదు సముద్రము లట్టితటాకముల్ నదుల్
పెటపెటవేగునట్ల యగుఁ బృథ్వి యితంతయుఁ గాలినట్ల యై
దిట చెడి యుండె బూడెకును దీటిది యంచును దోఁప వచ్చుచుఁ.

క. పొలములఁ గొణిదెసఁగింజలు
గలిగికొన న్వచ్చునెడు కఱ దయి కఱవై
పొఁగెసె సమస్త మిక్క నే
పొలుపున జీవింప నుండ్రు భూజను లకటా. 126

సీ. పర్జన్యుఁ బ్రొర్థించి ప్రార్థించి సాహస్ర
ఘటముల శంభులింగముల కెల్ల

సభిషేకములు మహాన్యాసప్రాశ్నకములు
వేదపారాయణవిధులు నడచె
జపతపోఽనుష్ఠానశతసహస్రంబులు
చేయించితివి బుచ్చి క్షితిసురులను
సూర్యనమస్కృతుల్ సోమార్చనంబులు
దినదినంబును బ్రవర్తిల్లుచుండె
తే, ఇచ్చ గాకున్న జాతర లెన్నియేని
గ్రామదేవతలకుఁ జేయఁ గలిగి యుంటి
గ్రహములకు శాంతు లెన్నియో సహరహంబు
సలుపుచుంటి ననావృష్టి దొలఁగ దయ్యెఁ 127

క. కురియింపఁడు పర్జన్యుఁడు
ధరణి న్వర్షం బిదేమి తహతహ యయ్యో
ధరణీసురులార! దీనికిఁ
బరిశాంతి వచించి నన్ గృపం గనుఁగొనుఁడీ. 128

చ. అనుడుఁ బ్రసన్నులై నృపతి కాద్విజు లిట్లని రీవు దృష్టుఁడై
ఘనులకు వేదవిప్రులకుఁ గా నపచారము చేయ నిన్ను వా
రనక పరిత్యజించి రది యయ్యె నుపప్లవకారణం బికన్
వినయము గల్గి వారలను వేఁడుము దాన శుభంబు గల్గెడున్.

—♦ ఋశ్యశృంగుని వృత్తాంతము ♦—

చ. కలఁ డిల ఋశ్యశృంగుఁ డనఁ గాఁ నుడి చెక్కినవాఁడు సోడిమిం
గలిగినవాఁడు శాంతుఁడు వికారవిదూరుఁ డరణ్యవాసముం
దలఁచెడునట్టివాఁ డెపుడు నన్నము పున్నె మెఱుంగఁ డేరిపై
నలుగఁడు కాఱు లాడఁడు మహాత్ముఁ డతండు మహీపురందరా.

సుగంధి. ఆతపస్వివర్యుఁ డున్నయట్టి భూతలంబునం
దీతిబాధ లుండఁ బో పవెప్డుఁ బాడిపంట లొప్పఁ
బ్రీతితోడ వాని నింటఁ బిల్వనంపు వచ్చె నే
నాతఁడే నృమహీతలంబునందు వాన లయ్యెడిన్. 131

వ. అని చెప్పిన నప్పృథివీవల్లభుం డాఋష్యశృంగునివృత్తాంతం బెట్టిది చెప్పు మనిన వారు మఱియును. 132

తే. కశ్యపాన్వయజాతుఁడై ఖ్యాతి గనిన
మునివరుఁడు విభాండకుఁ డనుఘనుఁ డెసంగు
బాలుఁ డయ్యును స్థవిరుఁడై బ్రహ్మచర్య
మునఁ దపించుచు నొకహ్రదంబున వసించె. 133

క. ఆలో దివి దేవేంద్రుని
మోలిక నటియించునప్సరోమణి యొక్క-
ర్తాలక్షించుచు నట నగు
కేళీహరిణము మహేంద్రుఁగిక్కురు పెట్టెన్. 134

వ. దాన నలిగి యింద్రుం డీవు హరిణిం జూచుచు న న్నవమానించితివి గావున హరిణంబవై ధరం బుట్టు మని శపించి దానిప్రార్థనంబు నంజేసి హరిణివై పుట్టి విభాండకునివీర్యంబునఁ బుత్రునిం గని శాప మోక్షంబు నొందుదు వనియె నంత నయ్యచ్చర భూలోకంబున హరిణియై పుట్టె నట్టియెడ జలంబులం దుండి తీవ్రతపంబు సేయు విభాండకున కొక్కనాఁ డూర్వశీదర్శనంబునం జేసి రేతఃపాతం బయ్యె నయ్యమోఘవీర్యం బుదకంబునం బడిన దానిం దృషిత యగు నాలేటిబోఁటి త్రావి గర్భిణియై యర్భకుం గాంచి మృతించె ననంతరంబ. 135

ఆ. దేవకన్యయగుచు దీపించునది యింద్రు
శాసనమున నట్లు జగతిఁ బుట్టి
మునినిఁ గాంచి శాప మోక్ష మందె నతండె
ఋష్యశృంగుఁ డనఁగ నెసఁగువాఁడు. 136

ఉ. ఆమునియుత్తమాంగమునయం దొకశృంగము పుట్టెఁ బుట్టిన
ప్డే మహితప్రభావమున నీధరణీస్థలి ఋష్యశృంగుఁ డన్
నామము నొందె నాతఁడు వనంబును దండ్రిని గాక యొండొకం
డేమియుఁ దా నెఱుంగక మహిం బ్రచరించెను బ్రహ్మచర్యమున్.

ఆ. వాని నెట్టులైన వంచించి యిటఁ దెచ్చి
నీదుశాంత నమ్మునిప్రవరున
కిచ్చి తేని దేశ మెల్ల సుభిక్షమై
పరఁగు నీకు మేలు పడయ వచ్చు. 138

వ. అని చెప్పిన నమ్మహీవల్లభుం డప్పుడ తనతప్పులకు నిష్కృతిం జెప్పుకొని బ్రాహ్మణవచనంబునం జేసి బుద్ధిమంతు లైనమంత్రులతో మంతనంబుండి సర్వలోకవశ్యౌషధాభిఖ్య లగువేశ్యాముఖ్యలం బిలువ నంచి మీరు మీనేర్పు పెంపునఁ బ్రవర్తించి ఋష్యశృంగు నిటం దెచ్చునది యనిన వారు మునిశాపభయసంత్రస్త లై పలుకఁ జాలకుండి రపు డొకముసలిజంత నన్నుఁ బుచ్చుము నేఁ గార్యంబు సాధించుకొని వచ్చెద ననిన మహీకాంతుండు దానికిఁ బసదనం బిచ్చి యంపిపుచ్చె నదియు రూపయౌవనసంపన్న లగుచేడెలం గూడుకొని వేడుక మీఱ వారితో నొక్కనావ నెక్కి పయనం బై చని నానాపుష్పఫలసమంచితభూరుహసంచయంబులును నానా మనోహరగుల్మజాలంబులును గలిగి మిగుల రమణీయం బై పర మాద్భుతదర్శనం బగునాకాశ్యపాశ్రమంబు లోచనగోచరం బగు టయు దాని కింతసమీపతీరంబున నావం గట్టి విభాండకుం డెడసిన జాడం గని వేశ్యమాత తనకూఁతు శృంగారవతి ననునయించి పంచె నిపుణ యగునదియు నోయారంబు మీఱ ఋష్యశృంగుని పాలికిం జేర నరిగి యి ట్లనియె. 139

—♦ రోమపాదునిపంపున వేశ్య ఋష్యశృంగుని వంచించుట ♦—

చ. కుశలమె తాపసోత్తములకుం దప మొప్పునె మీవని న్నమి
తక్షశఫలకందమూలములకుం గఱ వెప్పుడు లేక యుండునే
పశుపతితుల్యులై చనుభవజ్జనకుల్ ప్రియ మంది యుందురే
విశదగతిఁ బ్రశాంతు ల్బదివి వేడుక నాడుచు నీ వెలర్తువే. 140

వ. నిన్నుం గని నీతోఁ గొంత ప్రసంగించి పో వచ్చితి ననిన ఋష్య శృంగుం డయ్యంగనామణిం గని నివ్వెఱంపడి యి ట్లనియె. 141

ఉ. అక్కట జ్యోతివోలె దెస లన్నియు వెల్గఁగఁ జేయుచుంటి వీ
వెక్కడివాఁడ వాహ్వయ మదేమి వచింపు మహాత్మ నీవు నా
ప్రక్కఁగ నైనవాఁడ వని బుద్ధి యగుం గొను మర్ఘ్యపాద్యముల్
జొక్కపుటిక్షుతో లిదిగొ చూఁతముసు నేనుక విశ్రమింపుమా. 142

తే. అనిన వేశ్య వచించు నోయయ్య యిటకు
మూఁడుయోజనములదూరమున మదీయ
పావనాశ్రమ మగు నందు భక్తి నతిథి
పూజసేయుదు నే వారి పూజ గొందు. 143

వ. అట్లు కాకున్నం బెఱచోట నే జలోపస్పర్శనంబు సేయ నిది నావ్రతంబు దీనికి నీ వనుమతించితి వేని నన్నుం గ్రుచ్చుకొని నాతో వచ్చునది యనుఁడు నతండు నాఁ గాత మని పక్వంబు లగుకొన్ని కారుమక భల్లాత కామల కేంగుద ధన్వప్రియాళు ప్రముఖఫలంబులు వెట్టిన నవి ముట్టియు ముట్ట కది తన తెచ్చిన భక్ష్యభోజ్యపేయంబులును సుగంధపుష్పమాల్యంబులును విచిత్రవస్త్రంబులును వాని కిచ్చి ముచ్చటలు హెచ్చ వానిచెంతం బంతు లాడి నృత్యంబు చేసి నవ్వుచు నవ్వనచారి మాటిమాటికి సంగాంగసంయోగంబుగా నాలింగనంబుచేసికొని మోహపరవశుం జేసి లీలావలోకనంబులం దేలించి తేలించి నా కగ్నికార్యంబునకు వేళయగుచున్నయది పోయి వచ్చెద నని మెల్లనఁ జనియె నంత ఋష్యశృంగుండును.

సీ. మత్తుఁడై మోహితచిత్తుఁడై పెల్లాట
కత్తె వోయినదిక్కు హత్తి చూచుఁ
జూచి కన్దోవ మూసి చూచు లో నేచిన
చూపున బ్రహ్మంబుఁ జూచురీతి
రీతియు నీతియు ఖ్యాతియుం జెడ నాతి
బ్రాఁకమై నెంచి లోఁ బ్రీతిఁ బొందుఁ
బొందు విడువ లేనిచందంబునఁ గుందు
మందుఁడై యూర్చు నమందగతిని

తే. గతి నెఱుంగక నింగిఁ జూ పతుకఁ జేయుఁ
జేయునది లేక కన్నీళ్లు పాయ విడుచు
విడిచినను వీడ నట్టిపా టడర డెందు
డెందమున మోసకత్తియచందమునకు. 145

తే. ఇట్లు విమనస్కుఁడై యతఁ డెంతయేని
చింత నొందుచు నుండెనంతలోన
నాతపక్లిన్నగాత్రుఁడై యరుణనేత్రుఁ
డై విభాండకుం డరుదెంచె నడవినుండి. 146

వ. ఇట్లరుగుదెంచి. 147

చ. ఎదిరినిఁ దన్నెఱుంగక శోకయుక్తి వసించి వివేకశూన్యుఁడై
మది నెదియో తలంచుచుఁ గ్రమం బఱి యున్ననిజాత్మజన్మునిన్
గదియఁగ వచ్చి తండ్రి యను గాదిలిబిడ్డ యి దేమి యిట్లు నీ
వదనున నగ్ని వేల్వ కెడ నాఱడి నొందుచునుంటి చెప్పుమా. 148

క. పాలార్చితి స్రుక్స్రువముల
వేలిమిపడ్డయును బిడ్డ వేర్పడ కొకఁ డై
క్రాలెడిని నగ్ని వేల్వం
బా లెక్కడినుండి నేఁడు వచ్చుం జెపుమా. 149

క. ఎవ్వం డే నిట వచ్చెనో
యెవ్వగ రా నెద్దియేని నీ కని చనెనో
యివ్వగ పేటికిఁ దండ్రీ
త్రెవ్వకయుండంగ నాకుఁ దెలుపుము దానిన్. 150

వ. అనిన ఋష్యశృంగుండు తండ్రి కిట్లనియె. 151

—♦ ఋష్యశృంగుఁడు మునిగా వేశ్య నభివర్ణించుట ♦—

మ. అహహా! యే మని చెప్పువాఁడ మునినాథా! నేఁడు నాచెంతకుఁ
బ్రహ్మతేజోంచితమూర్తి యొక్కఁ డనువొప్పన్ వచ్చి పోయె న్నహో

మహాఁ డాతండు మహాతపస్వి సుమనోమాన్యుండు ధన్యుండు వి
జ్ఞహితుం డంబుజపత్రనేత్రుఁడు తప[illegible]న్నమద్గాత్రుఁడున్. 152

మ. పొడుగుం బొట్టియుఁ గానిమేను కనకంబు న్మేలమాడుం గడున్
గడిమిం జేఁటులఁ బొఱఁదోలు నెఱకల్ గంజంబుఁ గాదాడు మో
మడుగుల్ దమ్ములఁ దన్ను లంచు నుఱువున్ హాహా మహోదారు నా
జడదారిం గనకున్నఁ గన్నుఁగవకున్ సాఫల్యమొం దుండునే. 153

ఉ. పుత్తడిజన్నిదంబు లగుఁ బొ మ్మవి కంఠమునందు వ్రేలెడున్
గుత్తుకక్రిందిభాగమున గుండ్రనిపిండము లొప్పు రెండుపెన్
గుత్తపుగుత్తు లోయనఁ గనుంగొననై జడ లెల్ల మొల్లమై
ముత్తము గాఁగ నల్లఁబడె మోహనమూర్తికి వాని కారయన్.

సీ. చీరాంతరమునుండి చెన్నుమీఱఁగఁ దోచు
జాళువామొలనూలు జఘనమందు
వేదిమధ్యముపోలె విస్మయం బొదవించు
సూక్ష్మమై మధ్యంబు చూడ నొప్పి
హంసకూజితముల నద్భుతదర్శనీ
యము లేమొకో మ్రోయు నంఘ్రులందు
నక్షమాలలు పోలె హస్తయుగంబున
గలుగల్లుమను నవి గ్రాలుచుండు

తే. వానికట్టినపుట్టంబు గాన వచ్చు
నిండుపున్నమ జాబిల్లి నిగ్గు లెసఁగఁ
గొసరి కొసరి పుంస్కోకిల గ్రోల్చునట్లు
రుచ్యముగ మాటలాడు నారుచిరమూర్తి. 155

క. వన మెల్ల గుబులుకొనె నా
మునిపుత్రునిమేనితావి పోలింపఁగ నా
మని మలయసమీరము తాఁ
కున మల్లియనుండి గుబులుకొనుతావి బలెన్. 156

తే. జనక! వానిలలాటదేశంబునందు
రెండుతెఱఁగుల నగుజటామండలంబు

కలిపి సింగారముగ వెన్కఁ గట్టఁ బడియొ
స్వర్ణచక్రాంకితంబుగా సలిపి మెలపి. 157

చ. మునిసుతుఁ డాతఁ డొక్కఫలముం దనదక్షిణపాణిఁ బట్టి మే
దినిఁ బడఁ గొట్టి మీఁదికయి తేఱినదాని సువృత్తచిత్రమై
తనరెడుదాని మాటికిని దా నటుచేతన మొత్తు చెట్లు వ్రా
లిన నతఁ డట్లు వ్రాలుచుఁ జలించె మరుచ్చలితోర్వజంబు నాన్.

ఉ. వానిమనోహరాకృతియు వానివిలాసము వానిహాసముం
వానిలసత్సుకారమును వానివిహారము వానిచెయ్వులుం
మానసముం హరించె ననుమానము లే దతఁ డొక్కదేవతా
సూనుఁడుగాని యొక్కమునిసూనుఁడు గాఁడు తలంచి చూడఁగన్.

ఉ. ఆమహనీయమూర్తి ప్రణయంబున నన్నుఁ గవుంగిలించి నా
మోమున మోముఁ జేర్చి శిరముం జిబుకంబును బట్టి మోవితోఁ
గోమలశబ్దముఁన్ సలిపెఁ గొంచెము యే నది పెంచె హర్ష మే
నేమని చెప్పవాఁడ నతఁడే హృదయేశుఁ డటంచు నెంచెదన్. 160

తే. నే నొసంగినఫలము లాహూనిసూతి
తనకు వ్రీత మంచు మెసవఁడు దా నొసంగె
నాకు ఫలములు జలములు లోకమందు
వానిఁ బోలినవెందును గాన రావు. 161

చ. ఫలముల మీఁదితో లొలువఁ బట్టదు తన్మధురం బెఱుంగఁగాఁ
గలఁడె సుధాంధసుం డయినఁ గమ్మని తియ్యని తజ్జలంబులుం
జులుకన జిహ్వపై నిడఁగఁ జూచినమాత్రన లేచి వచ్చుఁ బ్రా
ణులకు గతించుప్రాణములు నూత్నవికాసముతోడ వెండియున్.

క. మిలమిలని మెఱయుపూవులు
లలి దండలనుండి విచ్చి లఘుగతుల నిటన్
గలయంగఁ జల్లె వాసన
పొలమెల్లం గుబులుకొనియెఁ బో విడకుండన్. 163

క. ఇటు పలుదెఱఁగుల నాతం
డిట నామదిఁ జూఱలాడి యెటకేఁ దాఱన్

దటుకున నాతనిగతి కేఁ
గటకటపడుచుంటి వింటె కరుణావార్ధీ. 164

ఆ. అమ్మునీంద్రపుత్త్రి నాశ్రమంబున కేను
బోయి వానితోఁ దపోవిధాన
మెపుడుఁ దీర్చుచుంట కెంచితి నాతనిఁ
గానకున్న మిత్తి గాన వచ్చు. 165

వ. అని పలికిన విభాండకుండు కొడుకుం జూచి తండ్రీ! తపస్విజనతపో విఘ్నం బాచరింప నిట్లు పెక్కుదెఱంగుల రక్కసు లుక్కుమిగిలి సంచరించుచుందురట్టివారి మముబోం ట్లనుసరింప రాదు వారి మధురాహారమాల్యాదులును దోషభూయిష్ఠంబు లగుటం జేసి వర్జనీయంబు లని వారించియు వాఁ డెప్పు డెచ్చటికేఁ బోవునో యని వాని నన్వేషించుచు మూఁడహోరాత్రంబు లెడఁబాయ కుండి యామమునాఁ డెప్పటియట్ల ఫలంబులు దేరఁ బోలంబున కరిగె నప్పుడు. 166

తే. మెఱపు మెఱసినచందాన మెఱసి తెఱవ
వెండియు మునీంద్రు నుటజంబుదండ కరుగు
దెంచుటయు ఋష్యశృంగుఁ డామెంచుఁబోఁడి
గాంచి మోహించి మది సంభ్రమించి పలికె. 167

చ. నిను విడనాడి నే నిలువ నేర నొకండ మునీంద్రపుత్త్ర! ని
న్నానుకొని వత్తు నీ వనికి నేఁడు ననుం గొని పొమ్ము వేగ నా
జనకుఁడు రాక మున్న యని సారెకుఁ బల్కినఁ గుల్కుమోమునన్
వనిత మునిన్ గ్రహించుకొని నావకుఁ జేర్చె నుపాయసంగతిన్.

వ. నావయుం గతిపయప్రయాణంబుల నంగదేశంబునకుం జని నావ్యాశ్రమవనంబుచెంత నాశ్రయించె నంత. 169

చ. ఘనుఁ డగుఋష్యశృంగుఁడు జగన్నుతుఁ డవ్విషయంబు సేరి నం
తన జలదంబు లెల్లెడలఁ దద్దయుఁ గ్రమ్మి మహాంబుధారలన్
ఘనతరవర్షముం గురిసెఁ గాలువ లై నదు లై సరస్సు లై
ఘనరస మంతయుం ధరణిఁ గప్పి తమింపఁగఁజేసె నెంతయున్.

తే. ఋష్యశృంగునిరాక పృథ్వీశ్వరుండు
వినిముదంబడి తోడ్తెచ్చి వినయమునను
బూజ గావించి తనయంతిపురమునంద
నిలుపుకొని నేర్పుచెంపుచఁ జెలిమి సేసి. 171

ఆ. కన్నకూంతు శాంత యున్నకన్నియ నిచ్చి
పెండ్లి చేసి మిగులఁ బ్రీతితోడ
నరణ మిచ్చె భూషణాంబరరత్నశ
య్యాసనార్థతతుల నతులితముగ. 172

వ. మఱియు విభాండకక్రోధప్రతీకారార్థంబుగా నతని కనేక గోశతసహస్రంబుల నిచ్చి మార్గమధ్యంబునం దెడనెడ గోష్ఠంబులును వానిం బాలింప గోపకులను నియమించి విభాండకుండు వచ్చిన నివి యెల్ల మీపుత్రునిగోరత్నంబు లనియు మేము మీలెంకల మనియుం జెప్పునది యని వారికిం జెప్పి యొప్పించి పుచ్చె నట విభాండకుండును గందమూలఫలాదులం గొని నిజాశ్రమంబునకు వచ్చి పుత్రుం గానక యెల్లకడ లన్వేషించుచు నది యంతయు రోమపాదకృతంబుగా శంకించి హుంకరించుచు నంగదేశంబునకు వచ్చి యనేకగోగణపరివృతం బైనయొక్కఘోషంబు దఱియం జేరి గోపపూజితుండై యట నారాత్రి విశ్రమించి యివి యెవ్వనిగోవు లని యడిగిన గోపాలకు లతని కి ట్లనిరి. 173

మ. ఇవి నీపుత్రునియాలమంద లివిగా కెన్నేనియుం గల్గు ని
ట్టివియు న్నీనికి మించినట్టివియుఁ దుష్టిం బుష్టినిం గూర్చుచుఁ
భువనాతీతతపోధనా వినుము నీ పుత్రుండు దా నంగరా
డ్భవనంబందు మహావిభూతి పొదలన్ భాసిల్లుఁ దా నల్లుఁడై. 174

సీ. అన విని హర్షించి మునిరాజు మనమునఁ
గలకోప మంతయుఁ దొలఁగఁ ద్రోచి
వడివడి నడ నేగి వసుమతీశుని రోమ
పాదునిఁ గని తత్సపర్యలంది

శాంతాసమేతుఁడై సంతతానందుఁడై
చనుకుమారునిఁ గాంచి సంతసించి
ఘోషముల్ గ్రామముల్ కొడుకున కొసఁగిన
వియ్యముం గని దయాన్వితుఁ డగుచుఁ

ఆ. గొడుకు పుట్టుదనుకఁ గొడుకు నం దుండంగ
నాన తిచ్చిచనియె నంత ఋష్య
శృంగుఁ డవల శాంతకుం గడుఁ గూరిచి
శ్వశురునింట నుండె సౌఖ్యగరిమ. 175

తే. లోకవాసన యెఱుఁగక లోలచిత్తుఁ
డైనఋశ్యశృంగుఁడు శాంతహస్తముఁ గొని
యంగపతి కల్లుఁ డైయున్నదాది సర్వ
లోకవృత్తాంతవేదియై వీఁక నొప్పె. 176

క. ఖ్రితులుగా శాస్త్రము లెఱిఁగిన
చతురున కొక్కింతలోనఁ జవి చూడనిసం
గతు లైన న్వినినంతన
మతి కెక్కం దెలియ వచ్చు మహితము లగుచున్. 177

మ. అని తొల్లింట సనత్కుమారుఁడు తగన్ వ్యాహారముం జేసె నా
తని నీ వేగి స్వయమ్ముగా నిటకుఁ దేఁ త్వత్పుణ్యలేశంబునన్
దనయుల్ నల్వురు నీకుఁ బుట్టెదరు తద్వాక్యంబె ఋవ్వాక్య మో
జననాథాగ్రణి వానిఁ దెచ్చి సవమున్ సల్పం దగు న్నానుడిన్. 178

—♦ దశరథుండు ఋష్యశృంగునిఁ దేర నేగుట ♦—

వ. అని యిట్లు సూతుం డనుసుమంత్రుండు చెప్పిన నప్పు డానందకం దళితాంతరంగుండై దశరథుండు సాంతఃపురుండును సహామాత్య సామంతుండును సహవసిష్ఠవామదేవుండునై కదలి కతిపయప్రయా ణంబుల వనంబులు నదులు నతిక్రమించినవెనుక రోమపాదుని పురంబునకుం జని పూజితుండై రాజాఖ్యాతుండై విఖ్యాతిం గాంచి యున్నఋశ్యశృంగునిం గని గోత్రనామంబు లుచ్చరించి నమస్క

రించి సంభావించి యటం గొన్నినా ళ్ళుండి రాజుం గాంచి
యి ట్లనియె. 179

సీ. ఏ నధ్వరము సేయ నెంచితి శాంతయు
నల్లుండు నీవు నీయాండ్రు నటకు
రాం గోరి ప్రార్థింప నేం గదలి కుటుంబ
సహితుండ నై నీదుసదనమునకు
వచ్చితి రాజేంద్ర! వాత్సల్యమునం జేసి
యందఱు నట రాంగ నవధరింపుం
డని ఋష్యశృంగునియనుకంప కెదురు చూ
చిన రాజు నింగితమునుగ్రహించి

తే. తనదుసహధర్మిణినిం గన్నతండ్రి యనుచుం
దెలియుటం జేసి దశరథు నలఘుభ క్తి
భావమునం జేసి కనుంగొని దేవకల్పుం
డైనఋష్యశృంగుండు మామ నాదరించి. 180

ఉ. మ్రొక్కెడునత్తమామలకు మోదమునం దనధర్మపత్నిచే
మ్రొక్కంగం జేసి తా నృపతిబొజ్జకుం దాకంగ వంచి శీర్షమున్
మిక్కిలిహర్షముం దెలుపుమేల్వచనంబుల నాదరించుచున్
మక్కువం జూపె నెంతయును మాటలచేతల మానసంబులన్. 181

—♦ శాంతాకౌసల్యల సంభాషణాదికము ♦—

ద్విపదము 1. తనకన్నబిడ్డ శాంతామహాదేవి
యని మాత్రమే కోసలావనీనాథ
తనయ యొఱుంగును దద్రూపకాంతి
యును విలాసము మాటయును హాస మెపుడొ

2. పాపయై యున్నపుడు పరికించెం గాని
యాపయి నెప్పుడు నరసి యుండమిని
నానవా ల్పట్టలేనట్టిదై సంశ
యానందములతోడ నాశాంత నట్టి

3. కనియె నామెయుఁ దన్నుఁ గన్నతల్లి యని
వినుటయే కాని తా వీక్షించి యుంట
యెఱుఁగదు గావున నెంతయువింత
తెఱఁగునం దల్లినిఁ దిలకించుచుండె

4. నింతలో నిద్దఱి కేకాల సమ్మోద
మంతరంగంబులయందుఁ బొదయుచుఁ
నట్టి కన్దోవలందు హర్షాశ్రుజలము
పుట్టి నొండొరు గాఢముగఁ గౌఁగిలించి

5. కొని రెల్లవారుఁ గన్గొని తల్లిఁ బిల్ల
మనముల హర్షించి మన్నించి రపుడు. 182

శా. గాఢాలింగన మాచరించుకొని వేడ్కం దల్లియుం బిల్లయున్
మూఢప్రక్రియఁ బెద్దదవ్వు గను మోమున్ మోమునుం జేరుకో
వ్యూఢానందభరమ్మునం గనుల నీ రుప్పొంగి పాఱంగ న
ప్రౌఢల్ వా రని యెల్లవారికిని దోఁపం బొల్చి రప్పట్టునన్. 183

—♦ శాంతాఋష్యశృంగు లయోధ్య కేగుట ♦—

ఆ. అపుడు రోమపాదు డాఋష్యశృంగుని
దరికిఁ జేర వచ్చి దశరథుండు
నాదుప్రాణసఖుఁడు నాకు వానికి నభే
దమ యటంచు నెఱుఁగఁ దగును నీవు. 184

ఉ. అల్లుఁడ వంచు నిన్ బిలుచునట్టిఁడ నైయుట కేగుదెంచెఁ దా
నెల్లమహీసురుల్ సుర లనేకవిధంబుల మెచ్చ వాజిమే
ధోల్లసదధ్వరంబు పరమోత్సుకతం బొనరించుఁ గావునన్
దెల్లము గాఁగ నందఱము దేవమహంబును జూడఁ బో నగున్. 185

క. నీవును నీజాయామణి
యీ వసుధాధీశువెంట నేగఁగ వలయున్
నే వత్తు నవల సంక
ల్పావసరం బెఱిఁగి సముచితారంభుఁడ నై. 186

తే. అనిన నొం గాత మని విభాండాత్మజుండు
పలుకునంతన దశరథావనివిభుండు
పెన్నిధిం గొన్ననిరుపేద విధము దోఁప
హర్షవార్నిధి నోలాడె నంతలోన. 187

వ. రోమపాదునకుం జెప్పి సర్వపరివారపరివృతుండై శాంతర్ష్యశృంగులతోడం గూడి శుభదినంబునఁ బయనంబై కొన్నియోజనంబుల మార్గం బతిక్రమించి నంతఁ దమకన్న మున్న పోఁ గలజాంఘికులం బుచ్చి పురం బలంకరింప నియోగించె. 188

## —♦ అయోధ్యాపురాలంకారము ♦—

సీ. అంతరాంతరముల నారాజమార్గంబు
నలువుగా సమ్మార్జనమ్మొనర్చి
నలుకెలంకులయందుఁ జలువ లీనంజాలు
పన్నీటఁ గలయంపి పరఁగఁ జల్లి
వరచతుష్పథములు నఱుగులు కస్తూరి
సిస్తుగా గోముఖశ్రీలఁ దీర్చి
కనులపండువు గాఁగఁ గనఁ బడఁ గట్టాణి
ముత్యాల ప్రోవుల ముగ్గు వెట్టి

తే. మేలురతనాల తోరణా లోలిఁ గట్టి
పట్టుపవలుగ రే యెల్ల నట్టె మాఱి
నన్నిదిక్కుల యంత్రదీపాళిఁ బెట్టి
పురముఁ గైసేసి రెల్లెడ ముదము గదుర. 189

మ. ప్రతివీథిం బ్రతిచత్వరంబునఁ బ్రతిద్వారంబున న్నేర్పునం
బ్రతిపాదించినకీలుబొమ్మ లటకుర్ రా నెవ్వరే లేచి స
త్కృతి గావించెడునాఁగ నింత చని తోఁతే నైసుఖాసంబు వై
చి తగన్ వీవన వీఁచి యాఁకుమడుపుల్ చేసేత నందిచ్చెడున్.190

మ. పురవీథిం జనునట్టిజానపదు లెప్డున్ గిట్టునం దిర్గుచున్
మరుదాప్తి స్వేదజల్లుచక్రములు నంభస్సారము లీఁకదికిన్

విరియం జేసెడు గోట్టముల్ దివియల న్వెల్గించు కాచంబులున్
బరిశీలించిరి నేత భూతముల నాఘక్కిం బ్రబంధించెనాన్. 191

ఉ. మాటల నాడుతీవలును మానుగ సంజ్ఞలఁ జేయుతీవలున్
మాటికి మాటి కార్చుచును మార్గములం దిరుగాడునుక్కుబం
డ్లోటమి లేక సంతత మహో యనఁ గాలముఁ దెల్పుకంబముల్
వీట సమస్తభోగముల విజ్ఞులు నిల్పిరి రాజనాజ్ఞమై. 192

తే. పల్లకీ లందలమ్ములు భద్రకరులు
తేరు లశ్వంబు లుష్ట్రముల్ వీరభటులు
దారులన్ సందడింపఁగఁ దేరి పురము
పట్టపగ్గము లేకుండఁ బరఁగె నపుడు. 193

తే. అట్లలంకృత మగుపుర మఖిలజనుల
తోడ దశరథభూవిభుం డోడనిమదిఁ
గూఁతు నల్లుని వెంబడిఁ గొనుచుఁ జేర
వచ్చెఁ దన కెల్ల రెదురుగా వచ్చుచుండ. 194

వ. అట్లు సముదాచారంబు నడిచినంత దశరథుం డతిమనోహరంబుగ నలంకృతం బయినపురీవరంబుఁ జొచ్చి రాజమార్గంబున ముచ్చట వడి యెల్లరం గూడి నడచి వచ్చుసమయంబున. 195

శా. కాంతం బై కనుపట్టు నెన్నుదుట శృంగం బూని కాంతుండు త
న్నెంతేనిం బ్రియ మేర్పడం గనుచుఁ జేయిం జేయియుం జేర్చి రా
శాంతాదేవి మనోహరంబుగ నడల్ సాగించుచుండం బురీ
కాంతల్ పూరుషులుం గనుంగొని రొగిం గౌతూహలస్వాంతులై.

శా. పూలున్ లాజలు సేసలున్ ముద మెదం బొందం బురంధ్రీమణుల్
వాలాయంబుగ దాజవీథినడుమన్ వా రోల్వుచుండంగ శాం
తాలక్ష్మీవరశీర్షమందు మఱియుం దన్నాథశీర్షంబునన్
బోలం జేరెడునట్లు చల్లి రినుఁ డామోదించుచుం జూడఁగన్. 197

తే. అంత నంతఃపురాంగన లల్ల నల్లఁ
గక్ష్యములు దాటి లోనికిం గాలు వెట్టు

శాంతఁ గని కృపపారతుల్ సంతసమునఁ
బట్టి తోడ్కొనిపోయి రప్పట్టునందు. 198

వ. ఇట్లుపురప్రవేశంబు గావించినపదంపడి రాజేంద్రుండుకొంతకాలంబు
గడిపినంత. 199

—♦ వసంతవర్ణనము. ♦—

సీ. మావిపూఁదేనెల మత్తిల్లి యలిగాయ
కాళి సుస్వరముల నోలిఁ బాడె
శుకశారికాది సచ్ఛకునసంతానమై
తాళికాళి ఘనశబ్దములఁ బలికెఁ
జిన్ని రాని మత్తైక్కిఁ జిరరవంబున వన
ప్రియకోటి కాహళఁ బ్రీతిఁ బట్టె
చెక్కలల్లార్చుచు నొక్కొటఁ గొలఁకుల
హంసకాంతాళి నాట్యంబు లాడె

తే. అట్టియామని సంతస మావహిల్ల
మన్మథోత్సాహజనకుండు మాధవుండు
సొగసులకు నెల్లఁ దానక మగుచు నెపుడు
వెలయుచున్నట్టివనలక్ష్మిఁ బెండ్లియాడె. 200

క. అలమాధవుఁడు వసేందిర
పలచితగతిఁ బెండ్లియాడుసమయమునందున్
దలఁ బ్రాలు చల్లుకొని రను
పోలుపున సలరారె మల్లెపూలు ధరిత్రిన్. 201

తే. మాధవునిఁ గూడ గమకించి మలయుమనము
తో వసేందిర తొల్లింటితోఁపుచీర
విడిచి క్రొంగెంపుచీరఁ దాల్చెడుననంగఁ
జెట్లఁ బ్రాయాఁకులూడి కెంజిగురు లలరె. 202

వ. అట్టివసంతాగమంబు సమనుప్రాప్తం బగుచుండ నొక్కనాఁడు
దశరథుండు మంత్రులనామంత్రణంబు చేసి యి ట్లనియె. 203

తే. సర్వసంభారములు మున్న నంతరించి
మీరు జాబాలిముఖ్యుల భూరియశుల
ఋత్విజులఁ బిల్చి రాజుల కెఱుకపఱచి
వెదకి సవనాశ్వమును దేర వెడల వలయు. 204

తే. సరయువున కుత్తరం బగుస్థానమందు
యజ్ఞభూమి నొనర్చి సమంతముగను
నాగలిం గట్టి దున్నించి నలువుపఱచి
శాలలఁ జేయ నొప్పెడు శాస్త్రవిధిని. 205

—♦ అశ్వమేధాశ్వలక్షణము ♦—

సీ. అశ్వమేధీయాశ్వ శశ్వదుదంతము
తల్లక్షణ మెఱుంగఁ దగును మీకు
నశ్వమాతాపిత లగునశ్వరాజముల్
బ్రహ్మచర్యవ్రతప్రజ్ఞ గలిగి
యితరాశ్వసంపర్క మిది యెన్నఁడును లేక
సుదినంబునం దది చూలు కొనఁగ
నగ్గర్భమందుఁ బుట్టంది దశధ్రువల్
స్వస్థానములయందు జతనుపడఁగ

తే. దేవమణి రోచమానము గ్రీవమణియు
లోనిసల్లక్షణంబులు పూని బ్రహ్మ
చర్యమున నొప్పునశ్వరాజమ్ము చంద్ర
ధవళ మది యెన్న నశ్వమేధమున కొప్పు. 206

తే. మఱియు మేను తెలుపు ముఖ మెఱుపు చెవులు
నలుపు పుచ్ఛము పచ్చన గలిగి యుండి
బ్రహ్మచర్యవ్రతంబున వఱలి మంచి
సుడులు గలగుఱ్ఱ మైన నొప్పెడు నటంద్రు. 207

తే. ఛిద్రములు రోయుచుఁ జెంతఁ జేరి బ్రహ్మ
రాక్షసులు విఘ్నములు ఘొనర్పంగఁ జూచు

చుందు రెందు నే లోపము నొంద నట్లు
నరయుచుండుఁడు దోషము లంట కుండ. 208

వ. అని చెప్పి ధీసచివుల నంపిపుచ్చె నంతలో సమాగతు లయి స్వస్తిం బలుకుచున్నసుయజ్ఞ వామదేవ జాబాలి కాశ్యప వసిష్ఠ ఋశ్య శృంగులం జూచి లేచి ప్రాంజలియై బ్రహ్మవాదులు ధర్మజ్ఞు లగు వారిదిక్కు మొగంబై ధర్మార్థసంహితంబు గా ని ట్లనియె. 209

ఉ. పుత్రులు లేనినాకు సుఖముం దలపోయఁగ రాని దయ్యె నో
ధాత్రిసుపర్వులార! ఋషితల్లజు లీరు భవత్కృపాదృతిన్
బుత్రుల నొందఁగాఁ దలఁచి పూతతురంగమమేధయాగమున్
బాత్రత గల్గి చేయుటకు భావ మొనర్చితి మీర లా నన్. 210

వ. అనిన ఋశ్యశృంగపురోగము లగువా రి ట్లనిరి. 211

తే. యజ్ఞసంభారములు గూర్చి హయము విడువఁ
దగు నుపాధ్యాయరక్షితంబుగ నరేంద్ర
సవమహిమఁజేసి పాపముల్ సమయు నీకు
నాత్మజప్రాప్తి యగు నిశ్చయమ్ముసుమ్ము. 212

వ. అని బ్రహ్మవాదు లాశీర్వదింప దశరథుండు పత్నీసహితుండై సుముహూర్తంబున యజ్ఞసంకల్పంబు జేసి ఋత్విగ్వరణంబు గావించు వాఁడై మునుమున్న సోమప్రవాకుం గోరిన నతండు. 213

—♦ ఋ త్వి గ్వ ర ణ ము ♦—

మ. ధరణీశానుమతిన్ వసిష్ఠుకడకుం దా వచ్చి సాకేతపూ
ర్వరనాథుండు హయాధ్వరం బొనరుపన్ వాంఛించి సంకల్పమున్
వరఁగం జేసియు నిన్ను వంశగురు నధ్వర్యుంగ నర్థించెఁ జు
మ్మరితిం దత్సవమం దొనర్పఁ దగు నీవాధ్వర్యవంబుం దగన్. 214

క. నావుడు నోంకారంబున్
గావించి మునీశ్వరుండు కడుమోదముునన్
భావించి "మహాన్వై వో
చో" వాక్యజపస్థిం బొనర్చె సురుచిరగతులన్. 215

తే. అంత సోమప్రవాక శాంతాత్మవిభుఁడు
ఋశ్యశృంగునిచెంగటి కేగి తొంటి
యట్లు చెప్పిన నాతఁడు నట్లు పలికి
మంత్రజప మొప్పఁగాఁ జేసె మహ మెసంగ. 216

వ. పిమ్మట చైత్రాది మాసముల సాంగ్రహణ సంజ్ఞానప్రాజాపత్యత్రైధాతవీయేష్టులం జేయుచు ననుక్రమంబుగా వామదేవ జాబాలి ప్రభృతుల హోత్రాగ్నీధ్ర మైత్రావరుణ ప్రతిప్రస్థాత్రుద్గాతృ ప్రస్తోతృ బ్రాహ్మణాచ్ఛంస్యచ్ఛావాక నేతృపోతృప్రశాస్త్ర గ్రావస్తుత్తోన్నేతృ సుబ్రహ్మణ్యుల గా నాయాకాలంబుల వరించి తెచ్చిన యజమానుండు ఫాల్గుణావాస్యయందు సంజ్ఞానేష్టియు వైశాఖపూర్ణిమఁ బ్రాజాపత్యేష్టియునాగామిపంచదశిఁ ద్రైధాతవీయేష్టియుంగావించి మించినభక్తి సవనకర్మం బొనర్చుచు నధ్వర్యుప్రభృతులు చిత్రాపౌర్ణమాసీప్రథమదినంబున సాంగ్రహణేష్టిం జేసి ద్వితీయదినంబున ద్వాదశారత్నిప్రమాణం బగుముంజమయరశనం జేసి యజ్ఞీయాశ్వముం దెచ్చి బంధించి స్నపనప్రోక్షణాదిసంస్కారసంస్కృతంబు గావించి దేశంబులం దిరిగి రా విడిచి రపుడు దానివె న్నంటి నూర్గురు రాజపుత్రులు నూర్గురు వైశ్యులు నూర్గురు శూద్రులు నూర్గురు సూదగ్రామణులు రక్షకులై ప్రస్థానంబు సేయ నుండ సప్తతంతుసప్తి సమంత్రకంబుగ సాగనంపి రంత సరయూత్తరతీరంబున శాంతికర్మములు విధివిధానంబునం బ్రవర్తిల్లఁ జేసి ప్రతిదినంబును నష్టాకపాలంబున సావిత్రేష్టులసాఁగించుచు సుబ్రహ్మణ్యాహ్వానంబు గావించుచుఁ బూర్వసంవత్సరంబు పరిసమాప్తిం గావించిరి. 217

## —♦ ద్వితీయసంవత్సరారంభము ♦—

సీ. అంతటఁ మరల వసంతసమాగమ
మయి వత్సరము పూర్ణ మయినయపుడు
యజ్ఞదీక్షం బొందునట్టిఁడై జనవిభుం
డధ్వర్యునిం గాంచి యధ్వరంబు

సీ. నీయధీనము నాకు నెఱిమీఱు నట్లు గా
సర్వోత్తరంబుగా సలుపు మన డు
నతఁ డట్లగుం గాత మని పల్కి స్థాపత్య
కర్మాంశికుల శిల్పకరుల ఖనక

తే. గణకనటన ర్తకులఁ బిల్చి గారవించి
రాజునుడిఁజేసి యజ్ఞకర్మముల మీరు
పాలుగొని యుండు డిష్టకల్ బహుసహస్ర
ములుగఁ జత్యర్థముం దెంపు మున్ను మున్ను. 218

వ. అని మఱియు బ్రాహ్మణప్రభృతులం గాంచి. 219

సీ. బ్రాహ్మణగృహములు రాజగృహంబులు
నతిథిభోజనముల కనువుపఱచుఁ
డెల్లవర్ణమువా రిష్టమృష్టాన్నము
లేవేళలఁ భుజియింప వలయు
నావాసముల భుక్తి యనుసంత నిడునట్లు
సదుపాయముల నెందు సలుప వలయు
జానపదులె కాని జనులె కాసీ వారి
నాదరింపుఁ డవజ్ఞ యేది తగతు

తే. వ్యగ్రహృదయులు గాక మీరన్నిపనులు
చక్కఁబెట్టుచు నుండుఁ డీసవనదినము
లందు నృపునందు మాయందు స్వాంతమందు
భక్తి భావించి వర్తింప వలయు మీరు. 220

వ. అనిన వా రందఱు నేకగ్రీవముగా రాజాజ్ఞ శిరసావహించి వర్తింతు
మనినంత సుమంత్రుం బిలిచి యి ట్లనియె. 221

తే. సర్వదేశములం గలజనులు నాల్గు
వర్ణములవారిఁ గడుగారవమ్ముఁ జూపి
వాజిమేధమునకుఁ బిలువంగ వలయు
భేదభావ మొకింతయేఁ బెట్టకుండ. 222

వ. అని మఱియును. 223

—♦ వసిష్ఠుఁడు సుమంత్రునిచే నెల్లవారి నాహ్వానించుట ♦—

సీ. జనకుని మిథిలాపతిని నీవ పిలువుము
బంధు వగుఁ జనపతి కతండు
కాశీపతిని రాజకౌశికుం బిలువు మీ
వనుఁగు రాజేంద్రున కానరపతి
వృద్ధుఁ గేకయరాజుఁ బిలుపుము నీ వేగి
శ్వశురుఁ డాతఁడు మనధర్మవిభునకు
సంగేశు రోమపాదాధిపుం బిలువు మా
తఁడు ప్రాణమిత్రము ధరణిపతికిఁ
తే. బ్రథితసింధు సౌవీర సౌరాష్ట్రవిభులఁ
దెలిసి ప్రాచ్యుల దక్షిణాత్యుల నుదీచ్య
జనవిభులఁ బిల్చి తోడ్తెమ్ము సపరివార
బంధుమిత్రముఁగా యజ్ఞవాటమునకు. 224

వ. అని చెప్పి పుచ్చినయనంతరంబు. 225

మ. శుభలగ్నంబున రాజపత్నులును సంశుద్ధాంతరంగుల్ ద్విజుల్
విభవం బేర్పడ రాజచంద్రులును ఋత్విక్కుల్ భజింపఁగ దుం
దుభులుఁ శంఖమృదంగముల్ మొఱయుచోఁదోఁగొంచుదివ్యారణీ
ప్రభవుఁ బోయెను యజ్ఞవాటమునకుఁ రాజేంద్రుఁడానాఁడనఁ.

తే. అపుడు రక్షకుల్ వెంట రా నధ్వరాశ్వ
మరుగు దెంచెను సాకేతపురికి నంత
దాని రథకారగృహమందుఁ దనర నిల్పి
పదములన్ ధృతిహోమముల్ పర్వఁ జేసి. 227

వ. పదంపడి దానిం గొంపోయి యశ్వత్థవృక్షంబులకడం బంధించి
చైత్రప్రతిపద్దినంబున దేవయజనంబునఁ త్రైధాతవీయ దీక్షణీయే
ష్టులం జేసి సప్తదినంబులు దీక్షాహోమంబులు మూడుమూడు
వైశ్వదేవహోమంబులు గానేకవింశతిహోమంబులుం బూర్ణాహు

తియుయథామీమాంసాశాస్త్రంబుగనావసదావసథ్యాదినకృత్యంబు నిర్వర్తించి బహుబంధనరశనం గలుగునాజ్యంబున యజమానున కభ్యంజనంబు గావించి దక్షిణకరంబునఁ గృష్ణవిషాణముం గట్టి కంటెకిం గాటుక వెట్టి సాంగకృష్ణాజిన మొసంగి దీక్షావ్రతంబు గావించి రంత. 228

—♦ సోమసంగ్రహణము ♦—

సీ. దక్షిణంబునఁ బ్రహ్మ తత్పశ్చిమంబున
నధ్వర్యుఁ డుత్తరమందు హోత
ప్రాగ్దిశ నుద్గాత వసియించి ఋత్వులతో
బాల సోముని దంపి రసము దీసి
ప్రాతస్సవనపూర్వవరకర్మము లొనర్చి
యైంద్రవాయుప్రీతి కాచరించి
యవల మాధ్యందినసవనంబు జరిపి తృ
తీయసవనమును దీర్చిచేసి
తే. రేక్షస్ఖలితముల్ లేకుండ నెల్లవేద
మంత్రములు నెల్ల స్తుతశస్త్రమార్గములను
శాస్త్రవిహితనారాశంససరణితోడ
మూడుసవనంబు లప్పుడు మొగి నెసంగె. 229

తే. అహుతమును స్ఖలితమును లే దాసవముల
సర్వహోమములుఁ మంత్రసరణి క్షేమ
యుక్తముగ బ్రహ్మవేత్త లాయుక్తమాధ్వ
రమునఁ బొనరించి రెంతయుఁ బ్రాజ్ఞు లగుచు. 230

సీ. ఆదినంబుల శాంతు లాఁకలి గొన్నవార
మందునకేఁ దోఁప రందు నెందు
నెల్లజాతులవారు నెపుడు తాపసులును
వృద్ధులు వ్యాధితుల్ స్త్రీలు బాలు
రనిశంబు భుజియింతు రటులైన సంతృప్తి
నొందక యజమానుఁ డందఱకును

మృష్టాన్న మొసఁగుఁడు మేల్పాత్రముల నిండు
 తినుబండముల నెల్లఁ దెచ్చి పెట్టుఁ
తే డనుచుఁ బలుకుచు నుండు నయ్యాదన పర్వ
తోపము లయి పెక్కులు నయి కోఁప వచ్చె
నన్నరాసులు భక్ష్యభోజ్యములరాసు
లన్నిచోట్ల మహానసమందు నెపుడు. 231

తే. అన్నపర్వతవరనిర్గతాజ్యతటిని
శాకపాకాదిదారు సంచయముఁ గొంచు
పంచశాఖలతోఁ బోయి బాడబాస్య
మును బ్రవేశించె నాజన్న మొనరునపుడు. 232

—♦ సోమరాజాహ్వానాదికము ♦—

వ. అంత సోమయాగానంతరమ్మున సోమరాజాప్యాయనమ్మును ద్వాదశబ్రహ్మవన్ద్యాదికమ్ములును గావించి యుపసత్తంత్రంబున నిష్టి నడపి బహిష్పవమానంబులఁ బ్రస్తుతించి సోమరాజానుగ్రహంబు వడసిన పదంపడి యూపసంస్కారం బొనరించువారై యాఱు బైల్వంబులు నాఱు ఖాదిరంబులు నాఱు పాలాశంబులు నొక్కశ్లేష్మాతకంబును రెండు దేవదారువులు నగుయూపంబులును వానికలంకృతంబులు శోభనాగ్ర మేకవింశతిసువర్ణయూపంబులు నేకవింశత్యరత్నిపరిమాణంబులుగ వినిర్మించిరత్న వస్త్రమాల్యాదుల నలంకరించి వాని నెల్ల విధివిహితస్థలంబుల నుచ్ఛ్రయంబు గావించి రవి నభోమధ్యంబున సప్తర్షిమండలంబువలె మండితంబు లగుచుండె ననంతరంబ. 233

సీ. శుల్బజ్ఞు లగుబుత్విజులు వహ్నిచితి నట
 నుత్తరవేదియం దొప్ప మిగుల
విధికల్పితేష్టకా విసరంబునన్ రుక్మ
 పక్షయుగ్మమువిప్పి ప్రాఙ్ముఖముగ

నుండి క్రిందుగఁ జూచునండజేంద్రునిఁ బోలె
నష్టాదశాత్మక మనఁగ నైన
పరిస్తారముం గల్గు ఫక్కి దివ్యేష్టకా
చయనంబు గావించి శాస్త్రఫణితి

తే. దానిపై నగ్నిహోత్రము తగఁ బ్రతిష్ఠ
సలిపి పాశుకాదులు హోమములు సమస్త
మందు గావింత్రు ఋత్విజు లఖిలవిదులు
యుక్తవేదోక్తమంత్ర సంయోగములను. 234

—♦ హయమేధ పశువివరణము ♦—

సీ. వాజిమేధమునందుఁ బశువులు మున్నూఱు
హయముతోఁ బక్షులు నప్పరములు
నురగము లయ్యుర్వదొక్కఁడు యూపము
లందుఁ దత్తద్దేవతాదుల కయి
రశనల బంధించి ప్రత్యేకసంప్రోక్ష
ణాదిసంస్కారము లాచరించి
రవలఁ గౌసల్య కై నసిదము గొని మంత్ర
ములు చదువుచునుండ ముదము పొదల

తే. అశ్వరాజము విశసన మాచరించి
యచట శామిత్ర సన్నిధియందు విగత
జీవ మగుదాని నారేయిఁ జేవమీఱ
కుత్సవిడి కాచుకొని యుండెఁ గూడిమహిషి. 235

వ. అంత మఱునాఁడు. 236

తే. హోత కధ్వర్యునకును నుద్గాత కంత
దశరథుఁడు కట్నము లొసంగె దదవసరమున
దానివపఁ దీసి యధ్వర్యుఁ డానుపూర్వ
హోమమొనరించెఁ బ్రజ్వలదుత్తరాగ్ని. 237

క. తురగవపాహోమోద్గత
వరధూమసుగంధ మపుడు వసుధాధిపుడున్
వరవర్ణినులు ప్రజలు పరి
పరి నాఘ్రాణించి రెల్లపాపము లరుగన్. 238

వ. అంత నితరజంతువపలవేల్చినంత హయాంగంబులెల్లఁదీసి పచనంబు గావించి ప్లక్షశాఖం బెట్టి వేల్చి పదంపడి మూఁడుదినంబు లందు ప్రథమదినంబునఁ జతుష్టోమంబు నాఁబడునగ్నిష్టోమంబును ద్వితీయ దినంబున నేకవింశోక్థ్యయుక్తం బగుటంజేసి యుక్థ్యంబు నాఁబడు జ్యోతిష్టోమంబును దృతీయదినంబున సర్వస్తోమయుక్తం బగునతి రాత్రంబును షోడశియు నభిజిద్విశ్వజిత్తులును హయమేధాంగంబులుగ నొనర్చి రిట్లిష్టకాచయన వపాహోమ చతుష్టోమ సవన మహంబులు యథావిధిం గావించినపదంపడి దక్షిణాకాలంబున. 239

—♦ హయమేధదక్షిణాప్రదానము ♦—

తే. ప్రాజ్మహీస్థలి హోతయుఁ బశ్చిమప్ర
దేశ మెల్ల నధ్వర్యుఁ డుదీచి భాగ
మెల్ల నుద్గాత దక్షిణభూమి బ్రహ్మ
గొనఁగ దక్షిణగా నిచ్చె మనుజవిభుఁడు. 240

క. క్రతువర్ధనుఁ డీరీతిన్
క్షితి యంతయు దాన మీయఁ జేకొని ఋత్వి
క్తతి యిట్లు పలుకు జనపతీ!
శ్రితిహితులకు భూమి నేలు ప్రోడల మట్టె. 241

ఉ. గోవులు రత్నముల్ మణులు కొంతసువర్ణము నిష్క్రయంబు గా
నీ విపు డిచ్చి మావలన నేల గ్రహింపుము మాకు వల్కకో
భూవర! నాఁగఁ బంక్తిరథభూపతి వారలు కోరినట్లు గా
గోవులు దొట్టిసొమ్ములను గొండ ని యిచ్చిగ్రహించె భూస్థలిన్.

క. వెనుకన్ బ్రసర్పకులకున్
ఘనులకుఁ గోదానకోట్లు కనకంబు మణుల్

ధనధాన్యవస్తువాహన
వినుతార్థము లిచ్చి పుచ్చె వేడుకతోడన్. 243

—♦ పు త్రి కా మే ష్టి ప్ర కా ర ము ♦—

వ. అవభృథాదిక మైనపయి దశరథుండు విభాండకసుతుంగాంచి మన
స్కరించి యి ట్లనియె. 244

క. కులవర్ధను లగుపుత్రులఁ
గలిగింపఁగఁ గోరుచుంటిఁ గరుణారససం
కలితాత్మ! యనుఁడు నాతం
డలుపము గానట్టిహార్ద మాత్మం బొడమన్. 245

వ. ధ్యాననిశ్చలమనస్కుండై కన్నులుమూసి యొక్కింత సేపుండి లబ్ధ
సంజ్ఞుండై రాజుం గాంచి యి ట్లనియె. 246

మ. తెలియ న్వచ్చె నథర్వశీర్షమున వర్తించున్ మహామంత్రముల్
విలసత్పుత్రవివర్ధనంబులు మహోర్వీనాథ! తన్మంత్రసం
కలనంబుం గలుగంగఁ జేయుదము వేడ్కం బుత్రకామేష్టి. త
త్ఫలితం బాత్మజసంభవం బనుచు జెప్ప న్వచ్చు భూమీశ్వరా.

మ. అని యిష్టిం బ్రచురింపఁ జేయుటయు నం దాహ్వానముం బొందిదే
వనికాయం బరుదెంచి హవ్యములు లిప్సం బొంది పో స్విష్టకృ
ద్ఘనహోమం బొనరించి వేఁడిరి జగత్కల్యాణసంధాయకున్
మునిలోకాంచితపాపపద్మని జగత్పూజ్యున్ సురేంద్రేఖ్యునిన్. 248

ఆ. అపుడు నింగి ముట్టునట్లు వైశ్వానరుం
డున్నతార్చి యగుచు హోమధూమ
మెల్ల కడలు నిండ నేచి పురోడాశ
మారగించుచుండె నట్టియెడల 249

—♦ పా య స ప్ర దా న ము ♦—

సీ. రక్తకృష్ణాంబర రంజితాకృతి మహా
బలుఁడు రక్తాస్యుఁడు భానుదీప్తి

దుందుభిస్వనసముద్భూతుఁడు స్నిగ్ధహ
ర్యక్షకేశుఁడు శ్మశ్రురమ్యముఖుఁడు
సూర్యసమాకారశోభితుం డనలశి
ఖోపముం డదిరిసమున్నతుండు
లక్షణసంపన్నుఁ డక్షయప్రతిభుండు
ప్రోద్యత్సుభూషావిభాసితుండు
తే. తప్తజాంబూనదమయుండు గుప్తదివ్య
పాయసపరిపూర్ణ మగుకనపాత్రినిఁ బ్రియ
పత్నినిం బోలెఁ జేఁబట్టి పరఁగఁ బొల్చె
నప్పు డాహవనీయమహాగ్నినుండి. 250

వ. అట్లు పొలిచి తన్నుం బ్రార్థించుచున్నపార్థివుం గాంచి. 251

క. నృపవర! నేఁ బ్రాజాప
త్యపూరుషుఁడ నైతి దేవతలపంపున దే
వపతి వినిర్మితపాయస
మపురూపము పుత్రదంబు నగు నిది తెలియన్. 252

వ. ఇది నీయనురూప లగుపత్నులకుం బెట్టుమని రాజుచేతం బెట్టి
యదృశ్యుం డయ్యె నంత దశరథుండును. 253

—♦ దశరథుఁడు భార్యలకుఁ బాయసంబు పంచి యిచ్చుట ♦—

సీ. దేవదత్తంబును దేవాన్నసంపూర్ణ
మగుస్వర్ణపాత్రిక నవధరించి
యానందకందళితాంతరంగుం డయి
పుత్రకామేష్టిసంపూర్తిచేసి
పాయసాన్నంబు విభాగించి సాము కౌ
సల్యకు నిడి కడసామునందు
సాము సుమిత్రకు సాపడ నిచ్చి శే
షము దాని రెండుభాగములు చేసి

తే. ఒక్కభాగము కైకకు నొసఁగి మిగిలి
నది సుమిత్రకు వెండియు నతఁ డొసంగె
వారు తమతమభాగముల్ కోరికమెయి
నారగించిరి భక్తిపూర్ణాత్మ లగుచు. 254

వ. అని చెప్పిన విని నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు సెప్పు
మని సూతు నడుగుటయును. 255

ఆశ్వాసాంతము.

శా. శ్రీవైకుంఠపురంబు గట్టి యచటన్ శ్రీదేవితో వైభవం
బేవేళం బ్రకటించుచుండు భువనాధీశుండు శ్రీశుం డనన్
ఠీవిం బొల్చినరామమంత్రి సమతన్ దీపించునయ్యా దరా
ఖ్యావిఖ్యాతుఁడు సర్వసౌఖ్యములతో హర్యాందు నెల్లప్పుడున్. 526

గద్యము

ఇది శ్రీమహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ
కవిసార్వభౌ మాంధ్రవ్యా సాభినవశ్రీనాథ వేదవిద్యా
విశారద శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతం
బైనశ్రీకృష్ణరామాయణంబునందు
బాలకాండమున ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# శ్రీకృష్ణరామాయణము

## బాలకాండము

### తృతీయాశ్వాసము.



శ్రీలకుఁ దానక మగున
య్యేలూరుపురంబునందు నెంతయుఁ బేర్మిన్
గ్రాలెడులక్ష్మీనరసాం
బాలక్ష్మీపుత్త్రుఁ డెసఁగు భాగ్యస్ఫూర్తిన్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహర్షుల కిట్లనియె నట్లు దశరథుండు పుత్త్రకామేష్టిం జేసి నారసింహదత్తపాయసంబు పత్నీత్రయంబు నకుఁ బంచి యిచ్చినకాలంబున లోకవిద్రావణుం డగురావణుం డనువాఁడు గండుమిగిలి యుండె వానివృత్తాంతంబుసవిస్తరంబుగం జెప్పెద నాలకింపుఁ డని యి ట్లనియె. 2

—♦ రావణాసురవృత్తాంతము ♦—

సీ. ఆదికాలమునం దనంతునకున్ వాయు
దేవునకుం బోరు తెగక పడియె
నపు డనంతుఁడు కనకాచలంబును జుట్టు
కొని గట్టివడియుండె ఘనుఁ డనిలుఁడు
వానిని నోడింపఁ గా నోప కెంతయో
జతనించి కదలింపఁ జాలఁ డయ్యె
నొక్కనాఁ డేమఱి యుండ శేషుఁడు గాలి
గనిపట్టి హేమాద్రిఁ గదలఁ గొట్టె

తే. కార్ద్రివేయుఁ డెట్లో తప్పెఁ గాని కొండ
ఖండమై కంధిలోఁ బడి కానఁ బడియె
నూఱుయోజనములు గల్గి నూత్నగతుల
రత్నమయ మగులంకయై రమణ కెక్కె. 3

చ. అది విజనప్రదేశ మని యంబురుహాసనుఁ డందుఁ జేరి స
ద్ముదము మెయిన్ మహాతపముఁ బొల్పుగఁ జేయుచు నుండె నయ్యెడన్
ద్రిదశులపంపునన్ మిగుల నీటును గోటును దీటు సూపుచున్
మదవతి యైనరంభ సురమాన్యునిచెంతకు వచ్చె ముచ్చటన్. 4

వ. వచ్చి యొయ్యారంబు సూప నారంభించిన రంభం గాంచి నంతలో
నాతనికి వీర్యస్ఖలనం బైె పులస్త్యుం డనుముని పుట్టెఁ బుట్టినవాని
నట్టె విడిచి బ్రహ్మదేవుండు సత్యలోకంబునకుం జనుదెంచె నంత
లోనం బెఱిఁగి పెద్దవాఁడై పులస్త్యుండు తండ్రికడకు వచ్చి యిట్లనియె.

ఆ. కన్నబిడ్డ నన్నుఁ గాదని విడనాడి
యిట్లు రాఁగ నగునె హేమగర్భ
మిన్ను వడ్డచోట నున్ననా కెవ్వరు
దిక్కు చెప్పు మయ్య తెలియఁ దండ్రి. 6

మ. అన నాతండు దయారసంబునఁ బులస్త్యాఖ్యు న్సుతుం జూచి యో
తనుజన్మా! విను భూతలంబున జగత్కల్యాణరుద్రాక్షకా
నన మొక్కం డగు నందుఁ బొందువడి ప్రజ్ఞావంతుఁడన్ మౌని యుం
డె నతం డీవు మదీయుఁ డంచు వినినన్ నిన్ బ్రేముడించున్మదిన్.

వ. నీ వటకుం బోయిన ని న్నతం డాదరించుం బొమ్మన నతండు
రుద్రాక్షవనంబునకుం బోయి త న్నెఱింగించిన నాతం డాతని దన
యింటం బెట్టుకొని పోషించుచు వేదవేదాంగంబు లెఱింగించి తన
కూఁతు నిచ్చి పెండ్లిఁ జేసి నీవు నీభార్యతో నెందే నొకయాశ్ర
మంబు నిర్మించుకొని యుండు మనిన నతండు భార్యతో భరద్వా
జాశ్రమంబునకు వచ్చి వానియనుగ్రహంబునకుం బాత్రం బై యట
సభార్యుండై యుండి విశ్రవసుం డనుకొడుకుం గని వానిని వానితల్లి
నట్ల విడనాడి బదరికాశ్రమంబునకుం జనియె నంత నక్కడ. 8

—♦ పులస్త్యపుత్రుఁడు విశ్రవసునకు వైశ్రవణుండుపుట్టుట ♦—

తే. అలభరద్వాజుఁ డింటిలో నతిథి యైన
విశ్రవసు నెంచి యెంతయుఁ బ్రేముడించి
శ్యామకాంత యనంబేరఁ జనుకుమారి
నిచ్చి పెండిలి గావించెఁ నిచ్చఁజేసి. 9

వ ఆవిశ్రవసునకు శ్యామకాంతయందు విశ్రవణుండు వైశ్రవణుఁడు ననునిద్దఱు కొడుకులు పుట్టి రందు వైశ్రవణుండును భరద్వాజుని కొడుకు జనాంకుఁడును మిత్రులై యొక్కనాఁ డొక్కనూతిసమీపంబున బంతులాడుచుండ జనాంకునిబంతి నూతం బడియె దానిం దెమ్మని జనాంకుండు కోరిన వైశ్రవణుండు దాని కియ్యకొనమిఁ గినుకం బూని జనాంకుండు. 10

తే. మీరు ముగ్గురు మాయింటఁ జేరి యిల్లు
గుల్లసేయుచుఁ దినుచుంటి రెల్లవేళఁ
జిన్నపని చెప్పఁ జేయవు చేటుకాల
మనఁగ వచ్చును నిన్నేమి యనఁగ వచ్చు. 11

ఆ. అనుచుఁ దూలనాడ నాతఁడు తల్లితోఁ
జెప్పి తల్లి నన్న నొప్పఁ జేసి
తాత యున్నకడకుఁ దరలి పోయి వచించెఁ
దమపరాభవంబు తగిలి వినఁగ. 12

తే. తాత! తలదాఁచుకొనుట కేస్థాన మైనఁ
జూపి పౌత్రులఁ గాపాడఁ జూడు మనిన
నప్పులస్త్యుఁడు తనతండ్రి యైనబ్రహ్మ
కడకుఁ జని విన్నవించె నయ్యెడుమ లెల్ల. 13

మత్త. విన్నవించిన బ్రహ్మ యి ట్లను వేడ్క మీఱఁగ నీవు నీ
కన్నవారలతోడ మేరువు ఖండమై చనులంకకున్
గ్రన్న నేగి వసింపుఁ డయ్యది కౌతుకం బిడు మీకు నం
దున్నస్వర్గమునందు నుండెడునోజ నుండెడు నాత్మజా. 14

వ. అనిన బులస్త్యుం డాలంకాద్వీపం బిపు డెవ్వరివశంబున నుండె నది యెట్టిది చెప్పు మనిన నప్పద్మగర్భుం డిట్లనియె. 15

సీ. మేరుఖండం బది కారణాంతరమున
సాగరంబునఁ బడి స్థాన మయ్యెఁ
గడలిఁ ద్రచ్చగ నప్డు గలిగినసుధ యట
నునిచి కావంగ నొక్కని సృజించి
కాపు వెట్టితి వాఁడు కాపురుషుం డయి
దానిని భక్షించెఁ ద ప్పెఱుఁగక
తెలిసి నే వానిని నలిగి రాక్షసుఁడవు
క మ్మని శాపంబు గట్టినాఁడ

తే. దితిజుఁడై వాఁడు వెనుక నద్దీవిఁ జేరి
కర్బురప్రమదలను బెక్కండ్రఁ బెండ్లి
యాడి మాలి సుమాలి లో నైనవారిఁ
బెక్కురఁ గుమారులం గాంచి పెంపుమిగిలె. 16

వ. బంధుసందోహసహితుండై నాఁడు బృందారకబృందంబుల బాధిం పం బూనిన వారు వానిదుండగం బంతయు దైత్యాంతకున కెఱిం గించిన నతండు లంకపైఁ జిచ్చుటంపఱం జిమ్ముచక్రంబు ప్రయో గించె దానంజేసి యం దున్నవాండ్రెందఱో మ్రందిరి కొందఱు సాగరగర్భంబు చొచ్చి రందు సుమాలి పాతాళంబునకుం బాఱి పోయి హరిచక్రభయంబున నడంగియుండెఁ గావున మీ రట కేఁగి నిరుపద్రవంబుగ నివసించి యుండుఁ డనుటయుఁ బులస్త్యుండు సపుత్రపౌత్రింబు గా లంకాపురంబునకుం జని కాపురం బుండె ననంతరంబ. 17

తే. అప్పులస్త్యుఁడు నిజపుత్రుఁ డైనవిశ్ర
వసునితోఁ జెప్పి తీర్థసేవకు గమించె
విశ్రవసుపెద్దకొడు కగువిశ్రవణుఁడు
దుర్విషయదగ్ధుఁడై మేను దొఱఁగె నంత. 18

### వైశ్రవణుఁడుతపించి శివుననుగ్రహంబువడయుట

ఉ. వైశ్రవణుండు మేటి యయి వర్తిలుచుక్ శివభక్తియుక్తుఁడై
విశ్రవుపేర లోకములు విశ్రుతి కెక్కఁగఁ జేయునట్టిఁడై
స్వాశ్రితకోటి కెప్డు ప్రియంకరుఁడై పొలుపొందుచుక్ గృహ
స్థాశ్రమమందు నుత్తమత నంది మెలంగుచు నుండె దండియై. 19

తే. మణిమతీతీరమునయందు మహితతపముఁ
జేసె నిష్ఠాగరిష్ఠుఁడై శివుని హృదయ
కమలమున నిల్పి వేనవేల్ సమలు వైశ్ర
వణుఁడు సురమునిచంద్రులు ప్రస్తుతింప. 20

సీ. వానిపౌనర్చినవరతపంబునకు నీ
శ్వరుఁడు ప్రత్యక్షమై వరము లిచ్చె
నవనిధులకు నధినాథునిఁ గావించి
కామగ మగుపుష్పకం బొసంగి
మమతఁ గుబేరనామము వెట్టి యుత్తర
దిక్పతిఁ గావించెఁ దెగనిమైత్రి
సంఘటిల్లఁగఁ జేసి చనియె నాతండును
దేవర్షిసన్నుతశ్రీ వహించి

తే. పితృపితామహప్రభృతుల విశ్రుతాజ్ఞఁ
జేసి లంకాపురంబునఁ జేరి కాపు
రమ్మొనర్చెను సహకుటుంబమ్ముగా సు
ఖమ్ముగాఁ బెక్కువర్షమ్ము లిమ్ము గలిగి. 21

వ. ఆనాఁడు రసాతలంబునకుం జనినసుమాలి యచ్చటన నివసించి పుష్పదంత యనునొక్కరాక్షసాంగనం బెండ్లియాడి జంబుమాలి యనుకొడుకును బుష్పమాల సుమోత్కట కైకసి యనుకూఁతులం బడసి కాపురంబు సేయుచుఁ గొన్నినాళ్ల కవల లంకాపురంబున కరుదెంచి మణిమతీతీరంబున విశ్రమించి యున్నవిశ్రవసుని వాని కుమారుం డగు వైశ్రవణుం గాంచి యిట్లనియె. 22

ఉ. ఎవ్వరు మీరు మీ రిచట నేమిటి కుంటిరి నే సుమాలినా
నివ్వటిలంగఁ బేర్ జగతి నెక్కొనియుంటి మదీయ మిప్పురం
బవ్వల విష్ణుచక్రమున నావడి రా విడనాడి పోయితిన్
ద్రెవ్వనినాసమస్త మిటనే పడవైచితిఁ బోవున త్తటిన్. 23

వ. అనిన వైశ్రవణుం డతని కిట్లనియె. 24

సీ. విను నేఁ గుబేరుఁడ విధిపుత్రుఁ డగుపుల
స్త్యమునీశ్వరుఁడు నాపితామహుండు
నాతండ్రి యితఁడు విఖ్యాతనాముఁడు విశ్ర
వసుఁడు భరద్వాజువసతినుండి
ద్రుహిణునానతిఁ జేసి తొడరి వచ్చితి మిట
వసియింపుఁ డని చెప్పఁ గసిమసంగి
వాఁడు మాటాడని వాని విశ్రవసునిఁ
దన్ని మీ రిట నుండి తరలి పొండు

తే. అన సుమాలికి బదులాడ కవనిఁ బడిన
తండ్రి లేవంగ నెత్తె నంతటఁ బులస్త్య
పుత్రుఁ డాదైత్యునిం గని పొం డటన్నఁ
బోయెదము మమ్ము వేధింపఁ బోకు మన్న. 25

— విశ్రవసుఁడు రావణకుంభకర్ణాదులం గనుట —

వ. అనిన సుమాలి కినుక మాలి విశ్రవసుదిక్కు మొగంబై నీయోరి మికి నాకు మెచ్చు వచ్చె నీకు నాకూఁతుల నిచ్చి పెండ్లిచేసెదం బెండ్లియాడితివేని మీకు మేలు చేసెద ననిన నతండు దాని కోంకారంబు పలికిన నంత సుమాలి తనతనయుల మువ్వురం దెచ్చి విశ్రవసున కిచ్చి వివాహంబు గావించి మేడలు మాడుగులు మాణిక్యమయాలయంబులు లోనగునగళ్ళు నిర్మించి యిచ్చి మీ రీపురంబున సుఖంబుండుం డని చెప్పి తాను పాతాళంబునకుం జనియె. 26

తే. విశ్రవసుఁ డంత మువ్వుర వెలఁదుకలను
గూడి సంసార మొనరించునాఁడు వారు

ముమ్వురుం గర్భవతు లయి మూఁడుమూళ్ళు
నెలలు నీర్మోసి పుత్రుల నెలమిఁ గనిరి. 27

సీ. అందుఁ గైకేసికి నవతరించిరి సుతుల్
కడిమి రావణకుంభకర్ణు లనఁగఁ
బుష్పోత్కటకు సుతుల్ పుట్టి రిద్దఱు ఖలుల్
ఖరదూషణులు లోకకంటకు లయి
సుమమాలి కుదయించె సుతుఁడు విభీషణా
ఖ్యాకుఁడు సర్వలోకైకనుతుఁడు
వారిలో నగ్రజుఁ డై రావణుఁడు మహా
సత్త్వపరాక్రమశాలి యయ్యెఁ

తే. గుంభకర్ణుఁడు మత్తుఁడు క్రూరచిత్తుఁ
డుగ్రుఁడు ఖరుండు దూషణుఁ డుగ్రతరుఁడు
బ్రహ్మవిద్వేషు లెల్లరు బ్రహ్మవేత్త
విగతభీషణుం డల్లవిభీషణుండు. 28

వ. మఱియుం గైకేసికి రావణకుంభకర్ణులవెనుక నుత్కట యగుశూర్ప నఖ యనుపుత్త్రికయును బుష్పోత్కటకు ఖరదూషణులవెనుకఁ బింగళ యనుపుత్త్రికయును పుష్పమాలికి విభీషణునివెనుకఁ దారా సుందరి యగుటంజేసి తార నాఁబఱుపుత్త్రికయునుం బుట్టె రందు రావణుండు. 29

క. పది తల లిరువది చేతులు
కదనంబుల శత్రుకోటి కదలినమాత్రన్
సదమదము సేయఁ జాలుప
గిది నగుమేన్ గలిగి ధరకుఁ గీడై పుట్టెన్. 30

వ. అట్లు పుట్టుటకుం గలకారణంబును వానిపూర్వవృత్తాంతంబునుం జెప్పెదనాకర్ణింపుఁడు. 31

—♦ జయవిజయులకుం గలిగినశాపము ♦—

చ. జయవిజయాఖ్యు లిర్వు రనిశంబు రమాధవపార్శ్వవర్తులై
భయమును భక్తియుం గలిగి ప్రస్తుతి సెక్కఁగ నుండు రొక్కనాఁ

డయ మెడలంగ నప్పురుషు లప్పురుషో త్తమమందిరంబునన్
నియమితులై మెలంగిరి వినీతమతి న్మొగసాలఁ గాచుచున్. 32

క. అపుడు దిగంబర రూపము
సుపరిష్కృత మగుచునుండఁ జూడఁగ నైదేం
డ్లపడుచులో యన సనకా
దిపరంతపు లచటి కేగుదెంచిరి కడిమిన్. 33

తే. లోపలికిఁ జొచ్చి చనునంతలోన నచటి
ద్వారపాలకు లాఁగి రవ్వలకుఁ జొరఁగ
నీక హరిశాసనము గాన నంతమాత్రఁ
గనలి వారలఁ గని వారు కటకట పడి. 34

మ. మదమాత్సర్యవిగర్వితాత్ములగుమీ ర్మానాథునిం బొంది యి
ప్పదమం దుండఁగ రాదు వీడి మదిరాపానప్రమత్తాసురీ
పదదాస్యం బొనరించునట్టి రగుచుఁ వర్తింపుఁడీ యంచు స
ద్విదితాత్ముల్ సనకాదిసంయమివరుల్ విచ్చేసి రిచ్ఛాగతిన్. 35

తే. అంత వారుపదభ్రష్టు లగుచుఁ గుయ్యి
వెట్టి కూలెడునప్పు డావిష్ణు వెఱఁగి
మూఁడుజన్మముల న్వైరమునను నన్ను
మరలఁ బొందెద రని వల్కి కరుణఁ జూపె. 36

వ. శాపోపహతు లగువా రిద్దరు భగవత్సన్నిధానంబునకుం గాక భూలోకంబున నదితికశ్యపులకు హిరణ్యాక్షహిరణ్యకశిపులై పుట్టి జగత్కంటకులైన వారిహరి వరాహనరసింహరూపంబుల వధించి సంహరించె వారె యిప్పు డారావణకుంభకర్ణులై పుట్టి రప్పుడు హిరణ్యకశిపుండు చచ్చుచు నరహరిం గాంచి. 37

చ. ఇరువది గోళ్లు నీకుఁ గల వందునఁ జీలిచి చంపఁ గల్గి తీ
వరయఁగ నాకు నిర్వ దగుహస్తము లుండిన నిన్నుఁ బిండి గా
దురమున నల్పివేయఁ గలదోర్బలశాలిని గాక యుందునే
నరహరి! యన్న నాతఁడు మనంబున సంతస మంది యిట్లనెన్. 38

ఆ. అవలిజన్మమందు నడిగినట్టులు నీకు
నిరువ డైనచేతు లిచ్చువాఁడ
నపుడు నన్నుఁ బోరు మది చూత మనె దాన
నట్లు పుట్టె రావణాసురుండు. 39

వ. అట్లు క్రూరులగుబిడ్డలం గాంచినవిశ్రవసుండు తనమనంబునం బరితపించుచుఁ దాను వారి విడిచి పో నెంచి కుబేరుం గాంచి రావణాదులప్రశంసం దెచ్చి. 40

మ. కులతిక్తంబులు వీండ్రు వీరికడ నేఁ గొండొక్క-కాలంబు నే
నిలువం జాలను దండ్రి! నే నెచటికేనిం బోవ నున్నాఁడ నీ
వలుపం బేనియు నింద కోరువవు నీయర్థాత్వముల్ వారు లోఁ
దలపం బోవరు వీడి వీరి యలకాస్థానంబుఁ జేరం దగున్. 41

వ. అని చెప్పి పత్నులం బిలిచి నేను దపోవనంబునకుం బోయెద మీరు మీపుత్రులకడన సుఖంబుండుం డని చెప్పి యొప్పించి కన్నతల్లిం దోడ్కొని రత్నసానుశైలదక్షిణభాగంబునకుం జని పర్ణశాలం గట్టుకొని నివసించియుండె నంత నిట రావణుండు సానుజుండై. 42

—♦ రావణాదులవృత్తాంతము ♦—

సీ. ఆచార్యునొద్ద విద్యాభ్యాస మొనరింప
నమరుచు నాల్గువేదములు మఱియు
నాఱుశాస్త్రంబులు నఱువదినాలుగు
కళలు ప్రకృతిశాస్త్రగతులు విల్లు
విద్య శస్త్రాస్త్రముల్ వివిధపురాణముల్
ధర్మశాస్త్రంబులు తవిలి చదివి
సంగీతసాహిత్యచతురుఁడై కవి యయి
గ్రంథరచనయందు గండుమిగిలి

తే. రాజకీయప్రసంగవిరాజమాన
నయవిదుం డయి విద్వజ్జన ప్రశస్త
దండనీతికోవిదుఁ డయి దశముఖుండు
బుద్ధిమత్త్వవరుం డయ్యె భూతలమున. 43

వ. ఆకాలంబునఁ గుబేరుండును. 44

మ. శివదత్తం బగుపుష్పకంబుపయి వాసిన్ విశ్రవోఽగ్రాత్మజుం
డవునా నెక్కి మహేశ్వరుంగొలువఁ బ్రత్యహ్నంబునుంబోయి వ
చ్చువడిన్ దానికి నోర్వఁ జాలఁ డయి రక్షోనాథుఁ డారావణుం
డవమానం బన కంబతోననియె దుస్స్వాంతంబు సంధించుచున్. 45

ఆ. సవతితల్లిబిడ్డ లవరజు లని మమ్ముఁ
జులుకఁ జేసి చూచుఁ బలుకరింపఁ
డనుదినంబు పుష్పకాధిరూఢుం డయి
పోయి వచ్చు స్వర్గపురికి వింటె. 46

క. అది మా కవమతి సేయుట
కదటునఁ గావించుకృత్య మని చెప్పెదు నో
సదమలమతి! తల్లీ! నే
నిది చూచి సహింపఁ జాల నే మను దమ్మా. 47

—♦ కుబేరుని గొప్పతనము ♦—

వ. అనినం దల్లి వాని కిట్లనియె. 48

ఉ. నీ వనినట్లు కా దతఁడు నీతివిదుండును ధర్మవిద్వరుం
డీవిధి చిత్తవృత్తి విడు మింతట నైనఁ గుబేరుఁ దండ్రిఁ గా
భావమునం దలంపు మొకపాటిగఁ జూడకు మోగు వచ్చెడున్
దేవసముం డతండు తనదేహముఁ బోలె నినుం గనుంగొనున్. 49

ఆ. నన్నుఁ గన్నతల్లికన్న మిన్నగఁ జూచు
నమ్మ యనుచుఁ బిలుచు ననిశ మేమి
వలయునన్నఁ దెచ్చి పదముల నిడి కొల్చు
నట్టియన్న నీకు నగునె తెగడ. 50

చ. అతనికిఁ బుష్పకం బనెడునట్టి దొకం డన నేల పార్వతీ
పతికరుణాకటాక్షమున బంగరుకొండను గానరాని ప్ర
స్తుతనిధులెల్ల వాని వయి చూడఁగ వచ్చెడు తండ్రి! వానినిం
బితృసముగాఁ దలంపు మెద మిమ్ము విడం డతఁ డెల్ల మీ కిడున్.

చ. పరవనితామతల్లులను భావమునం దనతల్లు లట్లు గా
నిరతమునుం దలంచుఁ బరనింద లొనర్పఁడు స్వప్నమందు నే
దురితము లాచరించుటకుఁ దోడ్పడఁ డెప్డు డసత్యవాక్యముల్
దొరలఁగ నీడు నాల్క—పంయి దోర్బలశాలి యతం డెఱుంగఁగన్. 52

క. అనితరసాధ్యం బగుతప
మనఘుఁ డతం డాచరించె నధికుం డయ్యెన్
తనుజన్మ! నీవు నగ్గతి
ఘనతపః మొనరింపఁ గమ్ము కలఁగనిమదితోన్. 53

ఉ. ఏయవి చేయ లేనిపను లేయని పొందగ రానికోర్కులో
యేయవి దాఁటరానిగిరు లేయవి యీఁదగరాని యేఱులో
యాయవి యెల్లఁ గన్గొనుచునంతటిలో నెఱవేర్పవచ్చు నిం
దాయజు సత్కృపారసము నందఁ దపం బొనరించువారికిన్. 54

—♦ రా వ ణా దు లు త పం బొ న ర్చు ట ♦—

వ. అని చెప్పినతల్లిమాట లుల్లంబున విశ్వసించి తమ్ములం దోడుకొని మందరంబునకుం జని కామక్రోధాదులన్ విడనాడి దయా సత్య శౌచ బ్రహ్మచర్య క్షమా ర్జవ ధృతి మితాహారాదిమహాగుణంబులం గలిగి కొని యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యాన ధారణసమాధులం దగిలి యతవ్రతంబున నట నొక్కచోఁ జతుర్దిగంచితాగ్నికుండంబుల మహాగ్నిజ్వాలలు నిగుడఁ దన్మధ్యంబునఁ గాలిపెనువ్రేల నేల నిలువంబడి యూర్ధ్వబాహుండై ప్రభాకరబింబంబుపై నంబకం బిడి బహిరింద్రియవ్యాపారంబులం దెగడి బ్రహ్మదేవుం గుఱించి త్రైలోక్యసంతాపకరం బగుదారుణతపం బాచరింపం దొడంగి. 55

చ. జలధులు వట్టిపో నిఖిలసాలములున్ జెడిపో దవాగ్నితోఁ
దొడుసుగఁ గాయునెండలకుఁ దోడ్పడుచు న్వడగాలి గొట్టుచో
మిడమిడలాడువేసవిని మే న్గను నాపదమస్తకంబుగా
నుడుకఁ గృశానుమధ్యమున నుండి తపించె నతండు మెండుగన్. 56

ఉ. ఉండినచోట నుండి మఱి యొండొకచోటికిఁ గాలు మెట్టిపో
కుండఁగఁ ద్రాఁచులం జదల నొత్తుగ వ్రేలఁగఁ గట్టినట్లు నీ
ర్కుండలఁ గ్రుమ్మరించినటు కొట్టెడువార్షికవాసరంబులన్
బండలఁ బండి పెంబయట బాఢతపం బొనరించె నెంచఁగన్. 57

చ. చదలునఁ బుట్టి కొలుపులిచందమునం బఱతెంచి మంచు భూ
పదమున నెల్లెడం బ్రబలి పైఁబడఁ బొఱుడు నెట్టివారినే
వదవదలాడఁ జేయుహిమవత్సమయంబున గొంతుబంటిగా
నదులజలంబుల న్నిలిచి నాకివిరోధి తపించె మించఁగన్. 58

వ. ఇట్లధికనిష్ఠాగరిష్ఠుండై మఱియును.

ఆ. వాయుభక్షుఁ డగుచు వేయివత్సరములు
పంచవహ్నిమధ్యవర్తి యయ్యు
నొంటికాల నిలిచి యొనరించె దారుణ
తపము పఙ్క్తికంఠుఁ డపుడు కడఁగి. 59

క. నియమవ్రతము పొసంగన్
నియతాహారుండు ధారణీశయనుండున్
భయరహితుఁ డుగ్రకర్ముం
డయి చేసెం గుంభకర్ణుఁ డధికతపంబున్. 60

క. రాలినపర్ణం బొక్కఁడు
వేళకు దిని యుపవసించి విమలాత్ముండై
శీలము మెఱయ విభీషణుఁ
డాలోనం దప మొనర్చె నత్యధికముగన్. 61

క. ఖరుఁడును శూర్పణఖ తపం
బరుదారం జేయువారి కనిశము రక్షా
పరిచర్యలు సల్పుచు నుం
డిరి హృష్టమనస్కులై కడింది ప్రియమునన్. 62

వ. ఇట్లనన్యసామాన్యంబుగనత్యుగ్రతపంబుగావించునయ్యవసరంబున.

మ. ధర గంపించెఁ బయోనిధు ల్గలఁగెఁ బాతాళంబు భేదిల్లె ది
క్కరులున్ మ్రొగ్గె ననంతుఁడున్బడిమొరిక ల్ధారాళభూమీధ్రము

ల్విరిసె న్విష్ణుపదంబు పేలి పగిలెన్ వేవెల్గు రేవెల్గునుం
దిర మేదం గతి దప్పి రెల్లకడలం దీపించెఁ బెంజీఁకటుల్. 64

శా. వేయేండ్లిట్లు తపించి పఙ్క్తిముఖుఁ డావేళన్ దురాధర్షుఁడై
స్ఫాయత్తేజమునం దలల్ సఱికి వేల్వ న్మెచ్చి పద్మోద్భవుం
డాయుర్విం జని రాక్షసేంద్రులకు నిష్టార్థప్రదుం డయ్యె భ
క్తాయత్తం బగుదివ్యచిత్తమున సౌహార్దంబు సంధిల్లఁగన్. 65

వ. అంత బ్రహ్మదేవుండు ప్రత్యక్షుండై రావణుం గని యిట్లనియె. 66

—♦ బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షమై వరంబు లిచ్చుట ♦—

మ. అమరత్వం బది గాక కోరుకొను మే వైనన్ వరంబుల్ ప్రియ
త్వమున న్నే నిడ వచ్చినాఁడ నిట వత్సా! నీతలల్ తొంటియ
ట్లమరున్ రూపము కోరిన ట్లగును నీకాలంబునన్ విద్విష
త్సముదాయమ్మును గెల్వఁ గాఁ దగుమహాసామర్థ్యముం గల్గెడున్.

వ. నావుడు రావణుండు. 68

తే. గరుడగంధర్వ కిన్నరాసురసుపర్వ
యక్షరాక్షస సిద్ధవిద్యాధరోర
గాదులవలనఁ బరిభవం బందకుండు
నట్లు వర మీవె దేవ! నా కనియె ననిన. 69

వ. చతురాననుండును మనుష్యజాతివలనం గాక వాఁ డడిగినయెల్లవా
రివలన భయంబు లేకుండ వరం బిచ్చితి ననుటయు వాఁ డెద
ముద మంది మదంబునంజేసి మనుష్య లోకలెక్క యని తలంపఁ
డయ్యె నయ్యెడ. 70

క. పరమేష్ఠి కుంభకర్ణుని
పరిసరమునకేగి వరము వాంఛింపు మనన్
దురితాత్ముఁ డతఁడు గోరెన్
గురుతరనిద్రం దమంబుఁ గొనుచిత్తమునన్. 71

వ. అనిన హిరణ్యగర్భుం డట్ల యగుం గావుత మని విభీషణుని
చెంతకుం జని. 72

ఉ. ప్రీతుఁడ వైతి నే వరముఁ బేర్కొ నొసంగెద వేఁడు మిచ్చెదం
జేతము వచ్చిన ట్లని వచించుటయున్ విని వీతమత్సరుం
డాతఁడు మోడ్చుఁ గేలు శిరమం దమరించి మదీయమానసం
బేతఱి ధర్మసంగతి వహించెడునట్టు లనుగ్రహింపవే. 73

వ. మఱియును నీకు నాపై ననుగ్రహంబు కలదేని భవదీయం బైన బ్రహ్మాస్త్రం బశిక్షితం బై నాయెడం దోఁచునట్లు వరం బొసంగు మనిన నతం డట్ల కావుత మని వానిం జూచి. 74

తే. అరయ రాక్షసికి జనించినట్టిఁ డయ్యు
ధర్మసంగతిఁ బాయనిదారిఁ బట్టి
ధార్మికుఁడ వైతి మెచ్చితిఁ దాత! నీకు
నిచ్చితిని నమరత్వ మే నిచ్చఁజేసి. 75

వ. అని చెప్పి యప్పితామహుం డంతర్హితుం డయ్యె నంత. 76

—♦రావణాసురుఁడు వరగర్వంబున విజృంభించుట♦—

సీ. పఙ్క్తికంఠుం డట్లు వడసి వరంబులు
గర్వాంధకారంబు గప్పికొనఁగ
ధనదుమీఁదికి దాడి చని వాని నోడించి
లంక వెడలఁ గొట్టి శంక విడిచి
పుష్పకారూఢుఁడై పోవుయక్షేశ్వరు
వెనుదన్ని పుష్పకంబును హరించి
యక్షరక్షోఽసాధ్యుఁడై రాక్షసస్తోత్ర
పాత్రుఁడై పెంపొందెఁ బ్రజ్ఞకలిమి

తే. వైశ్రవణుఁ డట్లు నిర్జింపఁ బడియు గినుక
దశవదనుఁ గాంచి గురుని నన్ దవిలి యిట్లొ
నర్చితివి గావునన్ విమానంబు నీకుఁ
గాక ని న్నోర్చువాని కౌఁ గాత మవల. 77

వ. అని శపించి యక్షరాక్షసపరివృతుం డై కైలాసపర్వతంబునందలి యలకాపురంబునకుం జని నిధీశ్వరుం డై సుఖంబుండె నంత నక్కడ ఙ్క్తిముఖుండు. 78

శా. శంకాతంకవిహీనుఁడై ప్రబలి రక్షస్సైన్యముల్ గొల్వఁ గా
లంకారాజ్యమునందుఁ బొంగుపడి లీలావిభ్రమం బేర్పడన్
జంకున్ డొంకు నెఱుంగ కెల్లకడలన్ శౌర్యంబునన్ మెట్టుచున్
లెంకల్గాఁ గొని దేవదానవుల నేలెన్ దుస్సహప్రక్రియన్. 79

ఆ. వ్యోమచారి యగుచుఁ గామరూపంబున
నెల్లవారిసిరుల నెగిచి దోచి
ప్రబలి లోకములను రవిలింపఁ జేయుట
రావణుం డనంగఁ గ్రాలె నతఁడు. 80

తే. శూర్పణఖ యనుసోదరి శూరుఁ డగుచుఁ
గ్రిందిలోకమునం దుండు త్రిశిరునకును
బెండ్లి గావించి వానిని బెగ్గడ గాను
దండనాయకుగాఁ జేసె దంషి యగుచు. 81

తే. దండకారణ్యమున జనస్థానమందు
ఖరుని దూషణుఁ ద్రిశిరస్కు ఘనబలంబుఁ
గలిగికొని పోయి శత్రుల గండడంచు
నట్టిరై యుండ నియమించె నట్టిమొనల. 82

చ. బలములుగొల్వ లోకములఁ బర్వినసర్వసుపర్వముఖ్యులన్
బలమదనిర్జితారు లగుపార్థివముఖ్యుల నాగముఖ్యులన్
గెలిచి రణాంగణంబుల సుకీర్తి వహించెఁ బరాక్రమంబు ది
క్కులఁ గలయంగఁ బర్వఁ దనకుం బ్రతిలేక జగత్త్రియంబునన్ 83

సీ. ఇంద్రలోకముఁ జేరి యింద్రుని నోడించి
యగ్నిలోకముఁ జని యగ్ని గెలిచి
యమలోకమున కేగి యముని వినిర్జించి
నిరృతిలోకముఁ జేరి నిరృతి నోడిచి
వరుణలోకముఁ జని వరుణుని గరుణించి
పవనలోకముఁ గని పవనుఁ దోలి
ధనదలోకముఁ జూచి ధనదుని దూలించి
రుద్రలోకము నొంది రుద్రు నదిమి

తే. మఱియు బ్రహ్మవిష్ణ్వాదులం దిరిగి గెలిచి
తనర నీరేడుజగములఁ దనవశంబు
గాఁగఁ గైకొని యేరికిఁ గాక కండ
కావరమ్మునఁ దిరిగె నాదేవవైరి. 84

—♦ దేవతలు బ్రహ్మపాలికిం జని మొఱవెట్టుట ♦—

వ. ఇట్లు దశగ్రీవుండు దేవదానవాద్యఖిలలోకభయంకరుండై గండు మిగిలి యుండె నయ్యవసరంబున దేవర్షులు బ్రహ్మర్షులు సిద్ధులు సాధ్యులు హవ్యవాహుం బురస్కరించుకొని పరమేష్ఠి పాలికిం జని శరణంబు వేఁడి రప్పు డగ్నిదేవుం డిట్లనియె. 85

మ. అవధారో జగదీశ! మా మొఱలు ఘోరాకారుఁడై రాక్షస
ప్రవరుండై చనువిశ్రవస్తనయుఁ డాప్తశ్రేణులం గూడి నేఁ
డు వరప్రాప్తి నవధ్యుఁడై ప్రజకుఁ గీడుం గూర్పఁగాఁ జొచ్చె నీ
భువనంబుల్ పదునాలుగున్ జెడియెఁ బెంపుందక్కి యొక్కుమ్మడిన్. 86

శా. పాల న్ముంచిన నీళ్ల ముంచినను దేవా! నీవే మాదిక్కు నీ
పాలం జేరితి మెట్లు జూచెదవొ మాభారంబు నీమీఁదనే
పోల న్వైచితి మార్తి నొందితిమి మమ్ముం జేకొనం జెల్లు నీ
వేళన్ సాంద్రదయారసంబు చిలుకన్ వీక్షించి రక్షించుచున్. 87

వ. అనిన బ్రహ్మదేవుండు దేవతలం గాంచి నాయిడినవరప్రభావంబు నంజేసి వాని నీరేడుజగంబులం జంపఁ జాలినవాఁడు లేడు మన ప్రయత్నంబు లేవియు నిటం బ్రయోజనకారులుఁగా విప్పట్ల సర్వలోకశరణ్యుం డగు నారాయణదేవుని శరణంబు వేఁడుటయే మన [illegible] కర్తవ్యం బని సర్వభావంబులం దలంచి నిశ్చయించి యుదగ్దిశాభిముఖులై చని చని ముందట. 88

—♦ క్షీ ర స ము ద్ర వ ర్ణ న ము ♦—

మ. కని రావేల్పు లనల్పకౌతుకమునం గల్యాణరత్నప్రభా
జనితాహ్లాదము సంభృతామృతరసస్వాదమ్ము చంద్రాదిపా

వనదాయాద మతిప్రసాద మపునిర్వాదమ్ము సుశ్రీదమున్
వినిగూఢోన్నతనాదమున్ ధ్రుతమహావేదమ్ము క్షీరోదమున్. 89

సీ. అల్లన సిరు లల్లుతల్లితల్లికి నెద్ది
 మురువల్ల వెదజల్లుపుట్టినిల్లు
ఎల్లలోకము లేలు నల్లజేజే కెద్ది
 కడునుల్లసిల్లెడుపడకయిల్లు
అల్లిబిల్లిగఁ జెల్లు నెల్లవేల్పుల కెద్ది
 వడలనిబ్రదుకు కల్లు వంటయిల్లు
ఇల్లటమై వెల్గునల్లగట్టున కెద్ది
 హల్లకల్లోల మహానాటయిల్లు

తే. గర్భజామృతోచ్చైశ్శ్రవఃకల్పవల్లి
రచితతటదేశమౌక్తికరంగవల్లి
సిరుల నీనెడుదివ్యవీచీమతల్లి
లీల సుర లెల్ల మెచ్చి రప్పాలవెల్లి. 90

క. ఘనదుగ్ధాబ్ధిత్వానేహ
స్సున నావేశికులు మనకు శుద్ధాతిథ్యం
బొనరించి పెంచి మించెన్
మును నీయన్నప్రదాత పొగడం దగదే. 91

వ. ఇట్లు కనుంగొని వా రప్పయోనిధ్యనుభావంబునకు సద్భుతా
మోదంబులం బొందు డెందంబులం బొందుగఁ బొగడుచు మంద
గమనం బంగీకరించి. 92

చ. హరి యిట నున్నవాఁడు నెనరార మిముం గరుణించు రం డటం
చురుతరమారుతోద్ధతమహోర్మిసుహస్తపరంపరాధికో
త్తరళితసంజ్ఞ ఘూర్ణిత ముదాత్తఘనస్వరవాక్ప్రవృత్తిగాఁ
బెరిమ నితం డొగి న్మనలఁ బిల్చెడునాఁ బొలుపొందుఁ గంటిరే. 93

సీ. అదె యకూపార మం దచ్యుతుండు శయించు
 నది నిషంగము త్రిపురాసురారి

కమరులకుం బెట్టు నన్నము కడుపాఱ
నఖిలాపగలకు గమ్యస్థలంబు
బడబానలమునకుఁ బానీయశాలిక
సిరికిఁ బుట్టినయిల్లు సురవిభునకు
గజధేనుమణ్యాశ్వ ఘనవస్తువులు గల్గఁ
జేసినవరదాతృ శేఖరుండు

తే. వేలుపులవంటయిల్లు కుంభినికి మాంజి
రత్నముల యాకరంబు చంద్రమునితండ్రి
కౌస్తుభముఁ గన్నసామి సగరసమాఖ్య
నృపతనయమోక్షభూమి యీ నీరుదామి. 94

చ. మును హరికాత్మజాత మణి ము న్నరణం బిడి పెండ్లిచేసి శం
భునకు శిరోమణిక్ సవనభుక్పతి కశ్వగజాప్సరోజ్జనీ
ఘనతరుముఖ్యముల్ మనకుఁ గాఁ గడుపాఱినతిండిఁ బెట్టె ని
వ్వననిధి పెండ్లివారి కిల వారక కానుక లిచ్చు దాతనాఁ. 95

వ. అని యి ట్లనోన్యవాక్ప్రసంగంబుల రంగదభంగతుంగ తరంగ పరంపరాతిశృంగారం బగునయ్యంబునిధి ననేకభంగులం గొనియాడుచుఁ గొంతద వ్వరిగి తన్మధ్యంబున ననేకశతసహస్రకోటియోజన విశాలభాజనం బైన శ్వేతద్వీపంబు దీపించు నదియును. 96

—♦ వై కుం ఠ పు ర వ ర్ణ న ము ♦—

చ. తరగలరాపిడిం బొడమి తద్దయు ముద్దగఁ జేరి పేరి పెం
పర మయి పాలవెల్లినడుమం దవువెన్నయ తెల్లదీవి యై
తిరపడె వెన్క వేల్పు లుదధి న్మథియింపఁగ నాసుధారసం
బరుదుగ నాఁడు దానిపయి నాఱిపరంగె మెఱుంగుపూఁత యై 97

వ. అమ్మహాద్వీపమధ్యమ్మున. 98

మ. అరుణార న్మణిభర్మనిర్మితమహాహర్మ్యప్రభాపుంజముఖ-
వరణస్థాపితనూత్నరత్నసురుచివ్రాతంబునుం గూడి భా

స్ఫురత్కోటివిద్యుతులన్ హసించుచును వేడ్కం బొల్చు వైకుంఠ మన్
పురరాజంబు విరాజమాన మగు సంపూర్ణప్రభావంబునన్. 99

మ. హరిసేవార్థసమాగతేంద్రముఖ దేవాధీశసంభారసం
భరితంబై హరిచందనాద్యుపవనవ్రాతావృతంబై సుధా
పరిశుద్ధోన్నతసౌధచంద్రసిలయ (ప్రాంచత్ప్ర)భాకీర్ణమై
సిరితో నొప్పువికుంఠ మొప్పుఁ గలశశ్రీవార్ధి చందంబునన్. 100

ఆ. పాలవెల్లినడుమఁ బద్మంబు నా నొప్పు
తెల్లదీవియందుఁ దెల్ల మగుచుఁ
గర్ణికాక్రమంబు గలిగి వైకుంఠము
కాంతి నెసఁగుఁ బుణ్యకాండ మగుచు. 101

క. విరజానది వైకుంఠము
పరిసరమునఁ బాఱుచుండుఁ బావన మగుచున్
బరికింప సర్వపాపము
లరుదుగ నాశనము నొందు నంతటిలోనన్. 102

మ. కులమందారవనాంతరప్రవిలసత్కల్యామృతాబ్జోచ్ఛల
త్కలహంసప్రతికూజితోన్నత రవాక్రాంతాచ్ఛసౌధోపరి
స్థలకేళీచలనాతిలాలసమరుద్బాలామణీవాక్యసం
కులశబ్దార్థపునఃపునఃశ్రవణరక్తుల్ విష్ణుభక్తుల్ పురిన్. 103

సీ. గంగాదితీర్థముల్ గని యెఱుంగనిచెట్టఁ
దడుగునఁ బుట్టించు నమరగంగ
గూడుగుడ్డలు లేక కుతిలఁ గుడుచునిస్వుఁ
డాఢ్యుఁడు లక్ష్మీకటాక్షమునకుఁ
గట్టుపోఁగులును లే కట్టెట్టుబడు పేద
కౌస్తుభహారముం గడకఁ దాల్చు
నడుగెడు నడలేమి నలసెడుబడుగు మేల్
పులుఁగుఁదత్తడి నెక్కి మెలఁగుచుండుఁ

తే. గత్తి గని జంకుపిఱికి చక్రంబు వట్టు
వెన్నుఁ డనుమాట యొకమాటు విన్నయేని

తిరుపతులయందు నెమ్మేను దోరఁగ నేని
యిట్టివా రందు నెందు నున్నట్టివారు. 104

ఉ. అందఱు నూర్ధ్వపుండ్రధరు లందఱు చామనచాయమేనివా
రందఱు శంఖచక్రధరు లందఱు పన్నగవైరి నెక్కువా
రందఱు నల్లఁ గన్నదొర లందఱు నాలుగుచేతు లున్నవా
రందఱు సర్వలోకపతు లందఱు వైష్ణవమూర్తు లప్పురిన్. 105

శా. పూర్ణాస్వాదనముం బొనర్చి వనులం బూదేనెలం దుమ్మెదల్
కర్ణాహ్లాదకరంబుగా నెపుడునుం గానంబు గావింప నా
కర్ణింపంబడు విష్ణునామకకథాకావ్యానులాపంబు లో
వర్ణింపం దగు నవ్వికుంఠనగరీవర్యాం బవార్యంబుగన్. 106

శా. ఏతాదృగ్విధభాగ్యవైభవముల వీక్షింపగా నొప్పి వి
ఖ్యాతిం గాంచినదానిఁ గాంచి మదిలోఁ గౌతూహలం బంది యా
పూతాత్ముల్ గడుభక్తి మొక్కుచును దత్ప్రాసాదమధ్యంబునన్
జేతఃప్రీతి ఘటించువిష్ణునగరిన్ వీక్షించి రక్షీద్వయిన్. 107

క. వరహారమధ్యమందున్
దరళమువలె స్వప్రకాశతం ద్రిజగంబుల్
పరఁగించుచు నధికయశో
భరితంబై వెలుఁగుచుండెఁ బ్రాసాద మటన్. 108

శా. ఆవైకుంఠపురంబునట్టనడుమన్ హైమంపుఁబ్రాకార మా
లో వాలాయము వాఋకాల్వ లట నాలోకింప నెుఁ బారిజా
తావిచ్ఛిన్నసుగంధబంధురవనం బం దిందిరాసుందరీ
గోవిందాంచిత దివ్యసౌధము పొసంగు న్భక్తిహృద్యోభమై. 109

వ. అట్టిప్రాసాదరాజమధ్యంబున. 110

—♦ దేవతలు విష్ణుదేవుం గని ప్రార్థించుట ♦—

సీ. నీలంపుతాలడాల్ డీలింపఁ జాలునై
హారాంబట్టురెం బెంబు డంబుమీాఱ

నునుబోరఁ గౌస్తుభమునఁ గ్రాలుపేరు క్రొ
క్కారుమెఱుఁగునాఁ గరము దనరఁ
గెంగేలఁ దలకట్టుసింగాణి వలమురి
గుదుసువా ల్గదయును గొమరుమిగుల
నెలమి దేవేరులై కలిమిలేమయు నీల
యును నేలచామయుఁ దనరఁ గొలువ

తే. మొగి సనకసనందనముఖమునులు వొగడఁ
జిలువయెకిమీఁనిమేనిపైఁ జెన్నుమీఱ
నత్తమిల్లినవెన్నునిఁ దత్తఱంబు
పొసఁగ గనుఁగొని దేవళ్లు పొగడి రిట్లు. 111

సీ. హంసాయ వాఙ్మనసాతీతరూపాయ
నిర్గుణాయ గుణాత్మనే నమోస్తు
ఆదిమధ్యాంతశూన్యాయ వేదాత్మనే
దేవాదిదేవాయ తే నమోస్తు
భక్తార్తిహారిణే భగవతే వనమాలి
నే నరకేసరిణే నమోస్తు
క్షీరాబ్ధిశాయినే శ్రీవత్సకౌస్తుభ
శ్రీనిభృతోరసే తే నమోస్తు

తే. భవకుశేశయసంభవ పాకశాస
నాదినిర్జరమకుట విన్యస్తపద్మ
రాగమాణిక్యకాంతి నీరాజితాము
లాంఘ్రికోకనదాయ తుభ్యం నమోస్తు. 112

వ. అని ప్రార్థించి మఱియును. 113

శా. తంద్రీ! తల్లిమఱుంగుపిల్లలవలెం దైత్యోత్కరం బంది మే
మాంద్రం బిడ్డలఁ గూడి నేఁటిదనుకన్ హాయిం బ్రవర్తింతు మే
వాం[illegible]యటలు లేమి నిప్పటికి నీవా రెల్ల సుగ్గంగఁ జాల్
[illegible] దీనమహార్తి వచ్చెఁ గరుణ న్వీక్షించి రక్షింపవే. 114

క. అతికష్టుఁడు దశకంఠుఁడు
పితామహాసమాత్తవరము పెంపున గర్వ
ప్రతిహితమతియై లోక
త్రితయము వేధింపఁ జొచ్చె దేవవరేణ్యా. 115

—♦ దేవతలు రావణునిదుండగంబు లెఱింగించుట ♦—

సీ. వజ్రి రక్కసికిఁ గప్పము గాఁగ సర్వస్వ
మర్పించి మొగసాల నాఁగె భృతికి
ననలుఁ డంధఃకరుండై రసవంతము
గా వండి పెట్టు రాక్షసగృహమున
జముఁ డనాయుష్యుని జను నైనఁ గొంపోక
నిర్వాజ వరవుళ్ల నిలిచె నచట
నిర్ఋతియు బెదరి నే నీవాఁడఁ జూ యని
సేవించు నానల్లఁ ద్రావువాని
తే. వేఁగ ననయం బపాంపతి వోఁగ ధూళి
యల్లదుర్మతివాకిళ్ల నీళ్లు చల్లు
నీఁద వానికి వీచోవు లిడుచునుండు
శ్రీదుఁ డీశానుఁడును వానిఁ జేరి మనిరి. 116

తే. ఇంద ఱివ్విధమున నిచ్చ లేమరకయ
సాధ్వసాతిభయావృతస్వాంతు లగుచుఁ
గన్నుసన్నల మెలఁగుచు నన్నిపనులు
తీర్చుచుండిన బలువంతఁ గూర్చుచుండు. 117

వ. దీనరక్షకా! భవద్రక్షకం బగునిజ్జగత్త్రయంబునకుఁ గలిగినగురుతరో పద్రవం బుడిపి త్వదేకశరణ్యుల మగుమమ్మగణ్యానుకంపాతి శయంబునం గాచి రక్షింపవే యని యనేకవిధంబుల వేఁడికొనిన విని భక్తలోకపరాయణుం డగునారాయణుండు ప్రసన్నుండై వారి కిట్లనియె. 118

—♦ విష్ణువు సురల కభయం బొసంగుట ♦—

చ. సనకసనందనాదిమునిశాపమునన్ విజయుండునున్ జయుం
డును సురవైరులై ధరఁ గడుంగడు క్రూరతఁ బుట్ట నైరి వా
రిని గరుణించి నే నపు డరిత్వముచేఁ గడతేర్తు మూఁడె యా
జననములం దటంచును విశాపము వల్కితిఁ గూర్మి పెంపునన్. 119

వ. ఆజయవిజయులు మునుమున్న హిరణ్యాక్షహిరణ్యకశిపులై రిపుడు
రావణకుంభకర్ణులై పుట్టి రవల శిశుపాలదంతవక్త్రు లయి పుట్టఁ
గలరు నావచనంబుసం జేసి నేన వారికి మోక్షప్రదుండ నని పలికి
మఱియు. 120

తే. ఎఱుఁగుదును రావణాఖ్యు వాఁ డెఱుక విడిచి
బ్రహ్మవరగర్వమునఁ జేసి ప్రబలుఁ డగుచు
జగము పేర్చుచునున్నవాఁ డోగిని వాని
సదమదము సేయ యత్నింతు శంక విడుఁడు. 121.

సీ. వినుఁడు స్వాయంభువ మనువు ప్రార్థించుటఁ
జేసి యవ్వానికి నే సుతుఁ డయి
జనియింతు నని వరము నొసంగితి నతండు
దశరథుఁడై యిప్డు ధరణిఁ బొడమె
భూదేవి గోరూపమును దాల్చి నాకడ
కరుదెంచి తనభార మది భరింపఁ
జాలను నా నేను జాలి వాపెద నీదు
భర మనుచున్ మున్ను వర మొసఁగితి

తే. మును జలంధరుకారణంబున శివుండు
నన్ను భూలోకమున నరునకు జనింపు
మని శపించినదాన నే నవనిఁ బుట్టి
రావణుని సంహరించెద రణము వన్ని. 122

ఆ. ధరణి నవతరించి దశసహస్రంబులు
దశశతంబు లేండ్లు తగ వసించి

రఘుకులంబునందు రాజు నై ప్రజ నేలి
మేగుదేర నగుదు నిటకు మరల. 123

—♦ విష్ణువు దేవతల భూలోకంబునం బుట్టుం డనుట ♦—

వ. అని నారాయణుండు వారి నాదరించి నేను రాముండ నై కౌసల్య
యందును సుదర్శనంబు భరతుండై కైకేయియందును శేషపాంచ
జన్యంబులు లక్ష్మణశత్రుఘ్నులై సుమిత్రయందును శ్రీమహా
లక్ష్మి సీతయై మిథిలాపురంబునందునుం బుట్టెద మింతకుమున్న
బ్రహ్మజృంభణంబునుండి ఋక్షవల్లభుండు జాంబవంతుండు పుట్టి
యుండె మీ రెల్లరు ఋక్షవానరాధ్యక్షులై పుట్టి మాకు సాహాయ్యం
బాచరించునది యని చెప్పి వారల నంపిపుచ్చె నయ్యవసరంబున
బ్రహ్మదేవుండు దేవేంద్రాదులం దిలకించి మీ రీశ్వరాజ్ఞం జేసి
బహువిధక్షేత్రంబుల బిడ్డలం గనునది యని పలికి. 124

తే. పిలిచి గంధర్వి యగుదుందుభి యనుదాని
దేవకార్యార్థ మిలం బుట్టు మీ వటనుచుం
బనిచెం బనిచిన నది మర్త్యమున జనించెం
గుబ్జ యై మంథరాభిఖ్యం గొమరు మిగుల. 125

వ. ఇంద్రాదిబృందారకబృందంబునుం జని ఋక్షవానరుల బహువిధ
క్షేత్రంబులం బుట్టించె నందు నింద్రునకు వాలియు సూర్యునకు
సుగ్రీవుండును బృహస్పతికిం దారుండును ధనదునకు గంధమాద
నుండును విశ్వకర్మనకు నళుండును జాతవేదునకు నీలుండును
నాసత్యులకు మైందద్వివిదులును వరుణునకు సుషేణుండును
బర్జన్యునకు శరభుండును వాయుదేవునకు వైనతేయ పరా
క్రముం డగుహనుమంతుండును మఱియు ననేకులకు గజగవయ
గవాక్షు లనేకులును బుట్టి బహుసహస్రసంఖ్యాకులై మహాబల
పరాక్రమసంపన్నులై నఖదంష్ట్రాయుధులు వాతరంహులునై వాలి
రక్షకత్వంబున రంజిల్లుచుండి రంత. 126

క. వారలనఖరములందుఁ
సారతరం బగుచు నశని సంధిల్లెడు న

ట్లారసి విధాత చేసెఁ
ధారణి వానరులు వజ్రధరులై రంతన్. 127

మ. విధి సంప్రార్థనకారణంబునను గోవిందుండు బృందారక
ప్రథితాపత్ప్రశమార్థ ముర్వి జనియింపం గా మనోనిశ్చయం
బధికృత్యంబునఁ జేసి పఙ్క్తిరథగోత్రాధీశ్వరాత్మోద్భవ
ప్రథ నొందం గలఁడయ్యె నానృపతి సౌభాగ్యంబు సామాన్యమే. 128

వ. అంత నక్కడ రావణుండును. 129

—♦ రావణాసురుఁడు పరాక్రమించి మందోదరిం బెండ్లియాడుట ♦—

మ. అజరుద్రాచ్యుతు లంతవారి నయినన్ స్వాంతంబునం దెన్నకే
విజయంబుం గొని యక్షరాక్షసమరుద్విద్యాధరాద్యాజులన్
ద్రిజగన్నాథుఁడ వై ప్రభుత్వగరిమన్ దీపించునట్టిండు నై
యజితుండై చరియించె నెల్లకడలం దవ్యాహతప్రజ్ఞుఁడై. 130

ఉ. మందరపర్వతేశ్వరకుమారిక యై ప్రభవించి యెంచ నై
సుందరతాప్రభావమున సూనశరాంగన కెత్తువచ్చి తా
నెండలో వచ్చి కోరికొన నేరిని గా దనుచు న్మెలంగు నా
మందరశైలమం దనుచు మాట వినంబడె నెల్లచోటులన్. 131

వ. పఙ్క్తికంధరుండు మయపుత్రికయగు నాసుందరాంగిం బెండ్లియాడ
నెంచి మంత్రులకుం జెప్పి తదనుమతంబు వడసి. 132

సీ. కడ లెల్ల వెలిగింపఁ గాఁ జాలుమణికిరీ
టములు సిరైదు శీర్షములఁ బెట్టి
రవికాంతిఁ గా దనురత్నకేయూరము
లిర్వదిభుజముల నెసఁగఁ దాల్చి
రవలకూర్పునఁ గడు రవళి మెఱయుతార
హారముల్ మెడలపై జార వైచి
బంగారుదారాల రంగార నేసిన
చీనాంబరము కటిసీమఁ గట్టి

తే. అసలుసరిగంచుపట్టుపీతాంబరంబు
మేనిపై వలెవాటుగాఁ బూని రాజ
కీయవైభవ మంతయుఁ గెలన వెలయు
కరణిఁ గైసేసి దశకంఠుఁ డడర నయ్యె. 133

వ. ఇట్లు నానా విధాలంకారాలంకృతుండై రాక్షసేశ్వరుండు మంత్రుల తోడం బుష్పకాధిరూఢుండై కదలి చని మందరంబున మందోదరికిం దర్శనం బిచ్చి తనవృత్తాంతం బంతయు నెఱింగించి వరించిన నా మెయును. 134

ఉ. పేరెఱుఁగుఁగన్ స్వరూప మది వేడుక లోడిక లెత్తుచుండు న
ట్టి రమణింప నయ్యెఁ బది యైనశిరంబులు నిర్వహై కడుం
దీరిచినట్టు లుండె బహుదీధితు లీనెడుహస్తపంక్తులున్
గోరికలూరఁ జేసె నలకోమలి కోరికఁ దెల్పఁ దెల్పినన్. 135

వ. దశకంఠుండు మందరునకుం జెప్పి మందోదరిం దనపుష్పకంబుపైఁ గూరుచుండం బెట్టుకొని మణిద్వీపంబునకు వచ్చి యచ్చటోరాత్రిం బెండ్లియాడి వెనుక మఱికొందఱం బెండ్లియాడి పెక్కుజన్మంబు లాచరించి యీరేడుజగంబుల కధినాథుండై యుండి యొక్కనాఁ డేకాంతంబున నొక్కరుండ కూరుచుండి తనజన్మంబునకుం జింతించుచుఁ దనలోన. 136

—♦ రావణుఁడు తనచావుఁ గోరి సంచరించుట ♦—

చ. సనకసనందనాదిమునిచంద్రులశాపము కారణంబు గా
వనటఁ బడంగనై యిట సుపర్వత వోవ నపర్వజన్మమున్
గొన నయి క్రూరభావమునకుం గుదురై త్రిజగజ్జనైహ్యమై
కనఁ దగువర్తనన్ మెలఁగఁగా నయి యుంటి విధిప్రసంగతిన్. 137

క. హరివరము కలదు వైర
స్ఫురణంబున మూఁడుజన్మములు చనునంతన్
దొరకును సాయుజ్యం బని
చిరకాలం బయ్యె నెట్లు చేయఁగ నగునో. 138

ఆ. హరికి వేఁడి పుట్టునట్టికార్యంబులు
చేసి కినుక వెంచి శీఘ్రకాల
మంద చావుకొఱకు మందు సంపాదించి
విడిచి పెట్టవలయు నోడలు వసిగ. 139

చ. మునులఁ బరాభవించి సురముఖ్యులతోఁ గలహించి దివ్యులన్
బొనరిచి యెల్లలోకముల పోడిమి వీడఁగఁ జేసి స్వఃపురీ
జనులను సంహరించి కృపజాతులు భూతులు లేక వేగి పోఁ
బను లొనరించి చత్తు హరిబారిఁ బడంగలవాఁడనై వడిన్. 140

వ. ఇట్లు చేసితిని మఱియుం జేసి జగత్కంటకుండనై యుండెద దానం జేసి లోకరక్షకుండు నన్నుఁ జంప రఘువంశంబున నవతరించు న ట్లగుటకు మున్ను వారివారితోడం బగ పెంచుకొందు నని నిశ్చయించి. 141

—♦ అనరణ్యుఁడు రావణుం బంధించుట ♦—

మ. అజరుద్రాచ్యుతు లంతవారలను ని ట్టట్టై పడం జేయఁ జాల్
భుజశక్తిం గలఁ డైనపం క్తిముఖు డెప్డు మున్నయోధ్యాపురీ
ప్రజలం దోలుచునుండుటల్ దెలిసి దోర్దర్పంబు దీపింపఁగా
విజయాంకుం డనరణ్యభూవిభుఁ డసిన్ వేధించి పట్టె న్వడిన్. 142

తే. పట్టి తనహజారంబునఁ బెట్టి ద్వార
పాలకునిఁ జేసెఁ గొన్నాళ్లు లోలిఁ గడవ
నేమఱిచి నిద్రవోయెడుభూమివిభునిఁ
జంపి రావణుఁ డొకనాఁడు చనఁగ నయ్యె. 143

మ. మఱియున్ మున్నలకార్తవీర్యుఁ డొకయంభఃపాతమం దాడుచోఁ
గరమల్కం జని రావణుం డతనితోఁ గయ్యంబు గావింప రాఁ
గరసాహస్రముతోడఁ బట్టి యతనిం గట్టించి పాశంబులన్
జెరసాలం బడవైచి వేచె విపులం జేంద్రడంబునన్ ద్రుమ్మగన్. 144

ఆ. చాలదినము లట్లు జరిగిన పైఁ బుల
స్త్యుఁడు వచ్చి వేని స్తుతి యొనర్చి

విడిడి పుచ్చునట్లు వేఁడ నాతఁడు వాని
వెడల నడచె మిగుల నడలు గుడిపి. 145

—♦ వాలి రావణునిఁ బట్టి సముద్రములలో ముంచుట ♦—

మ. ఒకనాఁ డింద్రసుతుండు వాలి నియమం బొప్పంగ సంద్రంబునన్
ద్రిక మొప్పన్ బితృతర్పణంబులను భక్తిం జేయుచుండంగ నా
డకు నారావణుఁ డల్లనల్లఁ జని కంఠంబందు బాధించి ప
ట్టుకొనం గందొవ విచ్చిచూచియత డాటుం బోటు హెచ్చన్వడిన్.

ఆ. వాని పట్టు విడక వాలంబునం జుట్టి
సప్తసాగరముల స్నాన మాడ
నరిగి వాని నట్టె యంబుపూరంబులన్
ముంచి ముంచి మిగుల నొంచి నొంచి. 147

వ. కిష్కింధకుం గొని పోయి బహిర్ద్వారంబునం బడ వైచి బుద్ధి గలిగి
బ్రదుకు మని విడిచి పుచ్చె నతండు నరసావు సచ్చి నట్టిండై
యేరికంటం బడకుండ లంకాపురంబు సేరె నంత మఱికొంత
కాలంబునకు. 148

శా. కైలాసాచలసన్నికృష్టమున కొక్కెం డొక్కనాఁ డేగి హే
లాలోలాత్మకుఁడై మదం బది కడున్ లావై ప్రసాదింపఁగా
నాలంకాధిపుఁ డామహాచలము ద్రోయం జాల నో యంచు దు
ర్శీలుండై గిరిక్రిందఁ జేతు లిడి డొల్చం జెల్చఁ బెల్లార్చుచున్. 149

క. గులగుల శబ్దముతో డాల్
జలజల మని వృక్షచయము చలియించి పడన్
దలక్రిందు లగుచుఁ బర్వత
మిలఁ గూలెడునట్టి దయ్యె నింతటిలోనన్. 150

క. పులులును లేళ్లును సింగం
బులు మాతంగములు బసులు భూరిస్వనముల్
సెలఁగఁగ నార్చుచు నూర్చుచు
నిలఁ ద్రెళ్లెడునట్టి దయ్యె నింతటిలోనన్. 151

మ. గిరిజాదేవి మహాభయంబునను గెంగే లెత్తి కంపించుచుం
ధరఁ బాదంబులు నిల్ప లేని దగుచుం దాపైన మృత్యుంజయుం
గరయుగ్మంబునఁ గౌఁగిలించుకొని భర్గా! దుర్గ కీరితి భీ
తి రహించెం గరుణింపవే యని కడుం దీనంబుగాఁ బల్కుచుం. 152

చ. మృడుఁ డది యంతయుం గనుచు మిక్కిలిమక్కువతోడ నక్కునం
మడఁతిని నిల్పి పొల్పెసఁగ మాటల నాడుచుఁ గాలిబొట్టనం
దడుకొని పర్వతం బదిమి కన్నుల నవ్వుచునుండె నంతలో
నడుగునఁ బడ్డచేతు లవి యాడక యాడక యుండె వానికిం. 153

క. జతనించి మొత్తమేనియు
నతిబలమున నట్టు లిట్టు లాడించుటకుం
జతపడ కూర్పులు నిగుడఁగ
జతికిలఁ బడి కదల లేక శ్రాంతుం డగుచుం. 154

వ. నితాంతచింతాకుల స్వాంతుండై శ్రాంతుండై శాంతిం గొని యగ
ణచతుష్టయోక్త భుజంగప్రయాత వృత్తంబుల గృత్తివాసుం బ్రస్తు
తించి సాంగ వేదవేది గావున సప్తస్వరంబుల సామగానంబుగావించె
దానం జేసి ప్రసన్నుండై పన్నగభూషణుం డతని ననుగ్రహించి
పుచ్చె నిట్లు రావణుని ప్రవర్తనం బతిప్రస్తుతంబై ప్రవర్తిల్లు
చున్నంత. 155

—♦ వేదవతి చరిత్రము ♦—

సీ. దేవరుం డనెడు భూదేవవరేణ్యుండు
సప్తతంతు వొనర్చుసమయమందు
నగ్నికుండమునందు నావిర్భవించెను
వేదవతి యనంగ వెలయుకన్య
పద్మాలయాంశము పరిఢవిల్లఁగ నామెఁ
గని దేవరుఁడు కూఁతుఁగా గ్రహించి
తల్లి నీ వెవ్వారి ధవునిగాఁ గైకొందు
వన నామె హరి గాక యగునె యొరుఁడు

తే. నీ వసుమతింతు వేని నే నీరజాక్షు
కరుణకుం బాత్రురాలను గాఁ దపింతు
ననుడు జనకుండు నీయిష్ట మైనయట్లు
సలుపు మన నామె గంగకుఁ జనియెఁ జెప్పి. 156

శా. గంగాతీరమునం దపించునపు డక్కంజాక్షినిన్ మార్గమం
దుం గన్గొంచు దశాననుం డెడఁద సంతోషించుచున్ దేవి! న
న్నంగీకారము సేయు మేదశముఖాఖ్యాకుండ నా నామె వి
ష్ణుం గీర్తించు మనుంట మూర్ఖలుకమిన్ గ్రోధారుణాక్ష్యాస్యయై. 157

ఉ. దానినిఁ జెంపపైఁ జఱచి దర్పము సూపుడు గన్నువిచ్చి య
మ్మానిని గాంచి సంచలితమానసయై కను మూసి వెండియున్
వాని శరీరమంటుట నపాత్రత గల్గిన దంచు దేహమున్
ధ్యానము లోననే విడిచె దైవతసంగత చిత్తవృత్తియై. 158

వ. అంత దశగ్రీవుండు విగతమనోరథుండై దీనిశరీరంబునం జేసి యైనఁ గొంత తృప్తి నొందెద నని తత్కళేబరంబు విమానంబునం బెట్టుకొని మందిరంబునకుం జని మందోదరికి నిచ్చి దీని నాకు వండి పెట్టు మని పేరోలగంబునకుం జనియె నంతలో నారదుం డామె కడం బొడసూపి యిది కాళరాత్రి దీనివలనం గీడు మూడు నని చెప్పి యొప్పించి చనియె నామెయు దాని నొక్కమంజసంబునం బెట్టి సముద్రమ్మునం బాఱవైచి వేఱొకమాంసంబు పక్కవంబు చేసి మగనికిం బెట్టె నట్టియెడ మందోదరికి మాత్రము విన వచ్చునట్లు. 159

క. వేదవతి యంచు నామము
భూదేవత దిక్కులెల్ల మ్రోయఁగఁ బల్కెన్
శ్రీదేవి యామె సీతా
భూదేవత యగుత మవలఁ బోవం బోవన్. 160

వ. అది విని మందోదరి తనచేసినదానికి సంతసించె నట్లు సముద్రంబున వేదవతి శరీరంబు పడి యున్నప్పుడు వైకుంఠంబున విష్ణుదేవుండు లక్ష్మీదేవిం గాంచి యిట్లనియె. 161

శా. నీయంశంబునఁ బుట్టి వేదవతినా నెక్కాఁగనై యొక్కస్త్రీ
నాయందుం గడుభక్తిఁ జేసి తపముం గావించుచుండన్ ఖలుం
డాయబ్జాక్షిని ముట్టె దాన విడిచెం బ్రాణంబు లి ప్డాశవం
బాయబ్ధిం బడియుండె నీ వరిగి యం దావిష్కృతిం గాంచుమా.

వ. అనంతరంబ నీవు సీతవై జనకునకుం బుత్రివై రామునకుఁ బత్ని వగుదు వనిన నామె చెప్పినచొప్పునం జేసె నంత నప్పేటిక యట్లు మకరాలయంబునం బడి క్రమక్రమంబుగ భూగర్భంబునం జొచ్చి తన్మార్గంబున మిథిలాపురంబునకుం జేర నచ్చె నప్పు డప్పురీశ్వరుం డగుజనకుండు పుత్రకామేష్టిం జేయ నెంచి పురీపరిసరంబున యజ్ఞశాలాప్రదేశంబు నాఁగలిం గట్టి దున్నించుచుండె నప్పు డామంజసంబు నాఁగేటికఱ్ఱునకుం దగులుకొనిన దానిం దెఱచి చూచునంత నందు దివ్యమంగళవిగ్రహం బగుమంగళదేవత కన్యాకాకృతిం బొడసూపె నపు డాకాశవాణి యీయామె మహాలక్ష్మి నీయందలికరుణం జేసి యిట్లు ప్రత్యక్షం బయినది దీని నీవు కన్యకగా గ్రహించి పెంచుకొని మహావిష్ణుస్వరూపుఁ డయిన రామున కిచ్చి ధన్యుండ వగు మనిన జనకుం డానందించుచు నయ్యిందిరం దననందనగా నంగీకరించి స్వీకరించి పెంచుచుండె నంత నక్కడ సాకేతపురంబున. 163

—♦ రామలక్ష్మణభరతశత్రుఘ్నుల జననము ♦—

ఉ. యజ్ఞసమాప్తిచేసి యట కాగతులైనధరాధినాథులన్
బ్రాజ్ఞులఁ బండితోత్తముల బ్రాహ్మణవర్యుల బంధుబృందమున్
విజ్ఞత సాఁగ నంపి కడువేడుక తోడ సతీసమేతుఁడై
ప్రజ్ఞ ప్రకాశిలన్ సలిపెఁ బంక్తిరథుండు పురప్రవేశమున్. 164

క. సంతోషంబున దశరథుఁ
డంతిపురిన్ సౌఖ్యముండి నంతటఁ గొన్నా
ళ్ళంతయు లఘుగతి గడచినఁ
గాంతలు నీర్భోసి రపుడు కౌతుక మెసఁగన్. 165

సీ. తదనంతరంబునఁ బదిరెండుమాసముల్
చనిన మీఁదట నైనచైత్రమందు

ధవళపక్షంబునఁ దనరునవమితిథిఁ
భానువారంబునఁ బట్టపగట
నదితి దైవత్య మై నలరుబుఋక్షమునందు
గ్రహపంచకం బుచ్చగతుల మెలఁగ
గురుఁడు చంద్రునితోడఁ గూడి పొల్పొందంగ
లలి నొప్పుకర్కటలగ్నమందుఁ

తే. గనియెఁ గౌసల్యఁ బుత్రు నైక్ష్వాకవర్ధ
నుని జగన్నాథు సర్వసన్నుతసులక్ష
ణాంచితుని సర్వలోకవంద్యాంఘ్రియుగళుఁ
గమలనాభుని యర్ధభాగమునఁ జేసి. 166

తే. కలిగెఁ బుష్యర్క్షమీనలగ్నంబునందు
ఘనుఁడు భరతుఁడు కైకేయి కనఘుఁ డవల
నెంట్ర రవి జేర నాశ్లేషఋక్షమందుఁ
గనియె లక్ష్మణశత్రుఘ్నులను సుమిత్ర. 167

ఛ. నలువురు రాజపుత్రు లటు నవ్యరుచిం బ్రభవింపఁగా జనా
కుల మగునయ్యయోధ్యఁ గడుఁ గోరిక లీరిక లెత్త నుత్సవం
బులు విలసిల్లె నప్పదియుఁ బ్రొద్దులు వోయినయంత నవ్వసి
ష్ఠులు పరమప్రియంబునను శోభిలఁ జేసిరి నామకర్మముల్. 168

వ. ఆరాజపుత్రులు దినదినప్రవర్ధమానులై చౌలోపనయనాదిసంస్కా-
రంబులం దనరి. 169

తే. వైదికాచారనిరతులై వేదమందు
వరధనుర్వేదమందును బండితు లయి
తల్లిదండ్రుల శుశ్రూషఁ దగిలి చేయు
చును దలిర్చిరి జన మెల్ల వినుతి సేయ. 170

సీ. జ్ఞానసంపన్నులై చనువారిలోపల
రాముఁడు సత్యపరాక్రముండు

సర్వలోకేష్టుఁడు సర్వజ్ఞుఁడు శశాంక
సదృశనిర్మలకీర్తి సర్వసముఁడు
లక్ష్మివర్ధనుఁడు బాల్యప్రభృతి స్నిగ్ధుఁ
డట్టి రామునకు నిత్యానువర్తి
లక్ష్మణుఁ డగు బహిర్గతప్రాణము
భుజియింపఁ డన్నకు ము న్నొకప్డు

తే. భరతశత్రుఘ్ను లెంతయుఁ బ్రజ్ఞ గలరు
ప్రియతరులు రామునకు వారిఁ బ్రియసుతులను
బడసి తలిదండ్రు లెల్లభావములయందు
నపరిమితహర్షమును బొంది రనుదినంబు. 171

క. రాముఁడు విష్ణ్వంశమునన్
భూమిన్ జనియించినట్టి పురుషుం డైనన్
దా మాధవాంశజుఁడ నని
యేమాత్ర మెఱుంగకుండు నెప్పుడు వినుడీ. 172

—♦ విష్ణువర్ధనునికి శాపమువచ్చుట ♦—

సీ. విష్ణువర్ధనుఁ డనుపృథ్వీశుఁ డొకఁ డగు
నతనికి రమ కూఁతురై జనించెఁ
జక్కనిచుక్క యౌనక్కన్నె వెన్నునిఁ
బెండ్లాడఁ దలఁచె హృద్వీథియందు
నాలోన గార్గ్యుండు నాపర్వతుఁడు వచ్చి
బాలికఁ గని మోహబద్ధు లగుచు
దమకు ని మ్మని దాని తండ్రినిం గోర నా
తం డిర్వురకు నీయఁ దగదు గానఁ

తే. గూఁతు రిర్వురలో నేరి కొనునొ! వాని
కిత్తు నెల్లి రం డని పుచ్చె నిది యెఱింగి
కన్నె వెన్నునిఁ దలఁచుచు నున్నక్షేదగుట
వచ్చి కొనిపోయె నారేయి వరుఁ డతండు. 173

వ. మఱునాఁడు మునీంద్రులు జడలు రుద్రాక్షలు కాషాయవస్త్ర
ములు ధరించి వచ్చి యంతయు నెఱింగి నీ చింతయు నెఱింగి మ
మ్మిట్లు మోస చేసితివి గావున నజ్ఞానివై నీలావు నీ వెఱుంగకుండెడ
దవు గాక యని శపించి చని రంత విష్ణువర్ధనుండు విష్ణుదేవుం బ్రా
ర్థించిన నతండు ప్రత్యక్షుండై మును లెఱుంగక నిన్ను శపించిరి
దానిం దప్పింప నేరిగిం గాదు నేను రావణవధార్థము రామావ
తారం బెత్తెద నప్పు డీశాపంబు నేను వహించెదం గావున నిప్పుడు
నీకు లేకుండు నని వరం బిచ్చెఁ గావున రామునకుఁ దా నెవ్వరో
యనువిజ్ఞానంబు లేకుండు గాని సకలసద్గుణసంపన్నుండై జగదేక
మనోహరుండై యుండె నంత. 174

—♦ విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకై వచ్చుట ♦—

సీ. అపుడు మహాతేజుఁడైనవిశ్వామిత్రుఁ
డరుదెంచె నచటి కభ్యాగతుఁడయి
దశరథుఁడును వాని దవ్వుదవ్వులం గని
యెదురేగి తోడ్తెచ్చి ముదముతోడ
నర్ఘ్యపాద్యాదుల నర్చించి నాజన్మ
మిపుడు సఫలమయ్యె నేను సుకృతి
నేకారణంబుగ నిపుడు మీరాకకు
వచియించి నన్నుఁ బ్రోవ వలయు మీరు

తే. పాత్రభూతులు నాదైనభాగధేయ
మట్లు మీదర్శనం బయ్యె ననఘమూర్తి
సఫల మయ్యెను నేఁడు నాజనన మెన్నఁ
బూజ్యతములరు బ్రహ్మర్షిపుంగవులరు. 175

మ. అమృతం బచ్చినయట్లనూదకమునం దాసారమైనట్లప
త్యము లేనట్టిఁడు పుత్రునిం సదృశభార్యం బొంది కన్నట్లు న
ష్టము లాభించినయట్లు లభ్యుదయహర్షం బట్లు మీరాక యి
ట్లమరుం బో యనియెంతుస్వాగతముమీకౌనో మునీంద్రోత్తమా.

ఆ. మాకు దైవ మీర లోకైకనుత! భవ
దీక్షితం బెఱింగి యే నొనర్చు
నున్నవాఁడ ననిన నుర్వీశ్వరునిఁ గాంచి
కౌశికుండు వలికెఁ గౌతుకమున. 176

తే. పలుకు నేకూటిచిలుక యాపలు కటందు
రవ్విధంబున సదృశవాక్యంబు పలికి
తర్కవంశ ప్రదీప! నా కతిముదంబు
కలిగె సత్యప్రతిజ్ఞతఁ గలిగికొమ్ము. 177

క. జన్నమ్ము బొక్కఁడు సేయఁగ
నున్నంతన వచ్చి దైత్యు లుద్వృత్తిమెయిన్
న న్నడిచిపుత్తు రందుల
కు నీనందనుల ప్రాపుఁ గొన వత్తు నిటన్. 178

సీ. అవధరింపుము దైత్యు లనఁగ మారీచసు
బాహులు నాఁబడునారు వీర్య
వంతు లే నొ మ్మనునంత నరుగుదెంచి
విఘ్నకరుల్ యజ్ఞవేదియందు
మాంసముల్ రుధిరముల్ మాంసలంబుగఁ బోసి
ఋత్విజులం బట్టి యివల నెట్టి
యజ్ఞవిధ్వంసముఁ నాచరింతురు వ్రత
ప్రతిబంధమున శపింపఁగఁ దగదు

తే. కావునన్ రామచంద్రునిఁ గాకపక్ష
ధరుని సత్యపరాక్రము త్వత్కుమార
శేఖరుని నా కొసఁగుమో క్షితితలేశ
రక్కసుల నుక్కడఁచుశక్తిఁ గ్రాలు నతఁడు. 179

మ. బహురూపం బగు శ్రేయ మాతనికి నేఁ బ్రాపింపఁగాఁ జేయుదున్
సహసోదర్యుఁడు వానికిం ద్రిభువనాంచత్కీర్తి ప్రాపించు ధూ
ర్వహుఁ డారాముని బారిఁ జిక్కి దనుజుల్ వార్ కాలపాశాహతిన్
విహరింపం గలరై త్యజించెదరు మేన్ బృథ్వీతలాధీశ్వరా. 180

క. ఎఱుఁగుదుసు రామచంద్రుని
గరిమం బది యెల్ల ధర్మగతిలాభంబున్
బరమయశోలాభంబున్
బరికించి యొసంగు మతనిఁ బరిహృతశంకన్. 181

తే. గురువసిష్ఠులతో మంత్రివరులతోడఁ
జిరవిచారము గావించి జ్యేష్ఠసుతుని
విడుము నాతోడఁ బదినాళ్ళు గడచినంత
సవము సాగించి పంపుదు నవల నతని. 182

—♦ దశరథుఁడు రామలక్ష్మణులను బంపఁజాలననుట ♦—

వ. ఇట్లు ధర్మార్థసహితంబుగం బలికిన హృదయవిదారణం బగుముని వచనంబు విని శోకవ్యాకులితేంద్రియుండై ముహూర్తమాత్రంబు మూర్ఛితుండై యుండి కొండొకవడికి లబ్ధసంజ్ఞుండై గడగడ వడంకుచు ని ట్లనియె. 183

క. పదియాఱేడులు నిండని
మృదులాంగుఁడు రాముఁ డాహవేద్ధక్రియలన్
జదురుండు గాడు రక్షః
పదములఁ బోరాడఁ జాలువాఁ డన నగునే. 184

శా. ఏ నింద్రారులతోడఁ బోరి విజయం బెన్నేపరు ల్పొందితిన్
గాన న్వచ్చు ననంత సైన్యములు లోకఖ్యాతదివ్యాస్త్రముల్
నానాశక్తులు నాసమక్షమున సన్నద్ధంబులై యుండె నో
మౌనీంద్రాభరణాయమాన రిపులన్ మర్దింప నే నేరుతున్. 185

తే. నన్నుఁ గొనిపొమ్ము వచ్చెద నాశరాగ్ని
రక్కసులఁ గాల్చి నీయజ్ఞ రక్షణంబు
చేసివత్తును గాని నాచిన్నిబుడుత
నంపఁగా నోప నీతోడననఘచరిత. 186

తే. షష్టివర్షసహస్రముల్ చనిననేను
రాఘునిం బాసి క్షణ మైన బ్రదుకఁ జాల

నలుగురు కొమాళ్ళలో నెప్డు నాకుఁ బ్రీతి
వానిపై నుంట విడ లేను వాని నేను. 187

సీ. అయినను వినియెద నారక్కసులు వేరు
వేరిపంపున వచ్చినారు నాఁగఁ
గౌశికుం డిట్లను గలఁడు పౌలస్త్యవం
శభవుండు సర్వరాక్షసవిభుండు
రావణుం డనువాఁడు బ్రహ్మవరంబునఁ
బ్రబలుఁడై బాధించుఁ బ్రజల నెల్ల
సుందోపసుందులసుతఁలు సుబాహు మా
రీచులు రావణు ప్రేరణమున

తే. సత్క్రియా విఘ్నము లొనర్ప జగతిఁ దిగురు
చుందు రని చెప్ప దశరథుం డుల్లమందు
డిల్లవడి వారితోఁ బోర నెల్లనాఁడు
జంకుచుండుదు నేను నశక్తుఁడ నయి. 188

ఆ. న న్ననుగ్రహింపు నాపాలిదైవమ
వగుచు రావణాసురానుచరుల
బారిఁ బడి మనంగ వలచువాఁ డీమూఁడు
జగములందు లేడు జనులయందు. 189

వ. తండ్రీ! నన్ను క్షమింపు మే నశక్తుండ నిట్టిచో రణకోవిదుండ
గానినా బాలు నే నెట్లు కాలాంతకోపము లగుమారీచసుబాహుల
తోడ డీకొనం బంపఁ గలుగుదు ననిన నేయి వేల్వ భగ్గున మండు
నగ్నివలెఁ మండిపడుచుఁ గనుంగవ నంగారకణంబులొలుక నలుక
మెయి విశ్వామిత్రుండు 190

శా. ఏమీ! చేయుదు నంచుఁ జెప్పి మునుము న్నిచ్చొప్పునం జెప్పదే
భూమీశా! యిది భానువంశజులకుఁ ము న్నున్నమర్యాదయై
హేమింపం బకుచుండునే సరియ పొమ్మ్ నేగెద న్నీ. విలఁ
క్షేమస్థైర్యజయంబు లధి సుఖనై జీవింపుమా యొప్పుదుఁ. 191

మ. అనుచుర్ దిగ్గున లేచి రెండడుగు లేయం బోవఁ గా భూతలం
బనివార్యంబుగ సంచలించె జగ మల్లాడెర్ దిశామండలం
బునఁ గప్పెర్ విడకుండఁ గా విరి భయంబుం గూర్చు చుల్కల్ నభం
బునరాలెర్ బవనుండు నల్కలఁకులర్ బోసెన్ రజంబార్చుచున్. 192

—♦ వసిష్ఠుండు రాజునకు బోధించి పుచ్చుట ♦—

సీ. అప్పుడు సంత్రస్త మగుజగం బారసి
ఘనుఁడు వసిష్ఠుఁ డామనుజవిభునిఁ
గని యిట్లు పలికె నిక్ష్వాకుకులంబున
జనియించినట్టియేజనుఁడు గాని
యిష్టముం బూ ర్తము నష్టంబు గా నాడి
తప్పి పోయినవాఁడు చెప్పఁ బడఁడు
చేయుదు నని చెప్పి చేయకుండుట నీకుఁ
దగదు విశ్వామిత్రదైవతంబు
తే. వెంట నకృతాస్త్రుఁ డనక నీప్రియతనూజు
నంపిపుచ్చుము తద్గుప్తుఁ డయినవాని
జ్వలనగుప్తామృతంబును బలె నెవండు
గర దెఱచి చూడఁ జాలఁడు కానిబుద్ధి. 193

మత్త. బుద్ధిమత్ప్రవరుండు వీర్యసముద్ధతుండు ఘనుం డితం
డిద్ధధర్మవిదుండు కౌశికుఁ డెల్లశస్త్రము లస్త్రముల్
సిద్ధకల్పము గా నెఱుంగును జెప్పుచుంటిని సత్యముర్
సిద్ధముఖ్యు లొసంగి రీతఁడు నేల యేలెడునత్తఱిర్. 194

సీ. విను దక్షపుత్రికల్ మును జయాసుప్రభ
లనుసాధ్వులు భృశాశ్వునాంగ్రడు వారు
రక్షోగణంబుల రాసి పుచ్చఁగ నొక్క
రొక రేఁబదుగురు పుత్రకులఁ గనిరి
వారు దుర్ధర్షు లవార్యవీర్యులు దురా
క్రాములు శరరూపుల్లై పొలంగి

రా ప్రభావం బెల్ల నీ ప్రసిద్ధార్థుఁడు
పొందఁ గలిగినట్టిపురుషుఁ డయ్యె

తే. ఇతఁ డపూర్వములన్ సృజియింప శక్తి
గలఁడు తా నెంతి లెంతలు సలుపఁ గలఁడు
నీ సుతహితార్థ మీరీతి నిన్నుఁ గోరెఁ
బడక సందియ మితనితోఁ బంపు సుతుల. 195

—♦ విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులం గొనిపోవుట ♦—

వ. అని కులగురుండు బోధించిన దశరథుండు ప్రసన్నహృదయుం డై విశ్వామిత్రునితోడం బుత్రులం బంప నెంచి రామలక్ష్మణులం బిలిపించి కార్య మెఱింగించి వారిమూర్ధాఘ్రాణంబు గావించి మునితల్లజున కిల్లటంబు వెట్టె నపుడు కృతస్వస్త్యయను లగురామ లక్ష్మణులు విశ్వామిత్రునిమార్గం బనుసరించి రపుడు వాయువు సుఖస్పర్శం బయ్యె శంఖదుందుభినిర్ఘోషంబు కర్ణభూషణం బై విన వచ్చె నెల్లరు జయజయధ్వానంబు గావించిరి భూసురాశీర్వాద రవంబు మేదురం బయ్యెఁ బుణ్యాంగనలు రాజమార్గంబున రామ లక్ష్మణులపై లాజలు జల్లి రిట్లు సర్వశుభశకునంబులును బ్రవర్తిల్లు చున్న యపుడు. 196

శా. విశ్వామిత్రునివెంట నంటి చని రావిద్యావిశేషాంచితుల్
శశ్వచ్ఛస్త్రధనుర్ధరుల్ మణివిభూషాభూషితుల్ కాకప
క్షాశ్వత్థామలపత్రచిత్రితశిరస్త్రాణుల్ కుమారోత్తరుల్
విశ్వప్రస్తుతదివ్యమూర్తులు శివున్ విఘ్నేట్కుమారుల్ బలెన్.

వ. దాశరథు లిట్లు కౌశికు నంటి సరయూదక్షిణకూలంబు వట్టి సార్థ యోజన దూరంబు ప్రయాణంబు చేసి యున్నప్పుడు మునిచక్రవర్తి రామమూర్తిం గాంచి యి ట్లనియె. 198

భ. అనఘ! రఘూద్వహా! జలము లంటుచు వెంటన యాచమింపు మే
నను మతిన్ బలాతిబల లన్ ఘనవిద్యల నీ కొసంగెదన్

బొనరుసు దాన నశ్రమము భూరిసమర్థత యప్రమాదతయున్
ఘనజవసత్త్వముల్ శుచియుఁ గల్గు నటంచు వచించి వెండియున్.

— విశ్వామిత్రుఁడు రామునకు బలాతిబలల నుపదేశించుట —

తే. వీనిఁ బోలినవిద్య లీపృథివి లేవు
జ్ఞానమాతృక లియ్యవి జప మొనర్ప
క్షుత్పిపాసలు లేకుండు శోభ గూర్చు
బ్రహ్మసుత లివ్వి రెండుప్రభాన్వితములు. 200

వ. అని చెప్పినరామభద్రుండు జలోపస్పర్శనంబు చేసి శుచియై యు
న్నం గని కౌశికుండు హస్తమస్తకసంయోగంబు గావించి దక్షిణ
కర్ణంబునం జెప్పిన నతండు వానిం బరిగ్రహించి జపించి నంత సర్వ
విద్యావిశారదుండును బరాక్రమైకవిరాజితుండును నై శరత్కా
లోదితసహస్రభానునిభాతి భూతిన్ గొని గురునమస్కారంబుగావించి
తానుం దమ్ముండు నతనితో నట నారాత్రి దర్భశయ్యల శయ
నించి రంతఁ బ్రభాతంబున. 201

సీ. కౌశికముని యుషఃకాలంబునన్ లేచి
నృపబాలకులచెంత కపుడు వోయి
రామ త్రైలోక్యాభిరామ లె మ్మిదె పూర్వ
సంధ్య ప్రవర్తించు సమయ మయ్యె
దైవ మాహ్నికకల్య మీవు పొనర్పుము
నా విని లేచి భూనాథసుతులు
స్నానసంధ్యాద్యనుష్ఠానమున్ గావించి
మునికభివాదనమును పొనర్చి

తే. పయనమై మునివెంబడి వడిగ నడచి
కడక నొక్కింతలోన గంగాస్రవంతి
సరయువును సంగమించినస్థలముఁ జేరి
మునితపోవన మొకం డటఁ గని ముదమున, 202

వ. గాధిపట్టి దిక్కు మొగంబై మహాత్మా యిది యేరి యాశ్రమపదం బనిన నతండు వారి కి ట్లనియె. 203

—♦ అంగ దేశ వర్ణనము ♦—

సీ. కాముఁ డిచ్చటఁ దపఃకాముఁడై యుండిన
హరునిపైఁ బూవుటంపఱ నిగిడ్చి
దాన నతం డల్గి వాని నీక్షించెఁ జి
చ్చఱకంటితోడ నత్తఱి మరుండు
బసుమమై స్వాంగంబు వడఁ దా ననంగుఁడై
పోయెఁ దదంగ మప్పుడమిఁ బడుట
నది యంగ దేశసమాఖ్యకు నయ్యె నిం
దెందఱో వసియింతు రిద్ధమునులు

తే. వీరు నాశిష్యు లిట రేయి విశ్రమింత
మనుచుఁ బలుకుచు నున్నంత మునులు వచ్చి
పూజ గావించి యాతిథ్యమును నొసంగి
రాశ్రమోటజంబుల నిల్పి యాదరించి. 204

వ. వా రారాత్రి వారియాశ్రమంబున సుఖనిద్రం గావించి మఱునాఁ డరుణోదయంబున లేచి కాల్యకృత్యంబులు నిర్వర్తించి ఋషిసమానీత మగునావ నెక్కి గంగ దాటి దక్షిణకూలంబు వట్టి పోవం బోవ ముందఱ జనసంచారవిరహితంబును ఘోరసంకాశంబు నగు నొక్కవనోద్దేశంబు గాంచి రఘుపుంగవుండు మునిపుంగవుం గాంచి యి ట్లనియె. 205

తరు. ఇది ఘోరవన మిందు నెందు నేనాఁడు
నేరు మెట్టినజాడ లీక్షింప రావు
పదములన్ శ్వాపదవ్యాఘ్రభల్లూక
వారణంబులు ఝిల్లివర్గనాదంబు
వెదుఁ...పిడెంబులు వివతిందుకములు
వేపలు డొంకలు వేలకు వేలు

పొదలుచుండును జనుల్ పో రాఁగ దారి
పోలింప రా దిది పూర్వ మెట్టిదియొ. 206

సీ. చెప్పు మనంగఁ గౌశికుఁ డివ్వి మలద క
రూశ దేశమ్ము లింద్రునకుఁ దొల్లి
వృత్రవధంబున వెలసినమల మిందుఁ
గడిగిరి వేల్పు లక్కతన నిందు
మలములును గరూశములు నాఁగ దేశము
లేర్పడె నెంతయు నెసక మెసఁగ
నవ్వేల నాగసహస్రబలము గల్గు
తాటక సుందునితన్వి యక్షి

తే. ఖలుని మారీచునిం గన్నతలియ యీప్ర
దేశములఁ జేరి ప్రజలను నాశనంబు
చేసి యీరీతికిం దెచ్చెఁ జెట్ట దాని
వన మిటకు నర్ధయోజనమున నెసంగు. 207

—♦ రాముఁడు తాటకఁ నెఱింగి సంహరించుట ♦—

వ. మునుమున్న మన్నియోగంబున దుష్టచారిణి యగుదానిఁ జంపి దేశంబు నిష్కంటకంబు గావింపు మనిన రాముం డల్పవీర్యు లగుయక్షులకు నాగసహస్రబలం బెట్లు వచ్చెం జెప్పు మన నతండు తొల్లి సుకేతుండు నా నొప్పుయక్షుం డనపత్యుండై పితామహునిం గూర్చి తపంబు గావించి తత్ప్రసాదంబున నిట్టిబలంబు గలతాటకం బడసి దీనిని ఝర్ఝపుత్రుం డగుసుందునకు నొసంగె నీయక్షికి మారీచుండు పుట్టె సుందుండు నిహతుండైన పదంపడి యీతాటక మారీచునితో నొక్కనాఁ డగస్త్యాశ్రమంబునకుం జని వానిం బట్టి మ్రింగ నెంచిన నతండు గండుమిగిలి మారీచుని రాక్షసుం డవు గ మ్మని శపించి తాటకను నీవు వికృతరూపంబు నొందుదు వనియె నిది తాటకవృత్తాంతంబు దీనిపట్ల పాపశంక విడిచి దుష్ట సంహారంబు సనాతనధర్మం బని తలంచి దీనిని సంహరించి లోకోప కారంబు గావింపు మనిన సాంజలియై రాఘవుండు. 208

మ. పితృనిర్దేశముఁ జేసి కౌశికమునీడ్విఖ్యాతవాక్యంబు నా
దృతి శీర్షంబునఁ బూని నేను గుశికాధీశాన్వయగ్రామణీ!
యతిచంద్రా! వధియింతుఁ దాటకను దేశాభ్యుచ్ఛ్రియం బెంచుచున్
క్షితిదేవార్థము గోహితార్థ మయి యీస్త్రీహత్యనిర్దోషమా. 209

వ. అనిధనుర్మధ్యంబువామముష్టింబట్టిజ్యాఘోషంబుగావించుటయు. 210

ఉ. అల్లమహాధ్వనిం దగిలినట్టివనంబునఁ జెట్లఁ జేమలన్
జల్లున రాలె నాఁకులు రసాధరకోటుల జాలు డుల్లె గల్
గల్లునఁ గందరాలయముఖంబులనుండి ప్రతిధ్వనుల్ ధరం
బెల్లుగ నిండెఁ బ్రాణితతి బెండువడెం జెవుఁ డయ్యె నెల్లెడన్. 211

సీ. జానుగు లగిలించుజ్యాఘోషమును విని
క్రోధమూర్ఛిత యయి కొంతలోన
శబ్దంబు చనుదెంచుచక్కికి నిప్పులు
గ్రక్కుచుం జనుదెంచి గర్జిలంగఁ
గని రాఘవుఁడు లక్ష్మణునిఁ గంటె తమ్ముఁడా!
దర్శనమాత్ర సాధ్వస మొసంగు
దారుణాకార యీదైత్యాంగన మహాతి
మాయాబలప్రసమన్విత యగుఁ
తే. దెఱవ గావున దీని వధింప మనము
గాదు ముక్కులుఁ జెవులును గండరించి
పంపుద మటంచుఁ బలికెఁ బట్టునందు
యక్షి రామునిపైఁ బడె రూక్షగతుల. 212

వ. నోరు తెఱచి చేతు లెత్తి మొత్త వచ్చుదానిం జూచి విశ్వామిత్రుండు
హుంకరించి రామునకు స్వస్తివలికె నప్పుడయ్యాయలాడి. 213

తరు. మాయాబలంబున మచ్చరం బెచ్చు
మబ్బయి గుండుజాల్ మాటికిం గుటిసెఁ
బాయనిశక్తిపైఁ బార్థివాత్మజుఁడు
ప్రక్షేపములఁ దానిబలు ముడిగించి

దాయవచ్ఛేదుయక్షి తతబాహుయుగము
తఱగె ఖడ్గంబునం దమ్ముఁడు నప్పు
డాయక్షికర్ణము లగ్రనాశికయు
నసిధారం దెగం గోసె నాగ్రహంబడర. 214

వ. ఆలోఁ గామరూపిణి యగునది యంతర్ధానంబు నొంది మఱియు మహోన్నతంబుగా నశ్మవర్షంబు గురియుచున్నం గని విశ్వామిత్రుండు మిత్రాన్వయరత్నంబుదిక్కు మొగంబై యి ట్లనియె. 215

ఉ. చాలుఘృణారసం బెద నెసంగఁగ నీకును దుష్టచారిణిన్
గోలుమసంగి సజ్జనులకున్ నిరతంబును గాళరాత్రియై
కాలునివీటి కంపుటకుం గట్టడ గట్టెడుపాపచిత్త నీ
లీల వధింప నుండు మదె లేఖులు నిన్ గనుచుండి రవ్వలన్. 216

మ. అనుచుండం బిడుగట్లు వచ్చి పడునాయక్షిన్ విరూపాక్షినిం
గని కాకుత్స్థకులోద్భవుండు కినుకన్ గాండంబు కోదండమం
దనుసంధానము చేసి దానియురమం దవ్యాహతప్రక్రియన్
మునిరా జెన్నఁగ నేసి కూల్చె నసువుల్ పోకాడి వీకాడఁగన్. 217

తే. అపుడు సురపతి చనుదెంచి నృపకుమారు
మేలు మే లని యగ్గించి మెచ్చి మునిని
నీ వలభృశాశ్వపుత్రుల నెల్ల శస్త్ర
ముల నెఱింగింపు మితనికిఁ బోలుపు మిగుల. 218

తే. అనుచు దేవేంద్రుఁ డరిగినయంతఁ గౌశి
కుఁడు నృపాత్మజుఁ గౌఁగిట నిడి శిరంబు
పుడికి యీ రేయి యిట నుండి పోవుద మన
విశ్రమించిరి తాటకావిపినభూమి. 219

—♦ విశ్వామిత్రుఁడు రాముని కనేకమహాస్త్రంబు లొసఁగుట ♦—

వ. మఱునాఁ డరుణోదయంబున మేలుకాంచి కాల్యకరణీయంబు లెల్ల నిర్వర్తించినంత విశ్వామిత్రుండు మిత్రకులనందనుం గని

నీచేతకుం బ్రీతుండ నైతి వత్సా! నీకు సర్వలోకప్రశస్తంబు లగు మహాస్త్రంబు లిచ్చెదం బుచ్చుకొను మని దండచక్రంబును, ధర్మచక్రంబును, గాలచక్రంబును, విష్ణుచక్రంబును, ఐంద్రాస్త్రంబును, వజ్రాస్త్రంబును, శైవశూలంబును, బ్రహ్మశిరోస్త్రంబును, బ్రహ్మాస్త్రంబును, మోదకీశిఖరు లను రెండుగదాదండంబులును, ధర్మపాశంబును, గాలపాశంబును, వరుణపాశంబును, వైనాశాస్త్రంబును, నారాయణాస్త్రంబును, ఆగ్నేయాస్త్రంబును, శిఖరాస్త్రంబును, వాయవ్యాస్త్రంబును, హయశిరోనామాస్త్రంబును, రుద్రవిష్ణునామకశక్తిద్వయంబును, గంకాళంబును, ముసలంబును, వైద్యాధరాస్త్రంబును, బ్రస్వాపనప్రశమనంబులును, గాంధర్వాస్త్రంబును, సౌరాస్త్రంబును, దర్పణ శోషణ సంతాపన విలాపన మదన మోహనంబు లనునస్త్రంబులును, సంవర్తదుర్ధరమహానలంబులును, సత్యమాయాధరాస్త్రంబులును, బరతేజోపకర్షణాస్త్రంబును, మున్నగు నానావిధమహాస్త్రంబు లిచ్చి యివి త్రిలోకవిజయప్రదంబు లని చెప్పి పరిగ్రహింపు మని ప్రాఙ్ముఖంబు గావించి మంత్రప్రదానంబుచేసి వీని కుపసంహారంబులునుం జెప్పెద నవధరింపు మని సత్యవ్రతము, సత్యకీర్తి, ధృష్టము, రభసము, పరాఙ్ముఖము, నవాఙ్ముఖము, దృఢనాభసునాభములు, జ్యోతిషము, వైరాగ్యము, యౌగంధరము, దైత్యప్రశమనము, శుచి, విరుచి, బాహువు, మహాబాహువు, కామరూపము, కామరుచి, మోహము, జృంభకము, సర్వనాభము, సంతానకరణము లోనగుసంహారంబు లెఱింగించిన రామచంద్రుండు మంత్రగ్రామం బెల్ల నెఱింగి వానిం దలంచుచుండ నవి నానావిధరూపంబులం బొడసూపి మే మిదె చను దెంచితిమి మాచేయునదియే మానతి మ్మనిన శ్రీరాముండు వలసినప్పు డాహ్వానించెద నని మంత్రాధిదేవతల నంపిపుచ్చి లక్ష్మణున కామంత్రరాజంబు లెల్లం జెప్పి ప్రత్యక్షంబు గావించి ప్రయాణోన్ముఖుండై దారిపట్టి కొంతదూరంబు చని యొక్కపర్వత ప్రాంతంబునం గాంతం బగుకాంతారంబుం గని కౌశికుందిలకించి. 220

మ. ఇది యెవ్వానివరాశ్రమస్థల మొకో యింద్రైకనుంగోఁగనై
పొదలుం జిల్కలు గోరువంకలు మనంబుం జూఱగోఁ గూసెడిన్
మదమాతంగము లిందు నందు మెలఁగున్ మాకందపుష్పంబులన్
గదుపుల్గట్టి పెలంగుభృంగములు ఝుంకారస్వనం బేర్పడన్.221

ఉ. ఈరు పౌనర్బ్వయజ్ఞపద మెక్కడ? యేరి దురాత్ములు? వేరి జంపి నే
సారతరాధ్వరక్రియ లజస్రము కావఁగఁ జెల్లు సర్వమున్
గోరితిఁ జెప్పవే యనుడుఁ గోరిక లీరిక లెత్తఁ గౌశికుం
డారఘురాముదిక్కు మొగమై ముద మాపహిలంగ నిట్లనున్.222

—♦ వా మ నా శ్ర మ వ ర్ణ న ము ♦—

సీ. ఇది వామనాశ్రమపద మిందుఁ దొల్లి క
శ్యపుఁ డెంతయో తపశ్చర్య నుండె
హరి ప్రసన్నుం డయి యదితికశ్యపులకు
వామనుండై పుట్టి వారిపంపు
వలన నిచ్చట యజ్ఞకలన నుండిన బలి
నడిగి మూ డడుగులు పుడమి యెల్ల
కడ లాక్రమించి సంక్రందనునకు నిచ్చి
తల్లిదండ్రులకోర్కి చెల్లఁ జేసెఁ

తే. బెక్కువేలేండ్లు తప మిందు వెలయఁ జేసె
దాన వామనాశ్ర మని దీని కయ్యె
నామధేయము నే నిం దనారతంబు
తపము సేయుచునుందు నోనృపకుమార. 223

చ. ఇచటికి రాక్షసాధము లనేకులు వచ్చి మదీయయాగమున్
విచలితమై చెడన్ సలుప వేచియ యుందురు వారిఁ ద్రుంపఁ గా
సుచరితుఁ డైననీ విపుడు చూడుము నావుడు రామచంద్రుఁడున్
శుచి యయ్యు మంత్రదేవతలఛొప్పు గనుంగొనుచుండె నంతటన్,

—♦ రాముఁడింద్రదత్తకోదండమును బరిగ్రహించుట ♦—

మ. ఎదుటం గాంచెను రాఘవుం డఖిలలోకైకప్రజాస్వాస్థ్యకృ
త్పదవీకాండము శౌర్యసారవిలసద్భాండంబు దేవేశ్వరా
స్పదభూరక్షణదక్షదండ మసురప్రాణాపనోదోల్లస
త్పదసంరబ్ధసుబద్ధబుద్ధయమరాడ్దండంబు కోదండముఁ. 225

తే. కాంచి యిది యేరి ధను వని కౌశికముని
నడుగునంత నతం డను నవనినాథ!
నీకుఁ గా దీని విధి పుచ్చె నీవు దీనిఁ
స్వీకరింపుమ యని యెత్తి చేతి కిచ్చె. 226

వ. శ్రీరాముండు దాని స్వీకరించి విశ్వామిత్రదత్తబాణంబులకుం దగిన
బాణాసనం బని ముదంపడుచు దీనివృత్తాంతం బెట్టిది చెప్పు మనిన
విశ్వామిత్రుండు. 227

సీ. మధుఁ డనుసురవైరి విధిచేతిదండము
విలువ నతం డల్గి వెస సుమేరు
శైలముపై నీవు సారవంశద్రుమ
మై పుట్టు మని తిట్టె నంత వాఁడు
వెదురుచెట్టయి పుట్టెఁ బిదపఁ బురత్రయ
సంహార మొనరించుసమయమందు
హరునకుఁ దగినవి ల్లవసర మగుటయు
విధి విశ్వకర్మను బిలిచి వంశ

తే. వార్త యెఱిఁగించి నీ వల్లవంశమునను
ధనువులం జేసి తె మ్మనఁ దరలి యతఁడు
మేరువున కేగి వేణువు నేరి కొట్టి
తెచ్చి కోదండములఁ జేసి యిచ్చెవిధికి. 228

వ. అతండు మొదటిది పినాకంబు దాని నీశ్వరునకును రెండవది
శార్ఙ్గంబు దాని లక్ష్మీశ్వరునకును మూడవది యిది నీకు నిచ్చె మఱి
యొండు కోదండంబు కల దది నారాయణమునిమిత్రుం డగునరున

కొసంగె నది యవ్వలికాలంబునఁ ధర్మనందనానుజుం డగునర్జునుని చేతికిం జిక్కె నని పలుకుచున్నంత. 229

శా. ఆసిద్ధాశ్రమవాసు లౌమునులు విశ్వామిత్రు నీక్షించుచుఁ
మాసంతోష మనంత మోమునివరా! మానాథునిం దెచ్చి మా
తో సంబంధము గల్గఁ జేసితివి నిన్ స్తోత్రంబు గావింప నా
నీసందేశ మిట న్మెలంగెడు జనం బెల్ల న్వినం జెల్లెడిన్. 230

—♦ విశ్వామిత్రుఁడు దీక్షంబూన రామలక్ష్మణులు గాచుచుండుట ♦—

సీ. ఏము చూచెద మెల్లనీవు దీక్షితుడవై
సవనసంకల్పము సలుపు మనుఁడు
నియతేంద్రియుండును నియతుఁడై దీక్షను
దొడగెను రాజపుత్రులును గడక
నెపు డెప్పు రాక్షసు లేతెంచెదరొ వారి
నుక్కడంచుట యెప్పుడో కద యన
సంతసించుచు మునుల్ షడ్రాత్రములు మౌన
మున నుండుకౌశికమునిని విడక

తే. కాచుకొనియుండ నౌ ననఁ గా నెటింగి
నిదుర యాహారమును మాని నిముస మైన
నామునీంద్రుని విడ కివ లావల నయి
ధన్వులై కాచి యుండి రాదాశరథులు. 231

చ. అనిమిషులై రఘూద్వహు లహర్నిశ మట్టులు యజ్ఞవాటి చు
ట్టును దిరుగాడుచున్ నడ కడు న్వడి సేయుచు నింగి నేలయున్
గనుఁగొనుచుం జెవుల్ నిగుడ గాఁ జిటు కన్న రవంతశబ్దమే
వినుచును గంటి తెప్పవలె వీడక యోడక కాచి రమ్మునిన్. 232

—♦ రాముఁడు మారీచ సుబాహుల నుక్కడంచుట ♦—

ఉ. ఒండును రెండు మూఁడనుచు నుండగ గండము వోలె నార్వ నాఁ
డండకు వచ్చె నచ్చిఱుత లట్టిస్గనుంగొనుచుండ మానిమా

ర్త్రాంతమునితో సమిత్కుశఫలాదులతో మఱి స్రుక్స్రువాళితో
మండెను వేది భగ్నమని మంటలు లేవ శుభంబు వోవఁగన్ 233

తే. అప్పు డాకాశమునఁ బెద్ద చప్పు డయ్యె
వానకారునఁ బెనుమబ్బు పర్విनట్లు
మాయ గప్పుచు రాక్షసుల్ మాంసరుధిర
వర్ష మెంతయుఁ గురిసి రధ్వ రము వేది. 234

తే. చదలఁ దాండవ మాడు రాక్షసుల వారిఁ
బొలఁ జూచి మారీచసుబాహు లనుచుఁ
దెలిసి రాముఁడు లక్ష్మణుదిక్కు చూచి
చూడు మనుజన్మ! వీ రెట్లు మాడఁ గలరొ. 235

మ. అని కోదండగుణంబునం బ్రళయకాలాసన్నతీవ్రాశుగ
మ్మునకుం దీటగునాశుగం బిడి వడిన్ బూరించి వాయ్వస్త్రమున్
గను లంగారము లీనఁ జూచి ఖలునిన్ మారీచుని న్నీచునిన్
గనుఁగో నెల్ల రురంబునం బడఁగ వీఁకం జేసి యేసె న్వడిన్. 236

ఆ. మానవాస్త్ర మద్ది వాని దాకి సహస్ర
యోజనములదూర మాజలార్ణ
వమ్మునందుఁ గూల వైచెఁ జంపియుఁ జంప
నట్లు చేసి మిగులఁ బెట్లు పెట్టి. 237

వ. అంత మఱియును. 238

మ. అనలాస్త్రం బదివోసి రాఘవుఁడు మంత్రానంతశక్త్యంచితం
బనివార్యంబుగఁ జేసి యేసె గగనవ్యాప్తం బ వై పర్వఁ గ
న్గొనుచుండంగఁ దదస్త్రరాజము మహాఘోషంబు గావించుచున్
జని ప్రమందించె సుబాహునిం గడమ రక్షస్సైని కాధ్యక్షులన్. 239

వ. ఇట్లు సర్వరాక్షససంహారంబు గావించిన రఘునందనుం గాంచి తదాశ్రమ వాసు లైనఋషు లందఱు నానందించి పూజించి రవుడు యజ్ఞసమాప్తిం జేసి విశ్వామిత్రుండు చనుదెంచి రామలక్ష్మణుల నక్కునం జేర్చి ప్రీముడించుచు. 240

శా. నన్నున్ ధన్యునిఁ గాగఁ జేసితి విటన్ రక్షోభయం బంతయున్
భిన్నంబై చనె నీకటాక్షమున నీపిత్రాజ్ఞ చెల్లించి తో
యన్నా! నిన్ను నుతింప నేర గుణధుర్యా! యంచు గాకుత్స్థులన్
గన్నారం గని పూజచేసె మునిసంఘంబుల్ ప్రశంసింపఁగన్. 241

మహా. అని విశ్వామిత్రమున్యాస్య గళిత మగువాక్యంబులాలించిరాముం
డనువొప్పన్ మ్రొక్కి నే నీయనుజుఁడు భవదీయాప్త దాసేరవర్గం
బున నౌవా రంచుఁ గర్జంబులుపొనరుప నెప్డు న్నియోగింపనొప్పన్
మునినాథా! యన్యబుద్ధిం బొనరుప నగునో పుత్రులం దెప్డుగానీ. 242

—♦ శ్రీరాముఁడు మునులతో మిథిలకుఁ బ్రయాణమగుట ♦—

తరు. అని పల్క మునివర్యు లందఱు వారి
నాదరించుచు గౌరవాతిశయమున
జననాథసుతులార! జనకభూజాని
జన్నం బొనర్చు నీసమయంబునందు
మునివర్యు లెల్ల రప్పురమున కేగ
మొనసియుండిరి నేఁడు పుణ్యమహంబు
గనుఁగొనుపొంటె నాకొమ్మవల్లభుండు
ఘనులలో ఘనుఁడు విజ్ఞానవారాశి. 243

సీ. ఆరాజునగరిలో హరధనుర్వర మొండు
పూజింపఁ బడుచుండుఁ బూలఁ బత్రి
మును దేవరాతాఖ్యుఁ జను జనకున కద్ది
దేవదత్తం బయి తేజరిల్లు
నది శత్రునాశార్థ మర్చింపఁ బడు దానిఁ
దివ్వ నెక్కిడ నేర్వ రెవ్వ రేని
దేవారులే కాదు భూవరు లెందఱో
తద్వీర్య మెఱుగంగఁ దలఁపుచేసి

తే. వచ్చి యెక్కిడ నేరక నొచ్చి పోవు
చుందు రీరు ఘనుల్ చూడ డెంద మైన

రంబు మముఁ గూడి యన రాఘవుండు తచ్ఛ
రాసదర్శన మొనరింప నాసఁ జూపె. 244

వ. అంత విశ్వామిత్రుండు మిత్రకులపవిత్రుల యనుమతం బెఱింగి సకలమునిజనపరివృతుండై వనదేవతల నామంత్రించి శకటంబుల నగ్నిహోత్రాది సంభారంబులం బెట్టుకొని ప్రస్థితుండై సిద్ధాశ్రమంబునుండి గంగాతీరంబున నుత్తరంబున నున్న హిమవతంబునకుఁ బ్రదక్షిణంబుగ నుత్తర దిఙ్మార్గంబు వట్టి త న్ననుసరించు సిద్ధాశ్రమవాసుల నిలువ నియమించి సాయంసమయంబునకు శోణనదపరిసరంబునకుం జని స్నానసంధ్యాదులు నిర్వర్తించి యున్నంత రామచంద్రుండు విశ్వామిత్రుని సమక్షంబునం గూరుచుండి కౌతూహలసమన్వితుండై యిట్లనియె. 245

క. ఇది ఎవ్వని దేశ మొకో
ముద మెదఁ బొదలఁగఁ జేయు మునిచంద్రమ! నా
కది యెల్లఁ దెలియఁ జెప్పుము
మొదలంటఁగ ననుచు మానిముఖ్యుం డనియెన్. 246

—♦ విశ్వామిత్రుండు కౌశికాశ్రమవృత్తాంతం బెఱిఁగించుట ♦—

సీ. బ్రహ్మపుత్రుం డయి ప్రభవించెను దపస్వి
కుతలంబున శయింపఁ గుశుఁ డనంగ
నతఁడు వైదర్భియన్ సతియందు గాంచెఁ సు
తులఁ గుశనాభు నాధూర్తరజసు
వసువుఁ గుశాంబు నవ్వల వారిఁ గని తండ్రి
పలికె ని ట్లని కృపాస్వాంతుఁ డగుచుఁ
బ్రజలార! వసుమతిం బాలింపుఁ డీ రన
నల్వురు గట్టిరి నాల్గుపురులు

తే. వారు వారిపురంబులఁ గోరికమెయి
నిలిచి దేశసంరక్షణ కలితచిత్తు

లగుచు రాజ్యాంగమంతయు ననువు పడఁగ
భూతలం బెల్ల నేలిరి భూరిమహిమ. 247

వ. వారిలోఁ గుశాంబుఁడు కౌశాంబీపురంబును గుశనాభుండు మహో దయపత్తనంబును అధూర్తరజసుండు ధర్మారణ్యనగరంబును వసువు గిరివ్రజపురంబును నిర్మించిరి వసువుపేర నీభూమి వసుమతి యయ్యె గిరివ్రజంబుం జుట్టి వైహార వరాహ వృషభ ఋషి చైత్రకంబు లనుపంచగిరులు విరాజిల్లు దానంజేసి పురంబు గిరి వ్రజంబు నాఁబడియె. నీదేశమధ్యమందలి దేశంబు మగధంబు నానొప్పు నిందు మాగధీనది ప్రవహించు నద్దాన నిది సస్యమా లినియై సుక్షేత్రం బయ్యె నని మఱియును. 248

సీ. కుశనాభుఁడు ఘృతాచిఁ గొని దానియందు నూ
ర్వురు కన్యలం గనె గరిమ మెఱయు
రుచిరాంగు లగువారు పరిసరోపవనంబుఁ
జని విహరింప నచ్చటికి వాయు
దేవుఁడు చనుదెంచి పూవుఁబోండ్లం గాంచి
నను వరియింపుఁడో వనితలార!
నిత్యయౌవనమును నిత్యదీర్ఘాయువు
మీకుఁ గల్గెడు నన మించుబోండ్లు

తే. మ మ్మెఱుంగక యారీతి మాట లాడఁ
దగునె పో మల్లకుశనాభతనయల మతఁ
డిచ్చినం గాక మే మేరి మెచ్చికొనము
తండ్రియే మాకుఁ బరమంబు దైవతంబు. 249

వ. అని ప్రత్యాఖ్యానంబు జేసినఁ బ్రుషదశ్వుండు కినిసి మీరుకుబ్జ లగు దురు గాక యని శపించిపుచ్చె వారును దీనాతిదీనలై దేవురించుచుం దండ్రిపాలికిం జని వాయుదేవు దుశ్చేష్టితం బెఱింగించిన నతండు తనదుహితలు చేసినచేఁతకుం బ్రీతుండై తగినవరులం దెచ్చి వారికి వివాహంబు సేయ నెంచి మంత్రులతో మంతనంబుండ వారును. 250

ఉ. చూళి యనంగ నొక్కమునిసోముఁడు బ్రాహ్మతపంబు సేయుచోఁ
గాలవిశేషసంగతిని గానఁగ వచ్చెను సోమదాఖ్య కా
బాలిక యూర్మిళాతనయ భర్తృపరాయణ దేవయోని ప్రో
యాలు మునిం భజించుమన మంద ఱెఱింగెడినట్లు దెల్పుచున్. 251

క. ప్రతిదినము చూళి కేఁడున్
వ్రతమర్యాదలకు వలయుపరికరములు తాఁ
మతి నెఱిఁగి తెచ్చి యిచ్చుచు
సతతము సేవించుచుండె సన్నుతమతియై. 252

వ. చూళియు దానిచేఁతలకు సంతసించుచు నొక్కనాఁడు నీకేమి కావ
లయు నెఱింగింపు మనిన నగ్గాంధర్వి యిట్లనియె. 253

చ. త్రికరణశుద్ధిగా నిపుడు దేవరకు న్వచియింతు నింత కే
నొకపురుషాకృతిం గనఁగ నుల్లము సేసినదానఁ గాను బ్రా
హ్మికి నెనయం్రడు నన్ జనులు మీఁదగుదర్శన మైనదాది మి
మ్మొకని వరించితిన్ త్రిభువనోన్నతుసిన్ సుతు నొంద నెఁచుచున్.

వ. అనిన నాతం డామె ననుగ్రహించి పాణిగ్రహణంబు గావించి
యామెయందు బ్రహ్మదత్తుం డనుపుత్రుని గనియె నాతం డిపుడు
కాంపిల్యపురంబున ధరణీశుండై యున్నవాఁడు నీపుత్రికల కెల్ల
విధంబులం దగినవాఁ డనినఁ గుశనాభుండు. 155

తే. బ్రహ్మదత్తునిఁ బిలిచి యాపార్థివునకుఁ
దనసుతల నిచ్చి నూర్వురఁ దగువిధమునఁ
బెండ్లి గావించె నంత నప్పెండ్లికొడుకు
తనసతులఁ గూడి కాంపిల్యమునకుఁ జనియె. 256

మ. కుశనాభుండు కుమారులం గనమికిన్ గొండొక్కచందంబునన్
గుశుఁ డెంతేనియుఁ జింతసేయుచును బెక్కున్ సత్క్రియల్ చేసిన
దృశమగుం గూర్చెదుపౌత్ర యాగమును జేయం బూన్చె నద్దాన న
క్కుశనాభుండు కుమారు గాధిఁ గనె లోకుల్ మెచ్చ నుచ్చైర్గతిన్.

వ. ఇట్లు కుశనాభునకుఁ గుమారుండు పుట్టినపదంపడి కుశుండు నభో
మార్గంబున బ్రహ్మలోకంబునకు నిర్గమించె నాకర్ణింపుము. 258

ఆ. కుశికనందనుండు కుశనాభపుత్రుండు
కౌశికుండ నైనగాధి నన్నుఁ
గన్నతండ్రి యగును ఘనుఁడు ఋచీకుని
దేవి సత్యవతి మదీయభగిని. 259

ఉ. ఆయమ బొందితోడఁ జనె నాక మనంతర మందు లోకర
క్షాయితచిత్తయై ధరణిఁ గౌశికి యై హిమవంతమందుఁ దా
నేయెడఁ బుణ్యతీర్థముల నేర్పడఁ బాఱుచునుండు నే నటన్
బాయక సర్వకాలము తపఃకలితాత్ముఁడనై వసించెదన్. 260

వ. అని తనపూర్వులవృత్తాంతంబు సవిస్తరంబుగం జెప్పి యిది సిద్ధాశ్రమంబు నీకతనం జేసి సిద్ధుండనైతి నని ప్రస్తుతించుచు నేతత్కథాకథనంబునం జేసి తెలియ లేకుంటి మిపు డర్ధరాత్రం బయ్యె సర్వప్రాణిలోకంబును నిద్రావశంబున నిలీనం బయ్యెఁ జంద్రుం డుదితుండై లోకతమం బడంచి పుచ్చునట్టిం దయ్యె నింక నీప్రసంగంబునుం జేయక నిద్రింపుము రేపకడన లేచి పయనంబు చేయవలయు నని యొండాడ కూరకున్నం నెల్లవారుం గుశికాన్వయంబు సర్వోన్నతం బని ప్రస్తుతం బని ప్రశంసించిరి రామలక్ష్మణులును గౌశికుం బ్రశంసించుచు నిద్రిత రై రనంతరంబ.

ఉ. శోణనదప్రతీరమునఁ జొక్కిన కైవడి నేల బండి ని
ద్రాణులనై మునీశ్వరులు దాశరథుల్ దెలవారకున్న మున్
రాణ లెసంగ మేలుకొని స్నానముఖాహ్నికనిత్యకృత్యముల్
ప్రీణన మేర్పడన్ సలిపి రేపకడం బయనంబు సేయుచున్. 262

వ. వనంబునుండి వనంబుగా బహువనంబు లతిక్రమించి రెండుయామంబు లగునప్పటికి హంససారససేవితంబు నమలజలంబు నగు గంగానదిం గాంచి విశ్రమించి మాధ్యాహ్నికకృత్యంబులు దీర్చి యగ్నుల నారాధించి హవిఃప్రాశనంబు చేసి యున్నసమయంబున

సకలమునిజనపరివృతుం డగువిశ్వామిత్రునిం గాంచి నమస్కరించి
రామచంద్రుండు త్రిపథగామిని యగుసీగంగ వృత్తాంతంబు విన
వలతుం జెప్పు మనిన నతం డతని కి ట్లనియె. 263

—♦ విశ్వామిత్రుఁడు గంగావృత్తాంతంబు చెప్పుట ♦—

సీ. అవధారు రామచంద్రా! హిమవన్నగేం
ద్రునకు సుమేరువు దుహిత యగుచు
నలరుమనోరమ యనుపత్నియందు గం
గయు గౌరియుం బుత్రికలు జనించి
రందు గంగను వేల్పు లడిగి త్రైలోక్యహి
తార్థము గొనిపోయి రమరపురికి
నుమ యీశ్వరునిఁ గోరి యుగ్రతపము సేయ
హిమవంతుఁ డామె మహేశున కిడె

తే. అపుడు వార్ దివ్యవర్షసహస్రములు సు
రత మొనర్చిరి గాని సంతతి జనింప
దయ్యె సేనానికై చూచునమరు లెల్ల
గతమనోరథులై వేఁడి రతులభక్తి. 264

ఉ. వేఁడిన శంభుఁ డి ట్లనియె వేఁడి వేలార్చెడునాదు తేజ మె
వ్వాఁడు భరింపఁగాఁ గలఁడు వానినిఁ జెప్పుఁడు నాఁగ దేవతల్
ఱేఁడ! త్వదీయతేజము భరింతురు నేలయు గాలి కీలియుఁ
వీడుము నాఁగ శంకరుఁడు వీడెను దేజము భూమిపైఁ బడన్ 265

కం. అనలుం డనిలుఁడు దానిన్
గొని హిమవత్పర్వతంబు కోన శరవణమం
దునిచిరి తత్స్థానమునం
గన నగుపిడితాలు చేలు కనకము లయ్యెన్. 266

సీ. అప్పు డుమాశంకరుల్ తపమున్నచోటికి
సురలు పో నుమ గాంచి చుఱచుఱ మని

కని తనుజప్రాప్తి గలుగకుండఁగ నొన
ర్చితిరి గావునను సంతతి లభింప
కుండుఁ గావుత మీకు నుర్వి మాకగు తేజు
భరియించెఁ గావున బహుపతిత్వ
మందుచుండెడుఁ గాత మని శపించిన వేల్పు
లదటుగుండెలతోడ నజునిఁ జేరి

తే. తమకు సేనాని లభియించుదారి దెల్పు
మన నతఁడు వేఱె గతి లేదు మనకు నగ్ని
దేవుఁ బ్రార్థించి యతనిచే దేవదేవు
వీర్య మది గంగకడుపున వేయ వలయు. 267

వ. దానంజేసి మీరు దేవసేనాపతిం బొందఁ గలిగినవా రగుదు రనిన వా రగ్నిం బ్రార్థించిన నతండు హిమవత్పాదంబున శరవణగు ప్తం బగువీర్యంబు గొనిపోయి గంగాగర్భంబున విడిచి వచ్చె గంగయు గర్భంబు దాల్చి దాని ధరింపఁ జాలమి నగ్నికిం జెప్పి హిమవత్ప ర్వతఁబున విడిచిపుచ్చె నంతలో నావీర్యంబునుండి కుమారుండు పుట్టి బెట్టార్చుట లాలించి షట్కృత్తికలు పోయి వానికి స్తన్యం బొసంగి రప్పు డతఁ డార్వురుతల్లుల స్తన్యంబు గ్రోలుట కాఱుము ఖంబులు ధరించి షణ్ముఖుం డయ్యె రేతస్స్కన్నంబునంజేసి స్కం దుం డయ్యె నప్పు డతని వేల్పులు దేవసేనానాయకునిఁ గా నభి షేకించి రింక గంగ భూమిగత యగుటకుం గారణంబు చెప్పెద వినుమని మఱియును. 268

## —♦ గంగ భూమి గత యగుట ♦—

మ. కలఁ డిక్ష్వాకుకులంబునన్ సగరుఁ డన్ క్ష్మానాథచంద్రుం డొకం
డలఘుప్రాభవుఁ డుద్ధతోన్నతబలుం డైశ్వర్యధుర్యుండు ని
స్తుల తేజోమహితుం డతం డధికుఁడై క్షోణీస్థలిన్ హైహయా...
ధుల నిర్జించి స్వరాజ్య మేలె నమరేంద్రుం డో యనం దొల్లిటన్,

వ. అతండు వైదర్భదుహిత యగు కేశినియు నరిష్టనేమిదుహిత యగు సుమతియు ననునిరువుర భార్యలం బడసియు సంతతిం బడయఁ జాలక పుత్రకాముండై కళత్రంబులతో హిమవంతంబు నందలి భృగుప్రస్రవణంబునకుం జని. 270

క. శతవర్షంబులు నిత్య
వ్రతముగ భృగువుం భజింప వరదుండై య
య్యతివర్యుండు ప్రసన్నత
నతనిం గని యిట్టు లనియె నాదర మెచ్చన్. 271

తే. పుత్రు లర్వాది వేగురు పుట్టుదు రొక
గరిత కింకొకదాని కొక్కరుఁడ పుట్టి
వంశకర్త యగు న్వాఁడు వసుమతీశ!
నీవు నిశ్చింతుఁ డై పొమ్ము నీనగరికి. 272

వ. అని యంపిపుచ్చిన నతం డభ్యనుజ్ఞ వడసి పురంబున కరుదెంచి సుఖంబుండె నంతఁ గొంతకాలంబునకు. 273

తే. పిదప గుర్వీణులై సతుల్ పొదలి రందు
మొదల సుమతి యొకయలాబు వుదయ మయ్యె
నవలఁ గేశినికిన్ సుతుం డయ్యె నొకఁడు
వగపు సంతస మొకపరి తగులు కొనఁగ. 274

చ. వద రది కాద టంచు నృపవర్యుఁడు దానిఁ బరిత్యజింపఁ గా
మదిఁ దలపోసె నప్డు డొకమాత్రము గాని రవంబు పెంపునన్
జదలు వచించెఁ గూడ దిటు సాహస మిందలిగింజ లుమ్మతోఁ
బొదలినకుండలం దిడుము పుట్టెద రర్వాదివేలపుత్రకుల్. 275

వ. సగరుం డాకాశవాణి చెప్పినట్లు చేసినఁ గొంతకాలంబునకు నాబీజంబులనుండి షష్టిసహస్రసంఖ్యాకు లగుపుత్రులు పుట్టి రంత. 276

## —♦ సగర చక్రవర్తి వృత్తాంతము ♦—

సీ. సగరుఁడు హయమేధసవనదీక్షితుఁడై త
దీయాశ్వరాజముఁ దిరుగ విడిచె

విడిచిన నఱువదివేగురు సాగరుల్
వెనువెంటఁ గాచుచు వెడలి రపుడు
ధర యెల్ల మెట్టుచుఁ దురగ మయ్యాది జల
హీనార్ణవమున నదృశ్య మయ్యెఁ
దెలిసి తండ్రికి దాని దెలుఁ గెల్ల వారలు
తదనుమతిని దెసల్ వెదకి వెదకి

ఆ॥ మరలఁ దండ్రికడకు నరుదెంచి జగములం
దెల్లకడలు రోసి యెందు నేని
హయముఁ గాని లేక హయహ ర్తనేఁ గాని
యెఱుఁగఁ జాల మైతి మేము తండ్రి. 277

వ. అనిన సగరుండు మరల వారువంబు నరయం బొండు పొడఁగాన కుండఁ బురంబునకు రాకుండుఁ డనిన సాగరులు సరి యని పోయి మహీతలం బెల్ల గాలించి గాలించి. 278

తే. విసివి వేసారి చింతిలి వింటివాకు
వలనఁ బుడమిని గ్రోస్సి యాఁకలికి మన్ను
మెసవుచు రసాతలము సేరి మెలఁగ నచటఁ
గపిలుచెంగట నవస స్తిఁ గాంచి కనలి. 279

ఉ. పట్టితి మద్దిరయ్య మన ప్రజ్ఞ ప్రకాశిల నేఁడు జన్నపుం
దట్టువ దొంగ వీఁడు జడదారి తెఱంగున నాట్యమాడెడుం
బట్టుఁడు కొట్టుఁ డంచు దనపజ్జకు రాఁ గని మౌని తెప్ప ల
ట్టిట్టు గదల్చి చూచునపుడే బసుమం బయి రెల్లసాగరుల్. 280

వ. అంత సగరుండు తనతనయు లఱువదివేగుఱుం గపిలు కోపానలంబున భస్మసాత్కృతు లగుట నారదమహర్షి వలన విని వనటం బొందుచుఁ గేశినీపుత్రుం డగునసమంజసుం డసమంజసుం డగుటం జేసి యన్యదేశప్రాపితుం డై నష్టుండగుట యెఱింగి యజ్ఞంబుపూర్ణం బగుట కుపాయంబు గానక తన మనుమం డసమంజసపుత్రుం డంశు మంతుఁ డనువానిం బిలిచి కార్యం బెఱింగించి యి ట్లనియె. 281

ఉ. పుత్రులపోకకు న్వగపు పుట్టక పోవదు గాని జన్మ మీ
ధాత్రిఁ బొనర్తునంట వితథం బయి పోకకుఁ జాల కుందుదున్
పౌత్రక! నారకవ్యథలపా లయి పోవకయుండ నా కిలన్
పాత్రత గల్గఁ జేయుటకుఁబాల్పడు మశ్వముఁ దెచ్చి చెచ్చెరన్.

క. ఇపుడు కుమార! మఖాశ్వము
కపిలునికడ నుండె నీవు కడకఁ జని మునిన్
గృపవుట్ట వేఁడి తె మ్మన
నపగతభయుఁ డగుచు నాతఁ డచటికిఁ బోయెన్. 283

వ. పోయి కపిలసంయమితల్లజుం గాంచి యి ట్లని ప్రస్తుతించె. 284

మ. పరమాత్ముం డవు లోకరక్షకుఁడ వెవ్వాడు న్నినుం బోల్పఁ జా
లరు వేదంబులు నిన్ స్తుతించుటకు నల్పత్వంబునుం బొందు నీ
శ్వరుఁడున్ బ్రహ్మయువిష్ణు వింద్రుండును సర్వంబున్ భవద్రూపమీ
వురు శక్తిం జరియించుచుందువు దయాళూ! దైవచూడామణీ. 285

క. సిరి వేఁడ నామెఁ బ్రోవఁగ
హరివై వర్తింతు విప్పు డజ్ఞానంబున్
ధరఁ బాపఁగ నిట్లు మునీ
శ్వరుఁ డవునై వెలసి తీవు సర్వజ్ఞనిధీ. 286

శా. సత్రాశ్వంబును గొన్నచోరుఁ డని నిన్ జర్చింతురే యట్టిమ
త్పిత్రజ్ఞానము సైఁపు సంయమివరా! పేర్కొందుఁ బైతామహా
త్పుత్రత్వప్రతిపాదకానఘమఖాశ్వం బిచ్చి రక్షింపు మా
ర్తత్రాణప్రతిసక్తభూరికరుణాధౌరేయ మౌనీశ్వరా. 287

వ. అని ప్రార్థించినం బ్రసన్నుం డై మునీంద్రుండు మీమఖాశ్వం బిదె
తోడికొనిపొమ్ము నీతండ్రు లవ్వలనీపౌత్రునికతంబునస్వర్గాదిసుఖం
బనుభవింతు రనిన నతం డతని కభివందనం బాచరించి నిజరాజ
ధానికిం జని సగరున కాకత్తలాని నివేదించుటయు నతండు పౌత్రు
నభినందించి హయమేధసమాప్తిం గావించి పౌత్రుం గూడి విస్మృత
పుత్రశోకుం డై పాకశాసనుం బోలి చిరకాలంబు లోకపాలనంబు

చేసి స్వర్గంబునకు నిర్గమించె నంత నయ్యంశుమంతుండును బెద్ద
కాలంబు నేల యేలి తనపుత్రుం డగుదిలీపునకు రాజ్యం బిచ్చి
చనియె దిలీపుండును మహీశుండై తనపితామహులమృతికిఁ వగచి
వారి కూర్ధ్వగతులు గలుగ గంగావతరణ ప్రయత్నంబు చేసియుం
జేయఁ జాలక భగీరథుఁ డనుతనతనయునిఁ బూజ్యసామ్రాజ్యంబు
నం దభిషిక్తుం జేసి తపోవనం బాశ్రయించి సిద్ధిం గాంచె నంత.

— భగీరథుఁడు తపంబు చేసి గంగం దెచ్చుట —

చ. ఘనుఁడు భగీరథుం డతఁ డఖండబలంబునఁ జక్రవర్తియై
పొనరి జగజ్జనప్రియత భూతల మేలుచుఁ గాపిలాగ్నికిన్
దనపిత లెల్ల నీ ఱగుటఁ దా విని వారమరాధివాసమున్
గొనుటకు దారి లేమికిని గొంచెము గానివిచార మొందుచున్ 289

ఆ. అఖిలరాజ్యభార మాత్మధీసచివుల
యందుఁ బెట్టి పితల కమలగతులు
కలుగఁ జేయఁ బూని కదలి తుషారాద్రి
కడకుఁ జనియె నతఁడు కడకతోడ. 290

వ. అట్లు చని యతం డాభూధరంబునఁ గందమూలాంబుభక్షుండై
నియమవ్రతంబున గంగాదేవి నంతరంగంబునం దిడుకొని వేయి
పరివత్సరంబులు ఘోరతపంబు గావించె నంత గంగ ప్రత్యక్షంబై
నీయభీష్టం బేమి యనిన నతండు వినయంబునం జేతులు జోడించి
యి ట్లనియె. 291

చ. కపిలుఁడు మత్పితామహులఁ గన్గొనినంతనె కాల్చి పుచ్చె లోఁ
గృప యినుమంత లేక యిటు కీర్తిని మిత్తికి నైన వారికిన్
సుపథము లేదు నీజలము సోకనియంతకుఁ గానఁ దగ్గరో
యిపు డరుదెంచి సాగరుల నీవు కృతార్థులఁ జేయ వేడుదున్. 292

ఆ. అనుడు గంగ యనియె నోఁ గాని నే వ్యోమ
పథము నుండి క్రిందఁ బడెడునపుడు

నాడు వేగ మోర్వ రా దేరికిం గాని
కాలకంఠునకు నొకనికేc గాక. 293

వ. నీ వతని మెప్పు వడసితి వేని నే నతనిజటాజూటంబునందుండి క్రింది కిం దిగి వచ్చెదననిన నతండుc గైలాసంబునకుం జని వీరాసనాసీనుం డై శివునిc ధ్యానించుచు నధికతపంబు గావించిన నతండు ప్రత్యక్షుం డై నీకోర్కి నే నెఱుంగుదు గంగాదేవిం దలం దాల్చి నేలకుం దిగc జేయుదు ననిన గంగయు. 294

ఉ. రంగదభంగ తుంగసుతరంగ పరంపరc గప్పి దిక్కులc
నింగి నెసంగc బొంగి వడి నేలc బడెం బడుచుండ శంభుc డ
గ్గంగ జటాకలాపమున గారవ మారcగc దాల్చె నంత నా
సంగతి నేఱు ధారణికి జాఱె సుపర్వులు చూచుచుండcగc. 295

సీ. సలలితకలహంస కలనాదమంజీర
రవకలితమహోన్నతవరగతియు
విపులసారతుషార విశదఫేనోత్కర
పరమోత్తరదుకూల వసనధృతియు
సతతపరిస్ఫుట చ్ఛంపాప్రభాభ్రాజ
మానమీననేక్షణ మహితరుచియుc
బవనవేగోచ్చల ద్భంగపరంపరా
నిశ లసద్రవవచో నిభృతరుతియుc

తే. గలిగి నురుగుల నవ్వుచు లలిc గరళ్ళ
నాడుచును సుళ్ళc బాడుచు వేడుక మెయి
సొగసుకత్తియ తెఱcగున జూడ నొప్పి
డిగియె నేలకు వినువాక వెగడు లేక. 296

వ. ఇట్లు త్రిపథగామిని యై ధరణి కవతరించిన దివిజగంగ గంగాధరుని జటాజూటంబునుండి హిమవచ్ఛిఖరాగ్రంబున బిందుసరోవరంబునం బడి యటనుండి సప్తస్రోతయై ప్రవహించె నందు హ్లాదిని పావని నళినియనునూడునదులు ప్రాఙ్ముఖంబుగను సుచక్షువు సీత సింధువు

ననుమూడునదులు పశ్చిమముఖంబుగను బ్రవహించె మఱియొక్కం డగుగంగ రథస్థుండై చనుభగీరథుని వెంట నంటి భరతవర్షమధ్య మార్గంబున దక్షిణాభిముఖయై చనుచు దారిం బారసించినజహ్ను మునియజ్ఞశాలఁ ముంచుటం జేసి యతం డాగంగ నంతయు నింత టిలో నంగిలిం బడ దిగమింగి సర్వదేవతాప్రార్థనంబున శ్రవణరం ధ్రంబునుండి విడిచి పెట్ట నట్టిమెడ గంగ జాహ్నవియై చని సాగ రబిలంబుఁ జేరి తద్భస్మరాసులం బాఱి వారికిఁ బుణ్యగతు లొసంగి భాగీరథి యనుపేరు వొంది జగత్రయంబు సుపవిత్రంబు గావించె నిది భాగీరథ్యవతరణప్రకారం బని చెప్పుటయు. 297

క. విని విశ్వామిత్రుఁడు. 298
వినిచినగంగావతరణ వృత్తాంతంబుఁ
మనమున హర్షించుచు ని
ట్లనియెఁ రాఘవుఁడు వినమితాననుఁ డగుచుఁ. 299

తే. ఘనులు మీయట్టిసత్తపోధనులకరుణఁ
బుణ్యకథ లిట్లు వినఁ గల్గెఁ బుణ్య మబ్బె
ననిన ముని యను శ్రీరామ ఘనుఁడ వీవు
నీ వెఱుంగవు పుణ్యమే నీవు సుమ్ము. 300

## విశాలపుర వర్ణనము

వ. అని ప్రశంసించు నారాత్రిశేషం బటం బుచ్చి మఱునాడు ప్రాతః కాలంబున లేచి కార్యకృత్యంబులు దీర్చి పయనంబై గంగం దాటి యవలిగట్టునకుం జని యట కింతదూరంబున నున్నవిశాలాపురిం గాంచి శ్రీరామచంద్రుండు విశ్వామిత్రునిం దిలకించి యిది యెవ్వానిపురంబు నేత్రపర్వంబు గావించుచున్నయది దీనివృత్తాం తంబు చెప్ప నవధరింపు మనిన నతం డి ట్లనియె. 301

క. దేవత లెల్లరుఁ దమకుం
జా వెప్పుడు లేనిబ్రతుకు సన్నుతి కెక్కఁ

భావమున నెంచి యొకతఱి
వావిరి యగువాంఛ వాసవపురోగములై. 302

మ. జ్వలదగ్నిప్రతిమానమై వరమణీస్వర్ణప్రభారాశి ను
జ్జ్వలశృంగంబుల మిన్ను ముట్టి రవితేజం బాఁగి సర్వోత్తరం
బు లసద్రూపము నైన మేరుకుధరంబుం జేరఁగాఁ బోయి పెం
పలరన్ మంతనముండి రచ్చటియపై నత్యంతనిష్ఠాగతిన్. 303

—♦ క్షీరసాగర మథనప్రకారము ♦—

వ. మృత్యువు లేకుండఁ జేయం గలమం దమృతం బది మహార్ణవంబున నుండు దాని మథించినచో లభ్యంబగు నని యెల్లరు నేకగ్రీవంబుగా నిశ్చయించి మందరాచలంబు మంథానంబుగ నమరించి దానికి దాపుగఁ గూర్మనాథు నిలువరించి. 304

క. సకలౌషధీ రసంబులఁ
బ్రకటిత మగుపాలవెల్లిఁ బఱపినమంథా
ద్రికి యోక్త్రముగా నలవా
సుకిఁ జుట్టి మథించి రఖిలసురలు నసురులున్. 305

శా. ఆపాతాళనిమగ్నమందర మహీధ్రాతిభ్రమప్రస్థితిన్
గూపారస్థితజంతుసంతతులునున్ క్షోణీరుహంబుల్ మహా
ద్వీపమ్ముల్ పృథివీధరంబులును నిష్పిష్టంబులై పోఁ బయో
రూపం బందెను దజ్జలం బడరి వారు న్వారునుం ద్రచ్చుచోన్. 306

ఉ. ఏండ్లకొలందిగాఁగ నిటు లెంతయు బంతముతో సురాసురుల్
వీండ్లన కిండ్లు నాఁక కడువేసట నొందుచుఁ ద్రచ్చఁ ద్రచ్చ న
గ్గొండ్లి యడంగ ఘోర మయి గొబ్బన హాలహాలంబు పుట్టి వా
రొండ్ల నెఱుంగ కంతమును నొందిరి నాఁ బడియుండి రయ్యెడన్. 307

వ. అట్టిమహోపద్రవం బగుదెంచినకాలంబునఁ గాలకాలుం డగు మహాదేవుండు దేవప్రార్థనంబునం జేసి. 308

క. త్రిజగత్సంహారకమై
గజిబిజి సేయంగనున్న కాకోలంబున్
గజదానవారి చేకొని
నిజగళమున నిలుపుకొనియె నీలగళుఁడుఁగన్. 309

వ. అప్పుడు దేవదానవులు సంకర్షణదత్తబలపరాక్రమంబులం దనరి హర్షోత్కర్షంబున మఱియుం దొడంగి మహార్ణవంబు మథింపం జొచ్చి రంత. 310

—♦ క్షీరసాగరంబునఁ జంద్రాదులు జనించుట ♦—

సీ. నలుగడఁ జలివెలుంగులు పర్వ జాబిల్లి
ధవళద్యుతులతోడ నవతరించెఁ
దెలిపట్టుపుట్టంబు వలెవాటుగాఁ గొని
సవురొప్ప శ్రీదేవి సంభవించె
వెన్నెలల్ వెదఁజల్లి వెన్నలోపలినుండి
రాణించు కౌస్తుభరత్న మొదవెఁ
గోరినకోరికల్ దీరుచుమణియును
గామధేనువుఁ గల్పకంబును బొడమె
తే. మఱియు నాల్గుదంతంబుల మత్తగజము
నమలతురగంబు సురయును నప్సరసలు
నమృతకలశంబుతో సుందరాంగ మొప్ప
ఘనుఁడు ధన్వంతరియు నందుఁ గలిగి రపుడు. 311

క. అరువదికోటులు గా న
ప్సరసలు పరిచారికాదిపరివృత లగుచున్
సురతోడఁ బుట్టి రాగి నా
సురఁ గ్రోలుట వేల్పు లపుడు సుర లై రెన్నన్. 312

శా. దుశ్శ్రవణంబు వో నటులు తోయధిఁ ద్రచ్చు సుధారసంబు ను
చ్చైశ్శ్రవ మచ్చరల్ రమయుఁ జంద్రుఁడు గొల్లె ననేకవస్తు లం

ఘట్ట్రశ్నసంబునుండి తెలువాలు వెలుంగుచు వెల్వడంగ నా
స్వాశ్రితులందు మేటు లగువారు గ్రహించిరి వాని వానిన్. 313

తే. జరయు మృతియును లేకుండ జలుపునట్టి
యమృతకలశంబు వేల్పులహస్తమందుఁ
జిక్క నసురుల కొకశ్రమ తక్క మఱియు
నన్య మేమియుఁ జిక్కలే దయ్యె నపుడు. 314

వ. ఆసమయంబున దేవదానవులకు ఘోరయుద్ధంబు సిద్ధించె నాయు
ద్ధంబున దానవు లెల్లరు యథాయథలై పోవుటంజేసి దితి మిగుల
వగలం బొగులుచు నిజభర్త యగుకశ్యపుని చెంతకుం జని హత
పుత్ర నైతి నని తనదుఃఖం బంతయుం జెప్పి జేజేరాయనిం జయిం
పం జాలు పుత్రుం బ్రసాదింపు మని ప్రార్థించిన నతం డట్ల యగుం
గావుత మీవు వేయిసంవత్సరంబులు నిష్ఠాగరిష్ఠవై వ్రతంబు సాగిం
తువేని నీ కింద్రుం ద్రుంపఁ గలపుత్రుండు పుట్టు నని నిజహస్తం
బున దానిశరీరం బంతయు స్పృశించి స్వస్తి పలుకుచుఁ దపోవనం
బున కరిగె నంత దితియు విశాలాపురపూర్వభాగంబున నున్న కుశ
ప్లవప్రదేశంబునకుం జని తపంబుండె నప్పుడు. 315

—♦ ఇంద్రుఁడు దితిగర్భచ్ఛేదంబు చేసినకథ ♦—

ఉ. ఇంద్రుఁ డిదంతయుం దెలిసి యెట్టిప్రమాద మ దెట్టిపట్టునన్
సాంద్రభయప్రదం బగుచు సంభవ మందునొ మానివాక్కు ని
స్తంద్ర మటంచు నమ్రత యొసంగఁగఁ జేయుచు నామె చెంతకున్
రుంద్రతరప్రపత్తి యటు రూపము నొందె నటంచుఁ దోఁపఁగన్ 316

ఆ. వచ్చి తల్లి నేను వాసవుం డను నీకు
దాస్య మాచరింపఁ దవిలి వచ్చి
నాఁడ ననుచు జలము ననలు బత్రియు దెచ్చి
యిచ్చుచుండు నామె మెచ్చుచుండ. 317

క. పదివర్షంబులు కొఱఁగాఁ
బదినూఱుల యేడు లయినపదపడి యొకనాఁ

జెడ నలరి దితి బిడ్డౌజసు
నదివేక్కెడు సల్లు పలికె నుటుగుపజనుసుకుణ్. 318

చ. ఒకపదివేలయేండ్లకాల మెంటులో మన ముంటిమయేని వాసవా
సకలరిపుక్షయంకరుఁడు సత్వసమేతుఁడు పుట్టు నీకిత్రు
ప్రకటితసన్మహాత్త్వమున వాఁడు భవత్సహజన్ముఁడే కదా
సకలరిపుక్షయార్థములు సల్పఁగ వచ్చును మీర లిద్దఱున్. 319

వ. అని వంచించి పలుకుచు నొక్కమట్టమధ్యాహ్నమున విరిదలతో శిర
స్థానంబునఁ బాదంబులు సేర్చి దితి నిద్రావశంబున నొడలెఱుంగక
పడియుండె వాసవుం డప్పటియాయమచిత్త్వం బెఱింగి సంతసిం
చుచు శరీరవివరంబునుండి లోనికిం జని వజ్రంబున నామెగర్భం
బేడుఖండంబులుగ ఖండించి వచ్చి తల్లికిం దండప్రణామంబు చేసి
యి ట్లనియె. 320

ఆ. నన్నుఁ ద్రుంప నున్ననాలిగర్భము ద్రుంచి
వచ్చినాఁడఁ గోపవశవు గాక
సైపు మమ్మ తప్పు సైచి నీ కిదె జోత
చేయుచుంటి భక్తి చేసి మదిని. 321

వ. అనిన నామె యేమియుం చేయఁ జాలక వేల్పుఱేనిం గని తండ్రీ!
యిట్లు చేసితి విన్నె మనం గల నైన నాగర్భంబు వృథపోవ కుండు
నట్లు ఖండంబు లేడు నేడు వాయువులై బ్రహ్మేంద్రచంద్రాది
లోకంబుల నావహ ప్రవహ సంవహ ఉద్వహ వివహ పరివహ
పరావహాఖ్య లంది సప్తవాతస్కంధంబులై చరించుచుండు నట్లును
గర్భంబున నీవు వీరి "మారుద" యంటివి గావున మారుతాఖ్యం
దాల్చు నట్లును వరం బనుగ్రహింపు మనినఁ బురందరుండు తల్లీ!
నీ వనిన ట్లవుం గాక నీతనయులు దేవభూతులై మేఘాకాశచంద్ర
సూర్యనక్షత్రగ్రహసప్తర్షిధ్రువమండలంబుల నఖండ తేజఃప్రభావం
బునఁ బ్రవర్తిల్లుచుండుదు రని తల్లిందోడ్కొని దివంబునకుం జనియె
నీప్రదేశంబు తొల్లి యింద్రుండు తల్లికిం బరిచర్యచేసిన ప్రదేశం

బిది మ న్నిక్ష్వాకునకు నలంబుసయందుఁ బుట్టినవిశాలుం డను భూపాలుండు పాలించుటం జేసి యీపురి విశాల యనుపేరం బరఁగు చున్నది ఆవిశాలునకు హేమచంద్రుఁడు వానికి సుచంద్రుఁడు వానికి ధూమ్రాశ్వుఁడు వానికి సృంజయుఁడు వానికి సహదేవుఁడు వానికిఁ గుశాశ్వుఁడు వానికిఁ సోమదత్తుఁడు వానికిఁ గాకుత్థ్సుఁడు వానికి సుమతి పుత్రులు వీరందఱు విశాలనేలుటంజేసి వైశాలకులు నాఁబడి ధార్మికులు వీర్యవంతులునై విఖ్యాతిం గాంచి రని. 322

మ. మనమీరేయిట నుండి రేపకడ నీమాసీంద్రులుం గూడి రా
జనకుం జూడఁగఁ బోవువార మనుచున్ సర్వజ్ఞుఁ డక్కౌశికుం
డనుమోదంబునఁ బల్కుచున్నతఱి దేశాధీశుఁ డచ్చోటికిన్
జనుదెంచెన్ మునివర్యులం గనెడునిచ్చన్ సాప్తభృత్యంబుగన్.

—♦ విశాలేశ్వరుండు రామలక్ష్మణుల దర్శించుట ♦—

ఆ. వచ్చి సుమతి సంచుఁ బాదాభివందన
మాచరించి వినమితాంగుఁ డగుచు
మునివరేణ్య! నాదుపుణ్యము మంచిది
ఘనులదర్శనంబుఁ గలిగె నేఁడు. 324

ఉ. ధన్యుఁడ నైతి మీదయినదర్శనభాగ్యము కల్మి నోమునీ
మాన్య! మదీయజన్మము సమంచితరీతిఁ దలిర్చెడిన్ జగ
జ్జన్యులు సర్వరక్షకులు సన్మనిచంద్రు లటందుఁ గాని నే
నన్యులనెంతలెంతలమహాత్ములటంచుఁ దలంపనెమ్మదిన్.

వ. అని ప్రశంసించి పలుకుచు ధనుర్బాణపాణులై పద్మపత్రవిశాలాక్షులై దేవతుల్యపరాక్రములై యున్నరాజకుమారులం జూచి విశ్వామిత్రుదిక్కుమొగంబై యిట్లనియె. 326

శా. నాసత్యుల్ బలెఁ గానవచ్చెదరు సన్మాన్యస్వరూపస్వభా
వాసంగమ్మున నెన్నఁ గా నగుచు లోకాతీతమాహాత్మ్యల
క్ష్మీసంపన్నులు నాఁగ వీరెవరొకో చెప్పం గటాక్షింపవే
ధీసిగ్గి భజింతు సర్వభువనస్తుత్యప్రభావోదయా 327

మ. ధరకుఁ వచ్చినపుష్పవంతు లనుచున్ దాత్పర్యముగాఁ జేయుదుర్
గర వష్టాశ్చర్య మగుఁ సుదుర్గమవనగ్రామంబులం గాల్నడన్
దిరుగాడం గలవార లై రిపుడు హృద్వీథిన్ మహాహల్యకున్
భరమయ్యె న్వినిపింపవే యనుచు సంప్రార్థించె నర్థార్థి యై. 328

తరు. అనిన విశ్వామిత్రుఁ డను నయోధ్యేశు
సౌరసుల్ వీరు శౌర్యాతిసంపన్ను
లనియొన స్మెరువు నంతల నైన
నా యనుసంతలో నడుమఁ గలరు
వినుము సిద్ధాశ్రమవీథి నీబాల
వీరులు చేసినవిధ మెల్లలోక
మున సువర్ణాక్షరముల లిఖయించి
పూజాగృహములందుఁ బొందింప నొప్పు. 329

వ. అనిన విని సుమతి రామలక్ష్మణుల కతిథిసత్కారంబు గావించి చని
యె నంత వారు నారాత్రి యట నుండి మఱునాఁడు మునిగణపరివృ
తులై మిథిలోపవనంబునకుం జని యట నిర్జనం బైన పురాణాశ్ర
మం బొండు గాన వచ్చిన నిది మున్నెరియాశ్రమంబు దీనివృత్తాంతం
బంతయు సవిస్తరంబుగ నెఱింగింపు మనినఁ గౌశికుం డిది మున్ను
గౌతమాశ్రమంబు దీనివృత్తాంతంబుఁ జెప్పెద నవధరింపుఁ డని యి
ట్లనియె. 330

—♦ అ హ ల్యా వృ త్తాం త ము ♦—

ఉ. చక్కదనాలయిక్క లగుచక్కెరబొండ్ల సృజించి వెండి యిం
కొక్కత నెల్లరం గెలుచునుగ్మలి నల్వ పొనర్ప నెంచి తా
నెక్కడ నెక్కడం గలుగునెన్నికవస్తువులన్ గ్రహించి మున్
మక్కువఁ గూర్చి చేసెను సమస్తము మెచ్చ నహల్య నాఁ జెలిన్ 331

ఉ. శ్రీ నిధి లోవ జానుగులు చేతులు పూసరులన్ బొమల్ రమా
సూనుని వింట ముక్కు దిలసూనమునన్ నుదు రర్ధచంద్రుచేఁ
గాను వియత్తలంబునను గాళులు కాహాళులం బదంబు లా
సూనబిస ప్రసూనములఁ జెక్కల గోరులు గా నొనర్చియున్. 332

వ. ఇట్లతిప్రయత్నంబున కన్యకారత్నంబు నిర్మించి దీనినెవ్వని కిచ్చి పెండ్లిసేయుదు నో యెవ్వండు సమర్థుండో యని యెంచి సురాసుర నరాదులం దెవ్వరిం గనక వేదవేదాంగ వేదియుఁ దపోధన సంపన్నుండు నగుగౌతమమునిచంద్రుం డొక్కండు తగు నని తలంచుచుండె నంత. 333

క. నవయౌవనంబుచేతను
సువిభక్తం బగుమృగాక్షిసుందరదేహం
బు విభాకరకరవికసిత
మవు వనరుహ మట్లు తనరె నతికోమలమై. 334

సీ. పార్వికశార్వరీశ్వరు గర్వ మడఁగించు
జీమూతివేణి నెమ్మోముసౌరు
బింబఫలంబుల డంబెడలించెడు
నుగ్మలిరుచిరాధరోష్ఠగరిమ
పంకేరుహంబుల బింకంబు లుడిపెడు
సారెకుఁ జంద్రాస్యకోరకనులు
భద్రకుంభంబులప్రభలు డీలుఁగఁ జేయు
మెఱుఁగుఁబోఁడి పైడిమెఱుఁగుచనులు
తే. మించుటద్దంబు మించునయ్యంచయాన
చెక్కులచలంబులను స్రుక్కఁజేయు బోలఁతి
పిఱుఁదు పల్లవములఁ గేరు వెలఁదిపదము
లభ్రమున కౌను సన్నమై యతివకౌను. 335

వ. ఇట్లు మవ్వ మగుజవ్వనంబున నివ్వటిల్లు నవ్వనితారత్నంబు మదనదేవతామోహన మంత్రశక్తి యనఁ జూపఱుమనంబు చూఱ లాడుచు నతిసౌందర్యంబున నలువొందునవసరంబున నింద్రాది బృందారకబృదంబు లాసుందరియందంబుఁ గని దర్పితకందర్పబాధాసహమానమానసులై వారివారిమానసంబుల. 336

—♦ ఇంద్రాదు లహల్యం గాంచి మోహించుట ♦—

మ. నునునవ్వుల్ పలుకుల్ నడ ల్బొగసుమేను స్నేర్పులొయ్యారముల్
కనుఁగో ముద్దులు మాటగట్టు నిది యిక్కన్యావతంసంబు తో

నేన నావచ్చునె లచ్చి గిచ్చి మొనగా నీ రేడులోకంబులన్
బౌనరుంగొమ్మలు బమ్మ నేర్పరి గదా పోలింప నీనాఁటికిన్. 337

మ. ఇది యెవ్వానికిఁ గాఁగనున్నదియొకో యెంచంగ లోకాన వా
నిదిగా జన్మము వానిదే సొగసు వానిం జేరు భాగ్యంబు సం
పద లౌ నద్దిర బాపురే బళిర వహ్వా యంచు నుప్పొంగు వా
రెద నమ్మక్కకటా యటం చనెడు వారై కుందు వారై రటన్-338

సీ. వనితనూగారు మోమును గని వలచిరి
శేషశాయియుఁ జంద్రశేఖరుండు
సుదతినడల్ కొప్పు నూచి కోరిరి హంస
నెక్కురాతును మబ్బు లెక్కురాతు
పొలఁతిగోళ్ళను బాదములు గాంచి తమిఁ గొని
రుడురాజు పద్మప్రియుండు నెడఁదఁ
గన్నెకన్నులు తొడల్ గన్గొని వేఁడిరి
మీనకేతనుఁడు రంభానుయాయి

తే. తరుణిపలుకులు విని సుధాంధస్సు లెల్ల
పడఁతిచన్నులరసి చక్రపాలకాళి
యతివపాటఁ దుంబురునారదాదిమౌను
లలరి రామవిలాస మే మనఁగ వచ్చు. 339

వ. ఇట్లమరగణంబు లెల్ల నయ్యహల్యాదర్శనంబునం గామపరవశులై
బమ్మకడకుం జని కన్నియ యొసంగు మని వేఱువేఱఁ బ్రార్థిం
చిన నతండు పాత్రంబై గౌతమముని యుండ నొండొకరి కచ్చెలి ని
చ్చుట కిచ్చలేమి వారి మాటలు వినియు వినన ట్లుండి మొండగు
నింద్రునితమకం బుడుపం జాల కింతలంతలం దీఱ దని యొకయింద్ర
జాలం బరసి యెల్లరకుఁ దెల్లంబుగా ని ట్లనియె. 340

క. ఎవ్వారు మున్నుగ మీలో
నివ్వసుధాతలము సర్వ మింతటిలోనన్
రివ్వన వలగొని వత్తురొ
యవ్వానికిఁ జేడె నిత్తు నని యాజ్ఞఁ డనియెన్. 341

చ. అనియెడుధాత పల్కు చెవు లానినయంతటనే సురాసురుల్
మునులును గన్యఁ గైకొనెడిబుద్ధిని భూమిప్రదక్షిణంబు దా
రొనరుప నెంచియొక్కని కిఁకొక్కరుఁడక్కట కానరాక గొ
బ్బునఁ జని రంత గౌతముఁడుముద్దియఁజేకొనుబుద్ధిపెంపునన్ 341

మ. ఒకచో వేలుపుగిడ్డి యీనుటకు నుద్యోగించినం గాంచి భూ
మికిఁ జాలు న్వలగొన్న దీని కని నెమ్మిన్ శాస్త్రదృష్టిన్ దలం
క కతం డంతఁ బ్రదక్షిణించెను గడంకన్ బార్శ్వమందున్నత్ర్యం
బకలింగంబును జుట్టి యమ్మునిమహత్వం బింతనా నొప్పునే. 342

తే. అంత నాతఁడు విధిచెంత కరుగుదెంచి
తాత ముమ్మాఱు ధరకుఁ బ్రదక్షిణములు
చేసి వచ్చితిఁ దెలియుమీ చిత్తమందు
నన నతఁడు లోని చూపున నంతయుఁ గని. 343

—♦ బ్రహ్మ యహల్యను గౌతమునకిచ్చి పెండ్లిచేయుట ♦—

ఉ. ఆతనిఁ జూచి బ్రహ్మ యను హో మునివర్య భవన్మహత్వమున్
నాతరమా! గణింపఁగ మనంబున సంతస మయ్యెడుం జుమీ
భూతలమెల్లఁ గన్గొనుచి మూసెడునంతటిలోఁ బ్రదక్షిణం
బీతఱి నేరు సేయఁ గల రిట్టియుపాయము నీక చెల్లుఁ బో. 344

వ. సర్వలక్షణలక్షిత యగునిత్తరళాక్షి నీ కొసంగెదఁ గైకొను మని
సుముహూర్తంబున మంగళతూర్యంబు లెసంగ విధిదృష్ట విధానం
బున వివాహంబుగావించె నంతలోఁ గ్రమక్రమంబున నొండొ
కండు గా సకలసురలుం గృతభూప్రదక్షిణులై దిమ్మదిరిగి యొమ్మ
గటిసిలం బడ నూర్చుచు న్వచ్చి వివాహవేదిక నున్నయహల్యా
గౌతములం గాంచి విస్మితాత్ములై నిరాశు లగుచుఁ దమతమ
పొందుపట్లకుం జని రింద్రుండు నతిమాత్సర్యంబున నచ్చోలిపైఁ
గ న్నిడి త్రిదివంబునకుం బోయెఁ బదంపడి గౌతమపారికాంక్షియు
నజ్జలజాక్షితో నియ్యాశ్రమంబునకు వచ్చి కులాలకీటన్యాయంబున
సంపాదం బనుసంధించుచుఁ దపఃక్రియాచరణదక్షుండై సుఖంబుండె
నంత నక్కడ. 345

♦ ఇంద్రుం డహల్యం జెనకం బోవుట ♦

చ. శతముఖుం డట్టిజాడ విని శాంబరి భూసురవేషధారి యై
యతిథివలె న్మునీశ్వరవరాశ్రమ సీమకుం బోయి కొన్నినా
ళ్లతివకు నై వసించి కనునప్డు తమిం బయి నేమి కాంగ నీ
యతిసతిం జెన్క మాన నని యుళ్కుడివోం దఱి వేచియుండెంబో.

తే. అంత నొకనాఁడు మానిపూర్వాహ్ణకాగ్ర
కర్మములు చేసి నిజశిష్యగణము గొలువ
సకలమానీశ్వరాశ్రమస్థలులు చూడ
వెడలె సతి నున్కిపట్టున విడిచి యపుడు. 347

క. ఏకతమ యున్నమునిసతిం
బైకొన నిది సమయ మనుచుం బాకారి వెసన్
గైకొని గౌతమమునివ
ర్యాకారము లోని కేగె నతికుతుకమునన్. 348

వ. అయ్యవసరంబున. 349

చ. ఎదురుగ వచ్చి వందనము లెన్నొ యొనర్చి మహాత్మ! యింతలోం
బదుగురం జూచి వచ్చితిరె నల్కుఁడటన్న నహల్యం గాంచి యో
సుదతి! భవద్విలాసములం జొక్కి చలించి మఱొండుచోటి కేం
గదలఁగ లేక కొంతదనుకం జని యవ్వలం బోక వచ్చితిన్. 350

వ. అని పలుకుచు నొక్కింతయుం గొంచ కహల్యాహస్తగ్రహణంబొన
రించి లోనికిం ద్రోసికొనిపోయె నంత నహల్య వానిం దేఱిపాఱం
జూచి వాఁడు తనభర్తకాఁడనియు నింద్రాపశదుం డనియు నంత
రంగంబున నెఱింగి వాని కిట్లనియె. 351

ఉ. ఎవ్వఁడ వోరి నీ విటు లొకింతయుం గొంచక మానిపత్ని న
న్నివ్విధి నంటగా నగునె యియ్యది పాపము నాం దలంపవే
క్రొవ్వీననిన్ను నే నిపుడు కొంచెము నేం గృపలేనిదాన నై
త్రెవ్వంగఁజేయు దానం గన్నుదే యను చుండెడునంతలోపలన్ 352

శా. అంతేవాసులతో మునీంద్రుఁడు గృహప్రాంతాగతుండై శుభో
దంతం బాడుచు మున్నెదుర్కొనుసతిం దర్శింప కాలో భయ
స్వాంతుల్ భృత్యులు వచ్చి లోన బయల న్వర్ణింపఁ జూపట్టి నా
రంతింతంచనరాదు మీమహిమ నా నాశ్చర్యచేతస్కుఁడై. 353

వ. ఆత్మగతంబున. 354

మ. చెలి నే నింట నొకింత లేనియెడఁ జర్చింపంగ నెవ్వానినో
కలసెం గావున వచ్చు నా కెదురుగాఁ గాకుండె నంచుం గృహా
దలుపుం బల్లన దట్టి హుంకృతులతో దంతంబులన్ గీటుచున్
కులటా! తీ! తలు పంచు దిక్కులవియన్ ఘోరార్భటిం బల్కినన్ 355

వ. అప్పలుకుల కులికి యహల్య యాభీలశార్దూలగర్జితంబు వినిన హరిణీ
కిశోరంబు చాడ్పున గడగడలాడుచుం జని తలుపు తెఱచె నాలో
బిడౌజుండు వృషదంశకంబై యొకమూల నడఁగి యుండె
నంతలో మునియుం దరియ వచ్చి భీతచేతస్కురాలై గడగడవడంకు
నిజతలోదరిం గాంచి కనలుచు. 356

—♦ గౌతముఁ డింద్రాహల్యల శపించుట ♦—

తే. ఏమి పనిచేసితివె పుంశ్చలీ! వెఱ కిటు
లనుచు నంగారకణములు కనుల నుఱుల
నౌడు గఱచుచు హుమ్మని యట్టె చూచి
తలను దోర్చుచుఁ గహకహధ్వనిఘటించె. 357

వ. అపు డహల్య లజ్జావనతాస్యయై సాధ్వసంబున నెదియును బలుకఁ
జాలక పాదాగుష్ఠాగ్రంబున విశ్వంభరోల్లేఖనంబు సేయుచు నశ్రూ
దకంబులు విడుచుచున్నంతన్ గౌతముం డెల్లకడల నరసి యొక్క
చో బిడాలరూపంబున నొదిగి వడంకుచున్న బిడౌజుం గాంచి. 358

చ. ఎవఁడవునీవు నే వనికి నేగినజాడ యెఱింగి వచ్చి నా
కువలయనేత్రతోఁ గలసి కుత్సితవృత్తిని నాదురాక నీ
చెవులకు సోఁక భీతుపడి చెచ్చెఱ పిల్లివలె న్నటింతు నీ
గవిలెము గట్టిపెట్టు నినుఁ గాల్పక పోదునె నేఁడు నావుడున్ 359

సీ. గడగడలాడుచుఁ దడబడువాకులఁ
బోకారి యిట్లనుఁ బావనాత్మ
యే నింద్రుఁ డను పాప మిట్లాచరింతు నా
యజ్ఞానమును సైచి యతివ రేణ్య
కాపాడు మక్కటికముతోడ నాపుడుఁ
గటకటఁబడి చూచి గౌతమముని
భగభక్తినఘములఁ బడితి గాన సహస్ర
భగములు నీమేన నగును మఱియు
తే. ముష్కములె కామమున కాదిమూలము లగుఁ
గాన నీముష్కములు తెగుం గాక నీకు
శతముఖుం డనుకీర్తితి సన్నగిల్లి
గౌరవం బంతయును గంగఁ గలయుఁ గాక 360
వ. అని యింద్రుని శపించి. 361
తే. నిజతలోదరిఁ గన్గొని నీవు గ్రావ
మగు మని శపింప విని యహల్యయుఁ జలించి
స్వామి మీరూపమున వచ్చి శక్రుఁడు కనుఁ
బ్రామి యిటు చేసె నెఱుఁగ నే నేమి సేయ. 362
చ. అనవుడు గౌతముండు మది నారసి యామె సదా పతివ్రతా
జన మని యెంచి కూర్మి ననుఁ జానకొ! కానమి శాప మిత్తు నిం
కను మరలింప నాతరము గా దది గావున నోర్చి నీ విటఁ
వనమున నుండు రాఘవుఁడు వచ్చి నినుం గడ తేర్చు నవ్వలన్. 363
వ. అప్పుడు శాపహతుం డగు దేవేంద్రుండు తప్పు సైచి నన్ను
రక్షింపు మనినం గరుణించి నీమేనిభగంబులు నీ కెట్లు కానిపించిన
వారలకు నేత్రంబులం బోలెఁ గాన వచ్చెడి దాన నీవు సహస్రా
క్షుండు నాఁ బె రరెదవు మఱియు నీ తెగిన యండంబులకు బదులు
మేషాండంబులు నీకు సంప్రాప్తంబై మేషాండుఁడ వగుదువని పోవం
బుచ్చి గౌతముం డెటయేవియుం జనియె నహల్యయు నియ్యాశ్రమం
బున శిలయై పెక్కువేలసంవత్సరంబులనుండి రామదర్శనలాలసయై

వేఁగుచున్నయది గావున దాని ననుగ్రహింపు మనినరామచంద్రుం డు లక్ష్మణసహితుండై విశ్వామిత్రునితో నయ్యాశ్రమప్రాంత కాంతారంబున విహరించుచు నొక్కచో నొక్కశిలా ఫలకంబుపైఁ గాలు మోపుటయు నంతలోన. 364

—♦ రామచంద్రుం డహల్యాశాపమోక్షంబు గావించుట ♦—

చ. శిల మెలమెల్లఁగాఁ గదలి చిత్రముగా నొకయింతలోపలన్
గలిగినతొంటి రూపు విడఁ గల్గియు నూసరవెల్లిచాడ్పునన్
బొలుపగుస్వర్ణరూపమును బొంది కరాంఘ్రిముఖాదు లొప్పఁగాఁ
జెలి యయి యింద్రజాల మనుచెల్వునఁ జెప్పగ నొప్పె నప్డిగిన్.

ఉ. ధూమ పరీవృతం బగుచుఁ దోపఁగ వచ్చెడువహ్నికీల నాఁ
గోమలమేఘభిత్తిపరిగుంఫితమై చనుచంద్రరేఖ నా
భూమిరజోవృతం బగుచుఁ బొల్చెడురత్నశలాక నాఁగ న
క్కామిని ధూళిధూసరితకాయముతోఁ గనవచ్చె నచ్చటన్. 366

వ. అట్లొప్పి యప్పు డంతి శ్రీరామచంద్రసన్నిధానంబున కల్లనఁ జను దెంచి చేతులు జోడించుకొని తనవృత్తాంతంబెఱిఁగించి యిట్లనియె.

ఉ. నీవు మహానుభావుఁడవు నీరజలోచనునంశ మొంది తో
దేవ! యెఱుంగుదున్ నిను మదీయశిలామయశాపరూపముం
బోవఁగఁ జేసి నన్ గరుణ బ్రోచితి కాని జగత్త్రయంబునన్
నావలనన్ మహాఘ మది నాటుకొనెం గద యేమి చెప్పుదున్ 368

చ. త్రికరణశుద్ధిగా మెలఁగితిన్ వృజినం బొకయింతయేని నా
దుకడ వచింపలే రెవరు తోయజనాభ! మదీయకర్మసూ
చక మయి దుర్యశం బిటు లెసంగె నెటుల్ భరియింప నేతు నా
కిఁకఁ గడతేఱుమార్గ మెదియే వచియింపుము నీకు మ్రొక్కెదన్ 369

ఆ. అనిన రామచంద్రుఁ డనియె నోతల్లి! నీ
వెఱుఁగ వెట్టిదోష మెఱుక లేక
యెవ్వఁ డెవ్విధంబు నే నిన్నుఁ బలికినఁ
బాపభాజి యగుచు బడలువడును. 370

తే. పంచకన్యలలో నీవు ప్రథమగణ్య
వగుచు దీపించెదవు నీదునాహ్వయంబు

దలఁచినంత మహాపాపములు నశించు
ననుచు వర మిచ్చె రాముఁ డహల్య కపుడు. 371

వ. అని వరం బొసంగిన నామె రాముని కభివందనం బొనరించిన నతండును నీకు దేవవందనం బాచరించుచుంటి నని పలికె నపుడు దేవ దుందుభులు మ్రోసెఁ బుష్పవర్షంబు గురిసె దేవతలు దివినుండి దిగివచ్చి యహల్య నభినందించిరి గౌతముండు నంతలో నట వచ్చి రామపూజితుండై తచ్ఛాసనంబునం బత్నిం బరిగ్రహించి రాముని దీవించి సభార్యుండై తపోవనంబునకుం జనియె నంత రామలక్ష్మణులు విశ్వామిత్రపురస్సరంబుగా సకలమునీంద్రపరివృతులై మిథిలా పురంబునకుం బయనం బయి రని చెప్పిన విని నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును. 372

—♦ ఆ శ్వా సాం త ము ♦—

చ. తనకొనరించుకర్జమునఁ దాఁ జతనింపకయున్న గీఁడుమే
ల్లొనరెడుఁ బ్రాణికోటుల కనూనవిధంబునఁ దొంటిపు
ట్టున మనయీదరార్యుఁడు కడుంగడు నీశ్వరపూజ చేసె నం
దున ఘనుఁడై వదాన్యుఁడయి తోపఁగ వచ్చె ధరాతలంబునన్. 373

క. అతఁడు కృతజ్ఞుఁడు తనకై
మతి చేసినవాని నరసి మమత దలిర్పన్
గతి గలుగఁ జేసి వాసిన్
క్షితి మెలఁగెడు నట్లుచేయు సిరి గలఁ డగుచున్. 374

గద్యము

ఇది శ్రీమహామహోపాధ్యాయ కలాప్రపూర్ణ కవిరాజ
కవిసార్వభౌ మాంధ్రవ్యాసాభినవశ్రీనాథ వేదవిద్యా
విశారద శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతం
బయిన శ్రీకృష్ణరామాయణంబునందు
బాలకాండమునఁ దృతీయాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# శ్రీకృష్ణరామాయణము

## బాలకాండము

### చతుర్థాశ్వాసము



మల్లక్ష్మీనరసాం
బామంజుల గర్భశుక్తిమౌక్తిక మగుచున్
భూమిసుపర్వవిభూషణ
మై మెలఁగెడునీదరాన్వయార్యుఁ డెసంగన్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు రామలక్ష్మ
ణులు విశ్వామిత్రప్రభృతులతో మిథిలానగరంబునకుం బయనంబై
భాగీరథి నుత్తరింప వలయుం గావున నెల్లరు నొక్కచో రేవుపడవ
నధిరోహింపనుండి రపుడు నావికుండు. 2

—♦ గంగానదీతరణము—గుహుఁడు ♦—

తే. దండములు కమండలువులు దాల్చి యున్న
తాపసోత్తము లెల్లరుఁ దరలి వచ్చి
మున్ను మున్నుగ నావపై నున్నచోట్ల
సర్దుకొని కూరుచుండ నాస్వాగతంబు. 3

వ. అనిన నెల్లరు నొక్కరొక్కరుగా నావ నెక్కి కూరుచుండి రపుడు
రామలక్ష్మణులు నెక్కుచుండ నావికుండు వేగిరించుచు రామ
చంద్రునిదిక్కు మొగంబై యిట్లనియె. 4

క. వల దయ్య వలదు నీ వి
క్కలముపయిం గాలు వెట్టఁగా వలదు కృపా
కలితమతి వగుచు నాదగు
పలుకుం జెవిఁ బెట్టు మయ్య! భక్తుఁడ నయ్యా! 5

ఉ. నవ్వుచు రామచంద్రుఁ డను నావపయిం జను లెల్ల నెక్కి రీఁ
వెవ్విధి నన్నుఁ గూడ దని యెంచి వచింతువొ పూట మయ్యె నో
నవ్వుల కే వచించెదవొ నావిక! చెప్పుము చెప్పుకున్న ని
న్నెవ్వరు మెచ్చ రన్న నొకయించుక కొంచక నావికుం డనున్. 6

చ. పడవపయిం ద్వదీయ మగుపాదము వెట్టితి వేని నాకు సా
పడియెడుకూటికే కఱవు వచ్చెడు నీదగుకాలిధూళి నా
పడవకు దాకె నే నది రవంతటిలోపలఁ గాంత యయ్యు న
న్నిడుమలపాలు సేయు నని యే నతిభీతి వచించితిన్ ప్రభూ. 7

క. యాతాయాతజనం బిట
నేతన్మాత్రముగ నాకు నిడ నద్దానన్
బూతికిఁ గఱ వనునది లే
కీతీఱున నుంటి దాని కిపు డడ్డ మగున్. 8

శా. నీపాదంబుల మచ్చుమం దెదియొ కానీ యుండఁబో ల్దాకె నే
నాపాటన్ బిడిఱాయి అప్పయెదియే నబ్జాక్షియై పోవు నం
చీ పొద్దే తెలియంగ వచ్చె నిది కొయ్యే యైన స్త్రీ యైనచో
నాపా ట్లే మని చెప్పవచ్చెడి జగన్నాథా! దయం జూడుమా. 9

క. దేవర నీపాదంబులు
పావనజలమునను గడిగి పరిహృతశంకా
భావుఁడ నై నినుఁ గొని నా
నావన్ దగ నిలుపుకొందు నలినదళాక్షా. 10

తే. కావునన్ వేఁడు చుంటి నోపావనాత్మ
నాదుజీవికాధార మై నలువుమీఱు
నౌకకు నపాయ మింతయుఁ గాక యుండు
నట్లు గావింప వేఁడెద నిట్లు దేవ. 11

క. అని గుహుఁడు పలుక రాముఁడు
ఘనమతి యగునతనిఁ గాంచి కరుణాన్వితుఁడై
నిను నెఱిఁగితి భక్తుఁడ వని
నను నీవాఁ డని యెఱింగి నడుపుము క్రియలన్. 12

వ. అనిన విని గుహుండు పరమానందభరితాంతరంగుండై గంగాజలమ్మునం జేసి రామచంద్రపాదారవిందంబులు గడిగితీర్థంబు శిరంబునం జల్లుకొని లోనికిం బుచ్చుకొని బహువిధంబులం బ్రస్తుతించినం బ్రసన్నుండై రామచంద్రుండు నీవు నా పరమభక్తుండవు.నీకు నే వరం బిచ్చెద నడుగు మనిన నతండు చేదోయిమోడించి యిట్లనియె॥

తే. నీదు చరణాబ్జములసేవ నే నొనర్చి
భాగ్యవంతుఁడ నైతి నోపరమపురుష
దీని కన్నను భాగ్య మేదైనఁ గలదె
యన్య మేమియు వలవ దట్లుగాన వినుము. 14

ఉ. నీ వొకగొప్పవైద్యుఁడవు నీకు నసాధ్యగదంబు లెవ్వి యే
భూవలయంబునం గలుగఁ బోవనుచుం భువనప్రసిద్ధి యాఁ
గావునఁ బుట్టుచావు లనఁగాఁ బడురోగము నాకుఁ గల్గు నే
దేవరవైద్యముం సలిపి దివ్యునిఁ జేయఁగ నేను వేఁడుదుం. 15

వ. అనిన రాముండు వానిం గౌఁగిలించుకొని నీవు నాభక్తుండవు నిన్ను నే నెప్పుడు మఱవకుండుదు .నీ కవలికాలంబున మోక్షంబు సంప్రాప్తించునని పలుకుచుం బడవ యెక్కి విశ్వామిత్రాదిమునిబృందపరివృతుండై యవలియొడ్డునం దిగి కొంతదూరంబు చని మిథిలాపురంబున కీశాన్యభాగంబున యజ్ఞవాటిక కింత దవ్వులకు వచ్చుట విని విదేహ భూవల్లభుండు శతానంద ప్రభృతిమునిజనసహితుండై యెదురేగి యర్ఘ్యపాద్యాదుల నెల్లర నర్చించి విశ్వామిత్రుం గాంచి నమస్కరించి యిట్లనియె. 16

—♦ జనకుఁడు రామాదుల నెదుర్కొని గౌరవించుట ♦—

ఉ. ఇప్పుడు నాదుయజ్ఞ మది యెంతయునుం ఫలవంత మయ్యె మీ
రప్పరమేశ్వరుం దెలిసినట్టిరుదర్శన మిచ్చియుంటిరే
జెప్పుదు ధన్యుఁ డైతి నని చేసితిఁ బుణ్య మెదో మునీంద్ర మీ
గొప్పతనం బదింత యని కోవిదు లైనను జెప్ప కుందురే. 17

ఆ. పదియు రెండు నాళ్ళు పరిశేషముగ యజ్ఞ
మునుచు నుండె వేల్పు లరుగుదెంచి

వారివారి యజ్ఞభాగంబులం బొందు
చుంద్రడు మీరు చూడ నొప్పు వారి. 18

వ. అని విశ్వామిత్రు ననుసరించియున్న రామలక్ష్మణులంగాంచి ముని
దిక్కు మొగం బై. 19

చ. ఋషివర! యిక్కుమారకు లెవ్వరు? దివ్యపరాక్రమక్రముల్
వృషసదృశాంసభాసురులు వీరులు ధీరులు వీరిజన్మక
ల్మషులు మనోహరాంగులు క్షమాగత దేవత లేరి పుత్రులో
తృషితుఁడ నైతిఁ జెప్పఁ గదవే మునిశేఖర! నీకు మ్రొక్కెదన్.

తరు. అనిన నాతఁడు వాని కను దేవ! వీర
లాదశరథపుత్రు లతిలోకు లార్య
వినుతులు ఘను లంచు వినిచి తా నేగి
వేఁడి తెచ్చుటయును విక్రమ మొప్ప
తనయజ్ఞమును గాచి దనుజుల రాచి
తాపసులం బ్రోచి తరలి విశాలఁ
గనుటయు గౌతమాంగనకు శాపంబు
గడ తేర్చుటయు లోఁగఁ గలవెల్లఁ దెలిపె. 21

వ. అనిన జనకుండపరిమితానందకందళితాంతరంగుండై రామలక్ష్మణుల
నభినందించె నప్పుడు గౌతమపుత్రుం డగుశతానందుండు సానం
దంబున రామలక్ష్మణుల సమక్షంబున విశ్వామిత్రుం గాంచి. 22

మత్త. దేవకల్పుల వీరి నిట్టులు తెచ్చి నాజనయిత్రికిన్
బోవఁ జేసితి శాపభారము పూజ్యురా లగుతల్లి దా
నేవిధం బగుపుణ్యలేశము నెప్పు డెప్పుడు చేసెనో
దేవతాభుఁడు నాదుతండ్రియుఁ దేల్చె వీరిఁ గృతార్థుఁడై. 23

అ. తాయి యైనతల్లి రాజీవముఖిఁ జేసి
రాముఁ డితఁడు తన్నుఁ బ్రేమఁ గనెడు
తండ్రి నాగ్రహింపఁ దలఁపక ప్రేముడి
నాదరించె ననుట కతిముద మగు. 24

—♦ శతానందుండు కౌశికమహాత్వం బెఱిగించుట ♦—

వ. అని యహల్యానందనుండు రామచంద్రునిం జూచి కుమారా! యీ కౌశికులకారణంబున మాకుం బరమోపకారంబు గావించితివి. నీకు స్వాగతంబు. ముజ్జగంబులనీ విశ్వామిత్రునకుం జాలినవాచంయము లెవ్వరును లే రితనిప్రభావాతిశయం బించుక నెఱింగించెద నాల కింపు మని మఱియును, 25

సీ. బ్రహ్మదేవుని పుత్రరత్నము కుశికుండు
కుశనాభుం డతనికిం గూర్చుకొడుకు
కుశనాభునకు గాధి కొమరుండు గాధికిం
బుత్రుండై పుట్టె నీభూరియశుఁడు
వసుధ నేలెఁ బహువర్షసహస్రము
లోకనాథుఁడు సబలుండై యుర్వి యెల్ల
సంచరించుచు వసిష్ఠమునీంద్రు నాశ్రమ
మున కేగి తత్పూజలను గ్రహించి

తే. అచట సర్వకామము లిచ్చునతనిహోమ
గవిం గనుంగొని నా కిది కావలయు ము
నీంద్ర! ప్రతిఫల మెంతయే నిత్తు నీకు
నాకు ని మ్మన్న నతం డిట్లు వా కొసంగె. 26

ఉ. కోటులు నర్బుదంబులును గో మ్మని యిచ్చిన ధాన్యరాసులుఁ
మేటు లొసంగినఁ మఱియు మేడలు మాడుగులుం బురంబులుఁ
బేటలు వేనవే లిడినఁ బృథ్వియొసంగిన హోమధేనువుఁ
మేటిని దీని నిచ్చుటకు మేకొని యుండ నిజంబు చెప్పితిఁ. 27

క. ఇదియే నాదగు దేహం
బిదియే నాధైనధనము నిదియే సర్వం
బిదియే నాదగు ప్రాణం
బిది నీ కిచ్చ నెట్లు నేర్తు నే నోరాజా. 28

వ. అని నిరాకరించిన విశ్వామిత్రుండు భటులచేత దానిం బట్టించి కట్టు కొనిపోవునప్పు డాకామగవి కంట నీరు వెట్టుచు వసిష్ఠునకు

నే నేమితప్పు చేసితి న న్నేటి కుపేక్షించె నని నిట్టూర్చుచు నిట్టి
వారి పట్టు వదలించుకొని వసిష్ఠునికడకు వచ్చి న న్నేమిటికిఁ
ద్యజించితి నేనేమితప్పు చేసితి ననికడుంగడుదుఃఖించుచునిట్లనియె 29

స్రగ్ధర. తాతా! నా పాలు క్షీరహీనత్వము తమకెలదాఁ దల్పుకోనేల సాయం
ప్రాతర్హోమాదినిత్యవ్రతముల హుతభుగ్ జ్వాలలన్ నాదుపాలన్
జేత న్బ్రేల్వంగఁ బుణ్యాన్వితమయి సుగతిన్ నిల్తునంచున్ననా కా
ప్రీతిం దక్కించ దయ్యోన్ విధిబలమకటా నెక్కసం బెన్నునాహా. 30

వ. అని సకరుణంబుగ దుఃఖించు దానిం జూచి దుఃఖించుచు వసి
ష్ఠుం డిట్లనియె. 31

శా. తల్లీ! నే విడ లేదు ని న్నపకృతుల్ త్వద్దోషముల్ గా వయో
ముల్లోకంబుల కైనఁ జాలిన మహాచమూధన్యు, డీత ండిటన్
దెల్లంబై బహుసైన్య మున్నయది నే దేబెన్ ద్విజుండ న్నినున్
మళ్ళింపం గలనే నృపాలగతమై మార్గంబునం బోవుచోన్. 32

తే. అనిన గో వసు నిది యేటి కనుట తండ్రి
బ్రహ్మబలము చెంగట క్షత్రబల మ దెంత
నీకు లో చ్చింతబల ముండెనే నితండు
నన్నుఁ బనుపుము చూపుదు నున్నబలము. 33

వ. అనిన వసిష్ఠుండు నీయిష్టంబునకు నే నంతరాయంబు గలిగింప ననిన
గోమాత హంభారవంబు గావించి నంత దానిశరీరంబు నుండి
శక, యవన, పల్లవ, పుళింద, కాంభోజ, మ్లేచ్ఛ, హారీత, కిరాతకులు
లోనగువారు వేనవేలు పుట్టి కౌశికబలంబు సర్వంబు ఖర్వంబు
గావించినం గౌశికసుతశతంబు నానావిధాస్త్రశస్త్రంబులం జేసి
పోటుకొనుచు వసిష్ఠునిపయిం బడిన నతండు హుంకారంబున వారి
నందఱ భస్మసాత్కృతులం గావించినంత నావిశ్వామిత్రుండు భగ్న
దంష్ట్రోరగంబువలె నై నిర్వేదించుచు. 34

## —♦ విశ్వామిత్రుని తపఃప్రకారము ♦—

సీ. హిమవద్గిరికి నేగి యెంతయుఁ దపియించి
శివుని ప్రత్యక్షంబు చేసికొనుచుఁ

దదను గ్రహమున నస్త్రములు శస్త్రంబులు
జగదసాధ్యంబుల సంగ్రహించి
ఘనసైన్యముం గూర్చుకొని వచ్చి ప్రళయార్ణ
వము నాఁగ ఘూర్ణిల్లి వడి వసిష్ఠు
ముని బ్రహ్మదండముఁ గొని యెదిరింప వి
శ్వామిత్రుఁ డాగ్నేయవారుణైంద్ర

తే. పాశుపతముఖ్యదివ్యాస్త్రపంక్తి వాని
పైఁ బ్రయోగించె నంత నాబ్రహ్మదండ
మన్నిటి గుటుక్కునఁ మ్రింగె నవి యెఱింగి
బ్రాహ్మ్య మరి వేసె నప్పుడు సంయమి ॥ 35

వ. అది మంటలు గ్రక్కుకొనుచు వసిష్ఠుని గ్రసింపవచ్చుచుండ గం
డుమిగిలి బ్రహ్మదండంబు దాని నొక్కుమ్మడి నంగిటం బడవేసు
కొనియె నాసమయంబున నెల్లమునిగణంబు లరుదెంచి వసిష్ఠవిశ్వా
మిత్రులఁ బ్రశాంతులఁ గావించి రంత విశ్వామిత్రుండు బ్రహ్మ
బలంబు బలంబ కాని క్షత్రియబలంబు బలంబు గాదని తలంచి
ప్రసన్నేంద్రియమానసుండై కొడుకునకుఁ బట్టంబుగట్టి తపోవనం
బునకుం జని వేయివర్షంబు లుగ్రతపంబు గావించి నంత బ్రహ్మ
దేవుండు ప్రత్యక్షంబై నీవు రాజర్షిముఖ్యుండ వైతి వనిన నతండు
దానికిం దృప్తిం గొనక మఱియు మహాతపంబు గావించె
నాసమయంబున. 36

## —♦ త్రిశంకుని వృత్తాంతము ♦—

సీ. ఘనుఁడు త్రిశంకుఁ డిక్ష్వాకువంశభవుండు
బొందితో స్వర్గంబు నొంద నెంచి
తనమనోరథ మెల్ల వినిచె వసిష్ఠున
కతఁ డది కానికార్యం బటనియె
నతఁడు ప్రత్యాఖ్యాతుఁడై పోవు చొక్కచో
వాసిష్ఠులం జూచి వారితోఁ ద

నంతయు నెఱిఁగించినట్టిఁడై వారల
పాదంబులను బ్రాల వారు కినిసి

తే. ఆవసిష్ఠునకు నశక్య మానవ మనఁ
గా దనుచు నొండ్లఁ గోరుచుఁ గదలుచుంటి
బాలిశుండవు పొమ్మంకెఁ జాలుఁ బొమ్ము
నీపురమ్మున కనిన నానృపవరుండు. 37

క. ప్రత్యాఖ్యాతుఁడ నైతిక్
సత్యవ్రతు లగువసిష్ఠసంయమిచంద్రుల్
నిత్యతపోధను లగుమీ
రత్యాకారముగ నిట్లాడం దగునే. 38

వ. నేను నాకర్మంబునఁ బోయి గత్యంతరంబుం జూచుకొందు మీకు
స్వస్తి యగుం గాక యనిన సంక్రుద్ధులై వసిష్ఠపుత్రులు నీవిట్లు గురు
ధిక్కారంబు గావించితివి గావున చండాలుండ వగు మని శపించి
రంత నిశాంతం బైనంత లోన. 39

సీ. కాటుకకొండనాఁ గానవచ్చెడు మేన
మాసినమసిపాతఁ ద్రోసి కట్టి
మొఱడు దేరినమేనఁ గఱకులై కనవచ్చు
నినుపనగల నెన్నియేని బెట్టి
గడుసువాఱినయట్టు గుడుసుజుంజురువెంద్రు
కలు నటు నిటు మోము గప్పుచుండ
నొలికిమిట్టం బడి మెలికలు వడినట్టి
పూలదండలు కంఠమున ధరించి

తే. ఇనుపకట్లతో గలుగల్లు మనుచు మ్రోయు
పెద్దలగుడము చేఁ బూని పృథివిఁ గొట్టు
కొనుచు శంబళిశంబళి యనుచు నార్పు
లోలిఁ గ్రాల ద్రిశంకుండు మాల యయ్యె. 40

వ. ఇట్లు చండాలుండైన త్రిశంకుని వానిమంత్రిసామంతాదులు రోసి
పరిత్యజించి రతండును పరితప్యమానమానసుండై తపోవనంబున

నున్న విశ్వామిత్రునికడకుం జని త న్నుతియించి వసిష్ఠుండును వాని పుత్రులును చేసినచేఁతలు తెలియ విన్నవించె. 41

—♦ విశ్వామిత్రుఁడు స్వర్గమునకుఁ బ్రతిస్వర్గము నిర్మించుట ♦—

చ. పదిపను లధ్వరంబు లతిభక్తిఁ బొనర్చితిఁ బూర్వధర్మముల్
వదలక రాజ్య మేలితిని బాహుబలంబున నెల్లరాజులన్
గదనములన్ జయించితిని గాయముతో దివి కేఁగఁ గోరికన్
గదిరినచిత్తవృత్తిమెయి గ్రాలియు నైతిని మానె ప్రభూ 42

తే. తా నొకటి చేయఁ దలఁచిన దైవ మొకటి
చేయుననునట్టి సామెత నాయెడ నిటు
సార్థకం బయ్యె మేనితో స్వర్గముఁ జన
నెంచి దుర్విధిఫలమున నిట్టు లైతి. 43

క. దైవోపహతుఁడ నాకున్
దైవము నీ వొక్కఁడవు తాపసవర్యా
కావుము కావుము శరణమ
వై వేఱొకదిక్కు లేద యనుచుఁ దెలుపుడున్, 44

వ. అని తెలిపిన త్రిశంకు నాదరించి విశ్వామిత్రుండు నీకు సశరీర స్వర్గసుఖంబు గల్పింతు నని నిజశిష్యులం బుచ్చి నానాదేశంబులం గలఋషివర్యులం దెచ్చి తాను యాజకుండై యాగంబు గావించి వేల్పులనాహ్వానించి వారు రాకుండుటం జేసి తనతపో మహత్వంబునఁ ద్రిశంకునిస్వర్గంబునకుం బుచ్చిన నింద్రుండు వాని నీ విందుండ రా దని క్రిందం బడఁ ద్రొబ్బెఁ బడుచుండువానిఁ గని పడకుండు మని కౌశికుం డాకసంబున స్వర్గంబునకు బ్రతిస్వర్గంబు నిర్మించి త్రిశంకు నం దుండ జేసె నని మఱియును. 45

—♦ విశ్వామిత్రుఁడు శునశ్శేపు నుద్ధరించుట ♦—

సీ. అంబరీషుఁడు యజ్ఞ మాచరించుచునుండ
యజ్ఞాశ్వమును నింద్రుఁ డపహరించె
నప్పుడు ఋత్విక్కులు నృపతినిం గని సేడు

నవినీతిమై నష్ట మయ్యెఁ బసువు
దీనఁ బ్రాయశ్చిత్త మానరు స్వోల్పట
లన వేనవే లర్ధ మతఁ డొసంగి
నరపసువుం గొన నరిగె నెందుం బడ
యఁగ లేక భృగుతుంగమందు సతము

తే. వనితతోఁ గాపురంబున్నముని ఋచీకు
కడకుఁ జని కోరినంత సొమ్మిడుదు నీదు
తనయు నవపసువుగ నిత్తె యనుఁడు నతఁడుఁ
బెద్దవాఁడు నాకుఁ బ్రియుండు విడువ వాని. 46

ఆ. అంత నతనిపత్ని యంబరీషున కనుఁ
బెద్దవానిఁ దండ్రి విడువ కున్న
విడువఁ జాల నేను బిన్నవాని ననఁగ
నడిమివాఁడు రాజు కడకు వచ్చి. 47

మ. తలికిం దండ్రికిఁ గానిమధ్యముఁడుచింతన్ దాశునశ్శేఫనా
మలసన్మూర్తి కుమారుఁ డిట్లనియె నోయుర్వీవల్లభా! కన్నవా
రలకుం గోరినయర్థ మిచ్చి నను లోకవ్యాంతయుం గొంక నీ
విలసద్యజ్ఞపశుత్వ మొందఁగను నే విచ్చేయుచున్ వెంబడిన్. 48

వ. అంబరీషుండు వారుకోరినధనం బిచ్చి శునశ్శేఫునిఁ దనరథంబుపైఁ గూరుచుండం బెట్టుకొని నానాదేశంబు లతిక్రమించి పోవుచు మార్గమధ్యంబునందలి పుష్కరతీర్థంబున నించుక విశ్రమించి నప్పు డట నీవిశ్వామిత్రుం డుండుట యెఱింగి శునశ్శేఫుండు వానిచెంత కుం జని దీనవదనుండై. 49

శా. నాకుం దల్లియుఁ దండ్రి బాంధవులు నన్నల్ దమ్ములున్ లేరునా
పోక న్వించువిచారమొందుటకు నాపూఁబోఁడియున్ లేదు వో
లోకాతీతతపఃప్రభావ! కరుణన్ లో బూనవే కావవే
నీకున్ మ్రొక్కెద నాకు స్వర్గసుఖముల్ నెక్కొఁగ దీవింపవే, 50

క. అన విని సాంత్వన వచనము
లను బలుకుచుఁ గౌశికుండు లక్షించి యటన్

దనతనయుల నందఱ నీ
యనఘుఁడు ప్రాణార్థి యగుచు నడిగెడివినుఁడీ.

చ. శరణము వేఁడె న న్నితఁడు సంయమిబాలకుఁ డేను వీనికిన్
కరుణఁ బొనర్చితిన్ వినుఁడు కా దన కీరు మదీయవాక్యముల్
బురుతరభక్తి నొక్కరుఁడు పోయి పశుత్వము నొందుఁడీ యనన్
గరమలుకం గుమారకులు కౌశికుఁ గన్గొని పల్కి రిగ్గతిన్.

తే. కన్నబిడ్డల మ మ్మిట్లు కాదటంచు
నన్యులను గాచువాఁడవై యజ్ఞపశువు
గాఁగఁ బొ మ్మనుచుంటివే కాదు ధర్మ
మేము పోఁ జాల మేది యె ట్లేని కాని. 54

వ. అనిన విశ్వామిత్రుండు కోపఘూర్ణితనయనుండై మీరు నామాట నిరాకరించితిరి గావున నెల్లరు శ్వమాంసభక్షకు లగుదురుగాత మని శపించి శునశ్శేఫుం గాంచి నీవు రక్తమాల్యానులేపనుండవై వైష్ణవయూపంబునం బంధితుండవై యున్నప్పుడు నింద్రోపేంద్రుల స్తుతింపు పొమ్ము. నీవు చిరంజీవివగుదు వని రెండుమంత్రంబు లుపదేశించి పుచ్చె నంత నతండును రాజుతోడ రథం బెక్కి యజ్ఞవాటంబునకుం బోయినపదంపడి ఋత్విజులు పశుసంస్కారంబు గావించి యూపంబునం గట్టిన శునశ్శేఫుండు విశ్వామిత్రదత్తమంత్రపఠనంబు గావించె. నింద్రుండు ప్రత్యక్షంబై శునశ్శేఫునకు దీర్ఘాయు వొసంగి యజ్ఞంబు పరిసమాప్తి యయినట్లు వరం బొసఁగి చనియె

ద్విపద. అవల విశ్వామిత్రుఁ డతిసిద్ధుఁ డెక్కు
లవు వేల వర్షము లధికతపంబు
గావించె నప్పుడు కమలభవుండు
నావసిష్ఠుఁడు వచ్చి యనిరి బ్రహ్మర్షి
వైతి నీవు తపంబు నాఁగి లోకములఁ
బ్రీతిఁ జూపుచునుండవే యని చనిరి. 55

వ. ఇది విశ్వామిత్రునిమాహాత్మ్యం బనిర్వచనీయం బని నంత
జనకుండు ప్రాంజలియై గౌశికుం దిలకించి. 56

ఉ. ధన్యుఁడ నైతి నాకులము ధన్యమ యయ్యె భవాదృశుల్ బగ
న్మాన్యులు పాద ముంచుటను నాయిలు పావన మయ్యె నీతపం
బన్యజనాతిసాధ్య మగుటన్నిది కాదిక నేను బోమెదన్
జన్యవృతన్ యజింప మునిచంద్రులు ర మ్మనుచుండి రిమ్ములన్.

వ. అని పలుకుచుఁ బ్రభూతింబునఁ బునర్దర్శనం బగు నని విశ్వామిత్రు
నకుఁ బ్రదక్షిణంబు గావించి చనియె నంత శతానందుండు. 58

—♦ శతానందుఁడు శివధనుః ప్రభావ మభివర్ణించుట ♦...

చ. మునికులసార్వభౌమ నృపపుత్రులు వీ రిట సీతకుంకువై
పౌనరెడు శైవకార్ముకము బూనఁగ నిష్టము చూపుచుందు రే
ఘనులకు నెంతవారలకుఁ గైకొన సాధ్యము గానిదై కనుం
గొనదగు సీతపెండిలి కగుం గదె విఘ్న మటన్న భీతికై. 59

వ. ఇట్లున్నయిక్కాలంబున. 60

ఉ. కొందఱు కార్ముకంబుఁగనుఁగొంచుగమింతురు మొక్కి-కొందఱున్
గొందఱుచేతముట్టుకొని కొందఱు పట్టఁగఁబోయి చేతులం
గొంద ఱొకింత యెత్తి మఱి కొందఱు మీఁదికి నెత్తఁ జాలిజేం
డ్లొందఱొ వచ్చి శైవధను వెక్కి-డఁ జాలక పోయి రింతలోన్. 61

శా. లంకారాజ్యమునుండి రావణుఁడు లీల న్వచ్చి కోదండమున్
శంకాతంకవిహీనుఁడై కదియనై శార్ఙ్గంబు నాచేతితో
సంకింపంబడిబెండుకంటె ఁ ఘువైనట్లయ్యె నీచాప మే
వంకం జూచినఁ బ్రాతపడ్డపగిదిన్ భావింపఁగా వచ్చెడిన్. 62

మ. అని దానిం గనఁ గోరి మైథిలునకున్ వ్యాహారముం జేయ నా
ఘనుఁ డారావణుఁడోడుకొంచుఁజని యుగ్రం బైనచాపంబుఁజూ
పిన నాతం డిది యెంతపాటి యనుచున్ వే వేకరాగ్రంబునన్
గొని యెత్తం గమకించి వ్రేల్ జొనిపెఁ దత్కోణంబు క్రిందన్ లలిన్ 63

ఉ. వ్రేలిడ సందుగాన కొకవ్రేలికి నైదును వ్రేళ్ళు సాయమై
వ్రాలఁగఁ జేసి చూచియు రవంతయు సాధ్యముగామిఁ జేతులన్

నాలుగు నైపులం గలిపి నల్గడ సాగెడునట్లు పట్టియున్
జాలనముం బొనర్చుటకుఁ జాలక జాలి వహించి లోపలన్. 64

మ. నగుబాటౌ నని మానసంబునను మందాక్షంబు ప్రేరేపఁగా
మగపాడిం గొని లేచి పూనికమెయిన్ ఘ్మౌగ్రంధంబు నెత్తంగజాల్
బిగిమై బట్టుచుఁ బ్రాణవాయువు ల హంవీరుండు నక్తంచరుం
డొగి నొక్కించుక లేవనెత్తి పడెఁ బై నొడ్డాని విల్ వ్రాలఁగన్.

తే. నాఁడు కైలాసగిరిక్రింద నాలు గైదు
లగుకరంబులు వడినప్పు డగుశ్రమంబు
కంటె నిప్పుడు తలలును గాళ్ళు సేతు
లాధనువుక్రిందఁ బడె నెంతబాధ పడెనొ. 66

క. పంచప్రాణమ్ములు నొ
క్కించుకలో నేగుననుచు నెంచుచు లోకుల్
గాంచుచు నుండఁగ నెట్లో
పంచత్వము నొందక కిచలఁ బడె నతఁడు వడిన్. 67

మ. ముకుటంబుల్ పదిముక్కచెక్క లగుచుంబోనయ్యెఁ గేయూరముల్
తుకు తుక్కై చెడిపోయె నిర్వదియుఁ జేతుల్ కాళ్ళు నల్గెం దలల్
సకలాంగంబులు రక్తసిక్తములయై సాల్వడ్డవై పోయె న
ష్టాకరీతిం జన నయ్యె రావణుఁడు లో నోలమ్ము నాశించుచున్. 68

వ. అని చెప్పిన విని రామచంద్రుండు శతానందునిదిక్కు మొగం బై
జనకునింటం గలవింటివృత్తాంతం బెట్టిదిదాని నెల్లవారును వచ్చి
యెక్కుఁబెట్టం బూనుట యేమి? వినవలతుం జెప్పు మనిన నతం డి
ట్లనియె. 69

—: శ్రీశతానందుఁడు సీతావృత్తాంతము చెప్పుట :—

సీ. వినుము నృపాల! చెప్పెదను మున్ జనకాన్వ
యమ్మున నిమికిఁ బూర్వమ్మునందు
నాఱవతరమువాఁ డగుదేవరాతుండు

ప్రార్థింప శంకరుం డతని కిచ్చె
నాధనూరత్నము నానాఁటినుండియుఁ
బూజింపఁ బడుచుండు రాజునింట
జనకుఁ డధ్వరమును బొనరించుపొంటె నాఁ
గలిఁ గట్టు దున్నుచో క్ష్మాతలమున

తే. దొరికెఁ గన్నియ నామెఁ గూఁతుఁగ నతండు
పెంచుకొనుచుండె నామెయుఁ బెఱిఁగి నాఁడు
నాఁట సర్వలక్షణముల నలువు మీఱె
సీతలోఁ బుట్టినది గాన సీతయయ్యె. 70

శా. భూగర్భంబునఁ బుట్టి పుణ్యవతియై పొల్పొందుటే కాక వి
ద్యాగంధంబు వివేకముం ఘనత యాచార్యంబు గాంభీర్యమున్
దాఁగైకొంచు నెలంతలందు గరిమం దళ్కొత్తి మాతాపితృ
ప్రాగర్థంబులకుణ్ ఫలంబ యనఁదుం బాల్యంగనై భాసిలుణ్. 71

తే. బాలికలతోడ నాయమ బంతు లాడు
తఱిని దనబంతి ధనువుక్రిందను బడంగ
వేవు రెత్తఁగాలేనియవ్విల్లు కేల
నెత్తి యటువెట్టి కొనె బంతి నింతలోన. 72

వ. దానిం దెలిసి జనకుండు జానకికిం దగిన వరునిఁ దే నిశ్చయించి మంత్రులమంతనంబున శివకార్ముకం బెక్కువెట్టిన రాజన్యునకుఁ గన్యామణి యిత్తు నని స్వయంవరంబు చాటించె. దానంజేసి రాజు లెల్లను కన్యాసౌందర్యమోహితులై వచ్చి ధనుర్వరంబు మోపెట్టం బూని రట్టుపడుచుం బోవుచుండు రీవు సర్వవిధంబుల సమర్థుండవు గావున నావామదేవుని కోదండం బెక్కువెట్టి త్రిలోక సుందరి యగు నిందువదనం బెండ్లియాడు మాపెండ్లి కూఁతురు. 73

—: సీతాదేవి సౌందర్యవర్ణనము :—

తే. జానుగుల శ్రీల్ పిరుందుల దా నడుమున
కా నుసుటు గ్రార సొక్కటిలోన బొట్టు

ఘ్రాణమున నొత్తు కేల దీర్ఘమును దోప
రమణి బుధు లెంతు రక్షరబ్రహ్మ మనుచు. 74

తే. నడుము మాయ కేదారము నాభి కుచయు
గంబు శ్రీగిరి కూర్మము కాళ్లు మీఁదు
మోవి మధురాంక మని గాంచి పువ్వుఁబోఁడి
తైర్థికులు తలంచెదరు క్షేత్రచయ మటంచు. 75

సీ. పసిడిమేన్ బాహువుల్ పసిపచ్చ తీవలు
నవ్వులు నునుమల్లెపువ్వుగములు
ముక్కు సంపగిమొగ్గ మోము పొందమ్మిపూ
వరకాళ్ళు చేతులు వరకిసలము
లలరుపాలిండ్లు పూవులగుత్తు లూరువు
లనఁటిబోదులు కన్ను లగుకలువలు
నునుపాటుపెదవి మంకెనపూవు ముంగురుల్
చెలు వగునీలాలిమొలకచాళ్ళు

తే. గోళ్ళు చిగురులు నునుపాట కోకిలములు
పలుకు చిలుకలు నెఱులు తేటులకదుపులు
కలిగి కన్నులపండువై కానఁ బడెడు
పూలతోఁట యనంగ రాచూలి యొప్పు. 76

తే. రాచకీవి నొసంగెడు రమ్యపురుష
మూర్తిఁ గస్తూరితోఁ జేసి మొదట నాల్గు
హస్తములు రెండు గా మార్చి యనుదినంబుఁ
బ్రాణనాథుఁ డటంచుఁ బ్రపత్తిఁ జేయు. 77

వ. అని యభివర్ణించి యిట్టి సర్వలక్షణలక్షిత యగుకన్యారత్నంబుఁ
బడయుఁ గలిగినవానిభాగ్యంబె భాగ్యంబని మేము దలంచుచుందుము
మాభాగ్యంబు నీకుఁ గలుగుఁ గాక యని దీవించుచు. 78

ఆ. ఆమె కీవు దగుదు వామె నీకుందగు
నీడు జోడు నొక్కజాడ నెసఁగు

మీా రలిరువు రొక్కట మెలఁగినచో రతి
మదను లనెడిపేర్మిఁ బొదలుదు రిల. 79

—♦ శ్రీరాముఁ డుద్యానవనంబున నివసించి సీతకై పరితపించుట ♦—

వ. అనిన విని మందహాససుందరవదనారవిందుం డగురామచంద్రుం గాంచి సంతసించుచు శతానందుండు విశ్వామిత్రునిదిక్కు మొగం బై రామచంద్రున కిష్టగంధబంధురపుష్పవనశోభితంబును, నమృతోపమానామృతపూరితవాపీసమంచితంబును, దివ్యభవనభాసమానంబును, దేవీదేవాయతనాలంకృతంబును, జనసమ్మర్దరహితంబు నగు నుపవనంబునందలి ప్రాసాదరాజంబున విశ్రమింపం జేయుఁ డని జనకుండు నిర్దేశించె నని చెప్పి కౌశికునితో రామలక్ష్మణులం దోడుకొని పోయి యిందు మీారు భోజనభాజనాదులం బొంది విశ్రమింపుఁ డని వారి నట నిలిపి విశ్వామిత్రునితోఁ దాను నిజభవనంబునకుం జనియె నంత నిక్కడ రామచంద్రుండును. 80

ఉ. స్నానము చేసి యెట్టెటులొ సంధ్యయు వారిచి యగ్నిహోత్ర మె
ట్లో నెరవేర్చి సాపడుట కొల్లమి సూపుచుఁ దమ్మునిట్టితో
దా నిటునట్టుగా మెసఁగి తల్లినిఁ దండ్రి గురున్ స్తుతింపఁగా
మానసముం బొనర్ప కొకమాదిరి వేధురు నా మెలంగుచున్. 81

వ. వేరితోడం బ్రసంగింపక, పురాణపఠనంబుం దలంపక, తమ్మునిం బలుకరింపక, పరిచారలకుం బనులు చెప్పక, శయనస్థలంబునకుం జని దానిపై మేను సేర్చి యిటు నటుం బొరలుచు, నుస్సు రని నిట్టూర్పు నిగిడించుచుఁ గన్నులు మూసికొని తనలోన. 82

చ. వెలఁదుక నేలలోనఁ బ్రభవించెను రత్నశలాకనా జగం
బుల నటువంటివిగ్రహము పోలిక లట్టివిలాసవైఖరుల్
గలుగవు వేరికే ననుచుఁ గన్నులఁ గట్టినయట్లు తోఁపఁగాఁ
దెలిపెమునీశ్వరుం డటుల తెల్పుట నామది సంతసించెడిన్. 83

ఉ. అయ్యెలనాగ నాకుఁ జెలి యౌనని నే నెటు విశ్వసింతు ని
ష్ఠయ్యెడ నున్నవీరవరు లెవ్వరునే ధను వెక్కు వెట్టినన్

బ్రహ్మయ్యగ నైన శక్తి మెయిఁ బొల్లయి నే నది యెక్కువెట్ట లే
కొయ్యన నుండితిన్ సుదతి నొందఁగ నోపని వాఁడనే కదా. 84

వ. అని పలుతెఱంగులఁ బలవరించుచుఁ దదేకధ్యానపరాయణుండై పరమాణుమధ్యహృదయ మధ్యంబునం బొడకట్టిన ట్లుండ నంత రామచంద్రుండు 85

ఉ. హృదయమునందుఁ జేర్చుకొను నేదియొపల్కునునవ్వుమోముతోఁ
జగములు ముట్టి నాపయిఁ గృపం బొదవించుమటంచు వేఁడు స
మ్మదమున మోవిపానకముఁ బొందగ మో మటు ద్రిప్పునెప్పుడున్
వదలను నిన్ను నే ననుచుఁ బట్టును నెట్టన రెండుచేతులన్. 86

వ. ఇట్లు మనోవికారంబునకుం బాలుపడి. 87

చ. అలరఘురాముఁ డొప్ప జనకాత్మజఁ గాంచకయున్న విన్నయ
ట్లెలమిఁ దదీయవిగ్రహము నే హృదయంబున నిల్పి లోనిచూ
పుల మునిరాజు బ్రహ్మమును బోలెఁ గనుంగొను చొంతుగాన కు
జ్జ్వలమదనానలంబునకు నైపఁగ లేక విరాళిఁ దాలుచున్. 88

తరళము కలవరింతలు పల్వరింతలు కల్లబొల్లివచోగతుల్
వలుమఱుం బొనరించుచున్ ద్రుటిపాటియేని సుషుప్తికిన్
గలుగఁ బోవక నాల్గుజాలను గారియంపడుచుండియున్
దెలియఁ బోకొక కేక నైనను దెల్లవారుచు నుండఁగన్. 89

వ. లక్ష్మణుండు మేలుకాంచి రామచంద్రునికడకున్ వచ్చి నాయన్న యని పిలిచి యిది యేమి వికారస్వరంబున శబ్దంబు చేసితి వన నతండు లేచి ముఖప్రక్షాళనంబు గావించుకొని తమ్మునిం జూచి.

చ. అవనిసుతావివాహపణమైన ధనుర్వర మేఁ గరంబునన్
దవిలినమాత్రఁ జెళ్ళు మని నడ్మికి విర్గినయట్లు నంతలో
బువులను గూర్చి మాలికను బొల్తుక నామెడ వేసినట్లు నే
నవల గజంబు నెక్కినటు లయ్యెను స్వప్నము వింటె తమ్ముఁడా 91

వ. అనిన లక్ష్మణుం డగ్రజు నాలింగనమ్ము చేసికొని యిది మంచి స్వప్నంబు మనకు మేలు గలుగ నీశ్వరుం డనుగ్రహించుం గావున

నీవు నిశ్చలచిత్తుండవై యుండు మదె ప్రాచిం బ్రొద్దు పొడుచు చాయలు పొడకట్టుచున్నయవి లేచి కాల్యకృత్యం బొనరింపు మింతలో విశ్వామిత్రాదులును దర్శన మిత్తు రని ప్రబోధించె నంత నక్కడ సీతాదేవియు. 92

— సీతాదేవి రామునివృత్తాంతము విని విరహతాపమునొందుట —

చ. జనకుఁడు సత్రయాగమును సల్పఁగఁ బూనినవాఁడి నిచ్చలున్
దనచెలికత్తియల్ పురమునం గలవార్తలు చెప్పుచుండు రా
దినమున రామలక్ష్మణులు దేశికతోఁ జనుదెంచి చండికా
వనమున నున్నవా రనుచు వార్త నెఱుంగఁగఁ జేసి పిమ్మటన్. 93

ఉ. ఒక్కఁడు నీలమేఘ మన నొప్పెడుమేన నెసంగుచుండు నిం
కొక్కఁడు సొన్నముం దెగడుచుండుశరీరమువాఁడు నిర్భరున్.
జక్కనివారిలోఁ మిగులఁ జక్కనివారును విల్లు నమ్ములున్
మిక్కిలిమక్కువన్ నిముస మే విడకుండెడువారు వింటివే. 94

వ. అందు జ్యేష్ఠుండు. 95

మత్త. ఇంద్రనీలముతళ్కుబెళ్కుల నీనుచుండెడుమేనితో
సాంద్రవైభవ మెల్లవారికి జాటుచుండెడునొద్దికన్
జంద్రునింబురుడించుమోమున జానుమీఱుచు నెప్పు ని
స్తంద్రుఁడై పచరించుఁ గోములచాతుర్యం దగఁ బల్కుచున్. 96

చ. గమగమలాడుకుందనముకన్నను మిన్న యనంగ నొప్పురా
కొమరునిమేనిసోయగము కొన్నిదినంబులు వెల్గుయామినీ
రమణుని మేను లేని రతిరాజును జెట్టుల మెట్టుమాధవున్.
క్రమమున గెల్చి పొల్చుఁద్రి జగజ్జనసంస్తవనీయమై కడున్ 97

క. ఘన మని చెప్పఁగనగు నా
తనివెనునునుసోఁగ నెఱులు ధరఁ గా దన శ్రీ
జనములమదులను నెమ్మలు
కనినంతన కుతుకమంద గాఁ గత మేమో. 98

చ. మొగ మలచందురుం గఱఁగి పోసి విధాత రచించెనంచు మున్
దగిలి కవీశ్వరుల్ నుడువ దబ్బరయం చనుకొందు మమ్మ! కా
దగు నెల వానిమోముఁ గనినంత నెలంతల కన్నుగల్వలిం
పుగ వికసించెడిన్ నిజము బొం కరయం గద తేటతెల్లమా. 100

సీ. పురుడించు వర తేజమునను దివాకరు
శూరత వాసవు సొంపుఁ గాంచు
దలపించు గురుబుద్ధి దైవతాచార్యునిఁ
దాలిమి భూదేవి లీల గెలుచుఁ
బోలుపొందుఁ దనుకాంతిఁ గలువలఱేఁడు నా
రూపున మారుని కేపుసూపు
సరిపోలు ధైర్యంబు సరణి హిమాద్రికి
గాంభీర్యమున దుగ్ధకంధిఁ బోలు
తే. దమము శమమును శాంతియు దాంతి కరుణ
తపము దానంబు బ్రాహ్మణతత్పరతయు
శౌచము మహాప్రభావము సాధువృత్తి
యతనియందఁ కా కన్యులయందు లేవు. 101

మత్త. కొండపిల్లలు వానిమూపులు కోటతల్పువిశాలమై
యుండు వక్షము బాహుయుగ్మ మయోమయార్గళమై మహో
ద్దండసంగరశత్రుసాధ్యసదంబులై కనుపట్టినన్
నిండుగాఁ గుతుకంబ కూర్చెడు నీలవేణుల కెత్తఱిన్. 102

తే. కన్నుఁగవయును మీఁగాళ్ళు కా న్మోదలగు
నవయువంబులఁ జూచినయంత నతఁడు
మత్స్య కూర్మ నృసింహాది మాన్యరూప
ములఁ జెలంగె ము న్నని తోఁచు ముగుదమిన్న. 103

ఆ. అతని కీవు భార్య వగుదేని నీరూపు
నీదుపుట్టుగడయు నెంతమిన్న
సార్థకమ్ము లగును సాధ్వీమతల్లి నీ
వతని కీడునత్తు వన్నిగతుల. 104

వ. అని యభివర్ణించినన్ విని సీతసంతోషితస్వాంత యయ్యు
నితాంతచింతా సాగరమగ్నయై చెలికత్తియల నల్లనల్లనంబోవం
బంచి పంచశరునిబారికిం జిక్కి యొక్కతయుం దనమనంబున. 105

మ. అతఁడే నామదిచూరఁగొన్నపురుషుం డం చెంచెదన్ లోకవి
జ్ఞత నాలోఁ బొడగట్టునట్టిది మొదల్ నాచిత్త మాచిత్తజా
కృతిపై హత్తియు నాఁడునాఁట మిగులన్ బ్రేమం బిసాళించుచున్
సతతం బాతని వీడిపోవుటకు నెంచం బోదు తా నెప్పుడున్. 106

చ. నిలిచినఁ గూరుచుండినను నిద్దుర వోయిన సుద్దు లాడినన్
జెలులను గూడి పూజలను చేయుచునుండిన నట్టు లుండినన్
దలఁకక నామనం బెపుడుఁ దత్పరతన్ రఘురామచంద్రునే
తలఁచుచు దద్దరించుచు వితాకుపడు న్వగఁ డొందు డిందుబో. 107

క. మునితో వచ్చె నటంచును
వినిపించిరి చెలులు నేఁడు వేడుకపడుచున్
గని పో వచ్చెను యజ్ఞము
జనకునియెడ భక్తిభావసంభరితుండై. 108

క. భూ తనయ యిచట నున్నది
సీతారత్నంబు దానిఁ జేకొనఁబోవం
బ్రీతివడి వచ్చెనో ధను
వేటియున నెత్తఁ గలఁడొ యే నెఱుఁగ నయో. 109

వ. అని యనేకవిధంబులం బడి పరితపించుచు. 110

క. మనసిజతాపజ్వరమున
మన మెటియఁగ నెదిరిఁ దన్ను మఱచినగతి గాఁ
దనచెలులు వలుకరించిన
విని విన నటు లై పొనర్చె వెడఁగుంజెయ్వుల్. 111

చ. ప్రియమునఁ జెంతఁ జేరి కడుబిగ్గరఁ దన్నుఁ గవుఁగిలించె నా
ప్రియుఁ డని మే నెఱుఁగ కొగి వెంగలి చేతులు సాఁచి నట్టి వెం
బయలు కవుంగిలించి లమి వాతెఱకై తనమోము ట్రొగ్గి యే
మియుఁ గనరామికిన్ తెలిసి మిక్కిలిగా వగచె న్వరాళికై. 112

చ. సరగున లేచి యాకసము నందిటఁ జేర్చెడు జ్యోత్స్నావిపానకం
బరయఁగ మోముఁ ద్రిప్పెడుఁ బ్రియంబున నేమియొ పల్కరించెడున్
జరచురఁ జూచెడుం గినిసి సోలెడు వ్రాలెడు నవ్వెడుం గడున్
విరహము నొందెడుం దెలివి వీఁగి నెలంత దురంతచింతయై 113

వ. ఇట్లు మిక్కిలి వగలం బొగులుచు శరీరపరవశత్వంబున నగపడిన వాని నెల్ల నెదిరియై యడిగినట్లు నుడిగికొనుచు నత్తఱి ధైర్యంబు ద్రిగ్గిల్ల బిత్తఱి చిత్తవిభ్రమం బొందినచందంబు నెఱింగి నందని పచ్చవిల్లు గలపచ్చిబోయ క్రచ్చుకొని వచ్చి విచ్చలవిడిఁ బెచ్చు పెఱిగి హెచ్చరికం దెచ్చుకొని నిడుదగేదంగిపిడి నడరునెడఁద చిగురాకుటడిదమ్మునను జున్నుని తలదిమ్మిడునాలిభూతమ్ము లగుతుమ్మెదలం గ్రమ్మినదారిన్ నాటితేటి జంటయగు తుంటవిల్లును దళుకు లొలుకు చికిలిచౌవంచములుకులును మేలుగేదంగివాలుం జిలుకయుం గోని సుందరం బగుబొందళంబు దొడిగి తొడిబడుమీనుమొసలిసిడంబుల నసరుగులుకు చిలుకతేజీయరదం చెక్కికొని చిక్కనగుతన దళంబులతో దొరపట్టిఁ జుట్టి ముట్టి కట్టిడితనంబున కొడిగట్టియుట్టిట్టనరానికట్టలుకం గలువ కడకుం దీసి నాల్గు బెట్టంపనల కట్టియలు నిట్టఁ బొడిచి గట్టిగాఁ గొట్టి చిక్కులం బెట్టిన దిట్టచెడి దోదూయమానమానసయై మానవతి మహానలసమానమైన విరిశయ్య వ్రాలి పొరలుచు దరి లేనివిరహసాగరంబు వెల్లివిరిసెనో యన నేత్రకోణంబులఁ గజ్జలాంచితబాష్పధారాపూరంబు తోరంబై బోరునం దిగజారి కాలువగట్టి చనుకట్టులం బడి చిట్టిగసి మిట్టిపడి పుడమిం బడి జాలువాఱుచుండఁ గోకిలకాకుకాకలీస్వనంబున నేడ్చుచుం జెక్కుటద్దంబులం జెయిఁ జేర్చి చిక్కులు వడిన తారహారంబులు భరంబు లగుట నూడ్చివైచి యొప్పులకుప్ప యగు గొప్పకొప్పు విప్పి విరియం బోసికొని కన్నులు మూసికొని రామభూవల్లభుండగునిజవల్లభుని రూపరేఖావిలాసంబులు హృదయఫలకంబునం దిడికొని తలంచుచున్నతఱి నతండు పొడకట్టిన ట్టయిన దిగ్గన లేచి యగ్గజగామిని కన్నుఁ దెఱచి నలుగడఁ గనియవెద

కొనక క్రుక్కి పలుమాఱు విధిం దూరుచు మున్నీరై నకన్నీరు కరతలంబున నొత్తుకొనుచుఁ జిత్తజవికారంబు లగు స్తంభ ప్రళయ రోమాంచాది సాత్త్వికాష్టచేష్టలకుం బాలుపడి సర్షపరసపాకంబు చేసిన పనరంబు పగిది బెల్లారాటంబున నిలిచినచోట నిలువక కూరుచుండినచోటం గూరుచుండక యన్నపానీయంబులు వర్జించి యితరవ్యవహారంబులు చాలించి తదేకధ్యానధారణాసనవాదుల భ్రమఁ గొని తిరుగుచుఁ గుసుమగంధి బంధురమదనాంధకారంబు నిర్భరంబుగాఁ గప్పినం దెగ వెఱుగక యడకిల్లోఁ బ్రొద్దు గ్రుంకిన ట్లుండి ముద్దురాచిలుకలు తనయొద్దకుం జేరినఁ జదివి పక యుద్ధవిడిం గద్దరించుచుఁ బాలితకేళీమరాళీపాళికి మందగతులు నేర్పక శిఖండితండంబులకు నఖండకరతాళంబుల మండలభ్రమణాదితాండవంబులు నిండు వేడుకం గఱపక పాఱఁ ద్రోలుచు సఖీజనంబు చేరం జని పిలిచిన మాఱాడక విసిగికొనుచు సలిచినఁ గసరికొనుచు ననేకవిధంబులఁ బొగులుచు నితాంతచింతాసాగరంబు గడవ నీఁదనేరమి నెంతయే విభ్రాంతి వహించియుండఁ జెలికత్తియలు శైత్యోపచారంబులు చేయుచుండి రంతట. 113

## సూర్యాస్తమయాదివర్ణనము

తే. వనజముఖి యైనయయ్యినతనయ విరహ
తాపమునఁ జేసి యెంతయుఁ దనువు సెడఁ ద
పించుటలు సూడ లేనట్టికించు వోలె
నినుఁడు చరమాద్రిపై వ్రాలె నింపుదక్కి. 114

తే. తనకు నాగ్నేయ ధర్మంబు తారసించు
టిష్ట మదిగాన నప్పుడు తిగ్మరశ్మి
యూర్ధ్వ గతిఁ బొందె ననఁ గిరణోచ్చ్రియంబు
మీఁదు గా, బ్రాకె నెంతయు మిన్నుముట్టి. 115

తే. గర్భవతి గాన ప్రాగ్దిగంగన మొగంబు
తొలుతవెలవెలఁబాఱ పైనెలలు నిండ

ఘూకరుతముల మ్రాల్గుచుఁ గొడుకుఁ గాంచె
నా స్సిశద్యుతితో నెల నలువుమీఱె. 116

తే. రజితభూధరాదులను నిరాకరించి
నీరజాండకటాహంబు నించి దెసల
ముంచి ధరణీతలం బాక్రమించి మించెఁ
బండువెన్నెల కన్నులపండు వగుచు. 117

వ. ఇట్లు లోకంబెల్లఁ దనవశంబు చేసికొని వియోగుల మారుబాఱిం బడవైచి రేయెల్లఁ బట్టపగలు గావించు నో యనఁ బిండియాఱ విప్పినట్లు పండువెన్నెల కన్నులపండువై కాయుచుండె నప్పుడు. 118

క. కనకనలాడెడునిప్పుల
గనిఁ బడునట్లి గురుశయ్యకై వ్రాలి కడుఁ
వనటం బొరలుచు భూసుత
మన సెఱియం గడపె రాత్రి మఱి మఱి వగలన్. 119

వ. అట్లు గడియ యొక్కమహాయుగంబుగా నారాత్రిం గడవనీడి సూర్యోదయం బైనపదంపడి. 120

—♦ సీతాదేవి యుపవనంబున కరుగుట ♦—

సీ. జలకంబు లాడి క్రొంజిలుగుపచ్చనిపట్టు
పుట్టంబు ధరియించి జుట్టు ముడిచి
మోమునం గస్తూరిబొట్టొప్పుగాఁ బెట్టి
కందోయిఁ గాటుక పొందొనర్చి
కాంతు లీనెడురూపు కంఠసీమను వ్రేఁ
బసపుగుంకుమయు సాంబ్రాణి పూలు
పత్త్రి యుంగలపళ్లెర మొకచేత
నొకచేత జలపాత్ర మొయ్య బూని

తే. చెలులు ముందను వెనుకను జేరి నడువ
రామతారకమంత్రము గ్రాల నాల్క
నుపవనంబున నీశ్వరి యున్నకడకుఁ
బోయె సీతామహాదేవి పూజ సేయ. 121

తే. గుడికిఁ బోయెడుదారిని నడువ కామె
తగి చతుశ్శాలమున కేగుదారిఁ బట్టి
నడువఁ జొచ్చెను నెచ్చెలుల్ నగుచు దేవి!
దారి తప్పితి మిది యిప్డు తప్పు దారి. 122

వ. అనిన జానకియు. 123

చ. ఎఱుఁగక వచ్చినట్లు నటియించుచు నో యిది చుట్టుదారి యి
త్తెఱఁగునఁ బోయినన్ వనము దేవళముం జన వచ్చు నైన ని
క్కఱి సరి గానిదన్నపుడు తప్పగు చొప్పునఁ బోవ నేటికిన్
దెఱవలు! మీరు చెప్పినటు నేనుబొనర్చెద నంచుఁబల్కుచున్. 124

వ. దిక్కులు సూచుచు సఖీజనసూచితమార్గంబునకు మరలి చనుచు వెనుకకుం దిరిగి తిరిగి చూచుచు నడు గోకయామడ యగునట్లు నడచి నడచి భవానీమందిరంబునకుం జని ప్రదక్షిణంబు చేసి లోనికిం జని షోడశోపచారంబుల సర్వేశ్వరి సర్వభావంబుల నారాధించి లేచి చేతులు జోడించుకొని. 125

మత్త. శర్వునిం జతురాననున్ హరి శక్రు సూర్యునిఁ జంద్రునిన్
సర్వదేవతకోటులన్ స్వవశంబున న్నిలఁ జేయుచున్
సర్వమంగళ వై జగంబు లజస్రముం గని ప్రోచుచున్
నిర్వహింతువు సర్వము న్నిను నే నుతించి భజించెదన్. 126

ఉ. పుట్టకమున్నె నే నెవనిఁ బొంద వినిర్మితి గల్గి యుండునో
యెట్టిమహోదయంబునకు నెప్డు దలంచుచు నుండునో ఘనుం
డట్టిమనోవిభుం డిటకు నాగతుఁ డయ్యెను వానిపొందు నా
కెట్టు ఘటిల్లఁ జేసెదవు యే నిను వేఁడుచునుంటిఁ దల్లిరో. 127

క. మనుజులకు నసాధ్యము లగు
పను లవి సాధ్యములు నీకుఁ బరమేశ్వరి! నా
మన మెఱిఁగి జీవితేశ్వరు
ననుఁ గూర్పుము నీకు వందనం బిదె జననీ. 128

—♦ సీతాదేవి విహారభవనంబున రాముసీక్షించుట ♦—

వ అని మ్రొక్కి వరంబు వడసి సఖీజనంబుతో శివలకు వచ్చి యట నొక్కవిశాలప్రదేశంబున నించుక విశ్రమించి విహారభవనంబు దిక్కు దృష్టి నిగిడించి యొకచో నొక్కమణికుట్టిమంబునఁ గూరుచున్ననృపకుమారుల యదృచ్ఛాలాభంబుగం గని చెలికత్తియల దిక్కు మొగంబై. 129

ఉ. సీలము కెంపు నొక్కకడ నిల్వఁగఁ జేసిన దెల్వి దోపనా
మేలిపసిండితిన్నెపయి మేలునుడుల్ పచరించువారి నిం
బోలఁ గనుంగొనుం డెవరొ పోలిచి చెప్పుఁడు నాఁగ నెచ్చెలుల్
బాలికదిక్కు మోముగుచు వారె యయోధ్యపురేశ్వరాత్మజుల్

ద్విపద. మెఱుఁగుచామనచాయమేన్ గలవాఁడు
పరికింప రాముఁ డాపచ్చనివాఁడు
సౌమిత్రి యన నగు జానకీ! నీవు
ప్రేముడిమై వారి వీక్షింపు మమ్మ. 131

వ. అనిన నామె లేది చెలికత్తియచే యూఁ ఱుంమక చని పుష్పాపచయంబు చేయుచున్నచందం బభినయించుచుండె నంతలో లక్ష్మణుం డంతర్గృహంబున కరిగిన రామచంద్రుండు డబ్బోట యబ్బాలికామణిం గాంచి యించుక తలవంచి యిక్కన్యావతంసంబు జనకరాజాత్మజాత కానోపు నని చూచియుం జూడనిచందంబున నటించుచుండె నప్పు డప్పద్మాక్షి చెలికత్తె నీక్షించి. 132

తే. పాలఁతి! తాంబూలవల్లి యీపొగడ చెట్టు
నట్టె చుట్టఁ బెట్టుకొనంగ నాసఁ జేయు
నట్టులున్నది చూచితే యనఁగ సకియ
లోకసంసార మీరీతి గాక యున్నె. 133

తే. సీత యను దివ్యమామిడిచెట్టు దీనిఁ
గోసలమునుండి నాతండ్రి కొనుచు వచ్చి
నిలిపె నిట దీనిపై నాకు నెమ్మి యనుచు
స్థానగౌరవ మది యని సకియ వలికె. 134

ఉ. పూవులు గోయుచందమును బొందుపడంగను నట్లు గాంచుచున్
వాలుకనుంగవల్ ప్రియునివంకకుఁ ద్రిప్పుచు నట్టె తీవలై
వ్రాలఁగఁ జేసి పూవు లని పత్రములం దెగఁ ద్రుంచి వైచుచున్
జాలియు సిగ్గునున్ నగవుఁ జాటుచు నుండె నెలంతగన్నులన్ 135

—♦ సీతరాముని సౌందర్యమభివర్ణించుట ♦—

ఉ. ఎక్కడిపూరుషుం డితఁ డిదెక్కడి చక్కదనంబు మేనిలో
నెక్కడి నైగనిగ్య మిది యెక్కడి కెక్కడ పైడినిగ్గు ల
మ్మక్క! పయోరుహాసనుఁడు హాయిగఁ గౌతుకకేళి దేలుచున్
మక్కువ మీఱఁగా సలిపె మారసమానుని రాకుమారునిన్ 136
మ. కలువల్ కన్నులఁ బోలు సింగములు లేఁగా నొబ్బలు శంఖంబునుం
గళముం బోలు మొగంబువోలు శశియున్ గన్గో జగంబందుఁ జా
యల మే తానుపమానవస్తు లుపమేయత్వంబునుం బొందె నీ
వలరాయం డోడ లెత్తునాఁటిసుత వహ్వా యెంతసంతోషమో.
తే. కాయమును గిల్లఁ బచ్చిపాల్గారు నౌర
ముద్దులను మూటగట్టునీ పురుషవరున
కీడుజోడైన చేడె యీచేడె యగునొ
కాదొ యిది వట్టి యడియాస గాఁగ నగునొ
వ. అని వగలం బొగలుచున్నంత. 139
ఉ. రాముఁడు నవ్వీథంబునన రాజముఖిం గని కన్నుదోయి సే
దో మఱియొక్కచక్కటికి దొర్లగఁ జేయుచు వెండి చూచుచున్
వేమఱు దృష్టిపాతములు వేసియు వేయక చూపి వేముఖిన్
దామరసాక్షికిం దనరుతాపముఁ దోఁపఁగఁ జేసి పిమ్మటన్ 140
మ. అవురా! పెంజడతీఱు మేలు మొగ మయ్యారే! కనుందోయి సా
రవునా! బాహులతల్ బలారె! బొమ లాహా! కంఠ మాకార! కన్
గవ మేలా! బళిరే! కృశోదర మహా! కాల్పొంక మోహో శుభో
రువిలాసంబు సెబాస్! పదంబు లివి యేరున్ మెత్తు రా! బాపురే!
తే. పచ్చమే నాకువచ్చుశ్రవణసుపత్ర
ఘుల్లి మోవియు నల్లనై యొప్పుకొప్పు

తెలుపు దెలిపెడినవ్వులు వెలయుఁ గాన
నైదురంగుల చిలుకయీ యతివమిన్న. 142

తే. సర్వజనమాన్యతయు మహైశ్వర్యపరత
కౌతుకాకరతయు భూరికాంతిపరత
భువననుతసువర్ణ మహావిభూషణతయుఁ
బొదల నడయాడుబంగారుబొమ్మ కొమ్మ. 143

క. మెఱమెఱలాడెడుమే నీ
తెఱవకు మబ్బునను మిగులఁ దేఁటి తొలకరిఁ
మెఱసెడు మెఱుగులప్రోవను
తెఱఁగునఁ బరికింప నొప్పుఁ దేజస్స్ఫూర్తిఁ. 144

వ. అని యభివర్ణించుచుఁ దదేకధ్యానతత్పరుండై యున్నతరుణంబున లక్ష్మణుండు వచ్చి నమస్కరించి విశ్వామిత్రమునీంద్రులు శతానందప్రభృతులతో వచ్చుచున్నవా రని విన్నవించినంత సీతాకాంతునకు గుండెలో జాఱి వడి నట్లయినఁ లేచి కన్నెమిన్నక గన్నుల నద్దుకొనుచెయ్యిం గానిపించుచు లోనికిం జనియె నంతఁ జేతన లేనిది వోలెనై బాలామణి పాలుమాలి నేలం గూలఁబడియె. నాలో నాళీజనం బామెకుం గేలూఁత యిచ్చి సేద దేర్చుచు లేవ నెత్తి మందమందగమనంబు సేయించుచు నగరునకుం దోడుకొని పోయి రిక్కడ శ్రీరామచంద్రుండు విశ్వామిత్రునిపాదారవిందంబుల కభివందనం బాచరించి శతానందుని కేటికోళ్ళు పెట్టి తోడితెచ్చి భద్రాసనంబుల నాశీనుం జేసి యంత విశ్వామిత్రుండు రామమూర్తిం గాంచి యభినందించుచు ని ట్లనియె. 145

—♦ రామలక్ష్మణులు నగరున కరుగుట ♦—

తే. వత్స! శ్రీరామచంద్ర! సర్వమును సౌఖ్య
గరిమకద! క్రొత్తవో టిది గాన ధాత్రి
కలత లేకుండ సుఖనిద్ర గాంచితి కద
పటుకర నీమేని కిట సుఖస్వాస్థ్యమె కద. 146

వ. అనిన సగుమొగంబున రామచంద్రుండు సర్వమును మీాయను గ్రహాధీనం బగిన నతండు వెండియును. 147

ఉ. ఇందలిమానవేశ్వరుఁ డహీనమనోరథసన్నిధాన మా
డెందముతోఁ బురం బిది కడిందివిలాసముగా నలంకృతిం
బొందఁగఁ జేసి వాసిమెయి బ్రోలుగనన్ నిను దేర నీశతా
నందునిఁ బుచ్చె నాకడకు నన్గొని నీకడ విన్నవింపగన్. 148

తే. కదలు మదె మేళతాళముల్ కాంతవాద్య
ములు సెలంగెడు వారాంగనలు సునృత్య
ము లగుఁ గైసేసి యేనిక నిలిపి యుంచి
రెక్కు మిా వలంకృతుఁడవై చక్కనయ్య. 149

వ. అనిన రామలక్ష్మణులు పాంథజనాలంకారాలంకృతులై ధను ర్బాణంబులు ధరించి విశ్వామిత్రునితో భద్రదంతావళంబునకుఁ బ్రదక్షిణంబు గావించి పురోభాగంబున నిలిచి యున్నంత. 150

మ. కడ లీరైదును నిండి మెండుకొన ఘీంకారంబు గావించి యే
న్గొడయం డంచు నెఱింగి రాముని సముద్యోగించితొండంబుతో
నడి నొందం జవుడోలునం దిడి ముని న్సామిత్రినిన్ వ్రేల్మిడిన్
గుడిభాగంబున నెడ్మభాగమునఁ జేరోఁకఁ జేసె న్గ్రబంబుగన్. 151

చిత్రపది. అప్పుడు వాద్యఘోషము లిలన్ వ్యాపింప నాకాశమం
దొప్పెను దుంధుభిధ్వనులు పూ లొత్తై ధరన్ రాలెఁ బెం
పుప్పతిలంగ నచ్చరలొగిన్ వ్యోమంబునం దాడి రా
చప్పుడు సర్వలోకములకున్ సంధించె నానందమున్. 152

సీ. అంతఁ దూర్యమ్ము లత్యంతమున్ మ్రోయంగ
వారాంగనలు నృత్యపరత నడువ
జయజయ ధ్వానముల్ సంతతంబు నొసంగ
నుపవనంబుననుండి యుత్సవముగ
నేగుఁ బెండ్లి యొనర్చు చేగుచో నందంపుఁ
జెలులు శత్రపవృత్తాశతుల నిడంగ

భూపు లతితలును బుణ్యాంగనలు చల్ల
వందిమాగధులు కైవారము లిడ

తే. వేణువీణాదినాదముల్ వీధి వీధి-
మేదురం బయి మోదము మిన్ను ముట్ట
శాస్త్రవాదము లందందు జరుగుచుండ
నెంతయును వింతయై యొప్పె నేగుఁబెండ్లి. 153

మ. సకలానందకరంబుగాఁ బురజనుల్ సాహస్రముల్ కూడి రా
నకలంకస్థితి నేగుబెండ్లి జను లాహా నాఁ బ్రవర్తించుచో
నొకచో భద్రగజంబు ఘీంకృతులతో నొక్కంజయే వేయ నొ
ల్లక గీపెట్టుచు నుండె హాస్తిపకుఁ డల్ ఘా ల్లంచుఁ బోఁద్రోలినన్.

తే. అప్పు డిది యేమి యే మని చెప్పుకొనుచు
నెల్ల రాశ్చర్య మగ్నులై యొల్లఁబోయి
రడుగు వెట్టను మదహస్తియనునయించి
యంకుశముఁ జూపి మావటీఁ డైనఁ గాని. 155

తే. అంతలో నంతిపురినుండి యడుగుదారి
నరుగుదెంచి జానకి హర్మ్యమందు నిలిచి
రాముని౦ గని పైనుండి ప్రసవసరము
హత్తిపైఁ బడ వేయుంచె నాళిచేత. 156

వ. అంతయు నెఱింగి యంతలోన. 157

చ. మఱియును ఘీంకరించుచును మత్తగజం బది దారివట్టు చె
చ్చెఱ నడయాడెఁ బ్రేక్షకులు చిత్రమి దే మని చర్చ సేయుచున్
నెఱి గల దీగజంబు విభునిం గన జానకి రాక కిట్లుగా
మొఱకుతనంబుఁ జూపె నని పూవులదండ యెఱుంగఁ జేసెన్.

వ. ఇట్లు సకలలోకాహ్లాదకరంబుగా నుత్సవంబు సాఁగినంతఁ గొంతలో
రాజసభాస్థలంబుకడ గజరాజంబు నిలువ రామలక్ష్మణులు విశ్వా
మిత్రునితో నవరోహణ బు చేసి పాదచారులై జనకాదులు విశ్వా
మిత్రాదులు వెంటనడువ మందగమనంబవధరించి రాజప్రాసాద

నడచికొని కక్ష్యాంతరంబులు దాఁటి పేరోలగంబునకుం జనిభద్రాసనంబుల నాసీనులై యున్నపదంపడి జనకుండు సింహాసనంబు నుండి లేచి సకలరాజలోకంబును మునిబృందంబును పౌరజానపదసమూహంబును వినుచుండఁ జేమ్రొత్తి యుచ్చైస్స్వరంబుననిట్లనియె. 159

—♦ జనకుఁడు రాజలోకములను హెచ్చరించుట ♦—

మ. వినుఁ డోహూ జనులార! నాగృహమునం బెక్కేండ్లుగా నుండిపూ
జనముం బొందుచునున్న శంకరునివిల్ సజ్జంబు గావించినన్
ఘనుఁ డెవ్వాఁ నికి నాసుతన్ సతిగ నేఁ గావింతు నంటిన్ జగం
బున నేవాఁడు సమర్థుఁ డుండినటు లెవ్వం జూడ లేఁ డింతకున్ 160

శా. నేఁ డీయోలగమందు పెక్కురు బలాన్వీతుల్ నృపాలాత్మజుల్
జూడ న్వచ్చినవార లుండి రని నేఁ జూఁజాయగా వింటి నో
ప్రోఁడల్! మీరు భుజాబలంబునను విల్ పూనంగ యత్నింపుడీ
యీడం బోకుఁడు లెండు రండు జయలక్ష్మీశక్త్వముం బొందఁగన్.

వ. అని పదివేవురు పోటరులం బుచ్చి పూజాగృహంబునుండి మృత్యుంజయకోదండమ్ముం దెప్పించి సభాముఖంబునం బెట్టించి యిదె మా జానకీపరిణయపణంబుగా నిడినధనుర్వరంబు రండు లెం డని మఱియుం బ్రోత్సహించి పలికె నప్పు డప్పలుకులు విని రాజపుత్రు లెల్లరు నోళ్లఁబోయినట్లు సజ్జకర్మంబునకుం బూనుకొన నుత్సహింపక యిది విల్లు గాదు. పర్వతంబు లైనం బగులింప వచ్చుం గాని దీని నెత్త నేరికిన్ దుస్సాధం బని వీర్యవిహీనులై యూరక చూచుచుండి రప్పుడు విశ్వామిత్రుండు శ్రీరామచంద్రునిం బిలిచి. 162

శా. ఓకాకుత్స్థకులాబ్ధిసోమ! జగదంహోరూపరిక్షోవిరా
మా! కారుణ్యగుణాభిరామ! రఘురామా! లెమ్ము కోదండముల్
నీకుం గాక యొకానొకం డెవనికిన్ జేముట్ట శక్యంబు గా
దీకర్జం బొనరించి చేకొనుము రాజేంద్రాత్మజన్ జానకన్ 163

మ. అనినన్ రాముఁడు మందహాసరుచిరాస్యాబ్జాతుఁడై హాటకా
సనమందుండి దివాకరుం డుదయపాషాణోచ్చయాగ్రంబునుం

డి నెటిన్ లేచెడునట్లు లేచి తనతండ్రిం దల్లినిం దేశికుఁ
ప సనందనుఁ స్మరియించి కౌశికుని సంభావించి సంరంభియై 164

—• రాముఁడు శివధనుర్భంగంబుగావించుట •—

వ. కోదండంబు సమీపించినంతలోనం గొందఱు. 165

ఉ. కోసలమూర్తి యీచిఱుత కొండిక దండిమగల్ మహామహుల్
తా మొకలోమ మాత్ర మయినం గదలింపఁగ లేని కార్ముకం
బే మని యెత్తఁగాఁ దగుదు నే నని లేచె శిశుస్వభావ మిం
దీమెయిఁ దోఁప వచ్చెడి సమీక్షణముం బొనరింత మిత్రులా 166

ఆ. కొండవంటివిల్లు కొండిక యీతండు
దానితోక యంత దైన లేఁడు
చేరి పట్టుటెడ? నారి గూర్చుట యెడ?
వట్టిమాట యిద్ది వట్టిమాట. 167

తే. అపుడు మఱికొంద ఱలఁతి యీనృపసుతుండు
కొండవంటిది విలు గనుగొనఁగ నైనఁ
జాలఁడందురు మెయిలావు సన్నము లవి
సారమును నిర్ణయింపంగఁ జాలునో కొ. 168

సీ. పిడు గెంతయుండను బడినఁ గొండంత దా
నిని బిండిపిండిగా నొనరుచుఁ గదె
దీప మెంతుండును దెసల నిండినగాఢ
తమస మంతయు దాన దఱుగును గదె
నింగల మెంతుండుఁ బొంగి లోకములంత
వానిని నుసి చేయఁ బూనును గదె
మం దెంతయుండును బొంది మేటంతరో
గము లెల్ల గడియలోఁ గాల్చును గదె

తే. చిన్నవాఁడుగ నున్న యీవన్నెకాఁడు
కొండకన్నను మిన్నకోదండ మైన

లోనిసారమునం జేసి దానిఁ బట్టి
బెండువలె రెండుగాఁ జేయనుండు నహహ. 169

తే. అపుడు సీతామహాదేవి హైమవతికి
మ్రొక్కి యనుఁ గన్నతల్లి నీపూజ నేను
మరచియుండను వరమది మఱవకమ్మ
నాదొరకు నిమ్ము నీశక్తి నాదిశక్తి. 170

క. జనకుఁడు మంత్రివరుల్ పుర
జనులును రామునకు విల్లు సజ్జము గాఁగన్
బొనరించు శక్తి గలుగన్
మనమున ధ్యానించి రెల్ల మహిమోన్నతులన్. 171

వ. అని పలువురు పలుదెఱంగులం బలుకుచున్న సమయంబున రామ
భద్రుండు కోదండంబు గలమంజసంబుకడకుం జని ధనువునకు
నధిదైవతం బగుదేవదేవునకును బ్రదక్షిణనమస్కారంబు లర్పించి
విశ్వామిత్రునిదిక్కు మొగంబై కన్నుల నాజ్ఞం గొని యెత్తి కడ
కేలం బేటికనుండి బెండువోలెం దాని లేవనెత్తి యొంటిచేతం దాని
గొనయంబు గనయంబునఁ గూర్చి లత్తకంబునం బట్టికుత్తరించుచు
ధనుష్టంకారంబు గావించి లాగి యాకర్ణపూర్ణంబు గావించి విడిచె
నంతలో నది పెళ్ళు మని రెండుముక్కలయ్యె నప్పుడు. 172

క. పెనుగొండ గూలి నేలన్
గొనకొని పడినట్లు పిడుగు కొండగుహాలపై
ఘనజవమునఁ బడినట్లును
విన వచ్చెను శబ్ద మపుడు వీనులు ప్రేలన్. 173

క. విఱిగినముక్కలు రెండున్
బెరకేలం బట్టి తొంటు పెట్టియఁ బడున
ల్లెఱుక మెయి విసరి రాఘవుఁ
డరుసంబునఁ గూరుచుండె నమ్మునిదెలుపన్, 174

చ. జనకుఁడు సంతసించుచును సన్నుతమూర్తికి గాధిపట్టికిన్
వినతి యొనర్చి యిట్లని యెవేదవిమత్సర! నీదుపేర్మి నా

తనయుకుఁ బెండ్లిసేయఁ గలధన్యుఁడ నయ్యెద నిట్లునాపయిన్
దనరెనకూర్మి నిగ్గతి నొనర్చితి తెచ్చితి రామచంద్రునిన్. 175

క. నాకులము ధన్య మయ్యెను
రాకొమరుఁడు సర్వలోకరక్షాదక్షుం
డై కడఁగు రామమూర్తికి
నాకన్నియ నీయఁ గంటి నయమున నుంటిన్. 176

—♦ సీత రామునఱుతఁ బుష్పమాల వైచుట ♦—

ఆ. అపుడు తండ్రిపంపు నంది సీతాదేవి
పుష్పమాల యొకఁడు పూని కేలఁ
జెలుల కేలుదండఁ జేకొని యోలగ
మునకు వచ్చి యెల్లమునుల మ్రొక్కె. 177

తే. తండ్రికడ నిల్వ నాతఁ డోతల్లి! రామ
చంద్రుఁ డీతఁ డుఁకువఁ జెల్ల సలిపె నిన్ను
వీని కీయ నెంచితి నీవు వీనియుఱుతఁ 178
బుష్పమాలిక వేయుము మ్రొక్కికొనుచు.

తే. ఉపవనంబునందు నుండి చూచినయట్టి
చూపులోనఁ గొంత చొచ్చె బెంగ
యిపుడు చూచునట్టియీచూపులోన నొ
క్కింతసిగ్గు చొచ్చె నింతి కపుడు.

మ. అనినన్ జానకి మోము వంచుకొని మందాక్షంబున న్నిల్వఁగా
సఖులుం జెల్వలు చేయివట్టుకొని రావమ్మా! జగత్పావనీ!
నినుఁ జేపట్టఁ గనున్నరామునఱుతన్ నీ వీసుదామంబు వే
సి నమస్కారము చేయుమం చచటికిం జేర్పంగ నాసీతయున్. 179

క. రాముని జూచియు సిగ్గున
మో మించుక వాల్చి తూర్యములు మ్రోయఁగనా
దామము రామునిమెడలో
నామె యిడి చనియె సీత నాళీవృతయై. 180

వ. అప్పుడు విశ్వామిత్రుండు జనకుం గాంచి యిట్లనియె. 181

సీ. ధన్యుండ వైతివి మాన్యుండ వైతి నీ
కులము ధన్యం బయ్యెఁ గువలయేశ
నీకోర్కెకిం దగ నీకన్నె శ్రీమహా
విష్ణుస్వరూపుఁడై వెలయుచునున
కీఁ గంటి పరిణయం బీలోనఁ జేయుట
శ్రేయ మంచును మేము చెప్పుచుంటి
మిం కొకమాట నే నిపుడు చెప్పు దునీదు
నౌరసపుత్రియై పొరుమీఱు

తే. నూర్మిళను లక్ష్మణునకు సహోదరుఁడు కు
శధ్వజునికన్నకూఁతురై చనెడునట్టి
మాండవిని శ్రుతకీర్తిని మఱియుఁ బేమ
భరతశత్రుఘ్నులకు నీయ వాంఛితంబు. 182

—♦ జనకుఁడు దశరథునకు శుభలేఖ నంపుట ♦—

క. అనినం జనకుం డౌనౌ
మునివర! నీచెప్పినట్లు పొనరించెద నేఁ
బనిచెద దూతల దశరథ
జననాథునిఁ దోడి తేర సచివులతోడన్. 183

వ. అని పుత్రమిత్రకళత్రపరివారపరివృతుండవై సీతారాముల వివాహం
బునకు రా నొప్పు నని దశరథునకు శుభలేఖ వ్రాసి యిక్షుమతీతీరం
బునందలి సాంకాశ్యపురంబున నున్న తమ్ముఁ డగు కుశధ్వజునిం
దేరఁ బుచ్చి సకలసంభారంబులు సమకట్టి శుభముహూర్త
నిశ్చయంబు చేసిబంధుమిత్రాదుల నెల్లం బిలువ బంచె నంత న
క్కడ దశరథుండు సకలపరివారపరివృతుండై వసిష్ఠవామదేవాదులం
బురస్కరించుకొని మహావైభవంబున మిథిలాపురంబున కరుగు
దెంచిన జనకుండు విశ్వామిత్రశతానందసహితుండై యెదురేగి
తోడితెచ్చి యొక్కనిశాంత భద్రోదవసితాభ్యంతరంబున విశ్రీ

మింపం జేసె నప్పుడు విశ్వామిత్రుండు రామలక్ష్మణులం దోడంబెట్టు
కొని దశరథునికడకుం జని పూజితుండై పుత్రులం జూపుచు 184

చ. నరవర! నీకుమారు లిదె నావెనువెంటన వచ్చి నాదున
ధ్వరము ను గాచి క్రూరు లగుదైత్యుల నెల్లర నుక్కడంచి ప్ర
స్తరమయియున్న గౌతమునితన్వి నను గహాదృష్టిం జూచి ము
క్కరణి నరేంద్రపుత్రికల గైకొన నుండిరి కొమ్ము వీరలన్ 185

వ. అంత రామలక్ష్మణులు మాతాపితృవందన మాచరించి, భరతశత్రు
ఘ్నులం గౌఁగిలించుకొని పరమోత్సవంబునం దేలుచుండి రప్పుడు
శతానందాదిమునిజనపరివృతుండై జనకుండు వసిష్ఠవామదేవవిశ్వా
మిత్రపరివృతుండై కొలువుదీరి యున్నపంక్తిరథునిపరిసరంబున కరిగి
సుముహూర్తంబెఱింగించె నప్పుడు వసిష్ఠుండుసూర్యవంశావతారంబు
బ్రహ్మదేవుఁడు మొదలుగా రామలక్ష్మణభరతశత్రుఘ్నులవఱకుం
గలవారి నెల్లరను క్రమంబుగ నెఱింగించినం శతానందుండు జనకరాజ
వంశావతారం బాకర్ణింపుం డాదిపురుషుండు నిమియనురాజు వానికి
మిథి. మిథిపేర నీపురంబు మిథిల యయ్యె మిథియె ప్రథమజనకుండు
వానికుదావసుఁడుపిదప క్రమంబుగా నందివర్ధనుఁడుసుకేతుండు దేవర
రాతుఁడు బృహద్రథుఁడు శూరుఁడు సుధృతి ధృష్టకేతుఁడు హార్య
శ్వుఁడు మరుఁడు ప్రతింధకుఁడు కీర్తిరథుఁడు దేవమీఢుఁడు విబు
ధుఁడు మహీధ్రకుఁడు కీర్తిరాతుఁడు మహారోముఁడు స్వర్ణరోముఁడు
హ్రస్వరోముఁడు వానికి జనకుఁడు కుశధ్వజుఁడు నను వీరిద్దరు పుత్రు
లని యభివర్ణించి. 186

## —♦ వివాహమహోత్సవము ♦—

చ. జనకుఁడు రాజ్య మేలుతఱి శౌర్యమెసంగ సుధన్వుం డన్నృపుం
డనిశము జానకిం దనకు నాలుగ నిమ్మని యాయకున్నం దాం
గినుకను దాడివచ్చి యనికిం దొరకొన్న నితండు వానినిన్
ఘనతరశస్త్రపాతమున గండడఁగించెం బరాక్రమంబునన్. 187

వ. ఇట్లు సుధన్వు నిర్జించి వానిపురం బగుసాంకాశ్యంబు వశంబుచేసి

కొని యందుకుశధ్వజుని రాజు గావించి ప్రతిష్ఠించెనపుడుజనకుండు దశరథుం దిలకించి రాజేంద్రా! నా ప్రథమపుత్రిక యగుసీతను నీప్రథమపుత్రుం డగురామునకును ద్వితీయపుత్రిక యగునూర్మిళను లక్ష్మణునకు నాతమ్మునిపుత్రిక లగుమాండవీ శ్రుతకీర్తులను భరతశత్రుఘ్నులకు నిచ్చి వివాహమహోత్సవంబు సేయ నెంచితి సుముహూర్తంబునకుఁ దరలి రం డని చెప్పి చనె నంత రామలక్ష్మణభరతశత్రుఘ్నుల నలువురనాల్గుభద్రదంతావళంబుల నెక్కించి సాకేతపురాధినాథుండు హిత పురోహితబంధుబృందంబును, నానావిధసేనాసమూహంబునుం బరివేష్టించి నడువ నేగుఁ బెండ్లి గావించుచు రాజమార్గంబునం జనునప్పు డప్పురాంగనలు రాజకుమారదర్శనలాలసలై రాజసదనోపరిజాలకంబు లావరించి రట్టిసమయంబున. 188

చ. అతివ యొకర్తు దిద్దుకొన నాయిత మయ్యెడు నంతలో ధరా
పతి చనుదెంచె నంచు విని వైభవ మారయుతత్తరంబు లోఁ
నతికినఁ దాలుమూలుపడ నాభరణంబులు మేనఁ దాల్చి యు
న్నతనిజసౌధ మెక్కెఁ గని నాతులు చేతులు దట్టబెట్టునన్. 189

చ. వడిగ గవాక్షకేగునొకవారిజలోచన కొప్పు వీడి మే
నడరఁగ గప్పినన్ మునువ నైనఁ దలంపక పోవఁ బెన్నెఱుల్
జడదము మేని తల్కుచపల ల్వీడి రాలెడుపూలు చిక్కులం
చడుగున నున్నవారలకు నాసమయంబునఁ దోఁచెనెంతయున్. 190

చ. చనియెడురామచంద్రుఁ డని చాన యొకర్తు పిఱుందుదోయి యున్
జనుఁగవ గొప్పునున్ నగలు చాల భరం బగుటన్ జవత్వ మొం
దినన సౌధమెక్కుటకు నేరనిచో మతి యూఁత సేసి తో
డ్కొనిచని చూపి తాను వడి డొల్లిపడెంబయియుండి రాముపైన్.

క. అందుఁ బురంధ్రీరత్నము
లందఱు మలెపూలు లాజ లక్షతలు మహో
నందమున దృష్టిదోషము
లెందగ రాఘవుల్లపై వడిన్ జల్లి రటన్. 192

## — సీతా కల్యాణము —

వ. ఇట్లు పురాంగన లెల్లం బరిపరివిధంబుల బడుచుండ రామచంద్రుండు హజారంబుకడ గజావరోహణంబు గావించి, మందగమనం బంగీకరించి, వందిసందోహసంకీర్తనంబును మాగధమధుర గానంబును, పాఠకగీతాపఠనంబును జెలంగం బుంఖానుపుంఖశంఖ భేరీమృదంగ వేణువీణాదినిస్వానంబులు రోదసీకుహరంబు నిండ రాణ లెసంగ మంత్రిసామంతాదులి రుగడం బరాబరులు సేయఁ బురంధ్రీరత్నంబులు నీరాజనంబు లిడి సేసలు చల్ల, నల్లనల్లన నడచుచు గృహప్రవేశంబుఁ జేసి, యెదనెదం గొన్నికక్ష్యాంతరంబులు దాఁటి, తోరణ స్తంభాయమాన రంభాకుంభినీరుహసంభృతంబును నిఖిలమణిగణ ఖచితకనకకలశాదిసముచితపస్తపరికరప్రభాభాసమానంబును పాణిపీడనక్రియారంభసంభారసంభ్రమ త్పురోహితహితముఖనిఖిలజన కలకలరవాలంకృతంబును నగుకౌతుకరమణీయభద్రోపవసితాభ్యంతరంబున మాణిక్యకలితమంటపంబున నధివసించె, నంత మిథిలేశ్వరుం డమందానందంబున నందనకు మంగళస్నానగౌరీపూజాదులు నిర్వర్తించి, కౌతుకవేదిపయిం దెచ్చి కూర్చుండం బెట్టె. భేరీమృదంగవేణువీణాది నిస్వానంబులును సకలజనకోలాహలరవంబులును వారాంగనానృత్యవిశేషణంబులును, నానావిధగాయనగానంబులును జెలంగుచుండ నవగ్రహంబు లేకాదశస్థానఫలంబు లొసంగ నెసంగు శుభముహూర్తంబున, ఝుళంఝుళత్కనకకంకణరవంబులు బోరుకలుగ. నంగనలు దెయ్యంట మంగళస్నాతుండై సాలంకృతుండై మణిగణఖచితపీఠికాతలంబున నాసీనుం డగువరుని శ్రీమహావిష్ణు స్వరూపునిగాఁ దలంచుచుఁ యథావిభవవిస్తరంబుగా నర్చించి,మధుపర్కం బొసఁగి పితృదేవతాప్రీతికరంబుగా ధారవోసి సాలంకృత కన్యాదానంబుఁ జేసె నంత. 192

శా. రారాజుల్ వినుతించుచుండ శుభతూర్యంబు ల్సెలంగన్ విదేహారాధ్యేశుఁడు కాళులం గడిగి కన్యాదానముంజేయఁ గా, శ్రీరాముండు పరిగ్రహించి శుభదృష్టిం బెండ్లియాడె న్వరాకారోపేత మఖోర్విజాత సుగుణౌఘస్ఫీత సీతం దగన్. 194

తే. వరుఁడు పాణిగ్రహణవిధి నెరపునపుడు
మరుఁడు మున్నేయ లోఁదూరివఱలుచున్న
ములుకు లెల్లను వెలికి రాఁ దలలు సూపె
ననఁగఁ బులకాంకురంబులు తనరెఁ జెలికి. 195

క. తెఱచీఱ లెత్త నైదువ
లిరువురు మోమును జూచి రింపుగఁ దలఁబ్రాల్
శిరముల నిడుకొని రంతట
వరు డామెను దాలెబొట్టు వలపునఁ గట్టెన్. 196

క. సతిపతు లప్పుడు దగ నా
హుతులన్ వేల్చి రరుణార్చిహుతభుఙ్ముఖమం
దతులితపలాశశాఖా
తతులం దధిలాజలన్ ఘృతంబున నంతన్, 197

క. వరుఁడు నవోఢాపాదము
కరమున గీలించి సన్నికలు ద్రొక్కించెన్
విరహార్తి నాకతంబున
నరయఁగ నా తప్పు సైపు మని తెలుపఁగ నాన్.

ఆ. మంగళంపుదివ్వె నంగన లిడునంత
మంగళార్థ మనుచు మగువ మగఁడు
నదె కనుండటంచు నార్యులు సూపఁ జూ
చిరి యరుంధతిని రుచిరగతముల. 199

వ. అయ్యవసరంబున. 200

—♦ జనకుఁడు రామునకంగుళీయకమిచ్చుట ♦—

చ. రతనము నిగ్గు లీనెడుకరండముఁనుండి జగత్ప్రసిద్ధికె
నుతులకుఁ దానకం బయి కనుంగొనవచ్చెడునంగుళీయకం
బతిరుచిరం బొకండు జనకావనినాథుఁడు తెచ్చి పెండ్లియై
స్థితిఁ గొనునల్లువానిచెయి చేకొని వ్రేలికిఁ బెట్టి యిట్లనున్. 201

మ. ఇది మాపూర్వులకున్ మహామహుఁడు లోకైకేశ్యభూరిప్రభా
వదళత్పాపుఁడు యాజ్ఞ్యవల్క్యుఁడు మహాప్రాగల్భ్యమున్ గల్గి చే

సి దయన్ జేకొనుఁ డంచుఁ గానుకగ నిచ్చెం దొల్లి యిం దెల్లసం
పదలం గూర్చెడు చిత్రముల్ జగములన్ వాసింగన న్వాసెడిన్.

వ. ఇట్లు లక్ష్మణున కూర్మిళను భరతునకు మాండవిని, శత్రుఘ్నునకు
శ్రుతకీర్తి నిచ్చి వివాహంబులు విధిదృష్టవిధానంబున నిర్వర్తించి,
కన్యావరులకుబహుశతసహస్రగణహస్త్యశ్వరథపదాతివర్గంబులును,
కంబళకౌశాంబరాభరణాదులును, దాసదాసీసహస్రంబును సువ
ర్ణమణిగణఖచితామూల్యాలంకారంబులు ముక్తావిద్రుమాదిమహా
రత్నసంచయంబులు నరణంబుగా నిచ్చి వియ్యముల నెయ్యమున
నాదరించుచు, ననేక చీనిచీనాంబరాభరణాదు లొసంగి మన్నిం
చుచు, నత్సమాగతు లగు బంధుమిత్రుల నెల్ల సత్కరించిమిథిలా
పురవల్లభుండు వారివారియిండ్ల కంపిపుచ్చి కృతకృత్యుండై సీతం
దొడఁబెట్టుకొని చేతిలోఁ జెయి వేయించి రాముని కప్పఁజెప్పుచు
పాదంబులు శిరంబు సోక మ్రొక్కు మని సీతయు. 203

—♦ జనకుఁడు రామునకు సీత నప్పగించుట ♦—

ఉ॥ చేతులు మోడ్చి వందనము చేయుచు వంగును గాని కాళ్ళపై
నాతటి సొదలం దగులు నట్టులు మ్రొక్కుట కిష్ట మింతయేఁ
జేతమునందు లేనటులుచేష్ట లెఱింగిన వార లై చెలుల్
సీతకు గర్వ మెచ్చనుచుఁ జెప్పకొనంగల వారలై రటన్॥ 204

మత్త॥ తా నయోనిజ భూమిపుత్రిక తన్ను మించినవారు వేర్
కానరారు రఘూద్వహుం డొకకాంతకుం బ్రభవించె నే
వీని కాళ్ళుల శీర్షముం చుట విధ్యయుక్తమటంచు ని
ట్లీనెలంతుక చేయుచున్నది యింత నిక్కువ మారయన్॥ 205

మ॥ తనుజాతన్ బ్రజ నిట్టులాడఁగ సుమేధాదేవి యున్ మైథిలుం
డును సీతం దరియంగ వచ్చి యిటు కూడుం బోజనుల్ నవ్వఁగాఁ
బానరింతే మిటులొప్పనే గరిత లీపోల్కిం బ్రవర్తింతురే
తనయా దాపక చెప్పు మమ్మ యనుచున్ దర్కించుచుంబల్కుచున్॥

తే. ఎట్టకే సీత వారల కిట్టులనియెఁ
భెంకితనమునఁ నే నిట్టు లంకెలి పడి

చేయుదానను గాను నాచిత్తమందుఁ
బెద్దభయ మొండుపుట్టె యీవిధ మొనర్తు॥ 207

శా. ఏపాదంబులు సోఁకినంతన వసిన్ వీక్షింప నొంటాయి స్త్రీ
రూపం బందెను మున్న మున్నె జనల్ రూపించి కన్గొన్నవా
రాపాదంబుల రత్నభూషణములన్ హార్యాదు నాశీర్షముల్
వ్యాపింపఁగఁ బొనర్ప నిష్టపడ సాపత్న్యాతిభీతాత్మనై. 208

వ. అనిన నెల్లరు నత్యంతహర్షంబు నొంది నీకంబ్రశంసించిరంత విశ్వామిత్రుండు నెల్లవారి నామంత్రణంబు చేసి హిమవంతంబు నకుం జనియెఁ గోసలేంద్రుండును వధూవరులం దోడుకొని వసిష్ఠ వామదేవాదులతోఁ బరివారపరివృతుండై కదలి కతిపయప్రయాణం బులు చేసె నప్పుడు. 209

—♦ మార్గమున భార్గవుఁడెదురువడుట ♦—

సీ. కడుపులోపలికోప ముడుగక తల కెక్కె
నా జటాపటలంబు నాట్య మాడఁ
గార్తవీర్యుని వేయికరములన్ వ్రెల్మిడి
నఱికిన గొడ్డలి యఱుత వ్రేలఁ
బగర నెదిర్చినపరు లిన్ని యన రుడు
రాక లిర్వదొకండు రహిఁ దలిర్పఁ
గొమరుసామిని గెల్చి కొనినవిల్ మెడలోన
బ్రహ్మసూత్ర మనంగఁ బ్రతిభ మెఱయఁ

తే. త్రిపురసంహార మొనరించు త్రిణయనుఁ డన
నెల్లజగము లేర్చెడుకాలకృష్ణవర్త్మ
యనఁ బ్రళయకాలమప్పటియముఁ డనంగ
మార్గమున కడ్డమై వచ్చె భార్గవుఁడు. 210

మ. భయదాకారముతోడ మార్గమున నీభంగిన్ యముండో యనన్
నయనద్వందసుగోచరుం డయినయున్మాలీకజన్మాభునిన్
రయ మొప్పన్ జమదగ్నిభార్గవునమర్యాదంబునం బోల్చి ని
ర్దయుఁ డీతం డని జంకి పంక్తిరథుఁ డత్యంతంబు భీతిల్లుచున్. 211

వ. వసిష్ఠుం జేరఁ బోటి ప్రణతుండై యితం డెవ్వండు వీనిం జూ
డఁ జిత్తంబు తత్తఱించుచున్న దన నతండు. 221

సీ. క్రౌంచదారణునితోఁ గయ్యంబు గావించి
విజయంబు గాంచినవీరవరుఁడు
తండ్రిమాటం జేసి తల్లిని వ్రేల్మిడిఁ
దఱిగివేసినయట్టిధైర్యశాలి
ముయ్యేడుమాఱులు మొనసిక్షత్రియజాతి
మొదలంటఁ గోసినమొక్కలీఁడు
నృపరక్త మంతయు నేడ్మడుంగులు చేసి
పితృతర్పణములు గావించినవ్రతి
తే. హైహయు నెదిర్చి వానిసహస్రకరము
లింతలింతలు చేసినహంతకారి
కశ్యపున కుర్వి పుడికినఘనభుజుండు
పరశురాముఁడు భృగుకులప్రభుఁడితండు. 213

మ. కరుణాహీనుఁడు వీనికాల్లఁ బడుచే కార్యంబు గా కన్యముల్
బరికింపంబడ వోరఘూద్వహ యిటుల్ బ్రహ్మణ్యుఁ డంచెంచుచుం
బరివర్త్యం బొనరింపు మర్ఘ్య మిడుచుం బాద్యంబు గావించుచుం
గర మర్థింపుము రమ్ము నావెనుక జంకం బోక శంకించుచుం. 214
వ. అనిన దశరథుం డర్ఘ్యపాద్యమ్ములు గొని పరశురాము నెదుర్కొ
లుచేసి యభివందనం బాచరించిన నతండు వాని నాదరింపక రామ
చంద్రున కభిముఖుండై చని. 215

—♦ శ్రీరామ పరశురాములసంవాదము ♦—

శా. నీవా? రాముఁడ వేన రాముఁడన యోరి! నేఁడిబీరట్లు లె
తే! వీరుం డవ యేని ర మ్మతివ నార్తిం జంపుటల్ గాదు వో
దేవేంద్రాదినుతప్రభావవిలస త్తీక్ష్ణస్వధిత్యుద్భవ
త్వావేశప్రతిపన్నశౌర్యనిధి నాదండం బ్రవర్తిల్లుటల్. 216

చ. చివికినప్రాంత వి ల్విఱిచి చివ్వల నే మొనగాడ నందు వీ
వవ్వొక్కరా! మదీయ మయి హార్వగు వైష్ణవధన్వ మిద్ది నీ

వపువనఁ జేత నొప్పు మపు డాపురుషోత్తముఁ డీ తఁడంచు నీ
భువనము లెల్ల నిన్ దెలిసి పూజ యొనర్చెడు రాచబిడ్డఁడా. 217

చ. ఇరువదియొక్కవారము లహీనపరాక్రమవిక్రమంబునన్
ధరఁ గలక్షత్రియాన్వయులఁ దామరతూండ్ల మదావళంబునా
విరవిరవోవఁ ద్రెంపితిని వీరవరేణ్యుఁడ న న్నెఱుంగవే
పరశువుఁ జూచియే నిపుడు పాఱ గనుంగొను మోరియర్భకా. 218

క. అన విని రాముఁడు మ్రొక్కుచు
వినయంబున నతనిఁ దరిసి విని యుంటి నినున్
మునివర! క్షత్రియజాతిని
గనికర మిసుమంత లేక కడ తేర్చి తయో. 219

తే. భూసురుల కెల్ల శాంతి విభూషణంబు
తాత కపచార మొనరించె ఘాతుకుఁ డొకఁ
డందునన్ జాతి నాశయు నడఁచు టరయఁ
దగు ననుచుఁ జెప్పుకొం టది తగవ యగునె. 220

ఉ. తాటక సర్వలోకులకుఁ దాపముఁ గూర్చెడుదుష్టయై త్రియా
మాటకులంబునం బ్రబలునట్టి దటం చునెఱింగియుం జెయేఁ
బోటరి నైన వధించితిని బో యది తల్లి యటం చెవండు నే
మాట యొకొం డు చెప్పిన నను స్మృతిఁ జేసి భజించి రానొకో. 221

తే. చిఱుత నామీఁదఁ గోపము చేయ నేల
హారునిధను వేను విఱిచితి నయియు నేము
కాదు చేముట్టినంతనే కార్ముక మది
విఱిగెఁ దప్పైన క్షమియింప వేఁడుచుంటి. 222

తే. నాఁడు నాతండ్రి కడ కీవు వేఁడుక మెయి
వచ్చి నసుఁ జూచి నాపేరు వత్స కీవు
పెట్టు మని చెప్పి తఁట దాన పేరు వచ్చె
రాముఁ డని ఘృతకోశమే దామ చెపుమ. 223

క. నావుఁడు భార్గవుఁడను నీ
వీవిధమున మెత్తనగ వహించినమదితో

వావాదు లాడుచుండిన
నే రిని సైరించి యుందునే నృపతనయా. 224

క. ఇదె నాదుగంభ్రడగోడ్డలి
పదునెక్కి జ్వలించుచుండె బహుభద్రముగా
నోదలించు కొనుము కంఠం
బిది ప్రతికూలంబు నీదుహితులకు నీకున్. 225

శా. శ్రీరాముం డను భార్గవాన్వయమణీ! చిత్రాంశువంశోద్భవుల్
వీరాగ్రేసరు లైన నెప్పుడును గో విప్రౌఘమును జంపఁ గా
నారంభం బొనరింప రందునను నే నాశింప ని న్నోర్వ నీ
వో రా ర మ్మిదె నాగళంబు దునుమన్ యోగింపు మాగొడ్డలిన్. 227

వ. అనిన భార్గవరాముండు.

ఆ. మాట చులుకు గాని మనము మెత్తన విప్ర
జాతి కిద్ది క్షత్రజాతియెడల
మాఱి యుండుఁ గాన మాటలు మెత్తగా
నడపుచుంటి నీదునెడఁద కలుకు. 228

తే. వెదకి క్షత్రియ జాతిని నదచుదంబు
సలుపునముఁ జూచి భయమున క్షత్రియుఁ డగు
కౌశికుఁడు జంకి బ్రహ్మత్వకాంక్షి యయ్యె
ననఁగ నే నెంతవాఁడనో యనఁగ వలెనొ. 229

ఉ. నావుడుఁ గోపగించి రఘునందనుఁ డిట్లను నింత మున్ను న
న్నీ వెటు లన్న సైఁచితిని నే నిపు డిట్లు మదీయదేశికుం
గావలి మెచ్చ నాడిన నిఁక న్మది సైఁపగ నోప భార్గవా!
నావడి లావు చేవయుఁ గన న్మది చేసితి వేని చెప్పుమా. 230

వ. అనినఁ బరశురాముండు. 231

—♦ శ్రీరామునకు పరశురాముఁడు ధనువుతో వైష్ణవతేజంబొసంగుట ♦—

చ. ఘన మగు శైవచాప మది ఖండములై పడఁ జేసినాఁడ నే
ముని యితఁ డేమిచేసెడిని బో యనుగర్వము నీవనంబున
న్గనుఁగొన వచ్చెడిన్ బలిమి కాఁడన యేని మదీయచాపముఁ
గొనకొని మోపు చూత మిదిగో నఁ చేతికి నిచ్చెఁ జాపముఁ.

వ. ఇచ్చినం బుచ్చుకొని శ్రీరామచంద్రుండు. 233

శా. ఆకర్షించి తదీయవైష్ణవమహేష్వాసంబుఁ దత్తేజమున్
లోకం బెన్నఁగ నెక్కువెట్టి త్రుటిలో లోలోన సంతోషమున్
గైకొంచు న్వడి మౌర్విఁ బట్టి రవమున్ గావించుచుండ న్నమో
వాకంబున్ ఘటియించి భార్గవుఁ డనుం బ్రస్తావముం జేయుచున్.

ఉ. ఈవు పురాణపూరుషుఁడ వే మును నిన్ను నెఱుంగుదున్ జగ
ద్భావితభక్తియుక్తిని దపం బొనరించెదు నాఁడు పొల్పు ల
క్ష్మీవరుఁ డిచ్చు నాయెడలఁ జేరిచి వైష్ణవ తేజ మీవిలన్
గావరులన్ వధించెదవు గావుత మంచు వచించి వెండియున్. 235

ఉ, నే రఘురాముఁడై ధర జనించెద నప్పుడు నాదు తేజమున్
జేరినదా కొసంగు మని చెప్పుటచే నిటు కార్ముకంబుతోఁ
గూరిచి నీదు తేజమును గోరిక లీరిక లెత్త నిత్తఱిన్
జేరిచి నాఁడ నీ కిదిగొ చేకొన వేఁడెద జానకీపతీ. 236

వ. మఱియు ముయ్యేడుమాఱు లీరాజలోకంబు శోధించి శోధించి సం
హరించునప్పుడు నాతల్లి రేణుకాదేవి చెప్పుటం జేసి మాతామహ
సంబంధంబగు నిక్ష్వాకువంశంబు మాత్రము కాచిపుచ్చితి నిదె. నే
లోకంబునం జేసిన కార్యం బింక నీకార్యంబు బహుభరంబు గా
వున నా తపం బెల్ల నీకు ధారవోయుచుంటి నన జలంబు విడిచి
దేవా! నీ కింక దుష్టసంహారంబు గావించి శిష్టులం బరిరక్షింపు
మని మఱియు. 237

తే. భూభుజుల గెల్చి తెచ్చిన భూమి యెల్లఁ
గశ్యపున కిచ్చితిని నీ విఁకన్ ధరిత్రి
సలుపఁ దగు కర్జములు పెక్కు గలవు గాన
నీదు విల్లును తేజము నీ కొసఁగితి. 238

ఉ. సజ్జము చేసి విల్లులుగు సంధిలఁ జేయుట పోలుఁ గావునన్
మజ్జనకున్ వధించితిని మానవనాథుని శిక్ష నొందినన్
మజ్జన మాచరించెదిని మామక దోష మదెల్ల గాళ్లపై
బుజ్జవ మాఱు వేయుమని బోధముసేయ రఘూద్వహుం డొగిన్. 239

వ. సజ్జితంబగు వైష్ణవచాపంబు దిగిచి రెండుబాణంబులొ రాముని
పాదంబులం బడనట్లు పల్లనమై చి నమస్కరించిన నతండు శ్రీరా
మునకుం బ్రదక్షిణంబు గావించి వశిష్ఠాదులకుం జెప్పి మహేంద్ర
పర్వతంబునకు నిర్గమించె నంత. 240

—♦ ముద్గలుండు దర్శనమిచ్చికొన్న విశేషంబు లెఱింగించుట ♦—

తే. అపుడు ముద్గలమౌని శిష్యప్రశిష్య
సహితుండై రామచంద్రుని జానకిం గాని
తేరఁ జేరియుఁ [illegible]
జనుచునుండె నయోధ్యకు నని యెఱింగి. 241

వ. వారిం గాంచి యభినందించు నిచ్చనై మార్గమధ్యంబున నెదురు
పడినం గని దశరథుండు వసిష్ఠపురస్సరంబుగా వాని నెదుర్కొని
తోడితెచ్చి యర్ఘ్యపాద్యంబు లిప్పించి యున్నంత ముద్గలుండు
దశరథునిం గాంచి యిట్లనియె. 242

ఉ. నీవు కృతార్థసమ్మదవు నిన్ను నుతించిన నెట్టిగాని యే
దేవుని నే నుతింపఁదగు దివ్యమహాత్మ్యము నీదుబొజ్జలో
నీవరునం జనించె జగమెల్లను ధన్యము మాన్యమయ్యె నో
భూవర నిన్ను మెచ్చుటకుఁ బోఁ చనుదెంచితిఁ దత్పరుండనై, 243

క॥ నీకుం గొడుకగు రాముఁడు
లోకారాధ్యుండు విష్ణులోకమునందుఁ
బ్రాకామ్య మొంది యుండెడు
వైకుంఠుం డిట్లు పుట్టె వసుధం బ్రోవన్. 244

ఆ. వసుధ నితఁడు చేయవలసినకార్యముల్
పెక్కుగలవు వానిఁ బేర్కొనంగ
నైతికాదు వెనుక నన్నియుఁ జగతికిఁ
దేటతెల్ల మగును తెలిసి కొనఁగ. 245

వ. అనినం బ్రత్యర్థుండు దేవా! మారామునిభావిచరిత్రము విన నెం
చితి యించుక వివరించి చెప్పు మనిన నతం డతని కిట్లనియె. 246

శా. సాకేద్విష్ణువితండు ధర్మమును సంస్థాపించి ధర్మాత్ములన్
రక్షించున్ ప్రభువై సమస్తవసుధారాజ్యంబు పాలించు బ్ర

త్యుతుండై పదునొండువేలుసమ లత్యంతప్రభావంబునన్
రఘోవంశము లెల్ల వీనివలనన్ రాధాపులం బొందెడిన్. 247

వ. మఱియు నితనికి నిద్దఱుకుమాళ్ళు నల్వురుకోడండ్రునిరువదినల్వురు మనుమలును బన్నిద్దరు మనుమరాండ్రును నవల నసంఖ్యాకులగు మునిమనుమలు లోనగువారు గల్గుదు రితండు సర్వసౌఖ్యంబులను భవించుచుఁ బెద్దకాలంబు ధరిత్రీతలంబునఁ జక్రవర్తియై దీపించుచుండి పిమ్మట బరంధామంబు నొందు నని చెప్పి ముద్గలుండు రామచంద్రు నభినందించుచుఁ జనియె నంత సకలపరివారపరివృతుండై పుష్పకరథం బయోధ్యాపురిం జేరఁ జనియె నప్పుడు. 248

—♦ పతిరథుండు పరివారంబుగా నయోధ్యం బ్రవేశించుట ♦—

సీ. నగరంబు నల్గడఁ దగురీతి సమ్మార్జ
నము జేసి పన్నీట నానఁ జేసి
పచ్చనితోరణాల్ భవనాళికిం గాక
నెల్లభాగంబుల నెనఁగఁ గట్టి
ప్రతివీధియందును భటసమూహము నిటు
నటు పాతిపెట్టినయట్లు నిలిపి
అడుగడుగునకు మంగళారతుల్ చేయూని
పుణ్యాంగనలు నిల్వఁ బోవాళించి

తే. అగరు పన్నీరు లత్తరు లందు నందుఁ
జల్లి సాంబ్రాణి ధూపముల్ చెల్లఁజేసి
ప్రజలకెల్లరకును గన్నుపండు వగుచు
రమణ మీఱంగ సేసి రారాచవీథు. 249

వ. అట్లలంకృతం బైన రాజధాని నానావిధ వాద్యంబులు ఘోరు కలుగ స్వస్తి పుణ్యాహవాచన పురస్సరంబుగఁ బ్రవేశించి రాజ మార్గంబున నేగు బెట్టిం జేయుచు మందగమనంబునం జని చని హజారంబు కడ నందఱు వాహనంబులు డిగ్గి యల్లన లోనికిం జని భూసురాశీర్వాదంబులతో నూతన వధూగృహప్రవేశంబు గావించి నంత వసిష్ఠ వామదేవాదులును దక్షిణ బంధువర్గంబును వారివారి

విడిదలకుం జని రంత రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు తల్లి దండ్రులకు సాష్టాంగ నమస్కారంబు గావించి తదనుమతంబునం దమతమ గృహంబులకుం జని రంత దశరథుడు భరతుం బిలిచి తండ్రీ! నీ మాతామహుండగు కేకయుండు నిన్ను జూడంగోరి నిన్నాహ్వానించుటకు నీమేనమామయగుయుధాజిత్తుబుచ్చె నూతన వధూగృహప్రవేశ మైన వెనుకం బంపుదు నంటి నతండువచ్చి వేగిరించుచున్నవాడు కావున నీవు వానితోడం బోయి రమ్మనిన నతండు తండ్రి యాజ్ఞ రామునకుం జెప్పి తదనుమతిం గొని శత్రుఘ్నునితో మేనమామనంటి రాజగృహంబునకుం జనియె నంత నిక్కడ రామచంద్రుండును. 250

—♦ రామచంద్రుని నిత్యకృత్యములు ♦—

సీ॥ అరుణోదయమునఁ బ్రాహ్మము మేల్కాంచి
కాల్యకృత్యంబులు కడకఁదీర్చి
పరివారయుక్తుఁడై సరయూనదికి నేగి
స్నానసంధ్యాదులు సంతరించి
సావిత్రి జపియించి సైకతస్థలి నుండి
బ్రహ్మయజ్ఞ మొనర్చి బ్రాహ్మణులకు
వరదానము లొనర్చి మరలి గృహము సేరి
యౌపాసన మొనర్చి యగ్ని గొలిచి.
తే. స్ఫటిక లింగార్చన మొనర్చి జననిపూజ
గోవుపూజయు గావించి కోర్కిమీర
దివ్యమాల్యాంబరంబులు తీరి తాల్చి
ముగురు తల్లులకును మ్రొక్కి నగరువెడలి. 251
తే. అవల నొడ్డోలగంబున కరిగి తండ్రి
యండఁ గూర్చుండి రాజకీయముల పాలు
గొనుచు నభియోగములు తీర్పులును గ్రహించి
తండ్రితోఁ గూడి యిలుసేరి తాన మాడి. 152

వ. మాధ్యాహ్నికకృత్యంబు లొనర్చి దేవతార్చనంబును వైశ్వదేవంబును గావించి భోజనానంతరంబున నించుక విశ్రమించి విద్వాంసు

లతోడ విద్యాగోష్ఠిం దగిలి గురు ముఖంబున పురాణశ్రవణంబు
జేసి పొద్దు వ్రాలఁబడినంతఁ దమ్ములంగూడి బాహ్యోద్యాన ప్రదే
శంబుల వాహ్యాళి సలిపి వచ్చి సంధ్యవార్చి శివదర్శనంబు గావించి
భోజనానంతరంబున సత్కాలక్షేపంబుగా సుఖనిద్రం గావించు
చుండు. భరత లక్ష్మణ శత్రుఘ్నులను నన్నివిధంబుల నన్న ననుస
రించుచు పితృవాక్యపాలనాయత్తచిత్తులై ప్రవర్తించుచుండి రప్పు
డు దశరథుండును మహోత్సాహభరితుడై చతురంబోధిపరీత
భూతలం బంతయు నేకచ్ఛత్రాధిపత్యంబుగఁ బూజ్యసామ్రాజ్యం
బేలుచు సుఖంబుండె నని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాం
తంబు చెప్పుమని సూతునడుగుటయును. 253

ఆ శ్వా సాం త ము

సీ. చతురాననాది నిర్జర సంఘసంప్రార్థ
నంబున జగతీతలంబునందు
నశ్వమేధాధ్వరి కాదశరథునకు
విమల కౌసల్యాగర్భమునఁ బుట్టి
తాటకాదులఁ గూల్చి మేటియై కౌశిక
యాగ సంరక్షణ మాచరించి
పాషాణమై కానఁబడి యున్న గౌతమ
పత్ని శాపము వాపి పడఁతిఁ జేసి
తే. శివధనుర్భంగ మొనరించి సీతఁ బడసి
తల్లి దండ్రులతోడ సోదరులతోడ
సౌఖ్యముండెడు శ్రీరామ చంద్రమూర్తి
శ్రేయములొసంగి వేంకటరాయునోము. 254

గ ద్య ము

ఇది శ్రీమహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజకవిసార్వభౌ
మాంధ్రవ్యాసాభినవశ్రీనాథ వేదవిద్యావిశారద
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబగు
శ్రీకృష్ణరామాయణంబునందు బాలకాండమునఁ
చతుర్థాశ్వాసము శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# శ్రీకృష్ణరామాయణము

## అయోధ్యాకాండము

### ప్రథమాశ్వాసము



క. శ్రీమద్ధేలాపురమునఁ
ప్రేమించి వసించి శ్రితులపెన్నిధియై ని
త్యామోదంబున నొప్పెడు
శ్రీమహితుఁడు సుబ్బమాంబప్రియుఁ డింపొందున్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె. నట్లు దశరథుండు
పుత్రమిత్ర కళత్రబంధుబృందంబులును మంత్రిసామంతాదులును
గొలువ వసిష్ఠవామదేవానుమతంబునఁ బ్రవర్తించుచు సర్వ
ప్రజానురంజనంబుగ రాజ్యపాలనంబు గావించుచున్నసమయం 2
బున రామచంద్రుండు.

తే. తండ్రియాజ్ఞను మీఱక తల్లు లంద
ఱకును దలలోనినాల్కనా నకలుషమతి
సంచరించుచుఁ బ్రజలకు సంతతేష్టుఁ
డగుచుఁ దత్ప్రీతిపాత్రమై తగియె నపుడు. 3

ఉ. ఆతనిసుస్వభావమున కమ్మలు నబ్బయు నెల్లబంధువుల్
ప్రీతి వహించి యుండు టొకవింతయె కాదు ధరాతలంబునన్
భీతికిఁ గానిమానిసి వివేకులలో నొకరుండు నే హితా
ద్రీతినిఁ జూచినం గలఁ డిదే యని చెప్పఁగఁ జాల రెవ్వరున్. 4

ఉ. రాముఁడు శౌర్యలబ్ధగుణరాముఁడు సువ్రతకాముఁడై ప్రజా
స్తోమసమంచితం బగువిశుద్ధచరిత్రము గల్గి తండ్రికిం

ప్రేమకుఁ దానలం బగుచుఁ బేర్మిని మించి కుమారశేఖరుం
డై మహిమోన్నతిం గనియె నయ్యెడ నెయ్యము తియ్య మేర్పడన్

—♦ దశరథుఁడు రామునకుఁ బట్టాభిషేకము చేయ నెంచుట ♦—

మ. యువరాజా రఘురామచంద్రుఁడు సమస్తోర్వీతలాధీశుఁడై
సవిమర్శంబుగ రాజ్య మేలుటకు లో సామర్థ్యముం గల్గిసూ
రివరేణ్యుం డయి భూప్రజేష్టుఁ డయి కీర్తింపంగ నై యుండుటల్
భువనాధీశ్వరుఁ డైనపంక్తిరథుఁ డాలో నెంచి చిత్తంబునన్. 6

మ. మనువంశంబున మానవేంద్రుఁ డయి జంభద్వేషిసఖ్యంబునన్
ఘనకీర్తిం గొని శౌర్యసారమున లోకంబందు రారాజులం
దు నెఱుంగాంచి సవంబులన్ సలిపి సత్పుత్రాప్తిసంతోషముం
గొని వృద్ధుం డయి యున్ననాకు జని పేర్కొ నయ్యెడున్ ధన్యమై.

ఆ. ఎల్లవైభవముల నేను బొందితి నింక
నితర మైనకోర్కు లేవి లేవు
ప్రజలకిష్టుఁ డైన ప్రథమ పుత్రుని రాజుఁ
జేసి పోవు టొకఁడు చేయ నుండు. 8

వ. అని సుమంత్రప్రభృతులం బిలిచి. 9

మ. పరమానందము నొందు డెందమున భూపాలుండు సంతోషమున్
సొరిదిన్ జెప్పమ సతు ... శో ... బీరశ్రం
బరఁగుం బుష్యమి పుణ్యయోగ మనుచున్ మారాముని న్ యువరా
జ్యరమాధీశునిఁ గాంచ నర్చెదము తత్సంభారముల్ కూర్చుఁడీ. 10

వ. వారి యనుమతంబున వసిష్ఠాదుల నామంత్రించిన వారు నీసంక
ల్పంబు సర్వోత్తమం బని పట్టాభిషేకముహూర్తంబు పంచకరహి
తంబు గావించి రక్కాలంబున నారదుఁ డొరు లెఱుంగకుండ శ్రీ
రామచంద్రునకు దర్శనం బిచ్చి యిట్లనియె. 11

—♦ శ్రీరామునకు నారదుఁడు దర్శనమిచ్చుట ♦—

శా. రాజై పుట్టినవాఁడు రక్షికొరకే రాజ్యంబు పాలించుటన్
దేజం బందెను జేసిధర్మ మనుచున్ దేవళ్ళ భావింప రో

రాజేంద్రాత్మజ! దేవతాంశభవుఁడై రాజిల్లునీ పూర్వరా
రాజత్వంబున నైజధర్మవిముఖారంభంబునం బోకుమా. 12

ఉ. దుష్టజనావళిం దునిమి దోర్బల మేర్పడ భూతలంబునన్
శిష్టులఁ బ్రోచుచుండు టది చేయఁ గల్గినది నీదుకార్యమై
స్పష్టపడున్ దురాసదులు పంచజనుల్ ఖలు లుండి రందులోఁ
గష్టుఁడు రావణాసురుఁడు కారియపెట్టుచునుండె లోకమున్ 13

తే. రాజ్యభారము పైఁబడ రాక మున్నె
దేశసంచార మొనరించి దేవవైరు
లైనవారలసంహార మాచరించి
జగతి రక్షింపు మని చెప్ప సాహసింతు. 14

తే. విభుఁడు నినుఁ బట్టభద్రుఁ గావింప నుండెఁ
గైక సుతు రాజుఁ జేయు మన్ కేకయునకు
నిచ్చె నుంకువ మఱచి యి ట్లిట్లు దీని
మీఁద నే దెట్లు వచ్చునో మేలుకొనుము. 15

వ. నేను బోయివచ్చెద నిది దేవరహస్యం బని చెప్పి రామచంద్రుని వీడ్కొని నారదుండు తిరోహితుం డయ్యె నంతఁ బత్తిరథుండు పురాలంకారంబు గావించి పట్టాభిషేక సంభారంబు లెల్ల సమకట్టించె నయ్యవసరంబునఁ గైకదాసి యగుమంథర రామునిపట్టాభిషేక మహోత్సవసంరంభంబంతయు నెఱింగి దేవతాప్రేరణఁజేసివానిసైరింపం గక కైకకడకుం జని దీనవదనయై విచారం బభినయించుచున్నం గని కైకేయి దానిం గాంచి యి ట్లనియె. 16

ఉ. మందర! నీముఖం బిపుడు మాడినతామరసంబువోలెఁ బో
ల్పొందదుఁ జింత యంతయుఁ దలంపఁగ మూర్తమునొందెనోయనన్
గందుగఁ గాన వచ్చెదవు కారణ మేమొ యెఱుంగఁ జాల నీ
చందము వింతయై యిపు డెసంగెడు నిక్కము చెప్ప నొప్పెడిన్. 17

క. నావుడు మందర యి ట్లను
దేవీ! యే మనుచు నీకుఁ దెలుపుదు నిఁక నా

* మందర * అని రూపాంతరము.

దేవియు సుతుఁడును మిక్కిలి
దేవురుపడ నట్టిచెడ్డదిష్టము వచ్చెన్. 18

వ. అనిన గడగడవడంకుచుఁ గైక యి ట్లనియె. 19

తే. ఏమి యి ట్లనుచుంటి నీమోముఁ జూడ
బీతు వొడకట్టుచుండె నోనాతి నాకు
నాసుతుని కెట్టియిక్కట్టు నే సమకుటు
నోటు చెప్పంగదే కొంకుపాటు విడిచి. 20

వ. అనిన మందర డెందంబునం గుందుచు ని ట్లనియె. 21

శా. అయ్యో దయ్యము నెత్తికోలు విషమంబై యుండె నీపట్ల నే
వెయ్యాలుల్ వచియింప నేమిటికి దేవీ నీదుదౌర్భాగ్యమున్
సయ్యాటం బ్రకటించె నీకుఁ గడెదం సర్పంబునా భీషణం
డయ్యె న్నెయ్యము సూపు మీఁది కిది నీ కంతర్విలాతం బెంతయున్

క. నీమగనికి నీమీఁదన్
నీముద్దులపట్టిమీఁద నెన రిసుమంతే
నీమెయి లే దని తెలిసెడి
నేమందుం దత్ప్రకార మిపు డోతల్లీ. 23

ఆ. పట్టమహిషి యగుచు భావించి కౌసల్య
నామె గన్నబిడ్డఁ డైనరామ
భద్రు నాదరించువాఁ డయ్యె నీమగం
డేమి చెప్పవచ్చు నిపుడు తల్లి. 24

చ. అనవుడుఁ గైక యి ట్లనియె నట్లనఁ బోకుము మమ్ము ముగ్వురన్
మనమున నొక్కమాదిరిగ మానవనాథుఁడు చూచు నందులో
గనుఁగొన నాపయిం గరుణ గాటముగా నగు నంచు నేను నీ
జనులు దలంచుచుందు మిటఁ జానరో! నీనుడి సత్యదూరమే. 25

వ. అనిన మంథర మఱియును, 26

ఆ. ఈవు వెట్టితల్లి వింతయు నెఱుఁగ వి
ల్లలుకఁ బండు వనుచు నాత్మ నెంతు
దేవి యనుచుఁ బైకి దియ్యఁగా మాటాడుఁ
దేనె పూసినచురి నీన్నృపమణీ. 27

ఉ. చెప్పెద నాలకింపు మిటు చిత్తమునం గలజాడ్య మెల్ల నీ
విప్పుడ యైన వీనుము మహీపతి రాముని బట్టభద్రుఁ గా
నొప్పెదునట్లు చేయుటకు నుల్లము చేసెఁ గ్రియాకలాపముల్
చొప్పడె నన్నియుం బురము శోభనలీల నలంకృతం బగున్. 28

ఉ. రాముఁడె పట్టభద్రుఁ డయి రాజ్యముఁ బూనిన నీవుఁ బుత్రుఁడున్
రామునిఁ గన్నతల్లికిని రాముని కూడిగముల్ పొనర్ప నై
భూమిని గట్టువాల్తనముఁ బొందినవారయి కుందకుందురే
నేమఱియున్ వచింపవలెనే వినకుండె సపత్నిధర్మముల్. 29

వ. అనిన హరస్మరణంబు సేయుచుఁ జెవులు మూసికొని కైక
మంథరం గర్హించుచు నిట్లనియె. 30

—♦ కైక మందరను గర్హించుట ♦—

శా. సీ సీ సీ! యిటు లాడ నీమనమునన్ సిగ్గింతయున్ లేదొకో
కౌసల్యాసతి నన్ సపత్నిగతి యేకాలంబునం జూడఁ బో
దేసన్నం బగునంశమైన విన నాకే చెప్పు నన్ దన్నుఁ గా
నే సూచున్ మును నాకుఁ బెట్టి తినుఁ దా నెప్రొద్దు నే దేనియున్ 31

ఆ. రామచంద్రుఁ డామె నేమాడ్కిఁ దల్లిఁగా
ననుచుఁ గొలుచు నట్లు నను సుమిత్రఁ
గన్నతల్లు లంచు గారవంబునఁ గాంచి
కొలుచుచుండు నెపుడు గుణి యతండు. 32

ఉ. తమ్ము లనంగ నాతని కెదం గలవత్సలత స్వచింప లే
మున్నమహీతలాత్ముఁ డయ్యనుజు లందఱికిం బెను పెద్దతమ్ముఁడుం

చెమ్మెయి మీఱ నాభరతునే కనుచుండును వానికై శరీ
రమ్మది యైనఁ బీడు నలరాముని వేటొకరీతి నెంతురే. 33

తే. రాముఁడు గుణాభిరాముఁడు రాముఁ డగ్ర
పుత్త్రుఁ డాతఁడు రా జయి భూతలంబు
నేల నగుఁ గానిమఱియెవ్వఁ డేల యర్హుఁ
డగు యథాన్యాయపథ మిది యగును గాదె. 34

ఉ. నాకును నీకు లోకులకు నాకులకున్ ముద మిద్ది యిట్టిచో
వాకొనె దేల దీన మగువాకులు పోకలు దుఃఖభావమున్
గైకొనె దేల నీ విటులు కానిపథంబును బట్టిపోవుటల్
నీకిసుమంతయుం దగదు నిందలపా ల్పడఁ బోకు మంథరా. 35

తే. అనిన మంథర యనియె నోయమ్మ! కన్న
ప్రేమకన్నను బెంచినప్రేమ పెద్ద
యనుట నే నింతగాఁ గొట్టుకొనుచు నుంటి
భరతునకుఁ గాఁగ నే నింత పరితపింతు. 36

చ. ఇదియును గాక ని న్నిచటి కిచ్చెడు నప్పుడు నీదుతండ్రి తా
మదిఁ గలకోర్కె పెంపునను మాసుతకుం బ్రభవించినట్టివా
నిద యగునేని రాజ్య మది నిన్ను గ్రహించెద నల్లువానిఁ గాఁ
దదితరచింతయే నిడసుతన్ జను మిద్ది వ్రతంబు నాకడన్. 37

క. దానికి నొడఁబడి దశరథుఁ
డీనిన్ను గ్రహించె నిప్పు డిటు వోయినచో
నానీదుతండ్రిచిత్తం
బేనెటి దుఃఖించునో కదే కైకమ్మా. 38

—♦ దేవప్రేరణంబున గైకబుద్ధి మాఱిపోవుట ♦—

తే. అవల నయ్యాజప్రేరిత యైనవాణి
కైకహృదయంబునం జొచ్చి కప్పెఁ బొంటి

బుద్ధినంతయు నంతలో బొలఁతి మదికిఁ
జెప్పలేనంతయావేశ మప్పు డొదవె. 39

వ. దానం జేసి తొంటివిజ్ఞానంబు వీడ నజ్ఞానంబున. 40

తే. మంథరా! యేమిచెప్పుదు మానవేంద్రుఁ
డిపుడు నన్నును నాసుతు నివలఁ ద్రోచి
పెద్దపెండ్లాము నాయమపెద్దకొడుకు
నాదలం బెట్టుకొనుచుండు నందు వేమొ. 41

చ. అగు నగు నీవుచెప్పినటులౌ నవు నాదుసపత్ని యిప్పుడీ
తగవున నున్న రా జగుచుఁ దత్సుతుఁ డుండిన యప్పు డిగ్గతిఁ
దగుచు మెలంగు నంచు నెడఁదం దలపోయఁగరా దటంటయే
తగ వను చెంచుమార్గ మని తప్పక నేనును విశ్వసించెదన్. 42

ఆ. తండ్రిమాట నీవు తలపెట్టితివి మంథ
రా! తదీయమానసాంతరమున
నుండుకోర్కి చెల్ల నొప్పుగా కే నొండు
తగవు తలఁచుచుంట తప్పు తగదు. 43

క. నీమదినా మది యొక్కటి
యై మహితం బయ్యె నిట్టి యవసరమున నో
హో మంథర! తగుమార్గం
బీమెయి స్ఫురియించె నాకు హిత మగు నీకున్. 44

ఆ. అనుడు దాసి యనియె నానాఁడు నీ కిచ్చె
రెండువరము లీశ్వరుండు వాని
నడుగు నీదునాత్మజుఁడు రాజుగా రాముఁ
డడవి కేగియుండునట్లు గాను. 45

వ. అనినం గైకేయి నాకు నిదియె తోఁచినది నీవు పొమ్ము నేను దగు
నట్లు ప్రవర్తించెద నని దాని నంపి పుచ్చె. 46

—♦ కైక వరద్వయం బిమ్మని యడుగుట ♦—

ఉ. మాసినచీఱఁ గట్టుకొని మానికపున్నగ లెల్ల నల్లనం
దీసి శిరోజముల్ విఱిసి దిక్కులు గప్పఁగఁ జేసి నెత్తికిన్
వాసెనకట్టు కట్టుకొని పక్కయు గిక్కయు లేక నేలపై
రోసము దుఃఖమై తెలియ రోదనముం బచరించునట్టిదై. 47

తే. ఉండినపు డచ్చటికిఁ బార్థివుండు వచ్చి
కాంచి యిది యేమి యి ట్లుంటి కాంచనాంగి
యెవ్వ రేయపచారము నిట్లు చేసి
యుండిరో చెప్పు నేఁ దీర్పు నున్నవాఁడ. 48

క. నీకుం గాదని నే నొక
పోకంతయు మాఱుపుంతఁ బోయి యెఱుంగన్
నీకై ప్రాణము లైనను
వాకొన కే విడువనుంటి వారిజనేత్రా. 49

వ. అనిన విని మోముపై నున్నముసుంగు తీసి కొని కంట నీరు వెట్టు
కొనుచుఁ గైక యి ట్లనియె. 50

శా. నాకై నాజనకుండు కేకయునకున్ నాఁ డీవు వాగ్దానమున్
గైకోఁ జేసితి దానిని న్మఱచి యిక్కాలంబునన్ రామునిన్
లోకారాధ్యునిఁ జేసి రాజ్య మిడఁగా లో నెంతు వంచుం బ్రజల్
వాకో వింటిని నీకు నిట్లు తగునే బాసన్ వృథా సేయుటల్. 51

ఆ. నాకు రెండువరము లాకాలమున నిచ్చి
తిమ్ము వాని భరతుఁ బృథివిపతిగ
నొనరుచుటయు రాము వనులందుఁ బదినాల్గు
సమలు తిరుగునట్లు సలుపుటయును. 52

మ. అనువాకుల్ శ్రవణేంద్రియాంతికగతం బైనంత నే వింతగా
మనుజేంద్రుం డటఁ బిడ్గు మొత్తి నగతిన్ బ్రహూన్నష్టవాక్కై వడిన్

ఘనశబ్దం బుదయించి మ్రోయఁ గడలన్ హాయంచుఁగూలెన్మహిన్
మనమున్ మాటయు లేక మోహకరణిన్ గన్పట్టి యప్పట్టునన్. 53

— దశరథుఁడు కైక ననునయించిపలుకుట —

తే. ఇట్లు పడి సేద దేరి యొక్కింతలోనఁ
దనదుకడ వీవనన్ వీచువనితఁ గాంచి
యుహ్వు యని వెట్టనూర్చుచు నోసి కైక
నీకు నిటు దుష్టబుద్ధి జనించె నేలొ. 54

సీ. రఘువంశమణి యగురామున కెల్లి ప
ట్టాభిషేకము సేయునాశయమున
నెల్ల నుత్సాహసమేతులై పరమోత్స
వము సేయగా నున్నసమయమందు
మొగులు లేకుండఁ బిడుగు వడ్డ చాడ్పున
విశిచి తి ట్లక్కట వేసినుడిని
వినిన నెవ్వారికే ప్రీలెడు హృదయంబు
చేటు నీ కేలవచ్చెడిని యిట్లు

తే. వరము లనునవి వరములై వఱల వలదె
సర్వహానికరంబులై చాగునవ్వి
వరము లన నౌనె వాని నీవరయ కడుగ
వచ్చునే యడిగిన నీయ వచ్చు నట్లె. 55

చ. కొడుకును రాజుఁ జేయు మని కోరుట చెల్లినఁ జెల్లుఁ గాని యి
వ్వడువున ముద్దులయ్య యగువాని నరణ్యముల న్వసింపఁగా
వెడలఁగఁ జేయుమం టిది వివేకులు కోరెదునట్టికోర్కెయే
మడఁతిరో! నీకు నిట్టిచెడుమానస మేటికిఁ బుట్టెఁ జెప్పవే. 56

ఆ. నిన్నుఁ దల్లికంటె నెఱిమీఱభజియించు
రామచంద్రమూర్తి రాజవదన!

వైరి శాంతుఁడు నీకు వాని పై నక్కటి
కమ్ము చేసి యైనఁ గావు నన్ను. 57

క. నిను గన్న తండ్రి కడ నేఁ
బొనరించితి బాస యన్న బుద్ధియు యే నీ
తనయునకు రాజ్య మడుగుము
కొను మిత్తు ద్వితీయ మొండు గోరుదె గోతీ!. 58

చ. భరతుఁడు నీవు తెచ్చి తన బాహుబలం దిడినట్టి రాజ్యముఁన్
వరమతిఁ బూని యేలు నని వాంఛ యొనర్తువ యేమొ చిత్తమం
దరయఁగ నద్ది వ్యర్థ మతఁ డాతని పైఁ బితృభక్తిఁ జూపుచున్
నిరతము వానిఁ బ్రాణ మని నెమ్మి భజించుచునుండు వింటివే. 59

తే. రామచంద్రునిఁ గాదని రాజ్యభరము
తాను బూనఁడు భరతుఁ డో మానినీమ
ణీ! మనం బిది విత యయి యేగు నమ్మ
నిట్టిచో నిట్టివ ట్టీవు పట్టఁ దగదు. 60

తే. అయినఁ గా నిమ్ము నీసుతునవని యేలు
పతిగఁ గావింతు నా ప్రాణపదము రాము
నడవికిం బంపఁ గోరకు మతివమిన్న!
నిన్నుఁ బ్రార్థింతు నేటికో ళ్ళైనొ్ా చేసి. 61

చ. భరతుఁడు రాజ్య మేలుకొనుపట్టున జ్యేష్ఠుఁడు రాముఁ డున్నచో
దొరతన మొప్పుగా నడవఁ దోఁపఁగ నీఁడని సంశయంబయేన్
గరితరొ! తద్భయం బెపుడు గల్గకయుండఁగఁ గట్టుదిట్టముం
బరిపెద నీకు నచ్చెడుక్రమంబున నమ్మము నాదువాక్యముల్.

ఉ. రాముఁ డరణ్యముం జనువరం బదిమాత్రిము మాను ముగ్ధలీ
రామునిఁ బాసి నే నవలఁ బ్రాణములన్ ధరియించియుండలే
నేమని చెప్పుదున్ మఱియు నేన్ బ్రదుక న్మదిఁ గోరుదేని నా
రాముని నాదుకట్టెదురఁ గ్రాలుచునుండ ననుగ్రహింపుమా. 63

తే. అనినఁ గైకేయి రాజున కనియె నాకు
వరము లిచ్చెద నంటి నీ వరమర విడి
యిమ్ము లేకున్న లేదను మింతె కాక
యొండు తెఱఁగులు నాకడ నుండ రాదు. 64

వ. అని మోరకుతనంబున ముక్తకంఠంబుగం బలికినఁ జేయునది యేదియుం దోపక దశరథుండు శోకవ్యాకులితేంద్రియుం డై కుమారుం బెడఁబాయువలసివచ్చెగా యని దీర్ఘవిచారంబు గావించుచు నోడలెఱుంగక నేలం గూలంబడి మూర్ఛాక్రాంతుండయ్యె నిట్లా రాత్రిశేషం బంతయు నతికష్టంబునఁ గడవ నీదె నంత మరునాఁ డరుణోదయంబున వసిష్ఠుండు సర్వసంభారంబులను సమకట్టి శిష్యసహితుండై సభాస్థలంబున కరుదెంచి సుమంత్రుం బిలిచి యిట్లనియె. 65

—♦ వసిష్ఠుఁడు సుమంత్రుని రాజునొద్దకుఁ బుచ్చుట ♦

సీ. ఓయిమంత్రి! పుష్యయోగముహూర్తము
తారసింపఁగ వచ్చెఁ దడయ కీవు
జననాథుకడ కేగి వినుచుము సాగర
గంగోదకాపూర్ణ ఘటచయంబు
లౌదుంబరము నుంబ యగుభద్రపీఠము
సర్వబీజంబులు క్షౌమరత్న
గంధపయోఘృత కాంచనాంబరములు
చతురశ్వరథము సంచితగజంబు

తే. ఛత్రచామరములు పుష్పసంచయంబు
శ్వేతవృషభము గోవులు విప్రవరులు
సర్వవాదిత్రములును వేశ్యాజనంబు
కూడియున్న దటంచు వాకొనుము పొమ్ము. 66

వ. పోయి శీఘ్రంబున మహారాజుం దోడితెమ్మనిన నతం డంతలోనఁ గైకేయీగృహంబున కరిగి మూర్ఛ మునింగియున్న రాజుం

గాంచి భయ దుఃఖంబు లిసుమడింపఁ గైక దిక్కు మొగంబై యి ట్లనియె. 67

శా. అమ్మా! యేమిది రాజచంద్రుఁ డిటుమూర్ఛాక్రాంతచిత్తంబునన్ మమ్ముం దమ్ము నెఱుంగకుండె నిటులేమాత్రంబునుం దాపఁ కీ విమ్మైఁ గోరుచునుంటిఁ జెప్పు మన నాయేణాక్షి మంత్రీంద్ర! నే నిమ్మంటిన్ వర మంతలో నితఁడు తా నిమ్మాడ్కి వర్తించెడిన్.

ఆ. ఈవు పోయి రాము నిటకుఁ దోడ్కొని రమ్ము దానిఁ దగిలియుండె వరము నాఁగ నతఁడు వడఁకికొనుచు నారాముకడ కేగి తెలియఁ జెప్పె నెల్లఁ దేటపడఁగ 69

వ. దీక్షాధర్మంబులం బొంది ధర్మసభాస్థలంబునకుం బోవ సమయంబునకై వేచి యున్న శ్రీరామచంద్రుం డాసుమంత్రునిమాట విని డిల్లపడి యెట్లున్నవా డట్ల లేచి సుమంత్రునితోఁ గైకమందిరంబునకరిగి తండ్రిం జూచి తల్లడంపడి నమస్కరించి పిలిచినం బలుకకున్నంతఁ గైకేయిదిక్కు మొగంబై యి ట్లనియె. 70

— శ్రీరాముఁడు కైకతోఁ బ్రసంగించుట —

మత్త. అమ్మ నాజనకుండు తా నిటు లార్తుఁడై పడియుంట కే మ్మరం బగునార్తి వచ్చెను ముచ్చటం బచరింపఁ డే నెమ్మెయిం బలికింప నింతయు నేని పల్కఁడు నాదు దో షమ్మె దేనియుఁ గల్గెనో మది సంశయింపక చెప్పుమా. 71

వ. అనినం గైక యి ట్లనియె. 72

తే. మున్ను నా కిడ్డ వరము లిప్పు డీడు మంటి నొకటి భరతునిఁ బుడమికి నొడయుఁ జేయ నిం కొకటి నిన్నుఁ బదునాలు గేండ్లు వనుల మెలఁగఁ జేయఁగ నన నిట్లు పలుకఁ డితఁడు. 73

వ. అనిన రామభద్రుండు తల్లి కి ట్లనియె. 74

శా. తల్లీ! నీ విపు డన్న రెండువరముల్ తథ్యంబుగా యుక్తముల్
జెల్లుం గోరఁగ నాదుతమ్మునకు నక్షిత్యాధి పత్యంబు సం
ధిల్లం గోరుట లొడ్డ కిమ్మనుటగా దే యిద్ది నా కెంతయే
నుల్లాసం బగు దీన ని ట్లగుట యేమో రాజచంద్రుం డయో. 75

తే. పత్తనముకన్న వన మది బహువిధముల
శ్రేష్ఠతర మే నచటి కేగి చిత్రములను
జూచి వత్తును బహుకీర్తి సొరిదిఁ దెత్తుఁ
బ్రజల కెంతయు సౌఖ్యంబు పరఁగ నిత్తు. 76

వ. ఇదియును నాకు సంతోషకరం బేను వీని కెంతయు నామోదించు
చుంటి నని రాజుం దరియ నరిగి కరస్పర్శనంబు చేయుచుఁ దండ్రీ!
దీనికి నీ వింత చింతింప నక్కఱ లేదు నే నింతలో వనంబులకుఁ
బోయి వచ్చెద నీలో నాతమ్ముండు నాపట్టమ్మున రాజ్య మేలు
చుండు నీవు స్వస్థుండవై యుండుము నే నిదె పోయి నా తల్లులకుం
జెప్పి తదనుజ్ఞం గొని వచ్చి విన్నవించి పోవుదు నని పాదచారియై
కౌసల్యాగృహంబునకుం జని తన ప్రయాణం బెఱింగించిన నామెయు.

—♦ రాముని వనవాసంబు విని తల్లి తల్లడిల్లుట ♦—

మ. అసిధారాహతి సేయఁగా నపుడు పెల్లారావముఁ జేయుచున్
వసుధన్ వ్రాలినరంభయో యనఁగ నాపద్మాక్షి లక్షించులో
వెస భూమిం బడి సంజ్ఞలేక కనుల న్వీక్షింప కక్షీణదుః
ఖసముద్భూత వికారరూపమున కై కన్పట్టె నప్పట్టునన్. 78

వ. అంతంగొంతలోఁ గుమారాశ్వాసితయై లేచికూరుచుండి పాదమ్ము
లొత్తు కొడుకుం దిగిచి కౌఁగిలించుకొని కంట నీరు వెట్టుచు వెక్కి
వ్రింగుచు ని ట్లనియె. 79

శా. నాతండ్రీ! యిది యేమికర్మగతియో. నా కింతకష్టాప్తి కే
నేత ప్పెష్ట వొనర్చియుంటినొ యెన్నేనాఁట సంప్రాప్తమై
చేతోరీతులఁ గాల్చివేయుటకునై చేకూరెఁ బాపం బిఁకే
రీతిం దాళుదు నెందుఁ జొత్తు నెటు వర్తింతున్ గుమారోత్తమా. 80

ఉ. కైక యొకప్పుడేని ననుఁ గాదని తా నొకచిన్నకార్యమేఁ
గైకొని చేయలే దెపుడు గాని ననుం గరువంపుఁజూపునన్
వాకొన లేదు నానుడులన్ శ్రుతులట్లు తలంచు చొదలన్
దాక ధరించు నన్ను నెదఁదన్ దన ప్రాణముగాఁ దలంచెడిన్. 81

శా. నిన్నుం గన్నకుమారుఁ డన్నగరిమన్ వీక్షించు నీ వెన్కనే
యొన్నం జూచును గన్నపుత్రకునిఁ దా నేఁడు నీ పైన సూ
య న్నొక్కల్పను చిన్ననాఁటిసుత నోయన్నా! బహిఃప్రాణమే
యన్నం జెల్లెడు నాదుచెల్లెలిటు చేయం జాలి యున్నే కటా. 82

మ. ఇది నేఁ జేసినపాపకర్మ మవియే యెంతుం గుమారాగ్రణీ!
మది నైపం డిది విన్న మీభరతుఁడేమాడ్కిన్ నినుం బాసి నే
బ్రదుకం జాలుదుఁ బాడుదైవ మది నాప్రాణంబులం దీయ ద
ప్పదకం జేటికి వచ్చు సర్వమును సంభావ్యంబు గా నుండఁగన్. 83

ఆ. నిన్ను విడిచి బ్రదుక నేరను గావున
నీదువెంట వనికి నేను వత్తుఁ
దండ్రి! దీని కీవు తాత్పర్య మొనరింపు
మింతకన్న నన్య మెఱుఁగఁ బడదు. 84

వ. అనినం గుమారుండు కన్నతల్లి కిట్లనియె. 85

శా. మాతండ్రిన్ విడనాడి నీవు వనికిన్ మాతోడఁ రాఁ జెల్లదో
మాతా! నే నిదె పోయి వత్తు నిటనే మాటాడుచుం డట్లు గా
నేతావన్మితకాలమున్ గడపి నీ వింతేని నాకై మనో
రీతిం జింతలపాలు సేయకుము పేర్మిన్ నన్ను దీవింపుమా. 86

వ. అనినంతఁ గౌసల్య చేయునదింతయును లేక జలంబులం జేసి కన్నులు తుడిచికొని పరమేశ్వరధ్యానంబు గావించి రామునిదిక్కు మోము పెట్టె. 87

—♦ కౌసల్య కొడుకున్ దీవించుట ♦—

సీ. నిగమాగమములు తెల్పు నీకు శివం బిచ్చు
ధర్మదేవత నిన్నుఁ దనివి గాచు

బంచభూతములు నీపట్ల దయం జూపు
ధాత విధాతయుఁ బ్రీతిఁ గంద్రు
చంద్రసూర్యాదులు శక్రాదిదేవతల్
భూతనాథుఁడు నిన్నుఁ బ్రోచుచుండ్రు
కౌశికదత్తాస్త్రగతదైవతము లెప్డు
సుప్రసన్నంబులై చూచు నిన్ను

తే. సింహశార్దూలములు నదుల్ క్షితిధరములు
వనచరములు నిన్ఁ గాపాడు ననవరతము
భూతవేతాళబాధ లాపాలమునందు
నీకు లేకుండఁ గావుత మోకుమార. 88

వ. అని దీవించుచుఁ గౌఁగిలించి శిరంబు పుడుకుచు నాఘ్రాణించి మూలిక నభిమంత్రించి శ్రీరాముని దక్షిణహస్తంబున రక్షాబంధనంబు గావించి యథాసుఖంబుగం బొమ్ము ర మ్మని పత్రపుష్పఫలంబులు చేతి కిచ్చి యంపిపుచ్చుటయు నతం డల్లన తల్లిపాదపల్లవంబులకుం బ్రణమిల్లి మెల్లన సీతాదేవి చెంగటికిం జని. 89

తే. కాంత! నేఁడు పట్టాభిషేక మ్మటంచుఁ
బురముఁ గైసేసి రన్నియుఁ బొసఁగ నయ్యెఁ
గాని యట్టులు గాకుండఁ గాననముల
కరుగునట్టి తెఱంగది యరయ వచ్చె. 90

వ. అని సర్వవృత్తాంతంబు నెఱుంగం జెప్పిన నామె రామునికై దండం గొని యి ట్లనియె. 91

—♦ సీత రామునితోఁ దా నరణ్యంబునకు వత్తుననుట ♦—

ఉ. ఊరు వనంబుల న్మెలఁగ నేగిన నే నిట నొంటి నుండఁగా
నేరను వెంట వచ్చెద ననింద్యచరిత్ర! భవత్సకాశమం
దారయ నాకు లోనగళు లైన వనంబులు నైన నొక్కఁడే.
తీరని విన్నవించెదను దేవర దీనికి సమ్మతింపుఁడీ. 92

వ. అనిన రాముం డారామం గాంచి యిట్లనియె. 93

సీ. పులులు సింగంబు లెల్గులు తోడుసీడలు
పాములు తేళ్ళును బట్టు విడవు
రక్షఃపిశాచము లేక్షణంబును బీడ
సలుపుచునుండు నాస్థలములందు
జాలు ఉప్పలు ముండ్లు గాలు వెట్టగనీవు
ఘూకాదిరుతములు వీకఁ గూర్చుఁ
దినఁ గంద లైనను గనఁబడ వొక్కప్డు
కటికనేలన పండఁ గలుగు జేలు

తే. గాలి దు మ్మొండ యివమును జాలి యుండు
దోమ లీగలు పురుగులు చీమగములు
నిలువ నీయవు నిముసమే నీవు వనుల
మెలఁగఁ జాలవు నావెంట వలదు రాఁగ. 94

ఆ. అనిన సీత యనియె సధిప నీచెప్పిన
దోసఁగు లెల్ల నాకుఁ దోచినవియ
వీని నన్ని యేని నేను భరించెదఁ
గాని నిన్ను విడువ లేను నాథ. 95

క. నాకాజ్ఞ గలదు వనికిం
బోకకు నీ కేది యనఁగఁ బోదురా వినుఁడీ
మీకాజ్ఞ యైన నాకున్
వాకో నగు నాజ్ఞ సగము వర్ష్మమ యగుటన్. 96

వ. ఇదియుం గాక మఱియు నన. 97

తే. జోసి యొక్కఁడు నాచేయి చూచి యీవు
వనుల విహరించు నని నేను ధనవు నీవు
నిఱుతువేనియు వని కేగి వేలుపులను
గొలుతు నంటి వనిం గనుకతుకము నగు. 98

వ. ఈమూడు కారణంబులం జేసి నాకు వనవాసం బత్యంతసంతోషదా
యకం బని మఱియును. 99

చ. మనమున భర్తృసోదరులు మామయుఁ జాలు ని దేటిసంగడం
బనియెద రత్తయుం గఱకు లాడి శపించెడు నాఁడుబిడ్డలున్
గనలుచుఁ బండ్లుగీటెదరు గాటము దూరెదుఁ దోడికోడలున్
మనుజులకెల్లఁ జుల్క నగు నాథబహిష్కృత కాంత కాశ్యపిన్ 100

వ. ఇట్లు లోకసామాన్యధర్మంబును గలదు గావున నే నిట నిన్నుఁ
బాసి యుండు టెల్ల విధంబులఁ జెల్లనిది యగుంగావున నా ప్రార్థనం
బంగీకరించి నే నంటిరా నను గ్రహింపు మనిన రామచం
ద్రుం డట్లయిన నీచిత్తం బనినంతలో లక్ష్మణుండు వచ్చిన వానిఁ
గాంచి రాముం డంతయు నెఱింగించి యి ట్లనియె. 101

శా. తమ్ముఁడ! నే వనంబులకుఁ దాతనుడింబడి పోవుచుంటి నీ
వమ్మల సేవ సేయుచు భయంబునఁ భక్తినిఁ దండ్రిఁ గొల్చుచున్
సమ్మతిమై నిటన్ భరతు సంగతి నుండి ప్రజాప్రపాలనం
బిమ్ముగఁ జేయుచుండు మన నెక్కలి గ్రమి గుచు లక్ష్మణుండనున్.

శా. నీరాజ్యం బారుఁ డేలుచుండఁ గనుచున్ నే వానిచెంతన్ శుభ
ప్రారంభంబున నుండఁ గాఁ గలనె దేవా! నీవ నాదిక్కు న
న్నేరీతిం గని యెట్లు చేసినను నిన్నే కొల్చి సీతోడనే
ఘోరారణ్యములన్ వసించుటకు నాకుం జిత్తమౌ నగ్రజా. 103

క. నావుడు రఘురాముఁ డనున్
నీ విట నుండినను జెంత నే లేనిదిగుల్
పో విడుచుఁ దల్లినీదగు
సేవల సంతృప్తి గలిగి చెప్పెదు వినుమా. 104

తే. లక్ష్మణుం డను నాయమ్మ లక్షమంది
లక్ష్మణులు గొల్చుచుండి మెలంగుచున్న
రామచంద్రులు గాఁ జాలరామె కన్న!
తద్విచారము విడి నన్ను దయను గనుము. 105

వ. అనిన నాఁ గాత ముని రామచంద్రుండు సౌమిత్రితో సుమిత్రా
భవనంబునకుం జని పాదాభివందనం బాచరించి. 106

—♦ సుమిత్ర రాముని దీవించి పుచ్చుట ♦—

శా. తల్లీ! నే జనకాజ్ఞమై వనిఁ జనం దాత్పర్యముం జేసితిన్
దల్లిన్ నీకడఁ బూఁట వెట్టితిని తద్భారంబు నీమీఁద నే
తెల్లంబై కనవచ్చుఁ జెప్పితిని నన్ దీవించి పుచ్చం దగున్
వెల్లంబై తగునాదరంబున ననన్ మోమోటమ్మై నిట్లనున్. 107

శా. తండ్రీ! మ మ్మిత్రుఁ బెట్టి పోవుదఁటె కాంతారంబుఁ గాంక్షించు చే
వాండ్రుం గోరనికోర్కెఁ గోరినది దైవప్రేరణాయైక మీ
తండ్రిం జిక్కులఁ బెట్టి నాప్రభువు నేతన్మాత్రముం మూఁక రా
డాండ్రం దప్పన రాదు తప్పు దది దైవాధీనమై యొప్పుటన్. 108

ఉ. నీ వాకరుండ వేగుటకు నే మదిలో నొడఁబాటుసేయ నీ
దేవియు నీదుతమ్ముఁడును దేవుని బోలె నినున్ భజించుచున్
నీవెనువెంట వచ్చెదరు నీ వెపు డొట్టిశ్రమంబు నొందఁ బో
కావల వచ్చి రాష్ట్రపతివై ప్రజ నేలు శుభంబు నీ కగున్. 109

వ. అని లక్ష్మణునిదిక్కు మొగంబై. 110

శా. అన్నా! లక్ష్మణ! కాననాంతరములం దశ్రాంతముం దైవమ
ట్లన్నం జేరి చతుర్దశాబ్దములు నిద్రాహారముల్ మాని తం
డ్రి న్నాఁ గొల్వుము జానకిన్ జననిమాడ్కిన్ భక్తి భావింపు మీ
కొన్నాళ్ళున్ వనమే యయోధ్య యనుచుం గోర్కెన్ బ్రవర్తింపుమా

వ. అని వాని రామున కప్పనఁబు చేసె నంత రామభద్రుండు తల్లికి
నమస్కరించి సీతాలక్ష్మణులతో స్వగృహంబునకుం జని నిజాభర
ణంబులన్నియుం దీసి బ్రాహ్మణసాత్కృతంబు గావించియనంతరంబ.

—:సీతారామలక్ష్మణులు వనవాసవేషములు ధరించుట:—

సీ. మణిపాలతో నద్ది నెఱులు జడలు గాఁగ
నడినెత్తిపైఁ గొండెముడులు వైచి

సుదుట వక్షంబునఁ బదములం జేతుల
మూఁడు రేకలు దేర భూతి వెట్టి
శిరమునఁ గొప్పలోనఁ గరముల భద్రరు
ద్రాక్షమాలికలను దనరఁ దాల్చి
కాషాయవర్ణము గలుగఁ జేసిననార
చీరలు మొయి జానుమీఁదఁ దాల్చి

తే. వ్రేళ్ళ జపమాల లొకమాల వ్రేలుచుండఁ
గరములఁ విల్లునమ్ములు కడఁకఁ బూని
రామలక్ష్మణు లెంతయుఁ బ్రేమ మీఁఱఁ
దాపసకుమారవేషముల్ దాల్చి రపుడు. 113

వ. అంత వనవాసోపయోగవేషంబు దాల్చియున్నజానకీదేవిం దోడఁ
బెట్టుకొని లక్ష్మణకుమారసహితుం డగురామచంద్రుండు సుమం
త్రుండు కంట నీరు వెట్టుకొనుచు వెంట నంటఁ గైకేయీగృహంబు
నకుం జని యొక్కచో నొడ లెఱుంగక పడియున్నతండ్రికిం బ్రద
క్షిణనమస్కారంబులు గావించుచున్న సమయంబునఁ గైక వడి
వడిం బరతెంచి శ్రీరామునిం గౌఁగిలించుకొని. 114

—♦ కైక రామునివనవాసవేషంబు చూచి దుఃఖించుట ♦—

ఉ. ఏమిర తండ్రి! నీ విటులు హీనగతిన్ మునిపుత్రవేషముం
గోమలితోడ వైచుకొని కొంచెము గానివిరాగ మేర్పడన్
మామకహృత్సరోజమును మాడిచి వేయుమహావ్యథాభరం
బీమెయిఁ గూర్చువాఁడ వయి తేమి విపద్దశ వచ్చెఁ జెప్పుమా. 115

వ. అని కంటికిని మంటికి నేకధారగ నేడ్చుచున్నకైకేయిం గాంచి
సుమంత్రుండు గర్హించుచు ని ట్లనియె. 116

ఉ. అన్నము వున్నముం దెలియనట్టివిధంబునఁ బల్కుచుంటి నీ
చిన్నెలు వే రెఱుంగనివి చెల్లరె! కన్నకుమారుఁ డంచు నీ
వెన్నక వీనిఁ గా రడవి కేగు మటంచు వచించి యిప్పు డీ
తెన్నునఁ బల్క వచ్చితి గదే! నిన్ను నేమనవచ్చు నిచ్చటన్. 117

క. నీకొమరుఁ డవని యేలఁగ
నీకొమరుం డరిగి వనుల నేలఁగ వరముల్
గైకొంటి వింతలోనే
కైకమ్మా! మరచితమ్మ! కలగా దమ్మా. 118

వ. అనిన నామె నోరును నెత్తియు మొత్తుకొనుచు నేలం బడిమూర్ఛిల్లి కుమారసమాశ్వాసితయై లేచి రాము సక్కసం బెర్చుకొని దుఃఖం చుచు ని ట్లనియె. 119

సీ. తండ్రి! నే నెఱుఁగను దథ్యంబు నామాట
బాస సేయుదును దైవంబు దలఁచి
నన్ను నే నెఱుఁగను నిన్నఁటిసుత బిడ్డ!
వెఱ్ఱియో పిచ్చియో వినుపఁ జాల
ఘన మపస్మారరోగమొ యేమొ తెలియదు
పీరు వా రని యెదు విధ మెఱుంగఁ
గల వోలె నెద్దియో కానవచ్చుచునుండె
దేహరోగము నాదు దెసను లేదు

తే. కారణం బేమొ యూహింపఁ గానరాదు
మంథర వచించె నీరీతి మాట లెవియొ
వాని కేఁ బ్రతికూలముగా నొడివితి
నింతమాత్రము జ్ఞప్తి నా కిపుడు కలదు. 120

శా. ఆవేశించెను నాదు మేనిపయి దయ్యంబో మహాభూతమో
నావిజ్ఞాన మదెల్ల నేటఁ గలసెన్ గాఁబోలు నే మేమి నే
నావేళం బచరించి యుంటినొ కుమారా! రామచంద్రా! మదీ
యావేశాగతదోషముల్ సయిచి నాయందుం దయ నిల్పుమా.

ఆ. గ్రహము సోఁకినపుడు గలిగినమాటలు
పాటిచేసి నీవు ప్రభుత విడిచి
యడవి కఱుగఁ దగదు విడువు మీవేషము
నిలువు నాదుప్రాణములను దండ్రి. 122

శా. నిన్నుం దన్నుఁగఁ జూచికొంచు నెపుడున్ నీయందె సర్వస్వమున్
విన్యాసంబున నుంచి కొల్చెడుభవద్విఖ్యాతసోదర్యుఁ డీ
నన్నుం బాపపథానువర్తినిఁ గనం గాలాగ్నిరుద్రుండ వై
బున్నం బంచును బాప మంచనక చంపుం గోసి చంద్రాసిచేన్.

తే. జగతిఁ గలయెల్లవారు నుత్సవము సలుపఁ
గైక రక్కసియై యిట్లు కానివట్టు
పట్టి రామునిఁ బోఁద్రోలె వనుల కనుచుఁ
బ్రజలు దూషింప విని నేను బ్రదుకఁ జాల. 124

సీ. ఈనావిభుం డెంతయే వంత నొందునో
కౌసల్య దా నెంత కస్తిపడునొ
కని మెచ్చెడుసుమిత్ర నను నెంతదూరునో
దాసీజనం బెంత రోసికొనునొ
మంత్రిసామంతు లేమాద్రి నిందింతురో
పౌరు లెంతెంతగాఁ బలుకుకొంద్రొ
నాతలిదండ్రు లేరీతి సిగ్గిలుచుంద్రొ
భరతుఁడు తా నెంత బడలువడునొ

తే. మీఁద దైవము తా నెంత మిక్కిలిగను
నన్ను శిక్షింపఁ దలఁచుచు నున్నయదియొ
నాదుప్రారబ్ధ మేగతిఁ బ్రోది యగునొ
యేను జేసిన చేఁతకు నిప్పు డకట! 125

వ. అని రామునిచిబుకంబు పుడుకుచు దీనస్వరంబున. 126

ఆ. నన్నుఁ గావు మన్న నాప్రాణములు నిల్పఁ
జూడు మన్న యెఱుఁగ కాడినట్టి
మాటఁ ద్రోసిపుచ్చి మహిపతివై మమ్ముఁ
గావు మన్నఁగరుణఁ బ్రోవు మన్న. 127

వ. అని పరిపరివిధంబులం బరితపించుచుం బలుకుచున్నంతఁ గొంత
సంజ్ఞం గలిగి దశరథుఁడు మందస్వరంబునఁ గొడుకుం బిల్చి. 12

—♦ దశరథుఁడు వనవాసము వలదనుట ♦—

ఆ. కన్నతండ్రి! తల్లి గాదె యీ కైకేయి
చెప్పినట్లు నీవుఁ జేయఁ దగుదు
నడవి కేగు టుడిగి పుడమితేఁ డగుము మా
ప్రాణములను నిలుపునట్టిఁ డగుము. 129

క. అనుడు సుమంత్రుం డను నీ
జననియు జనకుండు నుడువు చందంబున నీ
వానరింపఁ దగు నరణ్యముఁ
జన నొప్పదు నీకు శాస్త్రసరణియుఁ దెలియున్. 130

క. ఏనుడులఁ జేసి వనులకుఁ
బో నయితివొ రాజ్య మీఁగి పురుషోత్తమ! నీ
వానుడులఁ జేసి యిప్పుడు
పోనయితియు లే దటంచు బుద్ధి నెఱుఁగుమా. 131

వ. అనిన రామచంద్రుం డందఱు విన మంత్రి దిక్కుమొగంబై. 132

సీ. నాతల్లి తప్పిందు నలుసంతయును లేదు
దైవతంత్రం బిట్టిదె వెలయును
దండ్రి యిచ్చినవరద్వయమునం జేసియే
విధి నాకు రాజ్యంబు విడిచి చనుట
మఱియుఁ గేకయభూమి మండలపతికడ
బాస చేసెన్ దానివలన నేను
దండ్రినుడుల్ సెల్లుదారి చూతున యేని
వనికి నేగుట లొండె వరము నాకుఁ

తే. గానఁ దల్లియుఁ దండ్రియు జ్ఞాననిధులు
మంత్రివర్యులు మన్నించి మామకీన
మైనపరమోద్యమమునకు సద్ధసాళ్ళు
దగుల వర్తింప కుండ్రని తగ భజింతు. 133

క. దైవప్రేరిత మియ్యది
యేవారును మాన్పఁ జాల రింతేటికి నేఁ
బోవక తప్పదు గావున
నావలనన్ దిగులు విడిచి నన్నంప నగున్. 134

క. అని తండ్రి యడుగుఁదమ్ములఁ
దనహృదయముతోడఁ దలను దార్కొనఁ జేయం
గనులం గాఱెడుజలములఁ
దనయుని శీర్షంబు వీఁపుఁ దడిపె నతండున్. 135

—♦రాముఁడు తండ్రి ననునయించుట♦—

ఉ. చేతుల లేవ నెత్తుటకుఁ జేసెఁ బ్రయత్నము నంతలోపలం
జేతమునందుఁ బ్రజ్ఞ చెడఁ జేతుల చేవ చెడంగఁ గాడ ల
ల్లై తగి వ్రాలనయ్యె నపు డారఘురాముఁడు శీతలోదక
స్నాతునిఁ జేసి తేర్చి కరుణామయచిత్తముతోడ నిట్లనున్. 136

తే. ఇంద్రమనర్ఘాసనంబుపై నెక్కఁ గలిగి
జగతి నెల్లెడలను జయస్తంభములను
నిలిపి జన్నముల్ సలిపి బిడ్డలను గాంచి
ప్రబలు దీ విట్లగుట లెన్నఁ బ్రతిభ యగునె. 137

క. నాకై శోకము విడు మే
నీకొంచెములోన వనుల కేగి సురార్యు
ద్రేకము మానిచి లోకము
ప్రాకామ్యము నొందఁ జేసి వచ్చెదఁ దండ్రీ. 138

తే. ఆజ్ఞఁ యి మ్మని పలికెడునంతలోన
సీత చనుదెంచి మ్రొక్కి నీసూతివెంట
నేను వని కేగి వచ్చెద మానవేంద్ర!
యనుడుఁ గనువిచ్చి చూచి యి ట్లనియె నతఁడు. 139

ఉ. నీమగఁ డెంతచెప్పినను నే వని కేగక మాన నంచు నే
మేమొ వచించుఁ గైక మును పెట్లు మెలంగిన నిష్ఠ తప్ప నే

నామెయిఁ జేసితిన్ సయిపు మం చనుచుండెను గాన నాపయిన్
బ్రేముడిచేసి కానలకు వెళ్లక యుండఁగఁ జేయు మమ్మరో. 140

క. నను బ్రతికించినపుణ్యము
వనజానన! నీకు నంట వచ్చెడుఁ గైకే
యిని నంట వచ్చు నపయశ
మును రాకుం డెడిని దల్లి! ప్రోవవె మమ్మున్. 141

వ. అనిన సీత యి ట్లనియె. 142

తే. దేవ! నే నేమి చేయుదు జీవితేశుఁ
డెవరు చెప్పిన వినఁడు మీయెడలభక్తి
సలుపు మీమాట చెల్లింప వలయుఁ గాన
వనికి నరిగెద నని చెప్పెడిని నరేంద్ర. 143

వ. అని చెప్పి కైకేయి దిక్కు మొగంబైనంత నామె లేచి సీతన్ గాఢా
లింగనంబు గావించి చెంతం గూరుచుండం బెట్టుకొని. 144

క. స్పృహ లేనినాదునుడిఁబడి
గహనమునకు నేగ నెంచెఁ గాదన్న వినం
డహహా! యేమందును నా
కిహపరములు రెండు చెడఁగ ని ట్లొనఁ గూడెన్. 145

క. సుకుమారమూర్తి వమ్మా
సుకమెఱుఁగుదు కాని యెపుడు చూడవు కష్టం
బకటకటా! నీ పడవులఁ
దికమక పడ లేవు వెడలఁ దివురకు మెఱఁదన్. 146

ఆ. నిన్నుఁ గన్నబిడ్డకన్న మిన్నఁగఁ జూతు
నెట్టిలోటుపాటు లెందుఁ గాని
కలుగ నీను తల్లి కానలకుం బోవ
కీడ నుండు మమ్మ కోడలమ్మ. 147

వ. అనినఁ జానకి తల్లీ! నాచిత్తంబునకు నాస్వాతంత్ర్య మింతయును
లేదు చెప్పెద నవధరింపు మిది దైవప్రేరితంబు జరుగవలసినది

జరుగక మానదు జరుగకుండఁ జేయనేరికి నసాధ్యంబు గావున మీ
రందఱు మమ్ము దీవించి కాననగమనంబునకు ననుజ్ఞ యిండనుచు
నంత రామచంద్రుండు దండ్రికిం దండ ప్రణామంబు లాచరించి
ప్రయాణోన్ముఖుండై యంతకుమున్న వచ్చి విశ్రమించియున్న
వసిష్ఠునిపాదారవిందములకు వందనం బాచరించి ప్రయాణం
బాలోకించిన నతం డతని కిట్లనియె. 149

తే. వత్స! నేటికిఁ బదియేడు వత్సరములు
నిండునీ కొకహోరలో నృపతి వగుదు
వనుచు, గంకణముం గట్టనైన నేను
గానలకుఁ బోవఁగట్టెదఁ గంకణంబు. 149

వ. అని రక్షాబంధనంబు గావించి.

స్రగ్ధర. ఈ రక్షాబంధనం బోయినకులతిలకా! యెంతకాలంబు నీకై
వేరై పో కెల్లవేళ వెలుఁగుచుఁ గళలన్ బెంచుఁ దా నంతకాలం
బేరున్ ప్రాణంబుతో నీయెదుట నిలునదే రెట్టిదేవారు లైనన్
జేరుల నిల గీర్తి నీకుల సిరు లగు నెపుడుల జేరకుండఁ క్షుద్ధార్తుల్.

—♦రాముఁ డెల్లర నామంత్రించిఁ వనికిఁ బ్రయాణమగుట♦—

వ. అంతలో సుమంత్రుండు రథంబు సన్నద్ధంబు చేసి తెచ్చి యెదుటం
బెట్టి యధిష్ఠింపు మనిన రాముండు.

తే. రథము తాళము మేళము రవణములును
దూర్యములు వారవనితలతోడుపాటు
నుత్సవంబును బ్రతియయి యూరు విడిచి
వనికి నేగెడువానికిఁ వలనుపడునె. 153

మ. పదునాల్గేడులు నేఁటినుండి మొదలై పాటింప నొఁ గాన నే
నెదియున్ వాహనముం గ్రహించి చనఁగా నిష్టించఁ బద్చారినై
కదలం బోవుదు దారి చూపుటకు నొక్కండు డీవు సీమాంతభూ
పదముం జేరఁగ రమ్ము రాష్ట్రిరుదముల్ వర్జింపుమేఁ జెప్పితిన్. 154

వ. అని చెప్పి సీతాలక్ష్మణసమేతుండై రామచంద్రుం డెల్లవారికిం జే
యెత్తి మ్రొక్కి నే నిదె పోయివచ్చెద నాశీర్వదింపుం డని ప్రయా
ణాభిముఖుండై రెండడుగులు వైచె నంతలోఁ బ్రళయార్ణవంబు
పెల్లు ఘూర్ణిల్లినచందంబున ముల్లోకంబులు ముట్టునట్లు మహాశబ్దం
బుప్పతిల్ల గొల్లుమని యెల్లవారును గన్నీరు మున్నీరై పాఱ రోద
నంబు గావించిరి రాఘవుండును మఱియు వారి కభిముఖుండై
చేతు లెత్తి మ్రొక్కి శాంతింపుం డని సంజ్ఞం జేసి చెప్పి మఱియు
మాతృవందనంబు చేసి పురవీథిం బడి చనం జొచ్చె నప్పుడు వాని
వెంట నంటి.

సీ. అంతఃపురాంగన లందఱుఁ వెనుదన్ను
ముగ్గురుతల్లులుఁ ముందుఁ జనిరి
చెంతల మంత్రిసామంతవర్గం బెల్లఁ
దల వాంచి వెనువెంటఁ దరల నయ్యెఁ
గడ లంటి పౌరులుం గడజాతివారును
గన్నీరు కాల్వలై కాఱఁ జనిరి
మేడల న్మిద్దెల గోడలఁ వీథుల
నిలిచి పురస్త్రీలు నెగులు గుడిచి

తే. రిట్టు లాబాలగోపాల మెల్లపురము
బ్రతికియుండియుఁ జచ్చినపగిది నగుచు
మాటయును మంతియును లేక మ్రానుపడి యు
రామమార్గ మనుసరించె రమణ చెడఁగ.

—♦ రాముని గతికి బహుపత్న్యాదులును వగచుట ♦—

సీ. గిపెట్టు చేన్గులు క్రీగంట జలమూఱఁ
దలలు దోర్చుచును మేతలను వీడె
గుఱ్ఱముల్ కన్నీళ్లు గిఱ్ఱునఁ దిరుగుచు
దిగువాఱ ఖాణము దినుట మానె

లొట్టియల్ మోరయెత్తి వట్టిబయలు సూచుఁ
జెట్టులుం గదలనియట్టు లుండె
నాలు లేఁగలకునేఁ బాలిక సతతంబు
సంభారవంబుల నార్వఁ జొచ్చెఁ

తే. పక్షితతులును బెల్లార్పు లక్షయముగ
మేఁతలను మేయ మానెఁ దిమిర మ దెల్ల
దిక్కులం గప్పె సూర్యుని తేజ దఱిగె
జానకీపతి వని కేగు సమయమందు. 157

ఆ. రాజగృహమె కాక రాజధాని య దెల్ల
రాముఁ డడవి కేగురట్టువలన
సర్వశూన్య మైనచాడ్పునఁ గన నయో
ధ్యశోభ యొందు నేని చూడఁ బడక. 158

ఉ. తల్లులు పిల్లలున్ మఱియుఁ దండ్రులు నన్నలుఁ దమ్ము లెల్లవా
రిల్లును వాకిలం చనక యెంతయుఁ జింతల వంత నొందుచున్
జల్లనిరామచంద్రుని విసర్జనముం బొనరించి నట్టియా
చెల్లనియూర నుండ మనుచిత్తము చేసిరి తత్తఱించుచున్. 159

వ. ఇట్లు పురజను లెల్లరుం బరిపరివిధంబులఁ బరితపించుచున్నంత సీతారామలక్ష్మణులు సుమంత్రపురస్సరంబుగా సరయువు చెంతకుం జని వెనుదిరిగి వెన్నంటివచ్చువారిఁ బౌరజానపదాదులం గని చేయెత్తి మీ రింక రావల దుండుఁడు నే నిదే పదునాల్గు దినంబులలో వచ్చునట్లు వచ్చి మీదయకుం బాత్రమయ్యెద ననినసుమంత్రుండు నెలుంగెత్తి యెల్లర నివర్తిల్లం జేసె నప్పు డెట్టకేలకు మరలి రామ మాతృక లంతిపురికిం జనియున్నతఱి శోకవ్యాకులితచిత్తయై గోడుగోడున నేడుచుచున్నకౌసల్యం గాంచి సుమిత్ర యిట్లనియె. 160

—♦ సుమిత్ర కౌసల్య నూరార్చుట ♦—

శా. అక్కా యింతటివెఱ్ఱి యేమిటికి నీ కారామభద్రుండు పెం
పెక్కన్ దైత్యుల నుక్కడంచుటకు గా నీరీతి నీగర్భమం

దిక్కాలంబున నుద్భవించెఁ నెటువో కిచ్చోటనే హెచ్చువో
మొక్కల్ వోయి మెలంగునం చెదఁ దలంపుం జేయుటల్ వోలునే.

ఉ. కైకమ నీవు నేను నొకకంచమునం దిని యొక్కమంచమం
దేకద నిద్రవోవుదు మ దేటికి రాము నరణ్యభూమికిం
బోకడఁ బెట్టఁ గోరెడిని మోహము గా కిది యెల్ల దయ్యపుం
బోకడ లిట్టి చొప్పెఱుఁగఁ బోవక వెఱ్ఱుల మైతి మక్కటా. 162

ఆ. అపుడు కైక దీనయై నేన కారణ
మమ్మ రామచంద్రుఁ డరుగుటకును
నలికిఁ దండ్రి కిట్టివలవంత దెచ్చుట
నెట్టిరట్లు కైన నేను దగదు. 163

ఆ. అన సుమిత్ర మఱియు నంతకుం దైవమే
యనుచు నుంటిఁ గర్తృతను వహించి
నేన పాపిని నని యేల వాపోవుదు
వలదు తల్లి! నీకు వనట వలదు. 164

క. నాకన్నకొడుకు లక్ష్మణుఁ
డేకాలము చేసె సుకృత మెదియొ రాముం
గైకొని యుంటకు ఫల మది
నాకుం దన్మూలమునన నలువయి యుండున్. 165

వ. అంతఃపురకాంతాజనం బిట్లున్నంత. 166

ఆ. అట్లు వనికి నేగు మని వసిష్ఠుఁడు రాము
కరమునందు రక్ష గట్టి లోన
హర్షమంది రావణాదులు మృతి నొందు
కాల మరుగుదెంచెఁ గా యటంచు. 167

శా. వైకుంఠుం డెపుడో రఘూద్వహులసద్వంశంబునం బుట్టు నే
నాకంజాతునిఁ బ్రేమఁ జేయఁ గలవాఁడై యుందునం చెంచి యెం
తో కాలంబున నుండి వీరికులమందుం దేశికత్వంబునుం
గైకొంటిన్ ఫలియించె నేఁటి కది వేడ్కన్ ధన్యతం గాంచితిన్. 168

క. అని సంతోషించుచు నుం
డినయప్డు పురంబునం గడించివిచారం
బున నెల్లప్రజలు దుఃఖం
బున నుండినయప్డు రాజు పురవీథికడన్. 169

—♦ దశరథుఁడు మూర్ఛితుం డగుట ♦—

తే. పెల్లుకోలాహలం బయి గొల్లు మనుచు
వినఁగ వచ్చె నార్తధ్వని వీనులఁ బడ
రాజపత్నులు లోనగురమణు లెల్ల
గుండె లవియంగ వచ్చి రాగోడు దెలిసి. 170

వ. అప్పు డారాజమార్గమధ్యంబున. 171

సీ. ప్రజలు మూఁగికొనంగఁ బడినోట లాల పె
ల్లూర నిట్టూర్పుచు నున్నవానిఁ
గట్టినపుట్టమ్ము గదలి వీడినదాని
సరిచేసికొనక మి న్నరయువానిఁ
గేశపాశము వీడి కేశముల్ మేనెల్లఁ
గప్పినేలం బడఁ గలఁగువానిఁ
గన్నుఁ దమ్ములనుండి కాల్వలు గట్టంగ
బడిబడి బాష్పముల్ విడుచువాని

తే. ఎదిరిఁ దన్ను నెఱుంగక యిలను బోర
గిల్లఁ బండినవాని మేనెల్ల బూదె
వామిచేఁ గప్పఁ బడియున్నవాని సారె
కుహ్వా యనువానిఁ గాంచి రయ్యుర్విపతిని. 172

వ. కాంచియెల్లరుం గొల్లుమనుచుండ వసిష్ఠుండు వచ్చి శైత్యోపచారంబులు సేయించి సేదదేర్చి ప్రకృతిధర్మంబు నొందినదశరథుం బొదివికొని మెల్లన రాజగృహంబునకుందోడికొనిపోయివిశ్రమించిన పదంపడి యేకాంతంబున ని ట్లనియె. 173

తే. వినుము రాజేంద్ర నీయజ్ఞమునకు మున్న
నీ వెవండవొ నీపూర్వవృత్త మెద్ది
యో యెఱింగించితిని పుత్రయోగకార
ణమును జెప్పితి నీదుచిత్తమున కెఱుఁగ. 174

తే. కామగవికిని నీకును గలిగినట్టి
సంవివాదముఁ జెప్పితి తొల్లి తలేంద్ర
మఱచితే పూర్వవృత్తాంత మార్గమెల్ల
తెలియదే రాముఁ డెవ్వడో తెలిసికొనుము. 175

—వసిష్ఠుఁడు రామప్రభావం బెఱింగించుట—

చ. తెలిపితి నీకుఁ గౌశికునిదివ్యసవంబును గావఁ బుచ్చుచో
విలవిలలాడితీ వితఁడు విక్రమసింహుఁడు శత్రుకోటులన్
బిలుకుఱఁ జేసి లోకములపిమ్మట దీర్పఁగఁ బుట్టె నంచు న
ప్పలుకుల నింత నీ కెఱుఁగ వచ్చు నటైన వచింతు వెండియున్.176

శా. పౌలస్త్యాన్వయమందు రాక్షసజనిఁ బ్రాపించి లంకాపురిన్
ఫాలాక్షార్చకుఁడై మహోగ్రవరసంప్రాప్తిన్ మహోద్రిక్తుఁడై
కాలుండో యన నైనరావణుఁడు లోకస్తోమబాధాకరుం
డై లక్షింపఁగ నయ్యె నేరికి నసాధ్యప్రాభవోపేతుఁడై. 177

తే. రావణునిఁ జంప విష్ణువు రాముఁ డయ్యె
భరతుఁడు సుదర్శనము శేషపన్నగమ్ము
లక్ష్మణుఁడు పాంచజన్యము లక్ష్మణాను
జుండు నై నీకుఁ బుట్టి రోక్షోణినాథ. 178

క. పుట్టినకార్యము దీర్పక
నట్టింటన కూరుచుండి నలువురితోడన్
జిట్టాడుచుంట యొప్పెడు
నట్టే మఱి హేతుజన్మ లగువారలకున్. 179

వ. మఱియుం జెప్పెద నాకర్ణింపుము నాఁడు మిథిలనుండి వచ్చుచున్న
యపుడు మార్గమధ్యంబున నీకు గర్గుండు దర్శనం బిచ్చి. 180

ఉ. నీవు కృతార్థజన్ముఁడవు నిన్ను నుతించినవెన్కఁ గాని యే
దేవుని నే నుతింపఁ దగు దివ్యమహాత్మ్యము నీదు భాగ్యలో
నీవరుసన్ జనించె జగమెల్లను ధన్యము మాన్య మయ్యె నో
భూవర! నిన్ను మెచ్చుటకుఁ బో చనుదెంచితిఁ దత్పరుండనై. 181

క. నీకుం గొడుకగు రాముఁడు
లోకారాధ్యుండు విష్ణులోకమునందున్
బ్రాకామ్య మొంది యుండెడు
వైకుంఠుం డిట్లు పుట్టె వసుధన్ బ్రోవన్. 182

శా. సాక్షాద్విష్ణు వితండు ధర్మములఁ సంస్థాపించి ధర్మాత్ములన్
రక్షించున్ బ్రభుఁడై సమస్తవసుధారాజ్యంబు పాలించుఁ బ్ర
త్యక్షుండై పదునొండువేలు సమ లత్యంతప్రభావంబునన్
రక్షోవంశము లెల్ల నీనివలనన్ రాలాపులం బాడెడిన్. 183

వ. అని చెప్పెం గావున నీవు సర్వంబు నెఱింగినవాఁడవై మమకారా
హంకారంబులు విడిచి శాంతుండవై పరమేశ్వరారాధనంబు గావిం
చుచుండు మని మఱియును. 184

—♦ వసిష్ఠుఁడు వేదాంతోపదేశముచేయుట ♦—

ఉ. పోయినప్రొద్దువే మరలఁ బొల్చెడు నట్టులు కాలధర్మమై
పోయినవారె వెండియును బుట్టెద రిం దనిశంబుఁ జూచుచున్
దాయదుఁ దండ్రి యన్నయనుదమ్ముఁడునాలియుఁగూలిరంచుదుః
ఖాయితచిత్తులై జనులు కాఱియ నొందుదు రెంతవెఱ్ఱియో. 185

ఉ. ఎందఱు కెన్నిచందముల నెట్లు మెలంగునొ పుట్టి చచ్చువాఁ
డెందఱు వాని కె ట్లనుచు నేర్చెదరో నెఱచుట్ట లెవ్వరో
డెందమునం దలంపక కడింది విచారముతోడ మూర్ఖులై
కుందఁగ నేల కాలగతిఁ గూలెడువారికి నెట్టివారికిన్. 186

ఆ. తనకుఁ దాన కాని తన కేరు చుట్టముల్
లేరు వగవ రాదు వారిఁ గూర్చి

తాను వారు నొకఁడు కాని కాకుండనీ
వగచి తెచ్చు నయ్యు వారి మరల. 187

శా. ఎంతో తాను దలంచి యున్నపుడు మున్నే చేయుకర్మంబుచే
నిం తైనన్ గొనసాగ దందులకు దానే లోనఁ జింతింప నా
సంతాపంబును బొంది దేవునిఁ దిరస్కారంబు గావింప రా
దంత న్నాతకమావహిల్లి నరకప్రాప్తిం జనుం డార్తుఁడై. 188

క. నారలు గట్టుకొని వనిం
గూరలు తినుచుండుమునులకుం న్నేలిమిబం
గారుజలతారు చీరలు
సారాన్నము గొన్ననృపులు సరిపోలుదురే. 189

ఆ. ఆకు లైన నేమి యలము లైనను నేమి
సూప మైన నే మపూప మైన
నేమి వేఱురుచుల కేమి యాఁకలి దీర్చు
కొనుట కన్నఫలము చనునె లోన. 190

మ. కలలోఁ గన్నపదార్థమట్టుది సుమా కాంతాకుమారాదికం
బిల నీయంతము నాశమౌను జగమే వీక్షింప మిథ్యాత్వమై
పొలియున్ వెంబరవిత్తువై చెడి మహామోహాబ్ధిలో మున్గ క
వ్వలఁ జింతింపు మనశ్వరం బగుపరబ్రహ్మంబు తానొక్కఁడే. 191

చ. నలకలకన్న నల్కయి కనంబడి పెద్దలకన్నఁ బెద్దయై
నెల వొకచోటు నాఁక మఱి నింగియు నేలయునిండఁ బొంగియున్
దులువలు లెల్ల లేడనఁగఁ దోచెడుదైవము తాను నేనయై
వెలిగెడుజోతినిం దలఁచి వేయితెఱంగులఁ గొల్వఁగాఁదగున్. 192

వ. అని యనేకవిధంబుల వేదాంతోపదేశంబు చేసి వసిష్ఠుండు వెం
డియు నోరాజేంద్రా! నీ వింకనిహం బాసింపక పరంబు దెస వాఁడవు
కమ్ము నీ కిపుడు చింతాజ్వరం బావహించినది యిది నాసత్య
చరకాదుల కైన నసాధ్యంబు నింతలో నిది నీసర్వదుఃఖంబులం
జల్లార్చు నని చెప్పి కౌసల్యాదులతో నాతని నేమరక సేమ మూర

యుచుఁడుండని సూచించి నిజోటజంబునకు నిర్గమించె నంత నక్కడ రామచంద్రుఁడుండు మాతృకాదిజనంబు మరలి చనినప్పుడు సరయువునం దిగి జలోపస్పర్శనంబు చేసి సుమంత్రుం గని యి ట్లనియె. 193

—♦రాముఁడు సరయూ వృత్తాంతము చెప్పుట♦—

సీ. ఈసరయూనది నీక్షింతువె సుమంత్ర
జీవనదాత్రి యీతీతలమున
కానాఁడు సాకేతమందు వైవస్వత
మను విల యేలుసమయమునందు
నిట యజ్ఞ మొనరింప నెంచి వసిష్ఠున
కెఱిఁగింప నాఁత డోనృపవరేణ్య
నది లేనిచోటు నది చేయు నొప్పదు
నీపేర్మి చెల్లఁదె యిమ్మెపురమ్ము
తే. దరికిఁ బుణ్యప్రద మ్మగుపరమతటిని
దానితీరమునఁ సప్తతంతుతంత్ర
మాచరించినఁ దేవత లనుమతింత్రు
దాన నెంతేనిఫల మగు మానవేంద్ర. 194
తే. శ్రుతిమలిమ్లుచు మడియించి శ్రుతులఁ దెచ్చి
హరి సుమేరువుపైనుండి హర్షబాష్ప
ములను విడె నవి యే అయి పొరలి బిందు
సరమునందుండి మానససరముఁ జేరె. 195
శా. ఆతీర్థం బిట కీవు తెచ్చితివయే నత్యంతముఁ బొల్చు సా
కేతం బియ్యది దీనిచెంత సవముల్ కీర్తింపనై యొప్పు భూ
పా! తద్యత్న మొనర్పు మి వ్వనఁగ నౌ నం చాతఁ డమ్మానసా
ఖ్యాతం బైనసరోవరంబుకయి వేడ్కఁ వైచె దివ్యాస్త్రముఁ. 196
వ. దానంజేసి సరోవరంబు తెగి జలం బంతయు నింతలో వెల్లువయై ప్రవహించుచుం బఱతెంచి యిట్లు కోసలంబు నాక్రమించి శరపా

తంబున నైనదికొవ్వున శరయువు సరయువునను నామంబులందాల్చె
నని ప్రశంసించుచు మఱి యెన్నినాళ్ళకోయని తాను దజ్జలంబులం
ద్రావి తనవారిం గూడఁ ద్రావించి తదనంతరంబ. 197

చ. సరయువు దాటి కొంతచని సారథిఁ గన్గొని యోసుమంత్ర! యీ
పురజను లెంతవెట్టులోకొ పొం డని చెప్పినఁ బోక వెంబడిం
తురు మన మెట్టులే నొడివి తో సరుదేరకయుండ నిల్పుటల్
వర మని వారిఁ గాంచి కడువత్సలతం బచరించి యిట్లనున్. 198

ఆ. అన్నలార! మీర లతిదూర మరుదెంచి
నారు మరలుఁ డింక సారథియును
మరలువాఁడ మేము గిరిదుర్గములదారి
వట్టి పోవువార మిట్టియెడల. 199

క. మీమీవారలతోడన్
మే మరిగియుఁ గొంతలోన మీదర్శనముం
బ్రేమం జేయుదు మనుచున్
సామమునం బలికిచి మఱవ సలుపుఁడు మమ్మున్. 200

ఆ. అన సుమంత్రుఁ డనియె నార్యులారా! మీరు
రాఁగ వలదు మీఁద రామునాజ్ఞ
మీఱవలదు మరలి మీమీగృహంబుల
కరుగుఁ డనుచు వారి నంపిపుచ్చె. 201

వ. తాను గతిపయజనపరివృతుండై సీతారామలక్ష్మణుల ననుసరించి
పోవుచున్నప్పుడు మార్గమధ్యంబున. 202

—♦ పల్లియుల మునులు రాము నెదుర్కొనుట ♦—

సీ. మునివాటికలనుండి మునులుం పత్నులతోడ
నగ్నిహోత్రములతో నరుగుదెంచి
శ్రీమహావిష్ణువులే మీర లని జాన
కీరాములకు శుభశ్రీ రచింప

నీరాజనము లిచ్చి చేరి యటీశ్వర
సుప్రసాదం బని సుమము లొసఁగి
హింగుదీఫలముల నిచ్చి సక్తు వాకింత
వారిచేతులలోనఁ గోరిపెట్టి

తే. వాజపేయాధ్వరంబుల వారు పొంది
యున్నఛత్రంబులను వారెయుత్తమాంగ
ములను నాతప మది తాఁకుదలకు రాని
యట్లు పట్టిరి భక్తిపెం పతిశయిల్ల. 203

వ. రామచంద్రుండు వారిభక్తిప్రపత్తులకు సంతృప్తిం జెంది మీ రింక రావల దని వారి నంపిపుచ్చి సాయంసమయంబునకుఁ దమసా నదీతీరంబునకుం జని స్నానసంధ్యాదివిధులందీర్చుకొని ఫలాహారం బయినం గావింపక జలాహారంబు గావించి లక్ష్మణుండు విల్లం బులు పూని యులంగంబు దిరుగుచుండ నారాత్రి సీతారాములు భూశయ్యం బండి సుఖనిద్రం గావించి మఱునాఁ డుదయంబునఁ బయలుదేరి గోమతిం దాటిదక్షిణోత్తరకోసలంబులతిక్రమింపనున్న యప్పుడు రామచంద్రుండు సాకేతంబుదిక్కు మొగంబై చేతులు జోడించుకొని. 204

—♦ రాముఁడు సాకేతంబును దల్లిదండ్రులం దలంచు కొనుట ♦—

శా. కాకుత్స్థాన్వయరాజచంద్రులు భవద్గర్భంబునం దుండి లో
కైకఖ్యాతి మహానుభావు లగుచుం హార్వొంది లోకత్రయిన్
వాకో నొప్పిరి నిన్ను వార లెపుడుం భక్తిం బ్రదర్శింతు రో
సాకేతంబ ననుం దలంపుము నమస్కారంబు గావించెదన్. 205

వ. అని ప్రస్తుతించుచున్నంతలోఁ గన్నతల్లి జ్ఞప్తికి వచ్చుటంజేసి కంట నీరు వెట్టుకొనుచు. 206

ఆ. నన్నుఁ గన్నతల్లి నాపాలిదైవంబు
కంట నీరు గారఁ గాంచి నన్నుఁ

బోయిరమ్మ బిడ్డ పోయిర మ్మనుచును
విడువ లేక లేక విడిచె నన్ను. 207

ఆ. కౌఁగిలించి శిరము కరమునం బుడుకుచు
మూరుకొనుచు మోము ముద్దుగొనుచు
తండ్రి! నన్ను విడిచి తరలిపోవుదె యన్న
కన్నతల్లి మరలఁ గనుట యెపుడొ. 208

మ. కనులం గాఱెడు నీట నాశిరము వెక్కం దానమాడించి న
ట్లను వొందం దన పైఁటచెంగునను నెయ్యం బేర్పడన్ మార్జనం
బును గావించుచు వెండియుం దడుపుచున్ ముద్దాడుచుం బ్రోచునా
జననిం గాంచెడుభాగ్య మెప్డయిన నీజన్మంబునం గల్గునో. 209

శా. నామూత్రంబు పురీషముం దనదు నన్నంబందుఁ బడ్డప్పుడే
నేమాత్రంబును మానసంబునను దా నేవం గొనం బోక లో
నామోదించి సుధాసమంబు గను నాహారించు నాతల్లి నే
నీమాడ్కిన్ విడనాఁడ నైతి నకటా యెట్లీవ్యథం బాయుదున్. 210

చ. కొడుకును గన్నఁ దన్నతఁడు కొండపయి న్నిలువంగఁ జెట్టుసన్
జడమతి నెన్నిపాట్లొ పడి సవ్వడి కోరిచి నిట్టువాసముల్
కడుకొని యెన్నితో సలిపి కాంచెను మాయమ నన్నుఁ గించునిన్
గొడుకయిపుట్టి నే నమకు గోడు ఘటిల్లఁగఁ జేసితిం గటా. 211

వ. అని తండ్రిం దలంచుకొని. 212

చ. వర మిడు మంచుఁ గైకనుడి వచ్చి చెవిం బడునట్లు తాకినన్
విరవిరవోయి నేలఁ బడి వేఁడివెలార్చెడు మేనఁ బ్రాణముల్
తొరగినవో యనంగ నయి తోఁపఁగ వచ్చినకన్నతండ్రి నే
నర సెడుభాగ్య మెన్నఁటికి నైన లభించెడినే సుహృద్వరా. 213

తే. కొడుకు లుదయించి తనకేమొ కూర్తు రనుచు
గంపెడంతాస నెంతేని కష్టి కోర్చి
పడసె నేకాని వారలవలనఁ దనకుఁ
గలుగులాభము లే దని తెలియ వచ్చె. 214

క. కానక కన్నకుమారునిఁ
గానల కంపంగ లేదు కాంతామణికిన్
దా నిష్టవరము గాదనఁ
గా నేరం డట్టితండ్రిగతి కే వగతున్. 215

వ. అని యనేకవిధంబుల విచారించుచు మంత్రిం జూచి సుమంత్రా! మన మీరాత్రి యీతీరంబున నాహింగుదీవృక్షంబుకడ విశ్రమింత మని పలుకుచు ని ట్లనియె. 216

మ. కనుఁగొంటే సచివాగ్రణీ! యిదిగో గంగాకూలమందున్ ముదం
బనుసంధించుచు శృంగిబేర మనునాఖ్యం గొన్నగ్రామం బిటన్
ఘనుఁడై కానఁగ వచ్చెడిన్ గుహుఁ డనంగా నొప్పు నాభక్తుఁడై
మును నాపాదయుగంబుఁ గడ్గి యుదకంబుం బూనె శీర్షంబునన్.

— గుహుఁడు రాముని దర్శించుట. —

తే. అనుచుఁ బలికెడునంతలో నాగుహుండు
పుత్రమిత్రకళత్రముల్ మూఁగి కొనఁగ
నర్ఘ్యపాద్యాదులం గొని యరుగుదెంచి
రామచంద్రునిపదముల వ్రాలె నపుడు. 218

ఉ. ఆతని లేవనెత్తి కరుణాకరుఁ డారఘురామచంద్రుఁ డో
పూతచరిత్ర! క్షేమముగఁ బ్రొద్దులు పుచ్చుచు నుంటె నీప్రజల్
నీతలిదండ్రులున్ సతులు నీదగుసర్వము సౌఖ్యసంగతిన్
బ్రీతి నెసంగుచుండెఁ గదె పేర్కొన వోయి గుహోపమా గుహా.

ఉత్సాహము. అనిన నాతఁ డిట్టు లనియె ననఘ! సర్వసౌఖ్య మే
మని వచింతు నాదుతండ్రి యైన రాఘవుండు తా
మునివ లెన్ వనంబువెంటఁ బోక కేమి వచ్చెనో
కనఁగఁ గనఁగ నాదుగుండె కఱఁగి కాల్వ గట్టెడిన్. 220

వ. ఆనతీయుం బ్రార్థింతు ననిన రామచంద్రుండు. 221

సీ. మాతండ్రి కేకయమహీపతి కప్డు
మాట యిచ్చెను నీదుమనుమని నేను
భూతలపతిఁ గాఁగఁ బొనరుతు నంచుఁ
బూజ్యులనుడి శీర్షమునఁ బూని నేను
నాతమ్ముఁడుం దన్వి నాతోడ రాఁగ
నకచివచ్చితి నరణ్యంబుల నుండు
ప్రీతి మై నిదిగాక విపినములందు
వింతలం జూడంగ వేఁడుకయు నగు. 222

తే. అనిన నొండాడ నోడి లో నక్కజ పడి
రామ సుగుణాభిరామ! నే నీమహత్వ
మెఱుఁగ నెంతటివాఁడ బ్రహ్మేంద్రముఖ్యు
లైన నెఱుఁగంగఁ జాలర యంచుఁ బలుక. 223

ఉ. కారణజన్ముఁ డీ వగుదు కంజవిలోచన! దుష్టశిక్షణం
బారసి చేయఁ బుట్టితి వహర్పతివంశవిభూషణంబవై
శ్రీరమణీలలామ మగు సీతమ యీయమ నే నెఱుంగుదున్
మీరు త్రిలోకపూజ్యులరు మిమ్ము భజింతు నిరంతర మ్మెదన్. 224

క. అది శృంగిబేరపుర మ
య్యది నాగృహ మందు భగవదంఘ్రియుగంబున్
బొదలింపఁ గోర్కి నావుడు
సదయుఁడు రఘురాముఁ డనియె సత్కృపతోడన్. 225

క. వనవాసదీక్ష నుంటిన్
వనచరవర! నీదునింట వసియించుటకున్
గన నసువు పడవు శాస్త్రము
లని చెప్పుచునుంటి విడువు మది మదిలోనన్. 226

వ. అనిన గుహుండు కానిమ్ము నే నెట్లయినం ధన్యుండ నని శ్రీరా
మునిపాదంబులు గడిగితీర్థంబుస్వీకరించిశిరంబునం జల్లుకొనితనవారి
కండఱకుఁ బాదతీర్థం బిచ్చి మధురమధురంబు లగుఫలంబులును
బుట్టతేనెయుఁజారపప్పును హయ్యంగవీనంబును బాలుపెఱుగువెన్న

లోనగు నుత్తమపదార్థంబులం దెచ్చి యిచ్చినం బరిగ్రహించి శ్రీరా ముండు సీతాలక్ష్మణులకు సుమంత్రాదులకు నిచ్చి తాను భుజించె లక్ష్మణుండు భుజింపక వానిసుమంత్రున కిచ్చినం గాంచిరాముండు.

తే. ఏమిలక్ష్మణ గుహుఁ డిడు నీఫలాదు
లేల భుజియింప వన నతం డీవనములఁ
బదియునాల్గేండ్లు తింటియు నిదుర మాని
యన్న సేవింపు మని తల్లియాజ్ఞ గాన 228

వ. అప్మాట కందఱు నత్యాశ్చర్యంబు నొంది లక్ష్మణునగ్గించి రప్పుడు గుహుం డాహింగుదీవృక్షంబుక్రింద పుష్పశయ్యం గావించి నివే దించినసీతారాము లందు శయనించిరి సుమంత్రాదులు దవ్వులం బండుకొనిరి గుహుండు లక్ష్మణుండును ధనుర్బాణతూణీరపాణులై వారికిఁ జుట్టుం బ్రహరితిరుగుచు మృగాదులు రాకుండఁ గాపాడు చుండి రట్లు శయనించినసీతారాములు. 229

—♦సీతారాములు గంగ కడ శయనించుట♦—

ఉ. ఒండొరుఁ గౌఁగిలించుకొని యొక్కతెఱంగున నిద్దియెద్దియో
మెండగునాసతోఁ బెదవి మీఁదికి నెత్తక మందమందమై
యుండెడుతీఱునం బలుకుచుండెడువారికి నెన్ని యామముల్
నిండె నంగ నేర్పడక నట్టన రాత్రి తనంతఁ దాఁ జనెన్. 230

వ. ఇట్లారాత్రిక్షణమాత్రంబుగం గడపి సీతారాము లరుణోదయంబు నన లేచి కాల్యకృత్యంబులు దీర్చియున్నయప్పుడు సుమంత్రుండు రామునిం జూచి. 231

తే. దశరథుఁడు నన్నుఁ బంచి నాతండ్రితోడ
గంగవఱ కీవు జని నాప్రసంగముగను
వని వసించితి వింక నీవనితతోడఁ
బురకి రాఁజెప్పి తెమ్మని పుచ్చె నన్ను. 232

క. రామా! తండ్రిమనోరథ
మేమెయిఁ దీర్చెదవొ నాఁగ ని ట్లను నతఁ డీ

సీమము విడుచుట నాకుఁగా
క్షేమముగా దిట్లు నేను జెప్పుదు సూతా. 233

వ. అని సీత దెస మొగంబు ద్రిప్పి యి ట్లనియె. 234

చ. అడవుల సంచరించుటకు నబ్జదళేక్షణ నీకు నెంతయే
నిడుమకుఁ గారణం బగు నిఁ కింతటితో వనవాసకష్టముల్
విడివడఁ జేసికొం చితని వెంబడి నేగుము నీ వయోధ్య క
క్కడఁ నిను నత్తమామ లెద గారవ మారఁగఁ జూతు రాదృతిన్.

తే. అనుడు జానకి యను నార్య! వినుము చంద్రుఁ
బాసి చంద్రిక యేరీతి పరఁగఁ బోదొ
యట్లు నినుఁ బాసి యే నుంట యది యబద్ధ
మేను మెయినీడవలె నంటి యే మెలఁగుదు. 235

వ. అనిన రాముండు కష్టసుఖంబు లనుభవించుదానవు నీవు నీచిత్త ము
ని సుమంత్రుం జూచి నీ వింకమీఁద రా వలదు గంగ దాటించి
వచ్చితి నని మాతల్లితండ్రులకుం జెప్పుము నేను లేనిలోటు వారికి
లేకుండఁ జేయుభారము నీయధీన మని చెప్పి బుజ్జగించి పోవం
బుచ్చె నని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు
మని సూతు నడుగుటయును. 236

ఆ శ్వా సాం త ము

శా. శ్రీవైకుంఠపురంబు గట్టి యచటం జెన్నొందుచుం ద్యాగ భో
గా వాసార్థ విభుత్వముం బడసి నిత్యం బర్థికల్పద్రుమం
బై వెల్గొందినరామమంత్రి బలె విఖ్యాతాఖ్య ద్వైత్రీతికిన్
దా వైవేంకట రామమంత్రి ధరణిన్ దళ్కొత్తు నిత్యోన్నతిన్.

గ ద్య ము

ఇది శ్రీమహామహోపాధ్యాయ కలాప్రపూర్ణ కవిరాజ
కవిసార్వభౌ మాంధ్రవ్యా సాభినవశ్రీనాథ వేదవిద్యా
విశారద శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి ప్రణీతం
బయిన శ్రీకృష్ణరామాయణంబునందు
నయోధ్యాకాండంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు

# శ్రీకృష్ణరామాయణము



## అయోధ్యాకాండము

### ద్వితీయాశ్వాసము





రామభక్తితత్పరుఁ
డై రాముని పేరఁ గృతుల నల్లించి మహో
దారుం డగు వేంకటరా
వారోగ్యము భాగ్య మొప్ప నభివృద్ధిఁ గొనున్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు శ్రీరామచం
ద్రుండు సుమంత్రుం బోవఁ బనచి గుహుం గాంచి. 2

—♦సీతారామలక్ష్మణులు గంగ దాటిచనుట♦—

క. మము గంగానది దాటిం
పుము నావుడు గుహుఁడు నావఁ బొంతకుఁ దే సీ
తమతో రాముం డెక్కెన
సమయమునన్ లక్ష్మణుండు చయ్యన నెక్కెన్. 3

వ. అంతగుహుండు పడవనడుపుచు. 4

చిత్ర. రామచంద్ర నీ-రమ్యపాదపద్మముల్
నామనంబులోన్-నాటుకొల్పి కొల్చెదన్
బ్రేమతోడ-నాబీతు వాపి ప్రోవుమా
నీమహత్వమున్- నే నటించినట్టెడన్. 5

ఆ. ఇట్లు పాడుచుండ నింతలో నవ్వలి
తీరమునకు నావ చేరుటయును

గుహుఁడు రామచంద్ర! కూలముఁ జేరితి
మెట్లు నిన్ను విడువ నేను నేతు. 6

వ. సీతారామలక్ష్మణులు నావ నవరోహణంబు చేసి గుహు నా
దరించి పుచ్చి ప్రయాణోన్ముఖులై రంత. 7

చ. రఘుకులసింధుసోముఁ డగురాముఁడు సానుజరాముఁడై జగ
ద్విఘటితపుణ్యసంఘ జలవిస్రుతతుంగతరంగ గంగఁ దా
లఘుగతి దాటి దుష్టమృగలక్షణలక్షితసాధ్వసం బర
ణ్యఘనపథంబు వట్టి యడియాసల ధైర్యము దోపఁబోవుచున్. 8

వ. ఇట్లు కొంతదూరంబు నడిచినంత సీత నడువఁ జాలక జాలింబడి
ప్రాణేశ్వరుం గాంచి యి ట్లనియె. 9

చ. అడుగోకయామ డయ్యెడిని ప్రాణవిభూ! యిక నెంతదూర మే
నడవఁగ నొప్పు నూర్పులు గనంబడుచున్నవి చెమ్మటల్ కడుం
గడు సకలాంగకమ్ములను గ్రమ్మెడుఁ గాళులఁ బొక్కులెక్కె నొ
క్కడుగును వేయఁ జాల నిఁక నం చటఁగూలఁబడెన్ ధరాస్థలిన్. 10

వ. కాంచి రామచంద్రుండు కటకటంబడి లక్ష్మణునిదిక్కు మొగంబై
యి ట్లనియె. 11

—♦ నడువలేనిసీతం గాంచి రామలక్ష్మణులు వగచుట ♦—

శా. కంటే తమ్ముఁడ! దైవసంఘటన లోకంబందు నెవ్వారికిన్
గెంటన్ రాదు సుమీ మహావిభవయుక్తిం బొల్చురారాజు మే
ల్పంటై నోముల కెల్లఁ బుట్టి చనునీపద్మాక్షి కార్యానలోఁ
గంట న్నించుచు నక్షువుల్ నడచెడిన్ గష్టమ్ముగా నిత్తతిన్. 12

తే. కటికులా లొత్తి యుటుకాళ్ళు గాడి వెడలు
క్రొత్తనెత్తురు లాక్షనాఁ గొమరుమిగిలె
బిఱుసుపాంజేబు మువ్వలవరుస కరణి
నకడఁ బొడమినబొడిమయి నాతి కమరె. 13

వ. అని జానకి నాశ్వాసించుచు. 14

సీ. అతివరో! పరభర్మహర్మ్యతలంబులే
బహుభీకరదంబు లీపర్వతములు
తరుణిరో! నిరుపమోద్యానతలంబులే
కడుసంకటంబు లీకాననములు
వెలఁదిరో! బహుమూల్యపీతాంబరంబులే
వర్ష్మంబు నొరయు నీవల్కలములు
సకియరో! రుచికరశాల్యోదనమ్ములే
యతికషాయమ్ము లీయాకలములు

తే. అకట! రాజాధిరాజున కాత్మజాత
వైననీ కిట్టికొండల మావహిల్లెఁ
గదె యదృష్టవిహీనుల మొదటిలెక్క-
వాఁడ నైయున్ననాచెట్టఁ బట్టఁ బట్టి. 15

వ. అంత లక్ష్మణుండు కంట నీరువెట్టుకొనుచు జానకి నుద్దేశించి
రాముం గాంచి. 16

సీ. గడియ పూఁదోటలో నడయాడలే దీమె
నడవిఁ బెక్కేం డ్లెట్లు నడచు నన్న
నన దాఁకి కందెనం చనుమృదులాంగి నా
రలు గట్ట నేరీతిఁ దలఁక దన్న
చెలులతో మాటాడ వలసెదునబల ర
క్కసిరాపులకు నెట్లు కలఁగ దన్న
జవకుని కే సమక్షమున నుత్తరమీని
యది యాటవికుల నె ట్లాడు నన్న

తే. కటకటా లోకముల నేలఁ గలిగినట్టి
యెట్టివారికిఁ బ్రారబ్ధ మెట్టు లైన
ననుభవింపక పోదన్న నవల నుండు
హీనజనులను జెప్పంగ నేటి కన్న. 17

వ. రామచంద్రుండు చంద్రముఖిం గాంచి వెండియు. 18

ఉత్సాహము. ఎండకన్న వానకన్న నెఱుఁగ వీవు జనకభూ
మండలేశపుత్రి రాక మాను ముండు మింట నా
నుండ దేవ! నిన్ను విడిచి యొక్కగడియ యేని నీ
యుండ స్వర్గ మనుచు వనములందుఁ జొచ్చి తీ వయో. 19

వ. ఇట్లు పరితపించుచు రామభద్రుండు భూదేవిం దిలకించి కృతాం
జలిపుటుండై. 20

—♦ రాముఁడు భూదేవిం బ్రార్థించుట ♦—

చ. కడుపునఁ గన్నబిడ్డపయిఁ గల్గుట సాజము కూర్మి తల్లికిన్
గడుపునఁ బుట్టె నీకు జనకక్షితిపాలకుమారి యిట్లు లి
య్యడవి నడంగఁ జాలక మహావ్యథ నొందుచునుండె దీనిపై
నడరఁగఁ జేయఁగాఁ దగు దయారస మంచు వచించునంతలోన్. 21

ఆ. నడువ శక్తి గలిగి నలినాక్షి జానకి
నడుతు ననుచుఁ గ్రింద నడుగు లిడఁగఁ
బుడమి మెత్తఁబడినపోలిక నామెకు
నడుగు లిడినచోటులందుఁ దోచె. 22

వ. అట్లు శక్తి గలిగి జానకి నడువ సమర్థురాలై మెఱింగించిన
రాముండు లక్ష్మణునితో లేచి పయనంబై నడచి కొంతవడికి
గంగాయమునామధ్యగతం బగువత్సదేశంబు నందలి ప్రయాగ
రాజంబునకుం జని తదంతికంబున భరద్వాజాశ్రమంబు కల దని విని
చని ద్వారదేశంబున నొకమునిశిష్యుం గని నీవు పోయి మీగురు
వర్యునితో. 23

చ. దశరథరాజనందనుఁడు దాను దన్వియుఁ దమ్ముకుఱ్ఱయున్
యశమును గోరి కారడవియందు వసింపఁగ నెంచి పోవుచున్
బశుపతితుల్యులైనమునివర్యుల మిమ్ముఁ గనుంగొనంగ నై
ప్రశమన మెంచి వచ్చి కుటివాకిట నుండె రటంచుఁ జెప్పుమా.

తే. అనిన నాతఁడు లోపలి కరిగి రాముఁ
డరుగుదెంచుట మునిపతి కెఱుఁగఁ జేయ
నాతఁ డగ్నికార్యము దీర్చి యతని కెదురు
వోయి తోడితెచ్చి పూజించెఁ బూర్ణభక్తి. 25

—♦ రామాదులు భరద్వాజాశ్రమంబు చేరుట ♦—

వ. అంత శ్రీరామచంద్రుండు. 26

ఆ. ఓమునీంద్ర! నేను రాముఁడ నీసతి
జనకపుత్రి నాదు జాయ యితఁడు
నాసహోదరుండు నాతండ్రిపంపున
వచ్చినార మేము వనుల మెలఁగ. 27

వ. అనిన విని భరద్వాజుండు వారికి సుఖాసనం బొసంగి మధుపర్కం బొసంగి యిట్లనియె. 28

శా. మాయామానుషవిగ్రహుండ వగురామా! యిట్లు నాదర్శనం
బీయోజం బొనరింప వచ్చితివె ని న్నింద్రాదిరుద్రాదులే
నేయెంతో తపియించి కాని కనలే రే ధన్యుఁడన్ మాన్యుఁడన్
నాయాత్మన్ నిను నే నెఱుంగుదు రమానాథుండ వీ వారయన్.

మ. వనవాసావసరంబు నాల్గుపది యావర్షంబు లియ్యాశ్రమం
బున మీరల్ వసియింప వచ్చు ననుచున్ బోధింతునన్నన్ మునిన్
వినతుల్ సేయుచు రామచంద్రుఁ డను నోవిప్రోత్తమా పత్తనం
బునకుం దాపున వాస ముంటకు మనంబుం జేయఁబో నెవ్వడున్.

తే. మాకు వసియింప ననువగుమహి నొకండు
వెదకి చెప్పుము నావుడు వేదవేద్య!
యిటకు నొక్కింతదవ్వున నెసక మెసఁగు
మహితవాల్మీకిమున్యాశ్రమం బొకండు. 31

వ. అటఁ జిత్రకూటం బనుపర్వతరాజంబు గలదు దాని కిరుగడ ననేక ఋష్యాశ్రమంబు లున్నయవి మీ రందుఁ బర్ణశాలం గట్టుకొని నివాసంబు గావింపుఁ డని మఱియును. 32

క. ఎందఱో మానులు మున్నటఁ
గొందలమందక తపంబు గొని చేసి కడుఁ
బొందులతో స్వర్గంబుం
బొందిరి తత్థ్సలమహత్త్వమున రఘురామా. 33

వ. మీ రందు నివసించియుండు డని నాఁటిరాత్రివారి కాతిథ్యం బొసంగె వారు నారాత్రి యట సుఖనిద్రం గావించి ప్రాతఃకాలమున లేచి కాల్యకృత్యంబులు దీర్చుకొని భరద్వాజునకు మ్రొక్కి యనుజ్ఞం గొని తచ్చూచితమార్గంబు పట్టిపోవుచుఁ గాళిందిఁ దాఁటి శ్యామవటంబుం గాంచి పూజించి మందగమనంబునఁ జిత్రకూటమ్ముఁ జేరి రదియును. 34

—♦ చిత్రకూటాభివర్ణనము ♦—

సీ. అతిరమ్యవృక్షసమంచిత మతులిత
మధుజలనిర్ఝర ప్రథితతలము
వివిధపక్షిగణ ప్రభిన్నరవోపేత
మమలమున్యాశ్రమ సముచితంబు
బహువిధపుష్పసంభూత శీతలవాత
పోతసమాక్రాంతభూతలంబు
కందమూల ఫలాది సుందరకాంతార
పరివృత సర్వదిగ్భాగనుతము

తే. సాధుమృగసేవితము మునిజనవరేణ్య
కల్పితానల్ప హోమసంకలితధూమ
సంభృతము సంతత శ్రుతిస్వరయుతంబు
గుణవిచిత్రకూటము చిత్రకూటనగము. 35

వ. దానిం జూచి యానందించుచు సీతారామలక్ష్మణులు మువ్వురు నవ్వగలం బాసి యట నున్న వాల్మీక్యాశ్రమంబునకుంజని తమ్మెఱింగించుటయు నట నానామునిజనపరివృతుండై సుఖాసీనుండై యున్నవాల్మీకి వారిం గని వడివడి లేచి యెదురువోయి చేతులు

జోడించుకొనియున్నవారిం దోడి తెచ్చి దర్భాసనాసీనులం గావించి
స్వాగతంబు వలుకుచుం బూజించి యి ట్లనియె. 36

మ. పదివేలేండ్లకు మున్ను నే నెవనినిన్నా ప్రాభవం బెల్ల స
మ్మదమొప్పన్ శ్రుతిసమ్మతం బనుచు నెప్డుం జెప్పుకొంచుఁ శ్రవః
పదమందుం గొనియుంటినో సకలదేవవ్రాతసంసేవితుం
డు దయారూపుఁ డతండు పొల్చి నను ధన్యుం జేసె నిప్పట్టునన్.

ఉ. ఎవ్వనినామమంత్రజప మెప్పుడుఁ జేయుచునుంటఁ జేసి నే
నివ్విధి వ్యాధతన్ విడిచి యిద్ధమునీంద్రుఁడనై కవీంద్రుఁడై
యెవ్వనికిన్ లభింపని యహీనయశంబున కాలవాలమై
యివ్వగ నుంటి నట్టి జగదీశ్వరు నీశ్వరు నిన్ భజించుచున్. 38

వ. అని వాల్మీకిమునీంద్రుండు పరమానంద కందళితహృదయారవిం
దుండై కొండొకకాలంబున ధ్యాననిమగ్ననిశ్చల చిత్తుండైయుండి
కొంతలోఁ జెంత నున్న శ్రీరాముం గాంచి నీవు నివాస
యోగ్యప్రదేశం బరయ చున్నవాఁడవు రమ్ము చూపెదనని గంగా
నదికిని జిత్రకూటంబునకును మధ్యభాగంబునం గలభూమిం జూపి
యిదిపరమోత్తమస్థలం బిట నాశ్రమంబు నిర్మించుకొని యుండు
నది యని చెప్పి తాను దనయుటజంబునకుం జనియె నంత సీతా
కాంతుండు లక్ష్మణునిం బిలిచి యి ట్లనియె. 39

—♦ చిత్రకూటంబునఁ బర్ణశాల నిర్మించుకొని నివసించుట ♦—

చ. ఇట నొకపర్ణశాల రచియింపఁగ నొప్పెడు దానిచుట్టునుం
బటుతర సత్త్వముల్ చొఱఁగఁ బాఱఁగ శక్యము కానియట్లు గా
నటు నిటు ద్వారముల్ గలుగునట్లుగఁ జిక్కనియీఁతచెట్లతో
స్ఫుటముగఁ గంచె నా నిలిచి పొల్చెడునట్లుగ నుండఁగా నగున్. 40

తే. వెదురుబొంగులు వాసముల్ వెదకి తెమ్ము
పొరుటాకుల కప్పున వాన యెండ
గలుగకుండ నొనర్త మిత్త్రలమునందుఁ
జదరముగఁ జేయుచుందు భూజముల్ గొట్టి. 41

వ. అని లక్ష్మణుఁ బుచ్చి రాముం డా ప్రదేశంబునం గలచెట్లు జే
మలం దెగఁగొట్టి మిట్టపల్లంబులు లేకుండ సరిచేయుచుండె నంత
లో లక్ష్మణుండు శాలానిర్మాణోపయోగదారువిశేషంబులెల్ల నల్ల
నం దెచ్చె నంత రాఘవుండు. 42

సీ. స్వస్తి వచించుచు శంకువు స్థాపించి
స్తంభముల్ పాతి వాసములు గూర్చి
వెదురులు చిక్కగా వేసి పెండెలుగట్టి
పారుటాకులకప్పు పరఁగఁ జేసి
వెలుపల నరుగులు వేసి సీతయుఁ దోడు
పడఁగ వేర్వేర్గదుల్ పదిలపఱచి
యగ్నిహోత్రగృహంబు నర్చనాగృహమును
జపతపస్స్వాధ్యాయ సదనములును

తే. గలుగునట్లు దడుల్ గట్టి కడల నొక్క
వరచతుశ్శాల నిర్మించి వనిత లెపుడు
నెవ్వుడును బ్రసంగములు సేయ నెసఁగుగదియు
పరఁగ నిర్మించి రచ్చోటఁ బర్ణశాల. 43

వ. అప్పు డొక్కశుభముహూర్తంబున రామచంద్రుండు స్వస్తిపుణ్యా
హవాచనవాస్తుపూజాదులు గావించి గృహప్రవేశంబు చేసి వన
దేవతల గృహదేవతల నారాధించి కందమూలఫలంబుల బ్రాహ్మణ
సమారాధనంబు గావించి జాయానుజసహితంబుగ నందు నివా
సంబుండి మునుల సేవించుచు సత్కథాకాలక్షేపంబు సేయుచు
నొక్కనాఁడు సీతాసమేతుండై వనవిహారము గావించుచు వన
రామణీయకం బెల్ల వేఱువేఱం జూపుచు ని ట్లనియె. 44

—♦ రాముఁడు సీతకు వనవైభవంబు వర్ణించి చెప్పుట ♦—

చ. ఫలితరసాలసాల ఫలభక్షణముం గొని లో మదించి రా
చిలుకలపిండు రోషమతిచే మొగమెల్లను ముక్కు గాఁగ వా

క్కలకల మొప్ప నిన్ గెలువఁగా నిట వచ్చుచునుండెఁ జూచితే
చిలుకలకొల్కి రాజు పరుఁ జేరిన సంపదఁ జూచి సైచునే. 45

ఉ. కాకులు ప్రోచుటం దనకుఁ గల్గమి నీవలె నాద మూర్తి నే
కాకిని నిన్నుఁ గన్గొనఁగి కాంతరో! నీస్వనముల్ హరింపఁ బుం
స్కోకిల పిల్చుచుండె నదిగోఁ గనుగొంటివె మావిమీఁదఁ గూ
హూకలనాద మొప్ప ఖలు లోర్తురె యన్యులకల్మి కిద్దరన్. 46

మ. కలికీ! కింశుకవృక్ష మక్కడన యొక్కండైన పత్రంబునుం
దెలియం జాలనియట్లు పూచి యదిగో దీపించు నీచెంత భ
క్తులు దేవీనవరాత్రకాలమునఁ ద్రోఁగుం జేసి పూజింప ముం
గిళులం బోసినకుంకుమం బనఁగ రక్తిం గూర్చెదుం జూచితే. 47

క. వనదేవత కాహారము
పొనరింప వసంతమాధవుఁడుఁ రాశిగఁ బో
సినక్రొత్తమాంసమో యనఁ
బొనరెడుఁ గనుగొంటె దీనిఁ బూర్ణేందుముఖీ. 48

క. రాచిలుక కొమ్మమీఁదం
దోచి సమీపమున నున్నతొండిమలమొగ్గన్
రాచుచుఁబొడిచెడు ముక్కునఁ
జూచితె నాపోల్కి నీకుఁ జొప్పడ దంచున్. 49

తే. తండ్రి పెరచోటికిం బోయి తనకు లడ్డు
కమ్ము దెచ్చెడు నని బిడ్డ కనెడు కరణి
నగ్నిహోత్రుఁడు పెరచోటి కరిగి యాజి
మోదుగుం దెచ్చుఁ దన కని మోద మొందు. 50

ఉ. అండజయాన చూచితివె హర్మ్య మొసంగెడు దంతిసంతతుల్
పిండులు గట్టి చిట్టడవి పెద్దలు ముందు నడంగ నల్లనన్
దొండము లెత్తి ఫూత్కృతులతో విలసిల్లుచు నల్లచాయలన్
గొండలసందులన్ నడచుకొండలొకో యనఁ జూడ నొప్పెడిన్ 51

చ. కనుఁగొను మల్లలోయల నఖండగతిం బ్రవహించువాఁగులన్
బనువడునాగరంగములు పచ్చఁగఁ బండినపండ్ల నిండి పైఁ
జనుమన కిప్ప తోఁచెడి వసంతునిరాకకు వేచి మోములన్
వనవనితామణుల్ పసపు వాసి నెసంగఁగఁ దాల్చిరో యనన్. 52

తే. గాలివీఁకునఁ దరుశాఖ గదలి తాక
జుమ్ము రని రేఁగమధుమక్షికమ్ములంతఁ
దెగి పెరలనుండి కారెడుతేనె లాని
గంతుల న్వేయుఁ గోఁతులఁ గంటె కాంత. 53

మ. వనమాకందఫలంబు ముక్కులను గ్రుంపం బూని పాదంబునం
గొని పాపైకము కొమ్మపై నిలిపి చెక్కుల్ తీసి భక్షించుచున్
బనితప్రక్రియఁ బల్కుచుం బిక మొగిం బాటింగ మాటాడి పెం
గినుకం జూపుచుఁ జిల్కఁ గుల్కు నదె వీక్షింతే సరోజేక్షణా. 54

చ. పిక మది గున్నమావిపయి విన్ననువొప్పఁగఁ గూరుచుండి యో
పిక మెయిఁగూయుచుండె నటుపిమ్మటఁ జూడుము నెమ్మికూయుచున్
దకతక తాళమానగతి నాట్య మొనర్చెడు వైణికుండు కొం
చక మొనఁ బంచమం బవల షడ్జముఁ బాడినరీతి దోఁచెడిన్. 55

వ. ఇ ట్లనేకవిధంబు లగువిచిత్రంబు లాచిత్రకూటకాననంబునం గను
విను మని చెప్పి రఘురాముఁ డాసీతకు వనవాసక్లేశంబు గాన
రాకుండం గావించుచు నతిథుల నారాధించుచు స్నానసంధ్యాద్యను
ష్ఠానంబు గావించుచుఁ గాలక్షేపంబు చేయుచుండె నంత నక్కడ
శృంగిబేరపురంబున. 56

—♦ సుమంత్రుం డయోధ్యకుం జనిరామవృత్తాంతంబుచెప్పుట ♦—

తే. సీతతో రామలక్ష్మణుల్ చిత్రకూట
పర్వతంబున కరిగి తత్ప్రాంతమందు
నాఁకుటిలు గట్టుకొని యుండిరనుచు బాట
సారు లెఱిఁగింప విని మంత్రిస త్తముండు. 57

వ. గుహునకుం జెప్పి సపరివారంబుగ నయోధ్యకుం జనియె నప్పుడు.

ఉ. వచ్చుసుమంత్రుఁ డాన్నృపులవార్తలు దెచ్చునొ కాదు వారలన్
దెచ్చెను నంచు నాసమెయి దీనత దోపఁగ నున్నపౌరు లా
మచ్చున నొక్కరుం డగుసుమంత్రునిఁ గన్గొని దుఃఖభాగులై
చచ్చినవారలో యనఁగ సొళ్ళడి పోయిరి పత్తనంబునన్. 59

తే. అంతట సుమంత్రుఁడును మృతమైనరీతి
నున్నపురవీథిఁ బడిపోయి యుర్వినాథుఁ
డునఁగుకడ కేగి తనరాక యెఱుఁగఁ జేసి
లోనికిం జని భూజానిఁ గాన నయ్యె. 60

వ. భూజానియు స్వరంబునంబట్టి సుమంత్రుం డని యెఱింగి రాముం
దెచ్చె ననుసంతసంబునఁ గన్ను విచ్చి యొక్కరుం డగువానిం
గాంచి యిట్లనియె. 61

క. తెచ్చెద రాఘవు నంటివి
వచ్చెనె వాఁ డెచట నుండె పలుకఁడు నాతో
నిచ్చటికి వానిఁ దె మ్మో
సచ్చరితుఁడ యన్న మంత్రిసత్తముఁ డనియెన్. 62

ఉ. ర మ్మని రాజుపం పనుచు రాముని కెంతయు చెప్పితిన్ బ్రియం
బెమ్మెయిఁ జెప్పినన్ వినఁగ నెంచఁడు కించుతనంబ చూపెడిన్
సమ్మతి లేనియ ట్లెటు లెసంగఁగఁ బల్కినలాభ మేమి నీ
తమ్మున నైనఁ బంపు మని ప్రార్థన చేసితిఁ జేసినంతటన్. 63

ఉ. ఆయమఁ బిల్చి నీవు వనులందు శ్రమంపడుచుండ లేవయో
ప్రేయసి తండ్రి నిన్నయిన వీటికిఁ బుచ్చు మటంచుఁ గోరె నీ
పీయెష నొందుచింత విడి యేగుము మంత్రివరేణ్యు వెంట నే
నీయిటనేడువత్సరము లింతటిలోఁ గడతేర్చి వచ్చెదన్. 64

తే. అనిన నాయమ కష్టమెంతైనఁ గాని
నిను విడిచి పోవఁ జాల నోయినకులేశ
నీడవలె నేను నిన్నంటి యేడనైన
నెంతనాపద లైన నీచెంతనుందు. 65

—♦ రామవియోగంబున దేశము సొంపు చెడుట ♦—

వ. అని చెప్పుటంజేసి నేను నిరాశం జెంది వచ్చితి వారు గంగం దాటి ప్రయాగరాజమ్మునందలి భరద్వాజాశ్రమంబు మీఁదుగాఁ జిత్రకూటాద్రికిం జని పర్ణశాలం గట్టుకొని నివసించి యుండుట బాటసారులవలన విని వచ్చితి విని మఱియును. 66

సీ. పూచి కాచెడువృక్షములు మోడులై పోయె
పైరుపంటలవెల్లఁ బడటఁ గలసె
నీతిబాధలు భూమి నేదెసం బ్రబలెను
నదు లెండుకొనిపోయె నలుగడలను
రేలెల్ల నంగారవృష్టిని గురిపించు
హిమధాముఁ డెంతయు నెఱియు జగము
కాసారములయందుఁ గమలముల్ ముకుళించుఁ
బట్టపగట దుఃఖ ముట్టిపడఁగఁ

తే. గ్రూరమృగములు కన్నీళ్ళు గార విడుచు
మల్లె పరిమళ మది లేక మంటఁ గలియు
దేశమంతయు దుఃఖసందేశ మయ్యె
జాలివడి రాముఁ డడవులపాలు గాఁగ. 67

మ. అనినం బంక్తిరథుండు గొల్లు మనుచుం వ్యాపింపఁగా శబ్ద మే
డ్చెను గౌసల్యయు హారు హారు మనుచున్ జేసెన్ మహార్తధ్వనిన్
వనితాలోక మదెల్ల వచ్చి వసటం వర్తించె నంతఃపురం
బు నితాంతార్తమ యయ్యెనయ్యెడలరాముంబాసియున్నందునన్.

తే. పుత్రుఁ డడవికిఁ బోయె నన్ పొక్క కాక
భర్తఁ జీవింప నీయనివ్యాధి వలని
పొక్క నిమ్మడి యై కడుఁ బొగుల నయ్యె
రాజబింబాస్య కోసలరాజతనయ. 69

—♦ పుత్రవియోగంబున దశరథుండు మేను విడుచుట ♦—

వ. ఇట్లు సర్వంబు దుఃఖప్రాయంబై యుండె నప్పుడు పుత్రవియోగ దోదూయమానమానసుం డగుదశరథుండు మౌనిశాపంబు స్మరించుచు నితాంతంబు పరితపించుచు నొక్కచోటన పడియుండె నంత నాఱవనాటి రాత్రి సమయంబున. 70

ఉ. పుత్రవియోగదుఃఖమున భూపతి కంతవిదాహతాపముల్
గాత్రమునందుఁ గ్రమ్ముకొనెఁ గంపము పెంపర మయ్యె నేత్రముల్
శ్రోత్రము లడ్డ మౌకసడె శోషిలె వాతెఱ వేకి పుట్టె హృ
ద్గోత్రము భిన్న మయ్యె స్పృహతో నణఁగెం బలుకేగెనాడులున్.

క. చలి వచ్చె మెడలు నొచ్చెన్
దళసరిగరుదాల్చె మేను తలయే ఊదవెన్
బలు తేలుపోటు లట్టులు
నిలువెల్లం బోటు పొడమె నృపతికి మఱియున్. 72

మ. సమనాడీత్రికసన్నిపాతమున నాత్మాజాని కుద్యత్ప్రలా
పము నుద్వర్తన వేగ లేచుట కడుం బద్ధాబాహువిన్యాసముఁ
భ్రమయు న్వెక్కియుఁ దోఁచి తోఁచి తుద కానాడీస్థితుల్ తప్పఁ ద
త్క్రమమింతేనియు లేకయుండెఱుగ కాతండుండె నొంటూర్పుతోన్.

క. ఎటు వైచినకాళ్లేతులు
నటులుండఁగ నెదిరిఁ దన్ను నరయక యూర్ధ్వ
స్ఫుటనిశ్వాసమ్మున సం
కట పడిపడి దశరథుండు కడ తేరె నొగిన్. 74

వ. మఱునాఁడు మంత్రిసామంతాదు లరుదెంచి రాజు మరణించుట నెఱింగి వసిష్ఠానుమతంబున రాజకళేబరం బొకతైలద్రోణిం బెట్టి మాతులనగరంబున నున్నభరతుని శత్రుఘ్నునిం బిలువ నంపుఁ డని వసిష్ఠుండు చెప్పుటం జేసి సుమంత్రాదిమంత్రులుఁ జయంతసిద్ధార్థులును దూతలం బిలిచి మీ రాజానేయాశ్వంబుల నెక్కి గిరివ్రజపురం

బునకుం జని రామవనవాసంబు దశరథమరణంబు నుంజెప్పక భరత
శత్రుఘ్నులం దోడి తెమ్మనుటయును. 75

సీ. దూత లుదఙ్ముఖులైత త్తదుల నెక్కి
మాలిని లోనగుమహితనదులు
కడచి బాహ్లీకము కాశ్మీరముం దాటి
దివ్యదేశమ్ము లతిక్రమించి
గంగానదిం దాటి కడువేగమున నాల్గు
దినములపయనంబు తెలియఁ జేసి
పురము గిరివ్రజంబును జొచ్చి రాజగృ
హమ్మున భరతుని ననుజుఁ జూచి

తే. కులగురు వసిష్ఠునాజ్ఞమై కొని చనంగ
వచ్చినారము మి మ్మెల్ల స్వస్థు లచట
బయలుదేరుఁడు నావుడు భరతుఁ డెదియు
నరయఁ జాలక శత్రుఘ్ను నంటి కదలె. 76

వ. జవనాశ్వయోజితం బగురథం బెక్కి భరతశత్రుఘ్ను లేడుదినంబు
లలో నయోధ్యాపురంబునకుం జని పురం బంతయుఁ గళావిహీనం
బై గానంబడిన కనుకనింబడి సారథిం గాంచి. 77

—♦మాతులగృహంబునుండి భరతశత్రుఘ్నులువచ్చుట♦—

ఆ. పురము పాడుపడినకరణి నాకంటికిఁ
గాన వచ్చుచుండెఁ గాన రావు
మంగళాదు లెవియు మనుజులసంచార
మెచట లేదు సొంపు నింపు లేదు. 78

వ. కారణంబరయ రాకున్న దని కడుఁగడుఁ బరితపించుచుభరతుండు
రథంబు డిగి రాజగృహంబున దశరథుఁ గాన కటనుండి మాతృ
గృహంబునకుంజని తల్లిం గాంచి. 79

శా. తల్లీ!నాజనకుండు కానఁబడఁ డేదండం బ్రవర్తించునో
సల్లాపింపుము పత్తనం బిది సమస్తంబున్ మృతం బైనయ

ట్టుల్లంబుం బ్రదహింపఁ జేసెకిని నీవో శోభ వోఁ దోపనై
తెల్లం దాపక నాకుఁ జెప్పఁ గదె సర్వేశుం బ్రదర్శించుచున్ 80

సీ. అనిన గొల్లు మటంచునార్తస్వరంబునఁ
కైకేయి పుత్రునిఁ గౌఁగిలించి
తండ్రి నే నెంతయోఁ దప్పు జేసితి నన్ను
ఖండింపవే రెండుఖండములు గ
నిట్టి పాపాత్మురా లీనీకుఁ దల్లిగాఁ
జెప్పుకొంటకుఁ దగ దిప్పు డకట!
నానోట వచ్చిననాలిమాటంజేసి
యింతకష్టము మన కిపుడు వచ్చె

ఆ. అన్నరామచంద్రుఁ డడవులకుం బోయెఁ
దండ్రి దశరథుండు తనువు విడిచె
నేమి చెప్పుదాన నింతకుం గారణ
మేన సూవె తండ్రి! యేమి యందు. 81

—♦ భరతుండు పితృమృతికిం బరితపించుట ♦—

వ. అనిన భరతుండు మూలచ్ఛేదంబు చేసినసాలంబువోలె నేలగూలఁ బడి యురస్తాడనంబు చేసికొనుచుఁ గంటికి మింటికి నేకధారగా నేడ్చుచున్న సమయంబున మంథర వచ్చి తండ్రీ! శాంతింపుము శాంతింపుము నాదియు నిందుఁ గొంతదోషంబు గలదదియంతయు సాకల్యంబునం జెప్పెద నాలకింపు మని యి ట్లనియె. 82

సీ. ఈవుమాతులపురి కేగినపిదప నీ
జనకుఁడు రామచంద్రునకు రాజ్య
పట్టాభిషేకము పచరింపఁగాఁ జేసె
నే నట్లు గాకుండ నెంచి కైక
కడ కరుదెంచి రాముఁడు వనమున కేగ
భూపతి పీ వయి షోదలు నట్లు

వరము లడుగు మంచుఁ బలికితిం దెలియక
పైత్యభ్రమము నన్నుఁ బట్టియుంట

ఆ. సత్యశీలుఁ డైనతన్మాపతి నీతల్లి
మాట కడ్డు వలుక నోటువడిన
రాముఁ డడవి కేగ రాజు తద్విరహంబు
సైప లేక స్వర్గజగతి కరిగె. 83

తే. అపుడు శోకంబు క్రోధంబు నాత్మఁ బొడమఁ
గటకటం బడి భరతుండు కన్నతల్లిఁ
జుఱచుఱంజూచి యిట్లని చుఱుకులాడెఁ
గడుపు చుమ్మలు వాఱ దుఃఖమ్ము మీఱ. 84

చ. అకట ధనాశఁ జేసి యిటు లాఱడిగా హృదయేశుఁ జేసి మా
మక మగువంశ మెల్లఁ జెడుమార్గమువం బడఁ ద్రోసి నాదుమ
స్తకమునయుం దకీర్తి నిల సల్పి నృశంసము లాచరించితే
సుకృతవిహీనురాల యెగఁ జూడెడు నీదగుకోర్కి చూడుమా. 85

వ. అని పెద్దయుం బొద్దు పలవించి భరతుండు శత్రుఘ్నునితోఁ గౌస ల్యాభవనంబునకుం జని శోకవ్యాకులచిత్తయై యుత్తరీసేలం బడి యున్న కౌసల్యం గౌఁగిలించుకొని దుఃఖించుచుండ నామె వారిం జూచి వెక్కి వ్రమింగుచు. 86

ఆ. అన్నలార! మీర లన్యదేశమునందు
నున్నయప్పు డింతబన్నమయ్యె
నేమిచేయుదాన నెటు చొత్తు గతి యేమి
తెలుపు మన్న నన్నుఁ దేర్పు మన్న. 87

వ. అనిన భరతుండు తల్లీ! తల్లడింపకుము నేను నాయన్నం దెచ్చి కోసలరాజ్యపట్టభద్రుం గావించెద నూరడిల్లు మని పలుకుచున్న సమయంబున వసిష్ఠుండు వామదేవసహితుండై వచ్చి దుంఖితుం డైన భరతు నూఱడించి యిట్లనియె. 88

— వసిష్ఠుఁడు భరతునకు జ్ఞానోపదేశము చేయుట —

మ. భరతా! నీ విటు తండ్రికై వగచుటల్ భావ్యంబుగా దెంతయే
ధరణీలోకసుఖంబు నొందె హయమేధప్రస్తుతంబుల్ మహా
ధ్వరము ల్పెక్కు లొనర్చె సత్తనయులన్ వర్ణింపగాఁ గాంచె వ
త్సరముల్ పెక్కుసహస్రముల్ మనియెనాతం డెన్నసామాన్యుఁడే.

క. పుట్టిన వన్నియు గిట్టును
గిట్టిన వన్నియును బుట్టు గిట్టును మఱియున్
బుట్టును వీనికి వగవన్
గిట్టదు నీతండ్రిమృతికిఁ గించు తెలుఁగునన్. 91

చ. తెలియఁగ నెంతవారు నిలఁ ద్రెళ్ళిరి కాని యొకండు మిత్తిక
న్నుల మసిఁ ద్రోమి పొల్చుట కనుంగొనియే వినియేమెఱుంగమా
పొలిసెడునంతయు న్వినియు బూమె లెఱింగియు నుట్టి గట్టియు
య్యెల లిటు లూఁగుచుండు మని యెంచుట వెఱ్ఱితనంబు కాదొకో.

క. కలలోఁ గన్నపదార్థము
వలె నొఁ గాంతాకుమారవర్గం బెల్లన్
జల మనుచు నెండమావుల
పొలుపుం గని మృగము లేగు పోల్కి జన మగున్. 93

తే. ప్రాత వోఁ గ్రొత్తవస్త్రము వచ్చినట్లు
దేహ మిది వోవ వేఱొకదేహ మగును
దేహి యెన్నఁడు వోవఁడు తిరుఁడు దీన
తండ్రి మృతియించె ననుచింత తగని దగును. 94

సీ. ఇంద్రాదులకుఁ గూడ నింద్రుండు నాఁబడు
మాంధాత భూపతి మంటఁ గలసెఁ
దనతపశ్శక్తిచే ధర దున్నకుండఁ బం
డించె మరుత్తుఁ డిప్డెంచఁ గలఁడె
యుతధిపుత్రుండు సుహోత్రుండు బంగారు
గలిగించి ప్రజకిడెఁ గలఁడె యిప్పుడు

తనభార్య ద్విజునకు దానంబు చేసిన
రఘుమహారా జిప్డు గ్రాలుచున్నె

తే. ఎంద తెందఱో సర్వలోకైకవినుతు
లైనవారలు ధర విడనాడి చనిరి
గాని శాశ్వతులై యుంటఁ గాన మీవు
తండ్రికై యిట్లు చింతింపఁ దగదు భరత. 95

—♦ భరతుఁడు పితృయజ్ఞము గావించుట ♦...

వ. ప్రాజ్ఞుండవై దుఃఖంబు విడిచి తైలద్రోణికం బెట్టియుంచిన నీతండ్రి కళేబరంబున కూర్ధ్వదైహికంబు గావింపు మని గురుండు చెప్పిన శత్రుఘ్నసహితుం డగుభరతుండు మృతకళేబరంబునకు స్నానాది సంస్కారంబులు గావించి ప్రేతేష్టి యైనపదంపడి నాసందిం దెచ్చి చేర్చి శ్రౌతాగ్నులతో నాతని రుద్రభూమికిం గొనిపోయి బ్రహ్మమేధవిధిం జేసి దహనసంస్కారంబు గావించి లోష్టచయనంబు నుదకప్రదానంబును నైనపిమ్మట గోదానాదిషోడశ మహాదానంబులు నన్నప్రదానంబులునుం గావించె నంత మంత్రిసామంతాదులువచ్చి.

ఉ. రాజ్య మరాజకం బయినరాణ చెడుం బ్రజ ధర్మ మెంతయున్
బూజ్య మగున్ ధరిత్రిపయిఁ బొట్కున రాలదు చిక్కు రోగముల్
వ్యాజ్యము లెల్లవారలకు వ్యాధులు నాథులు తామసాంబర
ప్రాజ్యమహావ్యథల్ గలుగు ప్రాణిసుఖంబు నశించుఁ గావునన్. 97

వ. నీవు పట్టభద్రుండవై ప్రజలం బాలింపు మనిన భరతుండు చెవులు మూసికొని హరస్మరణంబు చేయుచు. 98

ఉ. ఎంతటి పాపకార్య మిది యే వినఁ గల్గితి నక్కటక్కటా
కొంతయినన్ విచారమునకున్ మది సేయక మీర లిట్లు గా
స్వాంతము నీరు గాఁ గఱఁగి పాఱఁగఁ బల్కుట పాడియే యశో
వంతుఁడు జ్యేష్ఠు డైనరఘువల్లభుఁ డుండఁగ నిట్టు లొప్పునే. 99

శా. లోకారాధ్యుఁడు లోకరక్షకుఁడు స్వర్లోకేశ్వరస్తుత్యుఁ డా
కాకుత్స్థాన్వయభూదుగ్ధవారినిధిరాకాచంద్రుఁ డారాఘవం

ద్రాకారాచ్యుతుఁ డర్చితుం డగుచు రాజ్యంబుం భరింపంగ నా
గా కీకష్టుఁడు భ్రష్టుఁ డెట్లు ధరణిం గైకోఁ దగుం జెప్పఁడీ. 100

ఆ. మాకులంబునందు మాపూర్వు లెవ్వరు
జ్యేష్ఠుఁ డుండ వానిఁ జేర నీక
వెడలఁ గొట్టి వానివిభుతఁ గైకొన్నక
నిష్ఠుఁ డెవఁడు గాని నెగడఁ బడెనె. 101

వ. కావున మీ రింక నొండుతలంపు విడిచి మాయన్నరామచంద్రుం
దెచ్చి పట్టాభిషేకంబు గావింపఁ బ్రయత్నించు నాకు మీ రెల్లరుం
దోడ్పడుండు సకలపరివారపరివృతు లగుమీరును వసిష్ఠవామదేవా
దిగురువర్గంబును దాసీజనపరివృత లైనమాతృకలును జతురంగ
బలంబుతోఁ బయనంబుగం డని చెప్పి తానువసిష్ఠునిపరిసరంబునకుం
జని పరిదేవనంబు సేయుచు ని ట్లనియె. 102

— భరతుఁడు సపరివారుఁడై యన్నకడ కేగుట —

చ. గురువులు మీరు మీనుడులకుం బదులాడునె రాఘవుండు మీ
భరతుఁడు మిమ్ముఁ గా దనుచుఁ బార్థివుఁ డయ్యెడినే పితృస్థితిన్
ధరణి భరింపు మీ వడవిదారులు పట్టగఁ జూడ కన్న నా
దార యిటు పోవఁ బూనఁడని తోఁచెడి మీ రటు సేయ రక్కటా.

ఆ. నా వసిష్ఠుఁ డనియె నాతండ్రి నీ విట్లు
తలఁచి వగలఁ బొగలఁ దగవుఁ గాదు
చెప్పినార మేము చెప్పినఁ బితృవాక్య
పాలనం బొనర్పఁ బ్రతిన వట్టె. 104

వ. అట్టివాని కెవ్వ రేమి చెప్పినను బ్రయోజనంబు లేదిది దైవప్రేరి
తంబు దానికై నీపరిదేవనంబు వ్యర్థంబు గావున శాంతివహింపు
మనిన భరతుండు వెండియు. 105

ఆ. ఏను రాముఁ దేర నెంచితి మీరును
మాతృజనము నాకు మార్గదర్శ

లగుచు నాదువెంట నరుదెంతురే యన
నతని కమ్మునీంద్రుఁ డనియె నిట్లు. 106

క. కా దన నేటికి మీతో
నేఁ దరలెదఁ గాని జనకపృథివీపతియున్
నీదగుమాతామహుఁడును
నీదండ మెలంగుచుంట నీతి యనఁ దగున్. 107

వ. అనిన నవుఁ గాత మని భరతుండు గురునకు నమస్కరించికతిపయ
పరివారపరివృతుండై మిథిలానగరంబున కరిగి జనకున కంతయు
నెఱింగించి రాఁ బ్రార్థించిన నతండు. 108

తే. నాదురాక నింతఁ బ్రయోజనంబుఁ గలుగు
ననుచు నేనుఁ దలంప నక్లైన నీవు
ర మ్మనుటఁ జేసి వచ్చెద నిమ్మెయి విను
నీదుమాతామహునిరాక నెఱి వహించు. 109

వ. అని చెప్పిన భరతుం డతనితో నతిత్వరితప్రయాణంబుల రాజగృ
హంబునకుం జని కేకయరాజుం బ్రార్థించిన నతం డొండాడ కొమ్మ
నుటయు వారిం గూడి రామానుజుం డయోధ్య కరుదెంచి వసిష్ఠు
ననుమతిం బడసి యంతిపురంబునకుం బోయి కౌసల్యా కైకేయీ
సుమిత్రలకుం జెప్పి వారిం బ్రత్యేకరథంబులపైఁ బ్రతిష్ఠింపం జేసి
తాను శత్రుఘ్నుండును జటావల్కలంబులుధరించి యెల్లవారితోడం
గూడి పయనంబై చని గుహునిం గాంచి సీతారామ లక్ష్మణుల
వృత్తాంతం బంతయు విని సీతారాములు లారాత్రి శయనించిన
స్థలంబు గుహునివలన నెఱింగి దానికిం బ్రదక్షిణనమస్కారంబు
లర్పించి. 110

—♦ భరతుండు దారిలో గుహుం గలసి పోవుట ♦—

శా. ఓహో భూపకుమారా! వినుము బాగడ నే నొక్కింతయుం జాల నీ
మాహాత్మ్యం బది సర్వలోకనుతి మహా మారామచంద్రుఁడు సు

స్నేహం బేర్పడ నీపయిన్ శయనముం జేసెన్ నినున్ మెచ్చె సం
దేహం బింతయు లేదు నిన్నుఁ గన మాదేహోఘముల్ వాసెనున్.

వ. అని యచ్చటిఘాళిం దీసి తానుం దమ్ముఁడు సర్వాంగలేపనంబు గావించుకొని యట నెండి పడియున్నలేజిగురుటాకుల శిరంబునం బెట్టుకొని యారేయి గుహసమర్పితఫలంబు లాహారించి మఱునాఁ డరుణోదయమ్మున గుహునితో గంగానదిం దాటి సపరివారంబుగ భరద్వాజాశ్రమంబునకుం బోయె నంత. 112

—♦ భరతాదులు భరద్వాజాశ్రమమున కేగుట ♦—

సీ. విని భరద్వాజుఁ డాతని నెదుర్కొని తెచ్చి
యర్ఘ్యపాద్యాదుల నాచరించి
భరత! నీవుత్తమభ్రాతృభక్తిగలాఁడ
వే నెఱుంగుదును నీ వేగి పురికి
రమ్మనినం గాని రాఁడు రాముఁ డతండు
చెప్పినట్లుగ నీవు చేయు మేగి
సపరివారముగ నీ కిపుడు నే నొకవిందు
చేయుఁ దలంచితిఁ జిత్తగింపు

తే. మనుచు సోమునిఁ దలఁచె నిధ్యానభక్తి
నన్నరాసులు భక్ష్యభోజ్యములరాసు
లెన్నియేనియు నాజ్యము నెంతయేని
క్షణములోపల నచట సాక్షాత్కరించె. 113

వ. అట్లు మహోన్నతప్రకారంబున నానావిధాపూర్వపదార్థంబులును సమకూడినంత భరద్వాజాజ్ఞంజేసి యెల్లరును, సుఖభోజనంబు గావించిరి. భరతశత్రుఘ్నులు ఫలాహారంబు చేసి రవుడు రాజపత్నులు మూవురును వచ్చి మునికి వందనంబు గావించిన నతండు వారు రాజపత్ను లని యెఱింగియు రామాదులం గన్నవా రెవ్వ రెవ్వరో యెఱుంగం గోరిన భరతుం డతని కిట్లనియె. 114

ఉ. చిక్కి కృశించి దీన యయి జీర్ణదశంబడి పొక్కుచున్నయా
యక్క రఘూద్వహుం గనినయమ్మ పదంబులచెంతఁ నశ్రువుల్
గ్రక్కుచుకన్నుఁదోయి గలకల్కి సుమిత్ర తదంతికంబునన్
బిక్కుమొగంబు వేసికొని వేగెడు నీయమ కైక నావుడున్. 115

వ. వారి నాదరించి పలుకుచు భరతాదులం గని మఱియును. 116

ఉ. కైక మహోపకారము జగంబులకున్ బొనరించినట్టి దై
వాకొన నొప్పు నీసతికృపం గదె భక్తులబాధ లన్నియున్
బోకడఁ బెట్టి రామవిభుఁ బోలఁగఁ గాంచి భజింపఁ గల్గె నీ
మాకును లోకకోటులకు మానవనాథకుమార వింటివే: 117

ఆ. నీకుఁ గాని మఱియు నిను ( బోలునెవ్వారి
కేని గాని కైక కాని కార్య
మాచరించె ననుచు నాగ్రహం బుదయించె
నేని తప్పు టంచు నే వచింతు. 118

తరలము. అనినఁ గైక మునీంద్రచంద్రున కంజలిం ఘటియించి యో
మునివరేణ్య మహాపరాధము పూని చేసినదాన నే
నని వచింతు ననున్ జగంబులు నాడిపోయఁగ వచ్చు నా
యనుఁగుబిడ్డ వనాళి కంపితిఁ బ్రాణనాథుని జంపితిన్. 119

వ. అనిన భరద్వాజుం డమ్మా! యుమ్మలింపకు మిందు నీదోషం
బీషణ్మాత్రంబును లేదు చింతింప కుండుమని చెప్పుచు నెల్లవారి
నాశ్వాసించి పోయి రం డని యంపిపుచ్చె నంత నక్కడ స్వర్గలో
కంబున నింద్రుండు బృహస్పతిం గని యిట్లనియె. 120

—♦ఇంద్రుఁడు బ్రహస్పతిం గని తనలోనిసందేహంబు దెలుపుట♦—

చ. గురువర చిత్రకూటమునకుం జనె రాముఁడు వానిఁ దేరఁగా
భరతుఁడు మాతృకామణులు పౌరులు మంత్రులు నిష్టబాంధవుల్
గురువులు వెంట రా నటకు గోరిక లీరిక లెత్త నిత్తఱిన్
దరలి రటంచు వింటి మది తల్లడ మందెడు నేమిసేయుదున్. 121

తే. భ్రాతృవత్సలుఁ డారామభద్రుఁ డనుజుఁ
డన్న నన్ను క్షమించి వనాళిఁ దిరుగు
టుడిగి సాకేతమునకు రా నుత్సహించి
పట్టభద్రుఁడ వగు మని పట్టువఱచు. 122

తే. అందునఁ గాక రామచంద్రుఁ డయ్యెడవిపయన
మునకు స్వస్తి వచించు నేమో యటంచు
నిపుడు కడుపెల్ల గుండెలై యేను గుతిలఁ
గుడుచు వాఁడన యైతి నోగురునరేన్యా. 123

వ. మఱియు నిక్కార్యంబున భరతునకుం దోడుగ జనక కేకయులుం
బోవుచున్నవా రఁట మన మేమే నిపుడు చేయనుండునో యనిన
నతం డతని కిట్లనియె. 123

తే. రాముఁడు కృతప్రతిజ్ఞుఁ డోక్రతుభుగీశ
వాని కాడి తప్పనివ్రత మూను గానఁ
దీన శంకింప నొప్ప దేదేని మనకు
ప్రతిక్రృతిం జేయునక్కఱ పట్టఁ బోదు. 124

వ. అని వానిసంభ్రమంబుడిగించె నంత నిక్కడ భరతుండు భరద్వా
జానుజ్ఞాతుండై ససైన్యంబుగా రామదర్శనలాలసుండై ప్రయాణం
బయ్యె నయ్యెడ లక్ష్మణుండు ఫలాహారియై వనంబులోనికిం బోయి
యున్నయప్పుడు రామభద్రుం డాశ్రమంబున సీతతొడపై శిరంబు
వెట్టుకొని శయనించె నంత. 125

—♦ కా కా సు ర వృ త్తాం త ము ♦—

తే. కాకి యొకఁడు వచ్చి కావు కావని యార్చి
కొనుచుఁ జెంత చెట్టుకొమ్మమీఁద
వ్రాలి సీతసారు రామునిసౌందర్య
మరయుచుండె విడనియట్టిరీతి. 126

క. కాకం బది కేవల మొక
కాకం బని కాదు దేవగణపతిసుతుఁడై

లోకమునఁ బేరుగాంచెను
వానినుగ జయంతుఁ డనెడువాఁ డగుఁ దెలియఁగన్. 127

ఉ. ఆతనిభార్య యొక్కతెతటి నాగిరకిం జనుదెంచి రామునిన్
సీతను జూచి పోయి తనచెల్వునితోడఁ దదీయరూపవి
ఖ్యాతి నెఱుంగఁ జేయుటయు నాతఁడు వారలఁ జూచునిచ్ఛమై
నాతఁడెఁ గాకరూపమున నాగతుఁ డయ్యెను నెయ్యమేర్పడన్ 128

ఆ. జనకరాజపుత్త్రిఁ జెనకఁ గా మదినెంచి
పుడమిజేఁడు నిద్రవోవుచుండఁ
దెలిసి పఱచివచ్చి చెలియురోజములను
జీఱె ముట్టి తనదుచెంచుపులను. 129

ఉ. నెత్తురు గ్రమ్మువాతి ధరణిం బడుచుండిన రామచంద్రు నా
మత్తగజేంద్రగామిని సుమంతయు జంకక లేప దయ్యె లో
కోత్తరుఁ డైనరాముఁడు నిజోదరమందు నసృక్తతుల్ వడన్
జిత్తడిఁజేసి మేలుకొని జిల్లునగాఱెడు నల్లగాంచుచున్. 130

తే. ఏమి యిది యని చెడుకాకి యిట్లు చేసె
నని యెఱింగి రఘూద్వహుఁ డట్టె విడిచె
బ్రాహ్మ్య మస్త్రము మంత్రించి బాలతృణము
కాకిపైఁ బడ దానినిఁ గాకి తెలిసి. 131

వ. భయభ్రాంతమై కాకంబు కావు కావు మని క్రచ్చఱఁ బాఱఁ జొచ్చె నస్త్రంబును వెన్నుండదన్ని దాని ననుసరించె నంతలోఁ గాకరూపుం డగు జయంతుండు కన్నతండ్రి యగునింద్రునిపాలికిం జని తనవృత్తాంత మంతయుం జెప్పి బ్రహ్మాస్త్రంబుబాఱినుండి నన్ను రక్షింపు మనిన నతండు. 132

చ. కడుపు చెడంగఁ బుట్టితివి కష్టుఁడ దుష్టుడఁ దుష్టకార్యమున్
నడపుట కెట్లు నీమనమునం బ్రియ మయ్యెనొ రాముఁ డన్న నె
వ్వాఁడయని యెంచుచుంటొ మధువైరి యతండు తదీయ మస్త్రము
న్నెడపఁగ నే నశక్తుఁడను లె మ్మిట కేనియుఁ బొమ్ము ద్రిమ్మరీ. 133

తే. పితృనిరాకృతుండై వాఁడు వెతలు గుడిచి
బ్రహ్మదేవునికడ కేగి రామబాణ
మరుగు దెంచెడిఁ గావవే పరమపురుష
యనుడు నాతఁడు ని ట్లను నకట కట్ట. 134

క. శరణము వేఁడితి నిన్నుఁ
బరిరక్షింపంగ నాకు బల మిసుమంతే
పరఁగదు గావున నిట నే
మరియుండక పొమ్ము పొమ్ము మఱి యెచ్చటికేఁ. 135

వ. ప్రత్యాఖ్యాతుండై జయంతుండు తనకుఁ జావు నిశ్చయం బని డగ్గ
ుత్తికను వెట్టి మొఱవెట్టుచుం బఱచి పోవుచుండ నారదుండు దర్శన
మిచ్చి యి ట్లనియె. 136

మ. నిను రక్షించెడువార లీజగమునఁ లే రెవ్వరుఁ రామచం
ద్రునిపాదంబుల వ్రాలి ప్రోవు మనుచుఁ దుఃఖించుచుఁ వేఁడినఁ
ఘనుఁ డాతండు కృపారసంబున నినుం గావం బ్రయత్నించుఁ బొ
మ్మని చెప్పంగ జయంతుఁ డాప్రభువుఁడాయంబో యిప్రార్థించుచుఁ.

క. త ప్పొనరించితి నీపద
మిప్పుడు పట్టంగ నిటకు నే వచ్చితి నో
యప్పా! కరుణింపుము నను
ముప్పునకుం గాకయుండ మొఱ నరయుమతిఁ. 138

వ. రామచంద్రుండు వానిం గరుణించి నాయస్త్రంబు వృథపోదునీయ
వయవంబులలో నొకం డిచ్చి నీవు చిరంజీవివై యుండుమనినఁ నతండు
తనయేకనేత్రం బిచ్చి బ్రతికిపోయె నది మొదలు కాకంబు లేకాక్షి
దృష్టి గలిగి చిరంజీవంబులై యుండు నంతలోన లక్ష్మణుం డర
ణ్యమ్మునుండి మధురఫలంబులు తెచ్చిన వారు మువ్వురు వాని
భక్షించుచు నిష్టగోష్ఠులం దేలుచుండి రానమయంబున. 139

—♦ భరతపరివారము చిత్రకూటంబు చేరుట ♦—

సీ. దివినుండి తెలి మబ్బు దిగివచ్చెనో యన
భువినుండి పెనుధూళి దివికి నేగెఁ
గల్పాంతకల్లోలకంధి పెల్లుబ్బె నా
హోర్వారవము దెస లొయ్య నిండె
నానావిధమృగంబు లానందమఱి యూర్పు
లార్పులు మ్రోఁయ నడవిఁ బాఱె
నాకసంబునఁ బక్షు లరచుచు నల్లడ
లంటి పఱవఁ జొచ్చె జంట లగుచు
తే. హేషలును ఘీంకృతుల్ భటభాషణములు
స్యందనాదినిర్ఘోషముల్ సాంద్ర మగుచు
వనము నలుమూలలను గప్పి వినఁగ నయ్యె
సాధ్వసము విస్మయంబును సాంద్రముగను. 140
తే. చెవులు నిగిడించి రాముఁ డారవము వినుచు
లక్ష్మణునిదిక్కు మొగ మయి లక్ష్మణా! య
దేమినినదమో తెలియుము భూమి నిండె
ననఁగ నాతఁడు పెద్దచె ట్టపుడ యెక్కి. 141
వ. నలుగడం గలయఁ బరికించి యొక్కదిక్కున రథగజతురంగపదాతి
సంకులం బగుచతురంగసైన్యముం గాంచి యి ట్లనియె. 142
మ. చతురంగధ్వజినీసమేతముగ రాజన్యుం డెవండో మహో
ద్ధతి మీఱం జనుదెంచు చుండెడిని యుద్ధంబుం బొనర్పంగ నీ
వతిభీమం బగుకార్ముకంబుఁ గొను మాయన్నా యనన్ రాఘవుం
డితిక ర్తవ్య మెఱుంగఁ జూడు మెవరో యేహేతువో రాకనున్. 143
తే. అనిన సౌమిత్రి వెండియు సరసి రామ
కోవిదారధ్వజము కనుఁగొనఁగ నయ్యె
భరతుఁ డరుదెంచు నని తోఁచెఁ బట్టభద్రుఁ
డతని యాలోచనం బేమి యగునో తెలియ. 144
వ. రాముం డి ట్లనియె. 145

వ. ర విట్లు లక్ష్మణా! యతఁడు రాముని జంపఁగ నొంప వచ్చు నం
చెమ్మెయి నీతలంపగునో యెంతటితప్పు తలంపుసేయు దో
తమ్ముఁడ! నీవునుం బలె నతండును దమ్ముఁడు నాకు బాలభా
వమ్మున నంటి నీ వతఁడు భక్తుఁడు రక్తుఁడు యుక్తుఁ డారయన్.

తే. వెత్తితమ్ముఁడ రమ్ము వేవేగ నెదురు
కోలుసేయుదము నను వేఁడి కొంచుఁ బోవ
నరుగుదెంచుచు నుండెను భరతుఁ డకట!
వానియభ్యర్థనము వమ్ముపఱుపు టగునొ. 147

వ. అంత నక్కడ. 148

చ భరతుఁడు చిత్రకూటగిరిపార్శ్వముఁ జేరఁగ వచ్చి సైన్యమున్
బరిసరభూమి నుండునటు పల్కి గుహుండు సుమంత్రుఁ డంటి రా
సరసను దమ్ముకుఱ్ఱఁ గొని తన్మతలనాథునిపర్ణశాల మే
తెరువున నుండెనో యనుచు దిక్కులు నాల్గును రోసె నాసమై.149

వ, ఇట్లు రోసి రోసి పరిశ్రాంతుండై తదేకధ్యానపరాయణుం డగుటం
జేసి పరవశంబు నొందినచెందంబున. 150

—♦భరతుఁడు రామాలయము నన్వేషించుట♦—

సీ. నాయన్న రామచంద్రమహీశశత్రుండు
తా నెందు నివసించు మానులార!
జానకీలక్ష్మణసహితుఁడై చనుఁదెంచె
తా నెందువర్తించుఁ దల్లులార!
జడలు దాల్చినఁ గాని విడఁడు విల్లమ్ములు
తా నెందు వసియించు తండ్రులార!
మెఱుఁగుచామనచాయమేన నొప్పెడువాఁడు
తా నెందు దీపించుఁ దరువులార!

తే. ఆఁకుటిలు గట్టి చిత్రకూటాశ్రమమున
నుండె నని చెప్పఁగా విని కొండయంత

యాస గావించి చూడఁగా నరుగు డెంచి
నాఁడ నెందుండు చెప్ప రే నాకులార. 151

వ. అని యడుగఁ బడినవాని నెల్ల నడిగికొనుచు రాను రా నొక్కచో
నొక్కమునిశిష్యుండు గాన వచ్చి. 152

తే. చిత్రకూటమునకు వెన్కఁ జెల్లుచక్కి
గంగకుత్తరభాగము గానె సంగు
దిక్కునన్ రామచంద్రుని దివ్యభవన
మలరుచున్నది కనుపండు వగుచునదిగో. 153

వ. అని చెప్పిన భరతుం డతిత్వరితగమనంబున నడచుచు నట నొక్క
చోట హలకులిశాది చిహ్నితంబు లగు శ్రీరామచంద్రు నడుగుజాడ
లం గాంచి సంతసించుచు నమస్కరించి యొక్కజాడలోనం గల
ధూళిం దీసి శిరమునం బెట్టుకొనితమ్మునికిం బెట్టి భక్తిం జేసి చేతులు
[illegible] పర్ణశాలసమీపంబునకుం జని. 154

ఉ. కనియెం [illegible] యనందనీసుతుఁ డటన్ గాకుత్స్థవంశాబ్ధిసో
[illegible] నయాభిరాముని దయాపూర్ణైదవార్ధామునిన్
ముని సీతాహృ[illegible] నినిన్ త్రిభువన ప్రోద్యద్యశః కాముని
మునిలోకస్తుతనామ[illegible] న్ సజలమేఘశ్యామునిన్ రాముని[illegible]న్. 155
ఘన దేవారివిరామ[illegible]

—భరతుఁడు రామదర్శనము గావించి తత్పాదనమ్రుఁడగుట.—

క. కని భయము భక్తి సంతోష
మును వినయము విస్మయంబు ముప్పిరిఁ బెనఁగన్
మనమునఁ బెనఁగొన సాష్టాం
గనమస్కృతి చేసి పాదకమలములఁ బడెన్. 156

తే. బాహువులు సాచి రాముఁ డాభరతు నెత్తి
కౌఁగిటం జేర్చి ముద్దాడి కంట నీరు
వఱ్ఱువాఱంగఁ దొడలపై వానిఁ జేర్చి
మోము మోమునఁ గదియించె మోహమునను. 157

వ. అంతఁ గొంతసేపటికి రాముండు భరతుం జూచుచు ని ట్లనియె. 158

తే. రాజ్యమును వీడి యిట కేల రాఁ గతంబు
చెప్పు మెరు లేరు గాని నీక్షితి హరించి
యుండరు గదా మహోన్నతు లుర్విపతులు
సుఖులె కా పితృపాదులు శుభము కదవె. 159

మ. అనినం గొల్లున నేడ్చె నాభరతుఁ డత్యంతంబు దుఃఖార్తుఁడై
విని రాముం డిది యేమి తమ్ముఁడ! మదిన్ వేధించెడిన్ నీదుచె
య్వు నరేంద్రుం డెటులుండెఁ జెప్పుమనుచున్ బోకార ధైర్యంబు క
న్గొనలం బాష్పజలంబు లూరవివశుండ న్స్థాణువై మూర్ఛిలెన్. 160

ఉ. అంతటిలో వసిష్ఠుఁ డట కాగతుఁడై పడియున్న రామునిన్
గొంతటిలోనఁ దేర్చి యిటు కూడునె నీకు రఘుప్రవీర! లో
కాంతర వాసమున్ సలుపు నాసమెయిం బితృపాదు లీవు నీ
కాంతయు లక్ష్మణుం డిటులు కానకు నేగినకొన్నినాళ్ళకున్. 161

తే. మీవియోగము సైపనిభావమునను
భౌతిక శరీరమును వీడి పరమపదము
నొందెఁ దల్లులుఁ దమ్ములు నందఱు మిట
నిన్నుఁ దేర్పంగ వచ్చితి మెన్నికొనుచు. 162

ఆ. కర్ణశూల మట్లు గా నైనగురువాక్య
మాలకించి రాముఁ డట్టు శూలి
రోదనం బొనర్చె రోదసీకుహరంబు
పగులునట్టిపగిదిఁ దగిలి తగిలి. 163

వ. అప్పుడు సీతాలక్ష్మణులును రాముం గట్టుకొని బెట్టు దుఃఖించు
చుండ భరతశత్రుఘ్నులును రాముం బొదివికొని సేద దేర్చుచుం
డి రాలో రామమాతృకలు వచ్చి మూగికొని పరిదేవనంబు సే
యంజొచ్చి రంత వసిష్ఠుండు రాము నాశ్వాసించుచు. 164

ఉ. ప్రాకృతునట్లు నీ విటులు బాధతరం బగుదుఃఖ భారమున్
బైకొని యుండుటల్ తగునె కాననముల్ నదులున్ సముద్రముల్

లోకములున్ నశించెడి నలోలత నొక్కటియే దిరంబు గా
నీ కుతలంబున న్నిలుచు టీవు గనుంగొనియుంటె చెప్పుమా. 165

వ. అంత సుమంత్రాదిమంత్రు లి ట్లనిరి. 166

తే. రామ సుగుణాభిరామ నీ కేము చెప్ప
వారమే మౌనిశాపము కారణమున
నూను లెవ్వరు తనచెంత లేనియపుడు
తనువు విడె తేఁడు విధిచెయ్యి తప్పిచనునె. 167

క. కావున శోకము విడి వడి
గా వచ్చినతమ్ముకుఱ్ఱఁ గరుణ దలిర్పన్
గావుము ప్రోవుము తన్మతి
భావించుట నీకుఁ జెల్లు పార్థివముఖ్యా. 168

వ. గుహుండు దరియ వచ్చి యి ట్లనియె. 169

చ. గుహుఁడను వచ్చినాఁడ నినుఁ గోరి భజించెదు భక్తుఁడన్ మహా
మహులకు బోధకుండ వగుమాధవ మూర్తివి నీవుకావె యు
న్నహమును మానిచంద్రములసాంతములన్ విహరించువాఁడ వో
నృహరి! జగత్త్రతారణమొ కించుక చాలు ననుగ్రహింపవే. 170

వ. భరతుండు భక్తిభరితుండై లేచి నమస్కరించి యిట్లనియె 171

శా. అన్నా! నీ వొకరుండు నే నొకఁడుగా నధ్యాత్మఁదానెంచి పా
పౌన్నత్యంబునఁ గేకయాత్మజ యరణ్యావాసముం జేత కై
నిన్నుం బంచినతప్పు సైచి మరలన్ విచ్చేసి రారాజవై
నన్నుం దమ్ముని బౌరజానపదులన్ బాలించి రక్షింపవే. 172

శా. శత్రుఘ్నుం డునురామపాదములపైఁ జాగిల్లి మాయన్న మ
న్మాత్రజ్ఞానము సంభవించినది యేమాత్రంబు లో దానికిన్
బాత్రం బీయక తమ్ముకుఱ్ఱలను సంబాళించునట్టిండ వై
ధాత్రీపాలన మాచరించుటకు రాఁ దమ్ముండు ప్రార్థించెడిన్ 173

వ. అంతఁ గైకేయి శోకములు కట్టుకొని యి ట్లనియె. 174

మ. కొడుకా! నన్ బ్రతికింపగా మనఃము గైకోవా జగంబందు నేఁ
బడునిందల్ మఱి యెవ్వరుం బడరు నాపాలం బ్రజాకోటియున్
గడుమెచ్చి కీర్తి ఘటిల్లఁ జేసెడిని నాకన్నయ్యయు న్నాఁడు నా
నుడికింగా దనిచెప్పఁ బుచ్చెఁ గృపనన్నుం బ్రోచి రక్షింపవే. 175

వ. సుమిత్రరామగాత్రంబు నిమురుచు ని ట్లనియె. 176

క. నాయన్న రామచంద్రా
నీయనుజులకోర్కి దీర్ప నీ కుచితము కై
కేయియు మిగులం బొగిలెడు
నాయమ్మం గరుణఁ జూచు టది యుక్తమగున్. 177

వ. కౌసల్య కన్నీరు దుడిచికొనుచు. 178

తే. తండ్రి! నీతండ్రిగతి నాకుఁ దారసించు
నీవు నీవారిమాటలు నెఱి గ్రహించి
మరలి పురి కీవు రాకున్న మాతప్రాణ
ములను గాచినఫలమును బొంద వకట. 179

వ. అపుడు జనకుండు జానకీసహితుండై రామునిచెంతకుం జనుదెంచి.
సీతంజూపుచు 180.

ఆ. ఎండవానకన్ను నెఱుఁగ దీమె నగళ్ళ
నలఁతిగాలి తాక నలసి పోవుఁ
గారుటడవిలోనఁ గ ష్టపడం జాల
దుడుగు మన్న ప్రజలనుడులఁజేసి. 181

ఆ. అనిన రాముఁ డనియె నార్య నీపుత్రిక
రాఁగ వలవ దుడుగు రాజపుత్రి
యనుచు నెంత చెప్పి నను గాని విన దిట్టు
లనుసరించె నాదునాగ మనుదె. 182

వ. అంతలో గేకయావనీనాథుండురఘురామునకన్నం జేర్చుకొనిప్రార్థ
నాపూర్వకంబుగా ని ట్లనియె. 183

శా. నాదౌహిత్రునకున్ స్వరాజ్య మిడ నానాఁటన్ భవత్తాత వా
చాదానం బొనరించె నా కటులు తత్సంసిద్ధి యయ్యెన్ గుమా
రా దానిన్ మరలన్ గ్రహీత నగునే నామన్మఁడున్ నీకు ని
ష్టాదేయం బని యిచ్చుచుంటి మిదె కొమ్మా సమ్మతిన్ జేయుచున్.

క. నీరాజ్యము నీ వొందుము
రా దమ్మ పురమ్ముఁ జేర రాఘవ తమ్ముం
డేరీతిఁ గుతిలఁగుడిచెడి
నో రహి చెడి యుండెఁ గరుణ నోముము వీనిన్. 185

వ. అని యందఱు నన్నిచందంబుల ననునయించుచుం బలికిన రామ
చంద్రుఁ డందఱు విన ని ట్లనియె. 186

— రాముఁడు ధర్మముఁ బాలింపక మరల ననుట —

క. సత్యము ధర్మము ననునవి
నిత్యము పాటించి జనుఁడు నియమముతోడన్
ప్రత్యయము గలిగి మెలఁగుట
లత్యవసర మనుచుఁ బ్రాజ్ఞు లందురు జగతిన్. 187

వ. కావున నేను ధర్మమార్గంబు ననుసరించి ప్రవర్తింతు నన్నంత వసి
ష్ఠుండు నీవును లక్ష్మణుండును పైతృకంబు నిర్వర్తింప వలయు నని
చెప్పి గంగాతీరంబునకుం గొనిపోయి పాలాశవిధివిధానంబున సర్వం
బుం బ్రవర్తిల్లం జేసి హింగుదీపిణ్యాకంబునఁ బిండప్రదానంబు
చేయించి నివాపాంజలు లిప్పించి పర్ణశాలం బ్రవేశించినపదంపడి
యెల్లరు ఫలంబు లారగించి యున్నంత భరతుండు రాఘవు నభ్య
ర్ణంబునఁ గృతాంజలిపుటుండై యి ట్లనియె. 188

సీ. మనవంశమున రాజ్యమును జ్యేష్ఠుఁ డే కాని
పెరవాఁడు గొనుటకు విధులు లేవు
జ్యేష్ఠుండు తండ్రి కనిష్ఠుల కేము నీ
బిడ్డల మని మమ్ముఁ బెరిమఁ గనుము

నాపరోక్షమునందు నాతల్లికతమున
నిటు వచ్చె నది యెల్ల నీవు మఱచి
పట్టభద్రుండ వై పాలింపు మెల్లర
న్ప్రార్థనం బిది సుప్రసన్న
తే. హృదయుఁ డవ యయి సాకేతసదనమునకు
నిపుడ మాతోడ నరుదెంచి నృపతు లెన్న
భద్రసింహాసనం బెక్కి ప్రభుతఁ దాల్చి
కోసలావనిఁ బాలింపఁ గోరుచుంటి. 189

వ. అని పాదంబులం బడినభరతు లేవనెత్తి రాముం డిట్లనియె. 190

తే. ఈవు సాకేతరాజ్యము నేలుటకును
నేను దండకరాజ్యము నేలుటకును
దండ్రి యాదేశమగుఁ గానఁ దండ్రి! నీవు
నేను దానిని బాటింప వాను గాదె. 191

క. పితృవాక్య మెవఁడు కా దని
మతి నెంచుచుఁ ద్రోసిపుచ్చు మానవపశు వా
సుతుఁ డైనవాని కయ్యెడు
గతు లధమములనుచు మనము గమనింప నగున్. 192

తే. వినుము మనతండ్రి కైకను బెండ్లియాడు
నపుడు తత్పుత్రునకు రాజ్యపతిత నిచ్చు
శుల్కము ప్రతిజ్ఞఁ జేసె నోశుభచరిత్ర!
దాని మనకుఁ జెల్లింపఁ గాఁ దగును గాదె. 193

—♦ భరతుఁడు తాను రాజ్య మేల నని పట్టుపట్టుట ♦—

వ. తమ్ముఁడా! తత్త్రివిధంబుల రాజ్యంబు నీది కాని నాది కాదు నీతల్లి చేసినత ప్పిం దింతయును లేదు నీ వామెం జెందనాడుట దోషమూలం బగు ననిన భరతుండు నీ వెన్ని చెప్పినను నిన్నుఁ గా దనినేను రాజ్యభారంబు పూన నొల్ల దీనికి నీ వంగీకరింపకున్న నే నిచటఁ

ప్రాయోపవేశంబు చేసి ప్రాణంబులం బాసెద నని దర్భలుపఱచు
కొని యందుఁ గూరుచున్నతమ్మునిం గని దయాతరంగి తాంత
రంగుం డగురామచంద్రుండు వెండియు నిట్లనియె. 194

క. ప్రాయోపవేశకర్మము
శ్రేయస్కర మెపుడు గాదు చేయకు మిఁక లో
నాయన్న! యనుచు భరతుని
బాయంగాఁ జేసె దర్భపంక్తికి వెలిగన్. 195

వ. అప్పుడు పితృవాక్యము పాలింతు నని రాఘవుండును నీవు సాకే
తంబునకు వచ్చి పట్టభద్రుండవు కాకున్న నీకడఁ బ్రాయోపవే
శంబు చేసెద నని భరతుండును పట్టుపట్టి యున్నయప్పు డెవ్వరు
నేమియుం జెప్పనేరకున్నప్పుడు వసిష్ఠుం డిర్వుర కొక్కింతసమా
ధానం బగునట్లిట్లనియె. 196

—♦ వసిష్ఠుఁడు రాముపాదుకలఁగొని పూజింపు మనుట ♦—

ఆ. భరత! నీవు రాముపాదుకలం గొని
పోయి రాజ్యపీఠిఁ బూనఁగ జేసిఁ
రాజ్యపాలనాదిరాజకీయం బెల్ల
వాని కర్పణంబు వలయుఁ జేయ. 197

చ. అనవుడు రామచంద్రుఁ డవు డౌ నని మెచ్చుచుఁ దీసి పాదుకల్
తనకడనున్నతమ్మున కుదారత నిచ్చి వసిష్ఠమౌనివా
క్కున నివి రాజ్యమేలు నని కోరికఁ దెల్పినఁ గైకపుత్రుఁ డిం
పునఁ గొని వానిశీర్షమునఁబూని రఘూద్వహుఁ గాంచి యిట్లనున్.

క. పదునాల్గేడులు దాఁటెడు
నదనునకు నీవు వచ్చి యవనీభరముం
బాదలించు కొమ్ము కాదే
నిదె నే మృతి కొదు ననుచు నెఱుఁగుము దేవా. 199

వ. అనిన రఘురాముం డిట్లనియె. 200

మ. పదునాల్గేడుల లెక్క మంథర వచింపన్ లే దరణ్యానులం
దు దినంబుల్ గడుపంగఁ గోరు మనె నన్నుం గైక తా నేలొకో
పదునాల్గేం డ్లన వింటి నింతయును దైవప్రేరణం బందు ని
య్యది త్రేతం గలకాలదోషమితి యంచాశ్చర్యముం బొందితిన్.

తే. కృతయుగంబునఁ బదునైదునేండ్లు త్రేత
యందుఁ బదునాల్గు ద్వాపరమందుఁ బదియు
మూఁడు కలిఁ బదిరెండగునేఁడు లనుచు
కాలదోషమితిం జెప్పఁ గాదె శ్రుతులు. 202

వ. ఇట్లు మాతల్లి నాకు రాజ్యసారసత్వంబునఁ గాలదోషంబు పట్టకుం
డునట్లు వరంబు గోరెం గావున నే నాకడపటిదినంబున వచ్చి
రాజ్యంబు స్వీకరింతు నీవు సుఖవై ప్రజాపాలనంబు గావించుచుం
డు మని చెప్పి వసిష్ఠవామదేవాదులయు మంత్రిసామంతాదులయు
మాతృకామణులయు గుహప్రభృతులయు ననుజ్ఞ వడసి భరతుం
జీరి మఱియు నోతండ్రి! నీవు వీరి నందఱం గొని సాకేతంబునకుం
జను మని తల్లికడకుం జని యొకిలోనం గూరుచుండి యిట్లనియె.

క. అమ్మా నే నిదె వచ్చెద
నెమ్మది నీవుండు భరతునిన్ ననుఁ బోలెన్
నెమ్మదిఁ గనుగొను మందుము
ముమ్మాటికిఁ జెప్పుచుంటిఁ బురి కేగు మమా. 204

వ. అని యెల్లర నామంత్రణంబు చేసినంత భరతుండును. 205

—♦ భరతుఁడు రామపాదుకలంగొని మరలి పోవుట ♦—

తే. రామపాదుక లపుడు శీర్షమునఁ బూని
ముని వసిష్ఠపురస్సరముగను ముగురు
తల్లులం దోడుకొని యమాత్యప్రభృతులు
పౌరులు గుహుండు తోడ రాఁ బయన మగుచు. 206

సీ. జానకీరాములచరణంబులకు మ్రొక్కి
సౌమిత్రి నక్కునఁ బ్రేమఁ జేర్చి
ప్రస్థితుం డయి చిత్రపర్వతంబునకుఁ బ్ర
దక్షిణం బగునట్లు దక్షిణముగ
రథము లధిష్ఠించి పథి భరద్వాజుల
కంతయు సాక్షిగించి యనుమతిఁ గొని
కాళింది దాటి ... న్ని నదులను వడి దాటి
గంగ ... సిలువంగఁ బెట్టి

తే. సకలపరివారమును దాను సరభసమున
రాజధానికిఁ జని మాతృకాజనంబు
నంతిపురి నిల్పి మంత్రిసామంతులఁ గని
భరతుఁ డిట్లని బలికె నెల్లరును వినఁగ. 207

సీ. రామచంద్రుఁడు లేనిరాజగృహంబుల
సంచరింపఁగ లేను సభకుఁ బోవఁ
జాల సింహాసనసంస్థుఁడ నై రాజ
కీయములం బని చేయఁ నోపఁ
దండ్రి మృతించెను దండ్రిఁ బోలినయన్న
వనములపా లయ్యె వనట కగుచు
నే నిట నుండఁగ లేను నంద్రిగ్రామ
మునను నుండుఁ బాదుకలను గొలుచుచు

తే. సచివులును గొంతపరివారసముదయమ్ము
నచట నుండెడునట్లు నాకందు వసతి
జపతపంబుల కనువగుచందమునను
గలుగునట్లును సలుపంగ వలయు నిపుడు. 208

వ. అనిన నమాత్యు లిది మంచిమార్గం బని భరతుండు చెప్పినచొప్పున సర్వమును సంసిద్ధంబు గావించి నంత భరతుండు జటావల్కల ధారియై రామపాదుకల శీర్షంబుం బూని నంద్రిగ్రామంబునకుం జని

గురుముఖంబునఁ బాదుకాపట్టాభిషేకంబు గావించి రత్నసింహాసనంబునం బాదుకలం బెట్టి ప్రత్యహంబును బూవులం బూజించుచు రాజకీయంబు లన్నియుఁ బాదుకలకు నివేదించుచు. 209

సీ. భరతుండు శత్రుఘ్నపరివృతుండై కంద
మూలఫలాదు లేప్రొద్దు మెసవు
స్థండిలశాయియై యుండి యింద్రియనిగ్ర
హమ్మున బ్రహ్మచర్యవ్రతమ్ము
జరుపుచు జపతప స్స్వాధ్యాయనిరతుఁడై
పాదుకారాధనపరత నొప్పి
ఘనకార్య మేదియేఁ గావింప నుండినఁ
బాదుకలకుఁ జెప్పి భక్తితోడ

తే. ఛత్రచామరాదులు వానిసరస నిలిపి
రాజలాంఛనము లవెల్ల రామపాదు
కలకు నంటఁగఁ జేయుచు సలుపుచుండె
రాజ్యపాలన మెంతయుఁ బూజ్యముగను. 210

సీ. శత్రుఘ్నునికి మాతృజనసేవ సేయంగ
సచివులు వ్యవహారసరణి నడుప
భూసురుల్ వరధర్మబోధముం జేయంగ
నియమించి భోగసంచయము విడిచి
యింద్రాదు లగ్గింప నిక్ష్వాకుముఖ్యుల
కంటె గొప్పగ రాజ్యకలన నొప్పి
పర్ణశాల విరక్తభావుఁడై నివసించి
శ్రీరామపాదపూజారతుఁ డయి

తే. భక్తివైరాగ్యములు గల్గి పత్తిసమున
నున్న వనినున్నవాఁడు నా నొప్పుమీఱి
యిట్టిరా జెవ్వ ధరణిపైఁ బుట్టఁ డనుచుఁ
బొగడితకు నెక్కె భరతుఁడు ప్రదమ యేలె. 211

వ. అంత నక్కడఁ జిత్రకూటపర్వతంబున. 212

—♦ రామునికడకు ఋషులు వచ్చి ఖరాదులదుండగములు చెప్పుట ♦—

చ. భరతుఁడు పాదుకల్ గొని సవాహిసిర్థై చని నంత రాముఁ డ
గ్గిరివరపార్శ్వభాగమునఁ గీడెడి లేక మెలంగుచుండఁ గాఁ
బరమమునీంద్రు లెవ్వరియొ పల్కుచు దైన్యముఖంబు లొప్పనుం
డిరి కని రాముఁ డేమిది కడిందివిచార మటంచు వెండియున్ 213

తే. పరమమునిచంద్రులార! నావలనఁ గాని
లక్ష్మణునివల్లఁ గాని నాలక్ష్మివలనఁ
గాని యేమే నకార్యము గలిగియుండ
లేదుకద నాకుఁ జెప్పుఁడీ సాదరమున. 214

తే. అనిన గులపతి యి ట్లను నతిభయమున
నీవు నీతమ్మకుజ్జయు నీదుపత్ని
పరమసాధువులరు మమ్ము భక్తిఁ గనుచు
నుండ్రు గాకొకకీడు సేయుదురె కట్ట. 215

ఉ. మానెగు లెట్టిదో విను మమర్త్యవిరోధి ఖరుండు నాఖరుం
డానర భోజి పంక్తిగళుఁ డన్నదురాత్మునితమ్ముఁ డాజన
స్థానమున న్వసించి మునిసంఘములన్ బెదరించి వారికిన్
మానక ప్రత్యహంబు నవమానము చేయుచునుండు దండియై. 216

సీ. మునివర్యు లధ్వరములు పొనర్పఁగఁ బోవ
విణ్మూత్రములు వేయు వేదులందు
మద్యమాంసములను మానక కొని వచ్చి
యజమానులముఖంబులందుఁ బోయు
నిరియుంగ బలుత్రాళ్ల ఋత్విగ్జనంబులఁ
బెడకెక్కలం గట్టి కడల వైచు
సోమిదమ్మలఁ బట్టి చూడఁ జూడం బతుల్
యూపంబులకుఁ గట్టుఁ బాప మనకఁ

తే. యజ్ఞశాలలు నుటజము లగ్నిహోత్ర
శాలల్చ వేల్చును స్రుక్స్రువాఘముల నెల్ల
మాపణాదులు పెక్కు గత్తోడఁ గూడ
ఖరుఁడు ఖరుఁడము నిరతంబు కొనలేయు. 217

—♦ రాముఁడుదండక కరుగుచు నత్రిమునిం జూచుట ♦—

వ. ఇట్లనంతోపద్రవంబులు గలిగించి బాధించుచుండు నిప్పుడు మీరిటకు వచ్చినదిమొదలుకొని వాఁడు చేయునుపద్రవం బింత యని చెప్ప శక్యంబు గాదు. మే మిపుడు వానియు వానియనుచరులయు నావడులంబడఁ జాలక మఱియొకచోటికిఁ బోఁ దలంచి ప్రసంగించుకొనుచుంటిమి. మీరు మాతో రా నిష్టమున్న రావచ్చు నని చెప్పి కులపతి మునిజనంబు వెంట రా నొండుచోటికిం బోయె రామచంద్రుండును.

సీ. భరతుని సైన్యము వసియించుటం జేసి
గజతురగకరీషకలిత మగుచు
నాశ్రమం బిది యనర్హమ యయ్యె బంధుగుల్
నిరతము వచ్చుచుండెద రిచటికి
దండకారణ్యము ధర్మసంస్థాపన
మాచరించుట కొప్పినది యగుఁ గద
యనుచు నచటు వోవ నగు నని కొమ్మతోఁ
దమ్మునితోఁ జెప్పి తరలిపోయి

తే. యత్రిమున్యాశ్రమ మది పవిత్రతరము
చేరి మునివర్యునకు మ్రొక్కి సిద్ధవచన
మంది తనదువృత్తాంత మాయనకుఁ జెప్పె
నతఁడు నతనిఁ బరాత్పరుఁ డని తలంచి. 219

ఉ. నీవు మహానుభావుఁడ వనింద్యచరిత్రుఁడ వెల్లలోకముల్
నీవ భరింతు వి న్నెవరునేని యెఱుంగఁగఁ జాల రోజగ

త్పావననామ! నీవు రఘువంశభవుండవు విష్ణుమూర్తి వీ
దేవి మహారమారమణి దివ్యవధూమణి మీకు మ్రొక్కెదన్. 220

తే. అనుచు నానందబాష్పము లతిశయిల్ల
నత్రిరామునిదిక్కు మో మగుచు నేను
వేని ధ్యానింతు నాతఁ డీవిధము నాకు
దర్శనం బిచ్చె మాన్యుఁడ ధన్యతముఁడ. 221

క. అనుచు స్తుతించిన రాముఁడు
మునిచంద్రా! నన్ను నిట్లు పొగడం దగునే
ఘనుఁడవు ముమ్మూర్తుల పిత
వని నే నిన్నెఱిఁగి తండ్రి వని భజియింతున్. 222

వ. నన్ను నీవు పుత్త్రభావంబునం బ్రతీక్షింపు మనిన నతండు హర్షించుచు మహాతపస్విని నాసహధర్మచారిణి యనసూయాదేవి మహత్త్వం బెఱుంగు మని చెప్ప నంతేవాసి నియమించిన నతండు రామచంద్రునిం గాంచి యిట్లనియె. 223

—♦ అనసూయా మాహాత్మ్యము ♦—

క. పదివేలదివ్యవర్షము
లొదవినవిఘ్నముల కోర్చి యుగ్రతపంబున్
బొదలించె నీతపస్విని
విదితము కద తచ్చరిత్ర విశ్వాధీశా. 224

ద్విపదము. పదివర్షములు మున్ను వానలు లేక
పొదవినక్షామంబు పోఁ గొట్టఁ గలిగి
నదు లెండిపోయిన నాఁట జాహ్నవిని
మదిఁ గోరి తనయాశ్రమమునకుఁ దెచ్చి
కందములఫలాళి గలిగించి జగతి
నందఱును సుఖించునట్టులు చేసె
దేవకార్యార్థము దినములు పదియుఁ
గావించె రాత్రిగా ఘనతపశ్శక్తి. 225

సీ. అనసూయవృత్తాంత మది నీకుఁ జెప్పెద
క్రమ మొప్ప వినుము కర్దమమహర్షి
మును స్వాయంభువమను పుత్రి దేవహూ
తిని బెండ్లియాడి యవ్వనితవలన
సాంఖ్యయోగాచార్య సర్వేశ్వరసదృక్షు
కపిలుఁ డ౯ పుత్రునిఁ గాంచి మున్ను
వెనుక నరుంధతి యనసూయ లోనగు
తొమ్మండ్రు కూఁతుల నెమ్మిఁ గాంచె

తే. అం దరుంధతి బ్రహ్మపుత్రాగ్రగణ్యుఁ
డగు వసిష్ఠునిఁ బెండ్లాడె నవల నత్రిఁ
బెండ్లియాడె నియ్యనసూయ వీర లిర్వు
రీలువున నెంతయేనియు నెసఁగి రవని. 226

ఉ. నారదుఁ డిట్టికాలమున నాలుగుదిక్కుల సంచరించుచు౯
ధారణి వీరిఁ గాంచి ప్రముదంబును బొందుచు దేవలోకముం
జేరి సతీత్వగర్వమునఁ జెన్నలరారు త్రిమూర్తికాంతల౯
వారక సత్త్వహీను లగువారిగఁ జేయఁ దలంపుసేయుచు౯. 227

వ. కొన్ని యినుపచణకంబులుసంగ్రహించి మొదటగౌరికడకుంజని. 228

— ఇనుప సెనగల వృత్తాంతము —

తే. ఇనియయోమయ చణకంబు లీవు వీని
వండి పెట్టుము నీసతీత్వమునఁ జేసి
యనుడు నాయమ యి ట్లను ననఘచరిత
పక్వ మె ట్లగు నిను మిట్లు పలుక నగునె.

వ. అనిన నతఁడు కా ని మ్మని లక్ష్మిసరస్వతులకడకుం జని గౌరి
నడిగిన ట్లడిగిన వారు నట్టియుత్తరం బిచ్చినపదంపడి యనసూయ
కడ కరుదెంచి త న్నెఱింగించి. 230

తే. ఇవి యయోమయచణకంబు లేను మెసవ
నెంచి హరిహరబ్రహ్మలయింతులకడ

కేగి వచనంబు చేసె నా కిం డటంచుఁ
గోరితిని వారు కా దనినారు తల్లి. 231

చ. ఇవి తిన నాకు వాంఛ యగు నెట్టులయేనియు వండి పెట్టఁ గాఁ
దవుదువు నీవు నావుడును దన్వి యనున్ మునిలోకనాథ భూ
భువనములన్ సృజించుటకుఁ బొల్చినవారలె యట్టు లన్న నే
నవతెను వారికోటికొన కేనియుఁ బోలనిదాన నక్కటా. 232

ఆ. ఎట్టు లేను నీకు నీచణకంబులు
వండి యిడుదు ననుచు వట్టిమాట
లాడినఁ దెమ్ము చూతు యత్నించి యని వానిఁ
జో[illegible]లించుకొనుచుఁ దోడు తోడ. 233

వ. ఇనుప సెనగ లివి వచనం బయ్యె నిండ కొను మని నారదుని
చేతిలోనం బోయుటయు నతఁ డామె నభినందించుచుం ద్రిభు
వనంబునకుం బోయి లక్ష్మీపార్వతీసరస్వతులకు వానిం జూపి యి
ట్లనియె. 234

శా. [illegible] మంచు గర్వము ననుం ద్రైలోక్యమం దంటలన్
దాకేఁ తక్కువ సేయ నేననుచు వాదంబుల్ వచారింతు రా
హా మహత్త్వంబున పతిప్రపత్ని యనసూయాదేవి చేముట్టి తా
నీమై పక్వము చేసి యిచ్చెఁ గనుఁడీ యీయిన్నపిండంబులన్. 235

వ. అని తమ్ముఁ బోనాడి నారదుండు పోయినంత మువ్వురు మువ్వురుస
ల్లజ్జితులై మహాకోపక గర్జించుచు ననసూయాపాతివ్రత్యం బెట్టు
లేని భంగంబు గావింప నెంచి తమభర్తలతోడం జెప్పి మాగౌర
వంబు గాపాడి రక్షింపుం డని ప్రార్థించిన వారు. మువ్వురును. 236

ఉ. మోహనమూర్తులై భువికిఁ బోయి తదాశ్రమమందు డిగ్గి సం
దేహము లేక పోయి మునిదేవిని గన్గొని భోజనంబు మా
కీహ యొనర్చి పెట్టుదురె యీ రన వారటు లే యటంచు న
వ్యాహతభక్తి వంటకము నంతయు సిద్ధము చేసి రండనన్. 237

వ. వార లి ట్లనిరి. 238

ఉ. మాకు వ్రతం బొకండు విను మానిని వంటక మాచరించి తా
కోక ధరింపఁ బోక యొకకొంచెము కాలము నగ్నులమై పయిన్
బాకము శాకముల్ వరుస పత్రములం దిడ నొప్పు నట్లుగా
కేకడ మేము భోజన మొకింతయుఁ జేయము నిక్కువం బనన్. 239

మ. అటులే చేసెద రం డటంచు ననసూయాదేవి యమ్ముమ్మృర్తిన్
గుటికల్ మ్రింగెడువారి నాసనములం గూర్చుండగాఁ జేసి యం
తట నగ్నాంగిగనై కనంబడినయంత న్వారు కౌర్యాకారమం
చట నేడ్పుల్ పచరించుచున్ బుడుతలై రాశ్చర్యముం దోపఁగన్.

—♦ త్రిమూర్తు లనసూయకడ శిశువులగుట ♦—

ఆ. శిశువు లైనవారిఁ జేకొని స్తన్యం బొ
సంగి తొట్టెలం దెసంగఁ జేసి
పెనిచెఁ గన్నబిడ్డ లని ప్రేముడిం జేసి
యాశ్రమాంతరంబునందు గరిత. 241

వ. అంత నక్కడఁ ద్రిమూర్తులపత్నులు తమభర్తలెంతకాల మైన
రాకుండుటం జేసి పరితపించుచున్నకాలంబున నారదుండు మఱియు
వచ్చి సర్వంబు నెఱింగించిన వారు చేయునది లేక నారదప్రేరి
తులై యనసూయకడకు వచ్చి ప్రార్థించుచు ని ట్లనిరి. 242

మ. అపరాధం బొనరించినార మనసూయా! మమ్ము రక్షించి నీ
కృప మాపై నొకకొంత చూపి శిశుతాశ్రీదోప నిందున్నవా
రు పతుల్ మా కిడి భిక్షపెట్టఁ గదె వేరున్ లేరు నీసాటి నా
నవు డాసాధ్వి దయారసం బది నిజస్వాంతంబునం బర్వఁగన్. 243

వ. శిశువులపై మంత్రోదకంబును చల్లినంత వారు త్రిమూర్తులై
లజ్జించుచు ననసూయపాదంబులకు మ్రొక్కి మేము ముమ్మూర
మిపు డిట్లు పుత్రుల మైతిమి గావున నవలికాలంబున నీకు మదం
శంబునఁ బుత్రుండు పుట్టు నని చెప్పి లక్ష్మీపార్వతీసరస్వతులతో
నిజవాసంబులకు నిష్క్రమించి రంతఁ గొంతకాలంబున ననసూయ
గర్భంబునఁ ద్రిమూర్తులయంశంబునదత్తాత్రేయుండు పుట్టి జగదేక

పూజ్యుం డయ్యె నని చెప్పిన సీతారాము లయ్యనసూయాపాదా
రవిందంబుల కభివందనం బాచరించి రనంతరంబ. 244

క. అనసూయ సీతఁ గౌఁగిటఁ
గొని యాఘ్రాణించి శిరము గోమలి! నీకుఁ
ఘనవర మిత్తుఁ గొను మన
వనితామణి సీత యొండు పలుకక యుండెన్. 245

—♦ అనసూయ సీతకు నంగరాగవల్కలము లిచ్చుట ♦—

వ. అంతలో మునిపత్ని సీతకుఁ గొన్ని పతివ్రతాధర్మంబు లుపదేశించి
మించిన వేడ్క నొక్కనాఁటిచీరయు విలేపనంబున కగునంగరా
గంబు నొసంగిన సీత వానిని స్వీకరించి వసనంబు గట్టుకొనియంగ
రాగంబు దేహంబునలుగడ విలేపనంబు గావించుకొనియెఁ దత్ప్ర
భావంబున సీత లోకాతీత తేజో విరాజిత దేహయష్టియై దీపించె రాముం
డది చూచి పరమాశ్చర్య భరితాంగుం డయ్యె నప్పు డన
సూయ రామపత్ని దిక్కు మొగంబై యిట్లనియె. 246

తే. తల్లి! పదునాలుగేండ్లు వస్త్రం బొకండు
దాల్ప నక్కఱ లే దిది దాల్చియుంట
నొరుఁడు దీని స్పృశింప లేఁ డెదియ జేయు
వజ్రకవచము నీ కిది వారిజాక్షి. 247

ఆ. అంగరాగ మిద్ది యంగసౌష్ఠవ మిడు
టొకఁడ కాదు విషము లొడలికెక్క
వాకలియును దప్పి లేకుండు జలమాడు
నవసరంబు గలుగ దమలగాత్రి. 248

వ. అని దీవించి తపోగృహంబులకుం జనియె సీతారామలక్ష్మణులు
నారేయి వారి కతిథులై యుండి మఱునాఁడు ప్రయాణోన్ము
ఖులై యుండునప్పుడు కొందఱు ఋషు లరుదెంచి రామచంద్రుం
గాంచి యిట్లనిరి. 249

మంజుల. రాక్షసాకీర్ణ మో రామ! యిక్కానవం
బేక్షణం బైనఁ గానీ ప్రజం బట్టి యా

రాక్షసుల్ చంపనై క్రాలుచుండ్రీవు మా
యాక్షితిం గావఁగా నెంచు ముల్లంబునన్. 250

వ. అనిన రఘురాముం డట్ల యగుం గావుత మని యెల్లవారినామం
త్రించి తదనుజ్ఞ వడిసి సీతాలక్ష్మణసహితంబుగా దండకారణ్యం
బునకుం జనియె నని చెప్పిన విని నైమిశారణ్యవాసు లవ్వలి
వృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయు. 251

## ఆ శ్వా సాం త ము

సీ. ప్రకృతిప్రధానవర్గప్రియుం డగురాముఁ
బట్టభద్రునిఁ జేయఁ బ త్త్రిరథుఁడు
తలఁచుచుండం గైక తనవరద్వయమున
భరతుఁడు రాజ్యంబు వడయునట్లు
శ్రీరాముఁ డడవులు చేరునట్లును బలిం
గోరుడు రాముఁ డాకోర్కెఁ జేసి
జానకీలక్ష్మణసహితుఁడై చని చిత్ర
కూటమందుండ నారాట వడుచు
తే. భరతుఁ డరుదెంచి రమ్మని పట్టుపఱచి
రాక యుండినఁ బాదుకల్ గైకొని పురి
కరిగెనట దండకకు నేగి ధరణినేలు
రామచంద్రుడు వేంకటరాము నేలు.

### గ ద్య ము

ఇది శ్రీమహామహోపాధ్యాయ కళాప్రపూర్ణకవిరాజ
కవిసార్వభౌ మాంధ్రవ్యా సాభినవశ్రీనాథ వేదవిద్యా
విశారద శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి ప్రణీతం
బయిన శ్రీకృష్ణరామాయణంబునందు
అరణ్యాకాండము ప్రథమాశ్వాసము
శ్రీ శ్రీ శ్రీ

# శ్రీకృష్ణరామాయణము

## ఆరణ్యకాండము

### ప్రథమాశ్వాసము



క. శ్రీవిద్యాపోషకుఁడై
భూవలయమునందుఁ బేరు ప్రోయం గవిరా
డ్భావితుఁ డగునీదరవం
శావిర్భూతుండు పొందు నభ్యుదయంబున్.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునీంద్రుల కిట్లనియె నట్లు సీతా
రామలక్ష్మణులు రుధిరోద్గారిసంవత్సర వైశాఖబహుళపంచమీదినం
బున దండకారణ్యంబునం బ్రవేశించి చనుచు నమ్మార్గమధ్యంబున; 2

—♦దండకారణ్య మార్గ వర్ణనము♦—

సీ. కన్నతల్లికి ధాత్రి కెన్ని మ్రొక్కెడు నన
ఫలభారమునఁ జేసి వంగెఁ జెట్లు
మహితపుష్పవితానమకరందముల మేపి
భ్రమరంబుల నోమ్రయు బహుళలతలు
శుకపికాదుల నింపి సుస్వరంబుల నొప్పి
మునులకు ముద మిచ్చె పొదలు పొదలు
కలువలజవరాలు కాలు పెట్టఁగ వచ్చె
నని వికసిలుకమలాకరములు
తే. కలిగి కన్నులపండువై కనుఁగొనంగ
సర్వదుఃఖంబులను బాపఁ జాలిన దయి
శాంతమై పరిశుద్ధమై సదమల మయి
తాపసాశ్రమమండల మేపుమీఱు. 3

సీ. అరిం దెందుఁ జూచిన నారక్తైచినవల్క-
లములును గృష్ణాజినములు కుశలు
సమిధ లగ్నులు పూర్ణ జలకలశంబులు
బలులును హోమముల్ బ్రహ్మఘోష
మందందు నాఁకు టిం డ్లందు మునీశ్వరుల్
జపతపస్స్వాధ్యాయచతురమతులు
గలిగి కన్పండునై కాన వచ్చెడుతపో
వనమును దశరథతనయు లపుడు

తే. భీతి కలుగనియట్లు వినీతవేష .
ములను గైకొని సజ్జితము లగుకార్ము
కములయెక్కులు డించి శాంతము శరీర
మందె నవఁ దోఁచి నడచి రయ్యాశ్రమమున. 4

ఉ. ఎన్నఁడుచూడనట్టిహొయ లేర్పడ నప్పరమాశ్రమంబునన్
బున్నమ రేల నింగిపయిఁ బొల్చెడుచంద్రుని బోలురామునిన్
వెన్నెల నాఁగ నామగని వెన్కొని వచ్చెడు జానకీసతిన్
గన్నులఁ గాంచి తాపసు లఖండముదంబును బొంది రందరున్. 5

వ. అంత వా రందఱు నెదురేగి తోడ్తెచ్చి దర్భాసనంబుల నాసీను
లం గావించి యర్ఘ్యపాద్యంబు లిచ్చి లక్ష్మీనారాయణస్వరూపు ల
ని పూజించి స్వస్తివాచకంబు లుచ్చరించుచు నిట్లని ప్రార్థించిరి. 6

—♦మౌనులు రామునికి స్వస్తి పలుకుట♦—

ఉ. ఈవవతారమూర్తి వని యేము గ్రహించితి మూర్వి దుష్టులన్
బోవఁగఁ జేసి శిష్టులను బ్రోవఁగఁ బుట్టినవిష్ణుమూర్తి వో
పావననామ! రామ! నినుభక్తి భజింతుము దండకాటవిన్
వేవురు రాక్షసాధములు వేఁపుచునుండిరి మమ్ము మాప్రజన్. 7

చ. అడవిఁ జరించుచున్నఁ బురమందు మెలంగుచునున్న భూప్రజన్.
గడుకొని ప్రోచుభార మదికైకొని యుండెడు రాజు గావునన్

విడువక మమ్ముఁ బ్రోవు మని వేఁడుచు నుంటిమి దుష్టశిక్షణం
బెడపక చేయురాజు గమ లేశ్వరుఁ డంచు బ్రమతుల్ వచించెడిన్. 8

సీ. జపతపంబులు మేము సలుపుకొనుచునుండ
నలజడి గలిగింతు రనుదినంబు
నగ్నిహోత్రంబుల నర్చించుకొనుచుండ
నడ తెంచి నంజుళ్లు విడుతు రచట
జన్నము లొనరింప సమకట్టి యున్నప్డు
శాలలు రగులింత్రు చండముగను
వైశ్వదేవము చేసి వడ్డించుకొన్నయ
న్నము ముట్టి కొనిపోదు రమిసి మీఁద

తే. ఆలుబిడ్డలతోడ మే మాదమఱచి
నిదుర పో రాదు మఱి యె ట్లు మెదలుటకును
గతులు లేకుండె మా కయో కౌసలేయ!
కావుమీ మమ్ము కష్టరాక్షసుల గిట్టి. 9

క. నాన్నుతు రామున్ గను భూ
దేవతలారా! వనాశ్రిదేశ కేశగుణక్
దేవారుల నడఁగించుట
కే వగవకుఁ డింక మీర లేఁ గలఁ గావక్. 10

వ. అని వారి కభయహస్తం బొసంగి రఘుపుంగవుండు నాఁటిరే
యట నుండి మరునాఁడు రేపకడ లేచి కాల్యకరణీయంబులు
దీర్చి యచటివారికిం జెప్పి సజాయానుజంబుగాఁ బయనంబై సింహ
శార్దూలాదిభీషణసత్వసంకులంబును భయంకరంబు నగునయ్యరణ్యా
మార్గంబున ధనుష్టంకారంబు గావించుచుం బోయి పోయి లక్ష్మణుం
గాంచి. 11

చ. ఇది కడుభీకరాటవి యనేకవిధంబుల సాధ్వసంబు లీ
పదమునఁ జూడ వచ్చెడిని భ్రాతృవరేణ్య! పరాకుపాటునన్
పొదలఁగ రాదు నే నడతు ముం దయి నీ వటువెన్క నుండు మీ
సుదతి మదీయమధ్యమునఁ జొచ్చి నడం జను జాగరూకతన్. 12

వ. అని తాను ముందుండి నడుమ జానకి నడువం జేసి వెనుక లక్ష్మణుఁ నిలిపి నడచుచుండె నప్పుడు సౌమిత్రిహలకులిశ పద్మాది రేఖాసమలంకృతంబు లగు సీతారాములనడుగుజాడలం గనుచు దనమనంబునయందు. 13

చ. అడవు లివెంతధన్యము లహో త్రిజగజ్జనవందనీయుఁడై
పుడమి జనించినట్టిరఘుపుంగవు పాదము లందుభాగ్యముల్
బడయఁగఁ గల్గినట్టి వయి భాసిలుపుణ్యపదంబు లట్టివై
నడచెడి వారి పాపము లనారతము న్వెడలించు బాపురే. 14

వ. అని ప్రశంసించుచు వానికి నమస్కరించుచు దిక్కులుపరికించు జాగరూకుండై నడచుచుండె నంతలోఁ గొంతదూరంబున.

— రామలక్ష్మణులకు విరాధు లడ్డుపడి సీతం గొనుట —

సీ. కాటుకకొండకుఁ దీటువచ్చెడుమేను
ఘోరస్వరంబు గంభీరదృశలు
పెద్దపర్వతగుహ కుద్ది వచ్చెడునోరు
విషమోదరంబును వికృతముఖము
చేటచెవుల్ బానపాటిసేయఁగఁ జాలు
ముక్కు గానుగుఱోళ్ళఁ బోలుకాళ్ళు
తాళవృక్షంబులపాలిదార్లు కరాలు
వజ్రంబులకు సాటి వచ్చుగోళ్లు
తే. ఆర్ద్రవైయాఘ్రచర్మము నలవరించు
కొనుట రక్తసిక్తాంగమై తనువు రోఁత
లీనుచుండ భయంకరాకృతి నెసంగు
కాలుఁ డనఁ బురుషాదుఁ డొక్కండు తోఁచె. 16

సీ. ఎక్కటివసఁ గ్రక్కునేనికతల మూఁడు
సింగముల్ నాలుగుచిఱుతపులులు
వృకములు రెండును వృషతముల్ పదియును
శూలాగ్రమునఁ గ్రుచ్చి లీల దాల్చి

నో రప్పళించుచు సారెకు నరచుచు
నట్టహాసము చేయునట్టిఁ డగుచు
వికృతరూపంబున వెఱ గందఁజేయుచు
మేదిని గదలంగ మెట్టికొనుచు

ఆ. రామలక్ష్మణులను సీత నామెయిఁ గని
యించుకేనియు జంకక యింతలోనఁ
బఱచి సీతను జేతులఁ బట్టి చంకఁ
బెట్టుకొని యిట్టు లనె వారి నట్టె చూచి. 17

తే. నారచీఱలు గట్టియుఁ గూరలు దిని
జడలుగట్టి నెఱిఁ గొండె ముడులు వైచి
మునులనుం బోలె దండ కావనమునందుఁ
సంచరించుచు నుంటిరి జంకు లేక. 18

క. మునులకు విల్లమ్ములునున్
వనితయునుం గలిగి యుంట వర మా నొక్కో
వినిపింపుఁ డేరు మీ రే
మునిభోజి విరాధుఁ డనఁగఁ బొలిచెడివాఁడన్. 19

క. ఇది నాకు నునికి పట్టగు
పద మే నరభోజినగుట భక్షింతు మిమున్
మదవతి దీనిం భార్యగ
మదనాహవమందు డింపి మసలెద నింకన్. 20

క. రూక్షాక్షరములు విని త
త్క్షణమునం జిక్కి సీత కంపించుచుఁ బ్ర
త్యక్ష మయి నంత రాఘవుఁ
డక్షీణవ్యధ మునింగి యనుఁ దమ్మునితోన్. 21

క. సూకర విష్ఠం బోలిన
యీ కష్టుఁడు ముట్టఁ గలిగె నిటు జానకి నే

నేకరణి నిట్టిదోషము
పోకడఁ బెట్టంగఁ జాలి పొలుతునొకొ క్ష్మా. 22

వ. అనిన లక్ష్మణుం డి ట్లనియె. 23

ఉ. అగ్రజ! రాక్షసాధమునియంగము దాకెను సీత కంచు నీ
వ్యగ్రత తోపవచ్చెడిని వహ్నికి నీడగునీమె కంటునే
యుగ్రహాదోష మైన నిది యిట్టిద యైన మఱొండు గల్గు న
త్యుగ్రతపోమహాత్వమున నొప్పెడు నయ్యనసూయ నర్గవే. 24

తే. అంగరాగ మొసఁగె నయ్యమ్మ యీామె
కది కవచ మయి యెట్టియంహాస్సునైన
నంటకుండఁ జేసెశక్తి నంది యుంట
నసుర సంస్పర్శదోష మీాయమకు రాదు. 25

క. నీ వీశోకము విడి వడ
గా వీని వధించి సీత గాసిలకుండన్
గావింపు మాసురర క్తము
ద్రావి ధరాదేవి ప్రీతిఁ దాఁ గొల్చు మనన్ 26

వ. అనినన్ విని రామచంద్రుండు. 27

మ. కనులన్ నిప్పులు రాలునట్లసురపైఁ గ్రొవ్విప్పుచున్ రోజుచున్
ఘనబాణం బరివోసి యేయ నగుచుం గన్నెఱ్ఱగారక్కసున్
గనుఁగొం చోరి నిశాచరా! యెవఁడవో కాసీ దురాత్ముండ వీ
వని నుండనన్న విరాధుఁ డీ వెవరో చెప్పంజెల్లు మున్మున్నుగన్. 28

క. రాముం డాతని కి ట్లను
మే మైక్ష్వాకులము క్షాత్ర మే మార్గనుత వసా
నా మనుజభోజి యిట్లను
మాామక మీానసము నేను మానసభోజిన్ 29

తే. జయునకు శతహ్రదకుఁ బుత్త్రుఁ డయినవాఁడ
నను విరాధుఁ డటందు రందఱును బ్రహ్మ

వరమునం జేసి శస్త్రాదిమరణ మేను
బొంద నని వెండి యి ట్లను బొలసుదిండి. 30

తే. పొలఁతిపై నాస విడి మీరు పొందు వడిగ
మిమ్ముఁ జంపంగఁ దలపోయు నెమ్మెలాడి
కారణంబున నావుడుఁ గనుల నిప్పు
లుప్పతిల రాముఁ డి ట్లను నుగ్రుఁ డగుచు. 31

శా. ఛీ ఛీ క్షుద్ర! నినుం గ్రసించి కొన నీచెంతం బ్రవర్తిల్లెడుం
వాచాలత్వ మెసంగ మృత్యు విదిగో వచ్చెం గటాక్షింపు మో
రీ చాతుర్యము చూపు మంచు గొనయం బెక్కించి పెక్కైననా
రాచంబుల్ నిగిడించి యేసె నురముం బ్రవ్యంగ నక్తంచరుం. 32

తే. రుక్మపుంఖంబు లగునేడు రూక్షబాణ
ము లు విరాధునిపై నేయ పోయి యవ్వి
వానియొడ లెల్లఁ జించి పై వచ్చి పడియె
రక్తసిక్తములై కడు వ్యక్తము లయి. 33

మ. తనువెల్లన్ రుధిరప్రవాహ మగుడుం దబ్బిబ్బునుం జెంది య
మ్మనుజాదుండు ధరాసుతన్ విడిచి భీమం బైనశూలం బొకం
డు నెఱిం బూని మహానినాదము జగన్నున్నంబు గా నార్చుచుం
డనుమం జాలు నటంచు నేసినది తోడ్తో మండుచున్ జేరుడున్. 34

తే. రాఘవుఁడు దాని రెండుశరములఁ జేసి
మూడు తునకలు గావించె భూరిరవము
తోడ నవి మేరు శిఖరము లూడక పడు
నట్లు భూమిపయిం బడె నద్భుతముగ. 35

మత్తే. చిత్తజల్లుగ బాణజాలము చిందువందుగ నేయుచున్
గత్తులం బడి మొత్తుచుండెనఁ గాని రక్కసి యుక్కునన్
మత్తభద్రము వాన దాక సుమంత గొంకక వంచి మో
మత్తఱిం బఱతెంచునట్టు లహంయువై పఱతెంచుచున్. 36

వ. రామలక్ష్మణుల నిద్దఱం బట్టి రెండుమూపులం బెట్టుకొని పఱవం జొచ్చె నప్పుడు.

—: రామలక్ష్మణులు విరాధుం దెగనేయుట :—

ఆ. పెద్దకొండమీఁదఁ బిట్టలురెం డొక్క-
కడన కూరుచున్నకరణి రామ
లక్ష్మణుల్ తదీయులంబభుజాస్కంధ
ములను గూరుచుండి రెలమి దోఁప. 38

ఆ. అట్లుదాశరథుల నాలరిరక్కసి
గొంచుఁ బోవుచుండఁ గాంచి సీత
హారు హారు మనుచు నార్చుచు వె న్నంటి
యరుగఁ జొచ్చె వారి ననుసరించి. 39

ఉ. అప్పుడు లక్ష్మణుండు నిజహస్తగతం బగుచంద్రహాసముం
ద్రిప్పుచు వానిబాహువును ద్రెంచె నొకండు రఘూద్వహుండునుం
దెప్పిలి త్రెవ్వ నేసెఁ దనదిక్కున నుండెడు బాహుదండముం
జప్పుడు లుప్పతిల్ల నవి క్ష్మాస్థితిపైఁ బడెఁ గొండలో యనన్. 40

వ. చేతిపట్టు విడుటంజేసి రామలక్ష్మణులు వానిభుజంబులనుండి నేల కుఱికి. 41

క. కరవాలంబుల వా రిరు
వురు వానిపదద్వయంబు పోరిఁ దెగి పడఁ జే
సిరి వాఁడు పెద్దకొండన
ధరణిం బడి పొరలఁ జొచ్చెఁ దరువులు విఱుగన్. 42

తే. దాశరథు లంత వానిని దరియ నేగి
కాళ్లఁ దన్నియు వడిఁ బిడికిళ్లఁ బొడిచి
జానుగులఁ గ్రుమ్మియు న్వానిఁ జంప లేక
నేలఁ బూడ్వంగ నెంచి రవ్వేళ వాఁడు. 43

వ. రామచంద్రుం గాంచి యి ట్లనియె. 44

చ. రఘుకులసింధుసోముఁడవు రాముఁడ వీవు ధరాతలంబునన్
దఘములు పాఱఁ దోలుటకు నచ్యుతునంశమునన్ జనించి తో
మఘవదభిష్టుతప్రభవ! మామకశాపము వాప నిగ్రతిన్
సుఘటకుఁ డైతి నిన్నిపుడు స్తోత్రముఁ జేసి భజింతు నచ్యుతా. 45

వ. అనిన రాముఁడు నీవృత్తాంతంబు చెప్పు మనిన విరాధుండు 46

తే. నన్నుఁ దుంబురుఁ డనెడుగంధర్వపతిగ
గనుము రంభకారణముగ ధనదుచేత
నిట్లు శప్తుండ నైతి న న్నేను వేఁడ
నీవలన శాపమోక్షము నెఱి నొసంగె. 47

వ. నీప్రసాదంబునన్ జేసి నేను ముక్తుండ నైతి నింక నిజభవనంబునకుం
జనియెద మీకు స్వస్తి యగుం గాక నాకళేబరం బొక్కయవ
టంబునం బెట్టి మట్టిం గప్పిపోవు డిటకు సార్ధయోజనదూరం
బున శరభంగునాశ్రమంబు గలదు వారి కట కరిగిన శ్రేయంబగు
నని ప్రాణంబులు విడిచి నిజలోకంబునకుం జనియె నాకు వాఁడు
చెప్పినచొప్పునం జేసి సీతాసమేతులై శరభంగు నాశ్రమసమీ
పంబు నకుం జని నంత రాముండు లక్ష్మణునకి ట్లనియె. 48

—♦ సీతారామలక్ష్మణులు శరభంగు నాశ్రమంబు సేరుట ♦—

సీ. కనుఁగొను మంతరిక్షమున దివ్యరథంబు
హరితవర్ణము లగునశ్వము లవె
యదియె యింద్రునిపీఠ మాఁతఁడే మాతలి
నూఱులు గా సురల్ గూరుచుండి
రాతఁ డింద్రుఁడు వార లారైరు లగునేండ్లు
వయసు గలుగువా రప్సరస్సు లరయ
వా రేమిటికి నిట వచ్చిరో తెలిసి వ
చ్చెద నింతసే పిట సీతతోడ

తే. నిలువు మని తాను వారికిం దెలియకుండ
నింత చని యుండె నంతలో నింద్రుఁడు ముని

రథమ్ము రథ మెక్కి మన ముని రామచంద్రుఁ
డరుగు దెంచెఁ గనివాని నరుగు దెంతు. 49

వ. అని చెప్పిన నింద్రుం డట్ల చేయు మేలిప్పు రామదర్శనంబు చేయ నొప్పదు పోయివచ్చెద నని మింటితెరువునం జనియె నంత రాముం డును మరలి వచ్చి సీతాలక్ష్మణులతో శరభంగునికడం జనిన నతండు వారి కర్ఘ్యపాద్యంబు లొసంగి పూజించి నంత నింద్రాగమ వృత్తాంతంబు చెప్ప మనిన రామునకు మునీంద్రుం డి ట్లనియె. 50

క. నను స్వర్గంబునకుఁ ర
మ్మని పిలువఁగ వచ్చెఁ డా స్వయమ్ముగ నే రా
మునిఁ గని సేవింపక రా
నని చెప్పితి నీకు రాక నాశించి ప్రభూ. 51

వ. అట్లు నాచేఁ బ్రత్యాఖ్యాతుం డై యింద్రుండు చనియె రామచం ద్రా! నాతపఃప్రభావంబున నేను సాధించినస్వర్లోకబ్రహ్మలోకంబు లు నీ కిచ్చెద స్వీకరింపు మనిన శ్రీరాముండు. 52

క. ఏలోకము లైనను నే
నే లలి సాధించుకొంటినేని స్వయముగా
మే లగు నని తలఁచుచును వ
నాళికి నిటు వచ్చినాఁడ ననఘచరిత్రా. 53

ఉ. మేము వసింపగా నెచట మే లయి యుండునొ చెప్పు మింతయే
మామది నుండుకోర్కి యన మౌనివరేణ్యుఁడు పల్కె నిట్లు లిం
దే మహిమోన్నతిం దగి సుతీక్ష్ణుఁడు నాఁబడుగౌతమాన్వయుం
డౌ మునివర్యుఁడొక్కఁడగునాతఁడుమీకుశుభంబుఁగూర్చెడున్. 54

—♦ రామలక్ష్మణులు సుతీక్ష్ణాశ్రమముం గాంచుట ♦—

వ. అని శరభంగుం డా సుతీక్ష్ణాశ్రమంబునకు దారి చెప్పిక్షణమాత్రం బుండి నన్నుఁ జూచుచుండుం డని శ్రౌతాగ్నిం బ్రజ్వరిల్లం జేసి కొన్ని యాజ్యాహుతు లొనర్చి తా నందుఁ జొచ్చె నంత లోని

వసామాంస మస్తిష్క శోణిత కేశత్వక్చయ మ్మంతయు దగ్ధం బైనపదంపడి దానినుండి దివ్యమంగళవిగ్రహం బొకండు పొడకట్టి లేచి యాహితాగ్నిలోకంబులు దాటి బ్రహ్మలోకంబునకుం జనియె ననంతరంబ కొందఱు మునీంద్రు లట జనుదెంచి రందు వైఖానసులు వాలఖిల్యులు సంప్రక్షాళకులు మరీచిపులు నశ్మకుట్టులు పత్రాహారులు దంతోలూఖలులు నున్మజ్జకులు గాత్రశయ్యులు నశయ్యులు నభ్రావకాశకులు సలిలాహారులు వాయుభక్షులు, నాకాశనిలయులు, స్థండిలశాయులు, నిత్యోపవాసులు, వ్రతోపవాసులు, దాంతులు సార్ద్రపటవాసులు సజపులు తపోనిష్ఠులు లోనగువారు పెక్కండ్రు గలరు వా రందఱును రాముని గలిసి వచ్చి యిట్లనిరి.

సీ. ప్రార్థింప వచ్చితి మందఱమును నిన్ను
నీవు సాక్షాత్పరమేశ్వరుఁడవు
ప్రజలఁ బ్రోవఁగ నిట్లు రాజవై పుట్టితి
మద్భాగబలి నంది జగతి నాతఁ
డేలు మునుల్ వాని కిత్తురు వారిత
పంబులో నాలవపాలు గాన
రక్షణీయుల మేము రామ! రక్షింపుము
రాక్షసబాధ మా కీక్షణమును

తే. గలుగుచుండును జూడు మాకెలన నెన్ని
యస్థిపంజరములు గుట్టలై పడినవో
వానిఁ బరికించి యైన మాపయినిఁ గరుణ
నలిపి రక్షింపు మనుచు మాపలుకుబడులు. 56

తే. అనిన రాముఁడు దుష్టసంహారమునకె
వచ్చితి నరణ్యపథములు పట్టి నన్ను
మీర లర్థింప వలయు నక్కామేర లేదు
నాక విధి గానఁ దీర్చెద నాదువిధిని. 57

**శ్రీరాముఁడు మహామునుల కభయప్రదానము చేయుట**

వ. మీ రింతటినుండి రాక్షసభయంబునుండి విముక్తులరై సుఖం బుండుఁ డిదె మీ కభయం బొసంగుచున్నవాఁడనని వారిం గూడి సీతాలక్ష్మణులతోఁ గదలి నడుమ నడుమ జలపూర్ణంబు లైన నదులు వనంబులు దాటి పర్వతంబు లతిక్రమించి చని చని కొంతపడి కొక్క తపోవనంబున నతివృద్ధుండై జీర్ణించిన శరీరంబు గలసుతీక్ష్ణుం గని యెవ్వరుం జెప్పకయ చోష్టులం బట్టి వాని నెఱింగి నమస్కరించి నేను రాఘవుండ దర్శనార్థినై వచ్చితి ననుగ్రహింపు మనిన నతం డతనిం గౌఁగిలించుకొని. 58

శా. రామా! స్వాగత మీవు వచ్చుటను గోత్రాభాగ మియ్యంతయుఁ
సామాన్యం బనరాని వైభవమునన్ జానొందె మాయాశ్రమం
బీమాత్రం బని లేను ధన్యుఁడను పో యెంచంగ మామానఘుల్
సీమీఁదం గలభక్తిమైఁ గడలకుంటిం బోక నైచోటికిన్. 59

వ. అని సుతీక్ష్ణుండు రాము నభినుతింప నతండు మే మేదే నొక్కచో నొక్కి న్నిదినంబులు నివసింపఁ గోరియుంటి మన నతం డిది మీ యాశ్రమంబ యిట నుండ వచ్చుం గాని మృగబాధమాత్రము పెచ్చునుడు రామచంద్రుం డౌఁ గాత మని యట నారాత్రి విశ్రమించి మఱునాఁడు వేకువన లేచి కాల్యకృత్యంబులు దీర్చుకొని యున్నయప్పుడు మరికొండఱు ఋషులు దండకనుండియు నితర స్థలములనుండియు వచ్చి రామునిం గని యి ట్లనిరి. 60

ఉ. ఈ వరుదెంచినాఁడ వని యే మచట న్విని వచ్చినార మో
దేవర! మాపొలంబులను దేవవిరోధుల బాధ మిక్కుటం
బై వివరింపలేనియటులై కనుపట్టెడి మామహార్తులీ
యీవిధ మంచుఁ జెప్పుకొన నేటికి నేఁటికి నీక తోఁచెడిన్. 61

వ. అనిన రామచంద్రుండు మునిసింద్రులం గాంచి మీవనంబునకుం దండక యనుపే రెట్లువచ్చె దానివృత్తాంతం బెట్టిది చెప్పుఁ డనిన వార లి ట్లనిరి. 62

—♦ దండకారణ్య వృత్తాంతము ♦—

సీ. ఇక్ష్వాకువంశజుం డైనదండకుఁ డను
మేటిఱేఁ డొకనాఁడు వేట వచ్చి
యిట నొకచోఁ గన్య భృగుపుత్త్రిఁ గని కామ
మోహితుండై దానిఁ బొందఁ గోరి
వలదు కూడ దటన్న వదలక బలవంత
ముగ నామెతోఁ గూడి పోయె నదియు
జనకున కెఱిఁగింపఁ గనలుచు నాతండు
దండకు శపియించి తద్వనంబు
తే. నూఱుయోజనములమేర నాఱు చెడి న
శించునట్టులుఁ బలికిన వించుఁ గూఁతు
రవ్వని పొనస్సృతపస్వితే దార్య! దాని
నసక మొసకంగఁ జేయవే మిసిమి గూర్చి. 63

మ. అనినన్ భార్గవుఁ డిట్లనెన్ ఘనకృపాయత్తైకచిత్తంబునన్
తనుజా మీఁద నగస్త్యమౌని యిటకున్ దా వచ్చు నప్పిమ్మటన్
జనసంఘంబులతో మృగావళులతో శాఖిజాతితో దోఁటియ
ట్లొనరున్ రాముని రాక పవిత్రఫలం బెంపొందున్ జగద్వర్ణ్యమై.
వ. అవ్వనంబు భృగుండు శపించినదాది సర్వశూన్యంబై మరుభూ
మియై యుండి వింధ్యపర్వతకారణంబున నగస్త్యుం డుత్తరంబునుం
డి వచ్చినదిమొద లది క్రమక్రమాభివృద్ధింగాంచె. 65

తరళము. అనుచు మానులు విన్నవించిన నబ్జలోచనుఁ డానుతీ
ర్ణ్యనిసముక్షము నొంది యిట్లను శోకకర్శితులైనయీ
మునివరేణ్యులు నన్నుఁ గొంకరముం గనం జనుదేఁ గడున్
వినుచుచుండిరి నే నటుల జని నీరిబాధ లడంగఁగా. 66
క. పూనరించి వత్తు వెండియు
ననుఁ గరుణం గాంచి ఫుచ్చ నతి గావింతున్
మునివర నావుడు నాతం
డినకులవర! వీరి నేలుటే వర మరయన్. 67

నున్నవారలు తాళక నన్ను వేఁడి
రేను రక్షింతు నంటి నోయింతిమిన్న. 72

తే. అభయహస్తం బొసంగి నే నార్తుఁడ నయి
చేఁత గా దని పలుకుట నీతిపథమె
రాజనై పుట్టి నేఁ బెరయోజ నుంట
కంటెఁ జచ్చుట శ్రేయ మూఁ గాదె కాంత. 73

క. స్త్రీచాపలమున నోఁటమి
నాచేతం బొందఁ బడెదు నా భయమునవో
వాచించి తిట్లు వగవకు
నీచెలువుం డెట్లు మెలఁగ నేర్చునో కనుమా. 74

వ. అనినం జానకి సిగ్గును భయంబు నభినయించుచు ని ట్లనియె. 75

చ. ఎఱుఁగనిదాననై పలుక నెంచినదాన నటంచు నెంచి తి
ట్లెఱుఁగక కాదు నీ వెవరొ యీవ యెఱుంగవ యేమొ కాని నే
నెఱుఁగుదు దానవారివి మునీశ్వరసన్నుత! తప్పు నైపు మీ
వెఱ్ఱఁగి చరింప నిట్లు వచియించితి నంచు నెఱుంగ వేఁడెదన్. 76

వ. అనిన రాఘవుండు సంతసించుచుఁ బ్రస్థితుండై నానావిధనదీనద
వనపర్వతప్రదేశంబు లరయుచుం జని చని కొన్నికొన్నిమునాశ్రమంబుల రెండు మూడు నాలు గైదు పది మాసంబులుగ
వసించుచు నాయాచోటులం గలరాక్షసుల నుక్కడంచుచుం బది
సంవత్సరంబులు గడపె నక్కాలంబునన. 77

శా. విల్లమ్ముల్ గొని రాత్రి నైనతటి నావీరాధివీరుండు తా
డెల్ల న్మెట్టుచు నొక్కరుండ యయి యెందే రాక్షసుల్ మానులన్
దెల్లం జేయఁగ నుందురో తెలిసి వారిం ద్రెళ్ళఁగా నేసి తా
నల్లం జేరుచునుండు మన్కి కనిశం బర్కుండు రాకుండఁగన్. 78

ఉ. మేల్కని సీత రాఘవునిమేనిపయిం గల నెత్తు రెమ్మెనైఁ
బల్కుచు నీళ్ళలం గడగి ద్వ్యాయము వాతెన ప్రాణనాథ! మీ

కాల్కొనబాణవర్షము రయోద్ధతి నందఱ ముంచి త్రుంచె నీ
కల్కి ముదంపడం దెలుపఁగాఁ దగు నన్న నతండు నవ్వుచున్. 79

వ. ఇం దెందును రాక్షసబాధ లేకుండఁ జేసితి నని యందఱుం గలసి నదీస్నానంబు గావించి ప్రాహ్ణకృత్యంబులు దీర్చుచుండు నిట్లు దినంబులు కడచినంత నొక్కనాఁ డుదయంబునం గదలి చని చని సంజ పడువఱకు యోజనాంతరప్రాకారంబున యోజనాయతంబును బద్మ పుష్కరసంబాధంబును గజయూథాలంకృతంబును బ్రసన్నసలిలంబును సారసహంసకలహంససంకులంబును నగు నొక్క కమలాకరంబు మనోహరమై కానవచ్చుట కాక తజ్జలగర్భంబు నుండి గీతవాద్యత్ర నినాదంబు శ్రోత్రపర్వంబైనంత నద్భుతపడి గాయకులం గాన కట ధర్మభృతుం డను నొక మునిం గని మీ రెవ రాశ్రుతిపేయం బగు గానం బెక్కడి నుండి వచ్చుచుండెడి నెఱింగింపు మనిన నతం డిట్లనియె. 80

—♦ పంచాప్సరస్సరోవరవర్ణనము ♦—

సీ. వినుఁడు పంచాప్సర మనుపేర నీతటా
కం బొప్పు మును మాండకర్ణి యను ముని
నిజతపోమహిమచే నిర్మించె నిట నమ్మ
హాముని పదివేలహాయనములు
వాయుభక్షుం డయి బహుతపం బొనరించె
నందున వేల్పులు కొందలపడి
మెఱపుఁదీఁగల వోలె మెఱయు నప్సరసల
నేవురఁ బుచ్చ నా మునితపంబు

తే. విఘ్న మొనరింపఁ జని మోహవివశుఁ గాఁగఁ
జేసి వానికిఁ బత్నులై యీసరోవ
రమున నంతర్గృహంబును రమణ మెఱయ
నతఁడు గావించె వా రందు నధివసింతురు. 81

వ. ఇది వారిగీత వాదిత్రనాదం బనిన దాశరథు లద్భుతంపడుచుండి రంతలోఁ బురోభాగంబున నింతలోఁ గలమునిపల్లెకుం జని మునుల దర్శించి యది తమకు నివాసయోగ్యం బని తలంచి రప్పు డందలి మునులు తమకడగండ్ల నెల్ల విన్నవించిన వా రందుండి వారి భయంబులు దీర్చి సుతీక్ష్ణాశ్రమంబునకు మరల వచ్చి కొంతకాల ముండి రాముం డొకనాఁ డమ్మునిం గని యి ట్లనిగెు. 82

తరువోజ. యతినాథ నే నగస్త్యమునీంద్రుఁ జూడ
నభిలషించితిఁ దదీయాశ్రమ మెందు
నుతియింపఁబడుచుండునో చెప్పు మనుఁడు
నుతచరిత్రుం డతండును నేను మీకు
నతని నెఱుంగింప నభిలాషపడుచు
ననఁ బోవుచుండంగ నడిగితి వీవు
క్షితి నాత నిఁక బోలుశ్రేష్ఠతరుండు
చెప్ప నొకఁడు లేడు సిద్ధుఁ డతండు. 83

వ. మీరు మద్గురూత్తరుం డగువానిదర్శించుట పరమశ్రేయం బనిన రామచంద్రుండు తద్వృత్తాంతంబు విన నెంచితిం జెప్పు మనిన నతం డి ట్లనియె. 84

—♦అగస్త్యమహామునిజన్మవృత్తాంతము;♦—

సీ. మును ము న్నొకానొకప్పుడు రక్కసులు రేఁగి
పగలు సంధ్యమునం దడఁగి నిశలను
బుడమిపై కరుదెంచి జనదాసులం ద్రుంచి
జగము తల్లడపడ సలుపుచుండ్రు
వాసవుం డప్పుడు వాయ్వాగ్నులం బిల్చి
మీ రెండఁ జేయుఁడు నీరువాము
నా వా రశక్తు లైనఁ వారి భూమిపైఁ
జనియింప శపియించెఁ గినుకఁ జేసి

తే. అవల మిత్రావరుణులు మహార్ణవమ్ము
కడఁ దిరుగుచుండ నూర్వశి కానఁ బడుడు

వారిపేర్యము సన్నమై వసుధఁ బడియె
నది యెఱుంగక వా రేగి రమరపురికి. 85

వ. అక్కడ నున్నయొకానొకం డావీర్య మెత్తి యొక్కఘటంబునం బోసె నందున వసిష్ఠాగస్త్యు లుదయించి కుంభసంభవసంజ్ఞం గలిగి మైత్రావరుణు లనం బరఁగి రం దగస్త్యుండు తత్త్వవేత్తయు ధనుర్విద్యావిశారదుండునై గొంతదేని చనువాఁ డొక్కగర్తంబున నధోముఖులై వ్రేలుచున్న పితృదేవతలం జూచి మీ రెవ్వ రేల యిట్లు భయకంపితులై యున్నవా రని యడిగిన వా రతని కిట్లనిరి.

చ. పితరుల మేము నీ పితులు పెండిలి యాడక పత్యహీనతన్
క్షితిఁ దిరుగాడుచుండుటను జేసి యధోగతిపాలు గాఁగ నీ
గతి వెత లొందుచుంటి మెడఁ గారుణికత్వము తోఁప నీ విలన్
సుతులను గంటి వేని గతశోకుల మయ్యెద మున్నతస్థితిన్. 87

—♦ అగస్త్యమహామునిమహాప్రభావము ♦—

తే. అన నగస్త్యుఁడు తా నిట్టు లనియె మీరు
చెప్పినట్టులు చేసెదఁ జింత విడువుఁ
డనుచు వారల వీడ్కొని చని తదర్థ
చింతనం జేయఁగాఁ జొచ్చెఁ జిత్తమందు. 88

వ. ఇట్లు నానాదేశంబులఁ దన కనురూప యగుకన్య నెందుం బడయ వచ్చు నని తిరిగి యన్వేషణంబు చేయుచు విదర్భరాజునకుఁ దపఃప్రభావంబునంబుట్టినయది లోపాముద్రయనుకన్యదానినొందనెంచి వైదర్భుపాలికిం జనుదెంచి నీపుత్రి నాకుధర్మపత్నిగ నిమ్మనుడు నతండు ప్రతిపాదనప్రత్యాఖ్యానంబుల కసమర్థుండై. 89

చ. తనసతిచెంతకున్ జని ధృతవ్రతుఁ డమ్ముని వచ్చి కన్య ని
మ్మనుట యెఱుంగఁ జెప్పి వని నాకలముల్ తినువాని కెట్టులీ
మన సగు నీయ కుండిన నమర్షసమేతుఁ డతండు శాపవ
హ్నిని రగులించి పుచ్చెడి నిఁ కెట్లని చింతిలుచున్నయంతటన్. 90

వ. లోపాముద్రి వచ్చి తండ్రికి నమస్కరించి యిట్లనియె. 91

తే. వగవకుము తండ్రి నను఼ గూర్చి జగభినుతు఼
డగు నగస్త్యున కిమ్ము న న్ననుడు నాత఼
డలరి విధిపూర్వముగ నిచ్చె నాత్మజాత
నమ్మునీంద్రున కెంతయు హర్ష మెసఁగ. 92

వ. అతండు గృహస్థోక్తంబుగ లోపాముద్రవివాహంబై దానికి వనవా
సోచితవల్కలాజినంబులు ధరింపంజేసి సమానవ్రతచర్య యగుసహ
ధర్మిణిం దోడ్కొని గంగాద్వారంబునకుం జని పరమతపం బొన
రించుచుండె నంత నొక్కనాఁడు. 93

క. జలకమ్ముల నాడి శుచియై
పులుగడిగినముత్తె మట్లుపొలఁతుక చెంతన్
మెలఁగం గని మోహితుఁడై
సలలితమతిఁ గలయఁ బిలిచె సంయమి దానిన్. 94

వ. లోపాముద్ర ప్రాంజలియై ప్రణయపూర్వకంబుగాన తనికిట్లనియె. 95

స్రగ్ధర. సంతానాపేక్షతోడన్ సతిఁబతిగలయన్ సమ్మతిన్ జూపుటొప్పున్
సంతోసం బయ్యెఁ గానీ సలలితగతి నాస్వాంతమం దిట్లగున్ భూ
కాంతుండాతండ్రియింటన్ ఘనవిభవమునన్ గ్రాలునట్లిందుఁగ్రాలన్
గాంతాలంకారవస్త్రోత్తరముదొడికొనన్ గాంక్షయయ్యెన్ మునీంద్రా.

క. హృదయేశ్వర! సదమలమణి
సదనంబుల నిన్నుఁ బొంద సంతస మగు నా
కిది గాక నారచీరలుఁ
బొదలును బుట్టలును మదికి మోదం బిడునే. 97

—♦అగస్త్యుండు వాతాపిని జీర్ణింపఁ జేయుట♦—

వ. అనినఁ గుంభసంభవుం డట్ల యగుంగాక యని శ్రుతర్వాణుం డను
రాజుకడకుం జని తనవచ్చినపని యెఱింగించి నీ యితరకార్యంబులకు
భంగంబు వాటిల్లకుండ నా కింతయర్థం బొసంగు దే యనివాని

యాయువ్యయంబులు సమంబులగుట యెఱింగి వానిం గూడి బ్రధ్న
స్యుం డనువానిపాలికిం బోయి యటం దొంటియట్ల యయిన వా
నిం దోడ్కొని పురుకుత్సపుత్త్రుం డగు త్రసదస్యునిచెంత కరిగి యం
దు నట్లయగుటం జేసి ధనార్జనోపాయంబు గానక యిల్వలుం డను
వాఁడు ధనాఢ్యుం డని విని వారి మువ్వురం దోడ్కొని మణిమతీ
పురంబునకుం జనుటయు నిల్వలుం డల్లంత దవ్వుల నెదురేఁగి వారిం
దోడి తెచ్చి యర్ఘ్యపాద్యంబు లిచ్చి మునులందుఁ గలద్వేషం
బునం జేసి తాను పూనినవ్రతంబు ననుసరించి తనతమ్ముఁ డైనవా
తాపి యనువాని ఛాగంబు గావించి సంస్కరించి యాతిథ్యం బొ
సంగిన నెఱింగి రాజర్షులు విషణ్ణహృదయులై మహర్షిం జూచి. 98

ఉ. తమ్ముని వండి పెట్టెడిని దైత్యకులాపశదుండు వాఁడు దే
హమ్ము ధరించి వచ్చెఁ బయి కంత భుజించినవాఁడు చచ్చు మో
సమ్మగు నిచ్చట న్మనము సాపడ నుంటిమ యేని నా విపా
దమ్ము వినుండు నే మెసవెదన్ బలలాసి నటంచుఁ బల్కుచున్.99

తే. కుంభసంభవుఁ డొకచోటఁ గూరుచుండి
తనకు నిల్వలుఁ డిడినవాతాపిమాంస
మంతయును మెక్కి దైత్యుఁ డయ్యనుజుఁ బిలుచు
సమయమునఁ ద్రేపె నుదరంబు నిమురుకొనుచు. 100

ఆ. మేఘగర్జవోలె మితి లేనిసవ్వడి
వొడమఁ గ్రిందువాయు వడరె మునికి
నపుడు పిలిచె నిల్వలాసురుం డనుజు వె
ల్వడు మటంచు సారె కడరువడిని. 101

వ. అగస్త్యుండు నవ్వుచు. 102

శా. జీర్ణం బయ్యె భవత్సహోదరుఁడు నాచే నింక నేవంక దాఁ
దూర్ణప్రక్రియ నిష్క్రమింప నగు నా దుఃఖించుచున్ దానవుం
డర్ణోరాసి తెఱంగునన్ గనుల నీ రావిర్భవింపంగ నం
పూర్ణభ్రాంతిని సంభ్రమించుచు మునిన్ మోదంబువో నంతటన్ .103

వ. ప్రాంజలియై మీ రే ప్రయోజనంబునం జేసి వచ్చితి రానతీం డనిన
నగస్త్యుండు నీవు ధనేశ్వరుండ వని విని ధనార్థులమై వచ్చితి మను
టయు నతండు మీ కెంత కావలయు నడుగుం డిచ్చెద ననిన మునీ
శ్వరుండు. 104

క. పదివే ల్గద్యాణంబులు
పదివే లావులును రాజవరు లొకొకని కి
ర్వదివే ల్గద్యాణము లి
ర్వది వే లావులును నాకు వలయు నిడంగన్. 105

వ. మఱియు నాకు నొక్క హిరణ్మయం బగు రథంబునుం గావలయు
ననిన నతండు వ్యథితుం డయ్యెను వా రడిగినధనంబును గోధనంబును
విరావసురావంబు లనునశ్వంబులం బూన్చినకనకరథంబు నొ
సంగిన వారు నల్వు రారథంబునం దమధనం బంతయు నిడుకొని
వాని పీడ్కొని గోవులం దోడ్కొని ఘటోద్భవాశ్రమంబునకు వ
చ్చి రంత రాజేంద్రు లరిగినవెనుక మునీంద్రుండు లోపాముద్రకుం
దన తెచ్చినధనం బంతయు నిచ్చిన నాసచ్చరిత్రయు. 106

క. మునినాథ! కోరినట్టులు
పొనరించి మనోరథంబు పూరించితి నా
కొనరింపు మింక యొకతే
పన వీర్యసముచితం బపత్యం బనుడున్. 107

తే. అప్పు డోంగాత మని యగస్త్యమునివరుండు
తగినసుతుం డుద్భవించెడుం దరుణి యనుచు
నామెం గలసి గర్భాధాన మాచరించి
తప మొనర్పంగ జనె వనాంతరములకును. 108

వ. అంత లోపాముద్ర తా నేడేండ్లు గర్భంబు దాల్చి జ్వలదగ్నిప్రభా
భాసమానుం డగు దృఢధన్వుం డను నర్భకుం గనియెం దన్మూలం
బున న్యగస్త్యుని పితృదేవత లుత్తమలోకం బంది రానాండుగోలె
నాగస్త్యాశ్రమంబు విఖ్యాతం బయ్యె నంత. 109

—♦ అగస్త్యుఁడు సముద్రోదకమెల్ల నాపోశన మొనర్చుట ♦—

సీ. కాలకేయాదులు కడలిలోపల నుండు
డాగి పగటి రాత్రి వేళ మూఁగి
లోకములం బడి కాఁక గూర్చుచునుండ
దేవేంద్రుఁ డెంతయు దిగులు గుంది
బ్రహ్మాదులం గూడి వైకుంఠమున కేగి
విష్ణునితో నెల్ల విన్నవించి
జగము రక్షింపవే జలజాక్ష యనుటయు
నాతఁడు వారల నరసి యనియె

తే. కంథిపై నెల్ల పట్టినఁ గాని వాండ్రఁ
జంప నేరికి నైన నశక్య మట్టి
పనికి మీరు ప్రయత్నింప వలయు నసుఁడు
ఘనుఁ డగస్త్యుఁడు కలఁ డని విని ముదమున. 110

వ. అతనిపాలికిం జని యా యగస్త్యుం బ్రార్థించిన నతండు మీ రేమి
వచ్చితి రెఱిఁగింపుఁ డనిన దేవత లగస్త్యుం గాంచి. 111

మత్త. కాలకేయులు లోకపాళికిఁ గల్గఁ జేయునుపద్రవం
బోలిఁ జెప్పి మునీంద్రచంద్ర! మహోదధిం గలయట్టికీ
లాల మంతయు పట్టిపోయెను లాగునం దయఁ జూచి లో
కాళి దాపురమై ఘనం బగునాపదం దొలఁగింపవే. 112

క. నీలావున జల మింకుఁడుఁ
గాలేయులఁ బట్టి మేము కడతేర్తు మనన్
లీలమెయి నట్ల యగు నో
వేలుపులారా! భయంబు విడువుం డింకన్. 113

వ. అని వారి నూఱడించి బలిక కుంభసంభవుండు సురగరుడోరగయక్ష
రాక్షససిద్ధసాధ్యసమేతుండై కదలి. 114

చ. మరువుల నవ్వునట్లు లలి నూల్కొనుగాలిఁ జలించుచున్నట్లుఁ దెం
దరగల నాడునట్లు సతతస్వనసంగతిఁ బాడునట్లు కం

దరముల భూధరంబులను దద్దయుఁ దొట్రిలునట్లుఁ బొల్చుపు
ష్కరసీధియొద్దకుం జనెనగస్త్యమునీంద్రుఁడు సేంద్రముఖ్యుఁడై. 115

శా. నీర్వామిం గని నంత సంతసమునం దీపించి మౌనీంద్రుఁ డో
గీర్వాణోత్తములార శస్త్రమున శక్తిం గల్గి మీరుండుఁ డే
గర్వం బేర్పడ నింతలోన జలధిం గ్రాఁగింతుఁ బొం డంచు నా
సర్వాంభశ్చయ మొక్కగ్రుక్కమొయినెంచం గ్రోలెలీలాగతిన్. 116

ఉ. వట్టినకంధిమధ్యమున వాసి చెడం బడి కాలకేయు ల
ప్పట్టునఁ జేప లట్టులు ప్రభావము దూలగఁ దేలగిల్లి చూ
పట్టుఁడు శౌర్యధుర్యులు సుపర్వులు పైఁ బడఁ బాఱి ధీరులై
పట్టసముద్గరాదులను బట్టి వధించిరి వారి ప్రేల్మిడిన్. 117

తే. అపుడు హతశేషు లగుకొంద ఱాతురపడి
నేలఁ బెకలించుకొంచుఁ బాతాళమునకుఁ
బాఱి తలదాచుకొని రంత భయము దక్కి
సుర లగస్త్యునిఁ గీర్తించి రరసిభక్తి. 118

వ. అంతఁ గొంతకాలంబునకు వింధ్యపర్వతం బవంధ్యగర్వంబున మేరుపర్వతంబుతో ద్వేషించి. 119

—♦అగస్త్యుఁడు వింధ్యగర్వం బడంచుట♦—

ఉ. అయ్యెడ నయ్యహార్యము మహోక్కృధ మేరువుమీఱువన్ని యొ
య్యొయ్యన ధ్రావమండలము నున్నతి పెచ్చుపెఱింగి రాయుచున్
నెయ్యము తియ్యము న్విడిచి నేర్పును గీర్పును జూడఁ బోక తాఁ
జయ్యన నడ్డె సూర్యునకుఁ జంద్రునకుం గలమార్గ మంతయున్. 120

సీ. అఖిలాండకోటిబ్రహ్మాండంబు లెల్ల న
కొక్కండ విచ్చెను బచ్చికుండ లనఁగ
సూర్యచంద్రాగ్నులు సారిది జేపును మాపు
నడచుదారులు కట్టు పడెయె మిగుల
నొకచో నెపుడు చెమ్మ లూర గాఢతమంబు
నొకచో నెఱియునెండయునుగ నుండె

సత్కర్మములు పోయె స్వాహాస్వధావష
ట్కారంబు లనుమాట గలుగ దయ్యె

తే. లోకములు నాల్గుఁ బదియుఁ జీకాకుపడియె
నన్నపానము లేకికి నబ్బవయ్యె
సురనరోరగముఖ జంతువరచయంబు
లుసురు లూఁదుట మంత్రించునోజఁ బడియె. 121

మ. నడిమింటన్ రవి నిల్చెఁ బశ్చిమమునన్ గ్రావంబుపైఁ జేరఁ బో
యెడు నాచుం బ్రజలుండి రెంతకును నట్లే యుండె నొక్కింతయేఁ
నడువం జాలఁడు వేఁడివే ల్పనెడునా నామంబు సార్థంబుగా
నుడికించెన్ సకలప్రపంచము లయప్రోద్ఘాతవహ్నిక్రియన్. 122

ఉ. చందురుఁ డింపుసాదుఁ జనఁ జాల కొకానొకచోట నుండ నై
క్రందుగ మంచు పెంజడుల కైవడిఁ జల్లుచు నెల్లదిక్కులం
దుం దెగకుండఁ గా నివముఁ దోఁపఁగఁ జేయుఁడు భూతజాతముల్
వ్రందెడునట్ల యయ్యెఁ జలిమంపున మేనులు కొయ్యఁ బాఱఁగన్.

వ. ఈవ లావల నిట్లకాండప్రళయంబో యన బ్రహ్మాండంబు లెల్ల నిండి యకొండ జగదుపప్లవంబు గలిగించుచుండె నట్టియెడ మూర్తిత్రయం బెట్టకే నేకీభూతంబై యస్మదాదుల కసాధ్యం బీకార్యంబు నిర్వర్తింప వారణాశిపురంబునఁ గాపురంబున్న కుంభసంభవుండొక్కండు దక్క నొండొక్కఁడోపండందుల కతనిం బ్రార్థింపఁ బో మన కవశ్యకర్తవ్యం బని యింద్రాదుల కెఱింగించిన వారు గీష్పతిపురస్సరంబుగా నగస్త్యాశ్రమంబునకుం బోయి జగత్ప్రళయం బుడుపు మని వేఁడిన నతం డనుమతించి సురవరుల నంపిపుచ్చి తన కక్కతంబునఁ గాశిఁ బాసిపోక రాకకు వాపోవుచు విశ్వేశ్వర మాధవ దుండి దండపాణి భైరవ కాశి గుహాదులసేవించి ప్రయాణోన్ముఖుండై. 124

సీ. అమ్మ! గంగాదేవి! యరిగి వచ్చెదనమ్మ
మనకూర్మి యెన్నఁడు మఱవకమ్మ

యన్నపూర్ణాదేవి యనురాగములబావి
నినుఁ బాసిపోక నా కొనరె నమ్మ
తండ్రి! విశ్వేశ్వర! తలవనితలఁ బయ్యె
మినువడ్డచోటికిఁ జనెద నయ్య
నాయన్న! భైరవ! పోయి వచ్చెద నయ్య!
నీపొత్తు విడనాడ నేర నయ్య

తే. మానివరులార! మీతోడివాని నన్నుఁ
గదలి పొమ్మందురే యిట్లు కరుణ లేక
నాకటీరమ! నీనీడ నాకుఁ దప్పె
నిప్పుడే నొండుచోటికి నేగ నుంటి. 125

వ. ఇట్లు కొంతదవ్వు పరిదేవనంబు చేసి కడపటికి కతిప్రయత్నంబున బయనంబై సభార్యాశిష్యకంబుగాఁ గదలి కతిపయప్రయాణంబుల మేరుభానుస్పర్ధాభివృద్ధి నవంధ్యం బగువింధ్యంబునకరుదెంచుటయు.

చ. గురువరుఁ డేగుదెంచె నని కోరిక లీరిక లెత్త నమ్మహా
గిరికులసత్తముం డవనిక్రింద కడంకువతోడ నమ్రుఁడై
"పరమదయాసమగ్ర! పరిపాలయ మా" మని యర్ఘ్యపాద్యముల్
గురుమతి నిచ్చి భక్తి మదిలోఁ గడుహెచ్చ నుతించుచున్నచోన్.

క. ఆశ్వాసించుచును నగ
శ్రేశ్వరుఁ డవ్వింధ్యశిఖరి కిట్లని పలికెన్
శశ్వత్త్రితాపకీర్తుల
శాశ్వతసుఖ మనుభవింతె ఛాత్రవరేణ్యా. 128

మహాస్ర. గురుభక్తిం జేసి నీకున్ గురుతరయశముల్లొప్పయుం జెప్పనొప్పెన్
ధరణి న్నిన్నొన్నటుపుచ్చం దలఁచినమతితోఁ దద్దయు న్మేరుశైలం
బరుడారం జేసి ఘోరం బగుతప మినుమం తైన సామ్యంబు గైకోఁ
దలముం గామిం దపించుం దనమనుగడ సార్థంబు గాదంచుఁ జింతన్.

తే. గ్రహములుం జంద్రసూర్యులు కాలచక్ర
మున భ్రమించుచు మాకక్షు గనఁగఁ జేయు

వారు లే రని గర్వింతు వారిగనుచు
మచ్చఁచి లీ విల్లు నాశిష్యుఁ డగుదు బలికె. 130

శా. వాతాపీల్వల కాలకేయనహుష ప్రత్యర్థు లైశ్వర్యగ
ర్వాతీతప్రతిభన్ బలారిముఖదేవాధీశులం బొట్టి వి
ఖ్యాతాఖ్యప్రభువన్యులన్ జెగడి యున్న ట్లెల్ల నీదేశికుం
జేతన్మాత్ర నడంచె వారి నది నీహృత్పద్మమా ముంచనో. 131

వ. నీచేతఁకు సంతోషించితి మంతేవాసీ! మేము లోపాముద్రాసహితం
బుగా దక్షిణాశాగత తీర్థయాత్రాచరణశీలుర మై పోవుచున్న వారము
వృద్ధులము గావున మాకుం బో ననువగు తెఱవు సూపి మరలి
మావచ్చువఱకు నట్లె యడంగి యుండు మొుంచుతలంపకుము మ
మ్మెఱుంగుదువు కదా యనిన గురువచనంబుల కొం డాడ లేక
వింధ్యమహీధరంబు దరిద్రగతమనోరథంబు పోలెఁ దనమనోర
థంబు వితథం బగుడు మేరుగతమత్సరం బుడిగించుకొని భూమి నడ
పాడం బడియుండె నప్పుడు సూర్యచంద్రాదులకు స్వతస్సిద్ధసంగమ
నంబు సిద్ధించె దానం జేసి వింధ్యోత్తరదక్షిణ దిగ్దేశంబులకు సంవత్సర
గణనావధానంబు నేఁటికిం గలిగియుండె నని సుతీక్ష్ణుం డగస్త్యప్రభా
వం బంతయు నెఱింగించి. 132

ఆ. నరవరేణ్య! యిటకు నాలుగామడలలోఁ
గల దగస్త్యమహాసీనలలితాశ్ర
మంబు దక్షిణంబు మార్గంబున నగస్త్య
తమ్ముఁ డాశ్రమంబు దనరు నొకఁడు. 133

వ. అదిస్థలీప్రాయం బై పిప్పలవృక్షసమంచితం బగు దాని నెఱింగి
నేఁటిరాత్రి యట విశ్రమించిమఱునాఁడు వేకువం గదలిపోవచ్చునని
వా రమ్మునిని వీడ్కొనికదలి సుతీక్ష్ణోక్తమార్గంబున నగస్త్యభ్రాతృ
నాశ్రమంబు లోచనగోచరం బగుటయు రామచంద్రుండు
లక్ష్మణుం గాంచి. 134

—♦ అగస్త్యుఁడు శ్రీరామచంద్రున కాతిథ్యమిడి పూజించుట ♦—

సీ. అదె యగస్త్యునితమ్ముఁడనమలాశ్రమము పి
ప్పలివృక్షములు పెక్కు లలము కొనియె
వైడూర్యములఁబోలు వర్ణస్ఫురణ బాలు
పొందుఁ గోసినదర్భ పాలము లింపు
నందంగఁ బ్రోవులై యరయ వచ్చెడు ముని
సంచిత మ్మగుసమిత్సంచయంబు
హోమధూమములచే నొయ్య నొయ్యనఁ గుటీ
రములపైకప్పుల నమరియుండుఁ

తే. గుటిలముంగిళ్ల మెత్తనికుశలు వేసి
తోళ్లు పఱచి రచ్చట నతిథులు వసింప
కనుము నిర్మాల్యపుష్పముల్ కడలఁ బొదలు
నది సుదర్శను నాశ్రమపదము తెలియ. 135

వ. అని ప్రశంసించుచు నయ్యాశ్రమంబునకుం జని రంత నమ్మ
నీంద్రుండు వారి నెదుర్కొని తోడితెచ్చి యర్ఘ్యపాద్యంబు లిచ్చి
పూజించె రాఘవులు నారాత్రి యట సుఖనిద్రం గావించి మరు
నాఁడు ప్రభాతకాలంబున లేచి సుదర్శనునకుం జెప్పి రామ
చంద్రుండు కొందఱ మునీంద్రుల ముం దిడుకొని సీతాలక్ష్మణ
సహితంబుగాఁ గొన్నివనంబులు దాఁటి చీరమాలాపరిష్కృతంబును
హోమధూమసమంచితంబునగునగస్త్యాశ్రమంబులక్షించి రాముండు
లక్ష్మణుం గాంచి యి ట్లనియె. 136

సీ. వింధ్యగర్వ మడంచి విధుసూర్యమార్గని
రోధంబు వాపినరుద్రతేజుఁ
డాపోశనముఁ బట్టె యంబోధి యంతయు
గుటుకున మ్రింగిన చటులశక్తి
వాతాపిఁ దిగమ్రింగి వడి జీర్ణ మగునట్లు
గ్జున ద్రేచినఘనయశుండు

లోకసంరక్షణాలోలమతిం జేసి
చిరజీవి యయ్యె నేసిద్ధమూర్తి
తే. అట్టిలోకైకపూజ్యుఁ డత్యలఘువీర్య
వంతుఁ డార్యామనోహరప్రతిముఁ డగుచుఁ
బ్రబలుచుండు నగస్త్యమహామునీంద్రుఁ
డరయఁ గంటిమి ధన్యుల మైతి మనుజ. 137

వ. ఇమ్మహామునిభయంబునం జేసి రక్షోగణం బెందు రా వెఱచు నం దున నెల్లమునీంద్రులు నిందు వచ్చి వసించుచుందు రని వినుచుందు మనము కూడ నిం దుండి వనవాసశేషమ్ము దీర్చిపుత్త్రమిావుపోయి నారాక వానికెఱింగించి రమ్మనిన సుమిత్త్రానందనుండు చని యా శ్రమంబున ముని శిష్యుం గని యి ట్లనియె. 138

తే. దశరథసుతుండు తన్వితోఁ దమ్మితోడఁ
గూడి వనవాస మొనరించువాఁ డ యగుచుఁ
గదలి చనుదెంచి యటనటం గలుగుమునులఁ
గనుచు మిముఁ జూడ నిట వచ్చె నని తెలుపుము. 139

వ. అనిన మునిసుతుండు వడివడిం జని యెఱింగించిన నతండు బ్రహ్మా నందభరితాంతరంగుం డై. 140

క. అంతేవాసులతోడన్
స్వాంతం బిగురొత్త వచ్చి సాత్త్వోద్విష్ణుం
డంతటివాఁ డీతఁడు నా
కెంతయు దయ దర్శనంబు ని ట్లిచ్చె నహో. 141

వ. అని సంతసించుచు నర్ఘ్యపాద్యంబు లిచ్చి గ్రుచ్చి కౌఁగిలించుకొని వైదండయొసంగి తనయాశ్రమంబుగం గలసూర్యచంద్రాగ్నీంద్ర వరుణకుబేరాదిస్థానంబు లెల్ల ననుక్రమంబునం జూపుచు నొక్కచోఁ గుశాసనంబున నాసీనుం గావించి ఫలమూలాహారం బొసంగి హేమరత్నవిభూషితం బైనవిల్లును బాణంబులును దూణీరంబునుం దెచ్చి రామునియెదుటం బెట్టి. 142

—♦ అగస్త్యుఁడు రామున కక్షయతూణీరాదులొసంగుట ♦—

సీ. విను రఘురామ! యీధనువు విశ్వకర్మ తా
నొనరించి విష్ణుదేవునకు నిచ్చె
బ్రహ్మదత్తము లివి బాణము లక్షయ
తూణీరములు మేల్ కృపాణ మిద్ది
వీనిని ధరియించి విష్ణుదేవుఁడు తొల్లి
సురలను బ్రోచె నసురుల రాచి
శతమన్యుఁ డివి నాకు నతిభక్తి నిచ్చెను
నేను నీ కిచ్చెద నీవు గొనుము

తే. అనుచు నభిమంత్రణ మొనర్చి యవ్వి యెల్ల
రామచంద్రునికరములఁ బ్రేమఁ బెట్టి
వీన వేల్మిడి గెలువుమా దానవులను
లోకసంరక్షణ మొనర్పుమా కుమార. 143

తే. అనిన శ్రీరామచంద్రుఁ డి ట్లని వచించె
ధన్యులము మేము మీదైనదర్శనమున
ననఘ మే మిందు నెందునే నాశ్రమంబు
సలుపుకొని యుందు మగుచోటు తెలుప వలయు. 144

సీ. అనుడు నగస్త్యుఁ డి ట్లను నింత యోజించి
యిటకు ద్వియోజనపృథ్వియందుఁ
బంచవటి యనఁగఁ బరఁగు ప్రదేశము
జలకాష్ఠతృణకందఫలసమృద్ధ
మట శేషవనవాస మది గడవం జేసి
ప్రతిన దీర్చి నగరమున కరిగి
పట్టభద్రుండవై ప్రజలను బాలింపు
మీతండ్రి దశరథక్ష్మాతలేంద్రుఁ

తే. డరయ నెంతయు ధన్యుఁ డో యనఘ నిన్ను
వంటిపుత్రునిఁ బడయుటవల్లన రామ

నన్ను మఱవకు మెప్పు నీకు నన్నుతండ్రి
కేను మిత్రుండఁ బోయి ర మ్మింతలోన. 145

వ. పంచవటి గోదావరీతీరంబున నున్న దిదిగో చూడు మీ
మహాకవనంబున కుత్తరం బగుమార్గంబు వట్టి చనినఁ బెద్ద మఱ్ఱి
వృక్షంబు గాన వచ్చు దాని కడనుండి పోయిన నొక్కపర్వతంబు
చూపట్టు దాని ప్రక్కం బంచవటీవనంబు కలదని చెప్పి దీవించి
సాగనంపె రాముండును ధనుర్బాణతూణీరఖడ్గంబులు దాల్చి
సీతాలక్ష్మణులతోడం బంచవటికిం బ్రయాణంబై యున్నసమయం
బున నందంముఁ గలబుషిచంద్రు లెందఱో చనుదెంచి రామచంద్రు
నాలింగనంబు చేసికొని యి ట్లనిరి. 146

చ. పొలఁతులు సుందరాంగు లగుపూరుషులం గని మోహమంది పొం
దులు తలపోయునట్టులు నినుఁ మదిఁ గోరుచునున్నవార మో
జలజదళాక్ష! నావుడును సంతసమందుచు రాముఁ డోమునీ
త్తిలకములార! మీఁదట వ తీర్చెద మీవగుకోర్కు లన్నియున్.

వ. అని వరం బొసంగి పంచవటిమార్గంబు వట్టి మెట్టుకొనుచుం
జనియె నంతఁ గొంతదూరంబున. 148

—♦ జటాయువు రాముని దర్శించుట ♦—

ఉ. చుక్కల శీర్షభాగములఁ జట్టుపడం బొనరించి రాయుచున్
దిక్కుల నాల్గిటం దనదు దీర్ఘతమం బగుశాఖలందునోఁ
జిక్కనియాకు లెల్లెడల జిక్కిరి బిక్కిరి గాఁగఁ బాదునో
నొక్కమహోన్నతం బగువటోర్విజ మారయ వచ్చె వారికిన్. 149

వ. ఆమఱ్ఱివృక్షంబు సమీపించునంతలోన. 150

సీ. పెద్దఱెక్కలతోడ జెఱిగి పెన్గొండ నా
దండి కెక్కిన మేను దారి నిండ
దంభోళి నొకపాటి తాకున బిండిగాఁ
బొనరింపఁ జేయఁజాల్ ముక్కు గలిగి
విస్ఫులింగము లొల్కువిలయాగ్ని కెనవచ్చు
నేత్రద్వయంబున నింగిఁ గనుచుఁ

బదునాల్గులోకముల్ పట్టి యట్టిట్టుగా
వ్రేలింపఁ జాల్గాళ్ల వ్రేళ్లు గ్రాల
తే. ఉదయభానుని తేజంబు నొల్లఁ బోవఁ
జలుపఁ జాలినమైచాయ చదలఁ బొదల
చెట్టుపైనుండి యొకగ్రద్ద చట్టుపలను
విష్పుదల గల్గ నిల్చె పేర్చెప్పుకొనుచు. 151
ఉ. వానిని గాంచి రాఘవుఁడు వాలు గ్రహించి సమీపవర్తియై
మానవభక్షకుం డనుచు మానసమందుఁ దలంచి యోరి నీ
వేనెఱివాఁడ వెక్కడికి నేగుదు వన్న నతండు మ్రొక్కుచున్
నేను భవత్పితృప్రియుఁడ నెయ్యుఁడ పేరు జటాయు వెన్నఁగన్.
తే. తండ్రి! దాశరథీ! వినఁ దలఁపు మేను
గశ్యపుఁడు గన్నసుతులలో ఘనత కెక్క
వారిలో నగ్రజుం డయివఱలునరుణు
వలనఁ బుట్టితి శ్యేని య స్వనితయందు. 153
మ. గరు డాఖ్యుం డగువైన తేయుఁడు జగత్ఖ్యాతుండు నాపిన్నతం
డ్రి రమానాథునివాహనం బతఁడు తండ్రి జ్ఞెప్పఁగా నేల భా
స్కరసాన్నిధ్యమునన్ బ్రసిద్ధి గొను నాసంపాతి నాయన్న నన్
శిరమందు న్గొను నీదుతండ్రి యెపుడున్ స్నేహంబు వాటించుచున్.
క. ఈకాంతారము క్రూరమృ
గాకీర్ణము మీర లిందుఁ గాపుర ముండన్
గైకొని యిచ్చట వచ్చితి
రీకాలమునందు మీకు నెగ్గగు దెంచున్. 155
తే. నేను మీకు సహాయుఁడ నై నిలిచెద
నీవు లక్ష్మణుఁ డేగిన నేను సీతఁ
గాచి కొనియుందు నని చెప్పఁగా రఘూద్వ
హుండు పితృసఖుఁ డతఁ డని యంకఁ జేర్చె. 156

—♦ సీతారామలక్ష్మణులు పంచవటిం జేరుట ♦—

వ. ఇట్లు జటాయువుతో సఖ్యంబు వాటించి రామచంద్రుండు పంచ
వటిం జేర నరిగి లక్ష్మణుం దిలకించి మనము పంచవటిం జేరితి

మదిగో గోదావరి శ్రీగంధవృక్షంబులనుండి నెత్తావి మొత్తమై
వచ్చి ఘ్రాణతర్పణంబు గావించుచున్నది పొన్నలు గున్నమామి
డులు కన్నులపండువు వగుచున్న విందు నేను సీతయు నీవును నుం
డుట కను వగునట్లు పర్ణశాలం గట్టు మన్న నతండు. 157

తే. ఒక్కచోట జెట్లుచేమలు చెక్కి వైచి
చదును గావించి భూమిపైఁ జల్లి నీళ్లు
వెదురుబొంగులకంబముల్ వేసి జమ్ము
వాసములు చేర్చి నిర్మించె పర్ణశాల. 158

వ. లక్ష్మణుం డిట్లు పర్ణశాలం గట్టి రామునకు నివేదించిన నతం
డతనిఁ గ్రుచ్చి కౌఁగిలించి నీవు నీయుపచారంబునం జేసి తండ్రిని
మఱపించునట్టి వైతి వని ప్రశంసించుచు వాస్తుపూజాదికంబు
గావించి పర్ణశాలాప్రవేశంబు చేసి లక్ష్మణుండు సర్వదా సేవించు
చుండ స్నానసంధ్యాద్యనుష్ఠానములు నిర్వర్తించుచు ఫలాహారం
బులు గావించుచు మునుల సేవించుచు లోకోత్తరమహత్తరకథ
లాలకించుచు సుఖం బుండె నని చెప్పిన విని నైమిశారణ్యవాసు
లవ్వలి వృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును. 159

—♦ ఆశ్వాసాంతము ♦—

ఉ. ఈదరవంశ మర్కజలధి నిందుఁడు నాఁ బ్రభవించి సత్కళల్
సారదరీతిఁ బ్రోచుటకునై ద్విజరాజయి సత్క్రియుండునై
మోదముతోఁ దలిర్చుచు సమున్నతతేజము గల్గి పొల్చువి
ద్యాదయితుండు మాన్యుఁడు వదాన్యుఁడు వేంకటరా వెనంగుఁ బోల్చ.

గద్యము

ఇది శ్రీమహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ
కవిసార్వభౌమాంధ్రవ్యాసాభినవశ్రీనాథ వేదవిద్యా
విశారద శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతం
బగు శ్రీకృష్ణరామాయణంబునందు
నారణ్యకాండంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు

# శ్రీకృష్ణ రామాయణము

## అరణ్యకాండము

### ద్వితీయాశ్వాసము



మదభ్రపాదేవిం
బ్రేమించి జగంబునందు విఖ్యాతధన
శ్రీ మించి వెలయు వేంకట
రాముఁడు దీర్ఘాయు వొంది ప్రబలుచు నుండుఁ. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు పంచవటీ వనంబునఁ బర్ణశాలం గట్టుకొని శ్రీరామచంద్రుండు సీతాలక్ష్మణ సమేతుండై యున్నయప్పుడు శరదృతువు కడచి హేమంతఋతువు సంప్రాప్తం బయ్యె నప్పు డొకనాఁటిప్రభాతంబున సీతారామలక్ష్మణులు గోదావరికి స్నానార్థ మరిగి యున్నయప్పుడు లక్ష్మణుండు రామునిం గని. 2

—రాముఁడు భరతుం దలంచుచు విచారించుట—

సీ. హేమంతమున నిప్డు భూమి సస్యసమృద్ధి
నలరారుచున్నది జలము ముట్ట
నలవి గాకున్నది యగ్నిప్రియం బయి
ప్రజలచే సేవింపఁ బడుచు నుండె
యుద్ధయాత్రల కిది యుత్తమకాల మా
నిచ్చుఁ బాలా ల్కుంభవృష్టి గాఁగ
నిపుడు మధ్యాహ్నము లింపుగా నుండును
మృగజాతి కియ్యది ఋతుదినంబు

తే. పుష్యపుణ్యము మాఘాఖ్య ముఖ్యదినము
చంద్రుఁ డస్తమువిభ్రాన సౌకు రక్త
జలపతత్త్రులు నీళ్ళలోపలఁ జొరంగఁ
గలఁగుచున్నవి చూచితే కాలమహిమ. 3

వ. అనిలక్ష్మణుండు పలుకుచున్నంత రామునకు భరతుండు స్మృతికి
వచ్చుటం జేసి కంట నీరు నిల్పుకొనుచు ని ట్లనియె. 4

చ. మన మిటు లీయరణ్యముల మా నటి యుంటిమి శీతవాతముల్
తనువునఁ దాఁక నోర్చుకొని తాపసవృత్తి వహించియుంటి మా
మనభరతుండు నక్కడ తమంబడి మానటి శీతవాతముల్
తనువునఁ దాఁక నోర్చుకొని తాపసవృత్తిఁ జరించు నక్కటా. 5

మ. మనముం బోలె నతండు నారలను నేమం బేర్పడన్ దాల్చి భో
జన మేనాఁకులతో నొనర్చుకొని నిచ్చల్ బూదెలో బుర్రింగి హె
చ్చినభక్తిన్ నను సర్వదా తలఁచుచున్ సేవించుచుం జిత్తమం
దనుతాపంబునఁ గుందుచున్ మెలఁగురా హా! బ్రహ్మచర్యంబునన్.

ఉ. ఈచలిలోన నొక్కరుఁడ యేగి యటన్ సరయూనదీహిమా
సిచయశీతలాంబువుల నిచ్చమెయిన్ మునుకల్ పొనర్చు నో
రాచరికంపుసేవ లవి రాఁ దలపోసిన రాకు పొమ్మనెన్
నా వినితమ్ముఁ డిప్పు డెటు నా కడఁ శోకము నొందుచుండునో. 7

ఉ. ఎల్లమహీతలంబునకు నేలికయై చనురాజుపత్ని నా
తల్లి సతీమతల్లి యొకదాసునిఁ గాంచినతల్లి పోలె నే
తల్లగ కుడ్చుచుండెఁ జలిత్రాఁకిన కోర్చుచు నెట్ట నార్చుచున్
చెల్లరె! నాదువోవ్యథలు చెప్పఁగ నేమిటి కిట్టిపట్టునన్. 8

వ. అని యనేకవిధంబులం దలంచుచు సతీసహితుండై స్నానంబు
గావించి సంధ్య వార్చి బ్రహ్మయజ్ఞపితృతర్పణంబు లొనరించి పర్ణ
శాలకుం జని దేవారాధనంబు గావించి యతిథిపూజం జేసి మునుల
సేవించి పురాతనపుణ్యకథ లాలకించుచు నిత్యవ్రతంబుగ ని ట్లట
మూడువత్సరంబులకాలంబు వెళ్ళఁబుచ్చె నప్పుడు. 9

—♦లక్ష్మణుండు జంబుం డనువానిం దెగవేయుట♦—

సీ. ఒకనాఁడు లక్ష్మణుం డొకరుండ ఫలసమి
ద్ధరణార్థ మడవికి నరిగి యచట
నొకపొదలోఁ దప ముండె రాక్షసుతుం
డైనజంబుం డనునసుర యొకఁడు
వాని నెఱుంగక వశి నటం దొరికిన
ఖడ్గంబునం బొద గండరించె
దాన నంతఁ దపించు దానవుం డొండు రెం
డై పడె రక్తసిక్తాంగుఁ డగుచు

తే. అప్పుడు సౌమిత్రిఖండము లరసి యకట
మునిసుతునిఁ జంపి పాపము మూట గట్టు
కొంటి నని లోన నెంతయుఁ గుతిలగుడిచి
మరలి చనుదెంచి రాముని కెఱుఁగఁ జేసె. 10

వ. రాముఁడు నింత విచారించి వానికడ ఖడ్గంబు గల దని చెప్పటం
జేసి వాఁడు బ్రాహ్మణుండు గాఁ డనియు దానవుం డెవండో
ఫలార్థియై తపంబు చేయుచుండె ననియు నిశ్చయించి నీకు బ్రహ్మ
హత్యాపాతకంబు రాఁ బోదని తమ్మునింబోధించుచుండె నప్పుడు,

తే. మునులు కొందఱు రామునిం గనఁగ రాఁగ
రాముఁ డిట్లను మాతమ్ముఁ డేమి యెఱుఁగ
కొక్కమునిపుత్రుఁ దెగనేసె నోగు గదిసె
దాన నగుదోష మేరీతిఁ బోనొ చెపుడ. 12

తే. అనుడు మునులు విద్యుజ్జిహ్వుఁ డనెడురాక్ష
సునికొమారుఁడు వాఁడు భూసురుఁడు గాఁడు
వానిఁ జంపుట పుణ్యమే కాని బ్రహ్మ
హత్య యనుదోష మారయ నచట లేదు. 13

వ. అని చెప్పిన వారు సంతోషితస్వాంతులై సుఖంబుండిరంతలోన. 14

—♦శూర్పణఖ యడవిలో సంచరించుట♦—

ఉ. దండకరాజ్యమందు విభుతం గొని శూర్పణఖాఖ్య నొప్పను
ద్దండపరాక్రమప్రథితదానవి రావణు చెల్లెలవ్వనిన్
కొండలు లోయలుం గనుచుఁ గొండొకచోఁ దనపుత్రదేహమున్
రెండయి యుంటఁ జూచి కడు రేఁగినదుఃఖభరంబు పెంపునన్. 15

వ. ఇంసుక విచారించి మించినక్రోధంబున నొడలెఱుంగనట్టిదై. 16

మత్త. తోఁకఁ ద్రొక్కిన త్రాఁచు వోలెను దోడు తోడన రోజుచున్
వీఁకఁ జూపుచుఁ జిందుద్రొక్కుచు విఱ్ఱవీఁగుచు వేడుఁకై
కోక న న్నిటు కన్ను గానక కోసె జంబుని వాసినే
నాకరాసి వధించి ఫుచ్చెద నల్కలంతలు మేను గన్. 17

వ. అని నలుగడ రోయుచుం బోవఁబోవ నొక్కచో నొక్కముని
కుమారుం గని వానిచేయి పట్టుకొని నిలువరించి. 18

శా. ఓరీ! యెవ్వఁడ వీవు మావనమునం దున్నాఁడవో? క్రొత్తవా
రేరే నీడకు వచ్చియుండిరె మదీయోద్ధ్రజం దున్మినా
రేరో రేపకడన్ వధించితివ యే నే వానినిం బట్టి నా
క్రూరాసిం దునిగించి పుచ్చెదను నాకుం జెప్పు మాచొప్పులన్. 19

వ. అనిన మునికుమారుం డి ట్లనియె. 20

తే. క్రూరు లెవ్వరు క్రొత్తవా రేరు రారు
గాని యీలోన రాజర్షు లైనవారు
కాంతతో వచ్చి యీవనిఁ గాపురముగ
నున్నవా రిర్వు రన నామె కన్ను దెరచి. 21

వ. వానిం గాంచి వా రెవ్వరు? వారివృత్తాంతం బెట్టిది? తెలిసినంత
వట్టు తెల్లంబు గావింపు మనిన నతండు. 22

సీ. సాకేతపురమున క్ష్మాపాలు రగువారు
రామలక్ష్మణు లనునామములను
దనరు వా రందు రామునిపత్ని జానకి
సౌందర్యమున లక్ష్మిచాయ నుండు

నవమన్మథుఁడు రామనరపాలుఁ డాతని
తమ్ముఁడు నంతటిచక్కని వాఁడె
జనకుపంపున వారు వనవాస మొనరింప
వచ్చిరి పెక్కుర వని వసించు

తే. రక్కసుల నుక్కడంచిరి పిక్కబెదురు
లేనివారలు వారలలో నెవండు
గాని నీపుత్త్రిఁ జంపిన ట్లాన యేమొ
నాకుఁ దెలియదు విమవుము నన్నుఁ దల్లి. 23

తే. ఐదు మఱ్ఱులు గలిగినగోద చెంతఁ
బంచవటి యన నొప్పునప్పదమునందు
నాకుటీలు గట్టుకొని వార లాలుతోడఁ
గాపురంబుండి రని వింటిఁ గాంచి యుంటి. 24

—శూర్పణఖ రాముని విని మోహచిత్తయగుట—

వ. అనిన శూర్పణఖ వానిం బో మ్మని విడిచిపుచ్చి తా నంతకు మున్న కొంతకొంత విన్నయదియ కావునఁ బుత్త్రిశోకంబు విడిచి కామసంతప్తచిత్తయై. 25

చ. మగఁ డెడఁ బాసి తన్ను జముమన్నన లందగఁ నేగినప్పు డా
దిగఁ దగువానికై తనమదిం దలపోయుచు నుండెఁ గాన మేల్
మగఁ డగుదెంచు నా కనుచు మానసిసంతస మంకురింపఁ గాఁ
దగ దన కామె చిత్తమున దాశరథిం దలపోసె నిగ్గతిన్. 26

తరళము. జలదముం బురుడించి మించెడుసోరు గల్గినమేను ది
క్కులఁ దళుక్కు తళుక్కు మంచును గ్రొత్తకాంతుల నీను క
న్నులును దేనియ లొల్కుపల్కులు నూఁగునూగుమీసలుఁగా
గలిగి కన్నులపండువై కనఁ గల్గురాముఁ డటంచు శ్రీలకా. 27

వ. నే నెట్టులైన వాని నావలలో వేసికొని కఱువు దీర్చు కొందు. 28

గోద — గోదావరీనది.

తరువోజ. అది నాకు సాధ్యమై యగపట్టదేని
యట్టె చేఁ బట్టుదు నంతన పోక
మదమత్తు లైన నామాంసాదులను
మాఱొక్కగాఁ బుచ్చి మన్ని గొనంగఁ
గదనంబు సేయింతుఁ గాకున్న నన్న
కలఁ డాతనికిఁ జెప్పి కన లెక్కఁ జేసి
సుదతి సీత హరింపఁ జూచెద నాకు
సుంత యడ్డను లేని చొప్పున నిడ్డ. 29

వ. అని యంత. 30

మ. నెలనా ముద్దులు మూటగట్ట నగుచు న్వాల్గంటునెమ్మోమునన్
గులుకుంగుబ్బలు వాలుఁగన్నులును విన్నుం బోలు లేగౌనుమేల్
దెలుపంజాలెడుజాళువాపసిడిమేన్ దీపింపఁగా సుందరాం
గులలోఁజెప్పెడుసుందరాంగియగుచున్ గొంటాడఁగానొప్పుచున్.31

వ. సీతాగృహప్రాంతకాంతారంబునం బడి యొక్కెతయుఁ బొక్కుచు
దిక్కులు సూచుచుం బరతెంచుమించుబోడిం గాంచి కరుణా
తరంగితాంతరంగి యగు సీత లేచి యుటజద్వారంబునకుం జని
చేయెత్తి పిలుచుచు దాని కెదురుకోలు సేసి యిట్లనియె. 32

— ♦ శూర్పణఖ యేడ్చుచుఁ బర్ణశాలకడకు వచ్చుట ♦ —

మ. అకటా! యేడ్చుచునుంటి వేమి యెలనాగా యొంటినై నేల కా
నకు నేతెంచితి నీ వెవర్తుకవు నీనామంబు గ్రామంబు చె
ప్పకపోరా దిపు డెందుఁ బోయెదవు సత్వంబుల్ మహాక్రూరముల్
సకలస్థానములన్ మెలంగెడిని బెల్చ న్నిల్చి మాటాడుమా. 33

వ. అనిన గొల్లుమని రోదనంబు సేయుచుఁ గన్నీరు కరతలంబునం
దుడుచుకొనుచు నమ్మత్తకాశిని యి ట్లనియె. 34

తే. చెలియ నాదుఃఖ మేమని తెలుపుదానఁ
దెలిపి నీకును దుఃఖంబు గలుగఁ జేయఁ

దలఁపఁ బో నిమ్ము నావాఞ్ఛిత ఫల మ దిట్లు
గాఁగ నున్నది నేమందుఁ గలికి మిన్న. 35

ఆ. ఇపుడు నాకు భయ మొకించు కేనియు లేదు
కారుకోనలోనఁ గ్రూరజంతు
పొదియు నేని తనదునుదరంబునం బెట్టు
కొన్న నాదునాథు లన్ని తీఱు. 36

వ. అని చనుచున్నచుప్పనాతికి సీత వెండియు. 37

క. నినుఁ జూడ నాదుహృదయము
కనికరమున వెన్నవోలెఁ గఱఁగిన దయ్యెన్
వనితారత్నమ! నీగను
వనుతాపము వెల్బు నీకు నాశయ మిత్తున్. 38

వ. అనినఁ జుప్పనాతియు. 39

ఉ. ఏ నొక రాజపత్ని నను నేలక నాదు మనోహరుండు నా
పై నలకంతయేని దయ పర్వఁగ నీక మఱొక్క కామినిన్
దాను బరిగ్రహించి నను దగ్గఁగఁ జేసెను రాత్రివేళ నీ
కానన మందుఁ బెట్టి నొకకష్టుఁడు కైకొనివచ్చి వింటివే. 40

క. దారియుఁ దెన్నును దెలియక
ఘోరాటవిలోన నిట్లు కొందలపడుచున్
భారము నొందఁగ నుంటిని
నారీమణి! నిన్ను వినఁగ నా కెద యయ్యెన్. 41

శా. నన్నుం బ్రోవఁగ నిట్లు నాతివ లెనై నాపాలఁ బ్రత్యక్షమై
బన్నంబుం దొలఁగింప వచ్చినరమాపద్మాస్యవో చెప్పవే
యన్నన్ జానకి యి ట్లనున్ దశరథక్ష్మాజానికిం గోడలన్
నన్నున్ రామునిపత్ని నీ వెఱుఁగు మోనారీశిరోరత్నమా. 42

—♦ సీత చుప్పనాతిని దనయొద్ద నిలుపుకొనుట ♦—

చ. అని మఱియున్ వచించు వనితా నిను నేను భరింతు నాకడన్
జనవున నుండు నావిభుఁడు సజ్జనుఁడన్యవధూటులం గనుం

గొను జనయిత్రు లట్లింతనిఁ గూడి మెలంగెదు తమ్ముఁ డట్టిదే
మనమున శంక దక్కి యిట మాకడ నుండుము వీగ నెవ్వగల్. 43

తే. అనఁడుఁ జుప్పనాతి యను నీసుమగఁడును
మఱఁది పడుచువారు మంథిరమున
మసలునన్నుఁ జూచి మరు లంది యేమేని
సలుపవచ్చు నేను సయిప లేను. 44

క. వా రింత పెట్టుచుండిరి
వా రాడినయట్లు మెలఁగ వలయును గాదే
యేరీతి నెట్లు వచ్చునో
నారీమణి యిట్టితోడుసునం బడఁజాలన్. 45

వ. పరపురుషులతోడి దర్శనస్పర్శన సంభాషణ సహవాసంబు
లపాంసుల యగుదానికిఁ బాతక హేతువులు నేనిటఁబరపురుషులతో
నిరంతరం బున్న నన్నుఁ గన్నవారు విన్నవారు సహింపఁ జాలరు
సంతతసహవాసపరిచయంబున నిప్పటి నీచిత్త మి ట్లుండక మాఱి
వచ్చు నప్పుడు నాచిత్తంబు వెచ్చగిలక మానదు దాన నే నెట్టి
గతికిఁ బాల్పడుదునో నా కీట్టి కష్టపాటెందులకుఁ గావలయు
నింతలో నెంతటికష్టమ్ములైనఁ బాపఁ జాలినదైవం బై యేశార్దూలం
బైనదర్శన మిచ్చు నమ్మా! నీ కిదె నమస్కారము పోయివచ్చెద నీ
యక్కటికంబునకు నేను మిక్కిలి సంతసించితి నని మార్గంబుపట్టి
వడివడిం జనఁ జొచ్చె నప్పుడు సీత వెన్నంటి పఱచి పట్టుకొని
పట్టువఱచుచుం బర్ణశాలకుం దెచ్చి లాలించుచు ని ట్లనియె. 46

సీ. ఓసతీమణి! మన మొకగూటిచిలుకల
వలె నుండి సిచ్చట జలక మాడి
కాత్యాయనీపూజ గావించి మునులను
సేవించి యతిథుల సేమ మరసి
సద్గోష్ఠిసలుపుచు సత్కథల్ వినుచును
దేవమహాత్మ్యముల్ తెలిసికొనుచుఁ

బుష్పాపచయము సల్పుచును బూజార్థము
వనవైభవం బెల్లఁ గనఁ గొనుచును

తే. వాకిటికి లేళ్లు నెమిళులు వచ్చుచుండు
వాని కాహార మెద్దియేఁ గాని పెట్టి
ముద్దులాడుచు దుఃఖముఁ బో కడంచి
సుఖముగాఁ గాలమును బుచ్చుఁ జూతు మతివ!. 47

వ. అని యెన్నియో చెప్పినఁ జుప్పనాతి సీతతో నుండ నిష్టంబు లేని చందం బభినయించుచు నట్టకేల కంగీకరించినట్టిదె పర్ణశాలలోనికిం జని జానకితోఁ బ్రసంగించుచుండె నప్పుడురామలక్ష్మణులు వనాంతరంబునుండివచ్చిన నమ్మాయామనుష్యాంగన సీతాదేవిచాటునకుం జనియె నపుడుసీతయు. 48

ఉ. ఈయమ యొక్కరాజసతి యేను బరీక్ష యొనర్చితిన్ విభుం
డై యతఁ డీయమన్ విడిచి యన్యసతిం గయికొంటె కాక యీ
రేయి గృహంబునందు నిదురించుచునుండగఁ దెచ్చి యిచ్చుటన్
బాయఁగఁ జేసి పోయె నని పల్కిన దీయమ సత్యసంగతిన్. 49

తే. మృగములకు నీమె వాచవి యగుదు ననుచుఁ
దెగువ వనులంటి పోవ నేఁ దెలిసి యిట్లు
తెచ్చితిని నాకుఁ దోడయి యిచ్చనుండు
ననుతలంపునఁ జేసి యోప్రాణనాథ. 50

క. ఈమెకుఁ బురుషులగాలియు
నేమాత్రము తాకరానిదే వ్రత మగుచున్
భూమి నగు నియ్యపాంసుల
నామీఁదను బ్రేముడించి నాతోనుండున్. 51

—♦ లక్ష్మణుఁడు దానిం జేర్పరాదని చెప్పుట ♦—

ఉ. రాముఁ డొకండు పల్కక కరంబు విచారము సేయుచుండఁగా
నామెయి లక్ష్మణుండనియె నమ్మరో! రాక్షసమాయ లెన్నియో

నేమములఁ బ్రవర్తిలెడు నీసపు లెన్నియొ నచ్చుఁ జెప్పఁచుఁ
దా మిటు సంచరించెదగు దైత్యకులాపశదుల్ తలంపఁగఁ. 52

ఆ. అనినఁ జుప్పనాక యనియె నాయన వల్క-
నుడులు సత్య మంచు నుడువ నుంటిఁ
గ్రొత్తవారి నెపుడు కొని పరీక్షింపక
నెల వొసంగ రామి నిజము నిజము. 53

క. తల్లీ! పోయెద నాకీ
యిల్లేటికి వాఁకి లేటి కీవన మెల్లఁ
దెల్లముగ నాకు నిల్లే
వల్లభుఁ డొల్లమిని జగము వల్లభమగునే. 54

వ. అని లేచి చనఁ బోవుచున్నంత సీత చేయిపట్టుకొని బతిమాలు
చుండెనప్పుడు రామచంద్రుం డి ట్లనియె. 55

ఆ. ఆడుదానిపొత్తు నాశించు నాడుది
యొంటి నుంట కోప కుర్విజాత
యీామె పొత్తుఁ గోరు నీరీతిఁ గావునఁ
గా దనంగ నేల కందు మెల్ల. 56

వ. అనిన సౌమిత్రి వెండియును. 57

ఆ. రాజభార్య ననుచు రమణి చెప్పెడుఁ గాని
రా జెవండొ తత్పురం బ దేదొ
తెలియఁ జెప్ప దీమె తలఁప నే రె ట్లన్న
సందియంబె యీామెయందు నాకు. 58

వ. అది యట్టిద కావున. 59

క. అతిథిగృహంబునయందున్
బ్రతిదిన మీామమ వసింప వలయుఁ దేసీ
మితిమీాఱ కున్న యేనీ
సతియున్కికి మన్కి కేను సమ్మతిపడుదున్. 60

వ. అనిన రాముండది యుత్తమకార్యం బనియె సీతయుం దానికిఁ దగు
నట్లు చెప్పి యతిథిగృహంబునం దధివసింపం జేసె నిట్లు కొన్ని
దినంబులు కడచినప్పుడు. 61

—♦ చుప్పనాతి తప్పుదారిం బ్రవర్తించుట ♦—

సీ. మగవారివాసన తగులరా దనునది
క్రమముగా రామునిఁ గదియ నయ్యె
సంభాషణంబులు సలుపుట తప్పను
నద్ది రామునితోడ సుద్దు లాడె
యాదృచ్ఛికముగ నే నగపడ రాదను
నామె క్రీఁగంటను రాముఁ గనియె
బడుగురిలో నైనఁ బరుఁ జూడ రాదను
నది యొంటిమై రాము నాడఁ దివిరె

తే. నోరఁజూపు లాయారము ల్ కోరికలును
దెలుపుసంజ్ఞలు చిటికెలు పలుకుబడులు
కూనిరాగంబులును మరు ల్గొలుపుచెయ్వు
లామె పొనరించుచుండె నహర్నిశంబు. 62

తే. పైట సవరించునట్టులు బయలు పఱచు
జుట్టుముడి విప్పి విడలిచి యట్టె ముడుచు
నావులించును జిటికెలు నపుడు వేయు
నొడలు విఱుచు నాయమ రాముఁ డున్నకడల. 63

ఆ. అది యెఱింగి రాముఁ డామెపై నెప్పుడు
చూపు నిలుపకుండు రేపు మాపు
సంచరించె నిట్లు సాఁగ నా ళ్లాయమ
కన్నుసన్న లెల్లఁ గడకుఁ ద్రోచి. 64

వ. ఒక్కనాఁ డేకతమయున్న రామచంద్రుచెంతకు వచ్చి చుప్పనాతి
చేతులు జోడించుకొనుచు నిట్లనియె. 65

మ. తరుణీరత్నము నేను నామగఁడు నాదండం బ్రవర్తింపఁ గ
ట్టుగలం ద్రోచెను గామశాస్త్ర సరణి నే నున్కటి నన్నుం బట్టి శం
బరశత్రుం డను గసున్గసు న్వాతలలోఁ బాఱఁగ వేయంగ నే
ను రవంతేనియుఁ దాళఁజాలనిగతిన్ దుఃఖించుచుంటిన్ బ్రభూ. 66

ఉ. కామకళారహస్యములు గల్గినవన్నియు నేర్చియుంటి నే
నే మెయి నేస్తుతో తెలియు నించుక కూడినమాత్ర నాపయిన్
బ్రేముడి సంఘటించుచును బ్రేయసిఁ గాఁ గొని ప్రాణదానమున్
గామినికిం బొనర్పు మని కాళ్ళుల నంటి భజించి వేఁడుదున్. 67

ఆ. అనుచు రాముఁ డనియె నతివ! నీ వారుఁ జూడ
నట్టిదాన వనుచు ననఁగ నెఱిఁగి
తమ్మునకుఁ జెప్పలుగు దగ వని నినుఁ జేరఁ
దీను నిష్ఠపడితిఁ దెఱవ నేను. 68

వ. నీ విట్టిదాన వని యెఱుంగక కోపంబు నాకడ నున్న దని యటుండ
నిమ్ము. 69

తే. ఏకపత్నీవ్రతంబున నే నెసంగు
చున్నవాఁడ వానప్రస్థ మెన్నఁ బనుచుఁ
గాటఁ గాషాయవస్త్రముల్ గట్టి చుట్టు
జోగినై యుండు న న్నిట్లు చూడఁ దగదు. 70

చ. వలసిన నొడ్జో కలరు వామవిలోచన కోడెకాండ్రు నీ
వలరులవింటిజోదునని యందు వలంతివనై చరించుచున్
గులము సముద్ధరింపఁగను కోర్కె పొనర్పుము క్రాలుఁగంటి నిన్
దెలిసిన నాడిపోసెడిని ధీరుఁడు తమ్ముఁడు కోసి వేసెడిన్. 71

వ. అని పలుకుచున్నంత. 72

క. తమ్ముఁడు కొమ్మయు లే రిపు
డి మ్మొక కౌఁగిలి యటంచు నేస్తెఱ రామున్
సమ్ముఖమునందుఁ గైకొని
నమ్మానిసితిండి రాఁగ నాతఁడు భీతిన్. 73

మ. అదిగో వచ్చెడు సీత యోసి కులటావ్యాహారముల్ పెక్కు ల
ల్లైదియుం గోరిక లేనిదానివలె నన్నెన్నో ప్రచారించి నా
సుదతి న్నన్నును మోసచేసి యిటు మాచో నుండి యి ప్డిగ్గతిన్
బెద రింతేనియు లేక రక్కసివలెన్ వేధింతువే పుంశ్చలీ. 74

వ. అంతలో జానకి వచ్చి రాముని నక్కునంజేర్చుకొన నుంకించుచున్న
దానిం జూచి రామాలింగన హా హా యని యదలించుచున్నంత
నామెం గాంచి తనమనోరథంబున కంతరాయం బాపాదించిన
దనునమస్కంబున నామె భ్రమింగ నోరు దెఱచుకొని పైఁబడ నున్న
రాక్షసిం గని లక్ష్మణుండు వడివడిం బఱచి వచ్చి దాని కేశపాశంబు
వట్టి తిగిచి నేలం బడవైచి కడకాలం ద్రొక్కిపట్టి కత్తికంగోయ
నున్న సమయంబున రామచంద్రుండు తమ్మునిం గాంచి యి ట్లనియె.

మాలిని. వలదు వలదు దీనిన్ వాలుగంటిన్ వధింపన్
బలలభుజియ యైనం బాప మౌఁ గాన సౌమ్యా!
వెలల విడుము లేంపత్వేయుటే చాలు నన్నన్
గళము నఱకునోజన్ గాకతం డప్డు కాకన్. 76

వ. దానికర్ణనాసాచ్ఛేదంబు గావించి వికృతాంగిం జేసి పొమ్మని పడఁ
గెంటుటయు నది పడి లేచి రాక్షసీరూపంబు ధరియించి నల్ల వెల్లువ
యై పాఱుచుండ ని ట్లనియె. 77

ఉ. ఏ నెవరో యెఱుంగ కిటు లింతలు చేసితి రింద్రముఖ్యులన్
దా నొకవ్రేల్మిడిన్ గెలిచి దర్పము పేర్చిన రాక్షసేశ్వరుం
డై నను లెందు లేక భువనైకవిభుం డయి పేర్మిఁ గాంచు తే
జోనిధి యైన రావణునిసోదరి శూర్పణఖన్ దలంపుఁడీ. 78

క. ఈదండక నాస్థానము
నాదండకు మీరు వచ్చి నాజంబుసుతున్
గాదనక చంపి మాకున్
బాదుకొనం జేసి రెగ్గు పరికింపంగన్. 79

మ. మిము నే నెట్టులు సేయఁగాఁ గలనొ న స్మత్సైంతు రీతిన్మహా
మము నక్తంచరులన్ సమస్తజగముల్ మన్నించుచుండంగ మీ
రు మనుష్యాధము లిట్లు చేయుటను మీరూపంబు మాయంగ నా
సమయం బయ్యె నటంచుఁ దోఁచెడిని వాక్యాలంబు లింకేటికిన్. 80

—♦ శూర్పణఖ ఖరాదులకడకుం జని మొఱ వెట్టుట ♦—

మ. అనుచుం గైరికధాతుభూధరముపై వర్షాపగల్ పాఱున
ట్లనయంబున్ సకలాంగకంబులను సాంద్రాస్పృక్తతుల్ పర్వఁగాఁ
జని రోదోంతర మార్గ నేఖచు జనస్థానంబునందున్ ఖరున్
దనతోఁబుట్టువు దుష్టరాక్షసవృతున్ దర్శించిమర్శించుచున్. 81

ఆ. చెవులు ముక్కు లేక సిక్తమై నెత్తుట
భీతి గొలుపుమేన గుభిల్లుమనెడు
చప్పు డుప్పతిల్ల జగతిపైఁ బడఁ జేసి
చుప్పనాక వీఁక చెప్పఁగొనియె 82

వ. అట్లు నేలం గూలఁ బడినశూర్పణఖం గాంచి ఖరదూషణాదులు మిక్కిలి పొక్కుచు లేవనెత్తి ని న్నెవం డిట్లు చేసె వానిం బట్టి మేమి ప్పుడ గిట్టించెదము వానిం జెప్పు మనిననామె గడుంగడు దుఃఖించుచు గద్గదస్వరంబున ని ట్లనియె. 38

సీ. దశరథరాజనందనులు రాముండును
లక్ష్మణుం డనువారు లావు గలరు
సుకుమారదేహులు సూర్య తేజస్కులు
వల్కలాజినజటావంతు లగుచు
జనకునాజ్ఞం జేసి జానకి యన్ సతి
తోడ నరణ్యముల్ చూడ వచ్చి
మొదట విరాధాదిముఖ్యదైత్యులఁ దునిమి
పంచవటికి వచ్చి కొంచ కిపుడు
తే. నా సుతున్ జంబుఁ దెగ వేసి నన్ను నిట్లు
ముక్కుచెవులు దెగం గోసి రక్క టకట

వారిమైపచ్చి నెత్తురవ్వారి గాఁగఁ
ద్రావినం గాని శాంతి నొందంగఁ జాల. 84

వ. అని చెల్లెలు చెప్పినమాటలు చెవులు సూడినయట్లయినదండతాడితభుజంగంబు వలె రోజుచుఁ ద్రిశిరస్కుం బిలిచి మనుష్యాధములిద్దఱు మనలం జంపువారై వచ్చి పంచవటిం బర్ణశాలం గట్టుకొని యుండి రనియు మనభాగిచేయుం డగుజంబుని నిరపరాధినిం జంపి రనియు మనశూర్పణఖ ముక్కుచెవులం గోసి రాక్షసజాతి కంతకు నవమానంబు గల్పించి రనియుఁ జెప్పి వారిం జంపి వారినెత్తురు మనశూర్పణఖకుం ద్రావ నిచ్చినప్పుడు గాని నాచిత్తంబున శాంతి చేకూరదు గావున మీ రందఱునేకగ్రీవంబుగా యుద్ధసన్నద్ధులై పదునాలుగు వేలరాక్షససైనికులకుం జెప్పి ప్రస్థానంబు గావింపుం డనిన నతం డెల్లసేనానాయకులకుం జెప్పె నప్పుడు గజాశ్వరథపదాతిపరివారంబులం గూర్చుకొని గదాసితోమరభిండివాల పరశుపట్టస ముసల ముద్గరాది సాధనంబులు సమకూర్చుకొని కట్టాయితంబై ప్రస్థానభేరి వేసి ధరణీతలంబు గ్రక్కదలఁ గేకలు నాకంబు ముట్ట నట్టహాసంబులు బిట్టడర రథనేమినిస్వనంబులును గజబృంహితంబులును వాజిహేషలుం గద్దకోలాహలంబై దిక్కులఁ బిక్కటిల్ల ఖరదూషణపురస్సరంబుగా శూర్పణఖా సూచితమార్గంబునఁ బంచవటికిం జనుదెంచి నేల యీనినలీలం గ్రాలఁ బరాగపటలం బంతరిక్షం బంటి సూర్యుండు లేడనునట్లు గావించె నప్పుడు రామచంద్రుండు లక్ష్మణుం గాంచి. 85

—♦ ఖరదూషణాదులు యుద్ధంబునకు వచ్చుట ♦—

మ. అనుజన్మా! కనుఁగొంటివే భవదుదగ్రాసి న్నికృత్తాస్యయై
చని యారక్కసి మొక్కలించుచు జనస్థానస్థరక్షోగణం
బును గైకొం చరుదెంచుచుండె మనలం బోరాడి గెల్వంగ నేఁ
జని వారిన్ నుఱుమాడి వచ్చెదను నాశస్త్రాస్త్రసంపత్తిమై. 86

వ. నీ విట జానకీసంరక్షణంబు జాగరూకుండవై చేయుచుండు మని ధనుర్బాణతూణీరకృపాణపాణియై ధనుష్టంకారంబు సేయుచు రక్షో

వీరుల కెదురు వోయి ప్రతిఘటించి నిలుచుటయును. 87

మ. పదియు న్నాలుగు వేలు రాక్షసులు చేవంజేసి శస్త్రాస్త్రముల్
గదలుం గత్తులు శూలముల్ ముసలముల్ ఖడ్గంబులున్ లోఁగనై
పదునుం దీరిన మేటులాయుధములాపద్మాక్షుపై నేసి చ
చ్చెద వోరీ! యనిపేర్చి యార్చిరి దెసల్ జేయన్ ప్రతిధ్వానముల్

తే. రాముఁ డన్నింటి నడుమన రవళి పుట్టఁ
బెట్టు ఖండించి కెంపుగా వెట్టఁ జూపు
మేటిబాణము లందఱి మీఁద నేసె
నొక్కతూఁకున నెల్ల రోహో యనంగ. 89

క. ఈరే డైనసహస్రము
లారాక్షసవీరు లపు డహంయువు లగుచున్
శ్రీరాము మీఁద నేసిరి
శూరతఁ బదునాల్గువేలశూలాస్త్రములన్. 90

ఉ. తోరణగట్టినట్టు వడితో నవి మూఁడుచు రాముమూర్తిపైఁ
జేరఁగ వచ్చుచుండఁ గని చిచ్చఱకంట వెలుంగువేల్పు నా
నారశిలీముఖంబులను జర్జరితం బయి నేలఁ గూలున
ట్లారఘువంశశేఖరుఁ డహో యనున ట్లొనరించె నాలమున్. 91

తే. ఖరుఁడు తనసేనపై నట్లు కలుకుటమ్ము
లడరి గుప్పించురాముని నరసి కినుక
యినుమడింపఁగ నాతనియెదుటికి రథ
మరుగఁ దోలించి యి ట్లనె నతనితోడ. 92

చ. బ్రదుకు తలంపు సేయవఁటె ప్రాణముమీఁద నిరాశఁ బూనితే
కదనము సేయ నిల్చితి వొకానొకరుండవు లేతకాయ వో
మృదులశరీర! మానవుఁడ విందఱు జోదులు మానవాడు లే
ప్రదరము చూప కట్టె నినుఁ బట్టి భుజించెద రింతలోపలన్. 93

ఉత్సా. ఖరుఁడ నేను నాకుఁ బేరు గల్గె నిట్లు పోరులన్
ఖరకరుండు ఫాలె మండి గండడంతు వైరులన్

శరము లేఱుఁగు దట్టి నీవు సంగరం బొనర్తువే
..శరము శోచనీయ మయ్యెఁ గాదె నీదుచెయ్దముల్. 94

తే. వంటయింటికిఁ గుండేలు వచ్చినట్లు
వచ్చితివి మానివాసము వంక కంతఁ
బోక నాదుసహోదరిముక్కు చెవులు
చెక్కి వేధించి తప్పె యోమొక్కలీడ. 95

క. నిను శిక్షింపఁగ వచ్చితి
వనితామణితోడ నిన్ను వాచవిఁ గొనఁగా
మనముం జేసెను మాయక
విని నన్నుం గొలువ నుందువే యందు వినుక్. 96

ఉ. నావుడు రామభద్రుఁ డను నా కిట బుద్ధులు నేర్పవచ్చితే
నీవు ఖరుండవా తెలిసె నీదగుసత్త్వము నిన్నుఁ గొల్చికో
నీవని కేగుదెంచితిని యెల్లఖరాదుల రాక్షసాదులన్
జావఁగ నేసిసజ్జనుల సాకగ వచ్చితి నోరిదుర్మతీ. 97

ద్విపద. అనుడు భగ్గున మండి యారాక్షసుండు
తనవారి నందఱ ధను వెత్తి పిలిచి
వెనుదీయ కీ రెల్ల విక్రమక్రమము
వినుతి కెక్కఁగఁ బీని పీఁడిఁ బట్టి 98

ద్విపద. కొనిరండు మీదగుకోదండశక్తి
నను నాదుభుజశక్తి నామంత్రశక్తి
కని యెఱుంగఁడు వీఁడు కం డెఱవండ
మనుజశిశువు వీని మాంసార్పణఖుఁ. 99

ద్విపద. తినుబండముగ నిచ్చి తిను మిచ్చ ననుచు
ననునయించెద నామెయాధు లవెల్లఁ
గని నంతనే తీఱుఁ గావున మీరు
కనుకనిం బడి ఘోరు క్రాఫింపుఁడివుడు 100

వ. అనిన నెల్లను నొల్లబోనిపరాక్రమంబున విజృంభించి నానావిధా యుధంబు లొకపెట్ట రామునిపైఁ దెట్టలుగట్టఁ బడవేయుటయు రాముండును. 101

— రామచంద్రుఁడు ఖరదూషణాదులతోఁ బోరుట —

క. అందఱకు నందఱై తమ
ముందఱఁ బోరెడు నసురగఁ బోలింపఁగనై
క్రందుగ బాణము లేయుచుఁ
జిందరవందరగఁ జేసె సేనల నెల్లన్. 102

వ. ఆసమయంబున. 103

చ. అరములు చక్రముల్ విఱుగ నచ్చె యిలం బడి నుగ్గునూచ మా
నరదములుఁ గణంబులగునంగములం గలఘోటకంబులున్
శిరములుఁ గాళ్ళుఁ జేతులును జెక్కలు ముక్కలుగాఁగఁ ద్రుంగినన్
ధర గయినేయుసారథులు దారుణ గా రథికుల్ కడుపోరి రుద్ధతిన్.

తే. భీకరమునఁ గూలు కొండలపిండువోలెఁ
దుండములు గండములుఁ గాళ్ళు దునక లగుట
భూరిదంతులు తెగిపడి భూమిఁ గప్పె
హస్తిపలుకులు రామునిఁ బోరునవసరమున. 105

క. ఉరుహేషల నురుధారల
బరవళ్ళం ద్రొక్కుతురగపంక్తు లవుడు పెం
పఱి కుప్పగూలె వినమే
ధరలో నత్యుచ్ఛ్రయః పతనహేతు వనన్ 106

క. పిడుగులపిల్లలొకో యన
గడిమిం బగ వానియందుఁ గనపఱచి వడిన్
గడు పోరి పోరి చచ్చిరి
పుడమిం బడి పెక్కుభటులు పొడి పొడి యగుచున్. 107

చ. ఒకఁ డొకఁ డంటి మండునవి యొక్కెడ యొక్కని బెక్కుమంది వీ
గక మడియించునట్టియవి కత్తళముల్ పడగల్ ధనుస్సులున్

మొకముల బూరగొమ్మలును ముక్కలు ముక్కలుగా నొనర్చి యె
న్నికగనుపట్టి వైయలరె నెక్కొని మిక్కిలి రామబాణముల్. 108

వ. ఇట్లు విక్రమంబునం బోరుచున్నసమయంబున దూషణ త్రిశిర
స్కులతోడం గూడి ఖరుండు తమసైన్యంబు దైన్యంబు నొంది
మల్లె పట్టినచేను నాఁ గాన రాకుంట యెఱింగి కల్పానల్పగర్భీరభై
రవుండై గండుమిగిలి దోర్దండచండిమంబు చూపుచు రాముని
దిక్కు రథంబు దోలించి. 109

మ. నియతి న్వింట సమంత్రకంబుగను నాగ్నేయాస్త్రసంధాన మొం
తయు గావించి పరాక్రమంబున వడిన్ బ్రత్యర్థిపై నేసి భూ
దయితా వచ్చెడుఁ గాచికొమ్మనుచు నౌద్ధత్యంబునై గర్వాతి
వియదాశాస్థలు లెల్ల ఘదిలఁ గడున్ బెల్లార్చె గొంకుమ్మడిన్. 100

వ. అప్పుడు రామచంద్రుండును. 101

మ. వెఱ పొక్కింతయు లేక రాఘవుఁడు వే వే వచ్చువచ్చిచ్చుటం
పఱ ధైర్యంబున వారుణాస్త్రమునఁ దా వారించి పైఁ బెద్దపా
తఱులై వచ్చెడురాక్షసాస్త్రములపైఁ బ్రత్యస్త్రముల్ వైచి యె
త్తెఱఁ సంహార మొనర్చి కూల్చె నరులన్ దేవౌఘ మగ్గింపగన్. 112

శా. చండప్రక్రియ నట్లు దోర్బలలసచ్ఛౌర్యం బవార్యంబుగా
దండు దర్లఁగఁ జేయుచున్ నృపతి కోదండోగ్రమౌర్వీరవో
ద్దండారావమునన్ దెస ల్పదియు నత్యంతంబు మార్మ్రోయు ను
గ్రుండో నా నెటఁ జూడఁ దాన యగుచున్ గోరాడెఁ బోరాడుచున్

వ. అప్పుడు ఖరదూషణత్రిశిరస్కులు విరథులు వీతచతురంగబలు
లయ్యు నుక్కుమిగిలి దోర్దండ చండిమంబు మెఱయ గదాదండం
బులం గొని పరవళ్ళు ద్రొక్కుచు రామునిపయిం బడుటయు
నతండును. 114

—♦ రాముఁడు ఖరదూషణాదుల సంహరించుట ♦—

మ. కరవాలంబు గ్రహించి త్రిప్పుకొనుచుం గ్రవ్యాదహస్తంబులన్
బరవళ్ళాడునినుపరోకలులు తొప్పల్ దోరలై ముక్కలై

ధరణిం ద్రెళ్ళఁగఁ జేసి ముప్పేరతలన్ తాటింపగా బంతు ల
ట్లరితి నిమ్మదికి లేచి క్రిందఁ బడె హా హా హా యనన్ భూతముల్.

క. అప్పుడు ఖరదూషణు లా
చొప్పునఁ బడినంత నింగి చొప్పశివసురల్
చప్పుడులు పర్వ దుందుభు
లొప్పుగ మ్రోగించి కురిసి రొత్తుగ సుమముల్. 116

క. తలపూ వాడకయుండఁగ
ఖలులను మర్దించి యిట్లు కాకుత్స్థకులో
జ్జ్వలమూర్తి పర్ణశాలకు
సలలితగతి నరుగుదెంచె సౌ రొప్పారన్. 117

క. సీతయు లక్ష్మణుఁడు దాతని
కాతఱి నెదురేగి భక్తి నభివందనమున్
బ్రీతిమెయిఁ జేసి రెంతయుఁ
గౌతూహల మయ్యె మౌనిగణముం దెల్లన్. 118

వ. అప్పుడు సీతరామునికంఠాలింగనంబు గావించుకొని యభినందిం
చుచు ఖరదూషణాదులయుద్ధం బెట్లయ్యె వారిపరాక్రమం బెట్టిది
వినవలతుం జెప్పు మనిన రామచంద్రుండు. 119

తే. ఉక్కుతునకలఁ బోలినయోధవరులు
పదియు నాలుగు వేవు రాబలగమందుఁ
బదియు నల్వురు పడవాళ్ళు వారి కెల్ల
నాయకుండు త్రిశిరస్కుఁడు నడుపు దురము. 120

తే. బహుళశస్త్రాస్త్రములు వారిపాలఁ గలవు
కొండలను బిండిగాఁ జేయుదండిమగలు
వారితోఁ బోర నింద్రుండు బడలువడును
ఖరుఁడు దూషణుఁడును ఖరకరులు దెలియ. 121

వ. అనినం జానకి హర్షపులకితాంగియై రామునిం గని. 122

ఉ. ఇందఱితోడ మాఱుకొని యొక్కఁటికయ్యమునందు నందఱన్
మ్రందఁగఁ జేసి నట్టినృపమండలమండితు నెన్నశక్యమే
పండితుఁ డమ్మహాసురణపద్ధతులం గన నంగవించుచున్
నిండుమనంబు నా కిపుడు నివ్వెఱఁ గూర్చుచునుండె వల్లభా. 123

క. పలికిన రాముండను నా
పొలికలనం జూడ నింత పోలిక లరయన్
గలవార మగుదు మన న
త్తలముం గనఁ గోరె సీత తాత్పర్యమునన్. 124

—రాముఁడు సీతాలక్ష్మణులకు యుద్ధభూమిం జూపుట—

వ. లక్ష్మణుండును వల్లె యనిన రాముండు సీతాలక్ష్మణులతో యుద్ధభూమికిం జని చతురంగబలంబులతోడి యుద్ధంబును ఖరాదులతోడియుద్ధంబును వేఱువేఱ నిరూపించుచుం జెప్పిన లక్ష్మణుండు సీతాదేవిం గాంచి. 125

మ. పది యున్నాలుగు వేలశూలము లివే పద్మాక్షి వీక్షించితే
పదియు న్నాలుగు వేలు రాక్షసభటుల్ వారొక్కమాత్రేయఁ గా
జిదురల్ గా నొనరించి ప్రోగులు వడన్ జేసెన్ రఘూత్తంసుఁ డి
య్యది యెవ్వారికినే నసాధ్య మనుచున్ వ్యాహారముం జేయుదున్

తే. విరథులయి యినుపగుదెలను వీరు మువురు
పూని యొకపఱి రాముని పైనిఁ బడఁగ
నితఁడు కరవాలమునఁ జేసి యింత లింత
లుగ నొనర్చె నైలాఘువ మగణితముగ. 127

క. ఖరదూషణత్రిశిరస్కుల
శిరములు వీక్షించితె తల్లి! శితభల్లములన్
జురుకునఁ దెగియున్ మింటికి
పరచి యిటం బడియెఁ గాలిబంతులు వోలెన్. 128

వ. అని మఱియు ననేకయుద్ధవిచిత్రంబులం గను విను మని చెప్పినం జెవి యొగ్గి వినుచు నలుగడం గలయఁబరికించి నంత మువ్వురును మరలి పర్ణశాలకుం జనుదెంచి యించుక విశ్రమించి గౌతమికిం

జని సచేలస్నానంబు గావించి యుటజంబునకు వచ్చి దేవపూజా దికంబు గావించుకొనుచుండి రాసమయంబున. 129

—♦ ఋషులు వచ్చి రామచంద్రు నభినందించుట ♦—

సీ. పంచవటిం గలపరమర్షులే గాక
దండకం గలయట్టితపసు లెల్ల
శిష్యప్రశిష్యులు చేరి రా వెనువెంట
నుటజంబుచెంగటి కోలి రాఁగ
సౌమిత్రి యెదురేగి సాష్టాంగవందనా
దులు చేసి వారలఁ దోడి తెచ్చి
యతిథిగేహమునందు నధివసింపఁగఁ జేసి
యర్ఘ్యపాద్యము లిచ్చి యర్చచేసె
తే. అపుడు రాముఁడు పరమర్షు లందఱకును
వందన మొనర్చి యి ట్లను బంచవటిని
దండకావని నేరికి దైత్యబాధ
యుండఁ బోదు గదా నేఁటినుండి మీకు 130

ఉ. నావుడు వారు లి ట్లనిరి నాఁటుకొనం బ్రియ మార రఘూద్వహా
దేవుఁడ వీవు వచ్చితివి దేవరులాట ల వెల్లఁ దీర్పఁగాఁ
గావరు లైనరాక్షసులు కాలునిఁ గొల్వఁగ నేగి రింక మే
మీవల సర్వసౌఖ్యముల సిందు లభింపఁగ నుందు మెప్పుడున్. 131

తే. స్నానసంధ్యాద్యనుష్ఠానసమితి దీర్చు
కొనుట కగ్నుల సేవించుకొనుట కతిథి
జనుల నర్చించుటకు భుక్తిఁ గొనుట కీవ
కారణమ వైతి రామ! రాక్షసవిరామ. 132

ఉ. ఆమ్మునఁ జేయి వెట్టికొని రోదసి నిండఁగ గొబ్బు వెట్టుచున్
నెమ్మది నెమ్మదిన్ గలుగ నిద్దుర వోదుము నేఁటినుండి మా
కొమ్మలు మేము బిడ్డలును గ్రూరఖరాదుల మానవాదులన్
జిమ్మన గ్రోవిఁ జిమ్మినటు చిమ్మి శరంబుల నీవు కూల్చుటన్. 133

వ. అని ప్రసంగించుచున్న యప్పుడు. 134

సీ. మది నెంచి త్ర్యంబకమంత్ర మొక్కమునీంద్రుఁ
డెమ్మెమై సర్వభస్మంబు వెట్టె
నీశ్వరనిర్మాల్య మిది యంచు నొకమాని
భక్తితో బిల్వమార్వాల నొసంగె
వరమహాన్యాసపూర్వకశతరుద్రాభి
షేకతీర్థం బిచ్చె సిద్ధుఁ డొకఁడు
శ్రీదేవతాభిషిక్తక్షీరామృతం బని
యనఁటిపండ్లు నొసంగె యతి యొకండు

తే. మౌంజి యొకఁ డిచ్చె యజనంబు మఱియొకండొ
సంగె వల్కల మొకఁడు విషాణ మొకఁడు
బ్రహ్మసూత్రము లిడె నొక్కబ్రాహ్మణుండు
మౌను లొసరింత్రు రామసమ్మానములను. 135

వ. అట్టి యవసరంబున. 136

——♦ ఇంద్రప్రేషిత దేవమాతపూదండలు తెచ్చి రామునకిచ్చుట. ♦——

క. జయ! జయ! సద్గుణధామా!
జయ! జయ! సుజనాభిరామ! జయ! నృపసోమా!
జయ! జయ! దైవలలామా!
జయ! జయ! జనవినుతనామ! జయ! రఘురామా!. 137

వ. అని శబ్దంబు శ్రోత్రగోచరం బగుటయు రామచంద్రుండు లక్ష్మణ
మూర్తిం గాంచి యిట్లనియె. 138

క. వాకిట శబ్దం బయ్యెడి
నీకాలమునందు వేరొ వీక్షింప ననుఁగా
గైకొని వచ్చిరి వారిఁ
వాకొని తోడితెమ్ము నాదు వద్దకు ననుజా. 139

వ. అనిన లక్ష్మణుండు పోయి వచ్చియున్న పురుషవ్యక్తిం గని లోనికిం
దెచ్చి యుచితాసనంబున నాశీనుంగావించినంతనతఁడు లేచిచేతులు

జోడించుకొని రామభద్రునిదిక్కు మొగంబై యిట్లనియె. 140

ఆ. ఏను దేవమాత నింద్రునిపంపున
నిన్నుఁ జూచి మెచ్చి సన్నుతించి
పోవ వచ్చినాఁడ పురుషోత్తమా! నీకు
వందనంబు పలికె వాసవుండు. 141

ఉ. నీ విపు డాచరించినయవిక్ శతమన్యుముఖామరౌఘముల్
జీవపురస్సరంబుగ వసించి నభస్థలమందుఁ గ్రందుగన్
వావిరిఁ గాంచి యింత యని పల్కఁగ రానికుతూహలంబునన్
భావము లుత్తుకో మహా సువాదికఁ జేసిరి చాల లందఱున్. 142

చ. ఖరునిశిరంబు ద్రెస్సి దివికిం జనుదెంచెడునప్పు డప్పురం
దరుఁ డిది వచ్చుచుండె ననుఁ దాఁకిభయంబొదఁజూచ్చునంచుఁ గ
త్తరపడె నంతలోపల ధారుణిపైఁ బిడు గట్లు గూలఁగా
నరసి యతండు పొందినమహోద్భుతహర్షము లెన్న శక్యమే. 143

క. ఆతఁడు నిన్నగ్గించుచుఁ
బూతము లగుపుష్పదామములు మూఁ డివి నీ
చేతికి నిమ్మని చెప్పెద
నేతన్మహిమంబు వినఁగ నెంచు మధీశా. 144

మ. ఇవి మీమువ్వురు దాల్చువా రయిన క్షుత్తృష్ణాశ్రమల్ శీతవా
తవిరుద్ధాతపబాధ లుగ్రమృగబాధల్ మీ కరణ్యానలన్
దవులం బోవవి వాడ వెప్పుడును గంధంబు న్వెలార్చు న్మహో
త్సవముం గూర్చును సర్వకాలము మహాత్మా! స్వీకరింపంగదే. 145

వ. అని యిచ్చినం బుచ్చుకొని రాముఁడు రెండు సీత కిచ్చి యొండు
లక్ష్మణునియురుతం దగిలించె సీతయుం దనకిచ్చినరెండుపుష్పహారం
బులు రామునికంఠమున వైచె రాముండు నం దొకటి తీసి సీతకం
ఠంబు నలంకరించి దేవమాతం గాంచి యి ట్లనియె. 146

ఉ. ఇంద్రునియంతవాఁడు నను నిందఱముందఱఁ బెద్దఁజేసి నా
కింద్రజగత్ప్రభూతము లహీనగుణాంచితపుష్పహారముల్
సాంద్రవిభూతియుఁ వివిధసంపదలుం గలుగంగఁ జేసి పు
చ్చెం ద్రిజగంబులన్ యశము చేకురఁ జేయుచు నేను ధన్యుఁడన్.

క. నాపని నేను జొనర్చితి
సీపాటికి నన్నుఁ బొగడు టింద్రునిసహజ
శ్రీపరిపాకము మాతృఁడ!
నాపాలిఁ గరుణ నిల్ప నతి చెప్ప మాటన్. 148

వ. అని దేవమాత సర్పించి యంపిపుచ్చె వచ్చియున్న ఋషులును యథాగతికృతగమను లై తదనంతరంబ ఖరదూషణత్రిశిరస్కాగ్రాలు లేఁ జతుర్దశసహస్రజనస్థానరాక్షసనంఘంబు బంతయు సంతసంబు గొలున నరిగినంత హతశేషుం డగు నకంపనుం డను వేగులవాఁడు నోరును నెత్తియు మొత్తుకొనుచు సత్వరితగతి రావణాసురునికడ కుం జని జనస్థానవృత్తాంతం బంతయుఁ జింతించుచు నెఱింగించిన రావణుండు తనమనంబున. 149

—♦ అకంపనుఁడు రావణునకు ఖరాదులవృత్తాంతము చెప్పుట. ♦—

చ. ఖరుఁడున్ దూషణుఁడుం ద్రిశీర్షుఁడును నేకాలంబున న్వానిచే
దురమందుం దెగి స్వర్గమార్గమున యందుం బోదురో నేను నా
శరదంతర్గతకాలముం దతనిచే సంస్థాపితిం గాంచుటన్
స్థిర మంచున్ వచియించె నారదుఁడు సిద్ధించు న్మనోభీష్టముల్.

వ. అని సంతసించుచు మీఁది మీఁదికిఁ జింతించువానిచందం బభిన
యించుచు 151

ఉ. కన్నుల నిప్పు లుప్పతిలఁ గన్గొని రోషకషాయితాస్యుఁడై
యెన్నఁడు లేనివార్త లివి యిట్లు వినంబడుచుండె నక్కటా
యన్నరుఁ డెవ్వఁ డాతనికి నట్టిపరాక్రమ మెట్లు గల్గె వాఁ
డెన్నఁడు నే మదీయబల మెప్పుడు గాని నను న్వినం డొకో. 152

తే. ఇంద్రుండు నుపేంద్రుండును యముం డేని కాని
నాకు నప్రియ మొనరించి లోకసమితి
నెవ్వఁ డేనియు సుఖి యయ్యు నిన్నాటిలునె
వరుఁ డనఁగ నెంత వాఁ డెవ్వఁ డెఱుఁగఁ జెప్పుమ. 153

తే. అన నకంపనుఁ డను రాముఁ డనెడువాఁడు
దశరథునిపుత్రుఁ డయ్యుచేత స్సుయుక్తుఁ
డగుచు నడవికి నరుదెంచె నతివతోడఁ
ననుజుతో నాతఁడే కూల్చె నాశరులను 154

ఉ. చాపము నేయి వేల్వఁగ ఘనంబగు నగ్ని యనంగ మండుచుఁ
గానఁగ జేఁ జూపెదను రాముఁడు గీముఁడు హీనిముద్దఱ్జఁ
దేవరుగొట్టువాఁ డనఁగ దేవుఁడో దేవుఁడమైన లెక్కఁడో
కావున నిష్టపోయి క్షణకాలములోపలఁ గట్టి తెచ్చెఁగా. 155

వ. అనిన నకంపనుం డలుక నహింపక నాసలుకునిమునియు ట్లనియె.

సీ. అతఁడుసామాన్యుఁడ యని యెంచుచో కాదు
కొండఁ బిండిగఁ జేయుఁ గోల నేసి
యేడుసంద్రంబుల నింకించు నొకయమ్మి
కంబున నొకబొట్టు గలుగకుండ
భూచక్రమంతయుఁ బూరటిల్లఁగఁ జేయుఁ
జిరుకోల వరఁగించి చిటికలోన
నీరేడుజగముల నింతలో నిర్మూలి
యై పో నొనర్చెడు నమ్ముఁ జూపి

తే. అతని నీ వనుకొనినట్లు లడఁచినైన
సాధ్య మని నేఁ దలంప రాక్షసవరేణ్య!
యెద్దియే చేసి రాముని నద్దవిడిని
నడఁచి వంచింపఁ దగు నుపాయమ్ము గనిమ్ము. 157

ద్విపదము. ఆరామునకు సీత యనుపత్నికలదు
సారసారుఁ లోన సౌందర్య మట్టి
దెవతెకుఁ గాని లే దిదినిక్కువంబు
భువనేశ! నీ వట్టి బూమెల నైన
నాచెలిం దెచ్చి నీయాలయమందు
దాఁచితి వేనియు దాన రాముండు
కాంతావియోగదుఃఖమ్మునఁ జేసి
యంతకాలయమున కతిథియై పోవు. 158

వ. అనిన రావణుండు నిజాత్మగతంబున. 159

మ. సిరివాల్గంటి విదేహరాజతనయన్ సీతామహాదేవియై
ధరణిం బుట్టె రఘూద్వహుండె హరి నన్ ధన్యాత్మునిం జేయఁగన్
బరిపంథిత్వము బూని నేను వధమున్ వాంఛింతు సీతాంబికన్
జెర బట్టం జని తెత్తు రాము నెడఁదన్ జేరం గృథాద్వేషముల్. 160

వ. అని నిశ్చయించుకొని నీవు నాకు మంచియుపదేశంబు చేసితివి నే
నింక సీతానయనప్రయత్నంబు గావింతునని యకంపను నంపివుచ్చె
నంతలోన. 161

— ♦ రావణుకడకు శూర్పణఖవచ్చి సర్వమెఱింగించి గర్హించుట. ♦ —

తే. అట్లు ఖరదూషణాదులఁ ద్రొట్టి పదియు
నాల్గువేల దేవారుల నీల్గఁ జేసి
గండుమిగిలినరామునిఁ గాంచి శూర్ప
ణఖ వికృతవేషమున లంకమొగము వెట్టె. 162

వ. భయశోకాదు లినుమడింప రయంబున రావణాసురునిపాలికిం జని
వానిపాదంబులం బడి విలపించుటయు నతండు దానివైకృతం బుపల
క్షించి కోపాటోపంబునఁ బండ్లు పటపటం గొఱుకుచు సంభ్రమించి
లేచి మంత్రులు విన నామెతో ని ట్లనియె. 163

సీ. ఎవ్వాఁడు కడువాఁడి నెంతయుమెఱయుశూ
లాగ్రంబుపైఁ బడ నాత్మ నెంచె

నెవ్వాడు నెత్తిపై నింగలంబును నిల్పి
కొని నెమ్మి నిద్రింప మనము చేసె
నెవ్వాడు విషవహ్ని నేర్పడు కాలాహిఁ
దడబడి కడకాలఁ దన్నఁ జూచె
నెవ్వాఁడు ఘోరమృగేంద్రము నోటిలో
పలికోఱ మెఱకంగఁ బాణి సాచె

ఆ. ఎవ్వఁ డిట్లు నీకు నెవ్వగ గలిగించెఁ
గన్నుఁ గాన లేక నన్ను సరకు
గొనక బ్రతుకునాస గనకున్నవానినిఁ
దెలియఁ జెప్పు మిపుడ తేటపడక. 164

క. ఆ తెఱఁగున నగనాతని
శ్రోత్రోమార్గమునను౦డి రోషజ్వాలల్
భూతము లయ్యెం గోటర
జాతములన్ రేల నగ్ని జ్వలియించుగతిన్. 165

వ. అంత శూర్పణఖ జంబుం జంపుటయుఁ దనకర్ణనాసికాచ్ఛేదనంబు సేయుటయు ఖరదూషణాదులఁ బదునాలుగువేవురం జంపుటయు నెఱింగించి మహోగ్రహంబున మండిపడుచు ని ట్లనియె. 166

సీ. నీభోగమే నీవు నిరతంబుఁ గనుచుందు
వితరు లెట్లున్నది యెఱుగ కుందు
విట్టినిన్ నీప్రజ లెపుడు శ్మశానాగ్ని
వలెఁ జూచి రోయుచుం బ్రేలమి విడిచి
ప్రజకష్టసుఖములు పరికింప కుండిన
రాజును శవముగాఁ బ్రజలు గంద్రు
గ్రామ్యభోగాసక్తిఁ గలిగినట్టులు నీకు
రాజ్యపాలనశక్తి పూజ్య మయ్యె

తే. బుద్ధిజాడ్యము నీ కగు మూర్ఖనిత్తుఁ
డవు కృపాహీనుఁడవు క్రూరుఁడవును నీదు

చావు నీ వెఱుంగనియట్లు సంచరించు
చుంటి వేమంచు ని న్నిప్పు డోవెడంగ. 167

ఉ. అల్లునిగొంతు గోసిరిని జానుజముక్కు చెవుల్ నరాజిచే
జల్లున నెత్రు నాఱ రభసంబునఁ గోసిరి తోడఁ బుట్టులన్
ద్రెళ్ళఁగ నేసి రాజిఁ బరిదేవనముం బొనరింపఁ బోక నీ
పల్లవపాణులన్ గలసి పాటలు పాడుచు నుండు మింటిటన్. 168

తే. రాముఁడు ప్రతిజ్ఞచేసెను రాక్షసకుల
ములను బేరులేకుండ నేఁ బొనరుతు నని
చెప్పినటు చేయువాఁ డయ్యె నిప్పు డైన
మేలుకొను మీవు నిద్దురపాలు గాఁక. 169

ఉ. చక్కనిచుక్క రామసతి జానకి దానినిఁ బట్టితెమ్ము నీ
చక్కిన నిల్పుకొన్న నట సాల్వడి రాముఁడు తద్వియోగపుం
బొక్కున మొక్కలీఁ డయినఁ బోయెడుమొక్కలువోయి నట్టిదై
చక్కనిమార్గ మిద్ది పెరసంగతికిం జనఁ జేటువాటిలుఁ. 170

—♦ రావణుఁడు మారీచుని కడ కరుగుట ♦—

వ. అనిన విని రాక్షసేశ్వరుం డాక్షణంబ కదలి వియద్గమనంబున త్రికూటంబును గాలపర్వతంబును గడచి మహోదధిం దాఁటి మహా దేవాయతనం బైనగోకర్ణంబునకుం జని యటం దొల్లి రామునివలని భయంబునం జేసి తపస్వియైయున్న తనతొంటిమంత్రి మారీచుని కడం బొడసూపుటయు నతం డతనిం గని సంభ్రమించి పూజించి విశ్రమించినవెనుక వినయంబున ని ట్లనియె. 171

చ. ప్రకృతికిఁ గాక నీ విటు వివర్ణత నొందితి వేమిహేతువో
సుకముగ నెల్లవారలును జూడఁగ నొప్పిరె నీపురంబునన్
బ్రకృతిజనంబు ని న్గొలువ వచ్చునె ముచ్చట యేమిచెప్పు మా
ప్రకటితకీర్తి నీ విటకు వచ్చుట లచ్చెరు వయ్యె నియ్యెడన్. 172

క. నీవచ్చినకార్యము గో
త్రావలయమునందు దుష్కరమ యగునేనన్

నావలన సఫలమగు నని
భావింపు మ టన్న దనుజవల్లభుఁ డంతన్. 173

ఉ. రాముఁడు లక్ష్మణుం డనఁగ రాజకుమారులు మాఱి సుందరుల్
కామినితోడ నేఁడు కుతుకంబున దండకకాననంబునన్
దాము వసించి శూర్పణఖఁ దాచి ఖరాదుల రాచినారు నీ
వీమెయి నాకుఁ దోడ్పడితివేఁ బగఁ దీఱుతు వారి నోరుతున్. 174

వ. అనుడు మారీచుం డేచినభయంబున. 175

ఉ. చాలుఁ బురే సురారివర! సద్గుణధాముఁడు రాముఁ డెన్న నా
హేళికులప్రదీపకు నహీనపరాక్రమ మే నెఱుంగుదున్
బోలని పోక లేమిటికిఁ బొమ్ము పురారియు నేని తచ్ఛరో
ద్వేలజవంబు సైఁపఁ గల ధీరుఁ డొకో యని సంశయించెదన్.176

మ. అతఁడే నాదగుతాపసిత్వమున నైనట్టిండు ముద్ వానితోఁ
బ్రతిరోధించినదాన నా కిటులు సంప్రాప్తించె లక్షించి తే
ప్రతిపక్షుం డెవఁ డిట్లు నీకుఁ గలిపెన్ బాపంబు నీ వింక లో
బ్రతుకాశింతువ యేని యిత్తెఱఁగునన్ గాకుండుమా రావణా.177

వ. అనినంగ్రోధతామ్రాక్షుండై రాక్షసేశ్వరుండు మారీచుం జూచి
భర్త్సించుచు ని ట్లనియె. 178

క. నామాట వినవ యేనియు
నీమెయిఁ బ్రాణములతోడ నిలువదు నన్నున్
సామాన్యునట్లు లెంచితి
వేమో నాశౌర్యసార మీా వెఱుఁగ వొకో. 179

తే. అనుడు మారీచుఁ డుల్లమునందు వీని
చేఁ జెగుటకంటె రాఘవుచేతఁ జెగుట
మే లని తలంచి రావణుమ్రోల నిలిచి
యలుగ వల దేను నీయాజ్ఞ మెలఁగువాఁడ. 180

చ. హితమును గోరి చెప్పితి న దిష్టము గాక మఱొక్క రీతి నీ
మతి కగునేని నీదయినమార్గమునం బ్రచరింతు నేను నో

హితుండ! యింకం బోనర్హఁగు నెయ్యది నెయ్యము మీఱఁ జెప్పు మా
గతిఁ బోవరింతు నన్నుఁ గుతుకంబున నాతని కాతఁ డిట్లనున్. 181

ఆ. నీవు కనకమృగము వై పడిఁ జని సీత
మోహపెట్టు మామె మోసపోయి
పట్టి తేర నిన్నుఁ బనుచు రాము నతండు
పెద్దదవ్వు నిన్ను వెన్నుఁ దన్ను. 182

శా. ఆలోలత్వముఁ దొందుచో యెడ నుపాయంబుం బ్రతీక్షించి నీ
హేలం జూపుము దాన నోట యిసుమంతే లేక తత్పత్ని నా
పాలా లీల మెయిన్ గ్రహించుకొని పోవన్ వచ్చెడుం దాన దు
శ్శీలుండై విరహాగ్నిఁ బ్రమ్మ నరి నాచిత్తంబు శేకెత్తఁగన్. 183

తే. అని వచించిన మారీచుఁ డప్పుడు తనకుఁ
దాన శాపించుకొని తిలోదకము లిచ్చి
రావణుని వెంట నడచె నారాజవరుని
పర్ణశాలకు నొక్కింత ప్రాంతముగను. 184

వ. ఇట్లు నడచియచ్చట. 185

—♦మారీచుండు కనకమృగమై సీత కడఁ బొడసూపుట♦—

సీ. పదియాఱువన్నె మేల్ పసిడినిగ్గులసంచుఁ
గాదు కాదనిపించు కాయ మలరఁ
నడకెంజాయల రంజిల్లి దివి వెల్గు
చుక్కలనా మేనఁ జుక్క లమరఁ
బసిపచ్చతా హెచ్చు మిసిమికి నెనవచ్చు
కొనదేరి మెలిగొను కొమ్ము లెసఁగఁ
గొదమరత్నంబులఁ బొదలింపఁ బడు బాకు
ఠిళ్ళనా డెక్కలకాళ్లు దనర
తే. నీలములఁబోలు కన్నులు నెఱి దలిర్పఁ
బసుపునిగ్గులు గలమోర పస నెసంగ

నిలుకడలు లేని బెదరుచూపులు పొసంగ
నేచి మగలేడి యయ్యె మారీచుఁ డపుడు. 186

వ. ఇట్లు మారీచుండు మాయామృగం బై జనకభూపాలనందనపాలం
బొడచూపుటయును. 137

చ. రతనము లెల్లెడన్ నిలిపి రాజిలఁ జేసిన పైడిబొమ్మ నా
నతికుతుకంబుఁ గూర్చుచు విహార మొనర్చెడుమాయలేడి నం
చితగతిఁ గాంచి చెంగటను సీత మహీతలనేత కమ్మహా
ద్భుతమును జూపి యిట్లనియెఁ దోరపువేడుక లోఁదొలిల్లఁగన్. 188

తే. కనకమృగ మిద్ది యిట్టిది గలుగు ననుచుఁ
గనియు వినియు నెఱుంగ లోకమున నెందుఁ
బ్రాణవల్లభ! దీనిఁ బట్టి తేర
మనసు పుట్టెను గాన నామనవి కొనుము. 189

— ♦రాముఁడు మాయామృగంబు వెంట నంటి చనుట♦ —

వ. అని ప్రార్థించినఁ బ్రసన్నుం డై రామచంద్రుండు చంద్రవదన
ప్రియంబు దీర్ప సమకట్టి దేవీరక్షణార్థ మట సౌమిత్రి నునిచి
తాను ధనుర్బాణతూణీరఖడ్గాదిసాధనంబులు సంగ్రహించి మించిన
వేడ్కరుద్రుండు యజ్ఞమృగముం బోలె నమ్మాయామృగంబు
వెంట నంటి తఱుముచుం జనియె నదియును. 190

మ. బెదరున్ బెన్నడిఁ బాఱుఁ జేరు గడలన్ బిట్టాడు మట్టాడుఁ బెం
బొదలన్ డాయుఁ దృణాంబు మేయు దివి పైఁబొల్చున్ భువి న్నిల్చు లో
నాడఁగుం బైకెమ్మగున్ మనోహరముగా నూఁగాడుఁ దోఁగాడు నూ
ర్చుఁ దగం జేర్చుఁ గనుంగొనున్ ముదము వెంచు న్నించు ద్వేషమున్.

వ. ఇట్లామాయామృగంబు కొండొకవడి వ్యవహితంబును సన్నిహి
తంబును దిరోహితంబును దృశ్యంబు నదృశ్యంబు నై యవ్వనాంతరంబు
నం బరిభ్రమింప రామచంద్రుండు దాని వెంటనంటి పెద్దదవ్వు చని
చని కొంతవడకిఁ దనమనంబున. 192

తే. మృగము గా దిది రాక్షసమ్మృగముగాని
దీనిఁ బట్టెద మనునాస కాని యనుచు
నమ్ముగా నట్టియొక్కవాలమ్ము దిగిచి
యేసె మాయామృగంబుపై నీసుఁ జేసి. 193

తే. రామబాణాభిహతుఁడయి రాక్షసుండు
లాఁగి రామస్వరమున హా! లక్ష్మణా! యు
టనుచు హా! సీత! యనుచు మహార్తి నఱచి
ధరణిఁ బడి చచ్చె విలవిలఁ దన్నుకొనుచు. 194

తే. ఆయెలుఁగు సీత విని భీతయై సుమిత్రి
పుత్రునిం గని మీయన్న రాత్రిచరుల
నేనఁ దగిలెను నీ వేగి వనటఁ బాపు
మనుచుఁ గన్నీర్గ్రమునఁ దాను నరుగఁ జొచ్చె. 195

వ. సుమిత్రాసుతుం డామె వారించుచు ని ట్లనియె. 196

తే. ఏల శంకింతు భయశీలురాల! రాము
నెవఁడు పరిహరింప నోపు నీభువనమందు
నెంపమునఁ గుంద కిటు లూరడిల్లు మాతఁ
డింతలో వచ్చు నానంద మిచ్చు నీకు. 197

వ. అని చెప్పిన నప్పల్కుపుం బోఁడి పోఁడిమి గలదయ్యును స్త్రీస్వభావం బంజేసిబేలయై దుఃఖించుచునతిరూక్షరోషరసమన్వితంబుగ లక్ష్మణుం జూచి యి ట్లనియె. 198

చ. వలవదు నీదు కోర్కె యిది వమ్మగు నోరి జడాత్మ! నేను నా
తలఁ దెగఁగోసి కొందు నసిధార హుతాశను నందుఁ జొత్తు నీ
బలునగ మెక్కి క్రిందఁ బడి ప్రాణము వీడుదుఁ గాని రామునిం
దొలఁచి నిన్నుఁ బరింపఁ బులితో నెయ్యాలి నక్క వరింప నెంచునే 199

క. అని పలికినపరుషంబులు
తనచెవులం జూడినట్లు తాఁక సుమిత్రా

తనయుండు హరి! హరీ! యని
విన నొల్లక మూసికొనియె వీనుల నంతన్. 200

తే. కనఁగ నొల్లక మానిని ఘనభుజుండు
విల్లు నమ్ములు గైకొని వెడలి పోయె
నన్న పోయినమార్గంబు నపుడ పట్టి
దోసఁగు శంకించియును బల్కఁ దోప కపుడు 201

— రావణుఁడు మునివేషంబున సీతకుం బొడసూపుట —

సీ. కిసలయారుణసాంద్ర విస్ఫురదరజటా
పటలంబు సంజకెం పటుమెఱింపఁ
జరఠాభవలగ్నసుందరత రైణాజినాం
తరరుంద్ర కాలాభ్ర మిగుల నీన
హరిదంశుకాంశుసంకరవిరళాక్ష
మాలికోడుగణంబు లోలి వెలుఁగ
నతిశాంతరసలసదతులితాభిజ్ఞాన
చంద్రోదయవ్యాప్తి చదలఁ బొదల

తే. నాచరణశిరోంగ నిరంతలావలిప్త
కలితసితభూతి పండువెన్నెలలు గాయ
రాక్షసుల కెల్లఁ బ్రియ మైనరాత్రి యనఁగ
మాయ కిరవైన దశాస్యుఁడు మౌని యయ్యె. 202

వ. ఇట్లు యతివేషధరుండై రావణుండు సప్రగ గప్పినవిప్పవలె నొప్పుచు నప్పతివ్రతావతంసంబు నపహరింప నెంచి మింటఁబోఁడి కట్టెదుటం బొడకట్టుటయును. 203

క. నిక్కపుముని యని తలఁచుచు
నక్కోమలి వాని ఫలజలాదులఁ బూజల్
మక్కువఁ జేసిన నాతం
డొక్కింతయు దాని నొల్ల కొండొకలోనన్. 204

## —♦ రావణుఁడు సీతను హరించుట ♦—

మ. పదిశీర్షంబులు నిర్మలైనకనులున్ బాహాయుధాఢ్యంబు లి
ర్వది బాహార్గళముల్ దృఢం బగుపదద్వంద్వంబు రత్నాంచితాం
గదహారాదివిభూషణంబులు మెయిం గ్రాలన్ మనుష్యాదుఁడై
మదమాతంగము నాఁగ నొప్పి యతఁ డాకొమ్మ ప్రతితో ని ట్లనున్.

ఉ. రావణనామధేయుఁడను రాక్షసనాథుఁడ నేను మానినీ
నావరపత్తనం బది గనం దగు లంక యనం బ్రసిద్ధమై
జీవనరాశిమధ్యమున జీవమణీగణమందిరాంచితం
బై వసుపూర్ణమై వసుధయందుఁ బొసంగెడు స్వర్గమో యనన్.

మత్త. నాకువల్లభనై జగత్త్రయనాథకాంతలు గొల్వఁ గా
లోకసుందరి నై యే లోపముం గనఁబోక సు
శ్రీకమై తనుమత్స్వరంబునఁ జెల్వొసంగెడుచెల్వలం
దాఁక లేక సమస్తభోగము లందుచుండుము మెండుగన్. 207

క. నీపాదసేవ సేయుచుఁ
గాపురుషుఁడఁ గాక నేను గడుభక్తిమెయిన్
నీప్రాపుఁ దగిలి యుండుదు
నాపాలఁ బ్రసన్నవగుము నను రక్షింపన్. 208

క. పృథివియుఁ గళిమియు సిరులున్
విడి వ్యాఘ్రములచెలిమి యెపుడు విడువక యిట్టి
య్యాశ్రమమున నిశముఁ గుడిచెదు
జడదారులఁ బట్టియుంట చనునే సీతన్. 209

వ. అని పలికినఁ బలుకు లెల్ల ములుకులైన నలుకుచుం జెవులు మూసి
కొని జానకి వాని కిట్లనియె. 210

ఉ. అక్కట యిట్టులాడెదె కులాంగన నన్నిదె నింగి యంతయున్
దిక్కులతోడఁ గూలిన ధరిత్రి సపర్వతకాననంబుగా
ముక్కలు ముక్కలైనను సముద్రము లింకిన వీతిహోత్రుఁడున్
మిక్కిలి చల్లనైన నెలమిన్ విడి రాఘవు నీకు దాననే. 211

తరళము. మదకలంబును మాని ధేనుక మంటిపంటని నంటగా
నెదఁ దలంచునె దాఁటి తేనియ లెంచి క్రోలెడు శ్రేష్టి దా
నదటునం జని రేఁగుపూరస మానునే చరితాత్మ! నే
మదిఁ గలంగి నిను స్మరింతునె మాట లేటికిఁ బొమ్మికన్. 213

వ. అని క్రోధావేశంబున నధరం బదర బదరి పలికి కరంబులు విదిర్చి కొనుచు నాశ్రమాభ్యంతరమునకుం జనియె నంత రావణుండు నామె వెన్నుఁ దన్ని చని పరుషస్వరంబున భర్త్సించుటం జేసి మూర్ఛంబడి యున్న యయ్యన్నుమిన్నం బట్టుకొనం బోవునం తలో ననసూయాదత్తాంగరాగపరిభావంబున నామెయొడ లంటవలెనని కరంబులం గాల్చునట్టిదైన నతండు నచ్చుటి భూభాగంబు తోడం గూడఁ బెల్లగించి భుజంబుమీఁద బెట్టుకొని నెట్టన నుప్పరంబున కెగసె నప్పు డప్పడంతి లబ్ధసంజ్ఞయై యుచ్చస్వరంబున.

—♦ సీత మూర్ఛదేరి తనగతికి దుఃఖించుట ♦—

ఉ. హా! రఘురామ! హా! త్రిజగదంచితసుచరితకామ! హా మహో
దారగుణాభిరామ! యిదె దైత్యకులాధముఁ డొక్కరుండు నీ
దార ననుం గ్రహించుకొని దక్షిణమార్గముఁ బట్టి పోయెడిన్
గారుణికత్వ మేర్పడఁగఁ గ్రన్నన నన్ విడిపింప రాఁగదే. 214

వ. అని మఱియును. 215

సీ. వేల్పులారా! నేలఁదాల్పులారా! మీరు
నావెతల్ తెలుపరే నావిభునకు
సిద్ధులారా! సుప్రసిద్ధులారా! మీరు
నావెతల్ తెలుపరే నావిభునకు
యక్షులారా! కార్యదక్షులారా! మీరు
నావెతల్ తెలుపరే నావిభునకు
సాధ్యులారా! పరాసాధ్యులారా! మీరు
నావెతల్ తెలుపరే నావిభునకు

తే. తుషితులారా! జగత్త్రయహృషితులార!
విశ్వులారా! సురక్షితవిశ్వులార!
వసువులారా! మహాతపోవసువులార!
నావెతల్ మీరు దెలుపరే నావిభునకు. 216

ఉత్సాహము. అని యెలుంగు రాలుపడఁగ నద్ధరాత్మజాత యే
డ్చినఁ దదార్తరవము వినుచుఁ జెచ్చెఱన్ జటాయు వన్
ఘనుఁడు గృధ్రరాజనూరునందనుండు దశరథే
శునకు సఖుఁడు వచ్చి చూచె స్రుక్కియున్న జానకిన్. 217

వ. క్రోధమూర్ఛితాంతరంగుండై వనం బెల్ల మ్రార్మోయ గర్జించుచు
రాక్షసేశ్వరు దిక్కు మొగంబై. 218

చ. విడు విడు రాక్షసాధమ! పవిత్రచరిత్ర నరేంద్రపుత్రికన్
ముడి గొనిపోవుచుంటి వెట వోయెద వో యెద వేద నిల్వుమే
నొడలను బ్రాణముల్ గలిగియుంటినయే నినుఁ బోవ నిత్తునే
పుడసితి వంచుఁజెప్పితిని మానిని వీడక యున్న నింకిటన్. 219

వ. అని పలికి క్రోధతామ్రాక్షుండై. 220

—♦ జటాయువు రావణుతో ఘోరయుద్ధముచేసి కూలుట ♦—

సీ. పక్షచ్ఛదాక్షేప విక్షేపములచేత
నఖిలాస్త్రశస్త్రాళి నపహరించి
తుండదండాధికోద్దండ చండిమచేతఁ
దుండెము తుండెములుగాఁ జెండి వైచి
మఘవాస్త్రదృఢఖరనఖరాగ్రములచేత
రక్తప్రవాహంబు వ్యక్తపఱచి
యంఘ్రిప్రఘూర్ణ బాధాఘాతములచేత
దిమ్మదిరుగునట్లు ద్రెళ్ళ వేసి

తే. తెగకసవ్యాపసవ్యముల్ తిరిగి తిరిగి
పైకిఁ గ్రిందికిఁ బేరముల్ వాటి పాటి

వేర్చి యార్చుచుఁ బట్టి పల్లార్చి చేర్చి
చించి చెండాడె సురవైరిఁ జెన్ను దఱుగ. 221

మ. ఘసదంభోళిసదృశరూక్షతను ద[illegible] యోగ్ర[illegible]
డనఖాత్యంతవిదారితాంగుఁ డగుచుఁ రక్షోవిభుం డాక్షణం
బున భూరిక్షతజాంచితుం డ[illegible] తటోద్యత్తద్ధాతుప్రరా
గనిబద్ధోన్నత సిద్ధరావృతమహోగ్రావంబు [illegible]. 222

వ అప్పుడు జటాయువు రావణుం జీఱె. 223

చ. తొడిమికనుండి పండువలె ద్రొల్లిపడం బొనరించు శీర్షముల్
విడి వడి సోకు ముక్కున గడె వీగక పోరు మటంచు ముక్కుతోఁ
బొడిచెను బోటు లొక్కపది ముక్కలు చెక్కలు నై కిరీటముల్
పొడి పొడియై ధరం బడియె మోములఁ గాటుక నల్ల మొల్లమై.

తే. కోపఘూర్ణిత నేత్రుఁడై క్రూరదనుజుఁ
డొక్కపది బాణములు జటాయువుశిరంబు
పైఁ బడఁగ లాగి వైచె నప్పక్షివానిఁ
గాళ్లతోఁ జెండి పడవైచెఁ గార్ముకంబు. 225

ఉ. వేఱొకచాప మెత్తుకొని వీరవరేణ్యుఁడు రావణుం డొగిన్
సూఱులు వేయి లక్షలుగ నూత్నశిలీముఖముల్ పతత్త్రిపైఁ
బాఱఁగ నేయుఁడున్ బతగవల్లభుఁ డెల్ల నిమేషమాత్రలోఁ
జీటిచి వైచెఁ గాళ్ళలను జిందఱవందఱలై ధరం బడన్. 226

తే. కాంచనోరశ్ఛదంబులు ఖరము లైన
ఖరములుం గూర్చి దివ్యము కామగంబు
నైన రథమును సారథి నట్టితునిమోఁ
దుండదండాగ్రమునఁ జేసి యండజపతి. 227

శా. ఆలో సీత గ్రహించి పోవ సమరేంద్రారాతి కడ్డై ఖలుం
డా! లంకాపురి కేగుచుంటివి యమ[illegible]
పోలం దెర్చిరి యేగు దచ్చటికిఁ బో పో వస్త్రంచు నొక్కుమ్మడిన్
వ్రాలెన్ వానిపయిన్ మహీధరము పై పై వ్రాలుచందంబునన్.

చ. శిరములమీఁద నెక్కి కొని చేటగునట్టులు మొట్టెఁ గొట్టుచున్
జరణయుగంబుఁ గొప్పలను జర్జరితం బగునట్లు మెట్టుచున్
బరిపరి తెక్కడోయి వదనంబుల నేయుచుఁ బక్షి యొప్పెఁ బెన్
ద్విరదము నెక్కి నెత్తి పయిఁ బ్రేటులు వేసెడు మావటీఁ డనన్.

వ. ఇట్లు ప్రహారింపంబడి రావణుండు. 2 0

ఆ. ప్రళయకాలరుద్రు పగిదిఁ గ్రోధపరిపూర్ణ
మానమానసుఁ డయి పూని ఖడ్గ
మండజేంద్రుగఱులు ఖండించె నాతఁడు
పవిహతాద్రి వోలెఁ బడియెఁ గ్రింద. 231

ఆ. పడినవానిఁ జూచి పుడమికన్నియ కంట
నీరు వెట్టుకొనుచు నోరి! తండ్రి!
నాకుఁ గాను బోరి లోకవిద్రావణు
తోడఁ గూలి తకట! తోడుసేడ. 232

— రావణుఁడు సీతం గ్రహించి లంక కరుగుట —

సీ. ఇటు జటాయువుఁ డెగ నేసి రావణుఁ డూర్ధ్వ
గతి సీతఁ గొనిపోయె నతిరయమున
జనునప్పు డందందుఁ గని సాధ్వి నదులాశ్ర
మములు కొలంకులు మార్గమందుఁ
దనభూషలం దీసి ధరఁ బడ విడుచుచు
దిక్కెవ్వగను లేక పొక్కిపడుచు
నొకకొండనెత్తమం దున్నయేవురువాన
రశ్రేష్ఠులం గాంచి రమణ మించి

తే. శేషభూషణముల నూడ్చి చేలచెఱఁగు
నందు బంధించి పడవైచె నదియు వాయు
వశమునం జేసి వడియె నవ్వారినడుమ
వారిదమునందు మెఱుఁగు దీవ వలె నపుడు. 233

సీ. రావణుఁ డారీతి రామపత్నిం గొని
యాకసంబున కేఁగు నపుడు సర్వ
జగ మమర్యాదమై చనెఁ దమోవృత మయ్యె
వాయువు స్తంభించె వనధి కలఁగె
మాసె నభోమణి మహి నెల్లవృక్షముల్
మాడినవో యన వాడి పోయె
బాష్పముల్ విడుచుచు వనమృగంబులు సీత
ఛాయ ననుసరించి చనఁగఁ జొచ్చె

తే. దండకారణ్యవాసులు తపసు లెల్ల
డెందమున మోదఖేదముల్ పొంద నైరి
దివ్యచక్షువునం గని దేవత లట
జరుగఁ దగినట్లు కార్యంబు జరిగె ననిరి. 234

వ. అట్లు జానకీదేవిం గొని గగనమార్గంబున నిర్గమించుచున్న సమ
యంబున సాధ్వసంబును శోకంబును మనంబునం బెనఁగొన నామె
రావణున కిట్లనియె. 235

—♦ మార్గమధ్యమున సీత రావణుని గర్హించుట ♦—

చ. తెలిపినయింటఁ గుక్క పడి దివ్యపదార్థము ముట్టినట్లు లే
డైలఁ జనునావిభుం డితరదిక్కున కేగినయప్పు డొంటినే
నలిమిలి నున్నయప్డు గొన నైతివి దొంగ తెఱంగు దోఁపఁ గా
మొలకవునిన్నుఁ బోల్ ఖలులు మూడుజగంబుల లేరు చూడఁగన్.

సీ. జగదేకవీరునిదగుసొమ్ము గొని పోవు
పాటచ్చరుండ వై పఱచుచుంటి
బిరుదుమగఁడ నందు పిఱికిపందవు నీవు
కలన రామభయంబు గలదుగానఁ
దెలివకాడవ యయి పఱచుచుంటివి నిన్ను
నడిమికిం జీల్పఁడే నావిభుండు

నిమిషమాత్రంబట నిలిచియుంటివ యేని
సీతల లన్నియు భూతి కగును

తే. ఖరుండు సూషణుఁడుం దొట్టి క్రవ్యభుజులు
పదియు నాలుగు వేగు రే పగిది మట్టిఁ
గలసిపోయిరొ తెలియ దోకలుషచిత్త
రాముని ప్రభావ మిట్టిది రాజ నాత్మ. 237

సీ. కాలపాశము నీదుకంఠమునం జుట్టి
కొనియుండె మిత్తినిఁ గూడి యుండె
రుధిరౌఘరుద్ధము పృథువైతరణిఁ జొత్తు
వసిపత్రవనము నీ చరయు దిపుడ
...నుపముం ...సు నింకి కనుఁగొనంభయ మగు
శాల్మలిం జూతువు క్షణము లోన
మసమసమసలుచు వెస జంతువులఁ బాక
మొనరించు కుంభినిఁ గనుదు విరిగొ

తే. నీదుశౌర్యము ధైర్యము నీదువిభుత
యేమి యయిపోవునో యిపు డేల చెప్ప
క్షణము నిలు మోరి శ్రీరామచంద్రమూర్తి
దర్శనం బైన మాత్ర నంతయు లభించు. 238

—♦ రావణుఁడు సీత నశోకవనంబున నిల్పుట ♦—

వ అని యనేకవిధంబుల నదురుబెదరు లేనిమానసంబునం దెగడిపోయు చుండె రావణుండును రామపత్నీసమేతుండై సరభసంబుగ సముద్రంబు దాఁటి బహుద్వారగోపురప్రాకార వప్రప్రాసాదభాసురంబును విశ్వకర్మనిర్మితంబును మనోహరంబునగు లంకాపురంబునకుం జని నిజాంతఃపురంబున నిలుపక సీత నశోకవనంబునం దలిదివ్యభవనంబున నిలువం జేసి త్రిజటాది రాక్షసాంగనలఁ బెక్కురం బిలిచి మీ రీమె నన్నపానాదుల నెపుడు నేమఱిపాటు లేక కాపాడుఁ డీమె కేమికావలయు నవి యన్నియుం దెచ్చి యిచ్చుచు నేయుకట్టులు

గలుగకుండ రాజోపచారాపచితులంజేసి పరదేవతం బలెనెంచి
సేవించుచుండ వలయు నని యుపన్యసంబు వెట్టి సభాస్థలంబు
నకుంజని మంత్రాలోచనంబు చేసి 239

తరువోజ. ఎనమండ్రరాక్షసవృషభులఁ బిల్చి
యీరుజనస్థానధారణి కేగి
మును ఖరుం డున్నట్టిపోలముననుండి
పురుషాదులకు మేలుపొనరెడునట్లు
కనుగొనుచుండుఁడు ఖరు నోర్చినట్టి
కష్టునిఁ గనిపెట్టి ఘనపాశములను
కనుకనిన్ బంధించి కైకొని రండు
ఘనగౌరవము మీకుఁ గలుగు నాపట్ల. 240

వ. అని నియోగించి యంపిపుచ్చి తా నంతఃపురంబునకుం జనియె.
నంత రామభద్రుండు మాయామృగంబు నట్లు మడియించి మరలి
వచ్చువాఁ డెదురపడినతమ్మునింగని యుదరిపడి యిట్లనియె. 241

—♦ రాముఁడు లక్ష్మణునితో సీతాదేవిని వెదకుట ♦—

ఉ. తమ్ముఁడ! తప్పు చేసితివి దారుణ మైనవనాంతరమ్మునం
దెమ్మెయిఁ జూతు మన్న భయమే కనిపించెడు నిట్టిచో విచా
ర మ్మది లేక మీవదిన రక్కసిపాల్పడ నొంటి డించి నీ
విమ్మహి కేల వచ్చితి విఁకేమను వాఁడ విధాతచెయ్దికిన్. 242

క. రక్కసునిమాయ నే నిటు
మిక్కిలి ద వ్వైతి నీవు మీఁ దెఱుఁగక యీ
చక్కి విడి వచ్చి తాసతి
దిక్కది యేమగునొ నాకు దిగు ల య్యె నయో. 243

క. వెడక న్నదరెడిఁ జెంతన్
వడి దిగులుం వొడముగవమున వరడులు కూయున్
విడిచెడి మృగములు కన్నీ
రెడఁ గంపము నొందె సీత యే మయ్యె నొకో. 244

తే. అనుచు వడివడి నడచెదు నన్న నరసి
సీత గన్గొంచి పలుకుట చెప్పి తప్పు
సైపు మనుటయు శ్రీరామచంద్రుఁ డరిగె
నడలు గుందుచు నాశ్రమప్రాంతమునకు. 245

తే. ఉసురు పోయినయట్టు వ్రాలె నుపిదఁ బాసి
శూన్యమై యున్నయుటజంబుఁ జూచి మూర్ఛ
మునిఁగి రాముఁడు సౌమిత్రిమూలమునను
సేదఁ దేరెఁ గొండొకవడి కాదరమున.

సీ. ఆకుటింటం గలయన్ని మూలలు చూచి 246
వెలుపల లోపల వెదకి వెదకి
పూలుఁ బండ్లుం దేరఁ బోయెనో యని చుట్టు
ప్రక్కలఁ గలచోట్లుపరఁగఁ జూచి
జలకమాడఁగఁ దమ్మికొలఁకున కరిగెనో
యని తాను దమ్ముఁడు నచటికేగి
మునిపత్నులం గనఁ బోయినదో యని
ప్రత్యుటజంబును బట్టి యరసి

తే. పర్ణశాలాంతరంబునఁ బడి చెదరిన
దర్భలం గాంచి నేలను ద్రవ్వి గడ్డఁ
గెల్లగించినచోటు నక్కెనవిఁ గాంచి
యేమి తోఁపనివాఁ డయ్యె నినకులుఁడు. 247

క. ప్రబుసి చూచి వేఁడో రక్కసి
రసిమై చనుదెంచి పూజ రోయుచు సీతం
గసిమసఁగి త్రవ్వి కొనిచనె
బసుమ ముగుదు నాఁట నన్నెకు భయమున నయ్యో. 248

—♦ రాముఁడు సీతం గంటిరా యని వృక్షాదులనడుగుట ♦—

వ. ఇట్లు పలవించుచు రామలక్ష్మణు లిరువురుం గదలి యందు నందు సీతాన్వేషణంబు సేయుచు రఘురాముండు.

సీ. వనములారా! మహానిధనములారా! మీరు
శ్రీరామపత్ని వీక్షించినారె
గట్టులారా! పుట్టచెట్టులారా! మీరు
జనకరాణ్ణందనఁ గనినవారె
మృగములారా! మహాఖగములారా! మీరు
రాచకూఁతుర్ సీతఁ జూచినారె
సరములారా! శివంకరములారా! మీరు
క్ష్మాజాతఁ జానకిం గాంచినారె
తే. సోకుదయ్యములార! సుశ్లోకులార!
వేల్పులారా! జగంబులఁ దాల్పులార!
మానులారా! తపోమానులార!
నామనోనాయకిం జూచినారె మీరు. 250

వ. అప్పుడు. 251

శా. ఆకాశంబున నార్పు లుప్పతిల సీతానందప్రభూతావళుల్
శోకం బేర్పడునట్లు కన్నులను నీళ్లల్ గార మో మెత్తి పై
వాకో నొప్పెడుసత్త్వముల్ యమదిశాభాగంబు సూచించుచున్
వీకం బాఱఁగఁ జొచ్చె నేడ్పు లెలుఁగుల్ వీక్షింపఁగాఁ జేయుచున్.

తే. అపుడు సౌమిత్రి కని యన్న కనియె నిట్లు
ఖగములు మృగంబులును మనగతిఁ వగచి
తెలుపుచున్నవి జానకీదేవి దక్షి
ణముగఁ గొంపోవఁ బడె బంధకమున ననుచు. 253

వ. అని చెప్పిన రామచంద్రుండు మృగాదులకుం దన పైఁ గలయనురాగంబున కౌ నని ప్రశంసించుచు మఱియు నగపడినవానినెల్ల నడిగికొనుచు నడలు గుడుచుచు దక్షిణమార్గంబు వట్టి పోయి పోయి ముందఱ. 254

—♦ రాముఁడు ప్రస్రవణాద్రికడ సీతదాల్చినపూలంజూచుట ♦—

ఉ. ప్రస్రవణాద్రిచేరువను రాలినపూవులు నేలమీఁద సా
హాస్రము లుంటఁ జూచి నృపుఁ డయ్యనుజుం గనియిట్లు ప్రాప్య సా

ఘుస్రిమునందు నేఁ జిదిమి చేకొని వచ్చి మహీజ కిచ్చితిన్
సుస్రిజముల్ హసన్ముఖని సొంపుగఁ దాలిచె నామె వీనినిన్.

క. అని ప్రస్రవణాద్రిం గని
వనితామణి యిటకు నెట్లు వచ్చె నె ఱిఁగన్
కని యుంటివేని తెలుపుమి
యని మిన్నుల న్వేఁడుకొనియె నాతురపడుచున్. 256

క. అని వేఁడి ఫలము గానక
నను నూరడఁబుచ్చి జనకనందన యిదె కొ
మ్మని యేఁడు తెచ్చి యీయఁడు
తునుమాడెద నెల్లజనుల దోర్బలశక్తిన్. 257

వ. అని కినుకం బూని మానధనుండు కోదండంబు పూని గొనయం
బునఁ గనయం బెక్కించినంత. 258

మ. ధరణీచక్రము దిద్దిరన్ దిరిగెఁ బాతాళంబు భేదిల్లె ది
క్కరులు క్రొమ్మగ్గె ననంతుఁడుం బడియెఁ జిక్కుల్ రాలె భూమీధ్రముల్
విరిగె న్విష్ణుపదంబు వ్రీలి పగిలెన్ వేవెల్గు రేవెల్గునుం
దిర మేగం గతి దప్పి రెల్లకడలం దీపించెఁ ఝంఝాకటుల్. 259

వ. అప్పుడు లక్ష్మణుం డన్న ననునయించుచు నన్నా! సర్వలోకరక్షా
దక్షుండ వగునీ విట్లు కారణంబుగ భూతవిద్రోహంబు గావించుటకుం
గడంగుట న్యాయ్యపథంబు గాదు సీతాపహర్త యగువాని నన్వే
షించి సంహరింత మది పొసంగఁ జేయ వలసినదంతయుం జేసి పుత్త
మిపు డీజగం బనుగ్రహపాత్రంబు గాని నిగ్రహపాత్రంబు గా దెంత
వారి కైన శుభాశుభకర్మం బనుభోక్తవ్యం బాకర్ణింపుము. 260

సీ. నహుషపుత్త్రుం డయి నలువొందినయయాతి
నాకవిభ్రష్టుఁ డై శోకమందె
మనగురుం డగువసిష్ఠుని నూర్వురు కొమాళ్లు
గాధేయనిహతులై గం డడఁగిరి
రేఁబళ్లను జేయుఱేండ్లును సైతము
గ్రహణముల్ స్వర్భానుగతులఁ గొండ్రు

కొన్నివే ల్వ్యర్థము లెన్న దేవేంద్రుఁడు
తామరతూఁటిలోఁ దాఁగ నయ్యె
తే. సర్వము భరించుభూమికిఁ జలన మగును
నలుఁడు మాంధాత లోనగునాథులకును
నాథు లయ్యె సమస్తము నతనియాజ్ఞ
నడచుచుండును దీనికి నడలు లేల?. 261

వ. అనిన రాముం డనుజవాక్యంబు లాదరించి శాంతుండై కాంతాన్వేషణంబు గావించుచు నిందు నందుఁ బరిభ్రమించుచు నొక్కచో లక్ష్మణుం గాంచి యుంగుళినిర్దేశంబు చేయుచు. 262

—♦ రామలక్ష్మణులు రావణ జటాయువులుపోరిన చోటుజూచుట ♦—

సీ. కాలిజాడలు కొన్ని కాన్పించెడి నదిగో
చిన్నజాడలు మనసీతవ యగుఁ
బెద్దజాడలు వేఁడో పెద్దరక్కసునివై
నట్లు తోఁచెడి నదె యవ్వలిదెస
తునిఁగి యుండినవిల్లు తుము రైనపొదులును
విఱిగినరథమును శరచయంబు
తెగి పడ్డసారథి తిలలంతలై త్రెళ్ళి
పడినరథ్యములును బాహుపురులు
తే. ముక్క లైనట్టిమకుటముల్ చెక్క లైన
చేతులును గల్గి మిక్కిలి భీతి గొలుపు
నట్టిదె నెత్తురవఱదలు మట్టుమీఱె
నంతయు గతార్థ మయ్యె నేమందు నయ్యొ. 263

ఆ. కాంచి లక్ష్మణుండు కైమోడ్చి యి ట్లను
భ్రాంతిఁ జిక్క వలదు రామచంద్ర
శూరు లెవరొ కాని పోరాడి రిచ్చటఁ
గనుము తద్విధంబు కన్ను సాచి. 264

సీ. మణియుంబును స్వర్ణమయ మగునీవిల్లు
బాలభాస్కరునితోఁ బోలి యుండె
బంగారు కవచము రంగారుఁ దపనీయ
దండాతపత్రము తళుకులీను

ఖరవాహనశవంబు లరయ వచ్చెడుఁ దేరు
స్వర్ణనిర్మిత మిదె సాలువడియె
నిలిచినవా రదే నిలిచిన ట్లయి చామ
రగ్రాహు లిద్ద ఱారయఁగ నైరి
తే. ఏరొకో గాని యూహింప నేర మిచట
ఘోరయుద్ధము చేసిరి కొంతలోనఁ
దెలియ వచ్చెడి మనకును దెలిసికొంద
మనుచుఁ జేరఁగ వచ్చెదు నంతలోన 265

—♦ రాఘవులు జటాయువునకు నుత్తరక్రియ లొనర్చుట ♦—

తరువోజ. వెసఁ గొండ వలెఁ గూలి భీషణాకృతినిఁ
బృథివిపయిం బడి వెట్టూర్చువానిఁ
గని గృధ్రరాజు రాక్షసుం డంచు నెంచి
ఘనభుజు లస్త్రముల్ గైకొని డాయఁ
జనుటయు నతఁ డేదశరథసఖుండ
సంపాతితమ్ముఁడఁ జను న న్నెఱుంగ
నన వారు పితృనామ మాలించి వీని
నరయుద మని చెంత కరిగి రాకింత. 266
వ. అంత జటాయువు వారిం జూచి తనవృత్తాంత మంతయుం జెప్పె.
తే. రావణుఁడు సీతఁ జెఱగొని పోవుటయును
దారిఁ దా నడ్డువడి వానిఁ దగులుటయును
దనదు గఱిదోయి నాతండు తఱుగుటయును
నించు కించుక గా విన్నవించుటయును. 268

క. ఆదశరథరాముఁడు కడు
నాదరముగ వానిఁ జూచి జానకిఁ గొని వాఁ
డేదెసకు నేగె ననుడున్
రా దని నోర్ దెలిపెఁ దా శిరఃకంపమునన్. 269
వ. అట్లు సూచించి జటాయువు విగతాయు వగుటయు రామలక్ష్మణు లింగితజ్ఞు లగుటం జేసి యది దక్షిణం బని యెఱింగి పితృసఖుం డగు వానికిఁ బితృమేధవిధానంబున నగ్నిసంస్కారాద్యౌర్ధ్వదైహికం

బంతయు నాచరించి దక్షిణపశ్చిమమార్గంబు పట్టి తరలి జనస్థానంబు
దాఁటి మూఁడుక్రోశంబులు నడచి క్రౌంచారణ్యంబుఁ జొచ్చిరదియును.

—♦ క్రౌంచారణ్య వర్ణనము ♦—

సీ. మిట్టపల్లంబులు చెట్టులు చేమలు
జాల్ అప్పలుం గల్గి రాయిడి కయి
యెప్పుడుం గని విని యెఱుఁగని సర్పము
లగ్గికిం దగ్గనియట్టి తేళ్ళు
సింహశార్దూలముల్ దంహగతి మెలఁగ
నెట్టివారికి భీతి పుట్టఁ జేయు
చిక్కనివృక్షముల్ క్షితిధరంబులు గల్గి
నేఁకు నింగికిం జాలికొనిదొ

తే. అట్టి క్రౌంచవనంబున నన్నదమ్ము
లట్టు నిట్టును మెట్టుచు నరుగుచుండ
నచటఁ బాతాళ మట్లు లోఁ దైనయొక్క
కొండగుహ గానవచ్చె రాకొమరులకును. 271

—♦ లక్ష్మణుఁడు ఘోరరాక్షసి ముక్కు చెవులు గోయుట ♦—

తరళము. అతిభయంకర మైనయగ్గుహయందు నుండి కనుంగొనన్
మతికి నేవ జనింపఁ జేయునమంగళాంగము కొండకున్
బ్రతి యనం దగు పెద్ద బొజ్జయుఁ బాఱలంత లురోజముల్
క్షితిధరంబులఁ జీల్చుకోఱలుఁ జిట్టి జుంజురు వెండ్రుకల్. 272

తే. బండి కందెనఁ బోలిన పాడుమేను
గలిగి వికృతస్వరూపము గానిపింపఁ
దల విరియఁ బోసికొని యొక్క దైత్యకాంత
యరయ నయ్యో నయోముఖి యనెడునద్ది. 273

తే. లక్ష్మణునిఁ గాంచి యోహోరి! లావు గలుగు
దీడు జో డైనవారము యీవు నేను
మదనకదనం బొనర్తము మాఱు లేని
గతుల రమ్మని వడి వచ్చి కరము వట్టె. 274

వ. లక్ష్మణుండును. 275

క. ముక్కును జెవులుం జన్నులు
చెక్కి యతం డింతలోన శితఖడ్గమునన్
మిక్కిలిచక్కనిదానవు
నిక్కముగా నీవు రతివ నిను మెత్తు రిలన్. 276

వ. అట్లు నికృత్తనాసాకర్ణస్తనియై రాక్షసాంగన గుహాగేహంబులు మాఱుమ్రోయ నేడ్చుచు రక్తసిక్తాంగియై యాక్రోశించుచుం బోయె నంత రామలక్ష్మణులును నను క్రమంబుగాఁ గదలిపోవుచుఁ దమసానవీప్రాంతికాంతారంబున సంచరించుచు దవానలంబు దఱికొన్న చందంబున వెఱచఱచి పఱచుమృగయూధంబులకోలాహల రవంబు శ్రవణకఠోరంబై తోఁచునంతలో నెట్టయెదుట. 277

—♦ రామలక్ష్మణులు కబంధుని చేతులునఱకుట ♦—

శా. కొండం బోనిమహోన్నతాంగము మహాఘోరస్వరూపంబు ను
ద్దండోరస్థలసంస్థితాక్షులు సమిద్ధస్కంధయుక్తంబు ప్ర
హ్మాండోద్యప్పృథులోదరాంతరమునం దాస్యంబునుం గల్గి రు
ద్రుండై మండుచు నుండఁ గాంచిరి కబంధున్ బద్ధదుర్గంధునిన్. 278

ఆ. వాఁడు దావవహ్ని వలె వచ్చి యాదృచ్ఛి
కముగ నూర్మి కేశు కరముఁ బట్టెఁ
బట్టి విపాసిభ్రమితాంగుఁడై యుర్వీరుఁ
డన్నమొగముఁ జూచి యనిరొ నిట్లు. 279

తే. బ్రహ్మపట్టెది నాకు నీపట్టు తప్ప
కొనెడుసామర్థ్య మింతయేఁ కుదురఁ బోదు
బెండువడితిని గొండనా వీఁ డెసంగు
నేమిసేయుదు నెట సొత్తు నేది దిక్కు. 280

మ. కనుగొంటే యిటు దైవసంఘటన మోకాకుత్స్యవంశాగ్రణీ
ప్రణుతింపం దగునీకు నాపదలె సంప్రాప్తించుచుండెన్ గటా
మును రాజ్యచ్యుతి తాతపాదనిధనంబుం గాననావాసమున్
జనకక్ష్మావరకన్యకాహరణమున్ నా కిప్పు డిప్పాటునన్. 281

వ. అని వాఁటియును. 282

చం. జనకజతోడఁ గూడుకొని సాధుజనస్తుతవైభవంబునన్
దనర నయోధ్య కేగి వినుతంబుగ భూవలయాధిరాజ్యమున్
గొని యభిషిక్తుఁ డైననినుఁ గోరికలీరక తెత్త సార్వభౌ
ష్పనిభృతదృష్టులం గనెడు భాగ్యము వీనికి లేక పోయెగా. 283

మ. కుశలున్ జలాలునున్ శమీదళములున్ గూడం గుబాళించుస
త్కలశపూరంబుల రాజుగాఁగ నభిషిక్తుండై ప్రకాశించునీ
విశదాస్యంబు ఘనావరోధమునకు స్వీయైనకే నెల్లు నా
యశ మొందన్ గనువారు ధన్యతములై [illegible]

వ. అని పలు దెఱంగులం బలవించు తమ్మునిం గని రామదేవుఁడు సంభ్రమసమయంబునందును సంభ్రమింపని చిత్తంబు గల ధీరోదాత్తుండు గావునఁ దత్తరంపడ కిట్లనియె. 285

తే. అన్న యోడకు మన్న నే నున్న వాఁడ
నిటను చూడు మటంచుఁ బ్రస్ఫుటము గాఁగఁ
బలికి శితఖడ్గమున వాని వామభుజము
నఱికి దక్షిణభుజ మీవు నఱకు మనియె. 286

వ. అనుడు లక్ష్మణుండును స్వర్భానుముఖవిముక్తుం డగుశీతభానుండో యనఁ గబంధభుజబంధనిర్గతుండై నిజాక్షదక్షాక్షేయకంబున రాక్షసునిదక్షిణభుజంబు [illegible] చటం జేసిగతాయువై కబంధుండు నేలం గూలె నంత వాని దేహాంతరంబునుండి సూర్యాగ్నిసదృశదేహుం డగు నొక్క దివ్యపురుషుండు పొడకట్టి నెట్టన నభంబునకు నెగయుచుండ రఘుకులతిలకుండు 287

—♦ కబంధుఁడు తనవృత్తాంతము చెప్పుట ♦—

క. కని వాని నీ వెవండవు
మనమున నాశ్చర్య మయ్యె మాకు నెఱుఁగన్
వినిపింపు మనుడు నాతఁడు
వినుతించుచు వాని కనియె విశ్రుతభణితిన్. 288

సీ. సీతామనోహర! శ్రీరామ! నీకు న
మోవాక మొనరింతు నావచనము

విను మేను వొల్లి చక్కనిరూపమున నుండి
పరిహాసించితి స్థూలశిరుఁ డనుముని
నతఁడునన్ శపియించె నలిగి రాక్షసుఁడవై
పొ మ్మంచు నే నంత మునిని వేఁడఁ
గరుణించి రఘురాముఁ డరుదెంచి వనికి నీ
చేతులు ద్రుంచి నిన్ జిదుమురాఁడు
తే. శాపమోక్ష మయ్యెడు నంచుఁ జనియె నేను
దేవి! దనుకులంబున శ్రీయను పేరనొప్పు
వానికిం బుట్టి ఘోరతపం బొనర్చి
నలినసంభవు మెప్పించి నాఁడ నంత. 289
వ. అతఁడు ప్రత్యక్షంబై ఘోరరూపుండ నగునాకు దీర్ఘాయువొసంగె
నేనును వరగర్వంబునం జేసి నావంశశత్రు వగునింద్రునిమీఁదికిం
దాడివోయినంత నింద్రుండును. 290
తే. వజ్ర మడరించి నాపయి వడిని జూపె
దానఁ దొడలును దలయును ద్రదయమున
నుదరమునఁ దొచ్చె నంత నే నుక్క దక్కి
చంపు మని వేఁడితిని వేఁడఁ జంప కతఁడు. 291
వ. ఓరీ! బ్రహ్మవరంబు కలదు కావున నీ కిప్పుడు చావు రాదు నీకు
నోరును నేత్రంబులును వక్షంబునందె యుండు నీచేతు లేకయో
జనదూరంబునం గలసర్వసత్త్వంబులం బట్టికొన సమర్థంబు లగు
నని పలికిన నేనును. 292
సీ. ఇట్టివ్వనంబున నే యుండి నలుగడ
నొకయోజనంబులో నుండునట్టి
పులుల సింగంబుల నెలుఁగుల నేన్గుల
నెల్లమృగంబుల నెగిచి పట్టి
తినుచుందు మునివాక్యమున జేసి నాకేలు
దునఁగ దెగ నేయఁ గాఁ దగినవాఁడు
చిక్కునో యని లోనఁ జేయుచుందు విచార
మీనాఁటి కీవు నామానసాధి

చే. తీర్చునట్టేడ నైతి వోగేవదేవ!
యీవు శ్రీరామచంద్రుఁడ వే నెఱుఁగుదు
లక్ష్మణుఁడితండు జానకి లక్ష్మి వెదకు
నట్టిరై వచ్చితిరి నన్ గృతార్థుఁ జేయ. 293

క. నావుడు రాఘవుఁ డనునో
దేవప్రియ! నాదుకాంత దేవరిపుం డా
రావణుఁడు గొంచుఁ బోవుట
లే విని యంటిసి జటాయు వెఱింగించుటచేన్. 294

—♦ కబంధుఁడు సుగ్రీవుని సంగతిచెప్పుట ♦—

చ. అనుడుఁ గబంధుఁ డి ట్లనియె నాసురవైరి నెఱుంగనే నకై
నను వచియింతు మార్గము వినం దలపోయు మొకింతదప్పనన్
దనరును బుశ్యమూక మనుధాత్రిధరం బటఁ బంపనా సర
స్సు నట వనేచరేశ్వరుఁడు సూర్యసుతుం డగు దానుమంత్రులున్.

శా. సుగ్రీవుం డనుపేరివాఁ డతఁడు సంశుద్ధస్వభావుండు సా
ధుగ్రాహ్యాత్మచరిత్రుఁ డుత్తముఁడు మంత్రుల్ నల్వురుంగూడ గో
త్రాగ్రంబందు వసించు నన్నభయ మత్యంతంబు గా నుంట నీ
వాగ్రావంబున కేగి సఖ్యమును జేయం జెల్లు నవ్వానితోన్. 296

ఆ. అన్న వాలిభీతి నాతఁడు భూతలం
బెల్లఁ జూచి యుండె నిపుడు సీత
యెందు నున్న నెఱిఁగి యింతలోననె తెచ్చి
నీకు నిచ్చు దేవ లోక మెన్న. 297

సీ. అదిగో నేరేళ్లలో నగుదారి చన నింత
గలదు నందనమనఁ గలుగువనము
దాని దాఁటినయంతలోనె పంపాసరో
వర మొందు గన వచ్చు వరద మగుచుఁ
బరమహంసలసింధు పరికింపనై మీకు
వీనులపొందు గావించు రుతము
కమ్మని తెమ్మెరల్ కడు మందమందము
గా వీచు చుండు నాతావులందు

తే. నట మతంగమహాముని యధివసించి
తాను శిష్యులు మున్నెంత యేని తపముఁ
జేయుచుండెడి వారి పొద్ధ పాయకుండు
శబరి నాఁబడునొక వృద్ధశబరకాంత. 298

సీ. పంపపశ్చిమమునఁ బరఁగును ఋష్యమూ
కము మతంగాశ్రమసముచితంబు
తచ్ఛిఖరంబునఁ దగఁ బండి కలఁ గన్నఁ
గన్నయట్టులు సిద్ధి గాన వచ్చు
సమ్మతంగునియాజ్ఞ నటకు దురాత్ములు
రా నోడుదురు దానిప్రక్క నొక్క
బిల మగు దానిలోపల హ్రిదం బొకఁ డొప్పు
నావలంకునను సుగ్రీవుఁ డుండు
తే. అప్పుడు నప్పంపు పర్వతమందు మెలఁగు
నని కబంధుఁడు వచియించి ఘనులు రామ
లక్ష్మణులయాజ్ఞ వడసి సులక్షణాన్వి
తాకృతిం గొని మింటికి నరిగె నంత. 299

—♦ రామలక్ష్మణులు శబరినను గ్రహించుట ♦—

వ. రామలక్ష్మణులును గబంధకళేబరమున కగ్నిసంస్కారంబు గావించి తదుక్తమార్గంబు వట్టి చని శబరి యాశ్రమంబు జేరిరంతశబరియుఁ

ఉ. యోగబలాతిసిద్ధి గొనియుండిన దాట నెఱింగి వారలఁ
వేగమె లేచి యేగి రఘువీరుల కాళుల వ్రాలి భక్తిసం
యోగముఁ జేసి తెచ్చి తనయున్కికి నర్ఘ్యము పాద్య మిచ్చి చే
తోగతి భక్తితత్పరతతో భజియించుచు నుండె నంతటన్. 301

ఉ. రాముఁడు నామెఁ గాంచి మునిరాజులసత్కృప నీతపంబు ని
ష్కామగతిం వెలింగెడినె ఘాతుకవిఘ్నము లెవ్వియేనియున్
నీమెయివ్రాలకుండెడినె నీ కెపుడెప్పుడు గాని కష్టమే
దే మొలకెత్తి యుండదుకదే యెఱిఁగింపు మహాతపస్విని. 302

ఆ. అనిన శబరి యనియె ననఘ! నీదర్శన
మునను సకలకలుషములు హరించె

నాతపంబు పండె నాగురువర్యులుఁ
బూజ్యులైరి నిన్నుఁ బొగడుకొనుట. 330

ఆ. నీప్రసాదమునను నే నింక నక్షయ
పుణ్యలోకములకుఁ బోవు దాన
నచట గురులసేవ నాచరించుచు నుందు
నాకు నాజ్ఞ నిమ్ము లోకనాథ. 304

ఆ. చిత్రకూటమునను జేరి నీ వున్నప్డు
నాదుగురువరుండు నాకముఁ జనె
నీదుదర్శనంబు నేఁ జేయుకోరిక
నిచట నిలిచి యుంటి నింతవఱకు. 305

మత్త. ఈవు వత్తు వటంచు నీ కిడ నేరి మంచిఫలంబులన్
నావలంకున దాచియుంచితి నాదుతండ్రి! భుజింపవే
దేవభోజ్యము లివ్వి యంచును దెచ్చి తా రుచి చూచి యే
దేవదేవుని నోటఁ బెట్టెను తియ్యతియ్యని వన్నియున్. 306

వ. రామచంద్రుండు శబరియిచ్చిన మధురఫలంబు లారగించి యోహో! తపస్వినీ! కబంధునివలన నీగురుప్రభావం బత్యధికంబుగా విని యుంటిఁ దచ్చిహ్నంబు లెవ్వియే నున్నయెడఁ జూపఁ గోరుచున్నవాఁడ ననిన నావృద్ధాంగన రామలక్ష్మణులం దోడుకొని కొంత చని యి ట్లనియె. 307

—♦ శబరి మతంగ మహాత్మ్యంబభివర్ణించుట ♦—

సీ. మబ్బు వేసినరీతి నబ్బురం బొసఁగు చి
క్కనిచెట్ల నిది మతంగవన మండ్రు
మంత్రవిదులఁ బుచ్చి మహితగంగాదితీ
ర్థము లిచటికిఁ దెచ్చి రమలమునులు
వేల్పుటరుగులపై వేసినపూవులు
వాడకున్నవి చూడు వేడుకమెయి
నుపవాసకృశులయి యుండుమాగురువర్యు
వల్కలంబుల నార నైచి రదిగో

తే. చూడు మనుచును మఱియును జూడఁ గలుగు
నెల్లవింతలు చూపి యావృద్ధవనిత

నేను నీసన్నిధిని దేహ మిాగి పుణ్య
గతికిఁ బోవఁగ నుంటి నీఁ గలుగు వచనము. 308

వ. అనిన రామచంద్రుండు నీవు నన్నుఁ బూజించితి వింక మిాఁదనీ యిచ్చవచ్చినలోకంబునకుం బొమ్మనిన శబరియట్లనగ్నిహోత్రునిం బ్రజ్వలింపంజేసిజ్వలించుదానియందుతన దేహంబునాహుతింగావించి దివ్యరూపంబు ధరించి దివి కేగె. రామలక్ష్మణులునటనుండి కదలి వన వైభవం బరయుచుఁ బంపాసరోవరంబునకుంబయనంబై. 309

♦— పంపాసరోవర వర్ణనము ♦—

మ. చని వీక్షించిరి రామలక్ష్మణులు పక్షి స్వజ్ఞలౌఘార్యముక్
ఘనసౌగంధికగంధబంధుర తరంగప్రోచ్చలద్రాజహం
సనితాంతారవతూర్య మార్యనుతచంచచ్చంచరీకోన్నత
స్వనసామశ్రుతిసారధుర్యము మహాపంపాసరోవర్యముఁ. 310

వ. ఆపంపాసరోవరతీరంబున శ్రీరామచంద్రుండు సీతావిరహదుఃఖార్తుండై విహరించుచు సరోజగంధబంధురంబును శిశిరంబునైన వాతపోతంబు తుషారసమేతంబై వచ్చి తనమే నల్లనం దాఁకు టెంచి చిత్తజానలంబు దరికొల్పినఁ దాల్మినిల్పఁ జాలక చిత్తంబునఁ దత్తరంపడి మత్తకాశినిం దలఁచి మిగులవగలం బొగిలి పొగిలి లక్ష్మణుం గాంచి. 311

చ. పసిమియు నల్పునుం గలిగి పచ్చికపట్టులు గాన వచ్చు న
ద్దెసఁ గనుఁగొంటె పెక్కు లగుతీరుల నొప్పెడుచెట్లనుండి పూ
లెసఁగఁగ ఁ్రాలియుండుట వనేందిర పొందుగ విశ్రమింపఁ గా
రసపయి రత్నకంబళము రాఘవుఁడు వేసినయట్లు తోఁచెడిఁ. 312

సీ. కారుమబ్బులు జలకణముల విడునట్లు
తరువులు పూవులం గురియు నదిగొ
పూఁగొమ్మపై నున్నపుంస్కోకిలమ్ముల
నుయ్యాల లూచుచు నుండెఁ బయర
గాలితాకున నేల రాలుపూవును విడ
కదె భృంగరాజ మల్లాడు కంటె
మలయమారుతసూతి మల్లికాసుమగంధ
హర్తయై పఱచెడు నన్నికడల

తే. సుమగుళుచ్ఛములన్ వ్రాలి భ్రమరము లవి
గాలిఁ గదలంగ వృక్షముల్ పూలు తుఱిమి
వల్లతలగుడ్డలం దాల్చునటు లనంగఁ
గానవచ్చుచు నుండె నిక్కాననమునఁ. 313

ఉ. కోకిల పొంగి యుబ్బునను గూసెడు మాటికి మాటిమాటికిన్
నాకు దిగుల్ మనంబునను నాటుఁగొనన్ శుక మద్ది దాసికిన్
జోకగఁ బల్కు వల్కెడిసి జుంజుముఃశబ్దము పుట్ట బంభరం
బీకరిణి న్విరోధము వహించె ని వన్నియు నేమి సేయుదున్. 314

మ. చివురుల్ జ్వాల లశోకగుచ్ఛములు వాసిన్ మండునంగారముల్
పువ్వులం దుమ్మెదనాదముల్ పెటపెటోద్భూతాతిదాహధ్వనుల్
మివులం రాలుమరందముల్ ఘృతముగా మిట్టాడి మట్టాడు మా
ధవదావానల మీఁద రేగి యితనిన్ దగ్ధంబు గావించెడిన్. 315

చ. మలయనగాగతం బగుచుమావులపూవుల సంచరించుచున్
జలువలనీనుపంపజలజమ్ములఁ దుమ్మెద పిండుఁ దోలుచున్
వెలసినమందమారుతము వీడి నెలఁతుకఁ దావతీప్తుఁడై
మెలఁగెడునాదుమేని కది మిక్కిలి వేఁడి ఘటించునగ్నినాన్. 316

వ. అని యనేకవిధంబులం బలవించుచు సౌమిత్రిం గాంచి. 317

ఉ. తమ్ముఁడ భ్రాతృవత్సలుఁ డుదారుఁడు నౌభరణుం గనంగఁ బో
మ్మిమ్మహి నంతమాత్రమును నే జనకాత్మజఁ బాసిఁ మేనఁ బ్రా
ణమ్ములు నిల్వఁ జాల నని నాడులు చల్లబడంగ నైనయ
ట్లిమ్మె దొఱంగి కూలఁబడె నేఁతయు వంత జనింపనంతటన్. 318

వ. సౌమిత్రి పొదివి పట్టుకొని లేవనెత్తి కంటనీరు గ్రుక్కుకొనుచు
పన్నదిక్కు మొగంబు వెట్టి యిట్లనియె. 319

చ. నిరుపమతత్త్వవేత్త వగునీ విటు లజ్ఞునిఁ బోలి బేలవై
దురపిలఁ బోలునే దురితదూరుని బ్రహ్మవిదగ్రగణ్యునిన్
బురుషుని వ్యాధు లాధులును బొందుట లక్రమము సూవె దేవ! నీ
వరయుముతాల్మిఁ జేసిహృదయంబునయందుజగత్ప్రవృత్తముల్ 320

చ. తెలియఁగ విన్మ నాపలుకు దేవరకున్ జనకాత్మజాతవా
ర్తలు వినవచ్చె నిచ్చటన తచ్చవ లాడుచు నుండ కామెఁ దేఁ

దలఁపుము శౌర్య మేర్పడఁగ దాపుననుండు హరీశ్వరుం డటం
జెలిమిఁ బొనర్పు మేఁ గలను శిష్యుఁడ నీ కిటు చింత యేటికిన్. 321

వ. అని విన్నవించిన రామచంద్రుం డెట్టకేఁ ప్రకృతిధర్మంబు నొంది కార్యాలోచనతత్పరుండయ్యెనంత వారిరువురును బంపాసరోవరసలిలంబునం గృతస్నానులై దేవర్షి పితృతర్పణంబులు గావించి కదలి మార్గమధ్యంబునం గలవనవిశేషంబు లరయుచుం బోయి నానావిధఫలానోకహాంబగు ఋశ్యమూకంబుఁ జేరఁ జని రని చెప్పిన విని నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పుమని సూతు నడుగుటయును. 322

ఆశ్వాసాంతము.

సీ. దండకారణ్యము దరియంగ జని యందు
మునులను రక్షింప బుద్ధినెంచి
మునువిరాధకబంధముఖదైత్యులఁ గూల్చి
కుంభభవాత్రిముఖ్యుల భజించి
పంచవటిం గాంచి పర్ణశాలవసించి
ఖరదూషణాదుల గండడంచి
జానకిం గోల్పోయి దానఁ గూలినజటా
యువున కున్నతగతులొదవఁ జేసి

తే. సీత వెదకుచుఁ గాననసీమలందు
శబరినిం గాంచి పంపకుఁజనియు నచట
విశ్రమించినరాముఁడు వేడ్క మీఱ
నీదరాన్వయ భూదేవు నేలుఁగాక. 323

గద్యము
ఇది శ్రీమహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ
కవిసార్వభౌమాంధ్రవ్యాసాభినవశ్రీనాథ వేదవిద్యా
విశారద శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి ప్రణీతం
బయినశ్రీకృష్ణరామాయణంబునందు
నారణ్యకాండంబునఁ సర్వంబును
ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# శ్రీకృష్ణరామాయణము

:o:

## కిష్కింధాకాండము

### ప్రథమాశ్వాసము



రామకోటి వ్రాయుచు
నారామునిదర్శనంబు సంపం గల్గెన్
భూరియశంబున నొప్పెడు
నారామయమంత్రిపౌత్రుఁ డలరు ధరిత్రిన్.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు రామలక్ష్మ
ణులు ఋశ్యమూకంబునకుం జని విశ్రమించి యున్నంత. 2

—♦ రామలక్ష్మణులం గని సుగ్రీవుఁడు విచారించుట ♦—

ఉ. పర్వతశీర్షభాగమున వర్తిలుచుండెడుసూర్యనందనుం
డుర్వర విశ్రమించినరఘూద్వహులం గని వాలిపంపునన్
ధూర్వహులై చరింతు రని తోఁపఁగ వచ్చెడు వీరు జోగులై
సర్వమహాయుధంబులఁ బ్రశంసకు నెక్కఁగ నుండి రక్కటా. 3

తే. ఒండొకఁడు చింత సేయక యుల్లమందు
బీతు గుడిచి కడుంగడుఁ బెదవు లెండ
నూర్పుకొంచును వడకుచు నొక్కలంగ
వైచె రాముండు గుహచేరువకు గమింప. 4

వ. మంత్రులం బిలిచి యి ట్లనియె. 5

సీ. మంత్రిసత్తములార! మన ముందుచోటికి
నిరువురు పురుషు లహీనబలులు
శరశరాసనతూణ కరవాలహస్తులు
దివ్యమంగళ దేహదీప్యమాను
లమరులవలెఁ దోఁప నైరి వా ర్వాలిచేఁ
బంపంగఁ బడి నన్నుఁ జంపుపొంటెఁ
జనుదెంతురో యని సందేహ మగుచుండె
మన మిష్టు పాటిపో మంచి దందు
తే. అనుడు వారలు తా మేమొ వినుచుచుండ
నాంజనేయుఁడు చే మోడ్చి యనియె నిట్లు
వాలిపంపున వచ్చినవార లనుచు
వారియెడ సందియంపడ వలదు వినుఁడు. 6

ఉ. వారలు దేవరూపు లగువారలు వారిశరీరసౌష్ఠవం
బారయఁ దోఁపవచ్చెడిని వాలిని దేశము కాదుగాని దై
త్యారిని దేశముం గొని ప్రియంబున నిన్నును మమ్ముఁ దేర్పఁగా
నీరహి ఋశ్యమూకమున కిష్టరుదెంచి రటంచు నెంచెదన్. 7

క. నావుడు సుగ్రీవుం డను
నీ వాకడకు వటువేష మేర్పడఁ గొని పో
మ్మీవాసి యగునా మాటల
భావంబున నెఱిఁగి రమ్ము వాయుతనూజా. 8

క. ఎఱిఁగికొని వచ్చులోఁగా
నెఱిఁగింపుము నాకు సంజ్ఞ యేర్పడెడిగతిన్
నెఱి గలవాఁడవ యగుచున్
గుఱు తెలుఁగుము శత్రుమిత్రగుణముల నెల్లన్. 9

వ. అని యనేకవిధంబులం దెలియఁ జెప్పి. 10

మ. పనిచెన్ మంతుని బుద్ధిమంతుని జగద్వర్ణ్యప్రభావంతునిన్
మునిలోకాద్భుతశాంతునిన్ త్రిభువనప్రోద్యద్యశఃకాంతునిన్

ఘనవృత్తాంతుని దాంతునిన్ సుజనపక్షస్వాంతునిన్ శౌర్యవం
తుని నక్లాంతుని ధైర్యవిద్ధహిమవంతున్ శ్రీహనూమంతునిన్. 11

## ఆంజనేయుఁడు రామలక్ష్మణులకడకు వచ్చి ప్రసంగించుట

వ. అతఁడు వారికడ కతివినీతవేషంబునం జని నమస్కరించి.

శా. రాజర్షిప్రవరుల్ సురప్రతిము లోరమ్యాంగులారా భవ
ద్రాజద్దేశ మదేది ? యేమిటికి నేతత్కాననక్ష్మకుఁ బ
ద్రాజీవంబులు కంద మెట్టుకొనుచున్ రా నయ్యె మీనామముల్
మీజన్మాదికము న్వచించుటకు నెమ్మి న్నేను బ్రార్థించెదన్. 13

సీ. శక్రచాపముఁ బోలు చాపంబులం దాల్చి
నారలు ధరియించి కూరలు దిని
హస్తిహస్తోపమశస్తభుజంబులఁ
గౌక్షేయకంబులు గ్రాలుచుండ
మణికిరీటంబుల మహితంబు లగుశిరో
భాగములన్ జటాపటల మెసఁగఁ
బద్మపత్రేక్షణప్రభ లెల్లకడలను
బ్రసరింపఁ జేయుచు వనచరు లయి

తే. మెలఁగఁ గారణ మే మానొ మింటినుండి
మంటికిం దిగి వచ్చినమాన్యు లైన
చంద్రసూర్యులు నానొప్పుచుంద్రు మీర
లెవ్వరో దయచేసి వాకింపు నాకు. 14

తే. ఏను సుగ్రీవుఁ డనువానరేంద్రునకును
ధీసచివుఁడను నంజనాదేవియందు
వాయువరమునఁ బుట్టినవాఁడ హనుమ
యంద్రు నానామధేయ మోయనఘులార. 15

క. నే నాసుగ్రీవునకున్
మానుగఁ బ్రియకృత్య మాచరించుమతి నీరూపం

బూని చనుదెంచి నాఁడర
నానారూపములు దాల్ప నా కగు శక్తుల్. 16

తే. కామచారిని నే నని కడు వినీతుఁ
డగుచుఁ బలికిన సౌమిత్రి నరసి రాముఁ
డితఁడు సుగ్రీవసచివుఁడు నుతచరితుఁడు
నేరుపరి మాటలందు వినీతబుద్ధి. 17

ఉ. నాలుగు వేదముల్ మఱియు నాల్గును రెండగుశాస్త్రముల్ దగం
బోలిచి నేర్చినట్టిఁ డని బుద్ధినెఱుంగఁగ వచ్చు వీనివా
గ్జాలమునందు దోష మనుజాడయుఁ గానఁగ రాదు శేముషీ
వేలువుజ్ఞ దేశికుని వెక్కుఁ బడం బొనరించు నెంచఁగన్. 18

వ. ఈతనికంఠగతం బగు వాక్యం బవిస్తరం బసందిగ్ధంబు నవిలంబ
నంబు నద్రుతం బై యుండు నిట్టివాఁడు దూతుం డగుటంజేసి
రాజకార్యంబు లెల్ల సిద్ధించెడి నీవు వీనితో నించుక ప్రసంగింపు
మనిన వాక్యజ్ఞుం డగులక్ష్మణుండు వాయుపుత్రునిదిక్కు మొగం బై
యి ట్లనియె. 19

తే. విద్వదగ్రేసరా! మేము వెదకుచుంటి
మర్కపుత్రుని సుగ్రీవు మర్కటవిభు
నీవు చెప్పినచొప్పున నేము చేయు
నట్టివారమయ్యె యుంటి మనుడు హనుమ. 20

క. సంతోషించుచు మీ రీ
కాంతారముఁ జేర నెట్టికారణ మగునో
వింత యగు మీచరిత్రము
కొంతయు డాపక వచింపఁ గోరుదు ననుడున్. 21

సీ. లక్ష్మణుం డనుఁ గోసలముల రాజేంద్రుండు
దశరథుం డనుపేరఁ దనరుచుంటి
బహుళదక్షిణలతో బహుయజ్ఞములొనర్చె
నతని కీతం డగ్రసుతుఁడు నూనె

రామనామంబునఁ గ్రాలువాఁడున్ సర్వ
భూతశరణ్యుండు పూతయశుఁడు
తండ్రియాజ్ఞంజేసి దండకావాసముఁ
గావింప వచ్చె స్వకాంతతోడ

తే. అనుజుఁడను నేను సేవకుఁ డగుచు వెంట
వచ్చినాఁడను మే మొక్కవలకుఁ జనిన
యపుడు మారామపత్ని సీతాయి నెవఁడొ
రాక్షసుండు హరించెఁ జౌర్యం బెసంగ. 22

వ. మేము సీతాన్వేషణంబు చేయుచు వనంబులం బడి వచ్చుచుండఁ గబంధుం డనువాఁడు సీతాపహరణవృత్తాంతంబు సుగ్రీవుం డను వానరవల్లభుం డెఱింగియుండు మీా రతని నాశ్రయింపుఁ డని చెప్పుటంజేసి వివిధప్రదేశంబు లన్వేషించుచు వచ్చుచుంటి మనిన నంజనానందనుం డానందకందళితహృదయారవిందుండై రామచంద్రునిఁ గన్నులారం గాంచె నప్పుడు. 23

—♦ ఆంజనేయులు రాముని విరాడ్రూపునిగ నెఱుంగుట ♦—

సీ. పదునాల్గు లోకముల్ పర్వతపంక్తులు
సప్తసముద్రముల్ సర్వనదులు
సర్వవనంబులు సర్వగ్రహంబులు
సర్వనక్షత్రముల్ చంద్రసూర్యు
లచలాంతరిక్షము లఖిలభూతంబులు
పత్తనంబులు నదుల్ పక్కనములు
యక్షరాక్షసులు తిర్యక్కులు దేవతల్
సర్వప్రపంచము సర్వదిశలు

తే. రామదేహమునం జూచి రాగరహితుఁ
డగుచు విస్మయంబు భయంబు నాత్మ మొలవ
వటుశరీరము విడనాడి వానరుఁ డయి
తగ వితర్కించె నిట్లని తగిలి తగిలి. 24

మ. పరమాశ్చర్య మెఱింగికొంటి నిది స్వప్నంబో మహావిభ్రమ
స్ఫురణంబో విపులేంద్రజాలమొ సముద్భూతప్రభావంబు నేఁ
బరికింపన్ సకలప్రపంచమును దోఁప న్వచ్చె నీరాముమే
న రమానాథుఁ డితండు మర్త్యుఁ డగుచుం గన్పట్టు నిప్పట్టునన్. 25

తే. అనుచు ధ్యానించుచుండెడు నవసరమున
రాముఁ డక్కపిరాజుమై రత్నకవచ
కుండలమ్ములు దీపించుచుండఁ గాంచి
యనుజుదిక్కు మొగం బయి యనియె నిట్లు. 26

క. చూచితె తమ్ముఁడ కంటికిఁ
దోఁచెడి నీహనుమ మేనఁ దులితేంద్రధనూ
రోచి యగుమేలుకంకట
మీచిత్రము చూచియెఱుఁగ మెప్పుడుఁ గానీ. 27

వ. అనిన శ్రీరామవచనం బాకర్ణించి హనూమంతుండు తొల్లి తన తపంబునకు మెచ్చి పరమేష్ఠి కవచకుండలంబు లిచ్చి తనకుఁ జెప్పినచొప్పులు స్మృతికిం దెచ్చుకొని శ్రీరాముండు శ్రీహరి యని నిర్ణయించుకొని సాష్టాంగనమస్కారంబు గావించి వినయవినమ్రితాంగుండై చేతులు జోడించుకొని యిట్లనియె. 28

సీ. నీవు నాస్వామివి నీకు నే దాసుఁడ
నిజము చెప్పుచునుంటి నీరజాక్ష
కమలాసనుఁడు నాకుఁ గవచకుండలముల
నిడి వేరికిం గానఁ బడవు వీని
నెవఁడు కంటం గాంచి వివరింపఁ జాలునో
యాతండు భూభారహరణమునకు
నవతరించినజగదధినాథుఁడు జనార్ద
నుం డని యెఱిఁగి నీనిందు మదిని

తే. గురువుగా నెంచి సేవించి కొను మటంచు
నాఁడు వచియించె నోస్వామి నతి యొనర్తు.

నన్ను నీదాసునిం గృపాభ్యున్నతిమెయిఁ
గాచి రక్షింపు మని వెంకఁ గాళులఁ బడె. 29

వ. రామచంద్రుండును గపీంద్రు లేవనెత్తి గుత్తంబుగఁ గౌఁగిలించు
కొని నీవృత్తాంతం బెట్టిది చెప్పు మనిన హనుమంతుండు ప్రాంజ
లియై మఱియు ని ట్లనియె. 30

—♦ హనుమంతుఁడు వాలిసుగ్రీవుల వృత్తాంతము చెప్పుట ♦—

తే. వాలిసుగ్రీవు లనియెడువారు వాన
రప్రవరులు వారలకు వైరంబు వొడమె
వాలిసుగ్రీవుభార్య రుమాలలనను
గైవసము చేసికొని తమ్ముఁ బోవఁ ద్రోలె. 31

ఉ. ఆవల భ్రాతృభీతిమెయి నందును నందుఁ బరిభ్రమించి సు
గ్రీవుఁడు మఱి మతంగమునికేసరి శాసనముం బొనర్చుటన్
గావరు లెవ్వ రీనగముఁ గన్గొనఁ జాలరు గాన నిర్భయుం
డై వసియించు నిక్కధరమందు సమాత్యులు దాను నిత్యమున్. 32

తే. జాంబవంతుఁడు లోనగు సచివు లందు
నే నొకండను మారుతి నా నెసఁగుదు
మిమ్ముఁ గని సూర్యపుత్త్రుఁడు మిమ్మట మగు
భీతునన్ బమ్మరిల్లి నన్ బిలిచి యనియె. 33

మత్త. వాలిపంపున నన్నుఁ జంపఁగ వచ్చినా రని యెంతు నా
వేలుపుందొర కెత్తువచ్చినవీరవర్యు లటంచు లోఁ
బ్రాలుమాలిక నైనభీతునఁ బొఱువాఁ డయి యంత నా
జోలి గైకొని యిట్లు మీదగుచొ ప్పెఱుంగఁగఁ బుచ్చెనన్. 34

వ. అట్లు వారు ప్రసంగించుచున్నసమయంబున. 35

ఉ. కచ్ఛపి మీటికొం చపుడు కమ్మనిగానము వీను లంటి ది
వ్వేచ్ఛ జనింపఁ జేయునటు లింపుగఁ బాడుచు నింగినుండి...

భ్రిచ్ఛవి నొప్పునారదుఁడు రాముఁడు లక్ష్మణుఁ డున్నచోటికిన్
దచ్ఛుభలగ్నమం దెలమి దర్శన మిచ్చె ముదంబు హెచ్చఁగన్.

వ. వచ్చిన నారదుం గని రామలక్ష్మణులు హనుమంతుండును లేచి
యెదు రేగి తోడి తెచ్చి సుఖాసనాసీనుం గావించి పూజించి రంత
మునీంద్రుండు రామచంద్రుం గాంచి యి ట్లనియె. 37

చ. వనముల మీకు నిట్లు బలువంతల చింతలఁ బొంద నయ్యె నీ
వనిత సజీవయై యిపుడు భర్తృసమాగమ మాస సేయుచున్
వనటఁ గృశించి యున్నయది వాసవవందిత! నీకు నింక మే
లొనరెడు సూర్యపుత్రునిసమున్నతసఖ్యము నొందఁ గల్గెడిన్. 38

క. మారుతి యీతం డీతని
కారణమున సీతవార్త గ్రహియింప నగున్
వైరులఁ దున్మి సుఖంబుగఁ
జేరుదు సాకేతపురికి శ్రీరఘురామా, 39

—♦ నారదుఁడు వచ్చి హనుమదాదుల వృత్తాంతము చెప్పుట ♦—

వ. అనిన రఘురాముండు వాలిసుగ్రీవులయు నీహనూమంతునియు
వృత్తాంతంబు విన నెంతు నానతి మ్మనిన నతం డి ట్లనియె. 40

సీ. నీ వెలుంగు దహల్య నీపాదరజ మది
ఆతి నాతిగఁ జేసి భూతి నొసఁగ
నామె కంజనయు శతానందుఁడుం బిడ్డ
లకాలమున నొక్కయవసరమునఁ
బతితోడ నాయమ వని మెలంగుచునుండ
దేవవిభుండును దినవిభుండు
కని మోహితాత్ములై మునిభయంబునఁ జేసి
కపిరూపులై వెంటఁ గదలి చనిరి

తే. కొంతలో వారి కాయమగొనబుఁ గనుట
వీఁగిపడెఁ దేజ మది గాలివేగమునను

వనధిఁ బడె నిందప్రతేజమువలన వాలి
ద్యుమణితేజున సుగ్రీవుఁ డుదితు లైరి. 41

వ. అంత బ్రహ్మదేవునానందబాష్పసంజనితుం డగుబృహద్రజుండు నాఁబడుఋక్షవల్లభుండు వానరుండు భర్గుం డనం బరఁగి కిష్కింధాపురప్రభుండై యుండి నిండువేడుక నొక్కనాఁడు సముద్రప్రాంత కాంతారంబున విహరించుచుఁ దత్తీరంబున వాలిసుగ్రీవులం గని యపుత్రకుం డగునతండు వారిం దోడ్కొని పురంబునకుం జని పుత్రప్రేమం జేసి పెంచి పెద్దవారిం గావించి వాలికిం దనవానర రాజ్యం బిచ్చి తాను స్వర్గంబునకు నిర్గమించె నంత. 42

తే. వాలి వానరవరరాజ్యపట్టభద్రుఁ
డగుచు సుగ్రీవు నెడ జ్ఞాతి యగుట నైర
మును బ్రతిష్ఠించి తనదేశమును దృజించి
పో నడఁచి వానిభార్యను పోరి హరించె. 43

తే. ఇల్లు వాఁకిలిఁ బెండ్లాము నెల్ల విడిచి
వ్యగ్రహృదయుఁడు సుగ్రీవుఁ డవని యెల్లఁ
దిరిగి వారికిఁ జొరరానిదేశ మగుట
నిందు విహరించుచుండె నోయినకులేశ. 44

వ. ఇంక నీహనుమంతునివృత్తాంతంబు చెప్పెద విను మని మఱియును.

సీ. అయ్యహల్యాపుత్రి యగునంజనాదేవి
కేసరి యనువాని కేలు పట్టి
యంధురాలై మందరాచలంబున నుండి
పరమేష్ఠి మెచ్చంగ బాఢతపముఁ
గావింప నాతండు కరుణించి వాయుచే
పునిఁ బిల్చి నిచ్చ లంజనకు భుక్తి
గలిగింపు మనఁగ నాథునుఁడు ప్రత్యహ మొక్క
ఫల మామెదోయిట నిలిపి పోవు

తే. ఆమె భక్షించు నిట్లుండునంత నొక్క
నాఁడు దుర్గామహేశ్వరుల్ వేడుక మెయిఁ

గాన విహరించు చొక్కపు గపులు మిథున
కర్మ మొనరింపఁగా గాంచి కామవశత. 46

వ. తామును గపిదంపతులై క్రీడించునంత హరునివీర్యంబు జారి ధారుణిం బడియె దానిం గాంచి వాయుదేవుం బిలిచి నీ వీవీర్యంబు గొనిపోయి యంజనాదేవి గర్భంబునం బెట్టుము ధాన నామె గర్భంబు ధరించి సర్వరాక్షసాంతకుండును రామభక్తుండు నగు నొక్కకుమారుం గను నతండు నీకును నాకును బుత్రుండు నా వ్యవహరింపఁబడుచుండు ననినఁ బవమానుండు దానిం గొనిపోయి యంజనాదేవిం గూడి హరుండుచెప్పినచొప్పునం జేసె నంత నామె గుర్విణియై నవమాసంబులు మోసి యమ్మహాత్మునిం గాంచి స్వర్గంబునకు నిర్గమించె నతండును.

మ. ఉదితార్కుం గని పం డటంచు మనమం దూహించి పై కేగి త్రిం
గఁ దలంపంగఁ దలంకి భాస్కరుఁ డజున్ గాఢార్తిఁ బ్రార్థింప నా
సదయుం డయ్యినఁ బ్రోవ వచ్చుటయు నిస్సందేహుఁడై యాభయ
ప్రదుఁడా ధాతను వాలపాశమున సంబంధించె సంధుల్ చెడన్. 48

మ. అపు డింద్రుండరుదెంచి వజ్రమున వ్రేయం దాన మూర్ఛిల్లె నీ
కపివర్యుం డది చూచి వాయువు జగత్కళ్యాణమై ప్రాణమై
సుపరివ్యాపృత మైననైజతనువున్ శోధింపఁగాఁ జేసె వి
ష్టపముల్ దానఁ జలించెఁ బ్రాణితతికిన్ సంక్షోభ మయ్యెం గడున్.

వ. అప్పు డింద్రాది బృందారకబృందంబులు ఋషికదంబంబులతోఁ గైలాసంబునకుం జని ప్రార్థించి విన్నవించిన నతం డంతయు నెఱింగి వారి కి ట్లనియె. 50

చ. వనచరుఁ డస్మదంశమున వాయుతనూజుఁడు గాఁగ నంజనా
వనితకుఁ బుట్టె నాతఁడు సపర్వతకాననసాగరావనిన్
గొనకొని మోయఁ జాలినఘనుం డని మీర లెఱుంగుఁ డవ్వలన్
జననము నొందు రామునకు సాయపడున్ ఖలుల న్వధించుచోన్.

ఆ. అతని లేవ నెత్తుఁ డంత జగత్ప్రాణుఁ
డలుక వీడుననిన నజుఁడు నితని

మొఱకు వచ్చి యమృత మిత్రనిమోముపైఁ
జల్లి లేవ నెత్తె నల్లనల్ల. 52

వ. మఱియు నజుం డీతని కత్యంతసత్వంబును జరాయువును నానాస్త్రాప్రతిబంధనంబును గలుగ వరం బొసంగుచు నమూల్యమణిమయవజ్రకవచకుండలంబు లిడి చనియె. జననకాలంబున నశ్మంబునం బడుటంజేసి హనువు విఱిగినదాన నితండు హనుమంతుండు నాఁ బడి సూర్యదేవు నాశ్రయించి నవవ్యాకరణంబులందును వేదవేదాంగంబులందును బండితుండై గురుదక్షిణ యొసంగువాఁడై గురుపుత్రుండును బరమోత్తముండు నగుసుగ్రీవు నాశ్రయించి యుండె రామచంద్రా! నీవు సుగ్రీవునితో సఖ్యంబు వాటించి సీతాకారణంబున రావణాదిరక్షోవీరుల రణంబున మరణంబు నొందించి జగత్కళ్యాణంబు గావింపు మేము బోయి వచ్చెద మనుజ్ఞ నొసంగుమని వారి నామంత్రణంబు చేసి గగనమార్గంబున నిర్గమించె నంత రాముండు. 53

— రామలక్ష్మణులు హనుమంతునితో సుగ్రీవుకడ కరుగుట —

మ. హనుమా! నీవు మహానుభావుఁడవు నా కత్యంతభక్తుండ వే
మనమందుం గడుసంతసించితి నిఁక న్నాతోడివాఁ డైతి నా
వనితారత్నముఁ దెచ్చుభార మది నీపైఁ బెట్టితిన్ ముమ్ముఁ దో
కొని పో మ్మారవిజుం డెసంగుకడకుం గోర్కిం బ్రదర్శించుచున్.

తే. అనుడు హనుమంతుఁ డట్లవు ననుచు వారిఁ
దనభుజంబుల నిడుకొని దారిఁ బట్టి
నడచెఁ దారక మాస్యమున న్నిరంత
రముగ వెలువడి మారోక్రియ రవము దెసల. 55

వ. అట్లు రామలక్ష్మణుల భుజంబులం గొని చని ఋశ్యమూకంబున కుపపర్వతం బగుమలయంబున డింపి తాను సుగ్రీవునికడకుం జని యి ట్లనియె. 56

ఉ. రాముఁడు లక్ష్మణుం డనఁగ రాజకుమారులు తండ్రిపంపునన్
దా మలదేశము న్వీడిచి దండకకుం జనుదెంచి యుండ నా
రామునిపత్ని జానకిని రాక్షసుఁ డేఁడొ హరించె నందునన్
గోమలి నెందునే నరసికోఁ జనుదెంచిరి కోన కిగ్గతిన్. 57

క. సీతో మైత్రిం గోరుచు
భూతలపతు లైనవారు పోలించి నినున్
నాతో వచ్చిరి మలయ
తూర్మతలమున నున్నవారు కపికులతిలకా. 58

క. నావుడు సుగ్రీవుం డను
నీవచనము వేద మట్లు నే నమ్మితి నో
పావని వారల కడకున్
బోవుద మని మర్త్యరూపముం గొని భక్తిన్. 59

వ. వినీతవేషుండై హనుమంతునితోడం జని రామలక్ష్మణులకుఁ బ్రద
క్షిణనమస్కారంబు గావించి రాముం గాంచి యి ట్లనియె. 60

ఉ. దేవత లీరు మీరాదయినదివ్యతరప్రతిభావిశేషముల్
పావని చెప్పి నాపయిఁ గృపం గలిగించుటఁజేసి ధన్యుఁడన్
బావన మయ్యె నాదుజని భాగ్యము పండెను దొంటిపుట్టునం
దేవిధి పుణ్యకర్మముల నెట్లు పొనర్చితినో తలంపఁగన్. 61

మత్త. నీదుకష్టము నాదుకష్టము నీదుసౌఖ్యము నారయన్
నాదుసౌఖ్యము నీకు సాయ మొనర్తు నే నటు లీవు నా
కాదరంబున సాయముం దగ నాచరింపఁగఁ గోరుదున్
సోదరాతిశయంబుఁ జూపుచు సూర్యవంశసముద్భవా. 62

క. అనుటయు రఘురాముం డను
మనమునఁ దలపోసి యిట్లు మారుతితోడన్
జనుదెంచి నార మోకపి
జనవల్లభ ! సంశయింపఁ జన దెవ్వరికిన్. 63

వ. అనినంత వారిద్దరు నగ్నిసాక్షికముగ సఖ్యంబు గావించుకొని
రంత సుగ్రీవుండు. 64

—♦ రామలక్ష్మణులు సుగ్రీవునితో సఖ్యంబు సేయుట ♦—

క. మాయన్న వాలి నాపైఁ
బాయనివైరంబు పూని పరిపరిగతులన్
జేయుచు నెగ్గులు నాజల
జాయతలోచన హరించి యవ్వల నన్నున్. 65

వ. రాజ్యంబునుండి వెడలం గొట్టుటయకాక బలవంతుం డగుటంజేసి యెందున్న నందు వచ్చి వేధింపఁ జొచ్చె నీఋశ్యమూకంబు మతంగమహామునిశాపంబునంజేసి పాపాత్ముం డగువాలికిఁ జొరరానిదయ్యెం గావున నే నిం దుండి జీవయాత్ర గావించుకొను చుంటి ననిన రామచంద్రుం డు కటకటంబడి. 66

చ. ఎఱుఁగుదు నీదుభార్యహరియించినవాలిని గూలనేసి యే
డ్తెఱ భవదీయభామినిని దెచ్చి కపీశ్వరరాజ్యముం బ్రిజల్
మఱి మఱి మెచ్చ నీ కిడుదు మాఁట యొసంగితి బాససేయుచున్
నెఱి గలవాఁడవై మనుము నెమ్మది నెమ్మది గల్గి మిత్రమా. 67

తరు. అనిన నింతనరానియట్లు సంతోష
మంతరంగంబునయందుఁ దోఁప్ఁడ
జనియింప సిట్లను జనకరాట్పుత్రి
జానకి యెం దున్నఁ జని నేను దెచ్చి
జనపతిపదపంకజమ్ములచెంత
సరగ నిల్పెద నిదే సత్యభాషణము
వినఁ దలంపుము రఘువీర నీ వింక
వెగడు గుద్చుట వృథా వృథ శాంతిఁ గొనుము. 68

శా. ఈలో నల్వురు మంత్రు లేను గిరిపై నే మేము చిత్తంబులం
దాలోచించుచునుండ నాకసమునన్ హా రామ! హా లక్ష్మణా!
జాలిం గూలితిఁ గావరే యనుచు నుచ్చైర్నాదముం గల్గి దీ
నాలాపంబులు కర్ణకర్కశముగా నాలింప నయ్యెం బ్రభూ. 69

ఉ. పొదల లెత్తి మిన్నుఁ గనునంతన తోఁచె దశాస్యుఁ డొక్క ధా
త్రీదయితాంగనన్ శ్రమనుదిక్కునకుం గొనిపోవుచుండుటల్

మాదృశ కారయంగ నయి మాడిచివేసెను మానసంబులన్
మాదయితా! తలంప నలమానిని మా యని తోఁప నమ్యెషిన్.

ఆ. అంతలోన కొన్నియాభరణంబు లా
కాంత విసరివేసె కట్టి మూట
దాని మేము తీసి దాచి యుంచితి మవి
కొంత గుఱుతు మీకుఁ గూర్పఁ గలవు. 71

—♦ శ్రీరామలక్ష్మణులు సీతాభరణంబు లరయుట ♦—

వ. అని సుగ్రీవుండు గుహాగేహంబునం దాచియుంచినరవణంబుల ముల్లెం దెచ్చి రామునికడం బెట్టిన నతం డుత్తరీయంబు విచ్చి చూచి కన్నీరు మున్నీరై వఱువాఱ హా! ప్రియా! యని ధైర్యంబు విడిచి పుడమిం బడి బడిబడి యడలుచు సౌమిత్రిం గాంచి భూష ణంబులం జూపి వీని నీవెఱుంగుదే యనిన నతం డతని కిట్లనిమె.

క. ఎఱుఁగం గేయూరము లే
నెఱుఁగం గుండలము లెప్పు డెఱుగుచునుంటన్
ఎఱుగుదు నూపురయుగ్మము
మఱవను నిక్కముగ నివ్వి మావదినవి యే. 73

వ. అనిన రామచంద్రుం డయ్యాభరణంబు లక్కునం జేర్చుకొని సుగ్రీవునిదిక్కుమొగంబై కన్ను లెఱ్ఱఁబడ నోమిత్రరత్నమా! నాకులాంగన నపహరించిన దశకంఠు నిప్పుడ సంహరించెద వానికై యమద్వారంబు తలుపు దెఱచి యున్నయది వాఁ డెక్కడ నుండు వానివృత్తాంతంబు నెట్టిది చెప్పు మనిన సుగ్రీవుండు. 74

క. నేను న్వాని నెఱుంగను
గానీ వానరులఁ బుచ్చి కలరూ పెల్లన్
మానుగ నెఱిఁగినపద్దపడి
వానిం దునుమాడఁ దలఁపఁ వలయు న టందున్. 75

చ. ఇడుమలు వచ్చినప్పు డొకయించుక ధైర్యము గల్గి మానవుం
డెడరు నతిక్రమించుటకు నెంచి ప్రయత్నము చేసి కార్యముల్

నడుపుట పోలుఁ గాని వ్యసనంబున నిం బఱి కుందుచుండుటల్
జడునకు నైనఁ గా దనుచు స్వాంతము సేయుము రాజచంద్రమా.

క. ఇదె చే మోడిచి నే
నెద శోకము చేయఁ దగని దే యని మైత్రిన్
మది నిలిపి నీకుఁ దెలుపుదు
నిది గరువము కా దటంచు నెఱుఁగు మధీశా. 77

శా. నన్నుం జూచినమీఁద నైన మదిలోనం బిమ్మటన్ వీడి నా
కన్న న్వీఁడు వనంటఁ గుందు నని నాకై నీదుచిత్తంబు ని
ల్ప న్న్యాయం బనవో ఖలుండు హరియింపం గల్గి నాపత్ని నా
కు న్నిల్వంగను నీడ లే నటులు కైకోఁ జేసె శోకంబులన్. 78

ఉ. ఈగిరి దాఁటి యెప్పు డెపు డీవల కావల కేగి యుంటినే
నాగణనీయ తేజుఁ డగునగ్రజుఁ డాగ్రహ మెచ్చ వచ్చి నా
యోగము మూడఁ జేసెఁ నయో యిటువంటిది దుఃఖ మేరికేఁ
గాఁ గలవారు గల్గిరనఁ గా విని యుందువె యెప్పుడేనియున్. 79

క. నావుడు రాముం డి ట్లను
నే వాలి వధించి నీకు హిత మొనఁ గూర్తున్
నీ వింక వగవకుండుము
నావాక్యము సత్య మనుచు నమ్ము మనమునన్. 80

వ. అని సుగ్రీవా! యన్నదమ్ములకు మీ కిట్టివైరంబునకుం గలకారణం
బేమియో వినఁ దలంచితి సవిస్తరంబుగం జెప్పు మనిన సుగ్రీవుం
డి ట్లనియె. 81

—♦ శ్రీరాముడు వాలిసుగ్రీవుల వైరకారణం బెఱుంగుట ♦—

సీ. వినుము దుందుభి యనుదనుజేంద్రపుత్రుండు
మాయావి యనునొక్క మానధనుఁడు
జగములం గలయట్టిజగజెట్టులం గొట్టి
తనతోడ ఘోరాకృఁ దగినజోదు

నెందునుం గానక హిమవంతుపై నేగ
నాతఁడు జంకి మాయావి! నేను
సీతోడఁ బోరఁగా నేర సమర్థునిఁ
జెప్పెద వినుము కిష్కింధలోన

తే. వాలి యనువాన రేంద్రుండు గ్రాలు వాని
తోడఁ బోరంగ నేగుమా పోరఁడ నీకుఁ
జాలినట్టిఁడు నావుడు జాల్మఁ డతఁడు
వచ్చి కిష్కింధ కొకనాఁడు వాలిఁ బిలిచి. 82

ఉ. యుద్ధము గోరి వచ్చితిని యోధుఁడ నై చనుదెమ్ము మార్కొనన్
బుద్ధి భయంబునం దగులఁ బోయినఁ జెప్పుము పోదు నావుడున్
బద్ధరుడంతరంగు డయి వాలి రయంబునఁ జేసి సర్వసం
సిద్ధుఁడయై నిశాచరునిఁ జివ్వకు ర మ్మనెఁ గాలు ద్రివ్వుచున్. 83

వ. అప్పుడు సర్వపరివారంబుతో నేనును వాలికి బాసటయై నిలిచి
నంత వాఁడు భీతచిత్తుండై త త్తరంబునం బాఱి చెంతనున్నగుహా
గేహంబుఁ జొచ్చె వాలియు ను మ్మండఱ నాగుహాముఖంబునం
గాచుచుండుఁడని తా నొక్కరుం డుక్కు మెయి నందుఁజొచ్చె. 84

ఉ. నాళ్లును బక్షముల్ నెలలు నాఁటికినాఁటి కతిక్రమించి పోఁ
జెల్లగ నయ్యె వత్సరము చెప్పినచొప్పున వాలి రామి మే
మెల్లర మా ర్తి నొందునపు డెంతయు నెత్తురు ప్రవాహరూపమై
జల్లునఁ దన్ముఖంబునను సాఁగఁగ జొచ్చె భయంబు హెచ్చఁగన్.

వ. మేమప్పుడు మాయావిచే వాలి నిహతుం డయ్యె నని నిశ్చయించు
కొని గుహాముఖంబుఁ బెద్దపాషాణంబున బంధించి కిష్కింధకుం
బోయితి మా వృత్తాంతంబు మంత్రు లెఱింగి దేశం బరాజకం
బుగ నుండఁ జెల్ల దని వాలిస్థానంబున నన్నుఁ బట్టభద్రుం జేసిరి
నేనును దానికి సమ్మతి లేనివాఁడ నయ్యును బ్రజానిర్బంధమునం
జేసి వానరరాజ్యరమాధురంధరుండ నై యుండునంతఁ గొంతతోఁ
వాలి వచ్చి సర్వంబు నెఱింగి నే నెంత ప్రార్థించినను నామాట

సరకుగొనక నాసహధర్మచారిణితో సర్వస్వమ్ము నపహరించి నన్నును నన్ను రాజుం జేసినయీమంత్రులను వెడల నడచె మేము వాలిభయంబునం బరిభ్రమించుచు నెందునుం గుదిరి యుండ నోపక యిందు వచ్చి నిశ్చింతులమై యుంటి మనిన రాముండు. 86

ఉ. వాలికి దవ్వు దవ్వులన వర్తిలుచున్న భయంబు సెప్పి తీ
శైలముచెంత నున్న యది సాధ్వస మెట్టులు లేకపోయె నీ
నేల వసించియుండుటకు నేరుపు లెయ్యవి చెప్పు మన్న నా
హేలికుమారుం డి ట్లనుచు నేర్పడం జెప్పె ధరాధినేతకున్. 87

క. మాయావి తండ్రి దుందుభి
యేయెడ సమరంబుం గోరి యెద్దియు జగతిన్
బాయక మెట్టుచు నొకనాం
డీయెడ కరుదెంచి మించి యేడ్తెఱం జూపెన్. 88

ఆ. వాలి వానిం బట్టి బాహుయుద్ధ మొనర్చి
గిట్టి త్రిప్పి వైచె క్షితినిం బడంగ
వానిమేనినెత్రు వఱ్ఱువాఱి మతంగ
మౌనివర్యునాశ్రమంబు నిండె. 89

వ. అది యెఱింగి మతంగముని కినుకం జేసి నాయాశ్రమం బిట్లు రక్తమయంబు గావించిన వాం డీప్రాంతప్రదేశంబుల కడుగువెట్టినంత నంతకున్ గొల్చువాం డగు నని శపించె దానం జేసి వాలి యిచ్చోటికి రాం జాలకుండు నద్దాన నేను వాలిభయంబు వో నిట నున్నవాండ ననిన రామచంద్రుండు వాలిపరాక్రమం బెట్టిది చెప్పు మనిన సుగ్రీవుండు వెండియు. 90

మ. శతమన్యుండు కుమారవత్సలత హెచ్చన్ వాలికిన్ దేవస
న్నుతమై యొప్పెడుపుష్పదామ మిడె యెందున్ దీనికిన్ సాటి లే
దు తనూజాతుండ! దీనిం గంఠమునయందున్ దాల్చిన న్నిన్నునీ
ప్రతిపక్షుల్ గని వీర్యహీను లయి పోవం జూతు రెల్లప్పుడున్. 91

క. వైరిబలంబున సగపాల్
సేరు నినుం బుష్పమాల చేరిక నీతోఁ
బోరాడఁ జాలఁ డెవ్వఁడు
భూరిబలాఢ్యుండ వగుచుఁ బొలిచెద వెపుడున్. 92

వ. అని వరంబొసంగి చనియె. దానంజేసి వాలి పరాక్రమవంతుం
డయ్యె నాకర్ణింపుము. 93

—♦ వా లి ప రా క్ర మ ప్ర కా ర ము ♦—

సీ. వాలి వేకువ లేచి నాలుగుదిక్కులఁ
గలసముద్రంబులఁ గలయ నాడుఁ
బర్వతంబుల నెత్తి పైకి నెగురవేసి
తల యొగ్గిపడినంతఁ దాల్చు వానిఁ
గొండకు రెండింత లుండినదుందుభి
దునిమి యెగురవేసె దొడ్డమేను
సప్తసాలములను సందిటిలోఁ బట్టి
యొకసారి తేకుల నూడలాగె

ఆ. వాలియెదుటఁ బడినవాఁ డెప్పుడుం గాని
బ్రదికి బట్ట గట్టి బయటఁ బడుట
కానరాదు నీదుఘనశక్తిసామర్థ్య
ములు నతిక్రమించుఁ దెలియ నతని. 94

మ. అన రాముం డను నాసమర్థత యెడఁగా స్వాంతంబునం గొంకు నీ
కు నితాంతం బగు నంచు నవ్వి యెదుటన్ ఘోరాకృతిం గూలియుం
డిన యాదుందుభిపెద్దమే నెగుర నెట్టెన్ గాలిపెన్ వ్రేల న
ద్ది నభం బంటి పదామడల్ చని పడెన్ దిగ్గేశముల్ దద్దిరన్. 95

వ. అనంతరంబ సుగ్రీవుండు. 96

మత్త. ఒక్కసాలము సేయు చూచెద నోరఘూత్తమ! నాఁగఁ దా
నొక్క బాణము తోడ సాలము లొక్కమా అవి యేడున్
ముక్కలై పడె దానిఁ గన్గొని మోద మొందుచు వానరే
ట్టక్కజంపడి రామచంద్రునియంఘ్రులం బడి మ్రొక్కెన్.

శా. నానోముల్ ఫలియించునట్టి వగఁచుఁడ నల్వాంఛ నే నింక నా
చానన్ గూడి కపీంద్రరాజ్యమునకున్ స్వామిత్వమున్ గాంచి బ్ర
హ్మానందంబునఁ గాలమున్ గడపువాఁడై యుందు శ్రీరామచం
ద్రానూన ప్రతిభావిశేషమున నం చత్యంతహర్షంబునన్. 98

వ. రామచంద్రునకుఁ బునఃపునఃప్రణామంబు లాచరించుచున్నంత రామచంద్రుండు సుగ్రీవా! నీ విప్పుడ పోయి వాలితోడ నాలంబు గావించుచుండుము నేనును నీవెన్క దన్ని వచ్చి మీరు పోరుచుండ వాలిం గూల నేయుదు ననిన ముదంపడి సుగ్రీవుండు కిష్కింధానగరోపకంఠంబునకుం బోయి రోదసీకుహరం బవియ రంహంబుగ సింహనాదంబు సేయుటయు వాలి వానిం దెలిసి సమరసన్నాహం బమరించుకొని దాఁటివెడలఁ దలంచి యున్నప్పుడు తార వారించి వాలి కి ట్లనియె. 99

—♦ తార వాలితో యుద్ధంబు వలదని చెప్పుట ♦—

శా. కీశాధీశ్వర! నీకు నోడి మును సుగ్రీవుండు గ్రీవంబులన్
బాశ స్త్వం బడి యుండువాఁ డిపుడు పూర్వం బట్లు గా కొక్కభూ
మీశపాగ్రణిపాప్రపున బ్రబలి తా నీకితి నిఁ మాక్కనం
గా శంకింపక వచ్చె నిచ్చటికి నిక్కం బిట్లు వ్రాక్రుచ్చితిన్. 100

చ. మునుపటివాఁడు గాఁ డగుటఁ బోరికి నీవు గడంగి పోవుటల్
వనచరనాథ! కీడునకు వచ్చును గావునఁ జెప్పుచుంటి నా
విని వనచారి తారఁ గని వేఁటిడి వాఁ డిపు డేరిపంపునన్
ననుఁ జెనకంగ వచ్చె నెలనాఁగ! యెఱుంగుదు వేనిఁ జెప్పవే.

తరు. అనఁ దార యి ట్లను నంతరంగమున
నరసి యొక్కింతలో నధిప! దశరథ
తనయుండు రాముఁ డన్ దలితారి యొకఁడు
తమ్ముఁడు సౌమిత్రి త న్నంటియుండ
వని నాలిఁ గోల్పోయి వనటఁ గ్రుమ్మరుచు
నచ్చి సుగ్రీవుని వలన సఖ్యంబు

పొసరించె నందునఁ బురికొని యతఁడు
పోరొనర్పఁగ వచ్చెఁ బూని నీతోడ. 102

తే. మేటి విలుకాఁడు కోసలమేదినీశ
నందనులు ఘనుల్ ద్వివిదుండు మైందుఁ డనిల
తనయుఁడును జాంబవంతుఁడుఁ దనకుఁ దోడు
పడుట సుగ్రీవుఁ డిప్పుడు ప్రబలుఁ డయ్యె. 103

క. అని విన్నవించి త న్నటఁ
జనవల దనుతారమాట సరకుగొన కెదన్
వనచరుఁడు దాని సుగ్రీ
వునిదానిగ నెంచుచుం దవుం దవు ననుచున్. 104

వ. పరుషాక్షరంబుల నధిక్షేపించి తత్క్షణంబ గుహాముఖంబునుండి వెడలి మాల్యవదభ్యాశంబున నున్నసుగ్రీవుని కడకుం బొడసూపి కోపంబున ని ట్లనియె. 105

చ. తడవలు పెక్కు నం గలనఁ దాఁకి జయం బన నెట్టిదో వినం
బడమి వడంకుచున్ వెఱచి పాఱితి సిగ్గు దలంప కేను న
ప్పుడు సహజుండ వౌ మ్మనుచుఁ బుచ్చితి నిన్ గరుణించి చంప కి
ప్పుడు బ్రదుకంగ నాస విడి పోయెనె వచ్చితి విట్లు వేటేఁడీ. 106

వ. అనిన సుగ్రీవుండు వాని కి ట్లనియె. 107

తే. ప్రాణములకన్నఁ బ్రాణమై క్రాలు నాలు
రాజ్యమును గోలుపడి ఝలం బూజ్యత చెడి
యున్ననా కీయెడల్ కాల్పనో యటంచుఁ
దెగువ మెయి వచ్చితిని నిన్నుఁ దగిలి పోర. 108

వ. అంత వా రొండొరుం గవిసి. 109

— వాలిసుగ్రీవులయుద్ధము —

మత్త. సాలతాల శిలాయుధంబు లెసంగఁ దాలిచి లీలమై
నోలివ్రేయుచు డాయుచుం గడు నుద్ధతిం గొని క్రుద్ధులై

కోలుపోవక కోల్పులు ల్చబెతెఁ గ్రోల్చి కోల్తల హెచ్చఁగా
నాలముం బొనరించి రెల్లరు నద్భుతింపడి మెచ్చఁగన్ 110

శా. కొండం గొండయుఁదాఁకి పిండియగుచుం గుండల్ బలెంగూలుచో
మెండై చప్పుడు పుట్టి బిట్టవిసె నామిన్నంతయున్ మ్రోసె నొం
డొండై లేచిననిప్పు లుప్పరమునం దొప్పెన్ గడున్ మంటలై
గుండెల్ దీసినబంటు లయ్యిరువురున్ గోరాడి పోరాడఁగన్. 111

వ. అతం గొంతవడికి మల్లయుద్ధసన్నద్ధులై. 112

ఉ. ఒండొరు ముష్టిఘాతముల నుద్ధతిఁ జూపుచు బిట్టుముట్టుచున్
గొండొక త్రోయుచుం దిగిచి కొట్టుచుఁ బట్టుచుఁ బెట్లు వెట్టు చు
ద్దండపరాక్రమంబునను ధారణి గ్రక్కదలంగ మెట్టుచున్
గొండయుఁ గొండయుం బలెను గూడుచువీడుచుఁ బోరిరార్చుచున్.

శా. పక్షిద్వంద్వము వోలె బిట్టెగయుచుం బాదమ్ములం గొట్టుచున్
బక్షోద్భేదము సేయుచున్ విసరి క్రిందన్ ద్రేయుచుం ద్రోయుచున్
రక్షఃప్రక్రియఁ బెద్దప్రొద్దిటులు పోరన్ రక్తసిక్తాంగులై
వీక్షింపం దగి రిద్దఱున్ సుమచయావేల్లత్పలాశక్రియన్. 114

వ. ఇట్లు వాలిసుగ్రీవు లిద్దఱుబద్ధమత్సరు లయి యుద్ధంబు సేయుచుండ
రాఘవుండు వారిం బోలింపఁ జాలక వాల మేమ్రయ కూరకున్నంత
సుగ్రీవుండు సుపరిశ్రాంతుండై పరాఙ్ముఖంబు వెట్టి వెఱచఱచి
పఱచి రఘుపతిచెంతకుం జని బెట్టు నిట్టూర్చుచు ని ట్లనియె. 115

మ. వరదా! వాలికి నేను జాల నని మున్ వాక్రుచ్చియుంటిన్ నను
దుర మం దింతటిలోన వాఁడు నను మృత్యుంగొల్వగాఁ బుచ్చెడిన్
బరిభావంబున నేను గన్నొఱఁగి యీభాతిన్ నినున్ వెండియున్
బరికింపం గలభాగ్య ముండుకతనన్ రాఁ గల్గితిన్ రాఘవా. 116

క. రాముం డను సుగ్రీవా
నే మాట యొసంగి యుంటి నే కాని యటుల్
గామించి చేయ లే దని
నీమానసమందు నలుక నిలిపితి వకటా. 117

చ. నడలును హావభావములు నవ్వులు మాటలు నీటుగోటులున్
కడుములు కాలుపోంకములు కాయసముచ్ఛ్రియశోభ లంకముల్
నిడివియు నొక్కటీ యగుచు నీవును నీదు సహోదరుండు నే
ర్పడ నగుటన్ శరంబు విడువం దల కయ్యె మదిన్ సుహృద్వరా.

చ. అతఁ డని నీపయిన్ ఖరతరాశుగ మేసిన మోసమై కడున్
గుటిలవడంగ నయ్యెడినొకో యని తూణమునుండి తీసియున్
గతిచెడ నుంటి నా కొకటి కా దని చెప్పెదనో కపీశ్వరా
మతి మఱి యొండుగాఁ దలఁప మానుము నిక్కము విశ్వసింపుమీ.

తే. అనుచు లక్ష్మణుఁ గనుఁగొని యనుజ! వీని
యరుత నడియాలముగఁ బుష్పహార మొండు
వేయు మనుటయు లక్ష్మణుం డావెస గజ
పుష్పమాలిక నిడె నర్కపుత్రునిమెడ. 120

ఆ. రాముఁ డనియె నింక రంహముగాఁ బొమ్ము
వాలితోడ మఱియు నాలమునకుఁ
గడఁగు మేను వచ్చి కడ తేర్తు నవ్వాలి
ననుచుఁ బుచ్చి తాను వెనుక నరిగె. 121

వ. సుగ్రీవుండును దొంటియట్ల పురద్వారంబుకడకుం జని రోదసీ
కుహరంబు భేదిల్లునట్లు ఘోరారవంబు గావించె వాలియు నాల
కించి తనలోన. 122

ఉ. వెండియు వచ్చె నివ్వెడఁగు వీనికి మేనిపయిన్ రవంతయే
నుండదు వాలు నాస యిటు లుద్ధతిసూపఁగ వచ్చె నెద్దియే
నండ లభించెనో యనఁగ నయ్యది సున్నయె యుండనిమ్ము నా
దండ నెవండు నిల్చి భుజదర్పము సూపఁగలాఁడుగల్గెడిన్. 123

వ. అని కోపాటోపంబునఁ గ్రిందు మీఁదునుం గానక హుమ్మని
రోజుచుం జని దట్టి బిగించి కట్టాయితంబైయున్న సుగ్రీవునిం జూచి
సమీపించి యి ట్లనియె. 124

శా. ఓరీ! యిప్పుడకాదె దెబ్బతిని మొఱ్ఱోయంచుఁ గుయ్ వెట్టుచున్
జేరం బాఱితి ఋశ్యమూకమునకుం జేఁ బూని ప్రాణంబు లో
రోరీ! యొక్క సుమంతమాత్రమున నీ కుగ్రాంతకాగారదు
ర్ద్వారంబుం గనుమేలు గూర్చెదను పోవం జాల విం కెట్టులున్.

మ. అని సుగ్రీవునిమస్తకంబునను హాహావృష్టి బిట్టేసె ము
ష్టినిపాతంబున గోత్రభేది మహీభృచ్ఛృంగంబుపై వజ్రముం
గినుకన్ వేసినవాసి నంతనను సుగ్రీవుండు క్రిం దయ్యె. నా
య్యన మీఁదై వడి వాలిపక్షమున నిర్ద్రావంబు రా మోదుచున్.

సీ. కాలాగ్నిరుద్రుఁడై వాలి వాలంబున
సుగ్రీవుకంఠంబుఁ జుట్టిపట్టె
నతఁ డాతనిం బట్టియటిటు లాడించి
పిడికిట ఱొమ్మున బిట్టు గొట్టె
బాహుపాశంబుల వా రొండొరుం జుట్టి
బంధించి బంధించి పట్టి విసరి
ఖరనఖరంబులఁ గండలు పెకలించి
గుండెలు ప్రగులంగ గ్రుద్ది గ్రుద్ది

తే. వృత్రవాసవులకుఁ బోలె విడక ముష్టి
బాహుపదజానువులఁ బట్టి పట్టి పిఱుతి
వియక యొండొరు కొండల వృక్షములను
బోరఁ జొచ్చిరి చూప అబ్బురము పడఁగ. 127

వ. ఇ ట్లొక్కముహూర్తంబు ఘోరయుద్ధంబు గావించినంత నింద్ర
నందనుం డుక్కుమిగిలి. 128

ఉ. కొండలఁ బిండిసేయుటకుఁ గూఁడ సమర్థత గల్గి లో నయః
పిండము గల్గుముష్టిఁ గడుబింకము దోఁపఁగ బట్టి సూర్యపు
త్రుం డిక నుండఁ డన్నటులు దోర్బల మేర్పడ నేయ నెత్తఁ బై
నుండి కడున్ వడిం బడఁగ నుండిన జాడ యెఱుంగవచ్చుడున్. 129

—♦ రాముఁడు వాలిం గూల నేయుట ♦—

ఆ. లక్ష్మణుండు దాని లక్షించి రఘురామ !
వేగిరింపు మదిగొ వేఁడిపిడుగు
వేయుచుండె వాలి వెస సూర్యసూతిపైఁ
జూడు చూడు మనుచుఁ జూపుటయును. 130

మ. శర మాశీవిషతుల్య మొండుగొనుచున్ జాపంబునం గూర్చి పే
ర్చి రఘూత్తంసుఁడు సత్వరంబుగ విసర్జింపంగ నయ్యమ్ము ము
మ్మరమై వాలియురంబునం బిడుగునా మార్మ్రోయుచున్ వ్రాల నా
సురరాణ్ణందనుఁ డంతఁ గూలె నిలకున్ క్షోణీధరంబో యనన్.

క. హాహాకారము సేయుచు
నాహరిహాయపుత్రుఁ డట్టు లవనిం బడఁ గా
శ్రీహరి లక్ష్మణసహితుం
డై హరికడ కరుగుదెంచె నారయుపొంకెన్. 132

వ. అట్లరుగుదెంచినరామునిం గని వాలి పరుషాక్షరసమన్వితంబుగ
ని ట్లనియె. 133

సీ. రాసుతుం డవు నీవు ప్రథితుండవును గుణీ
నుఁడవు తేజస్వి వన్నుడువు గలుగు
నేఁ బరాఙ్ముఖుఁడనై యితరునితోఁ బోరు
చున్నప్డు నను నేయ నొప్పునొక్కొ
కరుణార్ద్రభావుఁడు వరమతి రామచం
ద్రుండని భూతముల్ నుడువుచుండు
శమము దమంబును క్షమయు సత్యంబును
రాజధర్మంబు లో రామచంద్ర

తే. దండ మపరాధిపట్టున ధర్మ వగును
నిరపరాధుని న న్నిట్లు నీవు ధర్మ
మునకు గాకుండుమార్గమునను మెలంగి
నట్టిఁడై కొట్టితివి నన్ను నర్హ మగునె. 134

ఆ. నేను నీకుఁ గాని నీదేశమునకుఁ గా
నీ యొకప్పు డైన నెట్టికీడు
మూఁడఁ జేసియున్నవాఁడను గాను నీ
తోడఁ గయ్యమునకుఁ దొడరి రాను. 135

శా. ఏపాపంబు నెఱుంగనట్టినను నీ వీకీతినిన్ జంపుటన్
నీపాపంబున కంత ముండదు మదిన్ నీ వర్థధర్మంబులన్
రూపింపం దలపోయ విందియవశారూఢస్థితిం బొంది త
ద్వ్యాపారంబున సంచరించెదవు యుక్తాయుక్తశూన్యుండవై. 136

తే. మృగయ రాజుల కొప్పునం చిట్లు చేసి
నాఁడ నందువో భుజియింపఁ గూడనట్టి
జంతువును జంపరా దను శాస్త్ర మకట
క్రోతిమాంసము చర్మము గొనఁగరాదు. 137

ఉ. నాయెదుట న్మెలంగుచు రణం బొనరించిన వాఁడవేనియుఁ
నీయెడఁ గల్గులావు ధరణీ దెలియం గలదై తలిర్చెదుఁ
జేయక తత్క్రిమంబునను జెట్టుమఱుంగున నక్కి చంపి తీ
వీయపచారకార్యమున కీ వొకయింతయు సిగ్గు నొందవో. 138

సీ. భార్యాపహర్తను బట్టి వధింప సు
గ్రీవునితో సఖ్య మీవు చేసి
నిరపరాధుని నన్ను నిర్జించి టిటు గాక
నన్నె కోరిన నొక్కకన్నులోనఁ
దెక్కలికానిని దివిరి చంపకయుండి
జానకిం గొని వచ్చి నే నిడ నొకొ
లో నించుకైన నాలోచింప వైతివి
ధర్మమొకింతయుఁ దలఁపవైతి

తే. నీదుదుష్ప్రవర్తన మెల్ల నాదు పత్ని
తార వచియించె నే నీవు దశరథావ
నీపతిసుతుండ వని లోన నీభయంబు
విడిచి యుండుట నిర్జితి నుడువనేల. 139

వ. అని పలికి రామశరాభిఘాతవ్యథితుండై నోరెండుకొనిపోవ మాట లాడ నేర కూరకుండినంత రామచంద్రుండు వాలికిం దెలియ వచ్చున ట్లి ట్లనియె. 140

సీ. తినరానిమృగమును దెగవేయ రాదంటి
వది వేటకారుల కైన మాట
నిన్ను వేఁటాడంగ నే వచ్చి చంపను
చంపుదు ధర్మరక్షణముపొంటె
పగ లేదు నాకంటి వగు నగు ధర్మవు
నకుఁ బగతుఁడ వైన నాకుఁ గావె
భ్రాతృభార్య హరించి పాపి వైతివి నీవు
మరణదండన నీకు మనువు జెప్పె

తే. ఎదుటఁ బడువారిబలము నీ కదుక వచ్చు
వరము కల దది చెల్లింప వలయు నిన్నుఁ
జంపవలయుఁ గావున నిట్లు సలుప నయ్యె
దాన దోషము శంకింపఁ దగవు గాదు. 141

తే. అన్న తండ్రికి నెన యగు ననుజునకును
నీకు సుగ్రీవుఁ డనుజన్ముఁ డై కొడు కగు
వానిసతి గోడలున్న గూఁతు రౌను దాని
నంటి శిక్షార్హుఁ డైతివో యగచరేంద్ర. 142

శా. శిక్షార్హుండవు గాన రాజు నిను శిక్షింపం దగుఁ నేను త
త్పక్షంబుం గొని నిన్నుఁ జంపితిని జెప్పఁ వచ్చు రాడ్ధర్మ మీా
శిక్షం జెప్పెను నీకు ద ప్పనుచు వాచింపంగ నోఁ దప్పయై
ఋక్షాధీశ్వర కన్ను విచ్చి యిఁపుడే నీక్షింపుమా ధర్మముఁ. 143

సీ. నాకుఁ జెప్పిన సీత నీకింతలోఁ దెచ్చి
యర్పింప కుందునే యంటి వీవు
రావణుని జంపంగఁ బోవునాకు సహాయ
మొనరించువాఁడ వై జనన మొందితి

దేవతాద్రోహివై రావణుతో సఖ్య
మాచరించితి విట్టి యఘయుతుఁడవు
నీతోడు నేఁ గోరి నీచేతఁ గార్యము
సాగించుకొను టది సాధుమతమె?

తే. నేను రావణుతోఁ బోర నీవు వాని
పక్షమై నన్నుఁ బోరంగ వత్తుగాదె
తెలిసి నినుఁ గూల నేసితి తెలిసికొనుము
నీదుతప్పిందుఁ గలుగునో లేదొ యనుచు. 144

వ. అనిన వాలి వానివాక్యంబు లాలకించి ధర్మజ్ఞుండును బ్రశాంత
చిత్తుండునునై చేదోయి మోడ్చి యి ట్లనియె. 145

సీ. సత్యపూతములు నీసదమలవాక్యముల్
సర్వజ్ఞుఁడవు నీవు సన్నుతాత్మ
యజ్ఞానవశమున నత్త్రబాధంజేసి
మతిచెడి యేమేమొ మాట లంటి
నను సైచి మన్నింపు మని వేఁడు చుంటిని
సర్వేశ్వరుఁడ వెన్న సాధురక్ష
గావింపఁ బుట్టితి వీవు వైకుంఠుఁడ
వే నెఱుంగుదు నీదునేర్తెఱ యది

తే. ధర్మబాహ్యుఁడ నగునన్ను దయఁ దలంచి
కాచిపుచ్చితి నను మేను గాశ్యపీంప
శిక్షితుఁడనయి పూతుఁడై చెన్నుమిగిలి
యుంటి నని చెప్పుచుంటి నోయుర్వరేశ. 146

— తార వాలికై పరిదేవనంబు చేయుట —

వ. ఇట్లు వాలి తన తప్పు దాఁ దెలిసికొని పశ్చాత్తాపతప్తుండై వేదనా
భరంబున మాట లాడనేరక నమోవాకంబు గావించుచున్నంత
నోరు నెత్తియు మొత్తికొనుచుఁ దత్తరంబున సుషేణపుత్రిక యగు

తార కుమారునితోడఁ గొనిచి వచ్చి పతిమీఁదంబడి బడిబడి యడ
లుచు కన్నీరు మున్నీరై పొరలి పరిదేవనంబు చేయుచు. 147

సీ. హా నాథ! హా నాథ! హా జీవితేశ్వర!
నీ మహాశౌర్య మ దేమి యయ్యె
వల దనుచుండఁగా వచ్చి యిట్లైతివే
నేను జెప్పితిఁ గదే నృపునిబలము
మాయావి క్షణమాత్రి మర్దించినబలంబు
పదటను గలసెనే ప్రాణనాథ!
నను బహిఃప్రాణమం చనుదానినిఁ వీడి
పోవుట ధర్మమా భూరితేజ!
తే. నిన్నుఁ బెడబాసి యే నొక్కనిముష మేని
బ్రిదుకఁ జాలను నాతోడు వదలఁ బోక
నన్ను గొనిపొమ్ము నీతోడ నాకు నీవు
లేనియప్పుడు సర్వము లేనియదియె. 148

మ. సుకుమా! నీబుణ మీఁగె సంతసమ! నాసూఁడైతి దుఃఖంబ! కొం
కక నన్నుఁ బలిగొమ్ము ప్రాణమ! యిఁకఁ గాయంబునం దుండి తె
మ్మ్మ కుమారా! పరునిఁ భజింపఁ జను మోహమోహంబ! నీయాస లి
ట్లోకమాత్రింబునఁ గూలిపోయె నిపు డయ్యో నావిభుం డేగుటన్. 

ఆ. లేక లేక పుట్టె నీకొడు కొక్కఁడే
యంగదుండు వాని నట్టె విడిచి
పోవ నెంతు వద్దిపోలునే ప్రాణేశ!
కన్నకొడుకు నిట్లు కనుమొఱంగి. 150

వ. అని పలుతెఱంగులఁ బలవరించుచు బరితపించుచున్నంతఁ గన్నుఁ
దెఱచి వాలి తారం గాంచి యి ట్లనియె. 151

శా. నాకై నీవు తపింపఁ బోవకుము కాంతా! నేను లోకేశ్వరున్
లోకారాధ్యుని సేవ చేయుటకు నీలోఁ జొప్పుచున్నాఁడ నా
వైకుంఠుం డగునీరఘూద్వహుఁడు నాపాపంబు వోకార్చి నా
కాకైవల్య మొసంగె నీ వితని సంప్రార్థించి శ్రేయ లందుమా. 152

వ. అంగదుం గాంచి లాలించుచు ని ట్లనియె. 153

ఆ. నీవు నన్నుఁ బోలె నెఱి మీఱ సుగ్రీవు
నితని నాశ్రయించి యెపుడు రామ
కార్యతత్పరతను గైకొని యుండుమా
రాముఁ డఖిలలోకరక్షకుండు. 154

—♦ వాలి రామసుగ్రీవుల కంగదు నప్పఁజెప్పుట ♦—

వ. రామచంద్రునిదిక్కు మొగం బై యంగదుం జూపుచు. 155

ఆ. వీఁడు నాసుతుండు వీని నీసుతునిఁగా
నేలికొను మెఱుంగఁ డేమిగాని
బాలభావుఁ డనుచుఁ బాలించి నెనరుంచి
పనులు గొనుము వీనివలన రామ. 156

వ. అని సుగ్రీవుని జెంతకుం జే ఱీచి పిలిచి వచ్చినవాని నక్కునం
జేర్చుకొని తనకంఠంబునం గలకాంచనమాలం దీసి వానికంఠం
బున వైచి యంగదునిచేయి వానిచేతం బెట్టి. 157

మ. ఇదె నీ కప్పన సేయుచుంటి గొమరుం డీయంగదుం డింతయుఁ
హృదయార్థంబు లెఱుంగఁ జాలఁడు కృపన్ వీక్షించి నీ వీతనిన్
బదములన్ గొల్చెడు వానిగాఁ గొనుచుఁ బ్రోవం జూడుమీ వానరే
ట్పదముం గైకొని భూపుత్రిజం గరుణమైఁ బాలించి రక్షింపుమా.

వ. అని నలుగడం బరికించి మిత్రులారా! హనుమజ్జాంబవదాది
మహాప్రధానులారా! మీరు నాయపరాధంబు లెల్ల సయిచి
నాయం దనుగ్రహదృష్టిం బ్రతిష్ఠింపుఁడు పట్టభద్రుం డైనసుగ్రీవు
ననుగ్రహంబునకుం బాత్రములై ప్రవర్తింపుఁ డని రామచంద్ర
మూర్తిన్ దేరి పాఱం జూచి హృదయమధ్యగతుం గావించుకొని
రామతారకంబు స్మరించుచుఁ బ్రాణంబులం బాసె. 159

ఉ. అప్పుడు వాలిబంధుజన మంతయు నెంతయు సంతపించుచున్
ముప్పిరి గొన్నశోకమున భూతలమంతయు మ్రోయ నేడ్చుచున్

ముప్పనువార్ధి ముగ్గి తలపోయుచు నుండెను దత్ప్రవృత్తికిన్
జెప్పఁగఁ జాల మాప్రికృతిచిత్రము దుఃఖసమేత మారయన్. 160

సీ. ఏప్పుచున్ సుగ్రీవుఁ డేతెంచి రాముని
చెంతకుం గన్నీరు చెదరిపాఱ
నన్న చేసినచేత కట్టిట్టు వడి సహో
దరు నిట్లు చంపించి తరయఁ జోక
యంగదుండును హారు హారు మంచేడ్వ నా
కడుపు చెర్వాయి పోయె నుడుగు లేల
శోకింతు రెల్లరు నాకుఁ గిష్కింధాధి
పత్యము పూనుభావంబు వోయె

తే. జీవితము మీఁద నాశయుఁ జేయ నిపుడు
నెత్రు కూ డిది భుజియింప నేను నేర్వ
నంగదున కిచ్చి రాజ్యము నడవులందు
శేషకాలము పుచ్చంగఁ జిత్త మగును. 161

చ. అనవుడు రామచంద్రుఁడు నయంబునఁ దారసమీపభూమికిన్
జనుటయు నామె రామునకు సాఁగిలి మ్రొక్కి మహాత్మ! దుష్టులన్
దునుమఁగఁ బుట్టినట్టిడవు దోర్బలశాలివి నావిభుండు చే
సినసుకృతంబు మంచి దని చెప్పుదు శ్రీపతిచేతఁ జచ్చుటన్. 162

తే. పురుషునకుఁ బత్ని పెడఁబాసి పోక మిగుల
కష్ట మగుఁ గాన వాలి నాకై వియోగ
దుఃఖ మొందెడు నను వానితోడఁ గూడు
నట్లు చా నేసి పుణ్యము నందు మధిప. 163

వ. అనిన రాముం డి ట్లనియె. 164

మ త్త. వీరపత్నివి నీకు నిట్టులు వేలకుం బలెఁ బల్కుటల్
మేరయే సుఖదుఃఖముల్ కడిమిం బురాకృతకర్మసం
స్కారసంగతిఁ గల్గుచుండును సన్మునీంద్రులు దేనికిన్
సారహీనము గా మెలంగరు సాధ్వి! సత్పథ మెంచుమా. 165

క. వాలి వధాత్మకమరణం
బీలాగునఁ బొందఁ గలుగు నెగ్గు పౌనర్భే
మేలైనలోక మంచం
జాలినవాఁ డయ్యె నిపుడు సాధ్వి! యెఱుఁగుమా. 166

—♦ సుగ్రీవపట్టాభిషేకము ♦—

వ. అని సుగ్రీవాంగదప్రభృతులతోడం దగునట్లు పలికి వాలికిం బ్రేత కార్యంబు నిర్వర్తింపుం డని నియోగించుటయు సుగ్రీవుండు హనుమదాది సఖులం గూడి దహనసంస్కారాదు లన్నియు నం గదుచేతం జేయించి తారాద్యంగనల నెల్లఁ గిష్కింధాంతఃపురంబు నకుం బుచ్చి రామచంద్రునిఁ దరియవచ్చె నపుడు హనుమంతుండు రామచంద్రుం గాంచి యిట్లనియె. 167

మ. మనసుగ్రీవుఁడు వానరాధిపతియై మాహేంద్ర సంపద్విభు
త్వనిరూఢిన్ వెలుగొందునట్టులు పౌనర్భం జెల్లుఁ గాన న్బురం
బున కీ ర్వచ్చి మహాభిషేకవిధులం బొల్పొందఁ జేయింపఁగాఁ
జను నం చేము దలంచుచుంటిమి మహాత్మా మండలాఖండలా.

తే. అనుడు రాముఁడు పదునాల్గుహాయనములు
పురము గ్రామముఁ జొర రానివరనియమము
కలదు గావున నే రాను గాని నాదు
తమ్ముఁ డరుదెంచు మీ రేగుఁ డిమ్ము నకును. 169

క. ఇనతనయు రాజుఁ జేయుచు
ఘను నంగదుని యువరాజుఁగా నొనరింపుం
డని యానతిచ్చి వారలఁ
జనుఁ డని లక్ష్మణునితోడ సాఁగం బంపెన్. 170

వ. సుగ్రీవుండును రామాజ్ఞ నాదలం గొని లక్ష్మణునితో జాంబవదా దులతోఁ గిష్కింధాపురంబునకుం జని పౌరజానపదానుమతం బున యథావిభవవిస్తరంబుగం బట్టభద్రుండై రుమతో యువరా జగు నంగదునితో లక్ష్మణుం గూడి ప్రస్రవణ పర్వతంబున నున్న

శ్రీరామునిదర్శనంబు గావించి పట్టాభిషేకవృత్తాంతం బంతయు
నివేదించి దేవా! యిదే వర్షర్తు వాసన్నం బైనయది యిది పోయిన
పిమ్మట సీతాన్వేషణంబు గావింతు మంతదనుక మీ రిందు విశ్రా
మింపుం డని రాముననుజ్ఞ వడసి యెల్లవారితోడం గూడి పురం
బున కరిగి రుమతోడం గూడి మాడి సుఖంబుండె రామలక్ష్మ
ణులును ప్రస్రవణగిరిగుహ నివాసంబు గావించుకొని కాలంబు
గడుపుచుండి రప్పుడు. 172

## —♦ వ ర్షా కా ల వ ర్ణ న ము ♦—

క. అంతటఁ బ్రావృట్కాలము
సంతతగర్జార్భటీ ప్రసంగతసాంద్రా
నంతాభ్రావృత సర్వది
శాంతరమై దోఁచె విరహు లట్టిట్టుపడన్ 172

సీ. మేఘావృతం బయ్యె మిన్నెల్ల నుఱుములు
మెఱుములు తఱచయ్యె మిసిమి దోఁపఁ
దరణిప్రభ యడంగెఁ దారకల్ నిశ మాసెఁ
బడమట నింద్రచాపములు దోఁచె
విడక రేలుఁ బవళ్లు వడి హోరు మని జడుల్
పడియెఁ దాపము పటాపంచ లయ్యె
నృత్యంబు గావించె నెమ్మిలు మత్తిల్లి
భేకరుతంబులు పెచ్చుపెఱిఁగె

తే. వారిపరిషిక్తమై ధరావలయ మెల్ల
శాంత మయ్యె స్రవంతు లశ్రాంతకాంతి
మత్ప్రవాహము లయ్యె సమస్తభూత
సంతతికి సౌఖ్యమయ్యె నాసమయమందు. 173

మ. పురువార్ధారలు చంచలద్ద్యుతులు సంపూర్ణాసితాంగంబులున్
నిరతోద్యద్ఘనగర్జలుం గలిగి నిర్నిద్రప్రభావంబునన్

సురవర్త్మంబున నబ్దముల్ మదమునన్ జొత్తిల్లి సింధూరభా
స్వరనీలేభము లెప్డు బృంహితములన్ వర్తించు నా నొప్పెసన్.

మ. జలజధ్వానము మర్దలధ్వనులుగా శంపాలతల్ గుగ్గులూ
జ్జ్వలకీలమ్ములుగాఁ బ్రవర్షరుతి భాస్వద్వాద్యజాలమ్ముగా
నలిఝిల్లీకులనాద మున్నతగతిన్ వ్యాపించుగీతమ్ముగా
సలిపెన్ నృత్యము కేకిలోక మెపుడున్ షష్ఠంబునం బాగుమన్.

ఉ. వారిదసంభృతాసితనభస్థ్సలమందు మహోగణప్రభా
సారసముజ్జ్వలం బయి యొసంగుసురాధిపచాప ముర్విపైఁ
దీరి స్ఫురించెనో యనఁగఁ దేజరిలున్ సురగోపగోష్ఠమై
భూరితరప్రభూతతృణపుంజసమంచితభాగ మత్తఱిన్. 176

ఆ. దెసలు మాఱు మ్రోయఁ గొసరి కేకారవం
బెసఁగఁ బురులు విప్పి విసుగ కాడు
నెమ్మిగములఁ గాంచి నెమ్మది లల్లాడ
విరహిజనము చాల వెగడు గుడిచె. 177

తే. చాలఁ దపియించుచుండెడునేలపడఁతి
తొలకరిని వర్షబిందువుల్ గలయఁ బర్వఁ
గొసరి కమ్మతావుల నావి గుప్పుమ్మరించె
నపుడు విరహులనిట్టూర్పు ననుకరించి. 178

మ. జనితోష్ణంబునఁ జిక్కియున్నతటినీశర్వర్యటీవారముల్
ఘనకీలాలము పొట్టనిండఁ గొని తత్కాలంబునం జియ్యఁబ
ట్టి నికాయ్యంబులఁ గూల్చి సర్వమతిధాటిం గొంచు గాల్సేతు లా
డనిచో జంతుల నెల్ల ఘిర్రింగి పురము ల్మాయించి పాఱు న్వడిన్.

ఉ. వేఁడివెలుంగు రశ్మిలను వేసఁగిఁ గ్రాఁగిననీళ్ళుమండి పై
కీడెడునావి యభ్రమున కేగి సదాగతిశక్తి నభ్రమై
క్రూఁడి జలస్వరూపమును గొంచు ధరం బడు వెండి వర్షమై
వీడి పదంబు త్రిప్పపడుపీఁడికిన్ జనవే యధోగతుల్. 180

వ. అట్టి ప్రావృట్కాలంబున శ్రీరామచంద్రుండు లక్ష్మణసమేతుండై గిరిగుహాభ్యంతరంబున నధివసించి సర్వకాలసర్వావస్థల జానకి సంస్మరంగంబునం దిడుకొని గడియ యొకమహాయుగంబు చందంబునం గాలంబు వెళ్ళంబుచ్చుచు. 181

చ. మొయిలు లసగంగ నింగి యిది మున్దటియట్ల వినిర్మలత్వముం గయికొను నెన్నఁడో పుడమిఁ గల్గినసేళ్ళల నీళ్లు లింకి మే లయనము లేర్పడన్ బురద లన్నియు నెండి ప్రయాణయోగ్యమై ప్రియమిడు నెన్నఁడో యనుచుఁ బ్రేయసిఁ బాసినవంత వందురేన్.

వ. అంత నక్కడ లంకాపురంబున రావణుండును. 183

—♦ లంకలో సీతాదేవి పొందుకష్టములు ♦—

మత్త. తాపసాశ్రమసన్నిభం బయి తద్దయుం బొలుపొంది లం కాపురంబున నానశోకసుకాననంబునఁ దాపసీ రూపముం గొని చిక్కి మిక్కిలి రోఁజుచున్నమహీసుతం దాఁపి కాపుగఁ బెట్టెఁ జుట్టును దైత్యదానవకాంతలన్. 184

వ. వారును బ్రాసాసి శూల పరశు పట్ట సాలాత ముసల ముద్గర పరిఘాద్యాయుధంబులు ధరించి పరివేష్టించియుండి రందు నేకాక్షి ద్వ్యక్షి త్ర్యక్షి లలాటాక్షి దీర్ఘజిహ్వా యజిహ్వక త్రిస్తని యేక పాద యేకలోచన లోనగువారు వికృతాకారంబులు గ్రాల రేఁబవళ్లుడయక పరుషవ్యంజనస్వరంబున భర్జించుచు నమ్మించుచుఁబోఁడిం గాంచి. 185

ఉ. సుందరి! నీవు మాప్రభుని సుందరవిగ్రహు రావణేశ్వరుం బొందవ యేని కత్తులను మొత్తుచు నిత్తఱి నిన్నుఁ బట్టి మే మందఱ మొక్కపెట్ట తిల లంతలుగా విభజించి నీయొడల్ తిందుము నల్లఁ ద్రావుదుము తీఱెడు నీబ్రదు కింతమాత్రలోన్.

వ. అని తర్జనభర్జనంబులం గర్జించి పలుకుచున్నవాండ్రపలుకుల కలుకఁ జెందక భర్తృశోకసమావిష్ట యగుసీత బెట్టు వెట్టనిట్టూర్పు నిగిడించుచు నిట్లనియె. 187

ఆ. తల్లులార మీరు తడయక నను జంపి
తినుడు బ్రతుకునాస తీఱె నాకు
ఘనుని రామచంద్రుఁ గాక వేఱొక్కని
నేను వినఁగ నొల్ల నిది నిజంబు. 188

వ. ఇంక మీకుఁ బోలిసభంగిం జేయుం డని చెప్పిన విని రాక్షసాం
గన లెల్లరు నామె నిశ్చయంబు రాక్షసేశ్వరున కెఱుంగఁ జెప్పుట
కుం జని రప్పుడు త్రిజట యనురాక్షసాంగన వైదేహిం గని
సాంత్వనపూర్వంబుగా ని ట్లనియె. 189

—♦ త్రిజట తనస్వప్నవృత్తాంతము సీతతోఁ జెప్పుట ♦—

ఉ. అమ్మరొ నమ్ము నానుడి భయ మ్మిది వీడు మవింధ్యుఁ డేనెఱిం
బమ్మినవాఁడు రాక్షసుఁడు భవ్యమనస్కుఁడు నిన్నుఁ దేర్పఁగా
నిమ్మయి నీకుఁ జెప్పు మనియెం విను రాముఁడు లక్ష్మణుండు సే
మమ్మున నున్నవారు గరిమం గపిరాజొకరుండు తోడుగన్. 190

తే. వారు వనచారిసేంబుతో వామనేత్రి
నిన్ను విడిపించుపనికిన్నె యున్నవారు
వత్తు రిట బల్మిఁజేసి రావణుఁడు నిన్నుఁ
బట్టఁ బోడు కౌబేరిశాపంబు గలదు. 191

క. వలవదు భయపడ నీకుం
గలఁ గంటిన్ మఱియు వినుము గరితరో! దానన్
గులపాంసనుండు రావణుఁ
డలజడిఁ బడి తెగుట నిక్క మన్నులమిన్నా. 192

కల విను మెట్టిదో తెలియు గర్దభయుక్తరథంబు నెక్కి దు
ర్నిలయుఁడు రావణాసురుఁడు నృత్యము సేయుచు దక్షిణంబుగా
నిలుగుచు నేగె వెంబడిన నిల్వక పోయిరి కుంభకర్ణ ము
ఖ్యులు నెఱి వీడ నగ్నులయి కొంచరుణాంబర పుష్పగంధముల్.

ఉ. తెల్లనిపాగఁ జుట్టుకొని తెల్లనిదండలు దాల్చి మేనిపైఁ
దెల్లనివస్త్రముల్ దొడిగి తెల్లనిపూఁత విశీషణుండు దాఁ

దెల్లనికొండ యెక్కి తనధీసచివుల్ వెనువెంట నంట మా
కెల్ల భయంబు వాపినటు లేఁ గలఁ గంటిని వింటివే సతీ. 194

సీ. రాముఁడు తనయశోరాశి దిక్కులఁ బర్వ
శరవర్షమున నించె ధరణియెల్లఁ
నస్థిసంచయ మెక్కి సుస్థితిం గొని లక్ష్మ
ణుఁడు పాయసాన్నముఁ గుడుచుచుండె
రక్తసిక్తాంగివై రక్షింపఁ బడి పులి
రాజుచే నీ వుత్తరముగ నరిగి
తిటులు నేఁ గలఁ గంటి నిది నిక్కలయె సుమ్మి
నీ వింతలోనన నీదువిభునిఁ

తే. బొంది హర్షంబు నొందెద వింమవదన
కుందకు మటంచుఁ దెలిపినఁ గొంతవనట
దక్కి యుండెను జానకి తనకు విభుస
మాగమం బగు ననియెడునాసఁ జేసి.

## —♦ సీ తా రా వ ణ సం వా ద ము ♦—

వ. అట దశగ్రీవుండును సీతావృత్తాంత మంతయును విని దేవదానవ
యక్షరాక్షస గరుడగంధర్వ కిన్నర కింపురుషాదులం గెలియుచుఁ
గందర్పుం గెలువఁజాలనట్లు ప్రవర్తించుచు నొక్కనాఁడు దివ్య
మాల్యాంబరాభరణాదులు ధరించి సంకల్పవృక్షసదృశుండై యుం
డియు శ్మశానవృక్షంబు చందంబున భయంకరుండై శనైశ్చరుండు
రోహిణిం బోలె రాక్షసాంగనాజనపరివృత యగుసీతాదేవిం జేర
వచ్చి కోలుపులిం జూచిన లేటిబోటివలెఁ దన్నుం జూచి సంభ్ర
మించుచున్నమించుఁబోఁడిం గాంచి యి ట్లనియె. 196

క. నీపతిపయిఁ గలకూరిమి
నాపయి నిఁక నిలువఁజేసి నన్నుఁ బ్రిసన్న
శ్రీపరివృతవృష్టిం గని
నాపడఁతులు గొలువ నగుచు నలువొందఁ గదే. 197

మ. నను సేవించుచునుండుఁ బ్రియ్యచ్ఛలును గంధర్వాంగనల్ దైత్యభా
వినులున్ దానవకామినీమణులు స్వర్గిలాలకల్ నాగభా
మినులుం గిన్నరకాంతలున్ మిగుల నామే లెంచి వీ రందఱున్
నిను సేవింతురు నాకుఁ గూర్పు మయినన్ నీ రేజపత్రేక్షణా. 198

చ. భువనము లెల్ల నేలఁ దగి భూరిభుజాబలశాలినై సుర
ప్రవరులఁ దోలి తోరముగఁ బ్రస్తుతి కెక్కినన్నుఁ బ్రేముడిం
దవులక కూటిపేద యయి దారి యెఱుంగక కాఱుకానలో
నవమతి నున్న యొక్కమనుజాధముపైఁ దగులొందు టర్హమే. 199

వ. త్రిలోకేశ్వరుండ నగునాకుఁ గింకరులై పదునాలుగుకోట్లు పిశాచు
లును నిరువదియెనిమిదికోట్లురాక్షసులును నెనుబదినాలుగుకోట్లు
యక్షులును గలరు వా రెప్పుడును నన్ను సేవించి జీవించుచుం
దురు మఱియును. 200

సీ. అఖిలధనాధ్యక్షుఁ డైనయక్షేశ్వరుఁ
డగ్రజన్ముఁడు నాకు నతివ మున్న
బ్రహ్మర్షియై మహాప్రతిభ గాంచినవిశ్ర
వసుఁడు నాజనకుండు వనజనేత్ర
పంచముఁ డగులోకపాలుఁ డితం డని
నన్ను జగం బెంచు సన్నుతాంగి
ధనదుఁ గొల్వఁగఁ బోనిఘనులు గంధర్వులు
ననుఁ గొల్వవత్తురు నలినపాణి

తే. భక్ష్యభోజ్యాదివస్తువుల్ వాసవునకు
బలెను నాకును నక్షయమ్ములు తలంప
నిట్లు వనుల నుండి కృశింప నేల నీకు
నీవు నను నేల గలిగెడు దేవి వగుము. 201

తే. ఇట్లు ప్రలపింప సీత కన్నెఱ్ఱఁ జేసి
పెడమొగము వెట్టి తృణ మడ్డుపడఁగఁ దాల్చి
కన్నుఁగవ నీరు కాల్వలై కాఱుచుండ
హీనుఁ డగువాని దెస్సఁ జూడక కిట్టు లనియె. 202

మ. పలుమా ఱిట్టులు పల్కరానిపలుకుల్ పల్కంగ నీ వేను నా
తలవ్రాలిట్టులు తప్పి యున్నకతనన్ దాల్మి న్వినం గల్గితిం
దెలియం జెప్పెద నాలకింపు మెద నర్థింతేని భద్రంబు లం
గలఁగం బాఱినసీదుచిత్తమును జక్కం జేసికో నొప్పెడున్. 203

చ. గరితఁ బరాంగనం బరులఁ గానఁ దలంపనిసువ్రతంబునన్
బరఁగినదాని మానవతి మానవజాతికి నైనదాని న
న్నరతి నెసంగుదానిఁ దెలియంగ మనం బెటు నీకుఁ బుట్టెనో
కర మరయంగ నా నిట సుఖం బన నెట్టిదొ రాక్షసేశ్వరా. 204

చ. అదియును గాక బ్రహ్మసముఁడై మహిమోన్నతి ముజ్జగంబులం
బొదవినవిశ్రవోమునికిఁ బుత్రుఁడ వయ్యు మహేశమిత్రుఁడై
త్రిదశసమర్చితుం డయినదేవునకున్ సహోదర వయ్యు నీ
వెదఁ దలబోయవైతి గదవే యిసుమంతయు నేని ధర్మమున్.

వ. అని పలికి భయాతిశయప్రకంపితశరీరయై చేలచెఱంగున మొగంబు
గప్పుకొని యేడ్చె నప్పుడు రావణుం డానిష్ఠురోక్తులు విని ప్రత్యా
ఖ్యాతుండై దుర్మేధసుం డగుటం జేసి యెటయేనియుం బోయె నట
వైదేహియు రాక్షసీగణపరివృతయై త్రిజటాభిసేవ్యమానయై
యుండె నంత నక్కడఁ గౌసల్యానందనుండు మాల్యవత్కంధర
మందిరాంతరంబున దుస్సహం బగుఘనసమయవాసరంబు లెట్టకేఁ
గడప నీదుచుండెనని చెప్పిననైమిశారణ్యవాసు లవ్వలివృత్తాం
తంబు చెప్పు మనినసూతు నడుగుటయును. 106

— ఆశ్వాసాంతము —

శా. పూర్వాచార పరాయణుం డగుచు రేపు ల్మాపులున్ సంధ్యలున్
సర్వేశున్ భజియించునట్టిక్రియలన్ సాగించుచున్ ధర్మముల్
నిర్వర్తించుచు సత్యసంధుఁ డగుచున్ వెల్గొందుటయ్యాదరా
[illegible]ర్వీదేవకులావతంసము మహోద్యోగంబు వర్ధిల్లుతన్.

గద్యము.

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ కవి
సార్వభౌమాంధ్రవ్యాసాభినవశ్రీనాథ వేదవిద్యావిశారద
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన శ్రీకృష్ణ
రామాయణంబునందుఁ గిష్కింధాకాం
డంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ.

శ్రీ ర స్తు.

# శ్రీకృష్ణరామాయణము

—:o:—

## కిష్కింధాకాండము

### ద్వితీయాశ్వాసము



మల్లలక్ష్మీనరసాం
బామంజులగర్భశుక్తిమౌక్తిక మగుచున్
భూమిసుపర్వవిభూషణ
మై మెలఁగెడునీదరాన్వయార్యుఁ డెసంగన్

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నిట్లు దురంతమ్ము
లగువార్షికవాసరంబులం గడవనీదుచున్నంత. 2

క. శరదాగమమ్ము గురుతర
పరితోషాగమము హంసవారమ్మునకున్
స్మరదివ్యాగమ మొప్పెను
బరివర్ధితసప్తపర్ణభవ్యాగమమై. 3

సీ. నదు లెల్ల నిర్మలానందకందము లయ్యె
నంచల కానంద మతిశయిల్లె
నాకసంబు వినిర్మలాకారమును గాంచెఁ
దీరి నక్షత్రముల్ తేజరిల్లెఁ
బండువెన్నెల గాచె నిండిన రేల్ కన్నుల
పండువై కమలముల్ పరిఢవిల్లెఁ

బాలము లెల్లను సస్యకలితంబులై యొప్పఁ
గ ప్రియసంఘములు కేకి విడిచె

తే. కలితగర్భమరందపానప్రమత్త
భృంగసంగీతనాద మొసంగ వనల
భూమిసతి కిష్టమేటివింజామరములు
నాఁగఁ దగ దెల్లుపూల్ శరదాగమమునఁ. 4

చ. తెలతెలపోయె మేఘములు తేఁటి కృశత్వము నొందె వాఁకలుఁ
గలకలలాడె హంసములు కాంతములై కమలంబు లొప్పెఁగా
జలజలరాలె మంచు మృగజాతికి సంతస మయ్యె నప్పు డిం
పలరఁగ నేలఁ బట్టుపవలట్టులు తీఁటిచి కాచె వెన్నెలల్. 5

చ. ఇలపయి నెల్లవర్ణములు నేకవిధం బయి తన్నుఁ జేరఁ దా
నలరెను బ్రహ్మమో యనఁగ సంతత నిం కి విస్ఫుటకాంతిమై
వెలసి సమస్తజీవులకు వేడుకఁ గూర్చుచుఁ దీర్చి కానరే
నలిగఁ జకోరపాళి కశనం బయి శారదచంద్రచంద్రికల్. 6

మ. ఎలమిం గార్తికమాఘవృందము త్రిజగద్వ్యాపారన్యాంతకుండై
యిలపై మెట్టఁగ రాఁ దదీయు లపు డెంతేభక్తి భావించి ర
త్నులసీకాంత సహస్రదీపములతోఁ దో తెచ్చె నెత్తమ్మి పూల్
సెలఁగం జల్లె ననంతి పం క్తిలఁ వహించెఁ దెల్ల వింజామరల్. 7

ఉ. సారసపత్రనేత్రలు నిజప్రియదావనసౌధవీథులం
జేరి మనోరథంబునను జెల్లము విరాజిలఁగఁ జేరి బాలులై
శారదపూర్ణిమానిశల సారెకు వెన్నెలవత్తు లాడుచుఁ
మారునిదీములో యనఁ గనం దగి రంపము చంద మేర్పడన్.

తే. తమకు నాకాశధర్మంబు దవిలికొనఁగఁ
గలఁక దేఱి వినిర్మలగతులు గలిగి
సరసు లుల్లసిలున్ శరత్సమయమునఁ బొ
సరుపరమహంసల కగుమానసము లట్లు. 9

తే. తనయుజన్మదినము దా పయి వచ్చు నం
బెంచి సంతసమున మించుననఁగ
శరవణంబు పూచె సంపూర్ణపూర్ణిమా
చంద్రికాంతి కెనయఁ జాలుకాంతి. 10

వ. ఇట్లు శరదాగ్రితులు వర్తిల్లుచున్నసమయంబున నాంజనేయుండు
సుగ్రీవుని సమక్షంబునకుం జని యిట్లనియె. 11

శా. సీతాన్వేషణ మాచరించుపనికిన్ శ్రీరామదైవంబు తో
శీతర్త్వాగమనంబు హ ద్దిడుచు వాచింపంగ నై యుంటి మా
సీ తెతెంచెను దత్ప్రయత్న మిదియుం జేయంగ లే దింతకుం
గాతాళం బగుదెంచు రామునకు నీకార్యంబు గాకుండినన్. 12

ఉ. కావున వేగిరించి యిలఁ గల్గినవానరకోట్ల నెల్ల రాఁ
జేవ మెయిం బొనర్పు మిటు చేసిన సీత తెఱం గెఱుంగ నౌ
నావిధిఁ జేయఁ బుచ్చు మన నౌ నని వానరవల్లభుండు ప్ర
జ్ఞావరు లైనజాంఘికులఁ జయ్యనఁ బుచ్చెనుఁ బిల్వఁ గీశులన్. 13

—♦ రాముఁడు సుగ్రీవునికడకు లక్ష్మణుం బుచ్చుట ♦—

తే. అచట రాముఁడు సౌమిత్రి నరసి సౌమ్య
వర్ష వో సీత వెదకంగ వానరులను
బుత్తు ననెఁ గాని సీ తైనఁ బోలుపొందు
తెలుపునట్టిఁడు గాఁ డేమి తలఁచె నొక్కొ. 14

మ. తనకార్యం బది తీఱినంతఁ బెరలన్ దా రెంచఁ బో రెప్పుడున్
దనసౌఖ్యంబునకై పరార్తి దెలియన్ దాఁ గాక సుగ్రీవుఁ డో
యనుజన్మా విహరించుచుండె నిపు డీ వచ్చోటికిం బోయి నా
కినుకం దెల్పుచుఁ గార్యసాధనము గాఁ గీర్తిం బ్రతిష్ఠింపుమా. 15

క. విని పోయిరమ్ము వేగమ
యని పుచ్చిన లక్ష్మణుం డహంకారము లో
జననంబు నొంద విల్లున్
ఘనతరశస్త్రములు దాల్చి కడురయ మెసఁగన్. 16

వ. మండుచుఁ గాలాంతకయమోపముం డగులక్ష్మణుండు కిష్కింధాపురప్రాకారతోరణంబుకడకుఁ గ్రోధంబు మూర్తీభవించెనో యన వచ్చి తన్నుం జూచి యెల్లవారు నల్లతెల్లవోవుచుండఁ గొండ లవియునట్లు ధనుష్టంకారంబు గావించె. 17

మ. ధర గంపించె ధరాధరంబులు మహోద్ధ్వానంబు గావించుచున్
బరియల్ వాఱెనొ నో యనంగ బరికింపన్ వచ్చె నాకాశమున్
దరచై చీఁకటు లీనఁ జొచ్చె రవియున్ దర్పంబు వో మాసెఁ గా
విరి గ్రిమ్మెన్ భయదక్రమంబున దిశావిఖ్యాతభాగంబులన్. 18

వ. ఇట్లొక్క ముహూర్తమాత్రంబు సర్వభూతలంబు సంస్తంభించి యున్నంతఁ గొంతలోన నంగదుండు కతిపయపరివారపరివృతుండై చనుదెంచి లక్ష్మణుం గాంచి ప్రాంజలియై యున్నంత నతం డతనిం గాంచి యిట్లనియె.

శా. ఏడీ నీదు పితృవ్యుఁ డో వనచరా యీరీతి నున్మత్తుఁడై
పాడిం దప్పి మెలంగుచుండెఁ దగునే వానిం దగం జేసి పో
తే డంపం జనుదెంచె లక్ష్మణుఁడు నీరీతిన్ ప్రతీక్షింప నం
చోడం బోవక చెప్పి రమ్మనుచు నెంతో నల్కమైఁ బల్కుడున్.

వ. అంగదుండును బ్రకంపితాంగుండై లంగం గొని సుగ్రీవుఁ డున్నచోటికిం జని తారారుమలు వినుచుండ లక్ష్మణుఁడు క్రోధతామ్రాక్షుండై వచ్చుటయు వాని వచనంబులు నెఱింగించిన సుగ్రీవుండు హనుమజ్జాంబవదాదిధీసచివుల సాహాయ్యంబు గొని పాదచారియై లక్ష్మణుం డున్నచోటికిం బోయి పాదాభివందనమ్ముఁ గావించి వినమ్రుండై. 21

మ. మృగజాతిం గణియింప నైతి మొదియే మే మింత తప్పుం బొన
ర్పఁగ నున్నం గరుణింపఁగాఁ గలరు భూపాలాగ్రగణ్యుల్ కృపన్
దగఁ గైకొంచు రఘూద్వహా! నను మహాస్థానంబు న న్నిల్పి పా
ల్పుగ రక్షించినవానినిన్ మఱచి నే వర్తింపఁబో నెత్తఱిన్. 22

ఆ. అట్టులైన దోష మని యెంతు రే సైచి
దాసుఁ జైనవీని దయదలిర్పఁ
బ్రోవ వేఁడుచుంటి దేవ! నావుడు హను
మంతుఁ డిట్టులనియె శాంతి గలుగ. 23

శా. ఈసుగ్రీవుఁ డొకింతయేనియును ద ప్పేనాఁటికిం జేయఁడం
చేసందేహము లేనివాఁడ నయి వా కీ వచ్చితిన్ సౌమ్య! తా
కాసం తేనియు రామకార్యగతుఁడై కాకుండె నంచెంతో కాం
తాసంతోషమునన్ మునింగి యని యేతద్రీతి గా దెప్పుడున్. 24

క. ఇలఁ గలవానరకోటుల
బిలువం గాఁ బుచ్చె భటులఁ బెక్కురఁ గపులన్
ఘనసైన్యంబులతో నిట
కలఘుగతిన్ వచ్చుచుండి రని కను మవలన్. 25

వ. అనిన లక్ష్మణుండు కొంతశాంతి వహించుటం జేసి సుగ్రీవుం డాతని కభివందనం బాచరించి నగరునకు ర మ్మని ప్రార్థించిన బ్రసన్నుండై లక్ష్మణుం డెల్లరతో నంతఃపురంబునకుం జని సుగ్రీవ వైభవం బంతయు నెంతయు వింతగావింప గాంచి నంత నానా దేశంబులనుండి వానరవీరులు కోటానంగోటులు వచ్చుట సుగ్రీవుం డాలించి మంత్రిసామంతపరివారపరివృతుండై రామచంద్రదర్శనంబు గావింప లక్ష్మణపురస్సరంబుగా మహావైభవంబున మాల్యవంతంబునకుం జని శ్రీరామపాదారవిందంబులకుం బ్రణతుండై వినయంబునం జేసి వినతుండై నిలువంబడియున్న లక్ష్మణుం డన్నకి ట్లనియె. 26

♦ సుగ్రీవుఁడు వినమ్రుఁడై రామదర్శనముచేసి విన్నవించుట ♦

మ. మనసుగ్రీవుఁడు మిత్రకార్యమున నేమాత్రంబునుం బ్రాలుమా
లినచిత్తంబున నుండఁ డెల్లరు కపుల్ విచ్చేసి రేయేస్థలం
బున నున్నట్టిరు వేరి నె ట్లనుపఁ గాఁబోల్పొందునో సర్వమున్
వినిపింపం జనుదెంచె వీనిఁ గరుణ న్వీక్షింప నొప్పుం బ్రభూ. 27

క. నావుడు రాముం డను సు
గ్రీవా! నీభక్తి కిచ్చ కెక్కె సఖా
నీవలన నేను ధన్యుఁడ
నై వెలఁదిం గలిసికొంటి నని తలఁతు మదిన్. 28

వ. అనిన సుగ్రీవుండు రామచంద్రునిదిక్కు మొగంబై 29

మ. పదులు న్వేలును లక్ష లర్బుదములున్ బద్మంబులున్ శంఖముల్
విదితంబుల్ కపిసైన్యముల్ దొరల సేవింపంగ విచ్చేసి యు
ప్పదమం దెందును సందు లేనిపగిదిన్ వర్తించుచుండెన్ భవ
ద్హృదయార్థంబు గ్రహించు నిశ్చయమెయి న్నోపృథ్వీతలాధీశ్వరా.

ఉ. ఇం దొకఁ డొక్కఁ డెట్టిపనియేనియు నింతటిలోనఁ జేయఁగా
నుందురు రాజభక్తియెటు లుండగ నౌ నటు వీర లుందు రే
చందమున న్మెలంగుఁ డన సందియ మంద రొనర్తు రట్లు నీ
ముందట నిల్చి రాజ్ఞఁ గొనఁ బోలెదు నన్నుమనోరథంబునన్. 31

వ. అని సమీపవర్తి యగునాంజనేయుం జూపి.

మ. ఇతఁ డావాయుమహాంశసంభవుఁడు నా కెంతేనియుం బ్రాణ మీ
మతిమంతుం డొనరింప రానిపను లీమర్త్యంబునం గాదఁ యే
క్షితియందుం బరికింపలే వలనునాశీరాదులు న్వీనికిన్
మతిలో జంకుచునుందు రొడ్ల నిచటన్ మాటాడఁగా నుందునే.

శా. పాతాళంబున నుండిన న్మఱి నభోభాగంబునం దుండినన్
భూతప్రేతపిశాచశాకినులచేఁ బోషింపనై యుండియున్
సీతాదేవిని జూచి రాఁగలఁడు సుశ్రీవైభవం బేర్పడన్
జేతోమోదమునం బ్రివర్తిలుము లక్ష్మీనాథ! నీ విం కిటన్.

వ. అని సుగ్రీవుండు వెండియు. 34

—♦ నానాదేశంబులనుండి వానరసైన్యంబులు వచ్చుట ♦—

సీ. పదివేలకోటులు బలములు గొలువంగ
శతబలి యదె వచ్చి సమయ మడుగు

వేనవేల్కోటుల వానరులం గూడి
తారతండ్రి సుషేణుం డారయ నగు
వేయికోటులతోడ వెస వచ్చె రుమతండ్రి
తారుఁడు వీక్షింపు మోరమేశ
యిరువదియొక వేల యెనుబదినూర్లతో
నరుదెంచెఁ గేసరి హనుమతండ్రి

తే. వేయికోటులబలముతో వీరు డగుగ
వాక్షుఁ డేతెంచె రెండువేల్ ఋక్షబలము
గొలువ ధూమ్రుఁడు నాఁబడు బలయశోవి
శాలుఁ డరుదెంచె రామభూపాల! కనుమ. 35

వ. మఱియు మూఁడుకోట్లవానరులతోఁ బవనుండును బదికోట్లతో నీలుం
డును బదికోట్లతో గవయుండును వేయికోట్లవీరులతో దరీము
ఖుండు మఱియు మైందద్వివిదులును గజుండును జాంబవంతుండును
రుమణ్వంతుఁడును గంధమాదనుండును దుర్ముఖుండు నలుండు
నీలుండు దధిముఖుండు శరభుండు కుముదుండు లోనగు పెక్కురు
పెక్కులక్షల సైన్యంబుతో వచ్చి నీయాజ్ఞకై యెదురుచూచు
చుండి రనిన శ్రీరాముఁడు సంతసించుచు సుగ్రీవుం గాంచి. 36

చ. నదులువనంబులుం గిరులు నాలుగుసంద్రములున్ మహీస్థలుల్
త్రిదివమునుం దిగీశ్వరులదేశములున్ బలిసద్మమున్ భవ
త్పదముల మెట్టి చూచితివి తత్తదశేషమహావిశేషముల్
విదితము నీకుఁ గావునను వీరి కవెల్ల నెఱుంగఁ జేయుచున్. 37

తే. వేరి నెటు పుచ్చగాఁ దగు వారి నట్లు
వెడలఁ బుచ్చి భూపుత్రికాన్వేషణంబు
చేయఁ దగు నిద్దియే నాదు చిత్తమునకు
నిపుడు పొడకట్టినట్టిది యినతనూజ! 38

—• సుగ్రీవుఁడు ప్రాగ్దేశప్రకారము తెలియఁజేయుట •—

వ. అనిన సుగ్రీవుం డొసని వినతుం డను వానరోత్తమునిం బిలిచి యిట్లనియె.

చ. వినతుఁడ! నీవు లక్ష లక్షల వానరవీరులతోఁ గొండలున్
వనములు నేఱులుం గలిగి పర్వితప్రాగ్దిశఁ జొచ్చి యేఁగుచున్
వననిధిమేఖలాతనయ వార్త యెఱుంగుము సర్వభూములన్
వినుకలి గల్గి కన్గొనిన వీఁగక చేరి గవేషణాకృతిన్. 40

తే. గంగ సరయువు కాళింది కౌశికి యమున
వరుసతోఁ జని చూడుమీ మా ప్రాంతమందుఁ
గల సరస్వతి కీవలావలఁ గలుగు
భూధరముల నెల్ల వెదకు మోఘభూరితేజ. 41

వ. శోణనదంబునకును మహీదేశంబునకు నడుమఁబర్వతారణ్యములతో నొప్పుకాలమహీదేశంబులును బ్రహ్మమాల విదేహ మాళవ వంగ కాశీ కోసలాది దేశంబులును వంగంబు లంగలికోశకారరాజుల రాజధానిని రజతాకరంబు లగుభూములు లోచనగోచరంబులు గావించుకొని సీతాన్వేషణంబు గావింపుము. 42

సీ. సాగరాంతర్గతద్వీపభూభృత్పురంబులఁ
గలరు కొందఱు భయంకరులు జనులు
కొందఱు చెవులు లేకుందురు కొందఱు
పెదవులందుం జెవు లొప్పెదల నుందు
రినుపమోములవారు నేకపాదమువారు
కలరు పెక్కురు చావు తెలియకుండ
జవసత్త్వములు గల్గి చంపి మనుష్యుల
భక్షింతు రెంతయుఁ బట్టుబడిన

తే. వారిలోఁ గొందఱకుఁ జుట్టు వఱలుచుండు
శ్రవణయుగ్మమునందలిసాము మనుజ
దేహమును సాము శార్దూలదేహముగల
వార లుందు రాయాచోటు లారయ నగు. 43

ఉ. ఆపయి సాగరాంతరమునం దగు నేడగుతున్కలై యవ
ద్వీపము రత్నపుంగనులు వెండి సువర్ణము గల్గుచోటులున్
శ్రీపరిశోభమై యవలఁ జె న్నగుచున్ శిశిరాఖ్యపర్వతం
బాపయి భాగముల్ వెదకుఁ డాక్షితిజన్ జతనించి మెట్టుచున్. 44

సీ. లవణార్ణవమునకు నవ్వల నగాధము
శోణనదము దాఁటి చుట్టుప్రక్క
లరసి ప్లక్షద్వీపమందు నానావిధో
ద్యానంబులు నగంబు లార వెదకి
చనిన మీదన్ మీకు సాక్షాత్కరించు ని
క్షుసముద్ర మచ్చోట నసురవరులు
గలరుమత్స్యాలను నీడలఁ బట్టి మ్రింగుదు
రట గొప్పత్రాఁచు లల్లాడుచుండు

తే. మీరు వారికిఁ జక్కక మెలఁకువమెయి
చని మధూదధి నీక్షింపఁ జాలుదు రట
శాల్మలిద్వీప మెసఁగు నాస్థలమునందు
వర్ణితం బగు గరుడునావాసగృహము. 45

క. అట శైలశృంగమందుం
గుటిలులు మందేహు లనెడు క్రూరాసురు లాఁ
కట వేగుచు నుదితార్కుని
బటుజవమునఁ బట్టుచుంద్రు ప్రతిదినమందున్. 46

వ. అవ్వల ఘృతసముద్రంబును గాశద్వీపంబును దధిసముద్రంబును క్రౌంచద్వీపంబును నతిక్రమించి మించినవేడ్కం జని క్షీరసముద్రంబుంగని యట శ్వేతవర్ణవృషభపర్వతంబుం దిలకించి యట వెండికమలములతో విరాజిల్లుసుదర్శనసరస్సుం గని యటుపిమ్మట జలోదంబుగలదు దానికిఁ బదమూఁడుయోజనంబులపై జాతరూపశిలం బనుకాంచనగ్రావంబు గలదు దానిశిఖరంబునఁ జంద్రప్రతీకాశుండును సహస్రఫణామండితుండును నగునాదిశేషుప్రుం జూడఁగల రట బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ప్రాగాశ కెల్లగాఁ

వాళధ్వజముఁ బ్రతిష్ఠించిరి దానిపై నుదయపర్వతం బున్నయది దానిపై నేకయోజనాయతంబును శతయోజనోన్నతియుం గలిగి కాంచనమయంబై సౌమనసం బనుశిఖరం బున్నయది. 47

ఆ. మును త్రివిక్రముండు మొదటిపాదం బటు
సౌమనసమునందు సరగ నిలిపి
యావలిపద మల్ల సౌవర్ణమేరుప్ర
శిఖరమందు నిలిపెఁ జక్రిముగను. 48

వ. ఆసౌమనసశిఖరంబున నిపుడు వైఖానసులు వాలఖిల్యమహర్షులు సూర్యకాంతిం బోనికాంతి గలిగి దీప్యమానదేహులై కానంబడుచుందురట్టి యుదయపర్వతసమీపంబునందు సన్నూర్గామంబు గలిగి సుదర్శనద్వీపంబు దీపించుచుండు నాపర్వతశిఖరంబులందును గుహాలందును సీతాదేవి నన్వేషింపుఁడు దాని కవ్వలఁ జంద్రసూర్యసంచారంబు లేమింజేసి యంధకారావృతంబై యదృశ్యంబై యుండు మీరందుఁ బోవల దీచెప్పినప్రదేశంబుల నెల్ల జానకి నన్వేషించి యొక్కమాసంబు గడవకుండునట్లు రా వలయు నని వారి నంపెనుచ్చి సుగ్రీవుండు దక్షిణదిక్కున కుక్కుతునకలం బోలు వారిం బంపనెంచి యగ్నిసుతుం డగు నీలుని వాయుపుత్రుండగు హనుమంతుని బితామహకుమారుం డగుజాంబవంతుని మఱియు సుహోత్రశరారి శరగుల్మ గజ గవయ గవాక్ష సుషేణ వృషభ మైంద ద్వివిద విజయ గంధమాదనోల్కాముఖానంగప్రముఖులగు వారి వానరవీరులం బిలిచి యిట్లనియె. 49

—♦ సుగ్రీవుఁడు దక్షిణదేశవిశేషంబు లెఱింగించుట ♦—

సీ. ఒకవేయితలలతో నొప్పువింధ్యాద్రిని
దాఁటి నర్మదను గోదావరినది
వరకృష్ణవేణిని వరదోత్కలంబుల
మేఖలానదిఁ జూచి మీఁద నగు ద

శార్ణదేశంబుల సశ్వవంతి నవంతి
యనుపత్తనంబుల నరసి యరసి
ఘనవిదర్భము ఋషికము మాహిషిక మంగ
వంగకళింగముల్ వఱలు కాశి
తే. కములు గనుగొని ఖరదండకావనమ్ము
నందు గోదావరీనదియందు నాంధ్ర
మందు వరపుండ్రచోళపాండ్యములయందు
జానకీదేవి వెదకంగఁ జనును మీకు. 50

క. అవ్వల సహ్యం బనఁగా
నివ్వటిలుం బర్వతంబు నిభృతాగమమై
యెవ్వలన ధాతురంజిత
మవ్వరగిరిగహ్వరంబు లరయుఁడు మీరల్. 51

ద్విపదము. ఆవరపర్వతమందు జన్మించి
కావేరి ప్రవహించుఁ గనుగొని దాని
కావలితట్టున నలమలయాద్రి
దేవర్షి దీపించు దిగి యగస్త్యుండు. 52

వ. అతని నర్చించి తదనుమతంబునఁ దామ్రపర్ణిఁ దాటి యటనుండి ముక్తామణివిభూషితం బగుపాండ్యరాజనగరకవాటంబుఁ జూడఁగల రది కడచి సముద్రతీరంబునకుం జని సీతాన్వేషణంబు గావింపుఁడు.

మ. అలసీర్వామికి నంటి యుండెడు మహేంద్రాద్రీంద్ర మత్యున్నతం
బలఘుక్ష్మారుహసంభృతం బటకు దివ్యర్షుల్ మరుత్వంతుఁడున్
దెలియన్ బర్వములందు వచ్చి కడుభక్తిన్ సాగరస్నానమున్
సలుపం గల్గినవారలై చనెద రెంచన్ మీ రటం జూడుఁడీ. 54

సీ. ఆసముద్రమునందు ననితరసాధ్యమై
దేదీప్యమాన మాద్వీప మొకఁడు
నీఁంచుచుండు నాద్వీపమునలుగడ
సర్వప్రయత్నముల్ సలిపి సీత

నరయుఁడు శతయోజనాయతం బగునందు
వాసించెసిని రావణాసురుండు
దాని కుత్తరముగా దక్షిణకంధిలో
సంగారక యనంగ నసురయోర్త

తే. పరఁగు బ్రాఁణులనీడను బట్టి మ్రింగు
దానినిం దాఁటిపోఁ బుష్పతకముననఁగ
పర్వతం బగు నదియొక ప్రక్కఁదెలుపు
మఱొకప్రక్క నెర్పును గల్గి వఱలు చుండు. 55

వ. ఆపర్వత మతిక్రమించినంతఁ బదునాల్గుయోజనముల దూరంబున మఱియొకపర్వతంబు గలదు దాని కవ్వల వైడూర్యమయంబగు గోత్రంబు దానిపైఁ గుంజరం బనుగిరీంద్రంబగు నందు విశ్వకర్మము న్నగస్త్యమునికి నొకయోజనంబు వెడల్పును బదియోజనంబుల పొడుగును గలసువర్ణగృహంబు నిర్మించి యిచ్చె దాని సమీపంబున నానావిధభోగనివాసంబైన భోగవతీపురంబు గలదు దానియందు వాసుకి నివసించు మీరాప్రదేశంబు లెల్ల నన్వేషింప వలయు. 56

ఆ. భోగవతికి నవ్వలఁ బొలుపొందు ఋషభము
నాఁగ బేర నొప్పు నగ మొకండు
నందుఁ జందనాదు లఖిలవృక్షంబులు
చిత్రవర్ణములను జెలఁగుచుండు. 57

సీ. వాని మీరలు ముట్ట వలదు రోహితులను
గంధర్వు లాఢెట్లు గాచియుండు
పుణ్యకర్మంబులు పొనరించినట్టి రా
కడ మెలంగుదు రగ్నిగతి వెలుఁగుచుఁ
బిమ్మట భయదమై పితృలోక మగు ధర్మ
రాజున కయ్యది రాజధాని
చిమ్మచీకటి మీఁదఁ గ్రమ్మికొని కనంగ
వచ్చు నేరికిఁ బోవ వశముగాక

తే. ఇంతవఱ కీరు చెప్పినయెల్ల చోట్లు
వెదకి సీతామహాదేవి వేఁడు మాస
మేగకుండఁగఁ జనుదెంచి యింపుఁ గూర్చు
వాని నాప్రాణబంధువువ లెను జూతు. 58

వ. అని యంపిపుచ్చి తారాపిత యగుసుషేణుని మరీచిపుత్త్రుం డగు మారీచుం డను మహాకపిని వానితమ్ములను బడమటికిం బంపు వాఁడై రాఁ బిలిచి వారి కి ట్లనియె. 59

—♦ పశ్చిమదేశపుర పర్వతాదివర్ణనము ♦—

సీ. ఓయి సుషేణ! నీ వీయెడ రెండుల
క్షలకపిబలముతోఁ గలసి పోయి
పశ్చిమదిగ్భాగవర్ణితమ్ము లనురా
ష్ట్రము బాహ్లీకము శూల మమితసస్య
సమ్మితదేశముల్ జనపదంబులు నగ
రములు గ్రామములు వనములు గిరులు
గలయుంగఁ దిరుగుచుఁ గమలామహాదేవి
వెదుకుచు నవ్వల నుదధిఁ జేరి

తే. వేలవెంబడి నుండెడునేల లెల్లఁ
దిరిగి సింధునదము కంధి నొరయుచోటఁ
గలదు శతశృంగహేమశిఖరి యొకండు
దానిపైఁ బక్షిసింహము దనరుచుండు. 60

మత్త. కామరూపులు మీర లాగిరిఁ గల్గువృక్షములుఙ్ గుహల్
హేమవర్ణమహోపలంబుల నేళ్లఁ బూఁబొదలం దగఙ్
శ్రీమహీసుత యుండునో యని చేసి చిత్తము నల్గడల్
వేమఱుం దిరుగాడి చూడుఁడు వేసరంబడఁ బో కెదఙ్. 61

వ. ఆసముద్రంబునం గొంతదూరంబున నూఱుయోజనంబులపారి యాత్రపర్వతశిఖరంబు లోచనగోచరం బగు నాశిఖంబున బల వంతులు భయంకరాకారులు కామరూపులు వగుగంధర్వు లిరు

వదినాలుగుకోట్లమంది వసింతురు మీరు వారిసమీపంబునకుం బోక వారిచెట్లపండ్లం గోయక జాగరూకులై మెలంగుచు నట నుండి కొంతదూరంబున వజ్రపర్వతంబు కనుపట్టు నది నూఱు యోజనంబు లున్నతి గలిగి యుండు దానిగుహలలో సీతాదేవిం దిలకింపుఁ డటుమీఁద వజ్రవంత మనుమఱియొకభూధరంబు గలదు తొల్లి విశ్వకర్మ వేయంచులు గలచక్రంబు విసర్జించెఁ బూర్వకాలమ్మున విష్ణు దేవుం డొకదేవాసురయుద్ధంబునఁ బురుషోత్తమరూపుండై చక్ర రక్షకుం డగుహయగ్రీవుఁ డనుదానవుని వధించి చక్రంబును బంచజనుం డనుదానవుని వధించి పాంచజన్యంబును సంగ్రహించె నట్టికుధరంబునం గలగుహాలందును దరులందును జానకి నన్వేషించునది దాని కఱువదియోజనంబుల దూరంబున సముద్రమధ్యంబున వరాహ మనుగోత్రంబు కలదు దానిపై సువర్ణమయ మయినప్రాగ్జ్యోతిషం బనుపురీవరంబు గలదు దానియందు దురాత్ముం డగునరకాసురుండు నివసించు దాని పిమ్మటఁ గ్రమంబున నఱువదివేలపర్వతంబులు చూడఁ గలరు వానినడుమ సావర్ణిమేరుపర్వతంబు గలదు దానియందు గంధర్వులు విశ్వదేవతలు వాయువులు వసువులు నివసింతురు వాని కవ్వలఁ బదివేలయోజనంబులలో నస్తగిరి కలదు దానిపై విశ్వకర్మవినిర్మిత మైనదివ్యభవనమ్ము గలదు వరుణదేవున కది యునికిపట్టు తత్ప్రదేశంబుల సీతాన్వేషణంబు చేసి యవ్వలం బోక మాసావధిగా మీ రిట రావలయు నట్లు రాక జాగుచేసినవారికి మరణదండనము విధింపఁబడు నని యంపి పుచ్చి శతబలిం బిలిచి యుత్తరదిక్కునకుం బుచ్చువాఁడై యి ట్లనియె. 62

—♦ ఉత్తరదిగ్దేశపర్వతాదులు చెప్పుట ♦—

సీ. ఈ యుత్తరమునకు నేగి మ్లేచ్ఛ పుళింద
కురు మద్ర కాంభోజ భరత యవన
పౌరవ శూరసే నారట్టకాదులు
దేశంబు లన్నియుం దిరిగి చూచి

హిమవంతమున కేగి యివల సోమాశ్రమ
మును సానుమంతము గనుల గాంచి
తగుసుదర్శనపర్వతమున కింతన దేవ
సఖపర్వతం బగు సంగమలము
తే. ఆవల నూఱుయోజనముల యంతదవ్వు
ప్రాంతులును గిరుల్ నదులును లేక వట్టి
బయలుగా నుండు నది దాటి బయిన నెసక
మెసగు గైలాసపర్వతమసదృశ మయి. 63
శా. ఆకైలాసమునందు నర్థపతియై యక్షౌఘనేతృత్వముం
గైకొంచున్ వసియించు నైలబిలు డేకాలంబు లోకేశునిన్
వాకొంచున్ నలకూబరుండు కొడుకై స్వస్వార్థముల్ గాచుచున్
జోకై యుండగ సర్వసౌఖ్యములు గొంచున్ దాతయై నేతయై.
వ.మఱియు నక్కైలాసంబున హంసకారండవాది పక్షికలకలరవాక్రాం
తంబు కమలోత్పల సంఘాతసంభృతం బగు కమలాకరం బొండు
దీపించు దానిజెంత గ్రౌంచపర్వతంబు దానికి గుమారుండు బిలం
బుకావించె గ్రౌంచంబున కవ్వల మైనాకంబుగల దందు మయుని
గృహంబు జూపట్టు దానివెనుక వైఖానసాశ్రమంబు దాని సమీ
పంబున మానసం బందు గుబేరునిసార్వభౌమదిగ్గజంబులు కరే
ణువులం గూడి క్రీడించుచుండు దానిపై సూర్యసంచారంబు లే
దుత్తరకురుదేశంబులు దాటినపై నుత్తరసముద్రంబుండు నందు
సోమగిరి యను కాంచనపర్వతంబు గల దది బ్రహ్మాదులకు దక్క
నన్యుల కదర్శనంబై యుండు నవల మీరొక్కడు గైన వేయు
జాల రీలో నెల్లచోటుల జానకీదేవిజాడం దెలిసి వచ్చి నా కానం
దం బాపాదింపు డని వారినంపి పుచ్చి హనూమంతుం జూచి
యిట్లనియె. 65

—♦ సుగ్రీవుడు హనుమంతు నర్గించుట ♦—

మ. మరుదాత్మోద్భవ ! నీకు భూ మిపయి వ్యోమంబందు బాతాళమం
దురునీరంబున సంచరించుటకు శక్త్యుద్రేకముల్ గల్గు నా

సురగంధర్వభుజంగలోకముల నీచూడ్కిం బడంబోనిచో
టరయన్ రాదు సమస్తధర్మముల నీ వాతంత్రినిం బోలు దా. 66

తే. బలపరాక్రమబుద్ధు లోవాయుపుత్ర!
నీకడ సమగ్రములు నీతి నిన్నుఁ బోలు
వాఁడు ముల్లోకముల లేఁడు లేఁడు లేఁడు
నీవు సాధింప లేనివి లేవు లేవు. 67

ఉ. రామునికార్య మెట్లయిన రంహముగాఁ బొసరించి నాకు నీ
భూమిపయిన్ యశం బగుసమున్నతి గల్గఁ జేయుభారమున్
స్వామిపరాయణుండ వయి భాసిలు నీపయిఁ బెట్టియుంటి నీ
వేమి యొనర్తొ యింతకును నీవె ప్రమాణము వాయునందనా. 68

తే. అనుచు సుగ్రీవవచనము లాలకించి
రామచంద్రుఁడు హనుమంతు మోమునందుఁ
జూడ్కి నిగిడించి యెంతయు వేడ్కమీఱఁ
జేరఁ గాఁ దీసి యి ట్లని చేసె నుడుగు. 69

మ. నిను నేఁ గాంచినదాది నామనమున న్నీ వన్నిట న్మేటి వం
చును లోకోత్తరకార్యముల్ సలుపు దంచు న్నీదుమూలంబునన్
జనకక్ష్మాధరపుత్రి వార్త తెలుగన్ సాధ్యం బటం చెంచితిన్
జనకు న్మించితి వార్జవంబునను విశ్వాసత్వ! వాతాత్మజా! 70

—♦ రాముఁ డాంజనేయున కంగులీయక మిచ్చిపుచ్చుట ♦—

క. జనకజకు నభిజ్ఞానము
గ నొసంగెద నంగులీయకం బిది దీనిన్
గొని నీ వామెకు నప్పన
మొనరించుచు నిట్లు పలుకు మోకపిరాజా. 71

మ. ఇది మీపూర్వపితామహుండు నిమి కెంతే వత్సలత్వంబునన్
విదితాభుం డగుయాజ్ఞవల్క్యమునిరాడ్వేదండ మర్పించె ని
య్యది మీతండ్రి యొసంగె రామునకుఁ గళ్యాణంబుకట్నంబుగా
సదసద్వృత్తము లెల్ల దెల్పు నిది నీస్వాంతంబు శాంతంబుగన్

వ. అని యంగుళీయకంబు మారుతిహస్తంబున బెట్టిన నతండు దాని
శిరంబునం బెట్టి కట్టుకొని కేలుదోయిం గీలించి శ్రీరామపాదార
విందంబులకుం బ్రణమిల్లి వానరసేనాపరివృతుండై ప్రయాణోన్ము
ఖుండయ్యె నయ్యెడ రామచంద్రుండు సుగ్రీవుం గాంచి యి ట్లనియె.

క. భూమండలమంతయు నీ
వేమొ నెఱిఁగితివి దీని కేదే కతమా
నేమొ వచింపుము నావుడు
రాముని కి ట్లనియెఁ గపివరప్రభు విచ్చన్. 74

ఉ. వాలి నన్నున్ వధించుటకు వచ్చినయప్పుడు పాఱిపోయితిన్
వాలియు వెన్నుఁ దన్నెఁ గడు వాఁడి వెలార్చుచు నట్టివేళ నీ
నాలుగుసంద్రముల్ మఱియు నాలుగుదిక్కులు నేల యంతయున్
బోలఁగఁ జూచితిన్ బ్రభువ! పొందినప్రాణభయంబు పెంపునన్

తే. అపుడు న న్నంటియుండిన హనుమ తెలిసి
ఋశ్యశృంగమున మతంగఋషివరేణ్యు
శాపమునఁ వేసి వాలి రాఁ జాలఁ డనిన
నే నట వసించి బ్రదికితి నిన్ని నాళ్లు. 76

వ. అట్లు రామలక్ష్మణులు సుగ్రీవుండు నానావిషయంబులఁ బ్రసం
గించుకొనుచు గాలక్షేపంబు గావించి కొనుచుండిరంత. 77

సీ. అటు కొన్నినాళ్లైనయంతలో బ్రాగాది
దిక్కుల కరగిన మొక్కవీండ్రు
నదులు వనంబులు నగములు నగరముల్
చెఱువులు క్షేత్రముల్ చెప్పినట్లు
రేలుఁ బవలు నింక పాలుమాలిక లేక
వెదకియు వెదకియు విసివి విసివి
వేసారి జానకి విధ మెఱుంగగ లేక
సమయంబు దాటనిచందమునను

తే. ప్రస్రవణగిరి కరుదెంచి రామచంద్రుఁ
గూడి యుండినసుగ్రీవుతోడఁ దారు
పోయివచ్చినవిధ మెల్లఁ బూసగ్రుచ్చి
నట్లు వినిచి సీతఁ గాన మనిరి వారు. 78

—♦ హనుమదంగదాదులు దక్షిణదిక్కున కరుగుట ♦—

మ. హనుమంతుం డటు లాజ్ఞ గైకొని యవాగాశావకాశంబులన్
ఘనులన్ జాంబవదంగదాదులను వెన్కం గొంచు వింధ్యాటవిన్
జని యందందు నదీనదంబులను వృక్షచ్ఛాయలం గొండలన్
గనుగొంచున్ జని యెల్లగీము లరయన్ గానర్యో సీతాసతిన్.

మ. కలయం గ్రుమ్మరు వారు వింధ్య కవలన్ గన్గొనఁ బత్త్రంబులున్
ఫలపుష్పంబులు లేనివృక్షములలో వాఃపూరముం గాని యే
ఖలతో నుండియు వ్యాఘ్రసింహగజముల్ లోనైనసత్త్వంబులున్
జిలువల్ మానిసి కానరానికడకున్ విచ్చేసి రావానరుల్. 80

ఆ. కండు వనుమహర్షి కలఁ డొక్కఁ డానాఁడు
వానినందనుండు పదియునాఱు
నేండ్ల వాఁడు కాలమృతి నొంద శపియించెఁ
దండ్రి యట్లు గాఁగఁ దద్వనంబు. 81

క. ఆచోటులెల్ల వెదకుచు
ధీచతురులు వారు రామదేవింగనఁగా
నోచనివారై యటుపైఁ
జూచిరి యొకభీమవనము సొరిదిం జనుచున్. 82

మత్త. క్రూరకర్ముఁడు రాక్షసుం డొకఘోరపర్వతమో యనన్
దారిఁ దారసిలంగఁ గన్గొని తత్క్రమం బది యంతయున్
వారు చూచుచునుండ హు మ్మనివాఁడు వాతెపయిం బడెన్
వీరుఁ డంగదుఁ డొక్కవ్రేటున వ్రీల నేసె శిరంబునన్ 83

క. ముక్కుల నోటన్ నెత్తురు
గ్రక్కుచు రాక్షసుఁడు కొండకైవడి నేలం

గ్రిక్కదలఁ గూలె వాసరు
లక్కజపడి రావణుండ యని తలఁచి రెదన్. 84

క. కలకాననగిరిగుహాలం
బలుమఱు భూపుత్త్రి వెదకి పైపై నొకచో
నలసి యొకచెట్టుక్రిందం
బలువురు గూర్చుండి రపుడు బహుళార్తిమెయిన్. 85

ఉ. అంగదుఁ డెల్లవారు వినున ట్లనెఁ గానలుఁ గొనలున్ గుహల్
గంగలు నెల్లచోటులును గన్గొని నారము కాని యెందు సీ
తం గనఁ జాల మేగె క్షణదల్ కడునుగ్రుఁడు సూర్యపుత్త్రుఁ డీ
రంగద కోర్చి రేఁబవలు నారయఁ గాఁ దగు జానకీసతిన్. 86

క. మీమేలు గోరి చెప్పితి
నీమాడ్కిం గాక మీకు నేవేతోఁపం
గా మది నైనం దెలుపుఁడు
నామిసిమిన్ గంధమాదనకపీంద్రుఁడనెన్ 87

సీ. అంగదునుడి యొప్పు నట్లు చేయుద మెల్ల
కడ లరయుద మనఁ గదిసి కపులు
వింధ్యనగంబెల్ల వెదకిరి మఱి మఱి
గజగవయగవాక్షగంధమాన
నాదులు పాశ్చిమ నక్కొండపై ఋక్ష
బిల మనునొకగుహం గలయఁ జూచి
రాకలిదప్పుల కై వార లందఱు
జలపఱు లరుదెంచుటల నెఱింగి

తే. బిలమునన్ నీటియిక్కువ గల దటంచు
భయద మగునందు నొండొరుఁ బట్టుకొనుచు
దడుము కొనుచును జీఁకటి నడచి నడచి
కొంతలోఁ గాంచి రద్దారిఁ గొంత వెలుఁగు. 88

—♦ హనుమదాదుల స్వయంప్రభాబిలప్రవేశము ♦—

వ. క్షుత్పిపాసాతురు లగువానరోత్తము లావెలుంగున నింతదవ్వు చని
నంత రమణీయం బగునొక్కయుపవనంబు నందు బంగారు
పూవు గుత్తులు బంగారుపండులును గెంపుబింపునింపగుచిగు
ళ్లును దరుణాదిత్యసంకాశంబు లగువైడూర్యముల నిర్మింపంబడు
తిన్నెలం గల హిరణ్మయవృక్షంబులును వానిచెంతఁ గాంచన
కమలంబులును సువర్ణంబు లగుతామరతూండ్లను గలిగి నిర్మల జలంబుల
నిండియున్న సరాకరంబును దాని నానుకొని బంగారుకిటికీలును
ముక్తాహారంబులచే నలంకృతంబు లగు బంగారువిమానంబులును
మాణిక్యవినిర్మితకుట్టిమంబులును రత్నఖచితకలును నానావిధరత్న
ఖచితాసనశయ్యాదులును మఱియు దివ్యంబు లగునగరువులయు చం
దనంబులయు రాసులును రుచ్యంబు లగుఫలమూలంబులుం గల
యొకమహారణ్యంబు గని రంతలో నా ప్రాంతంబునఁ జీరకృష్ణాజి
నాంబరయు నియతాహారయు నగునొక్కవృద్ధతపస్వినిం గాంచి
భయసంభ్రమాశ్చర్యసంభరితాంతరంగులై యున్నసమయంబున
నాంజనేయుండు కృతాంజలియై యామె కి ట్లనియె. 89

శా. అవ్వా! యెవ్వతె వీవు దేవతవొ సిద్ధాఖ్యాక్షరా లెవ్వి యే
త్రివ్యంబోనిమయిఁ వసింతు విట నీదివ్యాలయంబుల్ మణుల్
మవ్వం బైనవనద్రుమావళులు నీమాణిక్యముల్ వానివా
వవ్వారే యనిపించెడిం దెలియఁదెల్పం జెల్లుఁ దల్లంబుగన్. 90

తే. మేము మార్గశ్రమంబున మిగుల నలసి
దప్పి మిక్కిలి యగుటచే తగవు దప్పి
జలము లుండెడు నిందని తెలిసి యంధ
కారబంధుర మగుదారిఁ జేరితి మిట. 91

తే. ఇట్టు లీ పదార్థంబు లిచటఁ గాంచి
యసురమాయ యేమో యని యటు నిటు పడు
చున్నవారము తెలుపవే యన్న నామె
కనికరంబున హనుమంతుఁ గాంచి పలికె. 92

—♦ స్వ యం ప్ర భా వృ త్తాం త ము ♦—

సీ. మయుఁ డనుదానవమాన్యుండు మాయావి
మాయ నీవన మిట్లు చేయఁగలిగెఁ
పరమేష్ఠి వరమునం బ్రబలుఁడై శిల్పశా
స్త్రమునఁ బ్రవీణుఁడై తనరె నిందు
హేమతోఁ గ్రీడించు చిందున్నవానిపై
వజ్ర మింద్రుఁడు వైచి పాటుఁ జేసె
నీగృహారామము హేమకు నిడె బ్రహ్మ
హేమ యీయంతకు నేడ్గడ యగు

తే. నేను మేరుసావర్ణియన్ వానికూఁతు
రను స్వయంప్రభ యందురు ననుఁ గవీంద్ర
నాకుఁ బ్రియసఖి హేమ కాననము దీని
కాచి రక్షింపు మని కోరెఁ గాన నేను. 93

వ. ఇందుండి దీనిం బాలించుచుంటి మీ రెవ్వ రేకతంబున గాంతా
రంబులందిరుగుచుంటి రీవనమార్గంబు మీ కెట్లు లోచనగోచరం
బయ్యెఁ జెప్పుదురు గాని మునుము నీఫలంబులు దిని జలంబులు
ద్రావి సేదదేరుం డనిన వారెల్లరు ఫలంబు లారగించి జలంబులు
గ్రోలి విశ్రమించి రంత వాయునందనుండు స్వయంప్రభకడకు
వచ్చి యి ట్లని చెప్పందొడంగె. 94

సీ. దశరథుం డనురాజతనయుండు రాముఁడు
సానుజరాముఁడై కాననమున
సంచరింపఁగ వచ్చె జనకునిపంపున
రామునిసతి సీత రావణుండు
చేరి జనస్థాన సీమ హరించె సు
గ్రీవుఁడు రామునికిం బ్రియుఁ డయి
యెల్లదిక్కులు రోయ నిట్లు కపులఁ బంచె
దక్షిణం బరయ మే మిక్కరణిని

తే. వచ్చి యాఁకలి దప్పియు హెచ్చ నొక్క
కడను గూర్చుండఁ బక్షులకడలిక నిట
జలము లుండెడు నని యెంచి బిలము సొచ్చి
యిట్లు వచ్చితి మమ్మరో! యిది నిజంబు. 95

చ. అని మఱియుం గపిప్రవరుఁ డాయమ కిట్లను నో స్వయంప్రభా!
నిను నుతియింప శక్యమగునే మను దప్పిని దీర్చినావారలన్
మనిచితి సీతకై చనెడు మ మ్మొకటుఁ లిప్పటినుండి మీఁదికిన్
జనఁ బొసఁగింతొ మార్గ మది సన్నకసన్న నెఱుంగఁ జేయవే. 96

వ. అని వేఁడినం బ్రసన్నయై స్వయంప్రభ యి ట్లనియె. 97

ఆ. ఈబిలంబు సొచ్చి యెవరుగాని పయి
కరిగినట్టివా రలరయ లేరు
నాతపంబువలన నేఁ దరలించెద
వగవకుండుఁ డయ్య ప్లవగులార. 98

వ. మీరందఱుం గన్నులు మూసికొనుం డని నిమేషమాత్రంబున బిలంబువెలుపలికిం దెచ్చి వానరోత్తములారా! మీకు మంగళం బగుఁ గాక నేను బోయివచ్చెద నని వారి నామంత్రణంబు చేసి బిలప్రవేశంబు చేసె నంత. 99

—♦ అంగదాదులు సీతం గానమికి వగచుట ♦—

సీ. బ్రతికితి మని వారు పయనమై వింధ్యకు
నైరృతిభాగంబునం దలిర్చు
తిప్పపైఁ గూర్చుండి చెప్పినగడు వది
గడచిపోవుట లంగదుఁడు గ్రహించి
కపులార! రాజాజ్ఞ గావింప కేగిన
మనకు మృత్యువు సిద్ధమని తలంపుఁ
డట కేగి రాజుచే హతు లగుకంటెను
ప్రాయోపవేశము వట్టియిచట

తే. మరణ మందుట మే లని మఱి దలంతు
ననుఁడు తారుఁడు నాఁబడునసచరుండు
మన మురక చచ్చుకంటె నాఘనబిలంబు
సొచ్చి నిర్భయంబుగ నుంస మిచ్చఁ జేసి. 100

మ. అది మే ల్మే లని యంగదుండు కపులారా! తారుఁ డన్నట్లు చే
యుద మాఘోరగుహాంతరాళమునయం దున్నట్టిమి మ్మెవ్వరుఁ
దుదముట్టింపఁగ లేరు రాజభయ మందుం బొందఁ బో రంచుఁ ద
త్పదమం దుండఁ దలంచె వాయుసుతుఁ డావాక్యంబు లాలించుచుఁ

తే. అంగదా! బుద్ధిమంతుఁడ వగుదు వీవు
చెప్పినట్లు గుహా న్మన మొప్ప యున్న
వేరు మనవంకఁ జూడఁగాఁ లే రని కప
నీతలం పది కా దని నేఁ దలంతు. 102

ఉ. ఇంద్రునివేయువజ్ర మొకయింత బిలంబును జేయఁ గల్గె భూ
మీంద్రుఁడు లక్ష్మణాగ్రజునియుద్ధశరం బొకయింతమాత్ర గో
త్రేంద్రము ముక్కముక్క లయి యేగెడునట్లు పొనర్పఁ జాలు నీ
తండ్రివచఃప్రసంగతులు తప్పని చెప్పుచు నుంటి నంగదా. 103

వ. అనిన నంగదుం డి ట్లనియె. 104

మ. కృతకార్యుం డనుగాక నే నిపుడు సుగ్రీవుం బ్రదర్శింప నే
వ్రతినై భూతలమందు దర్భలపయిఁ బ్రాయోపవేశంబు చే
సి తృణప్రాయముగాఁ ద్యజింతు నుసురుల్ సి గ్గేదఁ గిష్కింధ కీ
రతివేగంబునఁ బోయి నానతు లటఁ వ్యాహారముం జేయుఁడీ.

—♦ ప్రాయోపవేశముచేసినవారికడకు సంపాతివచ్చుట ♦—

వ. అని పలికి సముద్రోత్తరతీరంబున దక్షిణాగ్రంబులుగా దర్భలు
పఱచుకొని పూర్వాభిముఖుండై శయనించె వానిం జూచి తారుం
డును దక్షిణవారును బ్రాయోపవేశంబు చేయ నెంచి రప్పుడు.

చ. ఒకగుహనుండి గృధ్రము మహోగ్రతరాకృతి దోఁపఁ జేయుచుఁ
వికృతము గాఁగ నార్చుచు భువిఁ శయనించినవానరాళి ను

త్సుకతను గాంచి దైవమునఁ జొప్పడె మర్కటమాంసభోజనం
బొకనిముషంబులో నెడఁదనుండఁగఁ బోవు క్షుధాభరం బికన్.

వ. అని సంతోషసంభ్రమంబులతో వారివలన నడచుచు జటాయు
వను గృధ్రరాజు రామకార్యార్థము రావణాసురునితోఁ బోరి
వచ్చి పరంధామంబు నొందె మనమును రామకార్యార్థమై చత్త
మని పలుకుకొనుచుండ నాకర్ణించి గృధ్రరాజు. 108

— సంపాతి జటాయువు వృత్తాంతము విని వగచుట —

క. నాతోఁ బుట్టు జటాయువు
కతుల్ వచియించుచుండిరి కపీంద్రులు నీ
రీతజి నడిగెద వీరల
నాతనివృత్తాంత మెట్టి దని నయ మెసఁగన్. 109

వ. వారిసమీపంబునకు వచ్చి మీ రెవ్వ రిట్లు ప్రాయోపవేశంబు
చేయుటకుం గారణం బేమి నాతమ్ముండు జటాయువుం బేర్కొంటి
రవ్వృత్తాంతం బంతయు సవిస్తరంబుగఁ జెప్పుఁడనిన నంగదుండు
వాని కిట్లనియె. 110

తే. ఋక్షరజుఁ డనువానరశ్రేష్ఠుఁ డతఁడు
వాలిసుగ్రీవులకుఁ దండ్రి వాలి కేను
బ్రియతనూజుఁడ వినుము నా పేరు తెలియ
నంగదుం డంద్రు జెప్పెదఁ దచ్చరితము. 111

తర. దశరథాత్మజుఁ డైనరాముఁడు దమ్ముఁడుం గొమ్మయున్
వశమునం దనవెంట రా వనివచ్చియుండఁగ రావణా
పశదుఁ డారఘురామపత్నినిఁ బట్టి కొంచరుగంగఁ ద
ద్దశ గనుంగొనుచున్ జటాయువు దారిఁ బోరె సురద్విషున్. 112

ఆ. పోరి పోరి వానిక్రూరాస్త్రమునఁ జేసి
నిహతుఁ డగుచుఁ గూలె నేల కంత
నతని కూర్ధ్వదైహికాదికం బంతయు
సలిపె రామచంద్రుఁ డలరు ప్రీతి. 113

వ. అవ్వల నారామచంద్రుండు సుగ్రీవునితో సఖ్యంబు చేసి వాలిం
గూలనేసి వానరరాజ్యంబుసుగ్రీవునకుం బట్టంబు గట్టె మే మా
సుగ్రీవునిపంపున రామపత్ని నన్వేషించుచు వచ్చినవార మైతిమి.
మాకుం బెట్టినగడు వతిక్రమించెం గావున వానిచేతం జచ్చుటకంటె
మే మందఱ మిటం జావ నెంచి ప్రాయోపవేశము చేయుచుం
టిమి. నీవు జటాయునామస్మరణంబునం జేసి కంట నీరువెట్టుకొను
చుంటివి. నీ కతండు చుట్టంబొకో యెఱింగింపు మనిన గృధ్రరా
జి ట్లనియె. 114

మ. వినతాపుత్రకుం డగ్రజుం డరుణుం డావిఖ్యాతనాముండు గాం
చెను సంపాతిజటాయులన్ సుతుల నేం జెప్పంగ సంపాతి మీ
దనుచున్నాం దడు నాదుతమ్ముఁడు జటాయ్వాఖ్యుండు తానయ్యెవా
నినిం బౌలస్త్యుఁడు చంపె నంచు వినుటన్ నే నెంతో చింతించెదన్.

తే. వృత్రవధ మైనకాలమం దేను నతఁడు
పన్నిదంబులు చఱచి ప్రభాకరు దరి
యంగం బోతిమి నింగిపై నతఁడు వివశుం
డగుట వానికి నాగఱు ల డ్డొసంగితి. 116

వ. దానంజేసి నాగరుదోయి దగ్ధంబైన నే నిటం బడితి జటాయువు
వివశుండై జనస్థానంబునందుం బడియె. 117

తే. అనిన నంగదుం డనియె జటాయువునకు
నన్న వీ వైన మాకు నీ వనుంగు వగుదు
గాన నడుగుదు రావణస్థానమెద్ది
వానివృత్తాంత మెట్టిది పలుకు మనఘ. 118

—♦ సంపాతి సీతం గని యెఱింగించుట ♦—

వ. అనిన సంపాతి యి ట్లనియె. 119

ఉ. ఱెక్కలు గాలిపోయినవి ఱేకులశక్తియు మేనిశక్తియున్
దక్కువ యయ్యె నే నెటులు దాశరథి ప్రియ మాచరింతు నెం

పెక్కు త్రివిక్రముండు బలి నేర్చినకాలము వార్ధిc ద్రిచ్చఁగా
నెక్కొనుకాలముం దెలిసి నేను మెలంగుచు నుంటి వింటివే. 120

మత్త. రామ రామ యటంచు నేర్చెను రామ! రావణుఁ డొక్కనా
డీమెయిం గొని పోవుచుండఁగ నేను గాంచితి నింద నా
రామ రాముని బ్రేముడించెడురాణివాస మటంచు నే
నామదిం దల పోయుచుంటి వనప్రిచార! యెఱుంగుమా. 121

తే. రావణుఁడు రాక్షసుండు విశ్రవసుకొడుకు
రాజరాజానుజుఁడు సముద్రమునలంక
యనెడుసుందరపత్తన మలరు నందు
వాఁడు కాపుర ముండు నోవనచరేంద్ర. 122

ఉ. ఆపురమం దశోకవని నాసురకాంతలమధ్యమందు నా
భూపతి రాఘవాన్వయుని పుణ్యసతీమణి యేకవస్త్రయై
కాపురుషప్రభూత వలెc గానఁగ వచ్చెడు దీనవక్త్రయై
రూపఱి యున్న దిప్డు జలరుద్ధకనీనికయై వనేచరా. 123

క. శతయోజనముల దవ్వున
నుతియింపఁగ వచ్చురావణునివీ డది మే
మతిసూక్ష్మవస్తువేనియు
గతి యి ట్లని కంటఁజూడఁ గలము కపీంద్రా. 124

వ. పక్షులలో మొదటిమార్గము పిచ్చుకలులోనగునవియును ద్వితీయ మార్గము కాకులులోనగునవియును దృతీయమార్గము నీరుకాకులు కొంగలు లోనగునవియును జతుర్థమార్గము డేగలు లోనగునవి యును బంచమమార్గము గ్రద్దలులోనగునవియును షష్ఠమార్గము హంసలు లోనగునవియును సప్తమమార్గము వినతాపుత్రపుత్రుల మగుమేమును దృష్టి నిగిడించి చూచుశక్తి గలవారము గావున జానకిం జూచి చెప్పుచుంటి ననిన హనుమంతుం డెంతయు సంత సించుచు. 125

—♦ సంపాతి సీతాదేవి పడుపాటు లెఱింగించుట ♦—

ద్విప. ప్రియమిత్రమా ! యిప్డు శ్రీరామపత్ని
చెయిద మెట్లున్నది చెప్పవే చూచి
నయనముల్ విప్పంగ నడయాడ నుడుగు
నయినఁ జేయఁగ శక్తి యామెకుఁ గలదె. 126

వ. అనిన సంపాతి యద్దెస దృష్టి నిగిడించి చూచి యి ట్లనియె. 127

తర. అదె యశోకవనంబునం దనుజాంగనల్ తనుఁ జుట్టుకో
నదటుగుండెలతోడఁ గందొవలందు బాష్పము లూరఁగా
నోదవు శోకము పాకమై దిగు లుప్పతిల్లఁగ నిల్చి చె,
ట్టుదరి కొమ్మ గ్రహించి కేలఁ గడుంగడుంగడు వందురున్. 128

ఉ. కత్తులు పూని రక్కసులు కారులు ప్రేలుచుఁ జుట్టువాఱుచున్
వత్తురు మొత్తఁ జేరుదురు వాయిఁ దెమల్తురు మ్రింగఁ బోదు రీ
వి త్తఱి మానుడుల్ వినవ యేనియు నీదగు మేనుఁజీల్చి క్రొ
న్నెత్తురు జుఱ్ఱుకొందు మని నిట్టన నిల్తురు నాల్గుతట్టులన్. 129

ఆ. వారిఁ గనదు వినదు వామాక్షి భయపడ
దక్షి విప్ప దట్టె వృక్షశిఖర
మందు నిలుపు దృష్టి హా ! పరమేశ్వరా !
యనుచు వెట్ట నూర్చు నదిగొ కనుఁడు. 130

వ. అనిన విని హనుమంతుం డామె రూపలావణ్యంబు లెట్లుండుం
జెప్పుమనుటయు సంపాతి వెండియు. 131

క. కనకశలాక తెఱంగునఁ
గనఁబడు నతికోమలాంగి కా నది లేదం
చన వచ్చు వాడిపోవని
కనకకుసుమమాలఁ దాల్చు గంఠమునందున్. 132

తే. అంగరాగము చెదరినయట్లు గాదు
వల్కలము కాంతి నలుగడ నొల్కు జిగులు

మాట లాడదు వేరితో బోటి యొకతె
మాటిమాటికి నామెతో మనవిచేయు. 133

తే. చీమయును దోమ సీతకుఁ జెంతఁ జేర
వెఱచు రక్కసలభయంబు వీస మైన
నామెమది కున్నయట్లు నే నరయఁజాల
ధైర్య మాయమసా మ్మంచుఁ దలఁతుఁ నేను. 134

వ. అని మఱియును. 135

తే. సాగరము దాఁటి జానకి జాడఁ దెలిసి
రామచంద్రున కీవార్త రమణఁ దెలిపి
ప్లవగవాహినితో వచ్చి పంక్తికంఠు
దునుమఁ జేయుఁడు రామునితోడఁ జెప్పి. 135

వ. అంత సంతసించుచు జాంబవంతుండు లేచి సంపాతిచెంతకు వచ్చి మిత్రమా! రావణుండు సీతను హరించుకొనిపోవుట నీవు చెప్పి నట్లు గాక మఱియొకవిధంబునం దెలియ వచ్చెనేచెప్పు మనిన నతండు వెండియు.

సీ. ఈకొండపైఁ బడి యిటన నే నుంటి నా
కొడుకు సుపార్శ్వుఁడు కొలిచి పోవ
నొకనాఁడు నాకొడు కుదధిచెంత మెలంగ
రాక్షసుం డొకరుండు రాజవదనఁ
గొని పోవుచుండ వారినిఁ బట్టి నాతింటి
కై కొని రానున్నకాలమందు
వాఁడు ప్రార్థించుట వదలె వారిం బిడ్డఁ
డపుడు హారామ రామా యటంచు

తే. అతివ యేడ్చుట విన వచ్చి సుతుఁడు దెలిపె
వానికిఁ సిద్ధులును రామభార్యరావ
ణుఁడు హరించెడు నం చని నుడివి రనుచు
నాకుమారుఁడు చెప్పెను నాకు వింటె. 139

వ. మఱియు సీతాదేవి వృత్తాంతం బెఱుంగ నగువిధంబు కొంత గలదు వినుం డని మఱియును. 140

ఆ. ఇట నిశాకరాఖ్య నెసఁగుబుధీందు్రఁడు
మున్ను గలఁడు నాకుఁ బూజ్యుఁ డతఁడు
వానిచెంత కేను బో నాతఁ డెట్టకే
ననునెఱింగి యిట్టులనియెః బ్రీతి. 141

ఉ. కాలినఱెక్కదోయియును గాటుక వాఱినమేను గల్గి నీ
వీలలి నుంట కేమిటికి నిట్టివిపద్దశ వచ్చెఁ దమ్ముఁడున్
గాలమతి[క్ర]మించె ననుఁ గానఁగ వచ్చుట లేదు సౌఖ్యసం
చాలన మొప్ప నుండెనొకొ సర్వము నా కెఱుగంగఁ జెప్పవే. 142

వ. అనిన నేనును నాతమ్ముండును బందెంబు చఱచి సూర్యు నంటఁ బోవుటయుఁ దమకుఁ గలిగినవిపత్ప్రకారంబును నెఱింగించిన నతండు కరుణాంతరంగితాంతరంగుండై యి ట్లనియె. 143

ఉ. రాముఁడు పుట్టు వానిసతి రావణుఁడన్ సురవైరి గొంచుఁబో
నామెను వానరుల్ వెదకునట్టిరయ్యె చనుదెంతు్ర వారికిన్
గోమలివార్త యిట్టి దని కొంచెము మాత్ర మెఱుంగఁ జేసినన్
నీమెయిఁ బక్షముల్ మొలచు నేత్రము లొప్పును విక్రమం బగన్.

—♦ సంపాతికిఁ గాలిపోటున ఱెక్కలు వచ్చుట ♦—

తరువోజ. అని చెప్పి నాగురు వరిగినయంత
నట నుండి యిట వచ్చి హాయనశతము
చనఁ జేసితిని మీరు చనుదెంతు రనుచు
న్వాంతంబునం దాస సందడి గొనఁగ
ఘనులార! నే నింకఁ గడుధన్యతముఁడఁ
గలిగెడు నాకు ఱెక్కలు నింతలోన
ననుచుండఁగాఁ బుట్టె నతనికి ఱెక్క
లక్కజం బగుశక్తి యంగంబు నందు. 145

వ. అట్లగుటకెల్లను నిశాకరమునిప్రభావం బగ్గించుచుండి రప్పుడు సంపాతి నే నిపుడు ఱెక్కలుగలపరాక్రమవంతుండ నైతి మీరు సీతం జూడఁ గలరు మీకు మేలగుం గాక పోయి వచ్చెద నని గగనంబునకు నిర్గమించె వానరోత్తములును సంతోషసంభరిత స్వాంతులై దక్షిణాభిముఖులై గంతులు వైచుచు సింహనాదంబులు సేయుచుం జని సముద్రతీరంబునకుం బోయి రయ్యెడ. 146

మహాస్ర. కనదుగ్రగ్రాహనక్రక్రమ భయదమహాగర్తగంభీరనీరం
బును గల్లోలాగ్రనృత్యత్ప్రచురజలకణప్రోక్షితాభ్రంలిహభ్ర
స్తనితప్రాయానిశప్రస్ఫుటవనపతనప్రస్ఫుటధ్వానధామం
బనవద్యానంతమార్గం బయి భయకరమై యబ్ధి గన్పట్టె నంతన్

చ. పెనఁగి జగంబు లల్లుమగబిడ్డను బొడ్డునఁ గన్నదొడ్డవే
ల్పున కిడి విచ్చి బ్రిచ్చుతనముద్దులకన్నియఁ బెండ్లిచేసి పెం
పనుబడఁ గూఁతుతోఁడ దనయల్లుని నిల్పుట ముంచుకొంటి నే
నని కడుసంతసించు నన నంబుధి మిన్నులుముట్టి పెట్టుగన్. 148

వ. అట్టిమహాపారావారంబు గాంచి వానరోత్తములు భయార్తులై రపుడు మతిమంతుం డగునంగదుండు వలీముఖవీరులం గాంచి యి ట్లనియె. 149

—♦ సముద్రలంఘన విషయవిచారము ♦—

మ. మనలో నెవ్వఁడు బాహువిక్రమము పెంపం జాలి రత్నాకరం
బును దీనిం దరియించి మించినయశస్స్ఫూర్తిన్ బ్రవర్తించుచున్
ఘనలంకాపురి నున్నసీతఁ గని రాగం గల్గి సుగ్రీవునా
జ్ఞను బాలించునొ వానికిన్ బ్లవగరక్షాదక్షుఁ డం చెంచెదన్. 150

తే. ఎవ్వని ప్రభావమునఁజేసి యెల్లమనము
ధన్యతములమ మై జగన్మాన్యుల మయి
దారపుత్రాదిసౌఖ్యముల్ దగిలి యుండఁ
గలమొ వాఁ డెల్లరం గావఁ గలుగువాఁడు. 151

క. అని మఱియుఁ శతయోజన
ఘనసాగర మెల్ల దాటఁ గలుగునొ తెలుపుం
డనవుడు నెవ్వం డేమియు
ననఁ జాలక యూరకుండి రతినిశ్చలతన్. 152

ఆ. అంగదుండు నడుగుచుంటిన్ వాన
రేంద్రులార ! మీర లెవ్వ రెవ్వ
రెంత యెంతదూర మెగురంగఁ గలరొ మీ
మీబలంబు లెల్ల నాఁ బలుకఁగ. 153

వ. అని యంగదుం డడుగుటయును. 154

సీ. దశయోజనము లేను దాటెద ననె గజుం
డిరువదియోజనా లరిగెద నని
పలికె గవాక్షుఁ డవ్వల గవయుఁడు మూఁడు
పదులయోజనములు పఱచెద ననె
నల్వది యోజనాల్ నడచెద ననె శర
భుం డేను పదు లేను బోదు ననియెఁ
గంధమాదనుఁ డనుకపి మైందుఁడేవష్టి
యోజనంబులు వోవ నోపుదు ననె,

తే. ద్వివిదుఁ డేను యోజనసప్తతిని గమింతు
ననె సుషేణుఁ డశీతియోజనము లేను
దాటఁ గల ననె జాంబవద్బలిముఖుండు
నేను దొంబదియోజనా లేఁగుదు ననె. 155

చ. అని మఱియు న్వచించె నతఁ డంబరమార్గమునం బ్రచారముం
బొనరుచు శక్తి నాకు మును బొల్చుఁ ద్రివిక్రమూర్తి కప్డు దే
ననుగతిగాఁ బ్రదక్షిణము లాదటఁ జేసితి మూడుమార్లు నే
లను బద మూనకుండ నఖలప్రథితోన్నతభాగ మంతటన్. 156

క. యౌవనమందలినాబల

గావున నిట్టులు పలికితి
నావుడు నంగదుఁడు వలికె నందఱు వినఁగన్ 157

క. నేనూఱు యోజనంబులు
గా నీరధిదాఁటఁ గలను గానీ మఱియున్
రా నగునో కాదో బల మని
మానసమున సంశయంబు మసలెడు ననుచున్. 158

ఉ. భల్లుకవల్లభుం డనియె బాపురె నీదగుశక్తిలోకమం
దెల్ల రెఱింగియుందు రని యేను వచించెద నీవు నూఱు గా
దల్లన వేయియోజనము లైనను బోవఁగ రాఁగ నేర్తు వో
సల్లలితప్రభావ! ప్రభుసత్తముఁ బుచ్చుట లొప్పియుండునే. 159

తే. ప్రభువు భటుల నియోగింప వలయుఁ గాని
యీవు పోవుట తగదు మా కిందఱ కిట
రక్షకుఁడు లేక యుండెడు రాజపుత్ర!
మేము వర్తించు టెట్టు లామీఁద చెపుమ. 160

మత్త. వాలిసూనుఁడు జాంబవంతునివాక్యముల్ విని యిట్లనున్
శీలవద్వర! సత్యవాక్యమ నీవు పల్కితి గాని నేఁ
బ్రాలుమాలిన నొండ్లు పో వని వార లైనను గార్య మే
పీల నయ్యెడు ప్రాయమే గతి వేఁడొకండు దలంపఁగన్. 161

ఆ. అంగదుం డట్లు కొందల మందుచుండ
జాంబవంతుఁడు చింతింపఁ జనదు మనకుఁ
గార్యసాధన మొనరింపఁ గలుగువాని
నిదిగో తెచ్చెదఁ జూడు మోసదమలాత్మ. 162

—♦ జాంబవంతుఁడు హనుమంతుని బురికొల్పుట ♦—

వ. అని పలికి యేకాంతంబుగ నొక్కరుండ కూరుచుండి కార్యాలోచనతత్పరుండై యున్నహనుమంతునికడకుం జని యిట్లనియెఁ

శా. నన్నుం గా దనునట్లు కార్యగతికిన్ నా కెద్దియో చూచుచి
ట్లున్నన్ మా కిట నేది దిక్కెవరు మ మ్మొమ్మంగ నున్నా రయో

మిన్ను ల్ముట్టి సముద్ర మున్నయది నీమీఁదన్ సమస్తార్థముల్
క్రిన్నన్ బెట్టి మెలంగుచుంటిమి జగత్ప్రాణాత్మజా వింటివే. 164

ఉ. నీవు పరాక్రమక్రమవినిర్జిత నిర్జరలోకనేతవున్
దేవసమప్రభావుఁడవు నిన్ను నుతింపఁగఁ జాల మేము ము
న్నావినతాతనూజుని మహాప్రతిభన్ విని యుంటి మాతఁడున్
నీవెనుకన్ గణింపఁ దగు నిక్కము చెప్పితి నమ్ము నెమ్మదిన్.

ఆ. అతని రెక్కదోయి కల రెక్కబలము నీ
రెక్కదోయి బలము నొక్కగతిగ
వెలయు విక్రమంబు వేగంబు నాతని
కంటె నీకె హెచ్చు కాన వచ్చు. 166

ఆ. శౌర్యసారమందు జవసత్వములయందు
బలమునందు బుద్ధిబలమునందు
నధికుఁడైనకొమరుఁ డగు నని నీతల్లి
కనిలుఁ డిచ్చె వరము హనుమ! వినుమ. 167

చ. వనమునఁ బుట్టి నీ వపుడు భాస్కరుఁ గన్గొని పండ టంచు ప్రిం
గను బయి కేగి వేఁడిమిని గ్రాగక రేఁగుచునుండ నీపయిన్
గనుకని వజ్ర మింద్రుఁ డలుకం గొని వైచె నహో కవెంద్రు కే
గొనకొన లేక లేనిదయి కొంకి గమించెను మళ్లఁదెళ్లనై. 168

ఆ. బ్రహ్మ వచ్చి యపుడు వజ్రంబు దెబ్బకు
లొంగనట్టినీకు లోన మెచ్చి
యస్త్రశస్త్రభయము వాయుధభయము లే
కుండునట్లు వరము లొసఁగెఁ గాదె. 169

క. మే మిపుడు నిన్ను దైవము
గా మదిఁ దలఁపోసి బ్రదుకఁగా నుంటిమి నీ
వీమొయిఁ జూచుచు నుండకు
మో మారుతి! లెమ్ము కడలి నొయ్యన దాటన్. 170

—◆ హనుమంతుఁడు సముద్రంబు దాఁట నుత్సహించుట ◆—

వ. అట్లు జాంబవంతుండు ప్రేరింపఁ బ్రతీతవేగుం డగుపవనాత్మజుండు ప్రహర్షించుచు మేను వెంచినఁ గాంచి ప్లవంగోత్తములు సంతోషాయత్తచిత్తులై సింహనాదంబులు గావించుచుఁ బ్రభంజనాత్మజుం బ్రస్తుతించిన నతండు సంతోషంబునఁ బుచ్ఛచాలనంబు గావించుచుఁ గ్రమక్రమంబునఁ ద్రివిక్రమక్రమంబునఁ గ్రమవృద్ధింగాంచి విజృంభించి యి ట్లనియె. 171

సీ. ఉర్వీధ్రముల నెల్ల నుఱ్ఱూఁత లూఁగింపఁ
గలమహాబలునకేఁ గలిగినాఁడ
వేగంబునం జేసి విశ్రమింపక వేయి
నూరులుచుట్టెద మేరుగిరిని
సప్తసాగరముల గుప్తజలంబెల్ల
నెగురఁ గొట్టెద వట్టిదగుట దోఁప
నుదయించురవి తోఁడఁ గదలి నే నస్తాద్రి
కేగి మరలి వాని కెదురుపడుదు

తే. పంచభూతములబలంబు లెంచుఁడేను
తద్బలము నాకొకింతయై తనరఁజేయు
దును సముద్రము దాఁటుట యనఁగ నాకు
లీల యని యెంచుఁడీ భయశీలులార. 172

ఉ. అంబుధి నేను దాఁటినపు డందలినక్రతిమింగిలాళితో
నంబరమంతయుం జలమయం బగు గహ్వరి దద్దరిల్లు భూ
ధ్రంబులు పిండిపిండియగుఁ దారల సంఘగనేగ మేఘ సం
ఘంబులుమీఁకు నష్టి నను గన్గొన బీ తగుఁ డెంచు నెంచఁగన్. 173

తే. ఆకసంబున నేగున నక్షరసి యరసి
ద్వాదశాత్ముఁడు భయపడి దారి తప్పి
పశ్చిమాంబుధికిం బోవఁ బడలుపడును
నాఁడు వింధ్యాద్రివడకేఁ బో నోడినట్లు. 174

క. పదివేలయోజనంబుల
పద మొక్క నిమేషకాల పరిమితిలోఁ గా
ముదమున వాయువు లెఱుగున
నిదె నే లంఘింప నేర్తు నెఱుఁగుఁడి మీరల్ 176

క. పవిధారిఁ వచ్చునింద్రుని
సవసవగాఁ బట్టి తేరఁ జాలుదు రక్షః
ప్రవరులతోఁ గా లంకా
భువియంతయు బెల్లగించి భుజమునఁ దెత్తున్. 177

వ. అట్లు పలుకుచుండ వానరులెల్లరు సంతసించుచుండి రపుడు పరమ సంతుష్టాంతరంగుండై జాంబవంతుండు.

క. దేవర్షులు బ్రహ్మర్షులు
దేవతలుం బెద్దలెల్ల దీవింత్రు నినున్
నీ వెసఁగుము దీప్తిన్ బా
రావారము దాఁటి చూచి రమ్మా సీతన్. 178

వ. ఓజగత్ప్రాణనందనా! మాప్రాణంబు లన్నియు నీమీఁదం బెట్టిమే మిట నొంటికాల నిలిచి యుందు మనిన హనూమంతుం డో వానరవీరులారా! నేను లంఘించి మీఁది కెగయునప్పుడు నాపాద ఘట్టనంబునకు నావేగంబునకు నీమహేంద్రగిరి సమర్థం బగుం గావున నేనాపర్వతాగ్రంబునకుం బోయెద నని వాయుకుమారుండు మహేంద్రపర్వతం బారోహించె నని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును. 179

—♦ ఆ శ్వా సాం త ము ♦—

చ. అతిథులు మిత్రబాంధవు లహర్నిశముం దనయింటి కేగుదే
సతతము పంక్తిభోజనమొసంగుచు వారును వారుఁ గోరినన్
హితమతి వారికోరికల నెప్పుడు తీర్చెడు నట్టిదాతయై
స్తుతులకునైనవాఁ డగుచుశోభిలు నీదరవెంకటాహ్వయుం
డతులితభాగ్యభోగ్యముల నంది సుఖంచుచు నుండుఁగావుతన్.

గద్యము.

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ కవి
సార్వభౌమాంధ్రవ్యాసాభినవశ్రీనాథ వేదవిద్యావిశారద
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన శ్రీకృష్ణ
రామాయణంబునందుఁ గిష్కింధాకాం
డంబున ద్వితీయాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ.

శ్రీరస్తు.

# శ్రీకృష్ణరామాయణము

—:o:—

## సుందరకాండము

ప్రథమాశ్వాసము.

---



కరుఁడై సచరాచర
లోకంబుల సృష్టి చేయులోకేశుఁడు సు
శ్లోకుని వేంకటరాయనిఁ
గైకొని రక్షించు నెల్ల కాలము కరుణన్. 1

వ. అవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు వాయుకుమారుండు మహేంద్రపర్వతం బారోహించి ప్రాగ్దిశాభిముఖుండై చేతులు జోడించుకొని. 2

— ఆంజనేయులు సముద్రంబు దాఁటుట —

శా. నన్నుం గన్నసమీరదేవున కిదే నావందనం బెల్లసృ
ష్టిన్నిర్మించినబ్రహ్మదేవున కిదే చేమోడ్పు ముల్లోకముల్
తన్నుం బోలెను బ్రోచుజిష్ణున కిదే దండప్రణామంబు సం
పన్నోస్రంబుల వెల్గువేల్పున కివే ప్రాంచన్నమస్కారముల్. 3

వ. అని లంకవంక మొగంబు పెట్టి. 4

తే. ప్రాణమును బిగ్గఁబట్టి మధ్యంబు వంచి
కుంచి పాదముల్ చెవులు రిక్కించి తోక
వీఁక నాడించి రొమ్మూఁచి యాకసంబు
ఢంక ఘో మొత్తి విదళించి వర్ష్మ మపుడు. 5

సీ. బాహువు లల్లార్చి బలమికమైఁ గుంగి
కుప్పించి కాళ్లను గొంకఁ దన్ని
రివ్వున మీఁదికిఁ జువ్వనా లేచె న
త్తాపున కయ్యద్రి దద్దఱిల్లె
శాఖలపుష్పముల్ జలజల రాలెను
గుహలలో సత్త్వముల్ ఘూర్ణిలెఁ గడు
గులకటా లన్నియు గులగులలై కూలె
మ్రాఁకు లన్నియు నేలమట్ట మయ్యె

తే. ఘోరు మనుశబ్ద మత్తటి నుర్వీతలము
వ్యోమతలమును నిండె మహోన్నతముగ
నటుచుచుం బఱీ లెల్లెడఁ బఱవఁ జొచ్చె
నగచరేంద్రుఁడు నింగిపై నెగిరినపుడు. 6

శా. పంచాస్యంబుల పన్నగంబు లని చెప్ప స్వచ్ఛహస్తంబులన్
జంచచ్చారురవిందులో యనఁగఁ జెల్వంబొల్చునేత్రంబులన్
బాంచజ్జిష్ణుధనుర్వరం బన గణింపం జెల్లువాలంబు పెం
పెంచన్ లంకను దోకచుక్కపడు నా వీక్షించి రమ్మారుతిన్. 7

మ. హనుమచ్చారితరోరువేగ జనితాత్యంతోగ్రవాయ్వాహతిన్
గన నాద్యుత్తరదిక్కటంబున నపానాన్నధుండు పాతాళమున్
జనునో నా దిగి పోయి గాడివడె మున్ భాస్వంతు ముట్టంగ నో
యన మిన్నంటె మహాస్వనంబున జగం బల్లాడఁగాఁ జేయుచున్. 8

తే. దక్షిణంబునఁ జుక్క లుదధిశిరమున
మల్లెపూదండలం గొన్నమాడ్కి నొప్పె
గిరితరూద్గతపుష్పముల్ తెరలి పడుట
జలధిపుష్పమయం బని తలఁప నయ్యె. 9

తే. హనుమపై వేల్పు లప్పు లతాంతవృష్టి
కురిసి రుత్తరవాయువుల్ గొట్టె సూర్యుఁ

చెంతనేసియుఁ జల్లనై యెసక మెసఁగ
మునులు దీవించి రమణులు పొగడ రహిని. 10

—♦ సముద్రుఁడు హనుమకుం దోడ్పడ మైనాకుం బుచ్చుట ♦—

చ. సగరునికారణంబునను సాగరనామము పొల్చినట్లు నా
సగరునివంశమందు జనునసారసనాభుని కార్యముం బొన
ర్పఁగఁ జనుసంజనాసుతునిపట్ల నొకించుక సాయ మేను జే
యఁగ నగునంచు సాగరుఁడు స్వాంతమునం దలపోసి యంతటన్.

తే. వజ్రిహతిఁ జేసి యింద్రుండు పర్వతముల
ఱెక్కలం జెక్కునప్పుడే నక్కటికము
గలిగి దాఁచితి మైనాకుఁ గడుపునఁ గొని
వానిఁ దోడ్పడఁ బుచ్చెద వాయుజునకు. 12

తే. అని సముద్రుఁడు మైనాకు నపుడు పిలిచి
నావలనఁ గావఁ బడితి మైనాక! నీవు
రామకార్యార్థియై కపిరాజు వాఁడె
పోవు వానికి సాయముగా వెడలుము. 13

శా. ఆకాశంబున నేగుచుండె నదిగో నా రామదూతుండు మై
నాకా! తోడ్పడు మేగి వాని కిది నానాలోకముల్ గాచున
ట్టై కన్పట్టెడుకార్య మిందువలనను నీ కత్యంతవిఖ్యాతియున్
నాకాధీశు ననుగ్రహంబు గలదై నల్వొందుచుం జెప్పెడున్. 14

తే. మధువు మాన్యము లర్ఘముల్ మానికములు
నిచ్చుకొమ్మంట గాదు నీ వేగి దారి
నిలుతువే నాతఁ డొక్కింత నీపయి శ్రమ
వాయునటు పోవు నిదియె నీచేయఁ గలది. 15

తే. అతిథి సత్కార మియ్యది యగును దీని
కంటె నాత్మోద్ధరణం బెద్ది గలుగఁ బోదు

వేగిరింపుము నావుడు వెడలి జలధి
నంపి లేచె మైనాకుఁడు వ్యోమ మంట. 16

వ. ఆంజనేయుండు దనదారి కడ్డువచ్చిన మైనాకుం గాంచి సంభ్ర మించుచు. 17

మ. ఎవఁడో వీఁ డొకరాక్షసుండు ననుఁ బోనీ కాగఁగా వచ్చెఁ గొం
డవలెన్ వీనిని బట్టి బిట్టడఁచెదన్ గా కంచు నొక్కుమ్మడిన్
జవనం బేర్పడ ముష్టితోఁ బొడిచె నాశైల్మభృద్వర్యేణ్యాంబునుం
బవిచేఁ బోలె జలించి మర్త్యనిగతిన్ భాషించె భూషించుచున్. 18

ద్విప. ని న్నడ్డగింపగా నే రాను జూవె
నన్ను రక్కసిగ మనంబున నీవు
శంకింప వలదయ్య సాగరుఁ డిట్లు
శంకరాంశజు నిన్ను సంధింపఁ బంప
వచ్చితి మైనాక వరనాముఁ డేన
యిచ్చమై నామీఁద నించుక నిల్చి
సేద దేరి గమింపఁ జేయుదు మనవి
నీదగు కరుణకు నే వేచి యుంటి. 19

మ. మును బక్షంబులతోడి పర్వతము లేపుం జూపుచున్ దిక్కులన్
జనసంఘుంబులు బెగ్గడిల్ల మెలఁగన్ శక్రుండు వజ్రంబునన్
గొని తత్పక్షము లెల్లఁ ద్రుంచుతఱి నన్ గొం చీసముద్రంబునన్
మన వైచెన్ నినుఁ గన్నతండ్రి యదిగాన న్నిన్ను బ్రేమించితిన్. 20

తే. నేను యత్కించి దుపకృతి నీకుఁ జేత
యనిలదేవునకుం జేసినట్టి దగును
నాకృతజ్ఞత జగతిపై నాటఁ జేయుఁ
గాన నాప్రార్థన మొనర్పఁ గాఁ దలఁపుము. 21

ఉ. నా విని యాంజనేయుఁ డను నా కిట నిల్వఁగ రా దొకింతయున్
గ్రావవరేణ్య! సూర్యుఁ డపరస్థలముం గనఁ బోక మున్న లం

కావసుకృతం బిగం బగుచు గాప్రన తే సుపలంబు రాము కే
పీవిధి నాపరించుటయె యొంతయొ మే లొనగూర్చి నప్పుడున్. 22

ఆ. రామబాణమట్లు రయమంబుగాఁ బోవఁ
బ్రతినఁ జేసి కావె వచ్చినాఁడఁ
గానఁ బ్రతినఁ జెల్లఁగాఁ జేసి పోనిమ్ము
నగుట నాకుఁ బోవ నాజ్ఞ యిమ్ము. 23

వ. అని హనుమంతుండు మైనాకుం బహూకరించి పోవఁదలంచుటను నగాంగం బంటుక స్పృశించి చనియె నాలోన నింద్రుండును వచ్చి మైనాకుండు చేసిన చేతకు మెచ్చి నీకు నావలన నెట్టి భయంబు లేకుండు నని వరం బిచ్చి చనియె నంత. 24

—♦ దేవతలు హనుమంతుని బరీక్షింప సురసను బంపుట ♦—

చ. సురవరులున్ మహర్షులును శూరవరుం డనుమంతుఁ డెంతటి పె
క్కువ రణకర్కశుల్ గలుగుకోనకుఁ బోయెడు వాఁ డతండు నె
క్కరణి దొడంగనై జయము గాంచెడునో యని సంశయాత్ములై
సురసను నాగమాతఁ దమ చోటికి రమ్మని పల్కి రిమ్ముగన్. 25

ఆ. అదిగొ పోవుచుండె హనుమంతుఁ డాతని
బలపరాక్రమములు తెలియఁ గోరి
యున్నవార మీవు గ్రక్కున చని రాక్ష
సివి కరాళవక్త్రి వపు వమర్చు. 26

వ. అని యాదేశించిన నాగమాత దంష్ట్రా కరాళాస్యయు సర్వలోక భయానకయు విస్తృతాకారయు నై హనుమంతు నడ్డగించి యి ట్లనియె. 27

చ. నిలు నిలు వానరప్రవర! నేను క్షుధార్తను నాకు దైవ మి
ప్పొలుపునఁ దిండిఁ బుచ్చె నొకపొల్లునఁ బోవక నామునోటిలో
పలి కరుగంగ రమ్మనినఁ బావని యి ట్లనుఁ దల్లి నేను రా
ములపనిమీఁదఁ బోయెదను బోయి నిన డెలి వత్తు నింతలోన్. 28

తే. అపుడు నీనోటి కయ్యెద నమ్మ రాముఁ
డెల్లవారల కేడ్గడ యీావు రామ
భద్రునకుఁ దోడుపడు టది భావ్య మగుటఁ
జెప్పుచుంటిని నామాట చెవుల నిడుము. 29

సీ. నావుడు సరమ యిం కే విడువను నిన్ను
మ్రింగెద నని వాని మేనికంటె
పదిరెట్లుగా నోరు వడిఁ దెఱచిన హనుమ
యిరువది రెట్లుగా నెదిగె సురస
ముప్పది రెట్లుగా నప్పుడు నోర్ సేయ
హనుమ నల్వదిరెట్లు తనువు పెంచె
సురస యేఁబదిరెట్లు పఱపె నాస్యము గాలి
సూనుఁ డెన్మిదిరెట్లు మేను పెంచి

తే. నూఱురెట్లుగ సురస దా నోరు తెఱచె
నంతలో సూక్ష్మరూపుఁడై హనుమ దాని
వదనగహ్వరమునఁ జొచ్చి వచ్చి వెలికి
నీదు నాఁకలి తీఱెనో లేదొ చెపుమ. 30

తే. అంత సురసయు నిజరూప మంది యేను
నాగమాతను దేవతల్ నన్నుఁ జేరి
నీదుశక్తిఁ బరీక్షింప నీదు కడకుఁ
బుచ్చుటంజేసి వచ్చితి పురుషసింహ ! 31

మత్త. నీ వసాధ్యుఁడ వెల్లవారికి నిన్నుఁ బోలినజోఁడు లే
డీవసుంధర రామకార్యము నీవ చేయగఁ జాలుదో
పావనీ! నినుఁ బ్రస్తుతింపఁగ వచ్చు దేవవిరోధు లా
రావణాదుల నోర్వఁ జాలుదు రమ్ము పోయి యొకింతలోన్.

—♦ ఛాయాగ్రాహిణి హనుమంతుం గ్రసించుట ♦—

వ. అని సుర చనినంత నాంజనేయుం డెప్పటియట్ల గగనతలంబున
నెగురం జొచ్చె నప్పుడు సముద్రజలమధ్యంబున నున్న సింహిక
యనునాక్షసి, 33

శా. ఆకాశంబునఁ బోవు జంతువుల ఛాయం బట్టి భక్షించు న
ప్లాకీశేశుఁడు పోవుచుండ నొకఛాయం గాంచె మే ల్మేలు ఛా
య్యాకారంబు గలట్టి ప్రాణి యపుడో నన్నదెన్ బట్టి నా
యాకాశంబున బడవేసికొందు నని యంతే నంతనం జొందుచున్. 34

క. ఛాయాగ్రాహిణి గావున
నాయువకము లందుఁ దోచుహనుమంతుఁ డదై
ఛాయఁ గనిపట్టి పైఁబో
సియకి గ్రసియింపఁ జొచ్చె నింతలోఁబెన్. 35

తరళము. గమనవేగము తగ్గ నొక్కఁడు గాక క్రిందికి జారుటల్
క్రమగతిం గని వాయుపుత్రుఁడు కన్ను క్రిందికిఁ ద్రిప్ప తో
యములఁ సింహికఁ జూచి పెద్దకే పట్టి దానిమహాస్యగో
శమునఁ గూలి వధించె గోళ్లను లాగి ప్రేవుల నన్నిటిన్. 36

తే. సింహికం జంపె యాకీర్తి సిద్ధసాధ్య
ముఖ్యఖచరులు వినుతింప భూరి తేజఁ
డాంజనేయుఁడు సింగికి నట్టె యొగసి
వాయువేగముఁనం జేసి వార్ధిఁ దాటె. 37

—హనుమంతుండు సముద్రము దాటి సువేలాద్రి నధిష్ఠించుట—

క. ఇనుఁడస్తాద్రిఁ జేరెను
వనుచుండఁగ నాంజనేయుఁ డబ్ధిక నవలన్
దనరారుసువేలాచల
మును జేరం జిగియె వేలుపులు నీ లంకన్ 38

శా. ఈరూపంబున లంకలోపలికి నే నేగ న్నరుం గాంచి ర
క్షోరాజప్రజ మెల్ల సంశయమునన్ గోరాడి పోరాడుచున్
నారామప్రియకార్యభంగమునకుం గారాచులై యుం డ్రిటన్.
నా రూపంబును మార్చుకొంటయె తగున్ నానాప్రకారంబులన్.

క. అని హ్రస్వాకృతిఁ గైకొని
వనచరవల్లభుఁడు లంబపర్వతమందున్

గొనకొని విహరించుచు న
ధ్వనితాంతశ్రమము వాసి ప్రమనుం డగుచున్. 40

క. తారకలు నింగి విరిసిన
తీరున లంకాపురంబు తెరవులు నగళుల్
ద్వారములు తోరణంబులు
వారక దీపములు వెలిగె పవ లట్టులు గన్. 41

మ. గిరిపైనుండి సమస్తభాగమును నాకీశుండు వీక్షించి యి
ప్పురముం బోలి పురంబు లోకములలోఁ బొల్పొందుటల్ విందుమే
పురుహూతాదులపూర్వరంబులను జెప్పంగా గ్రంథము ల్విందుమే
పురమున్ దీనిశతాంశభాగమునకేఁ బోలింపఁగాఁ బోలునే. 42

♦— హనుమంతుఁడు లంక నభివర్ణించుట ♦—

క. మణిమయము స్వర్ణమయ మని
గణుతించెడు సత్కవీంద్రకార్యములం దా
ఘటితము లవి నమ్మకుందుము
గణకలితము దీనిఁ గన్న కొఱలుండ వెదకన్. 43

ఉ. మేరుగిరీంద్రమం దయిన మేలిమిబంగరుచేతనిర్మితం
బై రమణించు లంక యనియం ద్రదిగా దొకమాటయంచు నే
నూరక యెంతుఁ గాని కనుగో నిపు డంతయు సత్యమై తగెన్
మేరువుకన్న నియ్యదియె మిక్కిలిమక్కువఁ గూర్చు నద్దిరా. 44

క. మృణ్మయభూములు లేవు హి
రణ్మయములెఁ గాన వచ్చు రావణపురిలో
రాణ్మందిరము లితరమహి
పణ్మందిరములు గననొక్కఁడుచిఁ దనరారున్. 45

సీ. సలుగడఁ బ్రాకారములు నాకమంటిన కంటి
యున్నవో యనఁ జూడ నొప్పుచుండి
సాగరోపమ మయి సర్వతఃపరివృత
మయి భయంకరఖేయ మతిశయిల్లుఁ

జక్కులకెలువుపైఁ జూపట్టుశిఖరముల్
గలమహాప్రాసాదములు నెసంగ
నిందితనందనానందకందళితోప
వనశతసాహస్రములఁ బలిసి

తే. గుడులతో గోపురములతోఁ గరిమ మెఱసి
సూర్యసోమవీథులఁ గడున్ సొంపు మిగిలి
తోరణస్తంభసంభృతమై రహించి
యేపు మీఱుచునుండు లంకాపురంబు. 46

ఉ. గోపురశీర్షభాగములకుం దగిలించినమేల్పతాకలా
గోపురపాలకాదుల కకుంఠితరావణశక్తి నాజ్ఞలన్
జూపుచునుండు నాఁగ వినువీథిఁ జలించుచు నొప్పుచున్ గడు
న్వ్యాపథు వెల్గువారికి జనింపఁగఁ జేయుచునుండు మెండుగన్. 47

శా. ఈలంకాపురి యెట్టి యెట్టిదకు నే నీక్షింపఁగా దాని ప్రా
కీలాంభోనిధిమధ్యభాగమున దుర్భేద్యాగ్రవప్రావృతం
బై లక్షింపఁగ వచ్చు వానరుల కీప్రాంతంబులం జేరఁగా
నేలీలన్ లభియించు రాక్షసుల వారే రిట్లు నిక్షింతురో. 48

తే. అంతయు నసాధ్య మని నాదుస్వాంత మిపుడు
చెప్పుచున్నది రఘురాముఁ డెప్పగిదిని
సాగరము దాఁటి రావణుఁ జంపఁ గలఁడొ
దారియుం దెన్నుఁ దోఁప దీదర్శనమున. 49

వ. అయిన నిపు డనంతరకర్తవ్యవిచారణం బత్యావశ్యకంబు నే నీరజని సమయంబున లంకాపురంబు సొచ్చి సీతాన్వేషణంబు గావించెద నని పురోత్తరద్వారంబు దరియం జని సంధ్యావసానసమయంబునఁ బ్రసిద్ధద్వారంబునం గాక యద్వారంబున లోనికిం జని సూక్ష్మరూపుండై నడయాడుచుండు నంతలో నెట్టయెదుట. 50

మ. కనియెన్ మారుతి యుత్తరాధ్వమున నాకాశంబునుం దాఁటిపో
యినదో నా భ్రమగల్గఁ జేయుచు సువర్ణైకప్రభారాశి సూ

ర్యని కాంతిఁ నిరసించి మించు వరహార్మ్య శ్రేత్రంస మా రావణుం
డనులఁ దత్ప్రభవ ద్విప్తి చని సుపర్వానీకముం గెల్చెఁడుఁ. 51

—♦ హనుమంతుఁడు లంకిణి నోడించుట ♦—

తే. అని తలంచుచు దాటివో హనుమ యున్న
యపుడు వాఁకిట నిలిచి ఘోరాకృతి గల
రక్కసి యొకర్తు కని యోరి! యెక్కడి కటు
లరుగుచుంటివి నిలు మని యార్చె బిట్టు. 52

మ. వికృతాస్యంబు భయంకరేక్షణములుఁ బృథ్వీధరాభాంగమున్
సవిమర్శంబుగఁ జూచి పావని కడున్ జర్జించి యిద్దానితో
బవరంబుం బొనరింపఁ గార్యమునకుఁ భంగంబు వాటిల్లు నే
నవియోచెప్పి ప్రశాంతి చేయుటయె పో యుద్వేళకుం జెల్లెడుఁ. 53

వ. అని దానిదిక్కు మొగంబై. 54

ఉ. చెట్టులఁ జేమలం దిరిగి చీమల దోమలఁ బోనివాఁడ నై
యెట్టిటో కాలముం గడవ నీఁదుచు నుండెడువానరుండ నే
నిట్టిపురంబుఁ జూచుమతి నేగుచునుంటిని నాకతంబునఁ
రట్టులు రావు వేరికిని రామరా! పోవ నను గ్రహింపవే. 55

వ. అని మఱియును. 56

క. నీ వెవరు వినఁగ నెంచితి
నోవనితామణి! వచించియుం గరుణమెయిన్
నావలనఁ గూర్మి సేయుము
నావుడు నారాతిసాంగనామణి యనియెఁ. 57

తే. నేను లంకిణి యనుదాన వానరా ! పు
రంబు రక్షింప నను నిల్పె రావణుండు
నన్నుఁ గా దని చీమయు నగరముఁ జొర
నైతి గా దని చెప్పుదు నరుగకు మటు. 58

ఆ. ఓల మాస గొందువో నీవు వెనుకకు
మరలు మట్లు గాక మఱకువ మెయి

నడతు వేని నీవు పుడమిపై వంచపు
చెప్పుచుంటి వినుము చెవుల నొగ్గి. 59

క. అనవుడు తల్లీ ! లంకన్
గనుఁగొన మన మయ్యె నింతకాలములోనన్
జని వత్తు నాజ్ఞ యి మ్మని
చన రెండడుగులను ముందు సాగఁగ నిచ్చెన్. 60

చ. రయమున వచ్చి లంకిణి కరంబున మారుతివీపుపైఁ గనన్
భయ మొదవంగ వేయుటయు వాయుతనూజుఁడు మ్రొగ్గతిల్లఁ బో
యియు నిల నూది నిల్చి వడి నేత్రలఁ జూపుచు దానినెత్తిపై
శయమున మొత్తె దాన నది చచ్చినయట్లయి కూలె నేలకున్. 61

ఆ. కూలి లేచి మోడ్పుఁ గేలుఫాలంబునఁ
జేర్చి పాహి యనుచుఁ జేర్చిన వెఱ
నిట్టు లనియె గెల్చి తీవు న న్నిప్పుడు
వానరేంద్ర ! నిన్ను నే నెఱుఁగుదు. 62

ఉ. స్త్రీవధ మాచరించుటలు చెల్ల దటంచును గాక యింతలో
నీ వెటు లూరకుండెదవు నే నిటు చచ్చినయట్టి దాన నై
చావక యుంటి నీదయినశక్తియు యుక్తియు బ్రహ్మ నాకు మున్
భావన చేయుచుం దెలిపె వాయుతనూభవుఁ డీ వెఱుంగుదున్. 63

ద్విప. ఏనాఁడు నన్ను నీ వేడ్తెఱ మీఱ
నో నేయుదువో నాకు నొంటూరు పగునో
నా నాఁడు లంకకు నఖిలరాక్షసుల
కా నెంతయేని భయం బాంజనేయ. 64

మత్త. అడ్డమాకలు లేవు నీ కిట నందఱున్ జితు లట్టిరై
యుడ్డు గుడ్చెద రేమి చెప్పఁగ నుర్వరాతనయాకృతిన్
గొడ్డగం బగుమిత్తి లంకకుఁ గూడ వచ్చె సమస్తమున్
జెడ్డయే యగు రాక్షసాళికిఁ జెప్ప నేటికి మారుతీ. 65

వ. నీకార్యంబు నిర్విఘ్నంబుగం గొనసాగఁ బొమ్ము లంకాపురమ్మున యథేచ్ఛంబుగ విహరింపు మని మారుతికి మార్గంబు విడిచి తొలంగి చనియె నంత నతండును. 66

## ఆంజనేయులు లంకం జొచ్చి సీత నన్వేషించుట

సీ. లంకిణి నిర్జించి లంకాపుర ప్రవే
శము సేయఁగా నెంచి సరణిఁ గాంచి
ప్రాకారములు దాటి పరిఘలు లంఘించి
రాజమార్గంబునఁ దేజు మెఱసి
వివిధహర్మ్యంబులు వీథులు తిలకించి
చత్వరంబులయందు జాడ లెఱిఁగి
గుడిగోపురంబుల నడయాడుచుం జూచి
పానశాలలు సొచ్చి కానలేక

తే. నర్తనాగారములును గానగృహములును
పాఠశాలలు గజవాజిభద్రశాల
లాయుధాగారములును వ్యాయామశాల
లరసె హనుమంతుఁ డెంతయు నప్పురమున. 67

సీ. నృత్యగీతాదుల నేర్పరితన మెల్ల
జూపి చూపుచు నిద్రఁ జొక్కువారి
మద్యపానంబున మైమఱచి వివస్త్రు
లై పండి గుర్వెట్టునట్టివారి
నురగులోకో నాఁగ నొండొకళ్లం గట్టి
కొని గాఢతరనిద్రఁ గొనెడు వారి
సరససల్లాపముల్ సలుపుచుం బ్రియులతోఁ
గేళీగతులతోడఁ దేలువారి

తే. మఱియుఁ బెక్కు తెఱంగుల మలఁగువారి
నన్నిశాసమయంబున నాంజనేయుఁ

డపస్ఫారంబునఁ గలిగినహర్మ్యతలము
లందు విహరించుచుం గాంచె నందు నందు. 68

మ. ఒకకన్నున్ మఱియొక్కజానుగును వేఱొక్కండు పాదంబు నిం
కొకమోమున్ బహుబాహువుల్ శిరము లెన్నో కల్గువారిన్ మహా
వికృతాకారుల ఘోరదేహులను బీభత్సమాకారులన్
సకలస్థానములందుఁ జూచెను మరుజ్జాతుం డటన్ దైత్యులన్. 69

సీ. ఒకపానశాలాంగణోన్నతతలమందు
తరుణీమణులు త్రావి తనువు మఱచి
ఒకతెపై నొకతిగా నొదిగి వ్రాలి శయించి
రపుడు వారలభూష లటు నిటుఁ బడె
తారహారంబులు తబ్బిబ్బవడి వీడె
విరియఁ బాఱిన కేశవీథిఁ జిక్కి
పనిగలజలతారువలువ లన్నియు వీడె
యొడలిపైఁ గాక వేఱొకటఁ జేరె

తే. అపుడు దివ్వెలవెలుగున హనుమ కంటి
కచట సొన్నము నీలముల్ రుచిరమణులు
ముత్తెములు పోఁగు పోఁగులు పోసినట్లు
పొలుపు దోపఁగ వచ్చె నాపురమునందు. 70

వ. అట్లు వివిధప్రదేశంబుల సీతాన్వేషణమ్ము చేయుచు హనూమం
తుండు క్రమక్రమంబునఁ బ్రహస్త మహాపార్శ్వ కుంభకర్ణ మహో
దర విరూపాక్ష విద్యుజ్జిహ్వ వికట ప్రభృతులగృహంబు లెల్ల
వెదకి పుష్పకవిమానరాజభాగంబుల బరిశీలించి యెందునుఁ గానక
విభీషణగృహంబునకుం జని సూక్ష్మరూపుం డయి యొక్క చిత్ర
పటంబు చాటునం జేరి యున్నసమయంబున. 71

—♦ ఆంజనేయులు విభీషణ గృహంబున కరుగుట ♦—

తే. మగువ మగఁడు నొండొకరత్న మహితదీప
కాసమీపమునందు రత్నాసనములఁ

గూరుచుండెరి మగఁ డప్డు కొంతలోన
వినుమనుచు నొక్కగ్రంథము విప్పిచదివె. 72

ఉ. పావని సాగరం బతిజవంబున దాఁటి నిమేషమాత్రిలో
నావల లంకిణిం దెగెడునట్లుగఁ జేసి పురంబు సొచ్చి నల్
కేవల జానకిం వెదకి ఖిన్నత నొందినచిత్తవృత్తితోఁ
బోవుచు రావణానుజునిమోలిల మెలంగెడు వాఁడయ్యె తగన్. 73

క. అని చదివి యెదుట గనుఁగొని
వనితా! యదె వచ్చె వాయువరపుత్రుఁడు గ
న్గొను మన వనితామణి యటఁ
గని కాదది చిత్రపటము గాదొకొ తెలియన్. 74

మ. అని యాజంపతు లాడుకొన్ననుడు లాపాంతంబునం దున్నపా
వని యాలించి ననుం గ్రహించిరొకొ వీ రం చింత చింతించియున్
వనితావాక్యమునన్ గ్రహింప రని లోభావించి వీ రెవ్వరో
కనిరామాదులచిత్రముల్ గృహమునన్ గౌతూహలావిష్టుఁడై. 75

మ. తనమేన్ డాపగ నాశ్రయంబయిన చిత్రం బెన్నఁదా నొటయున్
గని యాతండు విభీషణుండు సతికిం రామాయణగ్రంథమున్
వినిపించుగ గథ ప్రస్తుతంబ యయి సందేహంబు సంధించె నా
మనమందించుక శాంతి కయ్యె నిట రామస్వామినామస్మృతిన్.

వ. మఱియు వీరిసంభాషణం బెట్లుండునో యాలకించి పోవుదమని పటంబు వెనుకం డాగి యుండె నపుడు విభీషణుండు వెండియును.

తే. వెదకి సీతను రావణుసదనమందు
విక్రమముఁ జూపి రాక్షసవీరవరుల
నని మొనం గూల్చి పెక్కుర నంతఁ బోక
పోలు రగిలించి పోవు నాగాలికొడుకు. 78

వ. మఱియు నోకాంతా. 79

ఉ. రావణుఁ డిట్లు కార్యగతి రామసతిం గొని వచ్చె నందునన్
దేవవిరోధివర్గములు ద్రెళ్లక మానవు రామచంద్రుఁడో

కేవలమర్త్యుఁ డంచుఁ బరికించుట పోలదు దేవదేవుఁడౌ
శ్రీవరుఁ డాతనిన్ దొడరి చేడ్పడి పోయెదు రావణుం డనిన్. 80

క. నే నారాముని భక్తిం
ధ్యానించెదువాఁడ నతనిదర్శించి ననున్
సూనునిగఁ జూచిప్రోవన్
గానుల్లము సేయు మనుచుఁ గైమోడ్తు సతీ. 81

వ. అని యనేకవిధంబులఁ బలుకుకొనుచుండ నాంజనేయుం డీతండు లోకవిద్రావణుం డగురావణు ననుజుం డుత్తమోత్తమచరితుండు విభీషణుండు యీయమ వీనిసహధర్మచారిణి సరమ యని నిర్ణయించి వారి నభినందించుచు నందుఁ బాసి రావణాంతఃపురంబున కుం జని యందందు గరుడగంధర్వకిన్నరయక్షరాక్షసాద్యంగనలం జూచి యొక్కమహాప్రాసాదరాజంబున నానావిధసుమసమలంకృతం బగు శయ్యాతలంబున. 82

—♦ హనుమ మండోదరిం జూచి సీతయని భ్రమించుట ♦—

తరు. పదిచేతులు తలాడవలెఁ గ్రిందవేలఁ
బది చేతు లంగము పైఁ గప్పి గ్రాలఁ
బదిశీర్షములు మోముప్రక్కకు వ్రాలఁ
బడఁతిపాదములపైఁ బదము వైచెఁ
గోదుక కొత్తిలి పండుకొని గురువెట్టు
కొనుచు నూరుపుతావి కొలలేక పర్వ
నిదురించురాక్షసనేత నీక్షించె
నిగిడించి మే న్కంటనిమిషముల్ లేక. 83

చ. కనుచు విభీషణుండు తనకాంత కెఱుంగగఁ జేయురామచం
ద్రునిచరితంబునం జెవికిఁ దోపగ వచ్చె సురారియింట భూ
తనయ లభించు నన్ననుడి దానన వచ్చితి నిచ్చ నీడ కీ
దనుజుని కౌఁగిటం బడినతన్వి యెవర్తుక గాఁగ నుండునో. 84

క. అని డోలాందోళితహృ
ద్వనజుండై వాయుసుతుఁడు వర్తించెడులో

దనుజుఁడు జృంభించుచు న
వ్వనితను విడి యోసరిల్లఁ బడి నిద్రించెన్. 85

తే. అతివసర్వాంగసౌష్ఠవ మపుడు చూచి
తనకు రాముఁడు చెప్పినఘనతరములు
జానకీలక్షణము లెల్ల నానెలంత
యందుఁ బొడఁగనె సందేహ మందుమదిని. 86

ఉ. కాళులు వ్రేళ్లు చేతులును కాయము కంఠము లావు సన్నముల్
గోళులు పొట్టియున్ బొడుగు గోమును మోమును కన్ను వెన్నునున్
వాలము జంఘలున్ పిరుదు వక్షము కక్షము లోని వన్నియుం
బోలఁగ వచ్చు నీయమకుఁ బోల్పఁగ నీపతి సీత యేమొకో. 87

వ. అని యించుక సంశయించి యంతలోన. 88

శా. ఛీ ఛీ చెడ్డతలంపు జేసితిని నాచిత్తంబు పాపాత్మమై
నీచం బైనది లోకమాత యగుచున్ నిర్నిద్రతేజంబునన్
వాచింపం దగురామచంద్రుసతియై వర్ణింప కాసీత యీ
నీచం బైనపరాంగసంగమునకున్ జిత్తంబునం దెంచునే. 89

మ. బలవంతం బగు నేని ప్రాణములనే పాయంగ నూహించు నె
ట్టులునే నింతియె కాని నీచునోడి నిట్టుల్ దాఁ బ్రవర్తించునే
కలలోకంబుల నెల్ల నేలగలవిఖ్యాతప్రభావాఢ్యుఁ డా
బలభిత్తుల్యుఁడు రామచంద్రుసతి నేఁ పాపంబు భావించితిన్. 90

క. మండోదరికిన్ సీతా
సౌందర్యము గలదటంచు జగమునఁ బే రా
నిందిందిరాక్షి యీయమ
మండోదరి నిక్కువంబు మాట లిఁకేలా. 91

వ. అని నిశ్చయించి యించుకంతయు విలంబనంబు సేయక వెలికి వచ్చి జానకీసందర్శనంబు గామికి మిగుల వగలం బొగలుచు నొక్కచో విశాలోన్నతసౌధోపరిభాగంబున నధిరోహించి నితాంతచింతాసాగరనిమగ్నమాన మానసుండై. 92

## హనుమంతుఁడు సీతఁ గానమికిఁ జింతించుట

ఉ. ఏ నని రామునాజ్ఞఁ గొని యిట్లరుదెంచుట వార్థి దాఁటుటల్
మానక లంకలోనఁ బతిమందిరముం జని కంట జూడఁగా
రానియనేకదృశ్యము లరల్ విడి చూచుట లెల్ల వ్యర్థమై
పో నగులేగుదెంచె నన బోడి కనం బడ దేమి చేయుదున్. 93

క. సంపాతి చెప్ప లంకన్
జంపకసుమగంధి సీత చనునం చకటా
కొంప లివన్నియుఁ దిరిగితి
నింపతె నాతల్లి యెక్కడేఁ దోప దయొ. 94

సీ. దశకంధరుఁడు జంకఁ దగిలించుకొనిపోవు
నపు డెట్టులే జారి యబ్ధిఁ బడెనొ
దనుజబలాత్కృతిన్ దా నొండు దలఁపక
తెగువ నెట్లేని మృతించె నేమొ
తనపల్కు లొల్లని తరుణిరావణుఁ డసిఁ
గొంతలోఁ గోసెనో యింతలుగను
అక్కసల్ చేయుకరపులు వినమి నామె
మ్రింగివేసినొ పెద్దయంకిలిఁ బడ

తే. యింతెకాని లంకాపురమందు నెందు
నున్నఁ గన్పింపకున్నె నాకన్నుఁగవకు
జానకీ దేవి కన్గొనఁ జాల కింక
స్వామిసన్నిధి కేనెట్లు జనెదువాఁడఁ 95

శా. నానూరేడులు నిండె నే నిపుడు సంద్రంబందు గుండ్రాయి నె
మ్మేనంటన్ దగఁ గట్టికొంచుఁ బడుదున్ మేల్వ్రాజముల్ నూది నేఁ
బ్రానంబుం బూనరింతు బెంజితిని సంబాళించి తద్వహ్నికిన్
మే నర్పించెద జానకిం గనుగొనం నే నోచ కున్నంతటన్. 96

తే. జానకిం జూడ లే దని నేను జెప్ప
రామలక్ష్మణు లే కాదు రామబంధు

వులును సుగ్రీవముఖ్యులు పొలిసెన రిట
సీతఁ గాననిసేఁ జచ్చుటే తగ వగు. 97

ఆ. అంతలోన హనుమ కావేశపూరిత
మగుచు నాగ్రహంబు స్వాంతమందుఁ
బొడమఁ జేవురించుమొగముతో నొడలెల్లఁ
జెమరఁ గొంకపోలె విదలుచుకొని. 98

శా. ఈలంకాపుర మొక్క-వ్రేల్మిడిని నే నీవార్ధిలోఁ గల్పెదన్
గీలాజాలము జొప్పి సర్వజనముల్ గీడ్పాటుగా భస్మమై
పో లీలన్ బొనరింతు రావణునియేపున్ మాపి బంధించి భూ
పాలుం డౌ రఘురాముచెంత నిడుదున్ బాహాబలం బేర్పడన్. 99

వ. అనుచు నొక్క-ముహూర్తమాత్రంబున ధ్యాననిశ్చలమనస్కుం
డై లేచి చేతులు జోడించుకొని. 100

మత్త. రామలక్ష్మణులార ! మీ కివె ప్రాంజలుల్ జనకాత్మజా
నామనఃకలితానతిం గొను నాదుతండ్రి ! మరుత్ప్రభూ
నీమహామహిమ న్నుతింపఁగ నేను జాల నివే నతుల్
ప్రేమఁజేసి గ్రహింపు మీశ్వర ! వీని నిచ్చగనెన్నుచున్ 101

వ. అని యొకండును జేయఁ దోపకున్నంత కొంతలోన. 102

—♦ హనుమంతుఁడు వాయుప్రేరితుండై యశోకవనికిం బోవుట ♦—

ఉ. కమ్మనిమందమారుత మొకానొకదిక్కు-ననుండి వచ్చి చో
క్క-మ్ముగ నంజనీసుతునికాయము సోకినయంత నాతఁడీ
కమ్మదనంబుగాలి యొకనాటికి నేఁ గనియుండఁ బుష్పగు
చ్ఛమ్ముల కింతవాసన లసంభవముల్ తలపోసి చూడగన్. 103

మ. పునఁగుంగస్తురియున్ జవాదియును బెంపుంగూర్చు సాంబ్రాణియున్
ఘనసారంబును గమ్మపుష్పకులసద్గంధమ్మునుం గుగ్గిలం
బును గప్రంబున వెల్గుదివ్వెలపొగల్ పోలింప శ్రీదేవళం
బునయందున్ జనియించినట్లు మదికి న్మోదంబు జేకూరెడిన్. 104

క. ఎదియే దేవళ మిన్వనిఁ
బొదలెడునో భక్తులెవరు పూజించెదరో
కద యనుచునుండ జానకి
మదికిం గానంగ వచ్చె మారుతి కంతన్. 105

వ. నాఁడు సంపాతితో నైనప్రసంగంబున నశోకవనికాభ్యంతరంబున
జానకి యున్నదనునుడి జ్ఞప్తికి వచ్చుటయు. 106

ద్విప. అనసూయ సీతకు నంగరాగంబు
మును తనదర్శనంబున కేగినప్పు
డనుకంప నొసఁగిన దనియును దానిఁ
గొని యామె మైఁ బూసి కొనె నని వింటి. 107

క. ఇది సీతాదేహోదిత
సదమలపరిమళము గాని సామాన్యము గా
దదె వనము దానియందున్
బొదవెడు జనకాత్మజాత పోయెద నటకున్. 108

క. అని యొక్కలంగ నచటికిఁ
జని మారుతనందనుండు సర్వస్థలముల్
గనుఁగొనుచు నడచి నడచియు
వనితామణి వెదకి కొనుచు వగ నొకచోటన్. 109

—♦ హనుమంతుఁ డశోకవనంబున సీతంగాంచుట ♦—

సీ. స్నేహచర్చ యొకింత చేయమి జడగట్టి
కటిదాక వ్రేల్ తలకట్టుదాని
నేనాఁడుకాటుకం గానకుండుటఁ దెల్ల
బోయిన ట్లగుకన్నుదోయిదాని
నన్నపానము లెడ్డ సున్నగావున వగ
డాఁకు నా నున్నమైడాక దాని
నుదుకు జెన్నఁడు లేమి నుర్వీరజం బంటఁ
గడుమాసి యున్నవల్కలముదానిఁ

తే. గేలు తరుశాఖపై వైచి వ్రాలియున్న
దాని రక్కసజాపుల కైనదానిఁ
గనుల బాష్పజలంబులు గార్చుదాని
సతము రామా యనునుడి పలుకుదాని. 110

క. నారీమణిఁ గని యీయమ
యే రామునిపత్ని సీత యేఁ గనుఁగొంటిన్
నారచియించినపున్నెపు
దారి కడు న్మేటి యయ్యె ధన్యుఁడ నైతిన్. 111

మహాస్ర. అనుచుం దర్కించుకొంచున్ హనుమఁడు మదిలో
హర్షముంబొంది మేను
బ్బినవాఁడై యుండంగఁ గన్నీరు ద్రోడలేదు మొగమున్
బెల్చ వీక్షించి దుఃఖం
బునవాఁడై లోకస్తుతుండై పోనరెడుఁదొరకున్
బుట్టి లోకేశ్వరుండై
చనుమేటిం బట్టి యిల్లై నవు రతి వగలన్
జావనై యుండెనయ్యో. 112

ఉ. రక్కసలెల్ల మూగి కొని రాపులు వెట్టగ నెట్టుతోప కీ
చక్కనిచెట్టుకొమ్మపయి చక్కనిహస్తము సాఁగ వైచి యే
దిక్కును గాన రామి కతిదీనతఁ బొక్కుచు నుండె నక్కటా
యిక్కమలాయతాక్షి యిఁక నే మని చెప్పఁగ నుండు దైవమున్.

తే. వనచరుఁడ నైన నాకె యీవారిజాక్షి
చెంద్రకిన్ నేత్రయుగ్మము చెమ్మగిల్లు
రాముఁ డీతన్విఁ బెడఁ బాసి యీమహి నెటు
బ్రిదికియుండెనో చెప్పఁ దరంబు గాదు. 114

ఉ. ఈమెను జూడఁ జూడ నిలువెల్లను నీళ్లులు గారు నట్టులై
నామెయి సంచలించెడి మనం బది వ్రక్కలు గాఁగ నయ్యెడిన్

మోమున నాట్యమాడెడిని బొర్లుచు వచ్చినదుఃఖఘోర మే
నేమయి నిల్చి యుండెడ నొ కింతయుఁ దోపక యున్న దయ్యయో.

—♦ రావణుఁడు సీతాదేవి కడకు వచ్చుట ♦—

వ. అని దుఃఖాక్రాంతచిత్తుండై తత్తరంపడుచున్నసమయంబున నట రావణుండు రామభక్తుం డగువానరుండు వచ్చి లంకాపురంబు నలుమూలలుం గ్రుమ్మఱి యుప్పు డశోకవనంబున కేగి యున్న వాఁ డని చారులవలన విని వాఁ డంజనానందనుండు సీతాన్వేష ణార్థంబు వచ్చె నని రామాయణకథాంశం బెల్ల నెఱింగి యున్న వాఁడుగావున నటఁ జని వాఁడు వినంగ రామున కుత్తేజంబు గలుగు నట్లు సంభాషించి రాము నింతలోనం వచ్చునట్లు చేసెదం గాక యని నిశ్చయించుకొని కరదీపికాసహస్రంబు వెంట నంటి నడువఁ గతిపయపరివారపరివృతుండై యశోకవనంబున కతివైభవంబునం బర తెంచుచుండె నట్టియెడ హనుమంతుండు రావణుండు వచ్చు చుంట నెఱింగి వానిచర్య లెట్లుండునో చూతుం గాత మని పర్ణాం తఃప్రలీనుండై యుండె నక్కంచరుండును సీతం దరియ వచ్చి తిర్యన భర్జనంబు లాచరించుచు ని ట్లనియె. 116

శా. సీతా! చెప్పితి నాకు గండు కడుపువాసిం గన్నవాఁ డింకలో
నా లెన్నల్ల యెఱింగి వచ్చి యని నీ కల్కంతలై పోవగా
శాతాసిఁ విశసించు నంచు బహుమాసంబుల్ చనె నేఁడు కా
శీతాత్మ్యం డరుదేడు నేఁడు నను బ్రత్యూన్ డీకొనం జాలెడిన్. 117

శా. కైలాసం బర కేలనెత్తితిని నాకవ్రాతముల్ మొత్తితిన్
గీలిం గట్టితి గాలిఁ బట్టితి యముల్ గింపాకుడిం జేసితిన్
భూలోకంబునఁ గాక నాల్గుపదియై పొల్పొందులోకంబులన్
నాలా వన్నను బిచ్చలింతురు జనుల్ నానాప్రకారంబులన్. 118

మత్త. నాగకన్యలు మర్త్యకన్యలు నాకకన్యలు నాకుఁ గా
నాగడి న్నివసించి యుందురు నాకృపం బరికించుచున్

భోగలాలస తోచు నేఁ బరిపూర్ణుఁడన్ సకలంబునన్
నాగజాశ్వరథాదు లెన్న ననంతముల్ జనకాత్మజా. 119

తే. చాన! యింద్రాదులెల్ల నాశౌర్యమునకు
నోడి దాసానుదాసులై యున్నవారు
సర్వలోకములం గల సర్వధనము
నాగృహంబున నుండె నోనాతిమిన్న. 120

చ. చిటికిట నేసి కొండలను బిండిగఁ జేయఁగ నోపియుంటి నా
కడ నెటువంటిధీరుఁడు నోకానొకయింతన కొంక నిల్వ నే
రఁడు మనుజప్రభూతుఁ డగురాముఁ డన న్నిముసంబులోనివాఁ
డడరిన పాత్రి భస్మ మయి యూరయ వచ్చెడు నమ్ము నానుడుల్.

శా. ఏడీ రాముఁడు? నాఁడె వచ్చు నని నీ వెంచంగ నా నున్నచో
రాఁడే రావణు సంహరించుటకు గోత్రాచక్రమం దాలిఁగాం
చూడం బోసినవానికన్నఁ బగవాఁ డొండొక్కరుం డుండునే
చూడం బోవకు మింక నీమగనికై శోకంబు పాకంబుగన్. 122

వ. అని పలుకుచున్నంతం గాంతామణి తనయురోజంబుల కూరువు
లడ్డువడ గొంకుచుండి తృణం బొండు త్రెంచి నడుమం
బడవైచి వాని కిట్లనియె. 123

—♦ సీ త రా వ ణు నో నా డు ట ♦—

చ. తెలిచినయింటిలోపలికిఁ జేలికగా శునకంబు వచ్చిన
ట్లెఱుఁగక రామలక్ష్మణు లెటేఁ జనినప్పుడు వచ్చి దొంగ వై
గటితను నన్నుఁ బట్టుకొనఁ గల్గితి వందొకఁ డప్పు డుండినన్
పటపటఁ గోసి ముక్కలుగఁ బాఱగ వేయఁడె నిన్ను రావణా.

క. చోరుఁడవై యిటు తెచ్చియు
శూరత్వము వెల్లడింపఁ జూతువు కట్టా
రా రమ్మందువు కాలము
తీఱెను గాఁ బోలు నీకు దేవద్వేషీ. 125

ఉ. రాముఁడు లక్ష్మణుం డిటకు రాఁ గలవారలు నిన్నుఁ ద్రుంచి లం
గ్రామమునందు రక్కసుల కంఠలు కంఠలు నాఁగఁ జేసి నా
ప్రేమయు మాట లాడుటకు నెంచవు కించవు నన్ను బొంకకన్
రాముని వీడి నిన్ గవయ రా నని యెంచకు రాక్షసాధిపా. 126

తే. వేగిరింపకు మింతలో వీరసింహు
లైన శ్రీరామలక్ష్మణు లరుగుదెంత్రు
నీతలలు నూఱు వ్రయ్యలై నేలఁ బడఁగఁ
జేయుదురు నీదుకోరిక చెల్లుఁ బొమ్ము. 127

వ. అనిన రావణుండు కోపాటోపం బధికంబయిన జానకి కిట్లనియె.

క. మాసద్వయంబు గడువు వేఁ
జేసితి నీలోన నీదుచిత్తము సరిగా
చేసికొను మట్లు గామిన్
గోసి నిను దిందు రసురకోమలు లతివా. 129

వ. అని ప్రఘునాదిదనుజాంగనల కా సీతాదేవి నప్పగంబు చేసి ధాన్య
మాలినీ సహితుండై నిజగృహంబునకుం జనియె నంత నారక్కసి
కాంత లాసీతం జుట్టుముట్టి. 130

—♦ రాక్షసాంగనలు సీతన్ భర్త్సించుట ♦—

శా. పౌలస్త్యుం డగురావణాసురుఁడు కోపప్రస్ఫురన్నేత్రుఁడై
పోలం జూచిన సర్వలోకములు వోవ్రుం ద్రెళ్ళి యుండ్రా నృపా
నాలక్షింపఁగ లేరు వానియరుణాస్యం బెగ్గరుం దాసులై
యీలంకాపురిఁ గొల్చుచుం డ్రితని నెంతే భక్తి భావించుమా.

క. నవనిధు లాతని యింటన్
నవనవముగ నిండియుండె నారీమణి! దే
వవరులు రావణుగోటికి
లవమాత్రము పోల రనుచు లక్షింప నగున్. 132

చర. ఘనుని రావణుఁ జెట్టఁ బట్టినఁ గల్పవృక్షమునీడలన్
దినదినంబును సంచరించెదు దేవదేవుని దేవియే
ననుభవింపఁగ రానిసౌఖ్య మహర్నిశంబును బొందనై
వనజనేత్రి! సుఖించు నెంతయు వాసిమై వసుధాస్థలిన్. 133

క. నీవాతని కానైతివ
దేవాంగన లెల్ల నిన్ను దేవేరి యటం
చేవేళఁ గొలుచుచుందురు
నీ వన్నను వడకు జగము నీరజనయనా. 134

క. అన నొఁ గాదన కెంతయు
గినుకం గనుగొనుచు నొండు కెలనం జనునా
వనితామణి మెడ రక్షో
వనితలు క్రోధంబు పూనవలసినవారై. 135

సీ. నీతలఁ బగిలించి నే నెత్తురొ్తో మెద
డెల్ల నొక్కర్తుకనే భుజింతు
గుండెకాయలు దీసి గోర్కె దీరగఁ దిని
వేడినల్లం దాగ్రి వేడ్కపడుదు
పెకలించినీనాల్క పెటపెట మని వేచి
కార మద్ది భుజింతు కరవుదీఱ
మాంస మంతయు దీసి మద్యంబుతో వండి
పంచదారం గూర్చి కొంచుఁ దిందు
తే. నీదువస నాడి ప్రేవులు నే ధరించి
పూసికొని నెత్రి మేనెల్లఁ బొలసు దీసి
మెసవుదు నటంచు వేర్వేఱ మెలత లెల్ల
గారు లఱచుచు సీతపైఁ గవిసి రపుడు. 136

—• త్రిజట రక్కసలకుఁ దనస్వప్నవృత్తాంతము చెప్పుట •—

తే. త్రిజట యనియొకకాంత నిద్రించుచుండి
యంతలో నుహ్వా యని లేచి కొంతలోన

సీత భర్జించుచుండినచెలులఁ జూచి
వదివదిం బోయి వారించి పలికె నిట్లు. 137

చ. వలదిటు లీమహాసతిని వారిజలోచన సీతఁ జంపఁగాఁ
దలఁపకు డెట్టిదానికిని దానికి మాఱుగ నన్నుఁ జంపఁగా
దలఁపుఁడు నాకలం వినుఁడు దాన భవన్మనముల్ తలంకనై
విలవిలపోవ వచ్చెడిని విన్నదనం బగడెంచెడిన్ గదా 138

సీ. జానకీసతికి విజయము దానవపతి
కవిజయ మాకల యలరఁ జేయు
వేయిరాయంచలు మోయుదంతపువిమా
న మెక్కి శ్వేతవస్త్రమ్ము దాల్చి
యనుజన్మతో రాముఁ డరుదెంచి నట్లును
జానకి శ్వేతవస్త్రము ధరించి
మొగిఁగొండపై నెక్కి మొగులదొరం జేరు
నట్లు రామునిఁ జేరినట్లు కంటి

తే. అవల రాముఁడు భద్రగజాధిరూఢుఁ
డగుచుఁ దెల్లనిపూదండ లరుతఁ దాల్చి
సీతతో లక్ష్మణునితోడ క్షితిధరంబు
నెక్కి నట్లును కల గంటి నింతులార. 139

సీ. వినుఁ డంతరావణుం డును నూనెలో నాని
గన్నేరుపూదండ కంఠమందుఁ
బూని యెఱ్ఱనిబట్ట మొలజుట్టునుం జుట్టి
కలుద్రావి మత్తిల్లి తొన్మతలమునఁ
బొరలున ట్లింతలో బోఁడియై పల్లని
వస్త్రంబు ధరియించి వనితచేత
నీడ్వంగఁ బడికిందఁ నేడ్చుచుం బడినట్లు
ఖరవాహనం బెక్కి కాలుదిక్కు

తే. మో మగుచుఁ బోవుచు న్నెలబోర్లఁ బడిన
యట్లు లారీతిఁ కుంభకర్ణాదు లెల్ల

నూనెలో నానుచున్నట్లు నూనె దాగ్రి
నట్లు నేఁ గలగంటి నోయతివలార. 140

ఉ. తెల్లనిపట్టుపుట్టమును దెల్లనిపూవులదండలుగ్ గదం
దెల్లనిగంధము న్మఱియుఁ దెల్లనిఛత్రముఁ దాల్చి శంఖముగ్
దెల్లము గాఁగ మ్రోగికొనఁ దెల్లనియేనుఁగు నెక్కి మల్లెపూల్
చల్లుచు రాఁ జలున్ తిరుగ సాఁగె విభీషణుఁ డంబరంబునగ్ 141

సీ. ప్రాకారములతోడఁ బ్రాసాదములతోడ
గోపురంబులతోడ గుడులతోడ
రథగజాశ్వములతో రాజ్ఞవతోడ లం
కాపురం బంతయుఁ గడలిలోనఁ
గలసిపోయిన యట్లు కలగంటి నంతలో
వానరుం డొక్కఁడు వచ్చి చిచ్చు
పెట్టి నల్మూలలు విడువక రగిలించి
పుచ్చినట్లును స్త్రీలు పురుషు లెల్లఁ

తే. తైలముం ద్రావి మత్తెక్కి తాండవంబు
సలుపుచుం గేక లిడుచును సంయమనికి
నరుగుకుంభకర్ణాదుల ననుసరించి
పోవుచున్నట్లు కలగంటిఁ బాలతులార. 142

చ. విడువుఁడు సీతదూరముగ వెళ్లుఁడు వేడుఁడు వేఁడికొన్నచో
నడ లొకయింత లేనియటు లాయమ మిమ్ముఁ గటాక్షదృష్టిమై
విడువదు ప్రోవఁజూచెడిని వీరవరేణ్యుఁడు రామచంద్రుఁ డి
ప్పుడె చనుదెంచు నొంచు మనపూర్వరవాసుల రావణాదులగ్.

క. ఎల్లనిమిత్తంబులు నీ
పల్లవజిచ్చరణ సీతబాధ లి వెల్లగ్
దెల్లెడు కాలము వచ్చుట
తెల్లము గాఁ జెప్పుచుండెఁ దెలియుఁడు మీరల్ 144

వ. అనంతరంబ. 145

—♦ సీతాదేవి తనగతికిఁ జింతించుట ♦—

చ. అటు లసురాంగనల్ తనకు హానిఘటిల్లఁగఁ జేయుచుండఁగా
నెటులును దోఁపనట్టి దయి యిందుముఖీమణి సీత డెందమం
దటమట నొంది కుందుచును హా! యని తాపము వెల్లడించుచున్
బటుతరవేదనాభరము పాయక యుండుటఁజేసి జేలయై. 146

చ. ఖలుఁ డగురావణాసురుఁడు కావలుఁడై చనుదెంచి యెన్నియో
తులువతనంబునం బలికె దొప్పలు దొరలు గాఁగ రెంపుచం
దులు గడు వుంచి రక్కసులతో వచియించి గమించె వీఁడు నన్
బిలుకురఁ జేయుచుండి రెటు వేగుదునేమి యొనర్తు నక్కటా.

ఉ. మిన్నులు వడ్డచోటఁ బడి మిత్తికి గుత్తగ నైతి నిందు నా
బన్నము నాలకింపఁ గలవాఁ డొకరుండును లేఁడు నావిభుఁ
గన్నులఁ జూచుభాగ్య మిఁకఁ గల్గదు గావున నిట్టు లుండి దుః
ఖోన్నతి నొందుకంటె మృతి నొందుటయే తగు నంచు నెంచెదన్.

తే. ఆత్మహత్యాతిపాతక మైన నైతుఁ
గాని శ్రీరామవిరహదుఃఖంబు సైపఁ
జాలఁ గావునఁ జచ్చెదఁ జచ్చుటకును
సాధనం బెద్దియుం దోప దీధరిత్రి. 149

వ. అని మరణోద్యోగమునం గృతనిశ్చయురాలై నిజజటాజూటంబు విప్పి కుత్తుకం జుట్ట బెట్టుకొని కొమ్మకుం గట్టి యురి వేసికొన నెంచుచుండె నంతలో ద్విజటావాక్యంబునం జేసి రాక్షసాంగనలు పరాఙ్ముఖములు పెట్టి చెట్టొకండై పండి నిద్రించి రంత సీతాదేవియు. 150

మ. ఉరి నూఁగాడఁగఁ బోవుచున్నతటి నాయుశ్శేసుతాస్వాంతమం
దరుడై రామకథాప్రసంగము శుభాఖ్యానంబు గాఁ దోప ద
ద్వరమార్గంబున సంచరించు నదియై వ్యాపారమయ్యెంతలో
మరవం జాలె రఘూద్వహప్రథితజన్మం బాదిగా నెంచుచున్.

వ. అట్టియవసరంబున. 152

—♦ ఆంజనేయుఁడు వృక్షంబుపైనుండి కర్తవ్య మాలోచించుట ♦—

ఉ. ఆకుమఱుంగు పిందె యగునంజనసంభవుఁ డెట్లు నేను సీ
తాకమలాయతాక్షికడ దర్శన మిచ్చెద నేమి చెప్పెదన్
నాకృతికాకృతిం గనిన నమ్మునొ నమ్మదొ రాక్షసుండె సు
మ్మీకరణిన్ బ్రతారణము నిట్లు పొనర్చెడు నంచు నెంచునో.

క. ఈయమకడకుం బోరునఁ
బోయిన ననుఁ గాంచి దనుజపుంగవునిమహా
మాయ యని యెంచుఁ గార్యం
జేయనువున సూటిపడునొ యే నెఱుఁగ నయో. 154

కం. సీతేఁ గని మాట లాడక
పోతినయే నేమి చెప్పె పోలఁతుక. యనుచున్
సీతావల్లభుఁ డడిగిన
నాతఱి నే మంచుఁ బలుకునట్టిఁడ నగుదున్. 155

వ. అని తలంచుచు నెట్లునుం జేయఁ దోపమి నాఁమె కించుక కాని
పించునట్లు సమీపశాఖాగ్రంబునఁ గూరుచుండి యోంకారంబు
గావించి రామమంత్రంబు పఠించి. 156

—♦ ఆంజనేయులు రాముకథ నభివర్ణించుట ♦—

సీ. ధరఁ గోసలంబులఁ దనరు నయోధ్యాపు
రమ్మందు దశరథరాజవరుఁడు
కౌసల్యయు సుమిత్ర కైకేయి యనుమువ్వు
రను బెండ్లియాడి పుత్రకులు లేమి
ఘనుఁ డగుఋష్యశృంగునిఁ బిల్చి పుత్రకా
మేష్టి గావించి యజ్ఞేశుకరుణఁ
గనియెఁ బుత్రుల నల్వురను రామభరతుల
లక్ష్మణశత్రుఘ్నులను ముదమున

తే. అందు రాముఁడు కౌశికునధ్వరంబు
మనిచి గౌతమపత్నినిఁ గనికరించి

మిథిల కరుదెంచి సీతకై ప్రథితమైన
శివునిచాపము ఖండించి సీతఁ గొంచు. 157

శా. సాకేతంబున కేగుదెంచి సతితో తమ్మిపాలునాజ్ఞం దలఁ
గైకొంచున్ వనవాసమున్ సలుపగా తమ్మిపుత్రికన్ లక్ష్మణున్ దాఁ
దోకొంచున్ జనుదెంచి దండకమునుల్ తోషంబు నొందన్ ఖలా
నీకంబుం దునుమాడి పంచవటికిన్ విచ్చేసె నిచ్ఛాగతిన్. 158

తే. శూర్పణఖముక్కు గోయించి శూరు లైన
ఖరుఁడు దూషణుఁడాది రాక్షసులఁ దునిమి
విగతకంటక మొనరించి విపుల మెల్ల
జానకీజాని దీపించె జనపదమున. 159

సీ. ఆలోనరావణాఖ్యాతుఁడు మారీచు
మాయలేడిం జేసి మరులు కొలిపి
రామలక్ష్మణు లెడ యై మసలినయప్డు
ఋషి యయి రావణుఁ డేగుదెంచి
సీతాపహరణంబు చేసె జటాయువు
వానితో నెదిరించి పరముగాంచె
రామలక్ష్మణు లప్డు రమణినారయు చొగి
ఋష్యమూకమునకు నేగుదెంచి

తే. రచట సుగ్రీవుఁ డన్వానరాధినాథుఁ
డనుఁగులై ప్రగ్గడలు నలువురంటి కొలువ
నంటి చనుదెంచు రాజవర్యులను గాంచి
నాంజనేయుని నను బుచ్చె నరసి తేర. 160

శా. ఏ నా వచ్చెదురామలక్ష్మణుల నెంతే భక్తి భావించుచున్
గానం బోయిన రామచంద్రుఁడు ననుం గన్గొంచు నోవానరా!
నీనామం బెది సంప్రదాయ మెది వర్ణింపంగ నె ట్లయ్యెడిన్
సానందంబుగఁ జెప్పు మన్న నిటు లే నంటిం బదం బంటుచున్. 161

సీ. వాయుప్రసాదమువలన నంజన కేను
బుట్టితి శివ తేజమునను జేసి
పుట్టినప్పుడ నినుఁ బట్టి మ్రింగఁగఁ బోవ
హరి వజ్రహతిఁ జేసి హనువువిరిచె
నందున హనుమంతుఁ డన నైతి సుగ్రీవుఁ
డనువాసర శ్రేష్ఠు నాశ్రయించి
యుంటి నాతఁడు మిమ్ము వెంటఁ దె మ్మని పుచ్చె
నీకు నెచ్చెలి యగు నెమ్మిఁ జేసి
తే. అనుచు వచియించి నే వారి నంసతలము
నందు నెక్కించుకొని పోయి హంససుతుని
తోడ సఖ్యము గావించి నాఁడఁ దొల్లి
రాముఁ డా తని నెంతయుఁ బ్రేముడించె. 162

వ. అని వర్ణించి మాతల్లి సీతామహాదేవి. 163

శా. ఆకాశంబున నుండి రావణుఁడు ని న్నంసంబునం గొంచుఁ బో
గోక నీవు విభూషణంబు లవి పెక్కు లట్టివ్రేయంగ నేఁ
జేకొంచున్ గుహ దాచి రామునకు నీక్షింపంగ నీ రాముఁడున్
శోకం బెంతయుం వెల్లువాఱఁ గనియెన్ శుద్ధాంతకాంతామణీ.

శా. సీతానామము చెంత వేదవతి యన్ చిహ్నంబు చిత్రం బటన్
జేతో మోద మొసంగు నుంగరమునన్ శ్రీరామచంద్రుం డడఁటఁ
జేతం గైకొని కంట నీ ర్విడుచుచున్ జే వెట్టు తమ్ముండు సం
ప్రీతిం బాసినమోమునం గనుచు నార్తిం దాల్చె శీర్షంబునన్

తే. వంగి రాముఁడు నీమోమువంకఁ గనుచు
కడక మంగళసూత్రము గట్టునట్లు
చిత్రమున నొప్పుపదకము చేతఁ బట్టి
రాముఁ డెంతయు చింతిల్లె రాజవదన. 166

క. చిటికెవ వ్రేలను శివధను
నటు పెట్టెడునీదువిగ్రహము గలయుంగ్రం

బట్టఁ జూచె రామచంద్రుఁడు
కటకట పడె నేమిచెప్పఁగల నో తల్లి. 167

తే. అవల సుగ్రీవునకు నన్న యైనవాలిఁ
జంపి వానరరాజ్యమొసంగె నతఁడు
దిక్కులకుఁ బుచ్చె వానరాధిపుల నెల్ల
నిన్ను వెదకెడు పనికయి సన్నుతమతి. 168

—♦ ఆంజనేయులు సీతకుఁ దన యాథార్థ్య మెఱింగించుట ♦—

ఉ. అం దొకరుండ నే హనుమ యన్న శికారము గల్గు నట్టిఁడన్.
గొందఱతోడఁ గూడుకొని కొండ లరణ్యము లెల్ల రోయుచున్
ముందు మహార్ణవంబు గని మోహముతోఁ గపు లెల్లఁ గుందుచో
నందఱ నందుఁ జెట్టి లవణాంబుధి నిట్టుల దాఁటి వచ్చితిన్. 169

శా. ఇల్లిల్లున్ దివనాడి చూచితిని దల్లీ యొందు నీజాడ నా
నల్లోకింపక రాత్రివై మదికి నెంతో గొల్పె సంతాప మో
చెల్లా! చావఁగ నెంచునట్టితఱి నీశ్రీగంధముం దెచ్చి నా
యుల్లంబుం బొదరించె గంధవహుఁ డోహో నాఁగ లోకేశ్వరీ.

తే. అంగరాగపరిభావ మే నాలకించి
యున్నవాఁడను గాపునఁ గన్నువెట్టి
వాసనంబట్టి వచ్చితి వనము దీనిఁ
గనెడుపొందెను లోకైకవినుతచరిత. 171

సీ. ఈచెట్టుపైనుండి యీక్షించితిని నిన్ను
స్వాంతంబుతోఁ గన్ను చల్లఁబడియెఁ
గాని నిగతికి దుఃఖం బయ్యె నంతలో
రావణురాకయు రక్కసులయు
రాపులుం గంటి వారలఁ జంప నెంచితి
నట్లు కా దని శాంతి నందితి నిది
సమయమంచు నీపదు సందర్శనము సేయ
వేచి యుంటిన్ దల్లి! నీచుఁడై

తే. రావణునిచెయ్యిలో యని భావమందు
సందియంపడఁ బోకు మోసాధ్వి నేను
రామునూతను సుగ్రీవుప్రాణసఖుఁడ
ననిలపుత్రుఁడ హనుమంతుఁ డనెడువాఁడ. 172

క. మాయావి గాను దల్లీ!
నాయాకృతిఁ జూచి మనమునన్ సంశయముమున్
జేయకుము కరుణఁ జూపుము
నాయెడ నే రామునూత నమ్ముము నెమ్మిన్. 173

వ. అని పలుకుచున్నపలుకు లెల్ల నుల్లంబున శ్రీరామచంద్రజననాది కంబు జింతించుచున్ మరణోద్యమమ్ము మరచి యున్నజానకి విని తనమనంబున. 174

శా. ఏ రామాయణ మాదినుండి మదిలో నీక్షించుచుండంగ దా
నారీతిన్ వచియింపఁ జొచ్చె నొకరుం డాతం డెవండో యిటన్
శ్రీరామున్ స్మరియింప నుండఁ డెవఁడున్ జెప్పంగ స్వప్నంబొ నా
ప్రారంభాక్షరశబ్దమో తెలియ రా దంచున్ భయంబందుచున్.

వ. కన్ను విచ్చి సన్నిధానంబున నున్నకోఁతిపిల్లం గాంచి కాంచినంతఁ గన్ను మొగిచి. 176

—♦ సీత కోఁతిపిల్లంగాంచి సందేహించుట ♦—

మ. కలలోఁ గోఁతినిఁ జూడ దోష మనుచున్ గన్పట్టు శాస్త్రంబులన్
గలదోషం బది రామలక్ష్మణులకున్ గాకుండు నాతండ్రికిన్
గలకు న్నిద్దుర యున్నఁ గాని తెలియం గా రాదు నాచెంగటన్
నిలువం జాలదు నిద్ర యిద్ది కల నా నే నెంచఁ బోని త్తఱిన్.

క. అని కన్ను దెఱచి మఱియును
గని రాముం దలఁచుచుండుకపివర్యునితో
ననుమానపడుచు రావణుఁ
డని మాయారూప మనుచు నాత్రముతోడన్. 178

వ. ఇట్లుకొమ్మ విడిచి వృక్షమూలంబునం గూరుచుండె నంతలో నాంజనేయుండును జెట్టు దిగి చేతులు గట్టుకొని సీతాపరిసరంబున కల్లన నడుగుపెట్టుటయు గడగడవడంకుచుఁ బుడమిపట్టి యి ట్లనియె. 179

ఉ. చచ్చినదానిఁ జంపుటకు స్వాంతము సేయుట కిట్లు డాయఁగా
వచ్చుచునుండి నీకు నిది పాడియనం బడ దోరి! రావణా
సచ్చరితాన్వవాయమున సంభవ మందితి విట్లు ప్రీతి పో
వచ్చునె పాపకూపములపా లయి పోయిన హెచ్చు వచ్చునే. 180

ఉ. అక్కట! మీద రాఁగలయనర్థ మెఱుంగవు రోరి నీయొడల్
ముక్కలు గాఁగఁ గోసిరఘుపుంగవుఁ డుగ్రరణాంగణంబునన్
నక్కలు కుక్కలుం దినఁగ నాలుగుమూలలఁ బాఱఁ జల్లెడున్
ని క్కిది యంతయు న్వెఱగి నీ అయి పోయెడు నోరి! మూర్ఖుఁడా.

క. అని తన్ను రావణాసురుఁ
డని మారెడు రామపత్ని నారయుచు మరు
త్తనయుండు మోడ్పుఁగే లిడి
తనశిరమునఁ జేర్చుకొంచుఁ దగ ని ట్లనియెన్. 182

క. అమ్మా! చెప్పితి సర్వ
మ్మమ్మాడ్కిన్ శంక సేయ నింతయు సం దిం
దెమ్మెయి నెమకినఁ గనఁబడ
దిమ్మన నామాట నమ్ము మే హరిదూతన్. 183

వ. అనిన సీత రామదూతపై నింత ప్రత్యయమ్ము గలిగినదయ్యు నెయ్యంబున నోయీ! నీవు రాము నెఱింగిన వాఁడవ యేని నాక భిజ్ఞానంబుగ వానిగుణంబు లభివర్ణింపు మనిన నంజనానందనుం డానందంబున.

— సీత రామునభిజ్ఞానం బెఱుంగఁ గోరుట —

సీ. నీలమేఘముఁ బోలు నెమ్మేను గలవాఁడు
కమలంబులం బోలుకనులవాఁడు

కరుణారసముతోడఁ గలఁగిపోసినయట్టి
హృదయంబు గలవాఁడు సదమలుండు
వేదశాస్త్రంబుల విధమెఱింగినవాఁడు
బుద్ధిబృహస్పతిం బోలువాఁడు
సౌందర్యమున మనస్సంభవునిం జెంప
గొట్టఁగఁ గలవాఁడు కోమలుండు

తే. విల్లు నమ్ములు తా నెప్డు విడువకుండు
వాఁడు పితృభక్తి గలిగినవాఁడు సతత
మేకపత్నీవ్రతంబున నెసక మెసఁగు
వాఁడు శ్రీరామచంద్రుఁ డోవారిజాక్షి. 185

ఆ. పర్ణశాల నున్నపట్టునఁ గాకాసు
రుఁడు పొనర్చినట్టి వెడఁగుపనికి
చంపి చంప కతనిఁ జయ్యనఁ గరుణించి
నట్టివాఁడు రాముఁ డరయ నరయుఁ. 186

వ. అని యభివర్ణించి మఱియును. 187

క. నీదాసుఁడ నని చెప్పిన
నేదో శంకింతు నమ్మ వింతయుఁ దల్లీ
నీదయితుఁ డిచ్చె నుంగర
మీదెస వీక్షింపు మనుచు నిచ్చెం దానిన్. 188

—♦ హనుమంతుఁడు సీత కంగుళీయక మిచ్చుట ♦—

చ. అది తనతండ్రి రామునకు హస్తపరిగ్రహవేళనీయ నై
నద ఋషినిర్మితంబు నిమి కాది లభించిన దంచు నెంచి స
మ్మదమునఁ గొంచుఁ గన్నుఁగవ మాటికి మాటికి నద్దికొంచుఁ జ
ల్లదనము మేనికిం గలుగు లాగని నొదలఁ దాల్చె దానినిన్. 189

ఉ. అంతటిలోన హస్తమునయందు ధరించి రఘూద్వహున్ కడున్
స్వాంతమునం దలంచుచును జక్కఁ గనుంగొని యింత సేపు దా

నింతనరాని దుఃఖమున నేడువ సాగె సమీరనందనుం
డెంతయు డద్దరిల్లుచు ని దే మిది యేమి యటంచు మాన్పఁగన్.

వ. కొంతలోన స్వస్థస్వాంతుండై వాయుపుత్రుండు. 191

తే. అమ్మ! యేమిది సంతోషపుసమయఁ దగిన
సమయమునయందు నీరీతి సంకటముగ
నడలఁ జొచ్చితి వినఁదగినట్టి దైనఁ
జెప్పు మనుటయు వెక్కుచుం జెప్పె సీత. 192

సీ. అంగుళీయకమందు నారయ వచ్చె నా
హృదయేశ్వరుండుఁ గపీశ్వరుండు
సౌమిత్రియును గొండచఱియపైఁ గూర్చుండ
నానూపురం బటఁ గానఁ బడుట
నామీఁది ప్రేముడి నానాథుఁ డెంతయు
నడలు గుప్పుచు నేలఁ బడియె నంత
లక్ష్మణుండును వానరముఖ్యవరుండును
సేదదేర్చిరి లేపి చెప్పనేల

తే. నావిభున కింతదుఃఖము నా కతమునఁ
గలుగనయ్యెను నే నెంతకఠినచిత్త
నో యెఱుఁగ నట్టులుండిన నాయధీశు
సేదదేర్పఁగ లే నైతిఁ జెంతఁ జేరి. 193

మ. అనినన్ వాయుసుతుండు బెంగటిలఁ బోకమ్మా! భవన్నాథుఁ డే
జని వార్తన్ వినిపించినంతన మహాసైన్యంబుతో సూర్యపు
త్రుని సాయంబున వచ్చి రావణు ననిం దుంచున్ భవద్దుఃఖ మం
తన చల్లారెడుఁ జింత దక్కు మనుచున్ దన్వంగి తా నిట్లనున్. 194

క. ఎపుడో వచ్చెడు నెపుడో
రిపులం దునుమాడు నెపుడొ ప్రేమం గను న
న్నెపు డెపుడో దినం బొక యుగ
మిపు డయ్యెడుఁ దండ్రి యిట్టియే నెటు మనుదున్. 195

క. నా విని యది య ట్లైనన్
నా వీపునఁ గొంచుఁ బోయి నరనాథునకున్
బావకుఁడు హవ్యముం గొని
దేవళ్లకు నిచ్చునట్లు తెగి నే నిత్తున్. 196

ఉ. నావిని నవ్వి సీత కరుణన్ బవమానతనూజుఁ గాంచి యో
పావనమూర్తి నీవు కొలువం జిఱుజేనెడు లేవు పెద్ద న
న్నేవిధి మోచికొం చవలి కేగుదు వింతయు భక్తి పెంపునన్
గావలె నంచు నెంచెదను గాక కుమార! శుభంబు నీ కగున్. 197

—♦ ఆంజనేయుఁడు సీతకుఁ దనరూపంబుసూపుట ♦—

తే. అనుడు కా దట్లు నారూప మరయు మనుచుఁ
గొంతపొడువునఁ బెఱిగిన క్రోఁతి నేతఁ
గాంచి నివ్వెరపడి సీత గాలికొడుక!
యెంత కైనను దగుదు నీ వెఱిఁగి కొంటి. 198

మ. ఇటు కాకుండిన నూఱుయోజనములై యేర్పడ్డనీర్వాశినీ
వెటు దాటం గల వెట్లు రావణపురిన్ హేరాళ ధైర్యస్థితిన్
బటు తేజంబున సంచరింపఁ గల వేవంరీతి వాఁడైన ని
న్నిట దేవుం డని విశ్వసించితిని దండ్రి! గంధవాహాత్మజా. 139

ఉ. చెప్పెద నాలకింపు మొకచిన్నమాటన్ నినుఁ గూడి పోవుటల్
దప్పనఁ గాని రావణుఁడు దా నతిపాపపథానువర్తి నే
నిప్పుడు పోతినేని హృదయేశుఁడు రా డిట రాక్షసాధముం
డెప్పటియట్లు లోకముల నేచక మానఁడు చావకుండుటన్. 200

తే. ఎట్లొ జీవించి యుందు నే నిన్నినాళ్లు
రామలక్ష్మణులను వానరప్రవీర
సహితముగఁ దోడి తెచ్చి రాక్షసుల నెల్ల
చంపి ననుఁ దోడ్కొనిపోక చనును జూవె. 201

చ. మగనికిఁ బాపి నన్నుఁగడుమచ్చర మెచ్చెగఁ దెచ్చి యిగ్గతిన్
దగులము గోరి వేపు టాక తట్టునఁ బెట్టుచు న్వాకుఁ గా ననిన్

దెగిమె జటాయువయ్యని మరిఁ దహియించెనీ నగ్నిహోలెన
ప్పగ మొదలంటఁ దీఱ సురవైరి వధం బది చూడ నెంచితిన్. 202

క. కావున రాముని లక్ష్మణు
తో వచ్చి మహోత్సవంబుతో రావణునిన్
జావంగ నేసి నన్నున్
బోవలయుం దోడుకొనుచుఁ బురి కని చెపుమా. 203

తర. మఱఁది లక్ష్మణమూర్తి నెన్నియొ మాటలాడితి నాఁడు త
ద్దురిత మే యిటు వెంట నంటెను దోరమై వెత లొందితిన్
మఱచి పో మ్మను మెల్ల తప్పులు మామకంబులు తమ్ముఁడా
తరలి రమ్మను మన్నతో నిట దానవుం బరిమార్పఁగన్. 204

వ. అనిన నాంజనేయుండు. 205

శా. తల్లీ! నీమనికార మెంతయును వేడం బట్టు వెల్గొందెడున్
ముల్లోకంబుల నేలఁ జాలినమహోత్కృం డర్యమోవంశసం
ఫుల్లాబ్జేక్షణుఁ డెల్లవానరచమూముఖ్యాళితో వచ్చి పా
పోల్లాసావృతు రావణాసురు మహోయుష్కంబునం దున్మెడిన్. 206

ఉ. నీవెత లెల్లఁ దీఱెనని నే నటఁ బోయి వచింతు సర్వమా
దేవున కిందు నీ వెపుడు దేనికి నేనియు వేఁడించుచున్
జావఁగఁ బోకు మావెనుక సల్పెడి దేమియు లేదు తల్లిరో!
పోవుదు నానవా లిడుము పుచ్చుము మెచ్చ నతండు నాతఁడున్.

—♦ సీత హనుమంతునకు నానవా లిచ్చుట ♦—

చ. అనవుడు నంతరీయమునయం దతిభద్రము గాఁగ దాఁచి యుం
చినవరశీర్షభూషణము చెచ్చెరఁ దీసి కపీంద్రుఁ డోయిటన్
గొను మని వైచి తండ్రి! యిదిగో రతనంబు గ్రహింపు మిద్ది ముం
జనకున కిందు్రఁ డిచ్చె ననితంబు యజింపు మటంచుఁ జెప్పుచున్.

సీ. ఇద్ది చింతామణి కెనవచ్చు నానాఁడు
జలధిఁ ద్రచ్చెడువేళ సంభవించె

నది మొదలింద్రుఁ డీయది దాఁచి మాతండ్రి
కిచ్చె నాతనిపేర్మి కిచ్చు మెచ్చి
చలివెల్గు వలె వెల్గు సౌఖ్యంబు గలిగించు
రతన మియ్యది మరుత్సుతుఁడ వినుము
నాపెండ్లివేళ నానాథుఁ డరయుచుండ
నాతల్లి బంధించె నాశిరమున
తే. నాఁటినుండియు దీని నేనాఁడు విడక
తల ధరించుచునుంటి నెంతలు ఘటిల్లి
నను విడువ దీనిఁ గైకొని చనుము రాముఁ
డెఱుఁగు దీనిప్రభావ మహీనతేజ. 209

వ. అని మఱియు నెన్నో యడియాలంబులఁ దెలుపువృత్తాంతములు చెప్పి నీప్రయాణశ్రమంబు తలంప నాచిత్తంబు తత్తఱించుచున్నది నీ వున్నయీకొన్నిఘటికలు శ్రీరామవార్తాశ్రవణంబునం జేసి సుఖప్రదంబులగుచున్నవి వినుము. 210

తే. అంధతమసంబునం బడి యరుగుపాంథు
నకు వెలుఁగు దోఁపగా దారి నడుమ మెఱుఁగు
తొంటిచూపును బాపినతోయమునను
బోలి యుండెడు నీవచ్చి పోవు టిపుడు. 211

క. అలసితి మార్గాయాసము
గలుగుట నోతండ్రి నేఁడు గాక ప్రయాణం
బలనాఁడు చేయు మందును
దెలియం బడ కింద యుండి దేవాంశభవా. 212

ఉ. నావుడు మోడ్చి కేల్పవననందనుఁ డిట్లను రామపత్నికిన్.
బోవలె నాలసించుటకుఁ బోలదు నా కిట తల్లి ! తండ్రి యి
ట్లేవిధి నుండెనో తెలియ దేఁ జని నీదగువార్త దెల్పినన్
భావము దీర శాంతిఁ గొని వచ్చు ప్రయాణముఁ జేయు నీడకున్.

వ. నాకుఁ బోనాజ్ఞ యొసంగు మని పునఃపునఃప్రణామంబు లాచరించుచుండ జానకి యంగుళీయకంబుఁ జూచి యి ట్లనియె. 214

తే. కొండగుహలోన నుండి రాముండు వెలికి
వచ్చిపోవుచు దిక్కులవంకఁ గనుచు
నుండె దక్షిణగతులు రాకుండి రనుచు
నరయుచుండెడు నని తోఁచు నాంజనేయ. 215

వ. నీ విం దాలసింపక పొమ్ము నీమార్గంబున శుభం బగుఁ గావుత మనిన నతండు దండప్రణామం బాచరించి ప్రయాణోన్ముఖుండై రామదూతుం డెట్టిండో రావణునకుం జూపి పోవుట పాడి యని తోఁచుచున్న దట్లు చేసెద నని సీతకుం జెప్పి యొప్పించి కుప్పించి యుప్పరంబున కెగసె నంత సీతాకాంతయు నింత శాంతిం గొని శింశుపావృక్షమూలం బాశ్రయించి విశ్రమించె నని చెప్పిన విని నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును. 216

—♦ ఆ శ్వా సాం త ము ♦—

మ. తనకున్ జేసినమే లొకింత యయినన్ దానిన్ సదా నెమ్మదిన్
గొని వారిం దనప్రాణ మట్లు కనుచున్ గోర్కుల్ తగం దీర్చుచున్
వినుతింపం బడుచుండు నీదరకులావిర్భూతభూమీసురుం
డనిశంబున్ సుఖసంపదల్ గలిగి ప్రఖ్యాతిం బ్రవర్తించుతన్. 217

గద్యము.

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమాంధ్రవ్యాసాభినవశ్రీనాథ వేదవిద్యావిశారద శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన శ్రీకృష్ణ రామాయణంబునందు సుందరకాండంబునఁ బ్రథమాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# శ్రీకృష్ణరామాయణము

—:o:—

## సుందరకాండము

### ద్వితీయాశ్వాసము



(శ్రీ)కరుఁడై సచరాచర
లోకంబులఁ జేయునట్టి లోకేశుఁడు సు
శ్లోకుని వేంకటరాయా
ఖ్యాకుని రక్షించుఁ గాత మనవరతంబున్.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె నట్లాంజనే
యుండు జానకీదేవి యాజ్ఞం గొని కదలి చని యొక్కచో నొక్క
వృక్షాగ్రంబున నధిష్ఠించి. 2

ఆ. నాపరాక్రమంబు చూపి రావణునితో
మాటలాడి పోవ మనసు పుట్టెఁ
జేయ నెట్టు లద్ది సిద్ధించు నో యని
యుపవనంబుఁ గూల్ప నుద్యమించె. 3

—♦ హనుమంతుఁ డుపవనంబు భగ్నము సేయుట ♦—

సీ. ఫలములు పూవు లాకులు చిలువలు పల
వలు రాల్చి కొమ్మలు దూలఁగఁ ద్రోచి
వృక్షముల్ వ్రేళ్లతోఁ బెకలించి పెదపెద్ద
శాఖలు విఱిచి హస్తములఁ బెఱిచి

కేళాకుళులఁ ద్రెంచి కేళీమహీధ్రముల్
గూలిచి మేడలు గుప్పఁగఁ జేసి
బహువిధయంత్రముల్ పద్మాకరంబులు
దుమ్ము దుమ్ముగఁ జేసె దొడ్డవనము

తే. ప్రళయకాలానిలము రేఁగి ప్రబల మగుచు
జగతి నేరీతిఁ జిందర యగుదెఱఁగునఁ
జేయు నత్తెఱంగున నాంజనేయుఁ డప్పు
డెల్ల వనభాగమును నాశరిల్లఁ జేసె. 4

క. దారియుఁ దెన్నును దెలియని
తీఱున వృక్షములు విఱిగి దెసలం గప్పన్
భూరిగిరు లెల్ల గులగుల
లై ఱా లవి నిండుకొనియె నవ్వనభూమిన్. 5

తరు. వనపాలిక లసురవనితలు హనుమ
వలనుఁ జూడఁగ లేక పఱచిరి కడల
కనువఱి వృక్షము లం దుండుపక్షు
లఱచుచు నాకాశమంతయుఁ గప్పెఁ
బనితమ్ములు విహారభవనము లెల్ల
భగ్నములై నేలపా లయ్యె మృగము
లనిశ మార్చుచు నింగినంట నా లేచి
యటు నిటుఁ బరువెత్తె పక్కా-లమందు. 6

వ. అప్పుడు కొందఱు రాక్షసాంగనలు రామపత్నికడకు వచ్చివానర రూపుం డగువాఁ డెవండు నీతో నేమి ప్రసంగించెఁ జెప్పు మనిన నప్పద్మాక్షి వారికి భద్రంబు దోఁప ని ట్లనియె. 7

క. వానరరూపము గానీ
గీనరరూపంబు గాని కేవలమాయన్
బూనం జాలుదు రసురులు
నే నెఱుఁగను మీ ర లెఱుఁగ నేరుతు రెల్లన్. 8

ఆ. అంతలోనఁ గొంద రతివలు చని ధాన్య
మాలితోడఁ గూడిమాడుచున్న
పజ్తికంఠుఁ డున్నపడకగదికిఁ బోయి
విన్నవించి రిట్లు లున్నతగతి. 9

మ. అవధా రోదనుజాధినాథ ! మనప్రోలాశించి యెవ్వాఁడో క్రోఁ
తివలెన్ వచ్చెను సీతతోడ నెడయో దీర్ఘంబుగా నాడి ది
వ్యవనంబంతయు నేలమట్ట మయి పోవంజేయుచున్నాఁడు మే
మెదియుం జేయఁగ లేక వచ్చితిమి వాకీయం జగన్నేతకున్. 10

ఆ. వన మదెల్లఁ బాడుపడడు గావించియు
సీత వాసమున్న చెట్టుమాత్ర
చెక్కుచెదరకుండ నొక్కఁడు కాపాడె
ననుచుఁ జెప్పుచుంటి మసురనాథ. 11

క. అన నేయి వేల్వ మండెడు
ఘనవైశ్వానరుఁడు నాఁగఁ గనలుచు రక్షో
జనవిభుఁ డెనుఁబదివేవురఁ
బ్రిణుతమహాశూరవరులఁ బంచె నెదుర్పన్. 12

హనుమంతుఁ డెనుఁబదివేలకింకరులం గూల్చుట

వ. కింకరు లగు వా రవారితవిక్రమక్రమంబునఁ గూట ముద్గర ముసల భిందివాల కరవాలాద్యాయుధంబులు ధరించి మించినవేడ్క నశోకవనద్వార దేశంబునకుం జని ధైర్యస్థైర్యంబు లినుమడింపనున్న మరున్నందనుం గని నానావిధాయుధంబులఁ దెట్టలు గట్టం గొట్టుటయు నట్టహాసంబు గావించి మేను వెంచి హనుమంతుండు.

ఉ. వాలము త్రిప్పి భూతలము బ్రద్దలువాఱఁగఁ గొట్టి భూధ్రముల్
వ్రీలగ నొక్క కేక వడి వేయుచు నే నొకరామదూత సీ
తాలలనామణిం గనఁగ దర్పము సూపఁగ వచ్చినాఁడ నం
చాలము సేయువారిపయి నట్టెపడెన్ బిడుగట్లు బెట్టుగన్. 14

ఆ. కసిమసంగి వారి కాళ్లులఁ జేతులఁ
జమిరివైచి చంపి క్షణములోన
ద్వారదేశమునకు ధైర్యముం జూపుచు
వచ్చి చిచ్చువోలెఁ బ్రజ్వరిల్లె. 15

వ. హతశేషు లగు వారు రావణునిపాలికిం జని యెనుఁబదివేలమంది వీరభటు లొక్కవానరునితోడం బోరి పారం బందుట యెఱింగించిన నతండు మండిపడి ప్రహస్తపుత్త్రుం డగుజంబుమాలిం బిలిచి నీవు పోయి మనప్రమదావనం బున్మూలించిన క్రోఁతిం బట్టితె మ్మనిన సమ్మతించి యతండు. 16

—♦ హనుమ జంబుమాలిం గూలసేయుట ♦—

శా. విల్లమ్ముల్ గొని వేనవే ల్భటులతో విక్రాంతిఁ జూపంగ న
త్యుల్లాసంబున నారి మ్రోఁత దెసలం దొక్కుమ్మడిం న్నిండుకో
నల్లం జేయుచు వచ్చి చైత్యమున నుగ్రాకారుఁడై యున్నయు
త్ఫుల్లాబ్జాక్షుని వాయుపుత్త్రుఁ గని యెంతో వింతగా నార్చుచున్.

సీ. కఱకుటమ్ములు పెక్కు కాయంబునందు ము
ఖంబునందుఁ గరద్వయంబునందు
ఱొమ్మునందుం బడ ఱోఁజుచు నేసిన
హనుమ రక్తప్రవాహమున మునిఁగి
తరుగనికినుకమై తత్క్షణంబున నొక్క
గండశిలం దీసి చెండె వాని
వాఁడు దానిం బదివాలంబులం దునా
తునియలు గావించి కినిసి నవ్వె

తే. మారుతాత్మజుఁ డటనున్నమ్రాఁకు నట్టె
పెల్లగించియు గిరగిరం బెరెములను
ద్రిప్పుచును జంబుమాలిపై ఱొప్పి వేసి
చచ్చితి వటంచు నాఁటిచెఁ బెచ్చు పెఱిగి. 18

ఆ. జంబుమాలి నాల్గుసాయకంబుల దాని
తునియలుగ నొనర్చి దొడ్డబాణ
పంచకమున హనుమబాహువుల్ వక్షము
నొచ్చునట్లు చేసి పెచ్చి యార్చె. 19

ఉ. దానికి నైపకాహనుమ ద్వారమునం గలపెద్దయిన్పమొ
ద్దాని పెకల్చి దాన దనుజోత్తమునెత్తి బడంగ నేయుడున్
గానఁగ రాక వానితల కాళులు చేతులు వీతులుం రథం
బానన నేలలోఁ గలిసె నచ్చెరుపాటుదయింపఁ జేయుచున్. 20

ఆ. జంబుమాలి నట్లు చంపుట విని పఙ్క్తి
కంఠుఁ డెంతయేని కనలుగుడిచి
బలపరాక్రమములు గలమంత్రిపుత్రస
ప్తకముఁ బుచ్చెఁ గ్రోఁతిఁ బట్టి చంప. 21

— హనుమంతుఁడు మంత్రిపుత్రసప్తకముం జావనేయుట —

ఉ. వారలు వారిభూరిపరివారముతోడ రథంబు లెక్కి క్రొ
క్కారుమెఱుంగుదీఁగ లనఁ గ్రాలెడు మేలగుకార్ముకంబులున్
సారతరాంబకంబులును సర్వవిధాయుధముల్ ధరించి మా
ర్వీరవ మెల్లదిక్కులఁ బోరిం బోరి మ్రోయఁగ నేగి రాజికిన్. 22

తే. పగి నింగియు నేలయు నెంతయేని
నిండ శరవర్ష మొలికించి నెఱి నెసంగి
రపుడు వాయుసుతుండు వర్షాతిశయము
వలనఁ గప్పువడినకొండ వలెను దోఁచి. 23

ఉ. కొంతటిలోన సింహ మనుకో నొకపెట్టన నింగి మ్రోయఁగా
నంతయు బొబ్బరించి కడు నేడ్తెఱఁ జూపుచు వారిమీఁద దు
ర్దాంతదురంతదుఃఖమునఁ దల్లడిలం బడి కాళ్లఁ జేతులన్
వింతగ నల్పి చంపె నొకవ్రేల్మిడి నెల్లర మంత్రిపుత్రులన్. 24

తే. కరులు హరులును రథములు కాలిబంట్లు
హనుమ సింహనాదములకు నడలు గుడిచి

ముప్పునకు నయ్యె హతశేషు లప్పుడు వడి
పాఱి రావణునకుఁ జెప్పి రారణంబు. 25

వ. రావణుండును మంత్రిపుత్రులమరణంబునకు మనంబున ఘనంబుగ దురపిల్లి కొంతసేపటికి విరూపాక్ష యూపాక్ష దుర్ధర ప్రఘస భాసకర్ణు లనునేవుర సేనానాయకుల రాఁ బనిచి మీరు జాగరూకులై పరాక్రమక్రమంబున రణంబు గావించి వానరుం బట్టి తేరం జనుఁడు వాఁడు సామాన్యవానరుం డని చూడక వేఁడిపిడుగులట్టివెడందబాణంబులం గొట్టి కట్టి తెం డనిన వారు బహువిధసేనాసందోహంబు వెంట నంటఁ జని తోరణస్తంభసమీపంబున రణోత్సాహంబు తెట్టింప నిట్టునట్టు లంఘించుచున్నహనుమంతుం గాంచి వానిపై శరవర్షంబు గురిసి రప్పుడు. 26

## —♦ హనుమంతుఁడు విరూపాక్షాదులం దున్ముచుట ♦—

సీ. దుర్ధరుం డాతనితోడఁ దీకొని పెక్కు-
మార్గణంబులు వైచి మాఱుకొనుఁడు
మారుతతనయుండు బోరున మీఁదికి
నెగిచి పర్వత మనునెగులు దోప
వాసిరథంబుపైఁ బడి నుగ్గు గావించి
రథ్యాళితోడ దుర్ధరునిఁ గూల్చె
నోపి విరూపాక్షయూపాక్షు లిరువురు
కనలి గదలతోడ గాలిపట్టి

తే. బెట్టు కొట్టిరి కొట్టిన బిఱ్ఱబిగిసి
కరువలిసుతుండు చెట్టొండు పెఱికి వారి
తలలు బ్రిద్దలు గావించి ధరణిఁ గూల్చె
ప్రఘసుఁడును భాసకర్ణుఁ డవ్వాల గడంగి. 27

వ. శూలంబులం బొడిచి ముద్గరంబుల నొంచిన హనుమంతుం డట నున్నపర్వతాగ్రం బొండు పెఱికి పట్టి బిట్టుకొట్టి వారిం గిట్టించె నిట్లు సేనాను లేవురుం ద్రెళ్లిన రావణుం డొల్ల బోయి పెల్లుబ్బిన

కోపంబున నేపుమీఱి పోరి కెదురు చూచునక్షకుమారునిం జేరం
జేరి కార్యం బెఱింగించుటయు. 28

చ. అతఁడు మహాబల ప్రధితుఁడై రథ మెక్కి జగత్ప్రసిద్ధముల్
వితతమహాదిశ స్త్రములు పెక్కులు దిక్కులు ప్రజ్వలించుచున్
బ్రతిభ వెలార్చుచుండఁ జనె వాయుతనూభవుఁ డున్నచోటికిన్
మతిమద మేయఁ డక్షసుకుమారుఁడు శూరవ రేణ్యుఁ డుగ్రుఁడై.

—♦ హనుమంతుం డక్షకుమారుం గూల్చుట ♦—

శా. కోండం బోలినవాన రేంద్రునిపయిన్ ఘోరాస్త్రశస్త్రంబులన్
జండాంశుప్రతిమాన తేజుఁ డగునక్షఖ్యాతుఁడై త్యేశపు
త్రుం డంభోదము పెల్లుజల్లువలెఁ జేర్ మ్రోయంగ నేయ న్మెయి
న్మెండై నెత్తురు వఱ్ఱువాఱఁ గపి సందీపించె బ్రధ్నుండు నాన్. 30

చ. విదిలిచికొంచు మే నపుడు విన్ననువొప్పఁగ వింటి కేగి దు
ర్వారుఁడయి పెద్దపెట్టున మహీతలఁ మెల్లను దద్దఱిల్ల బె
ల్లదటున నార్చి నక్షుని హృదంతర మంతయుఁ జ ల్లనం జమూ
పద మది భిన్నభిన్న మయి పర్వఁగఁ బర్వతము ల్చలింపఁగన్. 31

క. అక్షీణ బలపరాక్రముఁ
డక్షకుమారుండు మఱియు నయుతాస్త్రంబుల్
దక్షుఁడయి యేసె నింగిం
బక్షివలెన్ సంచరించుపవనభవుపయిన్. 32

చ. ఒకటియుఁ దన్నుఁ దాఁక నటు లోసరిలం జలనం బొనర్చుచున్
బ్రకటితశౌర్యసంపదలఁ బ్రస్తుతికెక్కినవాయునందనుం
డకటకటా కుమారుఁ డగునక్షునిఁ జంప మనంబు పుట్ట దీ
నుకలుఁడు పిన్న యయ్యు వడిఁ జూపుచు నుండెఁ బరాక్రమంబునన్.

చ. చుఱచుఱ చూడిన ట్లగుచుఁ జొచ్చుచు నున్నవి మేనిలోన నీ
కఱకరి వేయుబాణములు కాయ మిదెల్లను గాయ మయ్యె ని
శ్శైలఁగున నూఱకండితిన ధీరవరేణ్యుఁ డితండు దండియై
కఱకుతనంబు చూపెడి నికన్ సయిరింపఁగ రామియే తగున్. 34

క. అని తలఁచి మింట నంటఁగ
జనుదెంచెడు వానిఁ దరియఁ జని తద్రథర
థ్యనికాయము ద్రెళ్లఁగ ద
న్నెను గాలం గూలె వాఁడు నెఱి దప్పి ధరన్. 35

చ. రథము విశీర్ణ మయ్యె మఱి రథ్యములెన్మిది చూర్ణ మయ్యెఁ ద
ద్రథికుఁడు పిండి యయ్యె రథి రాపున నేపఱి కాలుసేతులన్
గుధరముఁబోలు మేన్ జిదుక కొంచెముగాని విధంబునన్ ధరన్
రుధిరము వెల్లువాఱఁగఁ గనుల్ చెడఁ గూలి మృతించె నంతలోన్.

వ. ఇట్లక్షకుమారుం జంపి వృక్షచరాధ్యక్షుం డక్షీణసత్త్వంబున రాక్ష
సేశ్వరులగుండియలు పగులించుచు మించినవేడ్క వెండియుఁ
దోరణ స్తంభం బధిష్ఠించె నట్లక్షకుమారుండు గూలుట రావణా
సురుండు విని జాలింబడి. 37

క. క్రోఁతికి నింతపరాక్రమ
మేతీఱున సంభవించె నిది చిత్ర మయో
నాతనయు నెదుర నింద్రుం
డే తలఁకున్ వాని కిట్లు మృత్యువు వచ్చెన్. 38

వ. అని వగలం బొగిలియు ధైర్యం బవలంబించి శౌర్యనిధి యగు
నింద్రజిత్తుం బిలువం బంచి కార్యం బెఱింగించి. 39

సీ. తండ్రి! నీ కింద్రుండు తలఁకు నస్త్రంబులు
శస్త్రముల్ నీసొమ్ము సకలములును
బ్రహ్మదేవునియనుగ్రహమున బ్రహ్మాస్త్ర
మును బొందినట్టేఁడ వని యెఱుఁగుదుఁ
బోరుల నీతోడఁ బోరి జీవించిన
వాఁడు లోకంబులఁ లేఁ డొకండు
బుద్ధిమంతుఁడవు నీయుద్ధనైపుణ్యము
దేవదానవులలోఁ దెలియ లేదు

తే. శాఖచరుఁ డెచ్చోఁ గింకరుల్ జంబుమాలి
మొదలయినవారు గాక నీముద్దుతమ్ము

కట్టియును గూలె నెట్లు నేఁ గుదిరి యుందు
నీవు తక్క లేఁ డొక్కఁ డీనెగులు దీర్ప. 40

చ. అనవుడు నింద్రజిత్తు వినయంబునఁ దండ్రికి మ్రొక్కి తండ్రి! లో
వనట దొఱంగు మేఁ గలసు వానరుఁ డన్న న దెంతపాటి నా
జననము సార్థకం బయినచందమునం జని వానిఁ బట్టి నే
జనకునియొద్దఁ బెట్టెదను సందియ మొందక వేగ నంపుమా. 41

—♦ఆంజనేయుఁ డింద్రజిత్తుతో ఘోరయుద్ధము సేయుట ♦—

వ. అని తండ్రి యాజ్ఞం గొని యింద్రజిత్తు ధనుర్బాణతూణీరపాణియై సింహచతుష్కయోజితం బగుసాంగ్రామికరథం బధిష్ఠించి ధనుష్టంకారము చేయుచు నతిత్వరితగతి హనూమంతుం డున్నచోటికిం జనుదెంచె నతండును దనకుం జాలిన పోటుమానిసి వచ్చుచుండె నని పెచ్చుపెఱిఁగినమచ్చరంబున నచ్చటం గలతోరణస్తంభంబు పెల్లగించి చేతం బట్టుకొని సింహనాదంబు గావించె. 42

మ. రథ సింహంబులు సింహనాదమున విభ్రాంతి న్మహాసాధ్వసో
న్మథితస్వాంతములై నియంత నిలుపంగా వాగురుల్ లాగినన్
బృథివి న్నిల్వఁగ లేని యట్లు పఱచెన్ విత్రస్తులై సైనికుల్
వ్యథితాత్మం గలరై నిడూర్చుచును బోవం జొచ్చి రుచ్చైర్గతిన్.

తే. రథము దిగ నుర్కి రావణి రథ్యములను
నిలువరించుచు మఱలించి నింగినాడు
హనుమశిర మెన్మిదమ్ముల నాఱుబాణ
ములను ఱొమ్మును బాదముల్ మొనసి కొట్టె. 44

మ. అలుకన్ వాయుసుతుండు తోమరముతో నయ్యింద్రజిచ్ఛందనం
బలుపంబుల్ శకలంబులై చెడఁగ రథ్యంబుల్ దెగన్ సూతుఁడున్
దిలలంబై పడ నేసి యార్చుటయు నాదేవారి వేరంబునన్
విలుసంధించి మథించె వానరవరున్ విఖ్యాతవీర్యంబునన్. 45

క. తప్పుకొనిహనుమచెట్టొకఁ
డప్పుడు పెకలించి రావణాత్మజు నేయన్

దెప్పున నేలం బడి మూర్ఛఁ
మునిఁగెందెడు నట్లు పడియె మోహావివశుఁడై. 46

ఆ. అంత మూర్ఛఁదేరి యతఁడు బ్రహ్మాస్త్రమ్ముఁ
నారివోసి యంజనాసుతుఁడును
దిగిచి వేసి దీనఁ దెగిలివిరా యని
నొక్కకేక వైచె నుర్వి యద్రువ. 47

—♦ హనుమ బ్రహ్మాస్త్రమునకు బద్ధుఁడగుట ♦—

సీ. బ్రహ్మాస్త్రపాతంబువలన వాయుసుతుండు
మూర్ఛ మునింగి పెంపును దొలంగి
చెయ్యు దక్క యొకింత సేపు కట్టంబడి
బ్రహ్మవరప్రభావంబువలన
నింతలోఁ దెలిసి లో నిట్లు వితర్కించె
నాకు బ్రహ్మాస్త్రంబు సోఁక దింత
వాయ్వింద్రవర మిట్లు వర్తిల్లు నట్లైన
పక్షివదను జూచి పలుకుమనము

తే. కలదు గావున మోహము గలిగినట్లు
మెలఁగి కట్టుళఁ బడి రాక్షసులు గ్రసించి
పోవ గాఁ బోయి రావణుపొంతఁ జేరి
మాటలాడెదఁ దగినట్లు లోటు లేక. 48

వ. అని యెవ్వరు వినకుండ నిందజిత్తు దిక్కు మొగంబై. 49

ఉ. ఇంద్రజి! నన్నెఱుంగుదువె యేఁ బవమానతనూభవుండ నా
కింద్రుఁడు వాయుదేవుఁ డజు డిచ్చినదివ్యవరప్రసంగతిఁ
సాంద్రబలం బెసంగెడిని శస్త్రము లస్త్రము లెవ్వి నామెయిఁ
దంత్రిత గాంచుఁ జెప్పితిని తావకనామ మెఱింగి యుండుటన్.

ఆ. వాని మాటలెల్ల వాస్తవికము లని
తెలిసినట్టిఁ డగుచు దేవవైరి

యొండుమాట లాడ కోసరిల్లఁగ నయ్యె
సంతసంబు బీతు సందడింప. 51

—♦రాక్షసులు హనుమంతుం గట్టి రావణుకడ బెట్టుట ♦—

వ. అపుడు హనూమంతుండును మూర్ఛుండు పోలె నేలం బడి యుండె రాక్షసులు వానింబట్టి గట్టిపగ్గంబుల వానిసర్వాంగంబులుం గట్టి మోచుకొని పోయి సభాస్థలంబునం బ్రహస్తాది మంత్రులతో సభాసదులతోఁ గొలువు దీఱి యున్నరావణాసురునిమ్రోలం బెట్టి వీఁడె మనయశోకవనం బెల్లఁ బెల్లగించి యతౌదులం ద్రెళ్ళ నేసిన వనచరుం డని చెప్పుటయు నప్పౌలస్త్యుండు హెచ్చుహెచ్చేఁగిన మచ్చరంబునఁ గ్రోధసంరక్తలోచనుండై కొంత వానిరూపలక్షణంబులం బరీక్షించువాఁడ పోలె నిరీక్షించి నిశ్చలచిత్తంబున ని ట్లని వితర్కించె. 52

శా. ఆహా వీనిమహాప్రభావము సహస్రాస్యంబు లున్నట్టి శే
షాహిస్వామియు నే నొకింత తెలుపం జాలండు సత్యంబు సం
దేహం బింతయు లేదు క్రూరమతి కాదే నిర్జరేంద్రుండు దా
సోహమ్మంచు భజించునట్టిఁ డగుఁ గాదా సర్వభావంబులన్. 53.

సీ. కపి యిట్టుఁ లెంచుచో గ్రివ్యాదుఁ డెంతయుఁ
గార్యంబునఁ బ్రహస్తుఁ గాంచి యనియె
నీకోఁతి యెవ్వరో యేటికి వచ్చెనో
యెట నుండువాఁడో మున్నిట్లు వనము
చెఱచుట యేటికో చొరరానివీఁ డెట్లు
చొఱఁ గలిగెనో భీతిచొప్పు లేక
యుద్ధమేటికిఁ జేసెనో యేమిలాభము
పొంద నెంచినవాఁడో పురములోన.

తే. అంతయును వీని నడిగి భయంబు దక్కి
చెప్పు మను మట్లు చెప్పిన చొప్పు నెఱిఁగి

విడిచి పుచ్చెద మను మన నడిగె నతఁడు
పఙ్క్తికంఠుఁడు పలికినపద్ధతులను. 54

ఆ. నిజముఁ జెప్ప కున్న సీతలఁ దెగనేసి
యీయశోకవనమునందు నొక్క-
చెట్టుకొనకు వ్రేలఁ గట్టింతు మనుటయు
హనుమ యనియె రావణునిఁ గనుగొని. 55

—♦ హనుమంతుఁడు రావణునితో నిజవృత్తాంత మెఱింగించుట ♦—

ఆ. వానరుండ నేను వచ్చితిఁ బురిఁ జూడ
వనము జాతిధర్మమున విఱిచితి
నన్నుఁ జంప వచ్చునాలిభూతములను
రాల్చినాఁడఁ బ్రాణరక్షపొంటె. 56

ఆ. ఎట్టియస్త్రమేని ముట్టదు బ్రహ్మాస్త్ర
బాధ లేదు నాకుఁ బ్రభువు నీదు
దర్శనంబు చేసి తగ నాడి పో నిట్లు
కట్టఁ బడుచు వచ్చినట్టి కనుము. 57

ఉ. నీ కొకరాజకార్యమును నేను వచింపఁగ వచ్చినాఁడ లో
కైకవిభుండు రామవసుధాధిపుదూతుఁడ నాంజనేయుఁడన్
నాకు మహాబలుండు కరుణానిధియై వరదానసంగతిన్
లోకనుతాతిసత్త్వమును లోఁ గలిగించె నెఱుంగఁ జెప్పితిన్. 58

క. ఆసుగ్రీవునకు న్నే
ధీసచివులలోన నొకఁడ దేవేంద్రాదుల్
నాసఖ్య మెంచుచుందురు
నాసామర్థ్యమున సూర్యు నమలఁగ నైతిన్. 59

ఉ. రాముఁడు సర్వలోకపరిరక్షకుఁ డక్షయసత్త్వుఁ డుగ్రసం
గ్రామజయోన్నతాభుఁడు విరాధముఖామరమారకుండు తే
జోమహితుండు భూతలరజోగుణమంతయుఁ బాప నిట్టు లా
ధామనిధిస్వవంశమునఁ దాఁ బ్రభవించె జగం బెఱుంగఁగన్. 60

తే. వాలమున నిన్ను బంధించి వారినిధుల
ముంచి నొంచినవానరపుంగవుఁ డగు
వాలి నొకకోలఁ గూల్చినవడి గలాఁడు
రాముఁ డాతని నెఱుఁగవే రాక్షసేంద్ర. 61

ఆ. అతఁడు లేనిపట్ల నరసి దొంగతెఱంగు
దోఁప నతనిపత్నిఁ దోచి తెచ్చి
తీవు లోకమాత నీరీతిఁ జెఱఁ గొంట
నీకెగా దటంచు నే వచింతు.

——♦ హనుమ రావణుని జెండనాడుట ♦——

మ. పరమేష్ఠ్యన్వయమందుఁ బుట్టితి శ్రుతుల్ వల్లించి తింద్రాదులన్
గర మర్దించితి వీశ్వరుం గొలిచి ప్రఖ్యాతిం బ్రవర్తిల్లి తి
ద్ధర నిన్ బోలినధర్మవేత్త లెవరున్ దర్శింపరా రిట్టినీ
వొరుదారం జెఱఁ బట్టినట్టిపను లయ్యో! చెల్లనై యుండునే. 63

క. లోకైకమాత సీతన్
రాకాచంద్రాస్య నితరరమణులఁ బోలెన్
నీకుం జెఱ బట్టుట తగ
దాకమలాలయయ సీత యని యెఱుఁగ వయో. 64

ఆ. కాళరాత్రి నింటఁ గట్టినయట్లు నీ
శిరమునందుఁ ద్రాఁచుఁ జేరినట్లు
లోఁడిని నిప్పుకలను ముడిచినయట్లును
దెచ్చియుంటి రాముదేవి నకట. 65

క. బలవద్వైరము నీకున్
ఫలవంతము గాదు లోకపతి రాముఁడు నా
నలఁతి యని తలఁచుచుంటివో
తెలియదు తన్మహిమ వినుము తెలిపెద నిచటన్. 66

సీ. నిను నాఁడు నలియఁ జేసినహరచాపముఁ
గడకేల విఱిచినఘనభుజుండు

నిన్నుఁ దోఁకకుం జుట్టి వసధులన్ ముంచిన
వాలిఁ జా నేసినబల్లిదుండు
నిన్నుఁ జెఱఁబెట్టినఘనునిఁ జంపినభార్గ
వునిపెం పడంచినప్రియతకీర్తి
ఖరదూషణాదుల గండడంచి యశంబుఁ
గాంచినసర్వలోకప్రభుండు

తే. అట్టి శ్రీరామచంద్రుని కాగ్రహంబు
గలిగె నేని ముల్లోకముల్ గ్రాఁగిపోవు
రావణా ! తప్పు చేసి తారామపత్నిఁ
దెచ్చితివి నీదు బ్రదు కెట్లొ తెలియ దవల. 67

మ. రఘువంశోత్తరుబాణినుండి నిను నీప్రాణంబులం గాచువా
రఘముం బాపెడువారు లే రొరులు సత్యం బేను వాక్రుచ్చితిన్
దృఘుణుం జేనియుఁ జాలఁ డాతనికిఁ జేతోరీతిఁ జర్చించి నీ
వు ఘనుం డాతని కిచ్చి సీత శరణంబుం బొందుమా రావణా.

క. శర ణన్న వారిఁ బ్రోచెడు
కరుణామయుఁ డతఁడు తప్పుగావించితి నేఁ
గరుణింపు మనుచు వేఁడినఁ
బరిరక్షించెడి నతండు వైరివి యైనన్. 69

క. కాకున్న నీకు మరణము
కాకుండదు నిశ్చయంబు గలిగినమాటన్
వాకొంటి ననుచుఁ గోపో
ద్రేకమునఁ రావణుండు దెగ వచియించెన్. 70

—♦ రావణుఁడు తనప్రభావము చెప్పుకొనుట ♦—

క. ఒకటెఱుఁగక ప్రేలెద వి
క్లైడ నింతయుఁ గాని భీతి యిడి కొని నన్నేఁ
బొడకట్ట దెదిరిఁ దన్నుం
బొడఁగానక యుంటి వెడఁగ ప్లవగాసరుఁడా, 71

క. నా తేజం బెట్టిదో నీ
చేతం బెటు లెఱుఁగఁ గలుగుఁ జెప్పెద విను నా
ఖ్యాతియు భీతియు రీతియు
నేత న్మాత్రక్రియ నటించు ని వసఁ గలవో. 72

సీ. నాయింటఁ గస వూడ్చు వాయుదేవుఁడు నీళ్లు
చల్లును నావీధి నీళ్లజేఁడు
వండిపెట్టును నగ్ని పింసివంటల నెల్లఁ
బూలమాలలఁ గట్టు వేలుపుదొర
దండధరుండు నాదండఁ గావలి యుండు
నంతఃపురముదాసు లప్సరసలు
పిల్లల మేకలం బెంప నాపురిలోఁ బ
రాశక్తి దాదియై కాఁపుచుండు

తే. రేలు చంద్రుఁడు దివ్వెయై మేలుగూర్చు
ధనదుఁ డెప్పుడు నానిధుల్ గనుచునుండు
నాపరాక్రమ మెఱుఁగమి నీపగిదిని
బలుకఁ జొచ్చితి వోరోరి వానరుండ. 73

తే. హరిహరబ్రహ్మలే నాకు నడలు గుడుచు
చుందు రన రాముఁ డన నెంత యోరిక్రోఁతి
నన్ను బెదరింప వచ్చితె కన్న గనక
ప్రాణ మాసింపనట్టిఁడ వైతి వయ్యో. 74

వ. అని క్రోధఘూర్ణితలోచనుండై మంత్రులం గాంచి వీని వధ్య
స్థానంబునకుం గొనిపోయి శిరచ్ఛేదంబు గావించి సీతకుం జూపుఁ
డని యాజ్ఞాపించిన విభీషణుండన్నదెస మొగంబువెట్టి యిట్లనియె. 75

క. దూతవధార్హుఁడు గాఁ డీ
క్రోఁతి వధించుటలు తగదు కోవిదవర్యా!
యాతనికిఁ దగినశిక్షఁ
ఖ్యాతిమెయిం జేసి పుత్త్ర మని పలుకుటయున్. 76

వ. రావణుం డౌ నని వానరంబులకు వాలంబు ముఖ్యాంగంబు గావున వీని తోఁకకుఁ గోక లెన్నియేనియుం జుట్టి తైలసిక్తంబు గావించి నిప్పంటించి పురంబు నాలుగువీథులం ద్రిప్పపుచ్చు డని ముదల వెట్టుటయును. 77

—♦ ఆంజనేయుఁడు లంకం గాల్చుట ♦—

సీ. నల్లదాప్రుడు తెల్ల నల్లని తెల్లని
పాఁతపేలిక లెన్నొ ప్రీతిఁ దెచ్చి
హనుమత్తోఁకకుఁ జుట్టి యది పెఱిఁగిన వెండి
యును దెచ్చి చుట్టిరి పను పెఱింగి
మఱియునుం బెఱుఁగంగఁ బురమునం గలయట్టి
వస్త్రముల్ చుట్టి రావాలమునకు
సప్తహోత్రము దెచ్చి యంటించి యూరేరి
మంటలు సలుగడ సంతసిల్లు

తే. అంత రాక్షసు లాకబంది యందు హనుమఁ
బెట్టి తూర్యరవంబులు బెట్టు మొఱయఁ
బ్రజలు గుంపులు గుంపులై వచ్చి చూడఁ
బురము నల్గడఁ ద్రిప్ప రబ్బరవు నోడ. 78

తే. అట్టియెడ రాక్షసాంగన లవనిపుత్రి
కడకుఁ జని యోసి నీతోడఁ గబురు లాడు
నట్టికోఁతికి గుడ్డలు చుట్టి నిప్పు
పెట్టి కాల్చుచు నుండి రిప్పట్టనంచు. 79

వ. అనిచెప్పిన సీతాదేవి శోకానలదందహ్యమానదేహయై తత్తఱం బున నత్తఱి వీతిహోత్రు నంతరంగంబునం దలంచుచు. 80

ఉ. ఏను మహాపతివ్రతన యేని పరాత్మునిఁ గోర నేని నా
మానస మెప్పుడున్ సుకృతమార్గమునందు మెలంగు నేని మ
త్ప్రాణము నిల్ప వచ్చినమహాత్ముఁడు వాయుసుతుండు వాని కెం
తేనియు శీతలత్వమును నిచ్చెడి వాఁడవు కమ్ము పావకా. 81

తే. కడఁగి నీకుఁ బ్రకాశము గలుగఁ జేయు
నీదు చెలికానిసుతునకు నెగులు గుడుప
రాదు చల్లనివాఁడవై నాదుమదికిఁ
జల్లదనమును గూర్పవే జాతవేద. 82

వ. అని ప్రార్థించె నంత నక్కడ హనుమంతుండును మంచున ముంచి నట్లు తనవాలంబు చల్లబడియుంట కుల్లంబున సంతసిల్లుచుఁ దనమనంబున. 83

శా. ఛాయాగ్రాహిణి నోటిలోనఁ బడి యీషన్మాత్రిలో చాని నే
నాయబ్ధిం బరిమార్చి వచ్చుటలు సంప్రాప్తించె నేయమ్మచే
నాయమ్మాళుననుగ్రహమ్మునన నీహారమ్ము నాఁ జల్లనై
నాయంగంబున జాతవేదసుఁడు సంధానించె సౌఖ్యం బహో. 84

వ. అని జగన్మాత యగుజానకిం గీర్తించుచుఁ దన కెట్టిబంధంబును లేనివాఁ డయ్యు నున్నవానిచాడ్పున నభినయించుచుఁ గొంత దూరం బట్లు చనినంత నింతలో మేను పెంచి కట్లం దునాతునియలు గావించి మించినవేడ్క గోపురద్వారంబుమీఁదికిం గుప్పించి యెగిరి పోయి యట నున్నయినుపగుదెం గొని ద్వారరక్షకులం ద్రెళ్ల నేసి తూఁచి ర మ్మన్నఁ గాల్చి వచ్చె ననుపేరు దెచ్చుకొనువాఁడై లంకాపురంబు నలుగడ వాలాగ్నిం జేసి భస్మసాత్కృతంబు గావింప నెంచి క్రమక్రమోచ్చలనంబు చేయుచుఁ బ్రహస్తునియు మహాపార్శ్వునియు శుకసారణేంద్రజిత్తులయు జంబుమాలివిద్యుజ్జిహ్వులయు రశ్మికేతుసూర్యశత్రులయు హ్రస్వకర్ణాదులయు సౌధంబులును మఱియు లంకాపురంబునం గల గృహంబు లన్నియుఁ బరశురామార్పణంబు గావించి వాలాగ్ని సముద్రకీలాలంబునఁ జల్లార్చుకొని ప్రయాణోన్ముఖుండై లంకాదాహంబునం జేసి శంకాకుల చిత్తుండై. 85

మ. ఎదియుం జూడక రావణాసురునిపై నేర్పడ్డకోపంబునన్
మొదలంటం జెడ లంకఁ గాల్చితి న దేమో యెట్లొ నాతల్లి సీ

త దహింపం బడెనో యటంచును నెడందం గొంత చింతించి యా
మె దయం గాల్పఁడు నన్ను వహ్ని యిపుడామెం గాల్చునంటో ప్పనే.

వ. నాది ప్రమాదం బని నిశ్చయించుకొనియు నామె వెండియు
దర్శించి పోవుటయ యుత్తమం బని చిత్తంబున నెంచి సీతాదేవి
కడకుం జని తనచేసినలంకాదహనాదికం బెఱింగించి తల్లీ! నే నిదె
పోయివచ్చెదఁ దల్లడిల్ల కుండు మని ప్రణమిల్లి ప్రణమిల్లినవేషం
బుతో ననుజ్ఞ వడసి పయనంబై ప్రదక్షిణపూర్వకంబుగా నడచుచు
నెగిరి వడివడి సముద్రతీరంబునం గలయరిష్టపర్వతంబు నధిరో
హించి. 87

—♦ హనుమంతుఁడు మరలసముద్రంబుదాఁటి తనవారిం గలియుట ♦—

చ. గిరిశిఖరంబుమీఁదికి నొగిం జని యుత్తరదిఙ్ముఖంబు గా
గరిమ మెసంగగా నిలిచి కాళులు కుంచి కరంబు లెత్తి పై
కరుదుగ లేచి మీఁదికి రయంబుగ నాకస మంటి పోవుచుɴ
గరుడియనంగ నెల్లరకుఁ గానఁగ వచ్చెను బెక్క లార్చుచుɴ. 88

మ. హనుమంతుం డవలɴ మహేంద్రనగముɴ హర్షంబునం జూచి లో
ఘన మానందగతిɴ వెలార్చుటకు నా గాఢంబుగా నార్చె ద
న్నినదంబు న్విని జాంబవత్ప్రముఖు లెంతే సంతసం బందుచుɴ
బెనువృక్షంబుల నెక్కి చూచిరి దివిɴ విచ్చేయువాతాత్మజుɴ. 89

ఆ. అతఁడె వచ్చుచుండె నంజనాతనయుండు
సీతఁ జూచి వచ్చురీతి యగునొ
కాదొ యనుచు మిగులఁ గళవళపడుచుండ
జాంబవంతుఁ డనియె నందియ మఱి. 90

ఉ. చూచినచొప్పె కానియెడ శోభనమూర్తి యతండు నవ్వుచుɴ
గీచు మటంచుఁగూయుచును గేకలు వేయుచుఁ గేలు తట్టుచుɴ
సాచినచూపులɴ మనల సారెకు సారెకుఁ జూచు చెంతయే
నేచినసంతసంబునను నేఁడ్తెఱఁ దెల్పెడు నిశ్చయం బగుɴ. 91

ఆ. చూచి వచ్చుచుండె రాచతేవ చెలంగ
మనము వాని కెదురు చని ప్రియమునఁ
బంప్లు కాన్క పెట్టి పరిపరి భజియింత
మనుచుఁ బలుకుకొనెదు నవసరమున. 92

శా. ఆకాశంబున నుండి ప్రొద్దు తెగిపడ్డట్లామహేంద్రాద్రిపై
వీఁకం జూపుచు వ్రాలి లీల లెసఁగన్ విచ్చేయుచున్ వానరా
నీకంబున్ వడిఁ బిల్చుచున్ ముదము గాన్పింపఁగ భాషించుచో
నాకప్యగ్రణు లాతనిం గదిసి గాఢాలింగనప్రక్రియన్. 93

వ. గౌరవించిన నతం డెల్లవారి నాదరించి జాంబవంతునకు నమస్క
రించి యంగదు నక్కునంజేర్చి నిజగమనవృత్తాంతంబు వినఁగుతూ
హలాయత్తచిత్తు లగువా రెల్లరు విన ని ట్లనియె. 94

ఉ. చూచితి సీత నే నట నశోకవనంబున రాక్షసాంగనల్
రాచి కడుం గడున్ వెతల రాయిడి పెట్టుచునుండ వారలన్
దోచి జనిత్రితో నుడులు తోఁపగఁ బల్కితి రామముద్రిక
న్దాచిన దానిఁ దీసి యిడినా నడియాలము గాఁగ నామెకున్. 95

ఆ. ఆమెవార్త లెఱిఁగి నట నశోకవనంబుఁ
గూల్చి న న్నెదుర్చుక్రూరు లక్ష
ముఖ్యులైనవారిఁ బోకార్చి రిపు దూరి
వచ్చినాఁడ లంక వహ్నిఁ గాల్చి. 96

వ. అట్టియవసరంబున. 97

సీ. సింహనాదంబులు చేసిరి కొందఱు
కొందఱు దుమికిరి కొండనుండి
యవ్యక్తనాదము లాచరించిరి కొంద
ఱట కొంద ఱానంద మనుభవించి
శాంజనేయుని మెచ్చి యాడిరి కొందఱు
కొందఱు చప్పట్లు కొట్టి రట్టె

వాలము లాఘించువా రైరి కొండఱు
కొండఱు చంకలం గొట్టుకొనిరి

తే. ఆంజనేయుఁడు లంకలో నవనిజాతఁ
జూచివచ్చితిఁ జెక్కుర రాచి లంకఁ
గాల్చి వచ్చితి నని చెప్పఁగా వినంగఁ
గవిసి యుండినవానరుల్ కౌతుకమున. 98

వ. ఇట్లందఱు నానందభరితులై హనూమంతుం బురస్కరించుకొని యంగదానుమతిం గిష్కింధకుం బోవువారై కొంతచని నప్పు డాంజనేయుండు జాంబవదంగదాదులం గాంచి. 99

మ. మన మీదక్షిణయాత్ర చేసి యొకఁ డౌమాసంబులో వత్తు మం చు నృపాలోత్తముచెంతఁ బల్కి యిపు డచ్చొప్పుల్ ప్రవర్తిల్లఁ జే యనివా రైతి మదైన సీతఁ గనుటన్ బ్రాణాశ దక్కించుకో నను వయ్యెన్ గడు వేగిరన్ మొదట రాజాజ్ఞల్ ప్రవర్తిల్లినన్.

—♦ వానరులు మధువనంబునఫలాదులు భుజించుట ♦—

తే. ప్రోలు విడిచినదాది యీపూటవఱకు
మనకు నిద్రయు నాహారమును లభింప
దిందఱును క్షుత్పిపాసల నెఱియుకడుపు
గలిగినట్టిర యేమందుఁ గష్ట మకట. 101

తే. మధువనం బొండు చారిలో మనకుఁ దోచు
నద్ది సుగ్రీవపాలితమై తలిర్చు
నంగదునియాజ్ఞ మన మెల్ల నందుఁ జేరి
తృప్తిగ భుజించి పో నాదుహృదయ మనియె. 102

సీ. అనిన నంగదుఁ డిది యౌరా లెస్స లిన లేమి
మన మెల్ల మలమల మాడుచుంటి
మమ్మధువనమునయందు ఫలంబులు
కడుపారఁ దిని మధుకమును గ్రోలి

పోవుద మని దధిముఖుఁడు కా దనుచుండ
వానిసరకు గొనక వనముఁ జొచ్చి
మధురఫలంబుల మనసార భక్షించి
తియ్యతేనెలు ద్రావి తియ్య మెసఁగ

తే. అడ్డ మాకలు లే కందు హనుమదాది
వానరేంద్రులు విహరింప వారినుడువఁ
జాల కాదధిముఖుఁడు నృపాలుపాలి
కరిగి యి ట్లని తెలిపె భయంబు తోఁప. 103

తే. అంగదాదులు మధువనమందుఁ జొచ్చి
కొల్లగొట్టి భుజించిరి యెల్లపండ్లు
తేనె లన్నియుఁ ద్రావిరి నేను వలదు
వలవదన్న నామాటలువమ్ముచేసి. 104

క. నాకును వనపాలురకున్
జీకొ ట్లవి గాక కాకచే నగుపోట్లున్
గైకొన నయ్యెం బ్రభుసుతుఁ
నేకరణిం జేయ లేమి నిల్లైతిఁ బ్రభూ. 105

వ. అనిన సుగ్రీవుండు రామచంద్రుదిక్కు మొగంబై. 106

మ. పులి నీర్ద్రాపదు నాదుపేరనిన నోభూమీశ! యీవానరుల్
బలిమిం జొచ్చి వనంబు శూన్య మగుతేవం బండ్లు భక్షించి తే
నెలు గ్రోలం గలవారలై రనుట నానెమ్మిం గపిశ్రేష్ఠు ల
య్యేలనాగ జనకాత్మజం గనిర టం చే నెంచు చుంటిన్ బ్రభూ.

తే. గడువుదాటినత ప్పెంచు కాక మధువ
నమ్ము నిటు సేయుతప్పవే జిమ్మయి నొన
రింప రిది యెల్ల సీత వీక్షింప నైన
సంతసం బని యెంతు నోత్మ్మాతలేంద్ర!. 108

వ. అని దధిముఖుం గాంచి కానిమ్ము విచారించెద నీవు పోయి వారి
నాకడకుం బంపుమని వాని నంపిపుచ్చుటయు వాఁడు వానిముదలం
గొని చనియె నంతఁ గొంతలోన, 109

—♦ హనుమదాదులు రామునికడం దిగుట ♦—

చ. గగనమునుండి యొక్కొకఁడు గా భువికిం దిగునంచ లట్లు తె
ల్లగ నగు వస్త్రదామము లలంకృతిగాఁ గొని మోచ్చి చేతు ల
య్యగచరు లంగదాదులు క్రమాగతులై రఘురాముచెంగటన్
దిగిరి ముదావహం బగుచు దేశ మదంతయుఁ దేజరిల్లఁగన్. 109

వ. అట్లు దిగి హనుమత్పురస్సరంబుగా నెల్లరు రామాదులకుం బ్రద
క్షిణంబు గావించి తదంతికప్రదేశమ్మున బాఱులు తీఱి నిలుచు
టయు రామలక్ష్మణసుగ్రీవులును వారి నెల్లరం గూరుచుండ నియో
గించి పదంపడి యెవ రేమి మాటచెప్పుదురో యని కడువెల్ల
గుండెలుగా నున్న రామచంద్రుని సన్నిధానంబునకు హనుమం
తుండు చెచ్చెర వచ్చి సమస్కరించి యి ట్లనియె. 110

ఉ. చూచితి సీత నే నట నశోకవనంబున రాక్షసాంగనల్
రాచి కడుంగడు న్వెతల రాయిడి పెట్టుచు నుండ వారలన్
ద్రోచి జనిత్రితో నుడులు తోఁపగఁ బల్కితి రామముద్రిక
న్దాచిన దాని దీసి యిడినా నడియాలము గాఁగ నామెకున్. 111

ఆ. అనుడు రామచంద్రుఁ డంజనాసుతు సకు
నందుఁ జేర్చి శీర్షమందు బాష్ప
జలము విడిచి తడిపె జలదము వక్షోప
కమ్ము విడుచు స్ఫటికకరణి దోఁప. 112

వ. అ ట్లుండి కొంతవడికి వత్సా! నీవు పోయివచ్చినవృత్తాంత మం
తయు సవిస్తరంబుగఁ జెప్పు మనుటయు నతం డతని కి ట్లనియె. 113

—♦ హనుమంతుఁడుతానుపోయివచ్చినవృత్తాంతముచెప్పుట ♦—

సీ. నీయాజ్ఞ తలఁ దాల్చి నే నంగదాదులఁ
గలసి దక్షిణవార్ధికడకు నేగి
దాని దాఁటగఁ బూని నే నెగిరెడునప్డు
ననుఁ బట్టి సింహిక నమల నెంచె

నద్దానినిం జంపి యవల లంకిణితోడఁ
బోరి జయించి యప్పురముఁ జొచ్చి
నలుగిడ వెదకితి నారీశిరోమణిఁ
గానరా దయ్యె నెక్కడను గాని

తే. రావణాంతఃపురంబున రామ నొకతెఁ
గాంచి సీతామహాదేవి యంచు భ్రాంతి
నొంది పిమ్మట నామె మందోదరి యని
తెలిసి కొని పాపమతికి నేఁ దలఁకి కొనుచు. 114

చ. దశముఖసోదరుం డధికదాంతుఁడు పొల్చు విభీషణుం డటన్
బ్రశమితదోషుఁ డాతనిశుభప్రదవేశ్మము గంటి నందులో
విశదముగాఁగ దోఁచు రఘువీరచరిత్రము చిత్రసంగతిన్
దశదిశలందు భక్తియ ప్రధాన మటంచునెఱుంగఁ జేయుచున్ 115

తే. అతఁడు నన్నుఁ జూచెఁ గాని నాప్రతిమ యనుచు
నిజ మెఱుంగనివాఁ డయ్యె నేను వాని
గతికి నెంతయు సంతోషకలితుఁడ నయి
వెడలి పోయితి యింకొక్కవిడిద కపుడు. 116

వ. ఎందునుం గానక యశోకవనంబునకుం బోయి యం దొక్కచెట్టు కొమ్మం బట్టుకొని నిలిచి యున్న కృశాంగిం గాంచి సీత యని నిశ్చయించియు నిశ్చయింప లేనివాఁడనై వృక్షపర్ణంబుల సూక్ష్మ రూపుఁడనై యడంగి యుంటి నంతలో రావణుం డటవచ్చి జానకి నెన్నియేఁ దెఱంగుల నిర్బంధించి నీవు నామాట వినవేని ని న్నీ రాక్షసాంగనలు భక్షించెద రని రెండుమాసములు గడువు పెట్టి పోయె నాకర్ణింపుము. 117

మ. తనవాఁ డన్నది లేనిచోటు జగముల్ దాఁ ద్రిమ్మఁగజాల్ రాక్షసుల్
తన వెంటం గలచోటు లేతపయురం దాఁకంగ నిల్వంగ నో
పని మే స్గలిన దాఁడు దారఘుకులస్వామ్యంగనారత్న మ
మ్మనుజాశింద్రణమట్టులెంచి తెగ జెన్ మాటల్ మెయిన్ గాల్పఁగన్.

తే. త్రిజట యనునోర్తు కలదట ! వ్యసనశంక
గలది రావణుఁ డితరకాంతలను బల్మిఁ
బట్టఁ జావఁ గౌబేరిశాపంబు గలుగ
వెఱుఁగఁ జేసెఁ గాఁబోలు సీతేందుముఖికి. 119

వ. అంతలో రాక్షసు లెడగలిగినప్పుడే నాతల్లిదర్శనంబు సేయుట కుపాయంబు గానక చెట్టుకొమ్మపైఁ గూరుచుండి రామాయణ పారాయణంబు గావించితి నామె కన్నెత్తి నన్నుఁ జూచి రాక్షస మాయ యని భ్రమించి యించుక సంచలించుచుండఁ జెట్టు దిగి చేతులు కట్టుకొని నావృత్తాంతం బంతయు సవిస్తరంబుగం జెప్పి యప్పతివ్రతావతంసంబు తన్నుం జెప్పకుండ నంతయుం దెలిసికొని యున్నవాఁడఁ గావున నంగుళీయకం బానవా లిచ్చినం బుచ్చుకొని సీతాదేవి. 120

ఆ. ముద్దు వెట్టుకొనియు మోమున నద్దియు
శిరమునందుఁ గొనియుఁ జిటుకైన కీడు
నపుడు తనదు వ్రేళ్ల కది వదు లగుటను
గరమునందుఁ దాల్చెఁ గంకణముగ. 121

వ. అమ్మహాదేవియు. 122

సీ. ఘనతరాంగారకగ్రహపీడఁ బడిసరో
హిణి తెఱంగున హెచ్చు నెసలి యెసలి
సితపక్షముఖమందుఁ జెలువొందుశశిరేఖ
చక్కి నొక్కింతగాఁ జిక్కి చిక్కి
స్వగణంబు విడనాడి శ్వగణాభివృత యగు
మృగివలె వగలకై పొగిలి పొగిలి
పుడమిపైఁ బొరలాడి బూది బ్రుంగుడువడ్డ
కనకశలాకనాఁ గనిసి కనిసి

తే. కప్పువడియున్నవహ్నిశిఖయును బోలెఁ
గావిరిఁ గొడిగట్టినదీపకళిక వోలెఁ

బూడిలోఁ బడ్డరతనంపుమొలకవోలెఁ
జెన్ను విడి కంటఁ దడి వెట్టుచున్న దంచు. 123

చ. తడయక రాముఁ డె వ్వనుచుఁ ద త్తఱపాటును జాటుచుండ నే
గడ్డుకొని నిన్ను శీర్షముసఁ గైకొనిపోవుదు నన్న నట్లు గా
దొడయఁడు వచ్చి రాక్షసుల నుక్కడగించుట చూచి కాని యి
ప్పుడ చనుదే నటంచుఁ దనపూన్కి యెఱుంగఁగఁ జేసె వింటివే.

—♦ హనుమంతుఁడు సీత యిడినరత్నంబు రామునికిచ్చుట ♦—

వ. నాప్రయాణం బెఱింగించి రాముని కానవా లెదియే ని మ్మనిన శిరోమణి యిచ్చి యిది నీ కభిజ్ఞానంబుగ నిమ్మనిన దని రాముని హ స్తంబునం బెట్టిన దానిఁ కన్నుల నద్దుకొని రామచంద్రుండు.

తే. ఇది మదీయవివాహము విదితముగను
జరుగుచున్నప్డు జనకభూజాని వాని
సతియు నీరత్నమును దెచ్చి జానకిశిర
మందుఁ గట్టిరి దీనిమహాత్మ్య మొప్పు. 126

వ. అని రామచంద్రుం డా శిరోరత్నదర్శనంబున సీతాదర్శనంబు చేసి నట్లు సంతసించుచు వాయుపుత్రా! నీవు ప్రాణప్రదానంబు చేసిన మిత్రుండవు ని న్నెన్నఁటికి మఱచి యుండ నని మఱియు లంకా పురంబున నీవుచేసినచేత లెట్టివి చెప్పు మనిన నతండు వెండియు.

శా. నాశౌర్యం బటఁ-జూపు వాఁడ నగుచున్ దర్పించి నే నందు ది
వ్యాశోకోపవనంబు ద్రెంచితిని దద్వ్యాజంబునం బెక్కురన్
నాశం బందఁగఁ జేసి రాక్షసపతిన్ దర్శించి లంకాపురం
బాశుక్రార్పిత మాచరించి యిట రా నైతిన్ రమానుజ్ఞమై. 128

వ. అని హనుమంతుండు తాను బోయి వచ్చినవృత్తాంతం బంతయుఁ బూసగ్రుచ్చినమచ్చున శ్రీరామచంద్రునకుఁ జెప్పె నని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలి వృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును, 229

—♦ ఆ శ్వా సాం త ము ♦—

సీ. ఆంజనేయుఁడు మహేంద్రాద్రిపై నుండియు
నెగిరె సంద్రము దాఁటు నిచ్చఁ జేసి
నమము సురస మెప్పు వడసి సింహికఁ గూల్చి
చని ప్రేల్మిడిన్ లంకఁ గనుఁగొని మును
లంకిణి నోడించి లంకాపురిన్ రేయి
జానకి నెందును గానలేక
యుపవనిఁ జని గాంచి యుచితగతిం దన్ను
నెఱిఁగించి యానవా లిచ్చికదలి

తే. రాక్షసులఁ బెక్కురం జంపి రావణుఁ గని
పురముఁ గాల్చి వచ్చి రామునకుఁ దెలుప
సంతసము నొందు శ్రీరామచంద్రమూర్తి
ప్రేమ నీదరవేంకటరాము నేలు. 230

గ ద్య ము.

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవి
సార్వభౌమాంధ్రవ్యాసాభినవశ్రీనాథ వేదవిద్యావిశారద
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన శ్రీకృష్ణ
రామాయణంబునందు సుందరకాండంబున
సర్వంబును ద్వితీయాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# శ్రీకృష్ణరామాయణము

:o:

## యుద్ధకాండము

### ప్రథమాశ్వాసము



విద్యాంచితమతియై
దేవళ్ళఁ భజించునట్టిధీనిధిఁ యగుచున్
క్ష్మావలయమందుఁ వెలసిన
శ్రీ వేంకటరాయమంత్రి చెన్నలరారున్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లాంజనేయుండు సీతావృత్తాంతంబు చెప్పి తనస్వాంతంబున కింత శాంతి గలిగించుటం జేసి సంతసించుచు శ్రీరామచంద్రుండు సుగ్రీవుదిక్కు మొగంబై. 2

— శ్రీరాముఁడు హనుమంతునిఁ బ్రశంసించుట —

మ. గరుత్మంతుఁడు గాలి తక్క యొరుఁ డొక్కం డేని కే దాఁట దు
ష్కరమౌ నీమకరాలయంబు గడెలోగం దాఁటి వచ్చెన్ మహో
త్తరుఁ డీమారుతి వీనిసాహసము మేధాశక్తి శౌర్యంబులున్
బరిపాటిన్ వచియించు టెవ్వరి కిలన్ సాధ్యం బగు న్మిత్రమా. 3

క. పరిమితి శతయోజనములు
వరనీరాకరము దాఁటివచ్చుటె కాక

ప్పారము సమంతము వైశ్వా
నరునకు నర్పింపఁ గలిగె నయనిధి వింటే. 4

క. ఒక్కఁడు వెక్కురు రక్కసు
లక్కజముగ వారి నోర్చి యత్యధికుఁడు నా
నెక్కొనినరావణాసురు
మిక్కిలిగం దెగడి వచ్చె మిసిమి గలాఁడై. 5

తే. చెప్పినది గాక పై పెచ్చు చేయువాఁడు
చెప్పినదె చేయువాఁడును జెప్పినద్ది
యును బొనర్పక యుండువాఁ డుత్తముఁడును
మధ్యముఁడు నధముం డన మంతుఁ గొంద్రు. 6

మ. వనభంగంబుఁ బురాతిదాహమును జెప్పన్ లేదు కావించె నీ
ఘనసత్వుం డిది యుత్తమోత్తమము లోకంబందు నియ్యంజనా
తనయుం బోలిన భృత్యుఁ డుండు ననుటల్ తప్పేతఁడే నామజీ
వనము న్నిల్పిన వాఁడు వీని నుతియింపం జాలఁ గీశేశ్వరా. 7

ఆ. వీని కేమి యిడినఁ గాని కొలంతయే
నాదుహృదయపద్మ మిాడయితున
కిత్తు ననుచు హనుమ నెంతయు నక్కున
హత్తఁ జేసి వాని నాదరించె. 8

వ. అనిమఱియును. 9

క. శతయోజనవిస్తీర్ణం
బతులిత సాగరము నడుమ నడ్డం బగు నో
మతిమంత యెట్లు లంకా
క్షితి కేగి సురారి గెలిచి సీతఁ గనుదుమో. 10

—♦ సుగ్రీవుఁడు తక్కినవానరులఁ బ్రశంసించుట ♦—

తే. అనుడు సుగ్రీవుఁ డను మనహనుమ దొట్టి
వానరేంద్రులు వెక్కురు వార్ధి దాఁటి

లంకతోఁ గూడ దాయ నీవంకకిపుడు
తే సమర్థులు గల రని తెలియు మధిప. 11

ఉ. వర్షకుఁ బూర్వమే యిటకు వచ్చిరి వానరవర్యు లెందఱో
హర్షము చూపుచుం బ్రథనమయ్యెది యెప్పుడటంచుఁ బల్కుచుం
ఘర్షణ మింతయుం సలుపగా మదిసేయక సత్యసన్నుతా
మర్షముతోడ లంకఁ జని మార్తురఁ గూల్తము మేల్తలంచుచుం.

క. నీకన్ను పడిన సంద్రం
బేకరణిం జేసి యేని యింకక పోదో
లోకైకవినుతకీర్తి!
కాకుండిన సేతువుం దగం గట్టెదమో. 13

ఆ. ఓల మాంసగొనక యొకఁడు గాదెల్లరు
రామకార్యమునకుఁ బ్రాణ మైన
విడువ నున్నవారు వీరవరేణ్యులు
శంక దక్కి యనికిఁ జనుము రామ. 14

వ. అనిన రామచంద్రుండు సంతసించుచు హనుమంతుం గాంచి
యి ట్లనియె. 15

—♦ హనుమంతుఁడు లంకావృత్తాంతము చెప్పుట ♦—

సీ. హనుమ లంకాపుర మరులకుఁ జొరరాని
దంటి కోట లవెన్ని యచటఁ గలవు?
వాని కెన్నిన్ని గవనులుండు నెందఱు
కావలివా రందుఁ గాంచియుందు
దండెంత యుండుఁ దత్పత్తనంబున నెన్ని
రాక్షసగృహములు గ్రాలుచుండు
యంత్రసామగ్రియు నాయుధసామగ్రి
యెంతమాత్రం బయి యెన్నఁ బడును

తే. జూచి యుంటి నీ వప్పురి చొప్పులెల్లఁ
జూచిన ట్లున్నయట్లు నేఁ జూచినట్లు

గాఁ దెలియు నట్లు చెప్పు మోగాలికొడుక !
యనవుడు నతండు రాముని కనియె నిట్లు. 15

క. కోటలు పేటలు వాటలు
మేటులగృహములును భటులు మిక్కిలియును సే
నాటోప మాదిగాఁ గల
పాటవ మంతయును దెలియఁ బలికెద వినుమా. 16

సీ. పగరకుఁ జొర రాని పత్తనం బది దాని
నాలుగుదిక్కులఁ నాలు గైన
పెద్దద్వారంబులు పెంపొందు వానికి
గడియమ్రానులు లోహకలితము లగు
ఘనకవాటంబులు గలిగి రథంబులు
హస్తులుఁ బోవంగ ననువుపడును
గవను లవి విశాలగతులఁ గ్రాలెడుయంత్ర
నివహంబులం గూడి నెగడఁ బడును

తే. అచట నచ్చట వేనవే లయినవీర
భటులు విడ కెప్పు డుండెద రటు నిటుఁ జన
కదటుగుండెల నొదవించు నది జనాళి
కరయ నరయంగ నప్పురం బవనినాథ. 17

తే. ఆహజారములకు ముందు నధ్వమందుఁ
దనరు పెద్దయగడ్తయు దానిమీఁద
యాత్రిఫలకంబు లమరింప నగుచు వలయు
నప్పుడుండును గానప్పు డవలఁ బోవు. 18

తే. అణువులం జేయఁ బడినయంత్రాళి యచట
నిలుపఁ బడియుండుఁ బురరక్షకులుపొంచెఁ
దెలియ వనశిలాజలదుర్గములు మఱియును
బ్రోలిచుట్టును గల వని పోలుఁదెలియ. 19

వ. లక్షోపలక్షలు రాక్షసవీరు లాలంకాపురంబున నానావిధాయుధ హస్తులై ప్రత్యక్షయమరాట్టులు నాఁజూపట్టుచుందు రాకర్ణింపుము.

సీ. పురముతూర్పుద్వారమునఁ బదివేవురు
వివిధాయుధంబుల వెలయుచుండ్రు
దక్షిణద్వారంబు దఱిని వీరాధివీ
రులు లక్షమంది పెంపలరుచుండ్రు
పశ్చిమద్వారంబు పజ్జ నానావిధా
స్త్రములతోఁ బదిలక్ష లమరి యుందు
రుత్తరద్వారంబునొద్దఁ గోటానఁగో
టులు మేటిరక్కసుల్ మెలఁగుచుండ్రు

తే. అట్టిలంకాపురముఁ జేర నరుగ నెట్టి
వానికి నసాధ్య మమరులుఁ దానిఁ జూచి
తలఁకుఁ గుడుచుచు నుందు రోతరణివంశ్య
రావణుప్రభావ మీరీతి తేవమీఱు. 21

శా. ఆలంకాపుర మేను గాల్చితి మహాహర్మ్యంబులున్ వప్రముల్
లీలోద్యానములున్ హజారములు నోలి న్నేలపా ల్సేసితిన్
గేలిం బోలె రణాంగణంబునను విక్షేపించి వృక్షాదులన్
వేలుం లక్షలు రాక్షసప్రవరులన్ విత్రస్తులం జేసితిన్. 22

మ. తెగియెంగోట లగడ్త లాయుధతతుల్ దీపించుసద్మంబులున్
గగనస్పృగ్వరణంబులున్ గృహములుఁ గళ్యాణవేదీస్థలుల్
సగబా ల్దక్కువ గాక యుండ గడెలో సర్వంబు నేఁ గూల్చితిఁ
సగబాల్ నాచెలికాండ్రు గూల్చెదరు ప్రస్థానంబు గావింపుమా.

క. ప్రతిగృహమునందు నగ్నుల
నతిభక్తిఁ వేల్చుచుందు రప్పురమందుఁ
బ్రతిగృహమున వేదంబులు
సతతము పఠియించు చుండ్రు శ్రవణసుఖముగఁ.

ఆ. ఆలకించి రాముఁ డడలు గుప్పిసమది
నదరుగుండెతోడ నాంజనేయ!
యీవు చెప్పినట్టు లేని నే రావణు
తోడఁ బోరఁ జాల నోడుదు ననె. 25

ఆ. అనుడు నాంజనేయుఁ డాలకింపుము రామ
దైత్యజాతి కెపుడు దయయు సత్య
శౌచములును లేవు సత్యము చెప్పితి
ననుడు నతఁడు శాంతి నంద నగుచు. 26

వ. చెంత నున్నసుగ్రీవునిం గాంచి రాఘవుండు వెండియు ను. 27

మ. విభవంబుల్ గలిగించు ఫల్గుని కడుల్ విశ్రాంతినిం గూర్చు మీ
యభిజిల్లగ్నమునం బ్రయాణము శుభప్రాప్తిం బ్రసాదించుఁ గా
న భవత్సేనల కెల్ల నీదినమునం బ్రస్థానముం దెల్పఁగా
సభ గావింతము మంత్రులంగలియుచున్ సన్మంత్రముం జేయుచున్.

మ. అని నీలుం గని రామభద్రుఁ డను నీలా సర్వసేనాధిపా
మన సేనం గొని ముందు నీవు చనుమా మార్గంబునం బండ్లు నీ
ళ్లును దుంప ల్లభియించునట్టి తెఱవుల్ శోధింపు మేలోయ నై
నను దుష్టాత్ములు గాచియుండెదరు విన్నాణంబునం బోవుమా.

వ. అని సుగ్రీవునిదిక్కు మొగంబై. 30

—♦ వానరసైన్యముప్రస్థానము గావించుట ♦—

సీ. గజ గవయ గవాక్షు లజితులు సేనాగ్ర
భాగమున మెలంగ వలయు నేర్చి
ఋషభుండు వానరశ్రేష్ఠుండు సేనకుఁ
గుడిప్రక్కఁగాచుచు నడువ వలయు
మదగజంబును బోలెఁ మనగంధమాదనుఁ
డెడమపార్శ్వంబున నెసఁగ వలయు
వెనుక సుషేణుఁడు వేగధర్ముండును
జాంబవంతుఁడు నుండి సాక వలయు

తే. నేను లక్ష్మణుఁడును నీవు సేననడుమఁ
జక్క నుండవు హనుమంతుఁ డక్కజముగ
నెల్లభాగములం జుట్టి యేగుచుండు
నట్టు గావిరప వలయుఁ బ్రయాణ మిపుడు. 31

వ. అనిరామచంద్రుం డాజ్ఞాపించిన సుగ్రీవుండు సర్వవానరసైన్యంబులకుఁ బ్రస్థానంబు ప్రకటించినంత నీలాభిరక్షితంబు లగువానరసైన్యంబులు లక్షోపలక్షలు దక్షిణదిశాభిముఖంబులై సింహనాదంబులు సేయుచుఁబయలుదేరె నందుఁ గుముద ఋషభ సుగ్రీవాంగదాదులు రామలక్ష్మణుల ననుసరించి రపుడు శతబలి యను వానరుండు పదికోట్లవానరసేనాసహాయుండై యుండెఁ గేసరి పనస గజాదులు నూఱుకోట్లసైన్యంబుతోఁ జనిరిసుషేణజాంబవంతులు పెక్కుఋక్షబలంబుతో సుగ్రీవుని ముందిడుకొని చనిరి సర్వసేనానాయకుం డగు నీలుండు నలువైపులం జుట్టి వచ్చుచు సర్వరక్షకుం డయ్యె దరీముఖ ప్రజంఘ రంభ రభసులు నీలునకుం దోడుచూపుచుండి రప్పుడు. 32

మానిని. ఆకపిసేనల కన్నిటికి న్నొగమై హనుమంతుఁడు పంతమునన్
గైకొని నిల్చెరఘూద్వహుఁ గొల్చుచుఁగైదువులంగొని యంగదుఁడున్
వీకమెయి ద్వివిదుండును మైందుఁడు నీలసుషేణనలాదులు న
స్తోకపరాక్రమ మేర్పడ నయ్యయి చోటుల నిల్చిరి మేటులుగన్. 33

వ. బలగర్వితు లగువారు కతిపయప్రయాణంబుల సహ్యపర్వత సమీపంబునకుం జని యం దుండుమలయపర్వతంబు మీఁదుగా సముద్రతీరంబున విశ్రమించి రపుడు రామలక్ష్మణ సుగ్రీవులు మలయంబునుండి మహేంద్రపర్వతంబునకుం జని దానిపై నధిష్ఠించిరంత. 34

—♦ స ము ద్ర వ ర్ణ న ము ♦—

సీ. ఒకచోటఁ జుక్క లింకొకచోట మగఱాలు
నొకచోట నుఱుము లింకొక్కచోటఁ
దరగలరాపిడిం బరఁగినఘూర్ణిత
మొకచోట మోఱుము లిం కొక్కచోట

నురుగు లింకొకచోటఁ జరియించుమేఘము
లొకచోటఁ గరడులయుచ్ఛ్వలనము
లొక్కదిక్కున దోఁకచుక్కలు వేఱొక్క
దిక్కునఁ బెనుబాము లక్కజముగఁ

తే. గానవచ్చుట నంతము కానరామి
సిద్ధ యిది యని చెప్పఁగా నేఱుపడక
యాకసంబు సముద్రము నేకరీతిఁ
జూపరుమనంబు లెంతయుఁ జూఱఁ గొనియె. 35

వ. అట్టిమహార్ణవంబు దరియ వచ్చి రామచంద్రుండు సేనల నిలువరింప నీలు నియోగించుటయు నతం డెల్లవానరుల నొక్కప్రక్కను గోలాంగూలంబుల నొక్కప్రక్కను భల్లుకంబుల నొక్కప్రక్కను నిలువ నియమించె నపుడు మైందద్వివిదులు చుట్టునుం దిరుగుచు సేనలం గాపాడుచుండిరి రామలక్ష్మణులు సుగ్రీవహనుమత్సహాయంబున సముద్రతీరంబునఁ గుశాస్తరణంబుల విశ్రమించి రంత. 36

—♦ సూ ర్యా స్త మ య వ ర్ణ న ము ♦—

క. నిజవంశజుఁ డగు రాముఁడు
రజనిచరాహృత సతీవిరహాపీడితుఁడై
వృజినము లొందం గాంచుటఁ
వృజినం బని తరణి చనియె వెసఁ బడమటికిన్. 37

తే. తనకు నాగ్నేయధర్మంబు దారసించు
దిష్ట మది గాన నప్పుడు తిగ్మరశ్మి
యూర్ధ్వగతి నొందె నసఁ గిరణోచ్ఛ్రయంబు
మీఁదుగాఁ బ్రాఁకు మిక్కిలి మిన్ను ముట్టె. 38

మ. ఇనుఁడై భూరివసుప్రభాకలితుఁడై శ్రీశుండునై యుల్లస
ద్ఘనతేజంబున నొప్పునారవియు నాత్రిం బంది యాత్మాంశు లఙ్
తనుసంజాతులఁ జెట్లపా ల్పఱచి సంధ్రిం బందుఁ గూలుం గటా!
కనుఁగొ నెంతటివారికైనఁ జనునే కాలావధిన్ మీఱఁగన్. 39

తే. రజనిసతి వల్లభుం డైనరాజు రాక
తడసె నని స్రుక్కి వ్రత మూని కడునయమున
నింగి యనుపాలవెల్లికి నిలువఁ గట్టు
కలువపూ లనఁ దారకల్ వెలిఁగె నపుడు. 40

చ. లలిఁ జనునాకసం బనుపొలంబునఁ బంటమొగంబుగాఁ బసం
జెలఁగుచు వ్రాలుచుక్కవరిచేలను గోయఁగ నెంచి ము న్నినుం
బొలియిడి రాగరక్త మటు వోయుచుఁ గాలజఘన్యజుండు కై
నిలుపులవిత్రమో యన జనించెను జందురువంకచూడఁగన్. 41

తే. రజతభూధరాదులను నిరాకరించి
నీరజాండభవాండంబు నించి దిశల
ముంచి ధరణీతలం బాక్రమించి మించెఁ
బండువెన్నెల కన్నుల పండు వగుచు. 42

వ. ఇట్లు రాత్రిపడిసంత శ్రీరామచంద్రుండు జానకీవియోగభరం
బునఁ బరితపించుచుండె నిట్లుండ నక్కడ రావణాసురుండు హను
మంతుండు వచ్చి లంకఁగాల్చి పోయినందుల కెంతయుఁ జింతిం
చుచు నిండోలగంబునకుం జని మంత్రులం గాంచి యి ట్లనియె. 43

—♦ లంకలో రావణుఁడు మంత్రులతో నాలోచించుట ♦—

ఉ. వానరమాత్రుఁ డొక్కరుఁడు వచ్చి పురంబునఁ జొచ్చి చైత్యముల్
మానక రాచి తోట మటుమాయముగాఁ బడఁ ద్రోచి యక్షము
ఖ్యానుచరాళిఁ గూల్చి పుర మంతయుఁ గాల్చి గమించె నెవ్వరున్
వానికిఁ జాలనట్టి రని భావము సేయఁగ వచ్చె నా కయో. 44

ఆ. వానిఁ బోలినట్టివారు పెక్కండ్రు
మట్టుమీఱినట్టి బెట్టిదంపుఁ
గర్జముల నొనర్చుకపిముఖ్యు లందఱుఁ
గలసి వచ్చినప్డు గతు ల వెట్లొ. 45

తే. అట్టి వానరసైన్యము నారఘుపతి
కోటు లర్బుదములు గాగఁ గూర్చుకొని స

ముద్రతీరమునకు వచ్చి భద్రగతులు
సెలఁగ నుండె నటం చిప్డు తెలిసె నాకు. 46

వ. ఘోరాస్త్రంబులు వైచి సముద్రంబు నింకించి కాని వంతెనలు వైచి కాని దాఁటి వచ్చి లంకాపురి ముట్టడి వేయం గలఁ డని తెలియుచున్నది. 47

తే. బుద్ధిమద్వరు లైనమీ రిద్ధకార్య
మరసి వచియింపుఁ డెట్లు చేయంగ మేలు
గలుగునో యట్లు చేయంగఁ దలఁతు ననుచుఁ
దనవిషాదము వెలిబుచ్చె మనము దలఁక. 48

వ. అట్టిపఙ్క్తికంఠునిం గని కొందఱు రాక్షసప్రవరు లి ట్లనిరి. 49

తే. గదలు కత్తులు శూలముల్ ఖడ్గములును
బరశువులు భిందివాలముల్ పట్టసములు
మొదలు గాఁగలనాయుధములనుఁ దాల్చి
లక్షలును కోట్లు సైనికుల్ గలరు నీకు. 50

సీ. భోగవతీపురంబున కేగి భుజగులఁ
గూల్చి వచ్చితి వీవు కొంతలోన
నలకాపురిఁ గుబేరు నంతలోనం గెల్చి
తద్విమానముఁ గొంటి దర్పమునను
మయుఁడు నీధాటికిఁ బయిలోడి మందోద
రినిఁ దెచ్చి నీ కిచ్చి ప్రీతి కయ్యెఁ
గుంభీనసీపతి క్రొవ్వి మధుఁ డెదిర్చి
దాసోఽహ మని నిన్నుఁ దరియ వచ్చెఁ

తే. గాలకేయులు వరగర్వకలితు లగుచు
వర్షకాలము నీతోడఁ బ్రబలరణము
సలిపి నీకు లోఁబడిపోయి రలఁతి వారొక్క-
వానరులు నరు లొకలెక్క-వారె నీకు. 51

చ. వరుణునికాలపాశమును వట్టిది చేసితి వగ్ని దేవు నీ
శ్వరుఁ బవనుక్ మధించి కొని వచ్చితి వింటిపనుల్ పొనర్చ ని
ర్జరపతి నోర్చి వాని కగుసర్వముఁ దెచ్చితి విచ్చ బెంపునన్
నిర్ఋతిసుతున్ గలంచితివి నెమ్మది నీ వనఁగా నలంతివే. 52

చ. ఎసకమెసంగ సంయమని కేగ యముం డరుదెంచి దండమున్
విసరిన దానిఁ బట్టుకొని వీసరవోవక వాని గిట్టి పై
నసురుసురంచు మిత్తి వెనుకాడఁగ మొత్తి జయించి భృత్యులక్
బసు లటు పాఱఁదోలితివి బ్రహ్మకులోద్భవ! నీ వలంతివే. 53

తే. ఇంద్రునిం బట్టి తెచ్చి నీయింటఁ గట్టి
యింద్రజి త్తనుపేరంది యెసకమెసఁగు
కొడుకు నీ కగు నాతఁ డొకొండ నీదు
కార్యముల నెల్ల సాధింపఁ గలఁడు సువ్వె. 54

—♦ రావణునితో రాక్షసులు తమతమప్రభావములఁ జెప్పుకొనుట ♦—

చ. అపుడు ప్రహస్తుఁ డిట్లనియె నంజలి సేయుచు రాక్షసేశ్వరా!
నృపు లన నెంత వేలుపుల నెల్ల జయించిననీకు మొన్ననా
కపి ప్రజ లేమటిల్లుతఱిఁ గాలిచిపోయెను లంక నంటి వే
నిపు డరుదేర వాఁడుఁ బెర లేమయి పోదురా చూతు రావణా. 55

క. నా కానతిమ్ము జగమం
దేకడ నున్నట్టికపుల నెల్లర బల్మిం
గైకొని వచ్చెద పేరే
లేకుండఁగఁ జేసి వత్తు లేఖద్వేషీ. 56

తే. దుర్ముఖుం డను నొకకోఁతి తోడరి వచ్చి
మనకు నవమాన మొనరించె మానసంబు
గలిగి మన మూరకుండుట కాదు నన్నుఁ
బుచ్చు మేఁ బోయి వానిని బొకడంతు. 57

తే. వజ్రదంష్ట్రుఁడు పలుకు నే వానిఁ బట్టి
బిట్టు వైతును ననుఁ బంపవే యనంగఁ

గుంభకర్ణునిసుతుఁడు నికుంభుఁ డేను
గవులతోఁ బట్టి రామలక్ష్మణులఁ గూల్తు. 58

వ. మఱియు వజ్రహనుఁడు నికుంభుఁడు రభసుఁడు సూర్యశత్రువు యజ్ఞఘ్నుఁడు మహోదరుఁ డగ్నికేతువు రశ్మికేతువు విరూపాక్షుఁడు వజ్రదంష్ట్రుఁడు ధూమ్రాక్షుఁడు దుర్ముఖుఁ డతికాయుఁడు లోనగువారు ధనుర్బాణ తూణీరపాణులై శస్త్రాస్త్రంబులు ధరించి రామ లక్ష్మణ సుగ్రీవ హనుమ దంగద జాంబవదాదుల నెల్ల నల్లంతన వధించి వత్తు మని యుద్ధసన్నద్ధులై రవుడు వారి నందఱఁ గూర్చుండఁ బెట్టి విభీషణుండు చేతులు జోడించుకొని రావణున కిట్లనియె. 59

—♦ విభీషణుఁడు రావణునకు నీతిఁజెప్పుట ♦—

సీ. అన్న ! నామాటలకు నాగ్రహింపక విన్ము
సామదానంబులు సాఁగకుండ
మునుమున్న దండంబు పొనరించుటొప్పదు
బుద్ధిమంతుం డైనపూరుషునకు
మనవారు వీరు రాముని వధించెద మని
పలుకు చున్నా రది తలఁచి చూడ
సాధ్య మంచుఁ దలంప సామర్థ్య మెఱిఁగిన
వా రట్లు పలుకరు వజ్రహస్తుఁ

తే. డైన రాఘవు నెదిరింప నడలు గుడుచు
ఖరుని దూషణుఁ దా నేయుకథ లెఱిఁగిన
నాతఁ డెట్టిపరాక్రమాన్వితుఁ డగునొ
తెలియ వగు రాముకడ మోస సలుప లేరు. 60

క. మేమే బలవంతుల మని
మాముందర నిలుచువాఁడు మహి లేఁ డని లో
సామాన్యు లెంతు రధికులు
షే మెంతని యెఱఁగి యుంద్రు మీఁదు లరయుచున్. 61

తే. హనుమ దీనికిఁ దార్కాణ మలఁతి వోలె
నుండి పురుషమాత్రుఁడైన కేరికి నొదుగఁ బడని
దుష్కరం బగుకార్యము తొడరి చేసె
నాతఁ డెంతటి వాఁడొ లో నరయ వలయు. 62

మ. హనుమం బోలినవారు వానరబలం బం దెందఱో యున్నవా
రని వింటిన్ దురమైన నె ట్లగునొ దైవాయ త్త మెట్లుండు వా
కొన నే ర్చేతురు నానుడుల్ వినుము నీకుం గోరి నేఁ జెప్పెదన్
వనితన్ సీతను గొంచుఁ బోయి హరి కీఁ బ్రార్థింతు నోయగ్రజా.

తే. రామబాణాగ్ని లంకపై వ్రాలకుండఁ
బుత్రమిత్రప్రభృతు లెల్లఁ బొలియకుండఁ
సీత రామున కర్పించి పూతుఁడ వయి
కులము రక్షించుకొను మన్న! కొతుక కన్న. 64

ఉ. అన్న ! విదేహరాజతనయామణి వచ్చినదాది లంకలో
నెన్నియొ దుర్నిమిత్తము ల వెప్పటికప్పుడు తోచుచుండె నీ
వెన్నఁడు లేనివైఖరి వహించితి వెట్టిశుభం బొకప్పుడున్
గన్నులఁ జూడ వచ్చుగతి గల్గకయున్న దిఁ కేమి చెప్పుదున్. 65

—♦ రావణాదులు విభీషణుని నిరాకరించుట ♦—

క. నావుడు రావణుఁ డి ట్లను
నీ వి ట్లిఁక నెపుడు పలుక నెంచకుము జయ
శ్రీ వెలయు నేను గొండొక
దేవుని నే సరకుగొనమి తెల్లమ కాదే. 66

వ. అంతలో నిద్రనుండి లేచి వచ్చియున్నకుంభకర్ణుండు రావణుం
గాంచి యి ట్లనియె. 67

శా. ఆలోచింపక యెట్టికార్యమును జేయన్ రాదు మాతోడ నీ
వాలోచించి పొసర్చినట్టియది గా దాజానకిం దెచ్చుటల్
శ్రీలన్ బాంపిరివోవునీ వొకనరస్త్రీఁ గోరుటల్ విస్మయం
బేలో నీమది యిట్టినీచకృతి కయ్యెన్ దయ్యపుంజెద్దమై. 68

క. కానిమ్ము వగవ వలవదు
నే నుంటిని రాముఁ డాజి నినుఁ గనఁ జాలం
డీనన్నుఁ దాఁకి రాముఁడు
గానీ గీముండు గాని కలఁడే బ్రతుకన్. 69

తే. అన మహాపార్శ్వుఁ డనియె నోదనుజనాథ
సామ మని దాన మని యిప్డు చదువ నేల
తెచ్చితివి సీత నీయిచ్చ వచ్చునట్లు
మెలఁగు మెవ్వఁడు ని న్నోర్వఁ గలిగియుండు. 70

వ. అనిన రావణుం డౌఁ గాత మని వాని మెచ్చుకొనుచుండ విభీష
ణుండు వెండియు. 71

ఉ. వాలముఁ జేతఁ బట్టి నిను వార్ధుల నన్నిట ముంచినట్టి యా
వాలి నొకమ్మునన్ ధరణి వ్రాలఁగఁ జేసిన రాముచెంత నీ
వాలమునందుఁ గూలుదు వి దంతయుఁ దప్పదు నమ్ము మిప్డు డీ
ప్రేలెదువీంద్రమాట విని పేర్మిని గోల్పడఁ బోకు మగ్రజా. 72

వ. అని మంత్రి యగుప్రహస్తునిం జూచి నీవు నీకుంభకర్ణేంద్రజిన్మహా
పార్శ్వ మహోదర కుంభ నికుం భాతికాయ ప్రభృతు లెవ్వరు
నారాముని మ్రోల నిలువం జాలరు మంత్రి యగువాఁడు మంచి
మంత్రంబు చేయ వలయును గాని దుర్మంత్రంబు చేసి ప్రభువుల
భంజించుట పోలియుండ దిట్లు పోరికిం బ్రేరేచిననిన్ను మునుము
న్నారఘుపుంగవుం డెదిరించి నొంచినప్పుడు నీవు వెన్నిచ్చి. 73

శా. పాతాళంబునఁ దూఱినన్ మఱి నభోభాగంబునం జేరినన్
స్ఫీతాంభోనిధి డాఁగినన్ దెసల కుద్వేగంబుమై నేగినన్
భూతేశప్రముఖామరేంద్రులభయంబు న్నీకు సంధించినన్
బ్రేతాధీశున కిల్లటం బ వయి పోవే తత్ఫలం బందఁగన్. 74

క. అనఁ బ్రహస్తుం డను నిం
దున్నన కేనియు జంక మేము తొడిఁబడి నీ వి

ట్లను వఱిఁబై వచియింతువు
నిను సేమనఁ గలము ప్రభువు నీ భ్రాతఁ గదా. 75

సీ. అపు డింద్రజిత్తు క్రోధారుణనేత్రుఁడై
యును విభీషణుతోడఁ గనఁగ నీవు
ఘనపులస్త్యాన్వయమునఁ బుట్టియును శౌర్య
ధైర్యముల్ విడనాడి దద్దమ వయి
పిఱికితనంబునం బే రెన్నికం గన్న
నీ విట్లు బెదరింప నేర్చి తకట
చిఱుత న న్గనినంత వెఱచి యింద్రాదులు
వలసలు దీసినవార కారె

తే. మనుజమాత్రులు రామలక్ష్మణు లనంగ
వారి నని గెల్చు టది యెంతపాటి మాట
నలిపివైచెద నల్లుల నలిపినట్లు
రామలక్ష్మణులన్ రణరంగమందు. 76

వ. అనిన విభీషణుండు. 77

ఉ. కొండిక వీవు రావణునకుం గొడుకై ప్రభవించినట్టి శ
త్రుండవు నీ కొకండయినఁ దోపదు సూహము పిల్లకాకి లో
నుండెలుదెబ్బ నెగ్గికొనకుండెడునట్లు మెలంగుచుంటి నీ
మొండితనంబు మాని మము బోటుల మాటలు పాటి సేయుమా.

తే. తండ్రి! తండ్రికిఁ జెప్పి సీతకు ననేక
మణివిభూషణములు పెట్టి మాన్యచరితుఁ
డైనరామున కర్పించునట్లు చేయు
మందునన్ రాక్షసాన్వయ మొందు సుఖము. 79

— రావణుఁడు విభీషణుని వెడల నడచుట —

వ. అని పలుకుచున్న విభీషణునిహితవచనంబులు విన నొల్లక గర్హించుచు మృత్యుప్రేరితుండై రావణుం డిట్లనియె. 80

శా. నా తోఁబుట్టువవై సమస్తసుఖముల్ నాతోడనే పొందుచున్
ఖ్యాతిం గాంచిననీవు జ్ఞాతి వగుటన్ నాయందు విద్వేషమున్
జేతోవీథి వహించి యుంటివి నీ చెయ్వుల్విచారించితిన్
"జ్ఞాతి శ్చే దనలేన కి" మ్మనెడుశాస్త్రం బయ్యె సత్యంబ మై.

సీ. శత్రువుతో నైన సంధించి యుండ నౌ
శత్రుపక్షముఁ జేరి మిత్రునివలె
నుండు నాతనిఁ గూడి యుండరా దెప్పుడు
దాయాదుఁ డధికుఁడై తనరుచున్న
దాయాదుఁడోర్వఁడు తఱి వేచి పరునిచే
భంజింప నెంచు నాపరమనీచు
నమ్మి ప్రవర్తించినన్ హాని వాటిల్లు
మిత్రరూపుఁడ వైనశత్రు వీవు

తే. సాధనాంతరములఁ బట్ట సాధ్యపడని
మదపుటేనిక వేటకాఁ డద నెఱింగి
మదపుటేనికచేతనే మాటి పట్టి
నట్లు ననుఁ బట్ట సాధన మగుదు వీవు. 82

వ. కావున నీపొత్తు నా కహితోడిపొత్తు వంటిది కావున నీవు నాకడ నుండనొప్ప దొండుకడకుం బోవు మని రూక్షాక్షరసమన్వితంబుగ శాసించె నంత విభీషణుండు చేయునది లేక తక్షణంబ నల నీల హిత సంపాతు లనునలువురమంత్రులతోడ నుడ్డీనంబు గావించి పైనుండి రావణుం దిలకించి యి ట్లనియె. 83

ఉ. అన్నవు గాన నీకు నగునాపద యిట్టి దటంచుఁ జెప్పితిన్
న న్నొకశాత్రవుం బలె మనంబున నెంచుచుఁ జెందనాడితో
సన్నుతమూర్తి ! నే నిదె నిజప్రతిపక్షముఁ జేరఁ బోయెదన్
మన్నఁ దలంచి రామసతి మన్నన సేయుచు నిచ్చి పుచ్చుమా. 84

వ. అని పలికి కొలువుకూటంబు విడిచి చనియె నంత నక్కడ సర్వ వానరసేనాంతికగతుం డగురామచంద్రుండు సుగ్రీవుం జూచి యి ట్లనియె. 85

—♦ శ్రీరాముఁడు సముద్రము దాఁటఁ బ్రయత్నించుట ♦—

క. జడనిధి దాఁటునుపాయము
పొడకట్టదు మనబలంబు భూమిష్ఠంబై
యడరెడుఁ గడలియు మిక్కిలి
పొడుగై కనుపించు మిన్ను ముట్టి కపీంద్రా. 86

వ. అని పలుకుచున్నసమయంబున. 87

ఉ. కొండ ఱి దెంతపాటియది గోష్పద మట్టులు దాఁటి పోవ నా
నిందఱ కంచుఁ బల్కి రొకయింతటిలో మఱికొంద ఱీది పో
వందగుఁ దెప్పలం గొని జవంబున నంచు వచించి రంతలోఁ
గొందఱు నావలం గడచికొంద మటంచు వచించి రంతటన్. 88

సీ. అనవుడు రఘురాముఁ డనియె మీామీామాట
లెల్లఁ జెల్లవు వినుఁ డెల్లవారు
శతయోజనంబులు మితిగలమున్నీరు
కడచనుట కడిందికర్జ మరయఁ
గలములుం దేపలు బలగంబులకుఁ జాల
సమకట్టు టరిది యీాసమయమందు
గలయోడ లన్నియుఁ గైకొన్న వణిజుల
కుపఘాత మగుటొం డగుం దలంప

తే. మఱియు నీర్వామిలో నిట్లు మన మరుగుట
తెలిసి వైరులు నుగ్గాడఁ గలరు గాన
నొప్పదిటులే నొకయుపాయ మిప్పు డెడఁద
నెఱిఁగికొంటిని మీార లిందఱును వినుఁడు. 89

మ. ఉపవాసవ్రత మేను బూని నియమం బొప్పన్ సరస్వంతునిం
గృపఁ బుట్టంగ భజించి వేఁడెదను నా కీతండు తె ర్వొచ్చు నీ
కుపరోధించినయేని మామకములై యుగ్రంబులై కల్పవ
హ్నిపటిష్ఠౌజము లైనబాణముల నే నింకింతు నొక్కుమ్మడిన్ 90

వ. అని పలికి సానుజుండగు రాముండు జలోపస్పర్శంబు చేసి కుశ
సంస్తరణశయనుండై జలనిధిం బ్రార్థించుచు. 91

—♦ శ్రీరాముఁడు సముద్రుని బ్రార్థించుట ♦—

శా. మావంశంబున నైనసాగరుల పేరిమన్ నీవు దీపించుచున్
నూవాఁడైతివి నేను నీకుఁ దెలియన్ బంధుత్వముం గొంటి పా
రావారంబ! రఘుప్రవీరుఁడను శ్రీరామాఖ్యుఁడన్ లంకకుం
బోవం గా నిటు వచ్చినాఁడ ఖలులం బోకార్చు కార్యంబునన్.

సీ. ఇంద్రునంతటివాని కీవు గోదానాది
దానముల్ చేసినదాతృమణివి
వేల్పుల కాఁకలి వేయకుండఁగ నెప్పు
డన్నదానము చేసినట్టిఘనుఁడ
వాలుబిడ్డలు లేమి నల్లాడుదామోద
రునకుఁ గల్ములబోఁటిఁగొన నిడితివి
కఱకంతునకు నెప్డు కాఁక రా కుండఁగఁ
జలువలఱా నెత్తి నిలిపి తీవు

తే. ఉదకదానము చేయుచు నుందు ఘనులు
కెపుడు పానీయశాలవై యిట్టి నీవు
వేడుచుంటిని లంకకు వెడలునాకుఁ
దె న్నొసంగుము కరుణమై సన్నుతాత్మ. 93

క. రావణునిఁ జంపుకార్యము
దేవతలకుఁ గాక యెల్లదేశంబులకున్
భావింప నిష్టమైనది
కావునఁ బోఁ దెరువు సూపఁగాఁ దగు మాకున్. 94

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండు గామిఁ గుపితుండై రాఘవుండు
విల్లమ్ము లంది పుచ్చుకొని లక్ష్మణుం గని. 95

—♦ శ్రీరాముఁడు సముద్రునిపై బ్రహ్మాస్త్ర మడరించుట ♦—

తే. ఎంత ప్రార్థించినం గాని పంతగించి
నట్లు మిన్నులు ముట్టి నీయబ్ధి వీని
త్రుళ్ల డంచెద నిప్డు నాదోర్బలమున
ననుచు బ్రహ్మాస్త్ర మరిఁ గొనె నట్టియెడల. 96

మ. ధర గంపించెఁ బయోఘలుం గలఁగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె ది
క్కరులున్ మ్రొగ్గెననంతుఁడుం బడియెఁ జిక్కల్ రాలె భూమీధ్రముల్
విరిసెన్ విష్ణుపదంబు వ్రేలిపగిలెన్ వేవెల్గు రేవెల్గునుం
దిరమేదం గతి దప్ప రెల్లకడలం దీపించెఁ బెంజీఁకటుల్. 97

వ. అంత సరస్వంతుండు నత్యంతసాధ్వసంబున గడగడ వడంకుచు
రామునకుం బొడసూపి యి ట్లనియె. 98

శా. నీ విక్ష్వాకుకులోద్భవుండ వగుటన్ నీజ్ఞాతి నోతండ్రి! నే
నీవేళన్ బొసరించుకార్యమది యేదీ నాకు వా కిమ్ము నా
నావీరాగ్రణి సంతసించి యను మా కారావణుం ద్రుంపఁ బో
భావం బయ్యెను మార్గ మిమ్ము కరుణాస్వాంతుండ వై సాగరా. 99

తే. ఇడక నాప్రార్థనముఁ ద్రోసి యేయు దేని
నాదుదివ్యాస్త్రమున నిన్నుఁ బాదుతోడ
నెండిపోఁ జేయుదునుఁ జూడు మిపు డనంగ
నుదరిపడి మ్రొక్కి యి ట్లను నుదధి మఱియు. 100

సీ. రామ! నే నీకంతరాయంబుఁ దలఁపను
గాని నాచెప్పెడిదాని నరసి
పోలినట్టుల చేయఁ బూనుము నీకు నేఁ
దెరు విత్తు నే నిట్లు తెగువఁ జేసి
లాఁతివాఁడును నన్ను లాఘవంబునఁ జూచి
శరబలంబున నాజ్ఞ సెఱపఁ బూను
వినుము మీలోఁ గపివీరుఁడు నలుఁ డనఁ
గలఁ డొక్కరుఁడు విశ్వకర్మసుతుఁడు

ఆ. వాఁడు శిల్పవేది వసిం దరుల్ గిరులును
వైవఁ దాల్తు నేను వారధి యన
నది యెసంగు నందు నరుగ మీకగు నని
యొడఁబడంగఁ జెప్పి వెడలె నతఁడు. 101

క. అరివోసినదివ్యాస్త్రము
సరిత్పతినఁగి విడిచెను సాగరమున నా
మరుభూమిఁ బడఁగ నిమ్మది
కరమరుదుగఁ గూల్చె నచటిఖలు లగుజనులన్. 102

సీ. రఘుకులతిలకుండు రాముఁ డంతట సాగ
రోపదేశంబును సోదరునకుఁ
జెప్పి మహాకార్య మిప్పుడు చేయంగ
నుంటిమి గాన నియ్యుర్వియందు
విఘ్నేశ్వరుని నిల్పి వేఁడుద మవ్వల
గ్రహములపూజయుఁ గాఁగ వలయు
నన చెప్పి చెప్పిన ట్లటఁ బూజ గావించి
నలునిఁ బిల్వం బంచి పలికె నిట్లు
తే. విశ్వకర్మసుతుండవు విశ్వవినుత
కీర్తి వీవు సేతువు గట్టనేర్తు వనుచుఁ
దెలిసెఁ గావున వానరావళులఁ గొనుచు
నీరువామిపయిం బాట నిలుపు మిపుడు. 103

—♦ నలుఁడు సేతుబంధము గావించుట ♦—

వ. అని నియోగించిన నతండు దేవరయాజ్ఞ యని వానరులం బిలిచి మీ రెల్లరు నెల్లకడలం గల చెట్లు చేమలు గట్లు లోనగునవి కొనితెం డని నియోగించి తాను నిర్మాణంబునకుం బూని దశయోజనవిస్తృతియు శతయోజనాయతంబు నగుమహాసేతువు మొదటిదినంబునఁబదునాలుగు యోజనంబులును ద్వితీయదినంబున నిరువదియోజనంబులును దృతీయదినంబున నిరువదియొక యోజనంబులును జతుర్థదినంబున నిరువదిరెండు యోజనంబులును

బంచమదినంబున నిరువదిమూఁడు యోజనంబులుగ సువేలాద్రి
వఱకును మహాసేతువు నిర్మించె నదియును. 104

మ. కుడిచేతన్ మఱి యెడ్మచేతఁ గొని పెక్కుల్ తాలునుల్ అప్పలున్
బెడగొండల్ విడి చెట్లు చేమలును వేవే తెచ్చి యీ యన్నలుం
డెడయింతేనియు లేనిచందమున నాయెల్లన్ సముద్రింబునం
దిడి తేలించుచుఁ గట్టె సేతువు జగం బెంచగ నంచద్గతిన్. 105

తే. వేలుపులు దాని మెచ్చి రవ్వేళ నద్ది
గగనమందునక్షత్రమార్గంబు స్వాతి
మార్గమనునది దీపించుమాద్రిఁ గడలి
మీఁద సేతువు దీపించె మోద మిడుచు. 106

వ. అట్లు సేతునిర్మాణ మయినపదంపడి. 107

చ. తెలిసిన నౌ నటంచుఁ దలఁ ద్రిప్పక ముప్పుఘటిల్లఁ జేయున
త్తులువను రావణాసురునిఁ దో డని యెంచక వీడి పోడిమిన్
నలువురు మంత్రిలుం దనకు నాలుగుచేతులుగా నెసంగ రా
ములఁ గన వచ్చె నిచ్చ గుణభూషణుఁడైన విభీషణుం డటన్.

ఉ. ఆకసమందు నట్టునిటు లాడుచు వానరసేనఁ జేరుచున్
నాకవిరోధివర్గమునయం దగువా రని వానరోత్తముల్
వీఁక మెయిన్ దలంచుచును వీసరపుత్త్రుఁరో రాము నత్తుకో
నీక విరోధకార్యము లనేకములన్ బచరించి పుత్త్రురో. 109

—♦ విభీషణుండువచ్చి రాముని శరణుఁ జొచ్చుట ♦—

వ. అని విభీషణాదులు వారిలో వారు డోలాయమానమానసులై
నడయాడుచున్నంత సుగ్రీవుండు చూచి హనుమదాదివానరవీరులఁ
జేరి వారికి వారిం జూపుచు నిట్లనియె. 110

మ. అదె నక్తంచరు లేగుదెంచెదరు దివ్యాస్త్రంబులున్ శస్త్రముల్
గుదెలుం గ్రాలఁగ హస్తియుగ్మములఁ బేర్కో వీరు రక్షోధిరా
ట్పదమందుండెడివారు శాత్రవులు చంప న్నొంపఁగా నిట్లు వ
చ్చెద రంచున్ దలపోయుచుంటి నన నాఁ చిత్తభ్రమం బందుచున్.

ఆ. నేల నదుగుపెట్టనీ కింతలో వారిఁ
గూల్చి పుత్త మనుచుఁ గొంద ఱనుచుఁ
జెట్లు గట్లు పూని చెలరేఁగునంతలో
దిగిరి వారు కంధితీర మందు. 112

వ. దిగి దిగునంతలో వానరులు వచ్చిపడి ప్రహరింతు రనుభయంబున విభీషణుం డుచ్చస్వరంబున నెల్లవారు విన ని ట్లనియె. 113

శా. సీతాహర్తకు రావణాసురునకేఁ జెప్పంగ నేఁదమ్ముఁడన్
సీతన్ రాముని కొప్పఁ జెప్పు మనుచున్ చెప్పంగఁ బో నంతలో
నాతోడం గలహించి పొమ్మనుచు గెంటన్ వచ్చితిన్ రామునిన్
జేతోవీథి భజించుచున్ శరణమున్ జేకోఁగ వాంఛించుచున్. 114

క. నేను విభీషణనాముఁడ
దానవకులమందుఁ బుట్టి దర్పముతోడన్
గానఁబడుచుండు వాఁడన
మైనన్ వచ్చితిని రాము నర్థింపంగన్. 115

వ. శ్రీరామచంద్రునకు విన్నవించి నన్నుద్ధస్యం జేయుం డనిన సుగ్రీవుండు లక్ష్మణసమేతుం డగు రామచంద్రునికడకుం జని యి ట్లనియె. 116

ఉ. రావణుతమ్ముఁ డట్టిఁ డఁట రామవిభున్ శరణంబు వేఁడెనో
భావముచేసి వచ్చె నఁట భ్రాతృబహిష్కృతుఁ డంట వచ్చెనో
దేవ! విభీషణుండ నని తెల్పుచు నుండె ననుగ్రహింతువో
దేవవిరోధి యంచుఁ దెగదెంపులు చేయన లోఁ దలంతువో.

సీ. మాయావు లగువారు మాఱువేషంబుల
నెన్నేనిమాయలు పన్న నేర్తు
రీతఁడు మన కరివాత్రమునందగు
వాఁడు రావణునకు వీఁడు భ్రాత

యన్నచేఁ బ్రేరితుఁడై వచ్చియుండును
బరబలాబలముల నరయుపొంటె
నే మఱిల్లితి మేని యేమేని గావించి
పోయిన పోవు నేపూటఁ గాని

తే. శత్రుపక్షమువాఁ డౌట జానకీశ!
వీని నమ్మినయేఁ బ్రాణహాని వచ్చుఁ
గావున న్వీని శిక్షింపగాఁ దలంచు
టే వరం బంచు నెంచెద నే నెడంద. 118

మ. అనినన్ రాముఁడు వానరాళిదెస మోమై చెప్పె సుగ్రీవుఁ డీ
ర్వినియున్నారు స్వకార్యమం దెవరికిన్ విశ్వాస ముండంగఁ బో
దని మి మ్మీవిషయంబునం దడుగుదున్ వ్యాఖ్యానముం జేయుఁ డం
చనుడున్ వాలికుమారుఁ డంగదుఁడు యోధాగ్రేసరుం డిట్లనున్.

ఆ. ఈవిభీషణుండు రావణుకడనుండి
వచ్చినట్టివాఁడు వానిపట్ల
సంశయించు టొప్పు స్వాంతమునన్ నమ్మి
జేరఁ దీసికొనినఁ జేటు వచ్చు. 120

వ. అంత నీతిశాస్త్రవిచక్షణుం డైనజాంబవంతుండు రామునిం గని.

ఆ. వైరియొద్దనుండి వచ్చె నకాలము
నం దితండు రాక్షసాన్వవాయ
మందు నైనవాఁడ యగుట సందేహము
పొందుచుండె నాదుడెంద మిపుడు. 122

వ. అంత నాంజనేయుండు ముకుళితకరకమలుం డై. 123

సీ. విమతభీషణ! యీవిభీషణుఁ డిందఱు
చెప్పినచొప్పున నొప్పుననుచు
నేనుఁ జెప్ప నకాల మీతఁడు రాలే దే
జెంగియె వచ్చె నీచెంగటికిని

సీతఁ దెచ్చుట తప్పు చెచ్చెరఁ గొనిపోయి
శ్రీరామమూర్తి కర్పింపు మనుచు
చెవులు చిల్లులువోవఁ జెప్పు నన్ను కితండు
దాన నాతఁడు వీనిఁ దరిమి వేయ

తే. వచ్చె నీపాలిఁ జేర నం చిచ్చ నెంతు
న న్నపుడు వాఁడు చంపుఁ డనంగ నితఁడు
తగ దనుచు నడ్డుపడి మాన్చె దైత్యుఁ డైన
దైవతుల్యుఁ డటంచు నేఁ దలతు ననఘ. 124

వ. అని చెప్పిన రామచంద్రుండు వానరేంద్రుం గాంచి యి ట్లనియె.

—♦ రామచంద్రుఁడు విభీషణుని బరిగ్రహించుట ♦—

మత్త. ఈవిభీషణుఁ డాహ్వయంబున నే విభీషణుఁ డీతఁ డా
రావణానుజుఁ డైన రాక్షసరాజవంశజుఁ డైన నిా
గావుమం చరుదెంచె నీతనిఁ గాచిపుచ్చుట పోలు నా
భావముం శర ణన్నవారల పట్లఁ బ్రోవఁగ నుండెడిన్. 126

సీ. శరణాగతునిఁ బ్రోవ సమకట్టెడువ్రతంబు
కలదు నా కది జన్మకలిత మగును
శత్రుపక్షం బైన మిత్రపక్షం బైన
నెవ రైన నా కేమి తవిలి వచ్చు
జంక నెందులకు నీశరణాగతుఁడు రావ
ణాసురుఁడే యైన ననుమతింతు
నాతని రక్షింతు నభయప్రదానము
చేసి కీఁ డేదియుఁ జేయఁ జాలఁ

తే. డితఁడు కావున నీ విపు డేగి తోడి
తెమ్ము నాతమ్మునిగ నేను నెమ్మిఁ జూతు
ననుచుఁ జెప్పుము సందియం బందకు మను
మోయి సుగ్రీవ మన కిది యుత్తమంబు. 127

వ. అనిన సుగ్రీవుం డొ౯దల నంజలి ఘటించి సర్వలోకరక్షాదక్షులు పరోపకారపరాయణుల కిది పరమోత్తమధర్మంబ మముబోంట్ల ప్రమాదమ్ము మన్నింపు మని క్రన్నన విభీషణుం డున్నచోటికిం జని రామచంద్రుం డభయప్రదానంబు చేసి ని న్నంగీకరించె సన్నిధానంబునకుం జనుదె మ్మనిన నుప్పొంగుచు విభీషణుండు వినీతవేషుండై తన మంత్రులతోడం బోయి రామపాదారవిందం బుల సాగిలిపడి నమోవాకం బుచ్చరించుచు ని ట్లనియె. 128

మ. రవివంశాభరణాయమాన! త్రిజగద్రక్షాతిదక్షా! మునీ
ట్ప్రవరస్తుత్యా! విభీషణుం డనెడువాఁడన్ రాక్షసాధీశ్వరుం
డవు రావణాత్మునితమ్ముఁడన్ బ్రియము నే నాడంగ నోనాడి న
న్నవమానించుటఁ జేసి వచ్చితిని ని న్నర్థించి జీవింపఁగన్. 129

క. కొడుకులు కొమ్మలు సొమ్ములు
విడిచి భవచ్చరణసేవ విడువక చేయన్
గడుకొని వచ్చితి నన్నున్
విడువక రక్షింపు మనుచు వేఁడుకొనంగన్. 130

వ. అనిన రాముం డతనిం గదియఁ దిగిచి గాఢాలింగనముం గావించి కన్నుగొలుకుల హర్షాశ్రువులొలుకమూర్ధంబు పుడుకుచు నిట్లనియె.

ఉ. కొమ్మ హరించినట్టిపగకుం గనఁ దమ్ముఁడ వైన నీవు నా
తమ్ములలోన నొక్కఁడవుతమ్మునిగాఁ దలపోయుచుండు నీ
కొమ్మయు నీవు నెమ్మిగయి కో నలరావణుఁ దున్మి నీకు రా
జ్యమ్ము నొసంగ బాస యిదె సల్పుచునుంటినిఁ బోల వింటివే. 132

వ. అని లక్ష్మణుం బిలిచి నీవు సముద్రోదకంబులం దెచ్చి సర్వవానర సేనామధ్యంబున నీవిభీషణుని లంకారాజ్యంబున కభిషిక్తుం జేయు మనిన నతండు సుగ్రీవజాంబవదంగదహనుమత్పురస్సరంబుగా రామచంద్రుం డభినందించుచుండ నభిషేకంబు గావించెనంత రామ చంద్రుండును విభీషణునిఁ జెంతం గూరుచుండఁ బెట్టుకొని వివిధ విషయంబులు ప్రసంగించుచు లంకాపురంబునఁ గలవారిలో మేటి

విలుకాండ్రని విఖ్యాతిం గాంచినవారిం గొంపఱు: జేకొనుమనిన విభీషణుం డి ట్లనియె. 133

—♦ విభీషణుఁడు రావణయోధుల సభివర్ణించి చెప్పుట ♦—

సీ. బ్రహ్మవరంబునఁ బ్రబలుఁడై రావణుఁ
డురఁడు శక్రాదుల నురరణముల
వానిసోదరుఁ డైనవాఁడు కుంభకుం
కర్ణుఁడు మేటివిల్కాఁడు ఘనుఁడు
వానిపుత్త్రుం డయి వన్నె కెక్కినమేటి
యింద్రజి త్తనియెడుసాంద్రకీర్తి
వానిధీసచివుండు వసిగలవాఁడు ప్ర
హస్తుఁడు సుప్రశస్తాతిశయుఁడు

తే. వానిసేనాను లగుసకంపనమహోద
దరులు మహాపార్శ్వుఁడును మహాబలులు కామ
చారు లవ్వారికిన్ సైన్యసంచయమునఁ
గలరు పదికోటివేల్ సైనికులు మహాత్మ. 134

—♦ రావణుఁడు సుగ్రీవుని కడకు శార్దూలుం బుచ్చుట ♦—

వ. ఇట్లు వారుసంభాషించుకొనుసమయంబున నట రావణుండు శార్దూలుం డనువానిం బుచ్చిన వాఁడు సముద్రంబు దాఁటి వచ్చి సుగ్రీవసైన్యంబు పారవారావారంబువలె నుంటయెఱింగి పోయి రావణున కెఱింగించిన వాఁడు శుకుం డనువేగులవానిం బిలిచి కార్యం బెఱిగించి పుచ్చిన వాఁడు శుకరూపంబున వచ్చి సుగ్రీవుం డవిన ని ట్లనియె. 135

చ. అరుణసుతుండ వీ వలుప మైనకులంబున కైనవానితో
సరి యని సఖ్యమున్ సలుప సర్వజనంబును నవ్వ రావణా
సురుఁ డన సర్వలోకపతి చూడుము గౌరవలక్షణంబు లా
నరునిఁ బరిత్యజింపు మని నాప్రభు వానతి యిచ్చె నిచ్చమై. 163

క. అని పలుకుచుండునంతన్
వనచరు లట కెగిరి వానిఁ బట్టివధింపన్
మన మొసరించిన రాముఁడు
కని దూత వధింపరామి తోఁపదె మీకున్. 137

వ. అంతసుగ్రీవుండు శుకునిదిక్కు మొగంబై. 138

ఉ. చుట్టము నంచుఁ జెప్పెదవు సూరెలవారలు నవ్వ నోరి నీ
చుట్టరికంబు చాలు నిఁకఁ జూచుచునుండఁగ రామమూర్తి నా
పెట్టవెలార్చుపిడ్డు పడి నిన్నును నీపరివారవారమున్
బట్టి దహించివైచెడిని బానిసపద్ధతి నీది చెల్లఁగన్. 139

క. రామదవానలమున నే
నామెయి నాశుగము నగుచు ననుగతి గలుగన్
నీమండలమున మెట్టెద
నోమూర్ఖుఁడ తెలుపవత్తె సోదరత నిటుల్. 140

వ. అని సుగ్రీవుండు చెప్పె నని మీరావణునకుం జెప్పు మని వెడలం
గొట్టుటయు శుకుండు మగిడి లంకాముఖంబు వెట్టి పోయి పౌల
స్త్యున కెల్లవృత్తాంతంబు విన్నవించె నంత నిక్కడ రామలక్ష్మ
ణులు సుగ్రీవవిభీషణులఁ గూడి సేతుమార్గంబునుండి నడచి యెల్ల
సైనికులు నవలిగట్టునకుం బోఁ బనిచి తామును దనమూలబలంబుతో
మధ్యగతుం డై నడచి యవ్వలికిం జని సువేలాపర్వతంబుకడ విభీ
షణసహితుండై విశ్రమించి లక్ష్మణుం గాంచి యి ట్లనియె. 141

—♦ రామాదులు సముద్రముదాఁటి సువేలాద్రిపైనివసించుట ♦—

మ. కనుఁగొంటేయనుజన్మ! రావణపురిన్ గందోయికిం బబ్బముం
బొనరించున్ వరసౌధసంఘములతో భూమ్యంతరిక్షంబులన్
దనసౌందర్యము వెల్లడించునదియై తళ్కొత్తు శ్వేతాభ్రబృం
దసిరుద్ధాభ్రము వోలెఁజెప్ప నగుచున్ సంతోషముం గూర్చుచున్.

తే. సత్య మమరావతియు శివస్థాన మలక
భోగవతియు వైకుంఠము లోఁగ నైన

పురము లెవ్వియు నీలంకపురమున గావు
తెలియవచ్చుచుండెను వినుకలినిఁ జేసి. 143

వ. అని పలికి రాజనీతివిశారదుండైన రామచంద్రుండు వానరసేనా సమూహంబు నెల్ల విభజించి గరుడవ్యూహముగా నేర్పఱించి నీల సహితుం డగునంగదుండు దానిహృదయభాగంబునందును ఋష భుండు నిజబలంబుతో దక్షిణభాగంబునందును గంధమాదనుం డుత్తరభాగంబునందును నేను లక్ష్మణునితోఁ బురోభాగంబునం దును జాంబవత్సుషేణవేగదర్శులు కుక్షిభాగంబునందు నుండి రక్షింతురుగాక సుగ్రీవుండు పశ్చాద్భాగంబున వరుణుండు బోలె నుండి పాలించుఁ గాక యని పలికి మొగ్గరంబు శత్రుభీకరం బగు నట్లు గావించె నంత నక్కడఁ బౌలస్త్యుండు శుకసారణు లనునిరు వుర మంత్రులం బిలిచి సుగ్రీవసేనాసందోహం బెవ్విధంబున నుండెనో యెఱుంగ నెంచి యి ట్లనియె. 144

—♦ రావణుఁడు శుకసారణుల వేగులగాఁబుచ్చుట ♦—

శా. ఓహో మంత్రివరేణ్యులార ! వినుఁడెంతో వింత విన్పించు నేఁ
డాహంసాన్వయుఁడైనరాముఁడు మహాహంకారహుంకారసం
దోహం బేర్పడ వార్ధిఁ గట్టి యిటకున్ దోస్సార మేపారఁగా
బాహాబాహిఁ బెనంగ వచ్చె నట తాఁ భల్లూకసైన్యంబుతోన్.

తే. మీరు వారికిఁ దెలియని మేఱఁ దోఁప
మాఱురూపములం గొని వారిలోనఁ
జొచ్చి వారికోలందులు హెచ్చియుండు
వారి మగటిమి తెలిసి రా వలయు నిపుడు. 146

శా. రాజాజ్ఞం గొని శీర్షముం దపుడు వారల్ వానరాకారముల్
తే జొప్పం గొని పోయి వానరచమూద్దేశంబునం జొచ్చి వి
భ్రాజద్రీతుల గూఢచారులగుచున్ వర్తింపఁగాఁ గాంచి ర
క్షోజాతుం డగునవ్విభీషణుఁ డటన్ గుర్తించి యయ్యుద్ధతిన్. 147

తే. రాఘవునిచెంతఁ బెట్టి యోరామ ! వీరు
శుకుఁడు సారణుఁ డనెడివా రకట మనలఁ
దెలిసి కొన వేగులై వచ్చి మెలఁగుచుండి
రనిన రాముఁడు వారల నరసె నంత. 148

వ. ప్రాణభయంబునం జేసిఁ గడగడ వడంకుచు శుకసారణు లిట్లనిరి.

తే. రావణున కేము వేగుల మీవిధమున
మీబలంబు పరీక్షింప మీకడ కిపు
డరుగుదెంచితి మయ్య మాయాగ మీరు
సయిచి రక్షింపఁ బ్రార్థింతు మయము నెంచి. 150

మ. అనినన్ రాముఁడు వేఁగులార ! భయ మిం తైనం దటస్థింప దే
ననుచున్నాఁడ మదీయసైన్యమును మీ రన్నింట వీక్షించి యుం
డినవారే యటు కానిచో నిపుడు వెంశిం జూచి పోం డింతయున్
వినిపింపుం డలరావణాసురునకున్ విఖ్యాత మౌ నట్లుఁగన్ 151

వ. మీకు వలయు నన్న సర్వంబును విభీషణుండు చెప్పఁ గలండు
నిర్భయులై నిరీక్షించి పొండు పోయి నామాటగా రావణున కిట్లు
చెప్పుఁడు. 152

ఉ. ఎవ్వనిప్రాపుఁ జూచుకొని యే నెడ యైనపు డేగుదెంచి నీ
వవ్వనితాశిరోమణి మదర్థశరీరము సీతఁ గొంటివో
చి వ్వగుదెంచె వాని నినుఁ జెప్పినవానిని బిల్వనంపు ని
న్నెవ్విధిఁ గాచిపుచ్చెడినొ యేఁ గనుగొందునుఁ గాక రావణా.

క. కట్టిడి ! నీదగుపురమున్
సాట్టాలకగోపురముగ సర్వము కాల్పన్
బట్టితి శపథము నీకుం
బట్టెవ్వఁడు రాఁడు మిత్తి వచ్చు నొకండే. 154

—♦ శుకసారణులు రావణునకు రామప్రభావ మెఱింగించుట ♦—

సీ. అని వారి విడిచి పుచ్చిన వెండి పుట్టిన
ట్లనుకొనుచున్ వారు చని సురారి

-కంతయు నెఱిఁగించి యలరామలక్ష్మణు
లతిధైర్యశాలు లత్యంతబలులు
వానిచెంతను రుద్రుఁ డైనను మన లేఁడు
వానరసైన్య మవ్వారి యన్యో
న్యద్వంతయును లేక గడ్డతోఁ బెకలించి
నీలంకఁ గంథిలోఁ నిలుపఁ గలదు

తే. ఈవు మన నెంచితేని నీయెల్లవారి
మనుప నెంచితి వేని సీతను గొని చని
దశరథాత్మజునకు నిడి తత్పదముల
కెఱఁగి శరణంబుఁ గైకొను టెల్ల హితము. 155

వ. దశయోజనవిస్తీర్ణంబును శతయోజనాయతంబు నగుమహాసేతువుఁ గట్టి సముద్రంబు దాఁటి సువేలాచలప్రాంతంబునఁ గొంత వానర సైన్యం బున్నయది కొంత సేతువు దాఁటుచున్నయది కొంత సముద్రోత్తరతీరంబున నున్నదెల్లసైన్యంబునకు నీలుం డను వాఁడు సేనానాయకుండు. 156

క. మనలంకఁ గాల్చిపుచ్చిన
హనుమంతునిఁ బోలువార లాబలమునఁ జేఁ
గనుఁగొంటి బెక్కుమందిని
దనుజేశ్వర! వార లెల్ల ధైర్యాఢ్యు లనఘా. 157

వ. అనిన రావణుండు సారణా! భీరుండ వగు నీ మాటం జేసి సీతఁ విడుచువాఁడఁ గా నది యెట్లయినను వారి సేనాసందోహం బెంతయుండునో చూతము ర మ్మని దశతాళోన్నతం బగునొక్క ప్రాసాదరాజం బధిరోహించి సాగరంబునకు రెండవసాగరంబనఁగ నున్నవానరబలంబుపై దృష్టి నిగిడించి: సారణా! వీరిలో నెవ్వ రెవ్వరు మొనగాం డ్రెఱింగింపు మనిన నతం డగుళినిర్దేశంబుఁ జేయుచు ని ట్లనియె. 158

—♦ శుకసారణులు రావణునకు వానరసైన్యములఁజూపి చెప్పుట ♦—

సీ. ఉదధి కావలరెండుయోజనంబులు నిండి
యీవల నట్లుగా నిడికి కొనుచు
వేయియోజనముల విరివిగల్గినసేతు
మార్గముఁ గప్పి సమంతముగను
సాగరమో యనఁ జాగి చూపట్టెడు
వానరసైన్యమువంకఁ జూచి
యీవానరులసంఖ్య యెంతయో చెప్పంగ
షణ్ముఖుం డేనియుఁ జాలఁ డెన్న
తే. వినుము వారల కిలకిలధ్వనులు ప్రళయ
కాలఘూర్ణిత మన నగుఁ గనుఁగొను మిదె
క్రిక్కిఱదలుచుండె భూతల మక్కజముగ
నింతసైన్యము నే నెప్పు డెఱుఁగఁ జూవె. 159
వ. అనిన రావణాసురుం డోయీ! వానరుల నెక్కువచ్చునావరు
లెవ్వరు చెప్పుమనిన నతండు. 160
శా. వారే రాముఁడు లక్ష్మణుం డనఁగ పే ర్వడ్డట్టిరాజోత్తముల్
వారిం గాలిసుతుండు వాలిసుతుఁడుం బాదంబుల న్మ్రొక్కి నీ
కీర్తిన్ వహియించి వత్తు రదిగో నీసేనకున్ మున్న యా
వీరుం డాతఁడు నీలుఁ డాతనినుడిన్ వీ రెల్ల నుండ్రి య్యనిన్. 161
చ. బొమిడికమున్ ధరించి మణిభూషలతో నరుదెంచునాతఁడే
సుమి కపిరాజు వాలిసమశోభ గలాఁడు తదంతికంబునన్
గొమ రగురూపుతోడ మెఱ కొంచెము వంచి గమించువాఁ
డమరనుతప్రభావుఁడు నలాఖ్యుఁడు సేతువుఁ గట్టినట్టిఁడై. 162
తే. నేలపైఁ బోలె నీళ్ళపై ఱాలు దేలు
నట్లుగాఁ జేసి యొండొంటి కదుకు లేదా
కలదొ నా సందియం బది గలుగునట్లు
చేర్చి కట్టెను వారధి నేర్చి పేర్చి. 163

క. ఒత్తుగ దేహంబంతయు
సత్తగ రోమములు కండ లాడఁగ ముదుకం
డొత్తిల్లి నడచు రణగుణ
వత్తరుఁ డాతండె జాంబవంతుఁడు తెలియన్. 164

వ. మఱియు నోరావణా! యటుచూడు మావంక వేయికోట్ల యెనుబదిలక్షలమంది నలుని సైన్య మది యొక్కటియె లంకకుఁ జాలి యున్నది శ్వేతుఁడు గోమతీతీరంబునందలి సంకోచపర్వతంబునఁ గోటానఁగోట్లసేనతో నుండువాఁ డతండు కుముదుం డాతనికిఁ గోటిసైన్యమ్ము గల దాప్రక్కనుండువాఁడు రంభుం డతండు వింధ్య పర్వతంబున నుండువాఁ డాతండు శరభుండు సాల్వేయపర్వతంబున నలువదిలక్షలువిహారు లనువారితో నుండువాఁ డాతండు పనసుండు పారియాత్రమున నుండువాఁ డాతనికి నేబదిలక్షల సైన్యంబు గల దతండు వినతుం డనువాఁ డఱువదిలక్షలతో వచ్చి యున్నవాఁడు క్రోధనుఁడు గవయుఁడు ననువీరు డెబ్బదిడెబ్బది వేలసైన్యములతో వచ్చియున్నవారు వాఁడె హరుం డనువానరోత్తముఁడు వానికడ వేయికోట్లవానరసైన్య మున్నయది యాతండు గోలాంగూలేశ్వరుం డగుధూమ్రుం డనువాఁ డాతండు దంభుండు వీరికి వేయికోట్లసైనికులు గల రాతండు ప్రమాథి యనువాఁ డతనికడ నూఱుకోట్ల కొండ ముచ్చులసైన్యంబు గల దాతండు గవాక్షుఁ డతండు కేసరియను వానరోత్తముఁడు వారికడ నరువదివేలసైన్యంబు గల డాతఁడు శత బలి రామునికై ప్రాణము లైన విడువ నున్నవాఁడు మఱియు గజ గవయ గవాక్ష ప్రభృతు లొక్క రొక్కరె లంకం బెల్లగించి వేయుదు మను చున్నవారు మఱియు నెందఱో వానరవీరు లదె చూపట్టుచున్నవారు వారు సర్వ సమర్థులు వారితో నింద్రాదులును మార్కొనఁ జాలరు వా రెల్ల నిరువదిరెండువేలకోట్లు పెక్క-

*నూఱులక్ష లొకకోటి; నూఱువేలకోట్లు శంఖము; నూఱువేలశంఖము లొక మహాశంఖము; నూఱువేల మహాశంఖము లొక బృందము; నూఱువేలబృందము లొక మహాబృందము; నూఱువేలమహాబృందము లొక పద్మము; నూఱువేలపద్మము లొక

వేల శంఖములు పెక్కునూఱులబృందములుం గలిగినవా రాప్రక్క నున్నవారు మైందద్వివిదు లిదిగో నీవైపున నున్నవాఁ డాంజనేయుండు వీనిప్రభావము నీ వెఱుంగుదు వని చెప్పినపదంపడి శార్దూలుండు లేచి రాక్షసేంద్రా! సారణుండు పేర్కొనినవా రందఱు దేవాంశసంభవులు సూర్యపుత్రుండు సుగ్రీవుఁడు బృహస్పతిసుతుండు కేసరి యమకుమారుండు సుషేణుండు బ్రహ్మాంశజులు సుముఖ దుర్ముఖ వేగధర్ములు చంద్రాంశజుఁడు దధిముఖుఁ డగ్నిసంభవుఁడు నీలుండు వాయుసుతుండు హనూమంతు డింద్రునిమనుమఁ డంగదుఁ డశ్వినీదేవాంశజులు మైందద్వివిదులు యమాంశజులు గజ గవయ గవాక్ష శరభ గంధమాదను లిట్టివారు పదికోట్లు సూర్యాంశజులు శ్వేతజ్యోతిదుర్ముఖులు వరుణపుత్రుండు హేమకూటుండు విశ్వకర్మపుత్రుఁడు నలుఁడు వసుపుత్రుండు దుర్ధరుండు వీ రందఱు రామచంద్రప్రేరితులై నిన్ను ముట్టడింప వచ్చుచున్నవా రని చెప్పిన రావణాసురుండు వారిం బోఁ బనిచి విద్యుజ్జిహ్వుం డనుమాయలమాఱిం బిలిచి యి ట్లనియె. 165

—♦ విద్యుజ్జిహ్వుఁడు తెగిన రామశీర్షము సీతకుం జూపుట ♦—

మ. తెగవేయం బడినట్టిరాముశిరముꣳ దెల్లంబుగాఁ జేసి నీ
కగునే ర్పెల్ల నెఱుంగఁ జూపు మిదె నే నాజానకీదేవి యు
న్నగతుల్ సూడ నశోకకాననము నొందం బోవుదుꣳ వార్తనే
యఁగ దానిం గొనిరమ్ము నీ విటకు మోహావేశముం గొల్పుచుꣳ.

తరు. అని చెప్పి తానశోకావని కేగి
యట నొకచో నేలయందుఁ గూర్చున్న
వనజాక్షి రఘురామపత్నినిం గాంచి
వనిత రావణుఁడను వచ్చితి నన్నుఁ

మహాపద్మము; నూఱువేలమహాపద్మము లొక ఖర్వము; నూఱువేలఖర్వము లొక మహాఖర్వము; నూఱువేలమహాఖర్వము లొక సముద్రము; నూఱువేల సముద్రము లొక యోఘము; నూఱువేలయోఘము లొక మహాయోఘము, ఇత్యాదులు తెలియందగు.

గనుము నీనాథుం డసు కనుమోడ్చి యుండ
ఘనులు నాభటు లేగి కరవాలమునను
దునిమి రాముని తలఁ దులిపి నాకంటి
దుగఁ బెట్టి రది నీకు దోఁపఁ దెచ్చితిని. 167

ఉ. నీ విఁక నీదు భర్తదెస నెమ్మది వీడినదానవై నను౯
దేవుఁ డటంచు నెంచుచును నీసగుకాలము వెళ్ళబుచ్చు మీ
దేవురులాట వ్యర్థమిటు తెల్పితిఁ బొల్పుగ నాడికాలమం
దీవది నమ్మ వైతి విపుడేమి యొనర్తువొ గాని జానకీ. 168

వ. అని యొకపరిచారికం బిలిచి నీవు పోయి విద్యుజ్జిహ్వునిం దోడ్కొని రమ్మనుడు నామె చనెనంత నాతండు ధనుర్బాణతూణీరపాణియై రామశీర్షం బొకశూలంబునం గ్రుచ్చి తెచ్చి రావణు మ్రోలం బెట్టె నాతండు దానిం జూచి సీతకుం జూపి యి ట్లనియె. 169

మ. ఇది నీరామునిశీర్ష మోరమణి యిష్టే చేహముఁ౯ వీడియు
న్నది రక్తంబు స్రవించుచుండెఁ వివర్ణత్వంబు గైకొ౯క మున్
గదియన్ వచ్చికనుంగొనం దగుదు నిక్కం బంచు భావించి నీ
యెదకుం దోఁచినరీతిగా నడువు మంచేఁ జెప్పగా వచ్చితిన్. 170

వ. అని యించుకంత యోసరిల్లి యున్నంతఁ గాంతామణి కాంతుని శిరంబు కరంబునం బట్టి కనుంగొని హా! ప్రాణేశ్వరా! యని గుభిల్లున నేలంగూలి మూర్ఛిల్లి కొంతలోనం దెప్పిఱిల్లి లేచి. 171

—♦ మాయారామశీర్షముం జూచి సీత దుఃఖించుట ♦—

మ. అయయో నీ కిటు వచ్చె నాకతమునన్ హా! ప్రాణనాథా జగ
చ్ఛయసంరక్షణదక్షుఁడం డవగుచున్ సాకేతమం దొప్పునీ
వయముం గాన కరణ్యభూములను దుఃఖాక్రాంతచిత్తుండ వై
చెయిదంబుల్ చెడనుండి యి ట్లయితివే చెల్లన్ సమస్తంబునున్. 172

తే. నేనుఁ దలఁబ్రాలువోసిన నెత్తి యిదియొ
జీలకఱ్ఱవాసనలు నాదుచిత్తమునకుఁ

దగులుచుండినయ ట్లుండె దైత్యుఁడిట్లు
నీచకార్యము గావించె నిన్ను నొంచె. 173

క. మంగసూత్రము మెడలో
నం గట్టినదానఁ గాదె నక్తంచరునిం
టంగల దానిం దేరన్
సంగర మిటు పన్ని వచ్చి చంపం బడితే. 174

క. నాదుఃఖము చల్లాఱెన్
నీదర్శనమునను నేను నిముసములోనన్
నీదారిఁ బట్టి వచ్చెద
నోదయితా! దారి మసలుచుండు మరయుచున్. 175

వ. అని విలపించుచున్నసమయంబునఁ బ్రహస్తుండు పనిఁ గలిగి ప్రభు
దర్శనంబుఁ గోరుచున్నవాఁ డని ద్వారపాలకుండు చెప్ప రావణుం
డశోకవనంబు విడిచి చనియె నంతలో మాయాశీర్షంబు నంతర్ధా
నం బయ్యె నయ్యెడ రావణునిరాకంజేసి మోకచాటునఁ డాఁగి
యున్నవిభీషణునిభార్య సరమ యనునది వడివడిం బఱచి వచ్చి
సీతం గ్రుచ్చి యెత్తి మెత్తనిమాటలఁ జిత్తశాంతిఁ గలుగ
నూఱార్చుచు ని ట్లనియె. 176

— సరమ సీతతో నది మాయాశీర్షమని చెప్పుట —

శా. మాయాశీర్షము రావణుండు పొనరింపం జేసి యే పంచె నీ
కాయామాయలు నాకుఁ దెల్ల మగు నోయమ్మా రఘూత్తంసుఁడే
ప్రాయోదఃపతి దక్షిణాశను సువేలాద్రీంద్రమందుం గపుల్
వేయార్లక్షలు కోటులుం గొలువఁగా వేంచేసియున్నాఁడటే 177

ఉ. రాముని శీర్షమే తెగిన రాణువ లేటికి యుద్ధమేటి కా
సామజసంఘ మేమిటికి సాహిణు లేటికి దుందుభిధ్వనుల్
వేమరు గల్గుటేమిటికి వీరవరేణ్యులు వచ్చి పైఁ బడం
గా మతి దప్పి రావణుఁడు కష్టములందు మునింగి యుండెఁ బో. 178

క. ఏదీ శీర్షము సీతా!
ఏదారినో పోయె మాయ యిది రాముడు సం
తోదమొసంగఁగ నదిగో
నా దెస వానరులతోడ నదె వచ్చి పడుఁ. 178

వ. అని యామె కన్నుల నీరు తుడిచి నేను దిరస్కరిణీవిద్యాప్రభావంబునం బోయి సర్వంబును జూచి వచ్చెదనని మాటలోనె బోయి వచ్చి రామచంద్రుండు సుఖయై లక్ష్మణ సుగ్రీవులతో నామగని జెంతం గూరుచుండం బెట్టుకొని మంత్రాలోచనంబు సేయుచున్నవాఁ డిటనుండి తత్తఱించుచుం బోయిన రావణుండు మంత్రులతో యుద్ధసన్నద్ధంబు గావింపం జెప్పియున్నయప్పుడు రావణునితల్లి యగుకైకసియు మందోదరియుఁ బులస్త్యుండును దల్లిపినతండ్రి యగుమాల్యవంతుండును విరూపాక్ష మహోదరాది మంత్రులును జెప్పవలసినంత జెప్పి యిప్పుడైన సీతం గొనిపోయి రామున కర్పించి శరణు పొందు మని బోధించి రతండు ముమూర్షు వౌషధంబు వోలె వారి మాటలు రుచింపక ప్రతికూలోత్తరంబు లొసంగెఁ దల్లీ! నీవు చింతిల్లకుము రామచంద్రుఁడిదె రావణాదుల సంహరించి నిన్నయోధ్యకుం గొనిపోవు నీవును నీప్రాణేశ్వరుండును లక్ష్మీనారాయణుల వలె సంతతానంద మనుభవింపఁ గలరని పరమ యూఱడించె నంత నక్కడ రావణాసురుండును. 179

—♦ రావణుఁడు నిజసైన్యములకాజ్ఞాపించుట ♦—

సీ. పరిఘావృత మ్మగుప్రాకారసప్తక
మ్మునఁ జండ్రశంకువుల్ మొనయ నాఁటి
కోటకొమ్మలమీఁద మేటిశతఘ్నులు
వివిధాయుధమ్ములు వెలయఁ జేసి
ద్వారదేశములందు భూరిగిరులఁ బోలు
మత్తేభముల నిల్పి మొత్తములుగఁ

బిడుగుల కైత్తైనవడిగలయోధుల
నియమించి నలుగడ నిలువరించి

తే. సర్వగుల్మంబులఁ యంత్రసాధనములు
సంతరించి మహాకేతుశతసహస్ర
సంభృతంబుగఁ జేసి రక్షావిధాన
మాచరించెను లంకయం దసురవిభుఁడు. 180

వ. ఇట్లు కావించి లంకాపురంబు తూర్పుగవనికడఁ బ్రహస్తుని దక్షిణ ద్వారంబున మహోదరమహాపార్శ్వులను బశ్చిమంబున నింద్ర జిత్తు నుత్తరభాగంబున శుకసారణులతోడఁ దాను బురమధ్యం బున విరూపాక్షుండు నుండి రక్షాకార్యంబుఁ గావించు నది యని మంత్రులకుం జెప్పి తా నంతఃపురంబునకుం జనియె నంత నిక్కడ రామచంద్రుండును. 181

—♦ నీలుఁడులోనగువారు లంకముట్టడించుట ♦—

సీ. నీలుఁడు బహువిధానీకినితోఁ దూర్పు
గవనిఁ బ్రహస్తునిఁ దవులుఁ గాక
యంగదుఁడు సమర్థులగు సైనికులతో మ
హోదరముఖ్యుల నోర్చుఁ గాక
హనుమంతుఁడు బలాఢ్యుఁడై పశ్చిమంబున
వీఁక నింద్రజిఁ దాఁకి పెనఁగుఁ గాక
నేను నాతమ్ముఁడు సేనతో రావణుఁ
బొదివి పెనంగ నుండెదము గాక

తే. ఎలుఁగురా జాంబవంతుఁడు వినసుతుండు
రావణానుజుఁడును లోనిరాణువపయి
వడి వడిగఁ బోరి యెల్లరఁ బట్టిగిట్టి
కాలుపురికంపెదరు గాక యాలమందు. 182

వ. ఇట్లు సేనాసంవిభాగంబుఁ గావించి రామచంద్రుండు లంకాదర్శన లాలసుండై సువేలాచలశిఖరంబున కెక్కె వానివెనుక లక్ష్మణ

సుగ్రీవ విభీష ణాంగద హనుమత్ప్రభృతులు నధిరోహించి రవుకు త్రికూటశిఖరాగ్రంబున నున్నలంకాపురంబున నొక్కప్రాసా దోపరిభాగంబున నానావిధాంబరాభరణభూషితుండై కూరు చున్నరావణాసురుం గాంచి సుగ్రీవుండు కోపాటోపంబున నెవ్వ రికిం జెప్పక రివ్వున నెగిరి రావణుం డున్నప్రదేశంబునం దుమికి వానిదిక్కు మొగంబై.

—♦ సుగ్రీవుఁ డెగిరిపోయి రావణునితో మల్లయుద్ధముచేయుట ♦—

శా. ఓరీ! రావణ! నేరఘూద్వహునినెయ్యుండన్ గపీంద్రుండ నీ
క్రూరత్వంబు మదిం గలంచుటయు నీరూపంబు కందోయికిన్
దూరం బంద స్ఫురించుటన్ నిలువ నందుం దోఁప కి ట్లీడకున్
జేరం గల్గితి నింక నిన్విడువ నీ జీవంబుతో నుండఁగన్. 184

క. అని క్రోధభరంబున న
ద్దనుజేంద్రునిశిరమునందుఁ దనరుకిరీటం
బును గాలఁ దన్నె భూతల
మునఁ బడునట్లుగఁ బొనర్చి పొడిచె నురమునన్. 185

క. డబ్బాటఁ గాంచి రావణుఁ
డబ్బా!కోతులకు నింత యుక్కను గలదో
తబ్బిబ్బుపడక నిలువుము
దెబ్బకు నినుఁ గూల్చిపుత్తు దివమునఁ గనంగన్. 186

సీ. అని వడిం జనిపట్టి యట్టిట్టుఁ ద్రిప్పుచుఁ
బడఁ ద్రొబ్బె గోపురద్వారమందు
లేచి సుగ్రీవుఁడు రాచి చంపెద నని
పట్టివానిని బంతిపగిదిఁ గొట్టె
రావణుండును వడిఁ జేవురించినమోము
తో ఱొమ్ము పగులంగఁ దూచిగ్రుద్దె
నేఁచి వానరపతి లోచనంబులఁ గెంపు
గదురంగఁ బిడికిట నదిమి పొడిచె

తే. నిట్లు వారలు పిడికిళ్ల నేసికొనియు
నడచి కొనియును జేతులం బొడిచికొనియుం
దన్నుకొనియును గాళుల దున్నికొనియు
బాహుయుద్ధ మొనర్చి రప్పట్టునందు. 187

క. ఒండొరుల నెగుర వేసియు
గొండొక క్రిందకును లాగి కొని వీపులపై
మెండుగ గ్రుద్దియుం బొడిచియు
దండిమగ ల్వా ర్షియుద్ధతత్పరు లగుచున్. 188

సీ. కోలుపులులరీతిం గొండొక తడ వేన్గు
గున్నలపోలికిం గొంతతడవు
భల్లూకములరీతి చెల్లంగొంతతడువు
పట్టి చుట్టి పెనంగి కట్టలుకను
వెనుక వెన్కకుం బోయి వెస వచ్చి పట్టియు
ఔమ్మ్రతో ఔ మ్మ్రాడం గ్రుమ్మి క్రుమ్మి
కూలి లేచియు నేల వ్రాలియు నొఱిగియు
నరగ లట్టులు మేను లొరయం జుట్టి

తే. పోటుమగ లైనవారు పోరాటమందు
నొకరి కొక్కరు తీసిపో కుండునట్టి
వారలై మండలాకృతిం బేరెములను
దిరుగుచును మల్లయుద్ధ మొనరిచి రపుడు. 180

తే. వానరేశ్వరు వడికి రావణుండు మిగుల
నలసి మాయాబలంబున మెలంగ నుంటం
దెలిసి సుగ్రీవుం డింతలో దివికి లేచి
వానరావళిం గలచోట వ్రాలె లీల. 190

తే. రక్తసిక్తాంగుం డగువానరప్రవరునిం
జూచి రాముండు పల్కె నోసూర్యపుత్ర!
మాకుం దెలుపక యీరీతి మార్గమునను
మెలంగ నగునె సాహస మిట్లు సలుప నగునె. 191

వ. అనిన సుగ్రీవుండు దండప్రణామంబు గావించుచు ని ట్లనియె. 192

చ. ఖలుఁడగు రావణాసురునిఁ గాంచినయంతన కోపతాపముల్
గలిగెను మే నెఱుంగక యొకానొకయంతయుఁ గాన కింతలో
పల నొకలంగలో నటకుఁ బాఱి సురారిని బట్టి యెంతయే
నలసినవానిఁగా సలిపి యాగతుఁ జైతిని దప్పు సైపుమా. 193

వ. అనిన రాముండు నీసాహసమ్మునకెంతయు సంతోషం బింక మనమాలసింపక లంకాపురంబు ముట్టడింత మని క్రిందికిం దిగి నిజసేనాసందోహముం గని సైనికులారా! నేను సుగ్రీవసహాయుం డనై యుత్తరద్వారంబు ముట్టడించెద మీరు మీమీస్థానంబులఁ జెప్పినచొప్పున ముట్టడివెట్టుం డని తాను విభీషణ సుగ్రీవ హనుమజ్జాంబవ త్సుషేణ లక్ష్మణప్రభృతులతోడం గూడి యుండె దక్కినవారును బూర్వపశ్చిమదక్షిణద్వారంబు లావరించి రపుడు నాగాయుతసత్త్వు లగువానరులెల్లరు వృక్షగ్రావాయుధులై కోటల గ్గలు వెట్టుట యెప్పు డెప్పుడని యువ్విళ్లూరుచుండి రపుడు గుణసముద్రుండగు రామభద్రుండు విభీషణానుమతి నంగదుం బిలిచి నీవు భయంబుదక్కి రావణునిపాలికిం జని నామాటగా జెప్పు మని కొన్నిమాటలు చెప్పి యంపిపుచ్చుటయు నతం డతనికడకుం జని త న్నెఱింగించి శ్రీరామసందేశంబు విను మని యి ట్లనియె.

—♦ శ్రీరాముఁ డంగదుని రావణునొద్ద కంపుట ♦—

సీ. ఓరి నిశాచర! యోరోరి! రావణ!
వరగర్వమున నోడ లక్ష్మఱచి నీవుఁ
దేవర్షిముఖ్యులు దేవురింపఁగ వారి
కెంతయే గీడు నిశ్చింతముగను
గావించితివి నాదుగరితహరించితి
నినుఁ జంపవచ్చితి నేను నీకు
నాయువు పరిపూర్ణ మయ్యె నీప్రాణముల్
నాచేత నున్న వీనాఁట విను ము.

తే. నిన్నుఁ గాపాడువాఁడు లేఁ డెన్నిచూడ
నాదుబాణాగ్నికీ లంక పాదుతోడ
దగ్ధ మగునీదుపుత్త్రపౌత్త్రప్రపౌత్త్ర
వర్గ మంతయు నీతోడ భస్మమగును. 195

సీ. అడవి నాకు లలమ్మి లాహారించుచుఁదపం
బున్నట్టివారల నోడుచుటయును
దేవతలయు భూమిదేవతలయుఁ గొత్త
దులఁబట్టి చెఱఁ బెట్టి నలచుటయును
ఘనుల రాజర్షుల ననపరాధుల నెల్ల
నక్కుటికము లేక నొక్కుటయును
నఖిలలోకములకు నలజడిఁ గాఁజెట్ట
లగుపను లెన్నియోఁ దగులుటయును

తే. నేఁటికి ఫలించె నవి యెల్ల నీకు ననుభ
వించు కాల మాసన్నమై పొంచి యుండె
బుద్ధి గలవాఁడ వేని నాముద్దరాలి
నెలమి నర్పించి ప్రాణముల్ నిలుపుకొనుము. 196

—♦ అంగదుఁడు రావణునితో రామవాక్యంబు లెఱింగించుట ♦—

తే. అట్లు కాదేని చూడు మాహవమునందు
నరుఁడ నగునాశరంబులబిరుసుఁ జూపి
నిన్ను నీవారినిం జంపి నిఖిల జగ మ
రాక్షసంబుగఁ జేసెద నీక్షణమున. 197

క. నీవొక పురుషుఁడ వేనియు
లా వొక్కింతేని నీకులంబునఁ గలదేఁ
జేవ మెఱుఁ జేయుమాల
మ్మేపీరుఁడ రిత్తపోవ నిత్తునె నిన్నున్. 198

శా. లంకారాజ్యము మావిభీషణుని కేలం బట్టముం గట్టుదు
శ్శంకాతంకవిహీనమానసుఁడనై చూనేసి నీ విన్నప్డు నా

వంకర్ జూడఁగ లేవు నీ వని మొనర్ బ్రహ్మాదులే వచ్చి నీ
కింకర్ బ్రాణము వోయలే రిది నిజం బేఁ జెప్పితిన్ నమ్ముమా.

తే. బుద్ధిగల వాఁడ వేని నా సుద్ది విశ్వ
సించువాఁడవ యేని నా సీతఁ దెచ్చి
యిచ్చి శరణంబు వేఁడు కా దేని చెప్పి
నంత కాఁగల దని రాముఁ డాన తిచ్చె. 200

వ. అనిన రావణుండు నేయి వేల్వ బగ్గు మని మండునగ్గి వలె మంత్రి
సమీపవర్తు లగురాక్షసవీరులం గని 201

—♦ అంగదుఁడు తన్నుఁబట్ట వచ్చిన రాక్షసులఁగిట్టివేచుట ♦—

చ. పరుసము లాడునీఖలునిఁ బట్టి బలంబునఁ గట్టి చంపుఁడీ
ఖరకర తేజు రార ! యనఁగా నటఁ గల్గినవీరు లాతనిన్
గరములఁ బట్టి బిట్టవియఁ గట్టఁగఁ బోయిన వారి నల్వురన్
విరవిర వోవఁ బట్టి కొని వీడక జంకలఁ బెట్టి నెట్టనన్. 202

క. కుప్పించి మీఁది కెగయుచు
నప్పుడు ప్రాసాద మెక్కి యటనుండి పడన్
దెప్పున నేలన్ వయిచిన
నప్పురుషులు కూలి ముక్కలై పోయి రొగిన్. 203

వ. అంగదుండునుఁ బాదాభిఘాతంబునఁ బ్రాసాదరాజంబు పగిలిపడం
జేసి రాక్షసహృదయవిదారణంబుగా సింహనాదంబు గావించి
యెక్కగంతున రామాంతికంబునన్ వ్రాలి వృత్తాంతం బంతయు
రామున కెఱింగించె నట రావణుండు ప్రళయకాలరుద్రుండు నా
మండిపడి ప్రాసాదోపరిభాగంబున కేగి నాల్గుతట్టుల ముట్టడించి
లగ్గలు వెట్టుచున్ననూఱక్షౌహిణుల వానరసైన్యముం గాంచి
మించిన శౌర్యంబున నిజయోధుల కెల్ల యుద్ధంబున కాజ్ఞ యిచ్చు
టయు వారు భేరీమృదంగశంఖముఖవాద్యధ్వనులతో సింహనాదం
బులు గావించి సన్నద్ధులై రప్పుడు వానరసమూహంబును. 204

శా. వీరాగ్రేసరుఁ డైనరాఘవుఁడు దోర్వీర్యం బవార్యంబుగాఁ
గ్రూరాస్త్రంబులు తూణయుగ్మమునఁబెక్కుల్ నాల్కలంగ్రోయ గం

భీరస్వాంతతఁ గోట్టులం బొనరుపం బిట్టాజ్ఞ యిచ్చెన్ మహా
ఘోరాకారులు ఋక్షవానరుల కఘుదప్రప్రభావంబునన్. 205

మత్త. వాతరంహులు వీతజిహ్మలు వానరుల్ కడుధీరులై
స్ఫీతబాహుబలం బెలర్పఁగ వృక్షపర్వతపంక్తులన్
బ్రీతిఁ గైకొని వీకమై జని పెచ్చుకోట్టల హెచ్చు లం
కాతతోన్నతసాలశృంగము లావరించిరి మించగన్. 206

తే. జాంబవద్విభీషణపురస్కారముఁగను
లక్ష్మణుఁడు వేనవేల్ సేన [1] లాసిపోదలఁ
గదలి దక్షిణద్వారముఁ గడఁక మెఱయ
ముట్టడించెను సంతసకట్టియపుడు. 207

స్ర. భూరిక్ష్మాభృత్సమాంగుల్ భువనవిదితసంస్ఫోటశాలుల్ ప్లవంగుల్
పారావారంబు నాఁగం బ్రబలిసకలభూభాగముం గప్పి మెప్పై
స్ఫారంబై యొప్పులం కేశ్వరవరణము నల్ ప్రక్కలన్ ముట్టినట్టుల్ [2]
మీరల్ మీఱంగ భిత్తుల్ మిడిసిపడ వడి న్మెట్టి మట్టాడి రంతన్.

—♦ రాక్షసులు ముట్టడించినవానరులం దోలుట ♦—

వ. ఇట్లరుణగోత్రోన్నతగాత్రు లగువలీముఖప్రవరులు శతసహస్ర
కోటులను ధూమ్రవర్ణులు నర్ణవగభీరులు నగునచ్ఛభల్లయోధులు
ముప్పదివేలకోట్లునుం గూడి వేడుకమెయిఁ గూడుచు వీడుచు నిగు
డుచు మగుడుచు మలయుచు సొలయుచు మత్తిల్లి మొత్తంబై
లంకాపురప్రాకారం బాక్రమించి నానావిధనిజదేహప్రభాపటలం
బున నాయూయికడలఁ గపిలంబు సేయుచుసూర్యాతపప్రచారంబున
కెడ గలుగకుండ నంతటం దామయై నిండి కోటకొమ్మలం గలమేటి
రక్కసుల నుక్కడంచి ద్వారతోరణమణిస్తంభ గోపురాట్టా
లక కుట్టిమకర్ణాటశిఖరశృంగయంత్రాగారాదుల విఱిచి పుర
మధ్యంబునం బడవిసరి వైచుచుఁ జకగుడోపలశతఘ్ని వాతం
బుల గదాపరిఘకుంతప్రముఖాద్యాయుధంబుల నెత్తి మొత్తుచు

[1] లాయు = విజృంభించు; [2] నెట్టుల్ = పూనికల్.

లంకాపురవాసులకెల్ల గుండె తల్లడంబుఁ గావించుచుండె రపుడు వరణరక్షకు లగురాక్షసవీరులు వెఱచఱచి పఱచి ప్లవంగవీరసంజనితం బగునమ్మహోపప్లవం బంతయు దేవాంతకుం డగురావణున కెఱింగించిన నతండు గండుమిగిలి కామరూపులును వికృతాకారులును శతసహస్రసంఖ్యాకులు నగురాక్షసుల నియోగించిన వారవారితభుజబలపరాక్రమంబు మెఱయ నరిగి కోటకొమ్మలం దీటుకొని మేట్లులై యున్నవనాటులపైఁ జిత్తజల్లువోలె మొత్తంబులై పడ నానావిధాయుధంబులం బ్రయోగించి మించి వరణంబు నిర్వానరగణంబు గావించి మరలఁ గోటం గైవసంబుఁ గావించుకొని యుండి రప్పుడు. 209

సీ. పురము నాలుగుద్వారముల మూఁగికొనియును
గుడులు గోపురములు కూలఁ ద్రోసి
ప్రాకారములు ద్రవ్వి పరిఘలు పూడిచి
ప్రాసాదసౌధముల్ పడఁగఁ గొట్టి
కిలకిలారావముల్ పలుమఱుఁ గావించి
పర్వతంబులు చెట్లు పట్టి వైచి
మొఘరుచుం దుముకుచు నిట్టట్టు పాఱుచు
నెదు రైనవారల నెగిచి మొత్తి

తే. వానరబలంబు లీరీతి బహుళతరము
లగుచుఁ జెల్రేఁచి పోరాట మాచరింప
నున్నతజి రాక్షసులమూఁక లెన్నతరము
గాని యటులొప్పె వారిపైఁ గవిసె రపుడు. 210

తే. పరశు పట్టిస ముసల ముద్గర గదాసి
తోమ రాదిసాధనములతోఁ గడంగి
తూర్యనాదములును మహాదుందుభులును
సింహానాదము లెంతయుఁ జేసి కొనుచు. 212

మత్త. కోట లెక్కినమేటివానరకోటులుక్ బ్రహరించియున్
బేటలం బడి సౌధముల్ పడవేయువేలను దోలియున్

మాటిమాటికి నార్చుచుండెడుమానవాదులు రేఁగుడున్
గోట ఱక్కి మృతింపజేసెను గోఁతిమూఁకలు వారలన్. 213

—♦ వానరరాక్షసులద్వంద్వయుద్ధము ♦—

వ. ఇట్లు బహుప్రకారంబుల వానరరాక్షసులు బోరుచుండి రప్పు డిం
ద్రజి త్తంగదునిం దాకె విభీషణమంత్రి యగు సంపాతి ప్రజంఘు
నెదిరించె హనుమంతుండు జంబుమాలి మార్కొనె గజనీలసుగ్రీ
వులు తపననికుంభప్రహస్తుల నెదిరించిరి లక్ష్మణుండు విరూపాక్షున్
డీకొనియె నగ్నికేతు రశ్మికేతు సుప్తఘ్న యజ్ఞకోపులు రామునిం
గదిసిరి వజ్రముష్టి మైందు నెదిర్చె నశనిప్రభుఁడు ద్వివిదునిన్
దాకెఁ బ్రతపనుండు నలునితోఁ బోరం దొడంగె సుషేణుఁడు
విద్యున్మాలితోఁ గవిసె నిట్లు రక్షోవానరుల కత్యుగ్రం బగుద్వంద్వ
యుద్ధంబు సిద్ధం బయ్యె. 214

తే. ఇంద్రజి త్తంగదుని వజ్ర మెత్తి వేయ
నతఁడు తప్పించుకొని మీఁది కట్టె యెగసి
వైరినిన్ దన్నెఁ దన్నిన సారథి రథ
రథ్యములు గూలె నేలపై రజము లగుచు 215

సీ. మూఁడుబాణంబుల మొనసి ప్రజంఘుఁడు
నొనేసె సంపాతి నొచ్చి యతఁడు
వృక్షంబునన్ వాని వక్ష మూడఁగ నేసె
జంబుమాలి కడంక శక్తి నెత్తి
హనుమంతునురము వ్రయ్యఁగ నేసె నీసున
నతఁడు హస్తతలాన నతనిఁ జఱచె
ప్రతనుండు తీవ్రాస్త్రతతి నలు నొప్పించె
నతనికందుగ నల్క నతఁడు వెఱికెఁ

తే. బ్రఘసుఁ డాస్యము తెర్చి సూర్యసుతు మ్రింగ
వచ్చె నతఁ డాతనిం గొట్టె వజ్రముష్టి
నగ్నికేత్వాదు లేచి రామాధిపుపయి
నతులితశరంబు లేసి పెల్లార్చి రేర్చి: 216

చ. నరపతి నాల్గుకోలలను నల్వుర వారలఁ ద్రెళ్ల నేసి త
త్పరిచరులైనరాక్షసులు పల్వురు మూఁగిన వారి నందఱన్
సురుచిరసాయకంబులను జుఱ్ఱనిపించుచు నొంచి యందఱన్
వరుస యమాలయంబునకుఁ బంచె యమాతిథులై చెలంగఁగన్.

ఉ. మైందుఁడు వజ్రముష్టి యనుమర్త్యపలాసి నెదిర్చి రోజుచుఁన్
క్రిందును మీఁదు గాన కొకకేళివ రణంబొనరించువాని వీఁ
కం దగి ముష్టితో నడఁచెఁ గాంచుచునుండ రథాశ్వపంక్తితోఁ
గ్రిందకు వ్రాలి కాలగతికిన్ వశమై చనె నాతఁ డింతలోన్. 218

ఉ. నీలనికుంభు లిద్దరు ననింద్యపరాక్రమవిక్రమంబుతో
నాలము సేయుచుండ నిశితాంబకముల్ నిగిడించి నొంచె నా
నీలుని రాక్షసుండు కడునేర్పున నీలుఁడు వానిచక్రమున్
గేల నమర్చి కొంచు నడఁగించెను మించి పరాక్రమంబునన్. 219

సీ. అశనిప్రభునిఁ దాఁకి యాద్వివిదుం డొక్క-
పర్వతంబున నేసె వాఁడు నంత
ద్వివిదు నేడమ్ముల నొవిలింప నాతండు
నశనిప్రభురథంబు హతముఁ జేసెఁ
దొడిఁబడ వచ్చి విద్యున్మాలి రథియె సు
షేణునిన్ దూపులఁజేసి యేసె
నతఁ డొక్క-కొండతో నారథంబునుఁ గూల్చె
నసుర గదంబూని యవనికుఱికి

తే. వానరుని మీఁదికిన్ వచ్చి వడినిఁ జూప
గండశిల యొండు గొని వానరుండు రాఁగ
రక్క-సుఁడు ఱొమ్మునన్ గొట్టె నుక్కుమిగిలి
వానరుఁడు వానిఁ జానేసె వడిగ మోది. 220

వ. ఇట్లు వారుపోరినపోరు దేవదానవులపోరుం బోలె భీకరంబై రుధి
రంబు ప్రవహించి భగ్నంబులై పుడమిం బడియున్నరథాశ్వగజాదు
లను వీరశరీరంబులనుఁ గొనిపోయె నంతలో సూర్యుం డస్తంగతుం

డగుటయు నప్పుడు విశ్రాంతి వహింపక పెచ్చుపెరిఁగిన మచ్చ రంబున వారు పోరుచుండి రపుడు రాత్రించరులు కరం బాగ్రహించి వానరులం బట్టి పాలార్చి నోటం బెట్టుకొనిచుండి రపుడు రాముండును వేసిపిడుగులం బోని వాఁడిబాణంబులు ప్రయోగించి వారియు బ్బడంచె నాసమయంబున ననిమొనకు నిలువఁ జాలక యమశత్రుదుర్ధరులు మహాపార్శ్వ మహోదర వజ్రదంష్ట్ర మహా కాయ శుకసారణులు వెన్నిచ్చి పఱచి రనతరంబ. 221

-♦ ఇంద్రజిత్తు రామలక్ష్మణుల నాగపాశబద్ధులం జేయుట ♦-

ఉ. అంగదుపాదఘాతమున స్యందన మట్టులు వోవ నింద్రజి
త్తంగద గాగ మాయమెయి యందఱకుం గన రానియట్టిఁడై
సంగరరంగ మెల్ల శరసంతతులం నిగిడించి నించుచున్
బొంగెడువానరధ్వజినిపొంక మడంగగ జేయుచు న్వడిన్. 222

తే. మేఘనాథుఁడు పిడుగులు మీఁదనుండి
పడెడునట్టులు శస్త్రముల్ వఱపి తెఱపి
వైచి నాగాస్త్రములు రఘుస్వాముల పయిఁ
గట్టి వైచెను నట్టిట్టుఁ గదలనట్లు. 223

ఆ. అంతలోనఁ దన్ను నరికట్టవచ్చిన
నంగదాదివానరాధిపతుల
మీఁదఁ బిడుగు లట్టి మేటిబాణంబులు
వైచి సింహనాద మాచరించె. 224

వ. అచటికి విభీషణ సుగ్రీవులును నీల మైంద ద్వివిద సుషేణ కుము దాంగదాదులు హనుమంతునితోఁ గూడి వచ్చి నాగపాశబద్ధులై యున్న రామలక్ష్మణులం గాంచిరి వారును. 225

సీ. చెయ్వు లెవ్వియు లేక చేష్టుచు నిట్టూర్పు
కన్ను మూఁత ల్వాడ నున్నవారిఁ
దొప్పదోఁగఁగ మేను దుమ్ము నెత్తురుతోడ
నెదిరిఁ ద మ్మెరుగక కదలువారి

నాగపాశములచే నలుమూలలుం గట్టఁ
బడి సొమ్మసిలినట్లుఁ బడినవారి
బాణపరంపరాపరిణద్ధదేహముల్
శరతల్పములఁ జేర్చి తరలువారి
తే. చుట్టు వాఱిన సైనికుల్ చుట్టములును
మూఁగి చూచుచుఁ గన్నీళ్ల ముంచి మేను
లకట కట్టా యనుచును దుఃఖార్తిఁ జూప
నన్నెమని పున్నెమని పల్క నట్టివారి. 226

వ. చూచి దుఃఖించుచుండ నింద్రజిత్తు మేఘంబులచాటున నుండి చూచి రామలక్ష్మణులు మృతించి రని తలంచి నాతండ్రికి మెండుగ ముదంబు గూర్చినవాఁడ నయితి నని సంతసించుచు రాక్షసులు వినఁ దనప్రభావం బగ్గించుకొనుచు నత్యంతగర్వదుర్విదగ్ధుండై నీలునిఁ దొమ్మిదివాలమ్ములను మైందద్వివిదుల మూఁడేసి బాణంబులను జాంబవంతు నొక్కొక్కలం బగుతూఁపుననుహనుమంతునిఁ బదిప్రదరంబులను గవాక్షశరభుల రెండేసికాండంబులను గాడ నేసి మఱియు ననేకపృషత్కంబుల వానరవీరులపై నేసి సింహనాదంబుఁ జేయుచుఁ తండ్రికిం జెప్పఁ జనియె నిక్కడ రామలక్ష్మణులం గాంచి చింతించుచున్నసుగ్రీవుం దిలకించి కంట నీరు వెట్టుకొనుచు విభీషణుం డి ట్లనియె. 227

—♦ విభీషణుఁడు గరుడమంత్రముజపించుచు సేవించుట ♦—

సీ. సుగ్రీవ వగవకు వ్యగ్రతఁ గల వయి
యూఱడి కన్నీటి నొత్తి కొనుము
రామలక్ష్మణులు మూర్ఛాకలితులు గాని
మృతి నొందినట్టివా రెపుడుఁ గారు
నాగాస్త్రమున కిట్లు నలువవరం బగు
దాన నిగ్గతి వచ్చె దాశరథుల
కింతలో మేల్కొండ్రు చింతదక్కు మటంచు
నీట సుగ్రీవుకన్నీళ్ళు దుడిచి

తే. గరుడమంత్రజపంబును విడక జేయు
నట్టివాఁ డయి వారిదేహములు నిమురు
చును భయంపడుకపులఁ గన్గొనుచు నూఱ
డించుచుండె విభీషణుఁ డంచితముగ. 228

వ. అట నింద్రజిత్తు తండ్రికడకుం జని నమస్కరించి యి ట్లనియె. 229

శా. తండ్రీ! నీదుమనోరథంబు సఫలత్వం బందె నారాఘవుల్
దీంద్రల్ గల్గిన నాదునాగశరముల్ దేదీప్యమానప్రభన్
వేంద్రంబున్ వెలిగ్రక్కుచున్ గవియుటన్ వేంచేసి రమ్మింటికిన్
వాంద్రంజేసి తటస్థమైనభయమున్ భావంబునన్ వీడుమా. 230

క. అన విని రావణుఁ డెంతయు
మనమున హర్షించి తనకుమారునిఁ గౌఁగిం
టనుఁ జేర్చి శిరము పుడుకుచుఁ
దను వెంతయుఁ బొంగ మెచ్చెఁ దనయుని నెంతేన్. 231

—♦ నాగపాశబద్ధులైనరామలక్ష్మణులను సీతకుఁ జూపుట ♦—

శా. సీతారక్షకురాంద్రఁ బిల్చి కుతుకశ్రీరాజితాస్యంబుతో
నోతన్వీమణులార! నాతనయనాగోగ్రాస్త్రపాతంబునన్
జైతన్యం బఱి రామలక్ష్మణు లటన్ సంగ్రామరంగంబునన్
బాతం బందిరి సీతకున్ దెలిపి చూపం జెల్లు మీ రిత్తఱిన్. 232

ఆ. పుష్పకంబు మీఁదఁ బూఁబోఁడి నెక్కించి
రణమునందుఁ బడినరామలక్ష్మ
ణులను జూపి రండు పొలతులార! యని
యంపిపుచ్చె రావణాసురుండు. 233

ఆ. రామమరణవార్త రావణుఁ డాలంకఁ
గలుగువార లెల్లఁ దెలిసికొనఁగఁ
జాటఁ బనిచి మిత్రసంఘాంచితుం డయి
మహి మెొనర్చె నపుడు మహితముగను. 234

వ. రాక్షసాంగన లాసీతాదేవిం గొని పోయి యొక తెఱుంగక పన
యున్న రామలక్ష్మణులం జూప నాపె శోకానలదందహ్యమాన
మానసయై కన్నీరు మున్నీరుగ నేడ్చుచు. 235

సీ. నను సుమంగలి యంచు మునులు దీవించుట
వితథ యయి పోవునే వితము దప్పి
పుత్రవతివి గమ్ము పూఁబోఁడి యని పెద్ద
లాశీర్వదించుట వ్యర్థము లోకో
సౌమిదమ్మవు గమ్ము సుదతి నీవనుమాట
నుడి యసత్యం బయి చెడియె నయ్యొ
పదివేల వరముల్ పడఁతి జీవించునీ
పతి యన్నజోస్యము పదటఁ గలిసె.

తే. బ్రాహ్మ్య మైంద్ర మాగ్నేయవారుణములు
లోనిశస్త్రాస్త్రములు గల్గి లోకవిదితు
లైనరఘువర్యు లీరీతి నలఁతియింద్ర
జిత్తువలనఁ జానయ్యోనే చెల్ల చెల్ల. 236

క. అని యిట్లు పలు తెఱంగుల
వనటం బడు వారిజాక్షివదనము గని వెం
టన యున్న త్రిజట యి ట్లను
వనితామణి శోక మందవలవదు నీకున్. 237

—♦ త్రిజట రామలక్ష్మణులు సజీవు లని సీతకుఁ జెప్పుట ♦—

శా. నీనాథుండు సజీవుఁ డిందులకు సందేహంబు లే దింతయున్
బ్రాణంబుల్ విడనేని సైన్యముల కీషక్కిన్ బ్రకాశంబు గ
న్గో నుంటల్ విన మీవు పీతధవవై గో డంది తే నీవిమా
నానూనప్రభ తగ్గి పోవు నిదె సాక్ష్యం బిచ్చు చుండెన్ సతీ. 238

క. సుగ్రీవుండు విభీషణుఁ
డగ్రస్థానమున నిల్పి యార్యుల ముఖముల్
వ్యగ్రత మెఱుఁగని తెఱఁగున
సుగ్రీవుల యగుచునుండ్రు చూడుము తల్లీ. 239

వ. ఇది రామలక్ష్మణులకు మూర్ఛ గాని మఱొండు గాదు నామాట నమ్ముము నేను హితంబుఁ గోరుదాన ననుచున్నంత విమానం బశోకవనంబునకుం బోయె నిక్కడఁ గొంతలో రామచంద్రుండు కొంచెము మేలు కాంచి ప్రాణంబులు వాసిన ట్లున్న లక్ష్మణుం గాంచి. 240

మ. అనుగుం డమ్ముఁడు నాగపాశహతిమైఁ బ్రాణంబులన్ బాసినన్
జనకక్ష్మావరపుత్రితో నవనితో జన్మంబుతోడం బ్రయో
జన మొక్కింతయు లేదు కాదు బ్రతుకన్ స్వాంతంబు గావింపఁబె
ల్చననేఁ బ్రాయము జేసి గిట్టుటకునై సంకల్పమున్ జేయుదున్. 241

వ. అని పలుకుచునంతలో మఱియు మూర్ఛిల్లె నది గని యెల్ల వానరులు నల్లతల్లడం బడుచుండి రాసమయంబున. 242

—♦ గరుత్మంతుఁడు వచ్చి నాగపాశంబుల వదలించుట ♦—

సీ. మెఱుఁగులతోఁ గూడి మేఘంబు లన్నియుఁ
బఱవాతంబునఁ బాఱఁదోడఁగ
నల్లకల్లోలమై యంబుధి యంతయు
నాకాశమంటెడు నట్లు లేచెఁ
బెనుమ్రాఁకు లన్నియుఁ బెళపెళ మని విఱ్ఱి
నేలపైఁ బడె నాల్గుమూలలందుఁ
బుడమి దద్దఱిలంగభూరిసాధము లెల్ల
విఱిగి క్రిందం బడెఁ బృథివి నిండ

ఆ. తెక్కఁద్రోయి విప్ప నెక్కొనువాయువు
నేల నింగి నింపఁ జాలె నపుడు
కుంకుమకును సవతుఁ గొనజాలు పె న్మేను
చెల్ల నేగుఁదెంచెఁ బొల్లిగ్రద్ద. 243

ఆ. గ్రద్దతెక్కఁదోయిఁగాలి సోకినమాత్ర
నాగపాశములవి నరపతులను

విడిచి పాఱిపోయె వెసవెస నంతలో
గరుడి వచ్చి వారిసరసఁ జేరి. 244

వ. వారి కాయంబు లంటి నిమిరినమాత్ర వారుప్రకృతి నంది లేచి చెంత నిలిచి తమమేను లంటి నిమురుచున్నగృధ్రరాజుం గాంచి రాముం డి ట్లనియె. 245

ఉ. మమ్ముఁ గృపారసంబునను మన్చినమీ రెవరయ్య మాపయిన్
ముమ్మఱ మైనప్రీతి యిటు పుట్టుట కేమికతంబు నాగపా
శమ్ములు మమ్ముఁ జుట్టుకొని చంపుచునుండెడివేళ గృధ్రరూ
పమ్మున వచ్చినట్టిరు సుపర్ణులరో సురలో వచింపరే. 246

ఆ. అనిన గరుడి యనియె నయ్య నీచెంత నీ
పాదసేవఁ జేయుభక్తవరుఁడఁ
దాసుఁడన్ సురారితనయుండు నాగాస్త్ర
మేసినట్టు లెఱుఁగ నే నెఱింగి. 247

శా. నా కీదాస్యముఁ జేసిపోవుటకు సంధానించె దైవం బటం
చీకాలంబున మిమ్ముఁ జూచుటకు ని ట్లేతెంచితిన్ ధన్యుఁడన్
మీకున్ సేవ లొనర్చుటల్ త్రిజగముల్ సేవించుటల్ నాగముల్
మీకున్ లెక్కయె గారుడాస్త్ర మది కూర్మిం గౌశికుం డీయఁడే.

వ. నావృత్తాంతంబు మీ కవ్వల నిన్నవించెద యిపు డింతమాత్ర నను గ్రహింపుఁ డీరు తలంచినప్పు డిట్లు వచ్చి నాచేయ నైన కార్యంబు చేసి పోవుదు నని సెలవుఁ గొని రామలక్ష్మణులకుఁ బ్రదక్షిణంబు గావించి దివంబునకు నిర్గమించె నప్పు డెల్లవానరులు నత్యంతానందంబు నొంది కిలకిలారావంబులును సింహనాదంబులును జేయుచు రామలక్ష్మణులం జుట్టువారుకొని యుండి రయ్యవసరంబున. 249

—♦ రావణుఁడు నాగపాశవిముక్తిం దెలిసికొనుట ♦—

ఉ. రావణుఁ డమ్మహోత్సవకరం బగునారవమాలకించి లో
దేవురు పుట్ట మంత్రులను ధీవరులన్ పిలిపించి వానరుల్

చేవ నెసంగుచున్ ధ్వనులు సేయుచునుండిరి నాగపాశబా
ధావృతులై మృతించిరనుసట్టిన రేందు్రలు ముక్తిఁ గాంచిరో. 250

క. చచ్చిరి నరపుంగవు లని
యిచ్చట నచ్చటను బ్రిజ లనేకవిధములన్
ముచ్చట లాడుచునుండఁగ
వచ్చె నిటుల్ కారణంబు వలయు నెఱుంగన్. 251

వ. అని వా రొక్కమహోన్నతసౌధం బెక్కి నాగపాశవిముక్తు లైన దాశరథులను భేరీమృదంగానకపటవాదుల మొఱయించుచు గంతులు వేయుచున్నవానరులం గాంచి వచ్చి రావణుదిక్కు మొగంబై. 262

చ. అసురవరేణ్య రాఘవు లహర్పతి తేజముతో వెలుంగుచున్
బ్రిస్రుమరశౌర్యసంపదలు గ్రాలఁ గనుంగొనవచ్చుచుండి ర
ద్దెసఁ గడుసంతసంబున విదిక్కులు దిక్కులు పిక్కటిల్లగాఁ
గొసరి మహాధ్వనుల్ సలుపుకొంచు వనేచరు లుండి రంతఁగన్.

—♦ రావణుఁడు ధూమ్రాక్షుని యుద్ధమునకుఁబుచ్చుట ♦—

వ. అని చెప్పిన రావణుండు రామలక్ష్మణులు నాగపాశవిముక్తులై రనుట కెంతయు జింతించుచు నీశ్వరవరప్రసాదసంభవంబు లగు నాగాస్త్రంబుల కిట్లు విముక్తి గలిగిన దన నింక సర్వరాక్షసవినా శంబు తప్పనిద యని తలంచుచు ధైర్యం బవలంబించి ధూమ్రా క్షుం డనుయోధాగ్రేసరుం బిలువ నంచి నీవు మహాసేనాసమన్వి తుండ వై పోయి రామలక్ష్మణులతో సర్వవానరసమూహంబును సమయించి ర మ్మనిన నతండు సమ్మతించి పరశు పట్టిస ముసల ముద్గర కరవాల భిందివాలాదిసాధనంబులు గల సేనాసమూ హంబుతో సర్వసన్నద్ధుండై ఖరవాహనోహ్యమానం బగు సాంగ్రామికరథం బెక్కి హనుమంతుం డున్నపశ్చిమద్వారంబు దెసకుం జనినంత వానరులును యుద్ధసన్నద్ధులై పాషాణవృక్ష ఘాతంబుల రాక్షసుల నఱుమాడుచుండి రప్పుడు రాక్షసులు

నానావిధాయుధంబుల ఘోరయోధనం బతిదారుణంబు గాఁ గావించి రప్పు డనేకరథంబులు నుగ్గునూచంబు లయ్యె నేనుంగులు పీనుంగులయ్యె తురంగంబులు వికలాంగంబు లయ్యెఁ గాలిబంట్లు నేలం గూలిరి సమరాంగణం బెల్ల పీనుంగు పెంటలయ్యె నెత్తురే ఱులు ప్రవహించె నప్పుడు. 254

మ. తనసైన్యం బది దైన్యమంది పఱువెత్తన్ గాంచి ధూమ్రాక్షుఁ డు
క్కున బాణాసన మెక్కువెట్టి కడిమిన్ ఘోరాస్త్రశస్త్రంబులన్
దునుగం జేసియు దోమ్మరాదులను సంధుల్ వీడఁగా బొప్పియున్
వనచారివ్రజమున్ క్షణార్ధమునఁ జావం జేసె నీ సేర్పడన్. 255

మ. హనుమంతుం డొకగండశైలమును హస్తాగ్రంబునం బూని పెం
పున ధూమ్రాక్షునిమీఁదికిన్ గవిసి యేపున్ జూపుచున్ స్యందనం
బును రథ్యంబులు సూతుఁడున్ దుమురయై పో నేసినన్ ద్రెళ్ళ న
య్యును నక్తంచరుఁ డట్టె తూలిపడె నేర్పొప్పంగ లంఘించుచున్.

సీ. ధూమ్రాక్షుఁ డగ్గతి దుమికి నేలకు నొక్క
పెంగద చేఁ బూని పెంపుమిగిలి
సామీరిపై పైకి సాఁగిపోయెడులోన
నతఁడు క్షణంబున నతనిసైన్య
మంతయు దైన్యము నందఁ జేయుచునుండఁ
గ్రవ్యాదుఁడునుఁ జేతిగదను ద్రిప్పి
వానరేంద్రునితల వ్రయ్యలుగా నేసె
నేసిన నొక్కింత యేపు దక్కి

తే. హనుమ తెప్పిటి యొకపర్వతాగ్రమెత్తి
రాక్షసునిమీఁద నేయఁగ నాక్షణంబ
శిఖరమును తెక్కలుం దెగ క్షితిధరంబు
కరణిఁ గూలెను నేల కాసురవిరోధి. 257

—♦ వజ్రదంష్ట్రుఁడు వానరసేనతో యుద్ధము సేయుట ♦—

వ. ధూమ్రాక్షునిసేనయుఁ జచ్చియు నొచ్చియు నామమాత్రావ శిష్టంబై లంకాభిముఖంబు వెట్టి పోయె నటఁ బ్జ్రిగీప్రుండును

ధూమ్రాక్షుండు దెగుట విని కోపఘూర్ణితనయనుండై కాలాహి వలె రోజుచు వజ్రదంష్ట్రుం డనువానిం బిలిచి నీవు రామలక్ష్మణ సహితంబుగ సుగ్రీవబలంబులనెల్ల నుగ్గాడి ర మ్మనిన సమ్మతించి యతండు చతుర్విధసైన్యంబుఁ గూర్చుకొని రథాధిరూఢుండై చతురంగబల కోలాహలంబు దిక్కులు పిక్కటిల్ల నంగదుం డున్న దక్షిణదిగ్భాగంబునకుఁ జనినంత నట వానరరాక్షసుల కక్షీణాయోధనం బయ్యె నయ్యెడ. 258

సీ. మేనులుతునియలై మేదినిం బడెఁ దలల్
తెగిన మొండెంబులు తిరుగులాడెఁ
గాలుసేతులు త్రెస్సి నేలపైఁ బడియాడె
గుండెలు బ్రద్దలై కూలఁ బడియె
గుండెకాయలు త్రెస్సి కుంభినిపైఁ డొల్లె
మాంసపుకండలు మహిని గప్పె
రక్తపునదులు సువ్యక్తమై ప్రవహించె
రథగజాశ్వాదులు రజము లయ్యె
తే. వృక్షచరులను రాక్షసుల్ విడనిరీతి
వృక్షపర్వతముల గదాహేతితతులఁ
దుములయుద్ధముఁ గావించుసమయమందు
నఖిలలోకభయంకర మగుచునుండె. 259
ఆ. వజ్రదంష్ట్రుఁ డపుడు పాశహస్తుం డైన
యముని రీతి నాగ్రహమున వృక్ష
చరసమూహములను జంపుచుండఁగ నంగ
దుండు గండుమిగిలి చెండె నరుల. 260

— అంగదుఁడు వజ్రదంష్ట్రుని సంహరించుట —

ఉ. అంగదుఁ డంగవించి విపులాంబకముల్ నిగిడించువజ్రదం
ష్ట్రుం గని తచ్ఛమూచయముఁ జుట్టునుముట్టడివెట్టి పట్టి యు
త్తుంగమహీధ్రముల్ విసరి తొప్పలుదోరలు కుప్పగూరగా
ద్రుంగి పడంగ నేసెఁ గసితోఁ గరలాఘవ మేర్పడన్ వడిన్. 261

సీ. తనసేన మల్లెవట్టినచేను నా నట్లు
క్షీణించుటకు లోనఁ జింతచేసి
వజ్రదంష్ట్రుఁడు క్రోధపరిపూరితాత్ముఁడై
మహోర్వివిరావము పర్వఁ జేసి
చండాశుగంబులు శతసహస్రములు గా
నిగిడించి వానరానీకినులనుఁ
జెండాడుచుం గపిశ్రేష్ఠు నంగదుఁ దాఁకి
క్రూరాస్త్రశస్త్రముల్ గుప్పఁగురిసె
తే. అప్పు డంగదుఁ డతనిపరాక్రమంబు
గాంచి సైపక పర్వత మెంచి పట్టి
వానిశీర్షముపైఁ బడ వడిగ నేసి
సింహనాదముఁ గావించె రంహముగను. 262
ఆ. తాఁకుమో పెఱుంగుదంట గావున వజ్ర
దంష్ట్రుఁ డరద మిఁగి ధరణి కురికెఁ
బర్వతంబు రథముపైఁ బడ వీతుల
తోడ సూతుతోడఁ దుముర యయ్యె 263
చ. గద గొని వజ్రదంష్ట్రుఁడు ప్రకంపితభూతలుఁడై కడంక నం
గదు నెదిరింప నాతఁడును గస్సని లేచెడుతాఁచునాఁగ నై
కదిసి మఱొక్కపర్వతము గైకొని మొత్తెను మొత్త రాక్షసుం
డదటున వ్రాలి మూర్ఛఁబడి యంతటిలోఁ దెలివిం గలండయ్యె.
సీ. గద వేసి యంగదుఁ గదలింప నేరక
పోలసుదిండి నియుద్ధమునకుఁ గడఁగె
నపుడు వా రొండురు నాగుచు లాగుచుఁ
గొట్టుచుఁ బట్టుచుఁ జుట్టుకొనుచు
నెట్టివేయుచు నంత నెత్తుటఁ జొత్తిల్లి
యలసి నిల్చియు నట నట్టు నిట్టు
వజ్రదంష్ట్రునిపయి వడి వ్రాలి కత్తుక
రెండుచేతులఁ బట్టి గుండె గొట్టి

తే. అంగదుం డొక్కఖడ్గము నట్టె పట్టి
శిరము ఖండించె నంతలో ధరణిధరము
నేలఁ గూలినవిధమునఁ గూలె నపుడు
వానియనుచరు లెల్లరు పాఱి రడలి. 265

—♦ రావణుఁ డకంపనునిఁ బోరికిం బుచ్చుట ♦—

వ. వజ్రదష్ట్రుని మరణంబు విని రావణుండు సేనానాయకాగ్రసరుం డైనయకంపనుం డనువానిం బిలిచి రణంబునకుఁ బో నియమించిన నతండు సర్వసన్నద్ధుండై రథంబెక్కి సేనాసమూహంబుతో సింహనాదశంఖనాదభేరీనాదంబులు బోరుకలుగ రణరంగంబునకుం జనియె నప్పు డుభయసేనలకు నతిభయదప్రకారంబున రణంబు ప్రవర్తిల్లె నాలోఁ గుముదుఁడు నలుఁడు మైందుఁడు ద్వివిదుఁడు లోనగువారు వాని నెదిరించి పోరినపోరు ఘోరం బయ్యెనయ్యెడ నకంపనుండు. 266

మ. ఒకబాణం బొకవేగరన్ దనుమున ట్లుగ్రంబుగా నేయుచున్
సకలాయోధనభూమిఁ దాన యగుచున్ సంగ్రామముం సల్పుచో
నొకఁడైనన్ నిలలేక వానరులు చెట్టొక్కండుగాఁ జేరు కో
నొకయుం తేనియుఁ గొంకులేక చనసై యోలంబు నాశించుచున్.

—♦ హనుమంతుఁ డకంపనునిం గూలఁజేయుట ♦—

తరు. హనుమంతుఁ డంతలో నరుదెంచి పఱచు
నాసైనికులను జేయూడించి పిలిచి
దనుజుని మర్దింపఁ దలపోసి చేత
ధరణిధరంబొండు దాలిచి వర్ష
మునుబోలె శరముల మునిఁగియుఁ జంకఁ
బోవక వచ్చునప్పురుషునిఁ జూచి
దనుజుఁడు చండాస్త్రి దాని ఖండించి
దద్దఱిల్లఁగ నార్చె ధరణీతలంబు. 268

తే. అలిగి హనుమంతుఁ డొకసాల మట్టె పెరికి
గిరగిరం ద్రిప్పుకొంచును బరిసరముల

నున్న సైన్యము లన్నియు నుగ్గునూఁచ
మగు తెఱంగునఁ జేయుచు నసురఁ దరిసి. 269

ఉ. వృక్షము త్రిప్పి వేయుతఱి వీరవరేణ్యుఁ డకంపనుండు ప్ర
త్యక్షయమంబునా నరయనై పదునాలుగువాలుతూపులన్
వృక్షచరాగ్రగణ్యుఁ డపవిద్ధశరీరునిఁ జేయగా నతం
డక్షియుగంబు కెంపు గన నాతనిఁ గన్గొని నవ్వి రివ్వనన్. 270

క. వృక్షమున రాక్షసాధము
వక్షమునన్ బిడుగువోలెఁ బడునట్లు పడన్
దక్షత నైవఁగ మృతుఁడై
రాక్షసుఁడిలఁ గూలె భూధరము గూలుగతిన్. 271

వ. అట రావణుం డకంపనుని మరణంబు విని కోపతాపంబు లేపు
మీఱ ప్రహస్తునిదిక్కు మొగంబై యి ట్లనియె. 272

—♦ రావణుఁడు ప్రహస్తుని యుద్ధమునకుఁ బుచ్చుట ♦—

ఉ. ఓయి ప్రహస్త నీవు మఱియుం గలవారు సమర్థు లెందఱో
నాయఁలు వేల్పులై వెలసినా రొకరుండును శత్రుసైన్యమున్
బాయక నాపురంబు నలుప్రక్కల ముట్టడివెట్టి యుండ గాఁ
జోయు మొనం దునుక గడపఁ బూనఁడు కానఁ డి దేమి కర్మమో.

తె. ఎల్ల రసమర్థులే గాని యింద్రజిత్తు
గాని మనకుంభకర్ణుఁడు గాని శత్రు
సైన్యములఁ దూల పుచ్చంగఁ జాలి యుంద్రు
గాని పెర లేరు గా రని నేనుఁ దలఁతు. 724

చ. అనుఁడుఁ బ్రహస్తుఁ డి ట్లనుచు నార్తి వెలార్చుచు నిట్లు పల్కె నో
ఘనభుజ మీర లిట్లనుటఁ గంపము పుట్టెడు నాదుచాలమిన్
వినిచితి రేను దీనఁ గడు విన్నదనంబునుఁ బొంద నైతి నా
బొనరిచినట్టి యుద్ధములఁ బోలిచి యైనను చూడ రక్కసా. 275

క. నాదగుబ్రతు కేమిటి కిఁక
నీదినమున నిట్టిమాట నే విన నైతిన్.

గా దనిపలుకఁగ నగునే
మా దేవుఁడుపలుకుచుండ మఱి యొకమాటన్. 276

తే. వినుము నీయాజ్ఞ యగునేని విడిచి సకల
సంపదల నాలిఁ గీలియు సంతతియునుఁ
గల దనెడుమాట తలఁపక కల నొనర్ప
సరిగెదనుఁ బ్రాణ మైనను సరకుఁ గొనక. 277

తర. అని ప్రహస్తుఁడు సర్వసైన్యము నంటిరా దనుజేంద్రు నా
జ్ఞను శిరంబునఁ బూని వానరసైన్యమున్ వడి దాఁకఁగా
జనె రథంబున నెక్కి భేరులు శంఖముల్ మొఱయంగ న
య్యని యొనర్చెడుచోటికిం జనె నార్పు లుప్పతిలంగడున్. 278

—♦ ప్రహస్తుఁడు ఘోరయుద్ధముచేయుట ♦—

ఉ. కొండలు పిండిసేయుటకుఁ గూడ సమర్థము లైనశస్త్రముల్
మెండుగఁ దాల్చి పెల్చ నలమిత్తికి నెత్తయి వచ్చునాతనిన్
గొండొకఁ దవ్వునంద కని ఘోరతరాకృతి గల్గు నీఁత డె
వ్వం డని పృచ్ఛచేసె రఘువర్యుఁడు మెచ్చుచు రావణానుజున్. 279

క. అతఁ డారామునిఁ గనుఁగొని
యితఁడు ప్రహస్తుండు రాక్షసేశ్వరసేనా
తతికి నధీశ్వరుఁ డనిలో
నితనికి నీతండె సాటి యెల్లవిధములన్. 280

క. అనితరసాధ్యం డీతఁ డి
తనిబలసంపత్తివలన దానవనాథుం
డనిమొనల నెల్ల వేల్పుల
మునుమున్న జయింపఁ గల్గెఁ బో రఘువీరా. 281

—♦ నరాంతకాదులు నిధనంబు నొందుట ♦—

సీ. అంతలో నుభయసైన్యంబులున్ బోరంగ
మొనసె రాక్షసు లస్త్రములను శస్త్ర

ములను మొత్తిరి వానరులు వృక్షముల దూలఁ
బిడికిళ్ళఁ బెనఁగిరి భీకరముగ
భేరీనినాదముల్ వీరులశబ్దముల్
మి న్నంటి మ్రోసెను మిక్కుటముగ
నంతలోపల సమరాంగణం బంతయుఁ
బీనుంగుపెంటలై గానఁ బడియె

తే. అప్పుడు నరాంతకుఁడు కుంభహనువులును స
మున్నతుఁడును మహానాదు లన్నవారు
వానరానీకములనెల్ల వరుసఁ బట్టి
సంహరింపఁగఁ జొచ్చి రాసమయమందు. 282

క. ద్వివిదుం డొకపర్వతమునఁ
జవమేర్పడ వచ్చి రాక్షసచతుష్కమ్మున్
బ్రవరుం డైననరాంతకు
భువిఁ గూలఁగ నేసె నరులపోడిమి చెడఁగన్. 283

తే. దుర్ముఖుం డేచి యొకచెట్టుతో సమున్న
తుని వధించెను జాంబవంతుండు గండ
శిలమహానాదు నడగించె శిరము పగుల
తారుఁ డాకుంభహనువును దరలఁ జేసె. 284

ఉ. ఆలము వీడి రావణుఁడయత్నపరాఙ్ముఖుఁడై చనంగ నా
భీలతరారిశస్త్రముల వేఁడికి బెగ్గిలి తద్బలంబులున్
బోలని పోకఁబోవఁ గని పోఁడిఁ బ్రహస్తుఁడు హస్త మెత్తి చాల్
చాలుఁ బరే నిలుం డనుచుఁ జయ్యనఁ గొల్లలఁ జేసెఁ జేసినన్.

ఉత్సాహము. పెల్లగిలినమూఁక లెల్లఁ బెచ్చుపెఱిగి వెంషియున్
బెల్లు మూఁగి సాహసించి వీడ కనికిఁ బొదలి పెం
పుల్లసిలఁగఁ దొడరిపోరు చుండుఁడు న్విభీషణుం
డొల్లఁబోవఁ జేసె నసురయోధులున్ రయంబునన్. 286

—♦ ప్రహస్త విభీషణులు పోరుట ♦—

స్రగ్ధర. క్రుద్ధుండై యిట్లు రక్షఃకులధరపవియై క్రూరనారాచసారో
ద్బుద్ధుండై యుద్ధశక్తిన్ బరఁగుదశముఖభ్రాత నీక్షించి రోషా
విద్ధాత్ముండై ప్రహస్తాభిహితవిబుధవిద్వేషి దూషించి స్పర్ధన్
యుద్ధోర్వి న్నిల్చి పెల్చన్ హుతవహుఁడననుజ్జ్వాతలూగించెవానిన్.

మ. తొలఁగం బోవఁగనీక వీఁకఁ గృతహస్తుం డాప్రహస్తుండు ని
స్తులనారాచములన్ జమూనివహముం శోధించి వేధించుచుం
జలముం జూపుచు నున్నవానిబలముం జక్కాడ నొక్కుమ్మడిన్
విలసత్కీర్తి విభీషణుం డెదిరె దోర్వీర్యం బవార్యంబుగన్. 288

క. ఘనయశుఁడైనఁ బ్రహస్తుం
డనితరసాధ్యంబు లైనయగ్న్యస్త్రములం
వనచరవీరుల నెల్లన్
దునుమాడెన్ బిలువ పేరు తోఁపనిగతిగన్. 289

మ. అరదం బెక్కి కపీంద్రసంఘముల నట్లాలంబునం గూల్చుచుం
గరిమం గన్నప్రహస్తునిం గని భుజాగర్వంబునన్ నీలుఁ డ
చ్చెరు వెచ్చం బ్రదరంబులన్ మునిఁగియున్ జెట్టొండుచేకొంచు ది
గ్గిరదానిం దిరుగాడఁ జేయుచు ననిం దీపించె దావాగ్నినాన్. 290

—♦ నీలుఁడు ప్రహస్తుని సంహరించుట ♦—

ఉ. నీలునిమేన నెత్తురులు నిల్వనఁ గాలువలై స్రవింపఁ బెన్
గోలల నేసి రాక్షసుఁ డకుంఠితశక్తిని శక్తిముఖ్యముల్
చాలఁగ నేసి రోసమున సంఘుల బంధము వీడఁ జేసినన్
నీలుఁ డచంచలుం డగుచు నిల్చి ప్రహస్తుని తేరిపైఁ బడెన్. 291

తే. అశ్వముల గూల్చి సారథి నట్టె మొట్టి
చేతివిలు లాఁగి రెండుగాఁ జేసి పేర్చి
యార్చెనుఁ బ్రహస్తుఁ డిల కుర్కి హస్తములను
ముసలమునుఁ బట్టి నీలుని మొనసి దాఁకె. 292

చ. మదము స్రవింప నేనుఁగుల మాడ్కిఁ జమూపతు లిర్వురున్ గడున్
మదమున మేని నెత్తురులు మాటికిఁ గాలువ గట్ట నార్చుచున్
గదన మొనర్చి ర ప్డసుర శౌర్య మవార్యము గాఁగ నీలునిన్
గద గొని వేయ నెత్తురులుఁ గారుచునున్నఁ జలింప కాతఁడున్. 293

శా. పాషాణం బొకఁ డుద్ధతిం గొని సుపర్వద్వేషి శీర్షంబుపై
రోషం బేర్పడ నేసి యార్చె నది యారూఢస్థితిన్ దాఁకి ని
శ్శేషం బౌదల శీర్ణమైన ధరకుం జేరెం బ్రహస్తుండు త
చ్ఛేషానీకిని లంకమో మయి చనెం జేటొప్పటు వాటిల్లఁగన్. 294

క. నీలుని రాముఁడు లక్ష్మణుఁ
డాలోఁ గౌఁగింటఁ జేర్చి యభినందింపన్
వాలికుమారుం డాతని
పాలఁ బ్రసన్నుండ యగుచుఁ బ్రస్తుతిఁ జేసెన్. 295

వ. అనిచెప్పిన విని పరమాశ్చర్యభరితాంతరంగులై నైమిశారణ్యవాసు
లవ్వలి వృత్తాంతంబు చెప్పుమని సూతు నడుగుటయును. 296

—♦ ఆ శ్వా సాం త ము ♦—

మ. వరలక్ష్మీ నరసాంబికా హృదయభాస్వచ్ఛుక్తి సమ్యగ్భవం
బుగు తేజః ప్రతిభావితంబు సుగుణస్యూతం బనర్ఘంబు భూ
వరకంఠాభరణాయమానము జగద్వర్ణ్యంబు శ్రీవేంకటే
శ్వర నామాంకిత రత్నమొప్పెనఁగు దివ్యప్రాభవోపేతమై 297

గ ద్య ము.

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ, కవి
సార్వభౌమాంధ్రవ్యాసాభినవశ్రీనాథ వేదవిద్యావిశారద
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన శ్రీకృష్ణ
రామాయణంబునందు యుద్ధకాండంబునఁ
బ్రథమాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# శ్రీకృష్ణరామాయణము

—————:o:—————

## యుద్ధకాండము

### ద్వితీయాశ్వాసము



మత్పుస్తకరూప
క్షేమంకర విత్తపత్రిసేవధివలనన్
శ్రీమించు నీదరార్యుఁడు
భూమిం బెంపొందుఁ గల్పభూజం బగుచున్. 1

వ. అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె నట్లు ప్రహస్తుండు
నీలునిచేఁ దెగిన యనంతరంబ. 2

—♦ రావణుఁడు చతురంగబలముతో యుద్ధమునకు వెడలుట ♦—

సీ. అటఁ బ్రహస్తుఁడు నీలుఁ డనువానిచేఁ దెగు
టాలించి రావణుఁ డార్తిఁ జెంది
ధైర్యంబుఁ గలఁ డయి దైత్యవీరులఁ గాంచి
శతమన్యు నోర్చినశౌర్యశాలి
మనప్రహస్తుఁడు ద్రెళ్లె ననఁ దోఁప దొక్కింత
యేన యద్ధమునకు నేగువాఁడ
నని చతురంగసైన్యములతో యోధాగ్రి
గణ్యులతోడ సాంగ్రామికరథ
తే. మెక్కి తూర్యధ్వనులు మ్రోయ మొక్కవోని
బాహువిక్రమ మెంతయుఁ బరిఢవిల్లఁ

బ్రిజ్వరిల్లుచు నగ్నిహోత్రంబు నాఁగఁ
బాలికలని కేగుదెంచె నప్పొలసుదిండి. 3

వ. ఇట్లు సేనాసమేతుండై శౌర్యలక్ష్మిం జేసి ప్రకాశించుచు వచ్చు రావణుపరివారంబుఁ గని రామచంద్రుండు విభీషణునిదిక్కు మొగంబై యావచ్చువా రెవ్వ రెవ్వ రీసేన యెవ్వరిది చెప్పు మనిన నతం డాతని కిట్లనియె. 4

—♦ విభీషణుఁడు రామునకు రావణాదుల నిరూపించి చెప్పుట ♦—

సీ. సింహధ్వజంబునఁ జెన్నగు తేరిపై
నెక్కి వచ్చెడునితం డింద్రజిత్తు
కొండనాఁ దేరిపైఁ గూర్చుండి పటు తెంచు
వాఁ డతికాయుఁ డవార్యశౌర్యుఁ
డపుడ పుట్టినసూర్యుఁ డన వెలుంగుచు నేన్గు
మీఁద నావాఁడు మహోదరుండు
సంజప్రొద్దన నొప్పు సప్తిపై నెక్కిన
ప్రాసాయుధి పిశాచరాక్షసుండు

తే. వీరు కుంభనికుంభులు వీఁడు త్రిశిరుఁ
డదె నరాంతకుఁ డాతఁడే యఖిలదేవ
తాళి నటిట్టుపడఁ జేసినట్టిఘనుఁడు
రావణుం డని తెలియుము రామచంద్ర. 5

మ. పదిమోముల్ పదిదిక్కులన్ గనఁగనై భాసిల్ల సాస్త్రంబు లి
ర్వదిచేతుల్ గలఁడై మహేంద్రగిరినా వర్ష్మంబు దీపింపఁ గా
నుదితార్కుం డన నొప్పి రత్నముకుటప్రోద్యత్ప్రభాశీర్షుఁ డా
మదమాతంగము ఘీంకరించు రఘురామా! వింటివే! గంటివే. 6

తరు. అన రాముఁ డను నతం డర్కుండు వోలె
నతిదీప్తిఁ గలఁ డయి యతిశయిల్లెడిని
కనినంత నామది కసలుఁ గుస్సినది
కనికరింపదు వీనిఁ గడతేర్తు నిపుడ

యనుచుండ సుగ్రీవుఁ డాతనిఁ జూచి
స్వాంతంబునన్ సైఁప కద్రి యొకండు
గొని వానిమీఁదికిఁ గొనకొని పోయి
కొట్టె వక్షమున నాకుధరంబు వెట్టె.

—♦ సుగ్రీవాదులు రావణు నెదిరించి పోరుట ♦—

ఉ. రాక్షసలోకనాథు డగురావణుఁ డప్పుడు చేర వచ్చునా
వృక్షచరాద్రిరాజమును వేఁడిశరంబుల వేయిముక్కలై
యాక్షణమంద నేలఁ బడునట్టులు చేసియు నంత వజ్రసం
శిక్షకమైన బాణమునఁ జేసి మథించెను వానరేశ్వరున్. 8

తే. దాన స్మృతి దప్పి సుగ్రీవవానరుండు
నేలఁ బడి చచ్చినట్టులు నెఱి దొఱంగె
రాక్షసులుఁ జూచి మిగులహర్షంబు నొంది
రపుడు దుఃఖించి రగచరు లడలు గుడిచి. 9

వ. అంతలో గజ గవయ గవాక్ష సుషేణ ఋషభ జ్యోతిర్ముఖ ప్రభృతు లగువానరులు గొప్పపర్వతంబులును వృక్షంబులును బూని రాక్షసేంద్రు నెదిరించి నొంచి రతండును వాఁడిములుకుల వేఁడిమిం జూపి వారి నెల్లరఁ జెల్లాచెదరు గావించె నందుఁ గొందఱు చచ్చియుఁ గొందఱు మెచ్చియుఁ గొందఱు కొందలం బందియు రామచంద్రుమఱువు సొచ్చి రపుడు రాముండు రావణాసురునిపై నెగ నెంచి యున్నపుడు లక్ష్మణుం డన్న కి ట్లనియె. 10

శా. అన్నా! తమ్ముఁడు ధన్వియై నికటమం దాజిన్ బ్రతీక్షించుచున్
విన్నాణంబున నున్నవాఁ డితనిన్ వేఁ బంపు మా నీచునిన్
మన్నిం జేకొని చేడ్పడన్ జలుపు నన్నున్ రాముఁ డ త్తమ్మునిన్
సన్నాహంబు నెఱింగినట్టిదయి కాంక్షన్ హార్ద్రభావంబునన్. 11

క. తమ్ముఁడ నీకోర్కికిఁ దగ
తమ్ముఁనిసిదిండితోడ నాలమున నెదు

రో్క్ర మ్మెదిరి నెఱిఁగిమెలఁగుము
సమ్మతి నిడినాఁడ నీదుసంభావనకున్. 12

—♦ హనుమంతుఁడు రావణు నెదిరించి పోరుట ♦—

వ. అని రాముం డాదేశించిన లక్ష్మణుండు ధనుర్బాణంబుల ధరించి ధనుష్టంకారంబు సేయుచు బాణవర్షంబు గుఱియుచు రావణాభిముఖంబుగన్ జనియె నాలో హనుమంతుండు రావణు నెదుర్కొని చే యెత్తి యుచ్చైస్స్వరంబున నిట్లనియె.

శా. ఓరీ రావణ! నీవు దేవవరులన్ యుద్ధంబులన్ గెల్చి వి
స్తారఖ్యాతి గణించి తన్నుడియే సత్యంబ యా నే నిదే
చేరన్ వచ్చితి నీదుప్రాణము గొనన్ జే యెత్తితిన్ గాచుకో
మ్మెవ్వ రీనిన్ను ననుగ్రహించెదరొ కానీ చూచుకో మ్మెత్తతిన్. 14

క. నా విని రావణుఁ డనియెన్
నీవాఁడి యొకింత జూప నీ వగుము నుడుల్
వేవే లేటికిఁ బొల్లులు
రావణుఁ డలఁతి యనుకొందురా వృక్షచరా. 15

తే. హనుమ యను నోరి! నా తేజు వినఁగ లేదొ
నీదుసుతు నక్షుఁ జంపుట నీవెఱుగవొ
పురము గాల్చుట చూడవొ మూర్ఖ యనుచుఁ
జేరి యఱచేత నతనిశిరముఁ జఱచె. 16

ఆ. హనుమచేతిచఱుపు నను బఙ్క్తికంఠుఁడు
గడగడ మని వడకునొడలు గలుగు
నట్టిఁ డగుచు నించు కంత విశ్రాంతికై
పఙ్క్తికంఠుఁడనియెఁ బావనిఁ గని. 17

ఆ. నీపరాక్రమంబు నాపట్లఁ జూపితి
మెచ్చుకొందు నిన్ను సచ్చరిత్ర
యనుడు న్నాంజనేయుఁ డనియె నోలంకేశ!
సిగ్గుపడుదు నాదుచేత కేను. 18

ఉ. ఈయరచేయి వజ్రి మగు నే భవదీయశిరంబు వ్రయ్యలై
పోయినయప్డు నీనుడులు పోలెదు ని ష్ఠిటు లంట తిట్టుచే
యీ యొకఁ జూడు ముష్టి యిదియే నిను నంతము నొందఁ జేయు న
ష్టీ యొనరించుసంస్తుతుల కించుకయర్థము గల్గి యుండెడిన్. 19

సీ. అనిన నొడు బిగించి దనుజేంద్రుఁ డాంజనే
యునిఁబొమ్మనన్ గుద్రె నురుతరముగ
దాన నించుక తూలి ధర వ్రాలి న ట్లయ్యె
నాలోపలఁ బలాశి నీలు నెదిరి
కఱకుటమ్ముల వానికాయము నొప్పింప
వాఁ డొక్క పెనుఁగొండ వాని నేసె
నేసిన రావణుం డేడుబాణంబుల
దానిఁ దుత్తునియలు గా నొనర్ప

తే. వీఁక నీలుఁడు మఱికొన్నిమ్రాఁకు లతని
పైనిగిడ్చిన నాతఁడు వాని నెల్లఁ
జిద్రుపలుగఁ జేసి నీలుపై శితశరములు
కురిసె నీలుఁడు తనరూపు కుఱచపఱచి. 20

వ. రావణునిరథపతాకంబుకొనకుం జని కూరుచుండి సింహనాదంబు సేయుచుఁ జిత్రవిహారంబు గావించె నంత రావణుం డాగ్నేయాస్త్రం బభిసంధించి నీలునిపైఁ బ్రయోగించిన నతండు స్మృతి దప్పి నేలపైఁ బడియె రావణుం డచ్చోటుఁ బాసి తనపై వచ్చులక్ష్మణునిమీఁది కరదంబుఁ దోలించి ధనుష్టంకారంబుఁ గావించిన లక్ష్మణుండును నారి సారించుచు రావణుం గాంచి యి ట్లనియె. 21

క. వానరులతోడఁ బోరన్
గా నీ వగుటరయ సమత గానిది యగు నో
దానవనాయక యిదె నా
తో నని గావించి కీర్తితుండవు కమ్మా. 22

సీ. అనవుడు రావణుం డను నీకుఁ గాల మా
సన్న మయ్యెను రమ్మ న న్నెదుర్ప

నని యేసువాలమ్ము లడరించె లక్ష్మణుం
డును వానిఁ దునిమెఁ దుత్తునియలుగను
గని పెక్కుబాణముల్ దనుజేంద్రుఁ డడరింప
నన్నింటి ఖండించె నతఁడు నడుమ
ని ట్లసురద్వేషి యేయుసాయకములఁ
దెగ నేయుచుండె వాఁడి యగుశరంబు

తే. లక్ష్మణుం జేసి యార్చిన లావు మెఱయ
రావణుఁడు బ్రహ్మదత్తాస్త్రరాజ మతని
పైఁ బ్రయోగించె సౌమిత్రిఁ బ్రజ్ఞ చెడియుఁ
దెలిసి రక్కసువిలు ద్రుంచెఁ బలమిక మెయి. 23

చ. విలుఁ దునుమాడి మూ డయినవేఁడిశరంబులఁ బట్టి కంతునిన్
బలమిక నేయ నాతఁడును బ్రహ్మ యొసంగినశక్తిఁ బూని తా
సెలవులు నాకుచున్ వయిచెఁ జెచ్చెర నయ్యది వచ్చి రామచం
ద్రులయనుజన్మువక్షమున దూఱెను సారెకు సొమ్మసేకుఱన్. 24

—♦ లక్ష్మణుఁడు రావణశక్తిచే మూర్ఛితుండగుట ♦—

ఆ. సొమ్మసిల్లి మూర్ఛ సొక్కినలక్ష్మణు
చెంత కేగి నిర్జరాంతకుండు
కొంచుఁ బోవ నెంచి కొని యెత్తఁ బోయెనుఁ
గాని యెత్తశక్తిఁ గలుగఁ డయ్యె. 25

తే. వాయునందనుఁ డప్పుడు వాఁడి మెఱసి
యెదురుకొని రావణునిఱొమ్ము చిదుకునట్లు
పిడికిటం బొడ్చె నందున నొడలు తెలియ
కతఁడు రథకూబరంబునఁ జతికిలఁ బడె. 26

మ. పదియున్ నోళులనుండి రక్తము స్రవింపన్ మైక మీఁరైదుక
న్నుదుగల్ నిండెను నట్లు క్రమ్ముకొన మేనుం జెమ్మటం దోఁగ దా
నదియుం గానక చచ్చెనో యన నటన్ వీక్షింపనై రావణుం
డదటుం జెంమట కెల్ల వేల్పులు ముదం బంధంగనై రత్తఱిన్. 27

తే. రావణునిశక్తి నొచ్చినరామునవనుజుఁ
జేతులన్ బట్టికొని యెత్తి వాతసూతి
జానకీవల్లభుని సమక్షమ్ము నకును
దెచ్చి నివసించఁగాఁ జేసెఁ జెచ్చెరమెయి. 28

వ. అంత నారావణప్రియుశక్తిశక్తియు. 29

ఉ. రావణుచెంతకున్ మఱియు రంహముగాఁ జన నయ్యె నాసుమి
త్రావరనందనుండు రఘురామునిచేత స్పృశింపనై కడుం
జేవమెయిం దలిర్చెఁ గపిశేఖరు లెల్లరు తేరి వచ్చినా
రావణుతో నెదుర్కొనఁగ రామి భయంబున బాఱఁ జొచ్చుడున్.

మత్త. రామచంద్రుఁడు రావణాసురు రాక్షసేశ్వరుఁ దాఁక సం
గ్రామరంగముఖంబుఁ జేరుడుఁ గాంచి వాయుతనూజుఁ డా
రాముచెంతకు వచ్చి యోరఘురామ ! నాపయి నెక్కి నీ
వీమెయిన్ రణ మాచరించుట కేను గోరికఁ జేయుదున్. 31

—♦ రాముఁడు రావణాసురు నెదుర్కొనియుద్ధముచేయుట ♦—

ఆ. గరుడిమీఁద నెక్కి కమలాక్షుఁ డానాఁడు
సకలరాక్షసులను సంహరించి
నట్లు నేఁడు నాదునంసమ్ముపై నెక్కి
రథికుఁ జంపు మితని రణముఖమున. 32

వ. అనిన రాముం డట్లయగుం గాక యని హనుమంతునిభుజశీర్షంబు
లపై నెక్కి రథారూఢుండై రణం బొనరించురావణునిమీఁదికిం జని
ధనుష్టంకారంబు సేయుచు ని ట్లనియె. 33

ఉ. నా కపకారకార్యము నొనర్చినని న్నిటు చంప వచ్చితిన్
నీ కిట దిక్కులే రెవరు ని న్నిపు డింద్రుఁడు చంద్రసూర్యులుఁ
లోకవిభుండు శంకరుఁడు లోనగువా రెవ రెట్లు కావఁగా
నై కడఁగట్టివచ్చిన క్షణార్థములోఁ దెగకుండ వీయనిన్. 34

చ. ఇతఁ డెవఁడో యటంచు మది నెంచెదవో పదునాల్గువేవు ర
గ్గతి ఖరదూషణాదులు నొకానొకయింతటిలో యమాలకమం

దతిథులుగాఁ జనన్ సలిపినట్టేఁడురాఘవుఁ డీ వెఱుంగు మీ
క్షితి కరుదెంచె మిత్త్రి యయి చెప్పితి నిప్పుడు విశ్వసింపుమా. 35

తే. రావణుఁడు రామవచనముల్ పోవఁ బెట్టి
వానివాహన మైవచ్చువాయుసుతుని
వాడి యమ్ములతో బొమ్ముఁ గాడ నేసె
నేసినం గని రాఘవుఁ డీసుఁజేసి. 36

చ. కరము కడంగి చండతరకాండము లన్ శతముల్ సహస్రముల్
సరయము గాఁగ రావణునిస్యందనమందుఁ బడన్ నిగిడ్చి త
త్కరముల నున్నఖడ్గమును ఖండములై పడఁ జేసె నంత న
య్యరదము కేతుసూతతురగాదులతో ధర దొర్లెఁ జూర్ణమై. 37

ఆ. మఱియు నొక్కపిడుగుమాదిరివాలమ్మున
వానివక్షమూడ వడిగ నేసె
దాన సొమ్మసిల్లిదానవేంద్రుఁడు వ్రాల
రామచంద్రుఁ డతని రమణఁ గాంచి. 38

—♦ రాముఁడు విరథుఁడైనరావణుని విడిచిపుచ్చుట ♦—

చ. అరదము వోయి శస్త్రములు నస్త్రములున్ విరళంబులై చనెన్
విరవిరవోవుచుండితివి వీరవరేణ్యుఁడ విట్టివిన్ను ని
త్తరుణమునందుఁ జంపుట కెదన్ ముదమొందను నేఁటి కేగి నీ
పురమున కీవు స్వస్థపడి పోరగ రమ్మిట కల్లి వెండియున్. 39

తే. అనిన గరువంబు దిగద్రావి దనుజవిభుఁడు
వీతరథుఁడు విశీర్ణరత్నాతిరుచిర
మకుటభూషణుఁడై సిగ్గుమాలి లంక
మోముపెట్టెను కాల్నడ భూమిఁ గనుచు. 40

సీ. లంకాపురికి నేగి శంక దక్కినమతిఁ
బజ్జికంధరుఁ డొక్కవలన నుండి
నెటఁ జిటుక్కనిన నిచ్చటికి వచ్చెడు నేమొ
రామబాణము లని రావణుండు

సింగంపునోటికిఁ జేర నౌనేనుఁగు
వలె గరుడిం గన్నపాము వలెను
వెలిచలిచినమది మెలఁగుపై మెలియురా
యనిమహాస్త్రంబుల కదటు గుడిచి

ఆ. నాదుగొప్పతనము నాశౌర్యధైర్యము
లిపుడు వ్యర్థ మయ్యె నే మహేంద్రి
తుల్యుఁ డగుచునుండి తుదకిట్లు మానవ
మాత్రుచేత నోడుమాత్రి నైతి. 41

—♦ రావణుఁడు మంత్రులతో నాలోచించుట ♦—

వ. అని విచారించుచు మంత్రులం బిలిచి యిట్లనియె. 42

సీ. గరుడగంధర్వరాక్షస యక్షపన్నగా
దులచేత మరణంబు గలుగ నట్లు
వర మంది నరులెంతవా రని గర్వించి
వదలితి నరణ్యావసుమతీశుఁ
డపుడు శపించిన ట్లతనివంశమువాఁడె
నాకు మృత్యువయయ్యె నాఁడు గౌరి
కైలాసమెత్తునన్ గరితకరతంబునఁ
జచ్చెద వని శాప మిచ్చె నకట

తే. క్రోఁతి యని నందిఁ గని నగ నాతఁడి నన్నుఁ
గ్రోఁతిచేత నీకుం జే టగు నని తిట్టెఁ
గాంతల బలాత్కృతిం జేసి కలసితేని
చత్తు వని రంభ శపియించె నత్తఱి నయొ. 43

మ. మునిశాపంబులు పెక్కు లన్ని యిపు డీపోల్కిన్ ననుం దాఁక నై
చనుదెంచెన్ జుఁడి మంత్రులార యటులే జం కింతయున్ లేక శ
త్రుని సాధించునుపాయముం దెలిసి పేరుం బెంపునుఁ గల్గి శౌ
ర్యనిధుల్ ధైర్యము పూనియుండుటలు సంగ్రామంబులన్ జెల్లెడిన్.

తే. మంత్రివరులార! శాత్రవుల్ మనపురంబు
లోని కడుగు వెట్టకయుండఁ బూని మీరు
వప్రముల నెక్కి కావలివార లగుచుఁ
గాచుచుండుట లొప్పు నిక్కాలమందు. 45

ఉ. భూరితపోనిధాన మయి పొల్చెడుపోటరి కుంభకర్ణుఁ డా
సారసగర్భునానతిని సంతతనిద్రను బొందుచుండు నై
దారు నెలల్ జనంగ నొకపారి ప్రసన్నమునన్ దెలివొంది వెండియున్.
గోరిక చేయుః బందుకొనఁ గోవిదులార! వచింప నేమగున్. 46

క. నేఁటికి దొమ్మిదిదినముల
నాఁటన నిద్రింప నేగె నాతో ననుచున్
మేటిమగఁడాతఁ డాతని
సాటిమగం డొకఁడు లేఁడు సకలజగములన్.

క. భేరీపటహాదులతో
మీ రాతని నిద్రనుండి మేల్కొనురీతిన్
నేరుపునఁ జేసి రం డని
శూరులు సుభటులకు నాజ్ఞ చొప్పడఁ జేసెన్. 47

— రావణుఁడు కుంభకర్ణుని నిద్రనుండి లేపనియమించుట —

వ. అని యానతిచ్చిన వారు గంధమాల్యాంబరాభరణాదులు మద్య
మాంసాన్నాదులుఁ గైకొని కుంభకర్ణుండు నిద్రించి యున్నగుహా
ముఖంబునకుం జని రప్పు డాతండును. 48

సీ. బ్రహ్మాండభాండంబు బ్రద్దలుగాఁ జేయఁ
గూడిన ట్లగుపెద్దగుఱ్ఱు మ్రోయ
నుర్వీధ్రముల నెల్ల నుఱ్ఱూత లూఁగింపఁ
జాలిననిట్టూర్పు గాలి ప్రబల
వెల్లువమై గుహయెల్ల నిండఁగ సెల
వులనుండి సొల్లు కాల్వలుగఁ బాఱఁ
జిగురుచెమ్మటలు మైఁ జిక్కనౌరోమకూ
పాళి నునయమంది జాలువాఱ

తే. గుఱ్ఱుతో మాటిమాటికి ఖొఖొఖొయనెడు
శబ్ద మెంతయు భీతిని సలుపుచుండెఁ
చిటపటల్ బండ్లు కొఱుకుచుఁ బలవరించు
కొనుచు గాఢనిద్రింబడ్డి కనఁగ నయ్యె! 49

వ. కని వానికింతంలో మృగమహిషవరాహాదిమాంసంబులు నానా
విధాన్నంబులను పర్వతంబులు నా రాసులు పోసియు రక్తంబును
మద్యంబును గలబానలు శతసహస్రంబులు తెచ్చిపెట్టియుఁ గాల
మేఘంబులు నా గర్జారవంబు గావించుచుఁ గుంభకర్ణుని నిద్ర
నుండి లేప నెంచి. 50

సీ. కోటిసంకుల నూఁది సూటిగా భేరీమృ
దంగాదివాద్యముల్ తగ నొనర్చి
కరములతో వానిఁ గదలించుచుం గొట్టి
సింహనాదంబులు చెవులఁ జేసి
గుదియల్ ఱోకళ్ళ గదలను మొత్తుచు
బొబ్బరింతలు వింత ప్రబ్బఁ జేసి
మేనిపై హయముల నేనుంగులం దోలి
కోలలతో నల్గఁ గొట్టి పట్టి
తే. వెండ్రుకలు పట్టిఁ లాగియు వ్రేలుచెవులు
గొఱికియును నీళ్లు కుండలకొలఁదిఁ బోసి
త్రాళ్ళతోఁ గట్టి కొట్టియు రాక్షసాళి
లేప లేకుండె నప్పు డాలేఖవైరి. 51

మ. చెవులన్ సీసము గాచి పోసి మిగులన్ జీఁద్రంబు గల్పింపఁగా
నెవనిన్ లేపుచునుండిరో యనెడు నట్లుం తేనిసే పుండియున్
జెవులన్ చీమలు ప్రాఁకిన ట్లయినఁ దా జృంభించుచుం జేతితో
జెవులన్ రాయుచు లేచి మేలుకొని కూర్చుండెన్ కడుందూఁగునన్,

ఆ. అంతలోన నోటికం దిచ్చుమహిషాది
మాంసముల భుజించి మద్యములను

ద్రావి కన్ను దెఱచి దఱి నున్న రాక్షస
వరుల నరసి యిట్లు పలికె నలుక. 53

మ. నను లేపం బని యేమియో కుశలియై నాయన్న యున్నాఁడె నా
మనమందుం భయశంక యంకురితమై మా నేదగాఁ జేయు మీ
రనుమానింపక చెప్పుఁ డెట్టిపగ నే నాలంబునం బట్టి చీ
ల్చి నెఱిం గూల్చెద నాదునగ్రజునకుం జిత్తంబు రేకెత్తఁగన్. 54

తరు. అనిన యూపాక్షుఁ డిట్లనియె నో రావ
ణానుజ మాకు నింద్రాదిభయము
కన నింతయును లేదు కాని మానవుని
కతమునం భయ మది ఘన మయ్యె నయ్యె
తనపత్నిఁ జెఱఁబట్టె దనుజుండ యనుచు
దశరథసుతుఁడు మాదర్పంబు మాపె
వినియుంటి కద యొక్క వృక్షచరుండు
వే వచ్చి యక్షాదివీరులఁ ద్రుంచె. 55

వ. అనినఁ గుంభకర్ణుండు నే నిదె వచ్చి శత్రుసంహారంబు గావించెద నని క్రోధఘూర్ణితలోచనుండై మఱియు ద్విసహస్రకుంభంబుల మద్యంబు ద్రావి వారితో రావణగృహంబునకుం బోవ బయనం బయ్యె నయ్యెడ వానరవీరులు వానిం జూచి వెఱచఱచి రాముని మఱువుఁ జొచ్చిరి రాముండును రావణానుజుం గాంచి నివ్వెఱం బడి విభీషణునిదిక్కు మొగంబై యి ట్లనియె. 56

—♦ విభీషణుండు రామునకుఁ గుంభకర్ణు నెఱింగించుట ♦—

ఉ. కొండకు నెత్తువచ్చెడి నకుంఠిత తేజుఁ డితం డెవండొ నా
గుండెలలోన సాధ్వసము కూడగ వచ్చెను మున్నెకప్పుడీ
దండిమగండు నాకనులదారికి రాఁడు యముండు నాఁగ నొ
ప్పుండినదంతయుం దెలియ నోజ వచింపు మయా విభీషణా. 57

సీ. వినుము రాఘవ వీఁడు విశ్రవోమునిసూతి
కుంభకర్ణాఖ్యను గొన్నవాఁడు

గరుడగంధర్వరాక్షసయక్షముఖ్యుల
నోడించినట్టిఁడు పోరెడ వీఁడు
శూలంబు గొని రాఁగ శూలియు గీలియు
యముఁడు గిముండు నాహవమునందు
నిలువఁ జాలరు తొల్లి నిర్జరేంద్రుఁడు వీని
పై వజ్రమడరించెఁ బట్టి దాని
తే. అట్టహాసము సేయుచు నట్టె యింద్రు
మీఁదఁ బడి మోదె దాన నయ్యాదితేయ
విభుఁడు వెఱ గంది పరమేష్ఠిపిఱుఁద కఱిగి
సర్వమును విన్నవించె రాక్షసునిచెయిది. 58

వ. పరమేష్ఠియు సర్వప్రాణులం బట్టి బక్షించునారాక్షసునిం గని నీ వింతటినుండి చచ్చినట్లు పడియుండు మని శపించిన రావణుండు వచ్చి నీమునిమనుమం డగువీని ననుగ్రహింపు మని ప్రార్థించినం బ్రసన్నుండై వీఁడు మృతుం డైనట్లు నిద్రితుండై యాఱుమాసములు నిద్రించి పిదప నొకనాఁడు లేచి నాఁడుప్రళయకాలాగ్నిహోత్రుని చందంబున వెలుంగుచు నెల్లలోకంబుల భ్రమింగఁ గలం డనియె నదిమొదలు లితం డట్లు నిద్రగావించుచుండు నేఁడు రావణుండు నీపరాక్రమంబునకుం బుఱిలోడి వీని నిట్లు నిద్రనుండి మేల్కొనం జేసె నని జెప్పిన రామచంద్రుండు సేనానాయకుం డగు నీలుం బిలిచి యి ట్లనియె. 59

ఉ. నీలుఁడ! సర్వసేనలను నిల్వఁగఁ జేయుచుఁ జెప్పి యిప్పురికిన్
నాలుగుమూలలన్ మఱియు నాలుగుచోటుల నాయుధంబులన్
బోలఁగ దాల్చి వానరులు పొల్చెడునట్టులఁ జేసి నీవు స
ర్వాలను జుట్టివచ్చుచు వహింపుము భారము పేర్మి పెంపునన్. 60

వ. అనిన నీలుం డౌఁగాత మని సేనాసందోహంబునకు రామాజ్ఞ నెఱుంగ జేసె నంత శరభ గవాక్ష హనుమ దంగదులు పర్వతశిఖరంబులును వృక్షంబులును దాల్చి శత్రునాగమంబు ప్రతీక్షించుచుండి రప్పుడు. 61

— కుంభకర్ణుఁడు రావణ ప్రేరితుండై యుద్ధమునకు వచ్చుట —

మత్త. కుంభకర్ణుఁడు రాక్షసావళిఁ గూడి రావణుచెంతకుం
గుంభినీతల మెల్ల దద్దిఱఁ గొంత సేపటి కేగుడుం
జృంభమాణపరాక్రముం డని చెప్ప నొప్పు సురారి సం
రంభమున్ గలఁడై తటాలున వ్రాలె నాతనివంకకున్. 62

తే. వ్రాలి కౌఁగిటఁ జేర్చి రావణుఁ డనుంగు
తమ్ముఁడా రాముఁ డనువాఁడు తాను దమ్ము
డును గపిధ్వజినిం గూర్చుకొని రయమున
వచ్చి ముట్టడించెను లంకఁ బెచ్చు పెఱిఁగి. 63

ఉ. ఎందఱో బంధుమిత్రు లని కేగి మృతించిరి సుప్రశస్త ని
ష్పందపరాక్రముం డనఁగఁ జాలు ప్రహస్తుఁడుఁ ద్రెళ్లె బందుగుల్
పొందఁగ నైనదుఃఖమును బోకడఁ బెట్టుము శత్రుసైన్యమున్
మ్రిందగఁ జేయు మ య్యదియె మామకహృత్కలితార్థ మయ్యెడిన్.

సీ. అనఁ గుంభకర్ణుఁ డిట్లను నన్న! నే మున్న
చెప్పితి నగుదెంచుఁ జేటటంచుఁ
జెవి బెట్టితి వినవైతి వదిపాప
ఫల మి ట్లనుభవింప వలసి యుండె
సీతాపహరణంబు చెడ్డదా మంచిదా
యనుచుఁ జర్చింపవు స్వాంతమందు
మంచిచెడ్డల నెద నెంచి కార్యంబులు
చేయనివానికిఁ జేటు లగును

తే. వినుము నీప్రియ మెంచి విభీషణుండు
చెప్పె నీ కది హితముగా దప్పు డిప్పు
డైన నట్టులు చేసితివేని మేలు
చేకుఱెడి నంచు నెంచుమో లోకవినుత. 65

వ. అనిన రావణుం డాగ్రహించుచు. 66

ఉ. నీతుల కిప్డు కాల మని నేను దలంపను జెప్పి తెన్నొ నీ
నీతులు నాదుజానుగుల నిల్వవు రిత్తల యాను నీవు నీ
రీతిని బల్కుటల్ తగదు ప్రీతికిఁ గా వవి దండ మొక్కఁడే
యీతటిఁ జెప్పఁ దగ్గదియు నే వినఁదగ్గది సుమ్ము తమ్ముఁడా. 67

తే. నీకు నాపట్ల ననురాగమే కలిగిన
నామనోరథముం దీర్పఁగా మెలఁగుము
వాసవుం డేని నినుఁ గాంచి పాఱు ననుట
మానవుం డన నేఁ పాటి మానవాద. 68

క. నను మన్నించెదుతమ్ముఁడ
వును శూరుఁడ వగుదువేని పోయి రణంబున్
బోఁ రిపు మట్లు కాదేఁ
జను మెప్పటియట్లు నిద్ర సలిపెదుపొం డెన్. 69

వ. అనిన కుంభకర్ణుం డన్న కి ట్లనియె. 70

శా. భ్రాంతిన్ జేసి వచించినాఁడ నిటు లో ప్రత్యర్థికాలోపమా
శాంతిం బొందుము నన్ను నన్యునిగతిన్ స్వాంతంబునం దెంచఁ బో
కెంతోపంతముఁ గల్గి పోయి రిపులన్ హింసించి నీనెమ్మదిన్
సంతోషం బెసఁగింతు నాకు నిపు డాజ్ఞం బెట్టు మేఁ బోయెదన్. 71

తే. నే నొకండన పోయి యావానరధ్వ
జిని సమేతముగా రాఘవుని వధించి
వత్తు నన మహోదరుఁ డనువాఁడు లేచి
కుంభకర్ణు నాక్షేపించి కొసరి పలికె. 72

తే. ఒకఁడ పదునాల్గువేవురఁ బ్రకటితౌజు
లైనఖరదూషణాదుల నని వధించి
నట్టి రాము నీ వొకఁడవ యరిగి గెల్వ
లేవు సేనలతోఁ గూడి పోవు టొప్పు. 73

వ. అనినఁ గుంభకర్ణుండు. 74

ఉ. ఓరి మహోదరా పిటికి వుండుము ని న్నెవఁ డిట్లు పల్కఁగాఁ
గోరె నొకం డెఱుంగని ప్రకోపితగర్వసమంచితుండ వీ
వూరక యుండు మంచును సహోదరుఁ గాంచి భయంబు దక్కు మేఁ
బోరికిఁ బోయి రాఘవులపొంక మడంగఁగఁ బట్టి మ్రింగెదన్. 75

వ. అని పలికి వానియనుజ్ఞం గొని శూలంబు కేలం బూని సర్వాయుధ
సన్నద్ధు లగుయోధాగ్రేసరు లెందఱే ననుసంధింప సమరాంగణం
బునకుం జనియె నప్పు డాకుంభకర్ణుం డొక్కపర్వతంబు నా నొప్పు
చుఁ బెద్దనోరుం దెఱచుకొని యట్టహాసంబుఁ గావించుచు వచ్చు
నాతనిం గని వానరు లెల్లరు పలాపంచలై పాఱఁ జొచ్చి రప్పుడు
కాలాగ్నిరుద్రుండు నా మండుచు వచ్చునతనిం గని పాఱఁ జొచ్చిన
వారిం గని యంగదుం డి ట్లనియె. 76

చ. నిలుఁడు నిలుండు వానరులు నిల్చి రణంబొనరింప నుండుఁ డి
ట్లలఁతులు వోలెఁ బ్రాణముల కాస యొనర్చుచుఁ బాఱిపోవ మీ
పొలఁతులు నవ్వ నట్టిపని పుట్టెడుఁ నెప్పటికేని యెంత లెం
తలకునుఁ జావు దప్పదిద దాఁగఁగఁ జాలరు మిత్తి కెవ్వరున్. 77

క. కులపౌరుషాభిమానము
లలఁతులు గణియింపఁ బోవ రగ్గతి మీరల్
చలియింపఁ బోక మరలుఁడు
కలనన్ శాత్రవులఁ జంపి గైకొనుఁ డసమున్. 78

వ. ఇట్లు పలికి వారి కుత్తేంజంబుఁ గలుగుమాట లాడిన నెల్లవారును
మరలి రణంబునకు మొనసి రప్పుడు ఋషభ మైంద ద్వివిద ధూమ్ర
నీల కుముద సుషేణ గవాక్ష రంభ తార పనస ప్రభృతులు రణ
రంగంబున నరివీరుల నెదుర్కొని రప్పుడు కుంభకర్ణుండు. 79

—♦ కుంభకర్ణుఁడు వానరులం బట్టి మ్రింగివేయుచుండుట ♦—

సీ. గరుడి పాములఁ బట్టి కడ తేర్చుచున్న
వానరులను బట్టి వడిగ మ్రింగుఁ
దడవ కైదాఱుశతములుగా నోటఁ బె
ట్టుకొని భుజించును సకలకపుల

వానిచెంగట నిల్వఁ గా నోప రెల్లరు
పాఱుచో ద్వివిదుండు పర్వతమ్ము
కుంభకర్ణుని బయికొని యేయ నది వాని
పైఁ బడ కట వానిబలగముపయిఁ

తే. బడుఁడు రథగజతురగముల్ భటచయంబు
పిండి పిండిగ నయ్యె నవ్వేళ నలుఁడు
వేఱొకఁడు కొండఁ గొని వ్రేసె వ్రేటువలనఁ
బెక్కురాక్షసబలమును చక్కఁబడియె. 80

క. హనుమంతుఁడు పర్వతముఁ
ఘనవృక్షములుం బెకల్చి క్రవ్యాదునిపై
గొని యేసె వాఁడు వానిన్
దనశూలముచేత నేసి ధరణిం గూల్చెన్. 81

సీ. శూలాయుధముఁ బూని లీలమై లంఘించి
హనుమంతుపైఁ బడె నతఁడు దొడ్డ
పర్వతం బనవచ్చువానిపయిఁ వైచె
దాన నాతఁడు సోలి ధైర్య మూని
కినుక శూలము ద్రిప్పుకొనుచు రక్కసి వాయు
తనయునివక్షముఁ దాఁక నేసె
పగిలి వక్షము నెత్తురువఱ్ఱు వాఱఁగఁ జొచ్చెఁ
గని రాక్షసులు కలకల మొనర్చి

తే. రపుడు రణముఖంబున నిల్వ నడలు గుడిచి
తొలఁగి పాఱంగ నీలుఁడు పిలిచి వారి
మేటి పర్వత మొక్కఁ డామేటిమగని
శిరముపైఁ బడ నేసి యార్చెను గడంక. 82

క. పైవచ్చుకొండఁ గనుగొని
రావణుననుజుండు దాని రంహ మెసంగన్
జేవమెయి గ్రుద్దె నయ్యది
భూవలయమునందుఁ గూలెఁ బొడి పొడి యగుచున్ 83

వ. అంత వానరోత్తము లగుఋషభ శరభ నీలగవాక్షగంధమాద నులు కుంభకర్ణునిమీఁదికిం గవిసి పర్వతవృక్షాదులతోడం గొట్టియు నఱచేతుల నప్పళించియుఁ గాళ్ళన్ గ్రుమ్మియుఁ బిడికిళ్ళం బొడిచియుఁ జుట్టుకొని గిట్టింపం జూచి రట్టి యెడఁ గుంభకర్ణుండు వారి నింతయు సరకుగొనక. 84

సీ. రెండుచేతులఁ బట్టి ఋషభుని నలప నా
తఁడు నల్ల గ్రక్కుచుఁ బుడమిఁ బడియెఁ
బిడికిటన్ శరభునిఁ బొడిచె మోకాలితో
నీలుని నేలపై వ్రాలఁ గ్రుమ్మె
నఱచేతితోడ గవాక్షునిం జఱచెను
గంధమాదనుఁ ద్రొక్కెఁ గాలితోడ
నలువుర నీరీతి నవయఁగా నొనరించె
వారిమేనులనుండి కాఱె నల్ల

తే. అపుడు వేలకొలందిగా నైన కపులు
కుంభకర్ణునిపై నెక్కి కోతిచేష్ట
లనుఁ బొనర్చిరి మోకాళ్ళనుఁ బొడిచిరి
గోళ్ళ ఱక్కిరి పళ్ళతోఁ గొఱికి రతని. 85

ఉ. వానరు లెందఱే నతనివర్ష్మము నెక్కినయప్డు పెక్కులై
కానఁగ వచ్చువృక్షములఁ గల్గినపర్వతమో యనంగ నై
మానక బోరి యందఱను మాటికిఁ జేతులఁ బట్టి నోటిలోఁ
బో నొనరింప వా ర్వెడలిపోయిరి ముక్కులనుండి మీఁదికిన్. 86

చ. అలిగి యతండు వానరుల నందఱ మ్రింగుచు నొక్కచేతులన్
నలుపుచుఁ గాలరాయుచు క్షణంబున సర్వము శూన్య మాగతిన్
సలుపుచుఁ బాశపాణి యగుసంయమనీపురవల్లభుండు నా
వెలుఁగుచు శూలపాణి యయి వీరవిహార మొనర్చె వాఁ డనిన్.

ఆ. వేఁడిపిడుగు వానివీక కోర్వఁగ లేక
దీనదీనముగను దేవ్వరించు

కొనుచు నొచ్చి శేషవనచరు లంగదు
మఱుగఁ జొచ్చి రోము మ మ్మటంచు. 88

—♦ అంగదుఁడు కుంభకర్ణునితో యుద్ధముచేయుట ♦—

ఉ. అంగదుఁ డొక్కపర్వతము హస్తయుగంబునఁ బూని కుంభక
ర్ణుం గదియంగ వచ్చి ఘనరోషము భీషణమై కనంబడన్
సంగడికాండ్రు మే లనుచు సంస్తుతులం బొనరింప నార్చుచున్
ఖంగనుశబ్ద మేర్పడగఁ గట్టిగఁ గొట్టెను వానిశీర్షమున్. 89

వ. అట్లు మార్కొని ఘోరయుద్ధం బొనర్చుచు. 90

మ. కినుకన్ వృక్షచరేశ్వరుండు భుజశక్తిం బూని వృక్షంబునన్
దనుజాధీశ్వరుఁ డీల్గునో యనఁగ మూర్ధంబందు నౌద్ధత్య మిం
పెనయన్ వ్రేసెను వ్రేసినం జిమ్రిపలై వృక్షమ్ము వ మ్మయ్యె వ
జ్రనిభాంగుం డగుకుంభకర్ణునకు స్పర్శజ్ఞానముం గల్గఁగన్. 91

స్రగ్ధ. ధైర్యస్థైర్యంబులొప్పం దలఁకక నలకంతం గృతాంతుండు నా దో
ర్వీర్యం బగ్గింప బల్మి న్వివివడనిగతిన్ వ్రేల్మిడిం బట్టి కొట్టెన్
క్రౌర్యాంచ చ్చిత్తు వానిం గనుకని కని వీఁక న్సుమిత్రాసుతుం డా
శ్చర్యంబుం దోఁప నేసెన్ శర మరిపయి దోస్సార మేపార సంతన్.

తే. కొండశిఖరంబు దాఁకుట కొంత నొచ్చి
కుంభకర్ణుఁడు కట్టల్కఁ గొనినమదిని
బిడికిటం బట్టి పెడచేత గడిమి నడరు
నంగదుం గొట్టె మూర్ఛమై నతఁడు వ్రాలె. 93

ఉ. ఆవగ నంగదుండు వడ నట్టిటు మెట్టుచు రాక్షసుండు సు
గ్రీవునిమీఁదికిం జనియెఁ ద్రిప్పుచు శూల మతండు నాతనిన్
దావులఁ గాంచి పర్వతముఁ దాఁ గొని వాని నెదిర్చి పేర్చి క్రో
ధావిలమూర్తియై కనుల నగ్నికణంబులు రాల ని ట్లనున్. 94

క. అలఁతుల వానరవీరుల
నలువురఁ గా దిదిగొ పీఁడు నగధరుఁ డగుచున్
కల నొనరింపఁగ వచ్చెన్
బలమిఁకఁ గలదేని వీనిపయిఁ జూపు వడిన్. 95

తే. అని పిడుగువోలెఁ బర్వత మట్టి యెత్తి
రాక్షసునివక్షమున వైచె నాక్షణంబ
చూర్ణమయ్యె నయ్యది చూచి సురవిరోధు
లార్చి సింహనాదంబులఁ బేర్చి రపుడు. 96

—♦ సుగ్రీవుఁడు కుంభకర్ణు నెదిర్చి మూర్ఛితుండగుట ♦—

ఉ. అంతన పోక నో రైఱచి యార్చుచుఁ బేర్చుచుఁ గుంభకర్ణుఁ డ
త్యంతపరాక్రమంబు మెఱయన్ వడిఁ దోడుతఁ ద్రిప్పి శూలమున్
బంత మెసంగ నేయుటయు వాయుతనూజుఁడు వచ్చుదానినిఁ
గొంతటిలోనఁ బట్టుకొని కొట్టె ధరం బొనరించె రెండుగన్. 97

ఆ. వేయిపుట్లయినుము పెట్టి చేసినశూల
మట్లు బెండులోలె హనుమ విఱువఁ
గపులు సంతసమున గంతులు వైచుచుఁ
గిలకిలారవంబు సలిపి రపుడు. 98

సీ. హనుమంతుపై నల్గ కసుర సుగ్రీవుని
పై మలయాద్రి గ్రావం బొకండు
దిగిచి సుగ్రీవునిదెస నిగిడించెను
దాన నాతఁడు స్మృతి దప్పి పడియెఁ
బడినివానిఁ బట్టి వడిఁ బోవుకుంభక
ర్ణునిఁ గాంచి వాయుపుత్త్రుండు వగచి
నే వీని విడిపింపఁ బోవుదునా యని
తలఁచుచు నంతలోఁ దగ దతండు

తే. మూర్ఛితుం డింత తెప్పిర్లి పొడిచి వాని
వచ్చు నే నడ్డు వోవుట వచ్చు నయశ
మతని కంచును దలఁచుచు నచోట మెలఁగు
వానరుల సూఱడించెడువాఁడ యయ్యె. 99

తే. కుంభకర్ణుఁడు సుగ్రీవుఁ గొని రయమున
లంకకుం దోడుకొనిపోయె నంకెల లిడ

నెంచునప్పుడు దారిలో స్మృతినిఁ బొంది
తనదుగతి నెర్గికొని కీశజనవిభుండు. 100

ఉత్సా. వానిముక్కు చెవులు గొఱికి వాడిగోళ్ల ముష్టితో
నూని గ్రుద్ది బిడుగు పడినదో యనంగఁ జేసి యెం
తేనివడిగ నింగి నంట నేగి క్షణములోన నా
వానరుల్ తలిర్చుచోట వ్రాలెఁ దార్క్ష్యుఁడో యనన్. 101

ఉ. గైరికధాతుపర్వతము కైవడి నెత్తుట నత్తమిల్లుచుఁ
గ్రూరుఁడు కుంభకర్ణుఁ డటకుం జన నెంచక యుద్ధభూమికిం
జేరినవాఁడమై మరలఁ జి చ్చన మందుచు వీరు వారు నా
కేరు లభించినం దినుచు నేర్పడె నప్పుడు మృత్యువో యనన్. 102

చ. తడవకు నూఱు వేయి గను దగ్గరుచుండినవానరావళిన్
గడువడిఁ బట్టి మ్రింగికొని గట్టని త్రేచుచుఁ గుంభకర్ణుఁ డా
కడఁ గలసర్వసైన్యమును గన్కనిఁ బాఱఁగఁ జేయుచుండఁ గాఁ
గడఁకొని లక్ష్మణుం డతనిఁ గన్గొని కన్గవ నిప్పు లొల్కఁగన్. 103

ఉ. నూఱులు వేలుగా నసుర నొవ్వఁగ నేసిన వాఁ డొకింతయుఁ
జీరికి నైనఁ గైకొనక వృక్షములన్ వడి నాకుకొంచుఁ జే
బారలు వేయుచున్ బెలుచఁ బాదయుగంబు గదల్చుచు న్వడిన్
శ్రీరఘురామచంద్రుఁడు వసించెడుచోటికి వచ్చె హెచ్చుగన్.

వ. రామచంద్రుండు సమాగతుం డగువాని నెఱింగి. 105

—♦ రామచంద్రుఁడు కుంభకర్ణునిం దాకి పోరుట ♦—

మత్త. వాఁడియమ్ములఁ గుంభకర్ణునివక్ష మాఁడగ నేసి పై
నేకుతూపుల నెత్తిపైఁ బఱ నేయుచున్ దనుజుండు పా
రాడుచున్ పెఱ నగ్నిమంటలు స్వాస్యమందు జనింపఁ బెన్
పాఁడికోఁతులఁ గొర్కుకొం చని పర్వఁ జేయుచు గర్వియై. 106

తరల. ప్లవగసేనల నెల్లఁ దోలుచు బాహుదర్ప మెలర్పఁగా
లవము మాత్రము గాని లక్ష్మణు లక్ష్యపెట్టక వానర

ప్రివరులం గొని మ్రింగుచున్ రఘురామచంద్రునిమీఁదికిన్
జవము సత్త్వము ప్రస్తుతింపఁగఁ జాలినట్టిఁడ వైచెనన్. 107

సీ. రాముఁడు వడివచ్చురాక్షసునిం గాంచి
చిచ్చుటంపఱ వాని మెచ్చఁ జేసె
వివశుఁడై రక్కసి విరవిరలాడె నా
లో వానిచే నున్నలోహపుగుదె
శూలము ఖడ్గము నేలపాలగుటచేఁ
గాళ్ళచేతులఁ బోరగాఁ దొడంగె
క్షితిధరంబుననుండి సెలయేళ్లు ప్రవహించు
గతి వానిమైనుండి కాఱె నల్ల

తే. క్రోఁతులం గొండముచ్చులఁ గొఱికి తినుచుఁ
బరువునెత్తుచు రణభూమి పర్వతమొకఁ
డూనిరామునిపై నేయ నున్న నెఱిఁగి
యాతఁ డేడమ్ములం దాని నవనిఁ గూల్చె. 108

ఆ. లక్ష్మణుండు కపుల లక్షించి మీ రెల్ల
వీనిమీఁది కెక్కి వీఁకఁ జూపుఁ
డనుడు పెక్కుమంది యసురపై నెక్కి త్రొ
క్కిన నతండు వారిఁ గినుకఁ ద్రోచె. 109

శా. మార్తాండాన్వయశేఖరుండు రఘురామస్వామి దైత్యేశుచే
నార్తిం బొందెడువానరాళిఁ గని దుఃఖాయత్తచిత్తంబునన్
గీర్తింపం దగునట్లు మార్విపయిఁ గే ల్గీలించి సారించుచున్
గర్తృత్వంబు వహించి పిల్చె రణముం గావింప నారక్కసిన్. 110

ఉ. రాముఁడ నేను వచ్చితిని రాక్షసవంశవినాశకుండనై
మీమహిం కీవు నన్ దెలియు మీ నిను రమ్మని పిల్చుచుంటి నీ
వామెయిఁ బోక నాకడకు నాగతుఁడై భవదీయశౌర్యమున్
వేమఱు మెచ్చఁ జూపు మని వేడుకఁ బల్కఁగ రాక్షసుండు డ్తనున్,

సీ. రాముఁడవా నీవు రా రమ్ము బెదరింతు
వా నే విరాధుఁడ గాను వాలిఁ
గాను గబంధుఁడఁ గాను మారీచుఁడఁ
గాను దూషణుఁడనుఁ గాను ఖరుడఁ
గాను నీయాట లీఘనుచెంతఁ జెల్ల వీ
శూల మెంతల నెట్లు కూలిచినదొ
నాశౌర్యధైర్యముల్ నాకౌకసు లెఱుంగ
కుండిరో జగమెర్గ కుండెనో క్కా
తే. చెప్ప నేటికి నీవె వీక్షింతు విపుడ
నీవు నాచేతఁ జిక్కితి నిన్నుఁ బట్టి
మ్రింగి గఱ్ఱునఁ ద్రేచెద మేలు చేయఁ
గలద యే నాకుఁ జూపు మిక్కడ నొకింత. 112
మహాస్ర. అనఁ గోపాటోపదృప్తుం డయి దనుజునిపై
నాయతంబుల్ మహావ
జ్రనిభంబుల్ వాఁడితూఁపుల్ రఘుకులవరుఁ డో
ర్వంగ రానట్లు లేయన్
గన లెక్కన్ గ్రావమోనాఁ గదలక నిలువం
గల్గి శూలంబుఁ గేలన్
గొని రాముం జూచి యేసెన్ గురి చెడనిగతిన్
ఘోరశబ్దంబు పుట్టన్. 113
వ. అంత శ్రీరాముండును. 114

—♦ రాముఁడు కుంభకర్ణుని చేతులంగాల్లునఱకి తలఁ ద్రెంపుట ♦—

శా. వాయవ్యాస్త్రము మంత్రపూత మగు శేవం గూర్చి కోదండమం
దాయమ్ముల్ వడి సోఁక సేయుటలు సర్వాంగంబు కంపింప దై
తేయుం డార్చుచుఁ బైపయిం బడఁగ రా దివ్యార్ధచంద్రాయుధం
బాయర్కాన్వయుఁ డేసె వానిభుజమున్ సాస్త్రంబుగాఁ ద్రెవ్వఁగన్.
ఆ. త్రెస్సి భుజము నేలఁ దిరుగాఁడువానర
సేనమీఁదఁ బడియెఁ దానఁ బెక్కు

మంది నిహతులైరి మఱి యొక్క-చేతితో
వృక్ష మొకఁడు పెఱికె రాక్షసుండు. 116

ఉ. మీఁద బడంగ వచ్చు తఱి మిక్కిలికోపముతోడ రాఘవుం
డాదట నైంద్రి బాణమున నాసురహస్తము సాగమంబుగా
భూదివముల్ ధ్వనించునట్టు స్ఫోటము సేయుటఁ ద్రెస్సి నేలపైఁ
జీదరఁ గూర్చుచుం బడియెఁ జిందఱవందఱలైనమూఁకకుఁ. 117

ఆ. రెండుచేతు లట్లు ఖండింపఁ బడి కుంభ
కర్ణుఁ డినకులేశుఁ గలియ ఱొప్పు
కొనుచు వచ్చుచుండఁ గోదండరాముఁ డా
రెండుకాళ్ల నపుడు జెండివైచె. 118

ఉ. చేతులు కాళ్లునుం దెగుట చెన్నఱిపోయియుఁ గుంభకర్ణుఁ డా
భూతలమందుఁ గూలియును భూధరకందరమో యనంగ నై
రోఁత నెసంగునో ద్రెఱచి రోజుచు రామునిఁ జేర డొల్లి రా
స్ఫీతశిలీముఖం బొకఁడు చేకొని రాముఁడు దుంచెఁ గంఠమున్.

క. తెగి శీర్ష మెగసి మింటికి
నొగి నేగి యొకింతలోన నురుతరనిర్ఘా
నగతిన్ లంకాపురమున
నగునొకప్రాసాదమందు నాప్పచుఁ బడియెన్. 120

తే. అచటఁ బ్రాసాద మది చూర్ణమయ్యె నిచటఁ
దెగినమొండెము దొర్లుచు దెసల నున్న
సకలమును బిండిగాఁ జేసి సాగరమునఁ
బడి కలంచెను జలజంతుదళము నెల్ల. 121

—♦ కుంభకర్ణునిమరణంబువినిరావణుఁడు దుఃఖించుట ♦—

వ. ఇట్లు కుంభకర్ణుండు దెగుట రావణుండు చారులవలన నెఱింగి నితాంతచింతాసాగర నిమగ్నుండై మూర్ఛిల్లె నపుడు దేవాంతక నరాంతక త్రిశిరోతికాయు లనువారు తమ పినతండ్రి కుంభకర్ణుని మరణంబునకుఁ గన్నీరు మున్నీరుగ దుఃఖించిరి తోడఁబుట్టువు

లగుమహోదరమహాపార్శ్వులును వ్యసనపీడితులై మృతులకై వడిం బడియుండి రంతఁ గొంతవడి కెట్టకేలకు రావణుండు తెప్పిఱిల్లి స్మరణం బభినయించుచు. 122

సీ. ఓకుంభకర్ణ! యోలోకైకవీర! నన్
బెడఁ బాసి యీరీతి వెడలి తయ్య
పుత్రమిత్రులయందుఁ బొలుపొందుమైత్రి నీ
వేరీతి విడి పోవ నెంచి తయ్య
నీతోడునీడనై ఖ్యాతి గాంచిననేను
బ్రదికియుఁ జచ్చినవాఁడ నయ్య
ప్రళయకాలానలప్రతిముఁడ వగునిన్ను
నలఁతి యెట్టులు చంపఁ గలిగె నయ్య
తే. ఇట్టిలోకైకశూరుఁడై నట్టినీవు
నన్ను బెడఁబాసి పోయితి వెన్న నాకు
లంక యేటికి బ్రదు కేటి కింక భార్య
లేటి కెవ్వరు నేటికి నేటి కొడలు. 123

శా. పంచప్రాణములందుఁ బ్రాణ మగుచున్ భాసిల్లునాతమ్మునిన్
గిం చొక్కండు వధించె వానివధముం గ్రేఁగంట వీక్షించియే
పంచత్వంబును బొంద నెంచితి నిఁకన్ బ్రాణంబు లాసింప నే
నంచున్ వేఱొకచోటి కేగి బ్రదుకన్ స్వాంతంబు గావింతునే.

వ. అని కుంభకర్ణునిమరణంబునకుఁ బరిపరివిధంబులఁ బరితపించుదశా ననుం గాంచి త్రిశిరుం డి ట్లనియె. 125

--- దేవాంతక నరాంతకాదులు యుద్ధమునకు వచ్చుట ---

సీ. పినతండ్రివధము నీ వనినట్లు యగుఁ గాని
జగము లన్నియుఁ గాల్పఁ జాలినట్టి
నీ విట్లు వగచుట నెఱి గాదు బ్రహ్మనీ
కిచ్చినశక్త్యాదు లేమి యగునొ ?
షగతుండు ని న్ననిం బరికింపఁ జాలఁడు
వేల్పులసాక్ష్య మావిధులఁ గలదు

నీకు రాముం డనుసీరసమానవుం
డే లెక్కలోనివాఁ డెన్ని చూడ

ఆ. నిర్భయుండ వగుచు నీవుంతు మే నేగి
నీకు శత్రు వగుచు నీదుసోద
రుని వధించినట్టిమనుజుని నని బట్టి
గిట్టి వైచి వత్తు నిట్టిమొకల. 126

వ. అనినం జావ నెంచినవాఁ డయ్యు రావణుండు కించిదాశాపాశ బద్ధుండై యింత శాంతిం గొనియుండె నపుడు రావణపుత్రు లగు దేవాంతకనరాంతకాతికాయులు నేను నే నని పలుకుచు రాక్షసేశ్వరుం జుట్టుకొనిరి వారు నల్వురును. 127

ఆ. మఘవుఁ బోలు మేలుమగఁటిమి గలవారు
బలిమిఁ గలుగువారు బహుసమరు
లధికమాయు లభ్రమందుఁ జరింతురు
వారి కెట్టి రైనఁ గారు సములు. 128

వ. అంత రావణుం డానందభరితుండై వారిం గౌఁగిలించుకొని మహోదరమహాపార్శ్వ లనువారి వారికిం దోడిచ్చి రణంబునకుం బుచ్చె నప్పుడు వారార్వురును సర్వసన్నాహసన్నద్ధులై రావణునకు మ్రొక్కి మొక్కవోనిపరాక్రమంబున గజాశ్వరథంబుల నెక్కి గదాసిఖడ్గాదులు ధనుర్బాణతూణీరాదులుం చాల్చి వివిధవిధసైన్యంబు దైన్యంబు తక్కి వెంట నంటఁ బోలికలనికిం బోయి నంత వానరసైన్యంబు వృక్షపర్వతాద్యాయుధంబులు వట్టి నెట్టన వారి నెదిర్చి రప్పు డొండొరులకు నసాధారణ సంకులసమరం బయ్యె నయ్యెడ. 129

సీ. రాక్షసుల్ పరఁగించు రూక్షాస్త్రము లడంచి
వృక్షాటు లేసిరి వృక్షములను
వృక్షచరుల్ వేయువృక్షపర్వతముల
రాక్షసుల్ వారించి రాక్షణమున

వీరిలో వారిలో వేనవేల్ వీరులు
ప్రేతత్వ మందిరి పృథివిఁ ద్రెళ్ళి
యట్టహాసంబులు నార్భులు రథనేమి
నిస్వనంబులు నింగి నేల నిండె
తే. నెత్తురేఱులు ప్రవహించె మొత్త మగుచుఁ
దేరు లేనుఁగు లశ్వముల్ వీరభటులు
ఖండఖండంబులై నేలఁ గప్పఁబడియె
నసురు లగచరులును బోరునవసరమున. 130

వ. అట్లు సంకులసంగరం బెసంగుచున్న సమయంబున నరాంతకుండు.

మత్త. వాయువేగము గల్గువాహనవర్యమం దధిరోహణం
బాయెడం బొనరించి వజ్రము నంది కొండలఁ బిండిగాఁ
జేయునింద్రునిపోల్కి వానరసేన నుగ్గుగఁ జేయుచున్
ధాత్రి యదంతయు బీన్గుపెంటలు గాఁగ సల్పె ననల్పుఁడై. 132

ఉ. దావము కాననాంతరము దగ్ధముసేయు తెఱంగు దోఁపఁగన్
జేవమెఱన్ నరాంతకుఁడు చేవడిఁ జూపుచు నేఁపుమీఱ సు
గ్రీవుని సైన్య మంతయునుఁ గీడ్పడి చచ్చియు నొచ్చి కోల్పులిన్
దావులఁ జూచి పాఱుమృగతండము నాఁ బరువెత్తె నత్తఱిన్. 133

క. కోల్పులి తేళ్ళం దోలెడు
పోల్పున నిజసేనఁ దోలు పురుషాదునిపై
నల్పంబుగాని రోషము
నల్పుచు సుగ్రీవుఁ డాత్మజన్మున కనియెన్. 134

—♦ అంగదాదులచే నరాంతకాదులు తెగుట ♦—

క. అంగద వాఁడె నరాంతకుఁ
డంగద గలిగించు సేన నరయుము వానిన్
సంగరరంగమునందున్
సంగతికై కూల్చి రమ్ము సరభస మెసఁగన్. 135

సీ. అంగదుఁ డట్లనునంతలోన నరాంత
కాంతికంబున కేగి యనియె నోరి
ముక్కిడిమూఁకతో మొనసి పోరెద వేల
రమ్మ నే నిదె నామెఱొమ్ముఁ జూడు
మేయుము నీగుదె యేమగునో చూత
మనిన నరాంతకుఁ డౌడు గఱచి
గదఁ ద్రిప్పి ఱొమ్ముఁ దాఁకగ నేసె నేసిన
గద భిన్నభిన్నమై కలసె నేల

తే. అంగదుం డంతఁ గనలుచు నసురవీతి
నెత్తిపై మొత్తె నఱచేత దుత్తుము రయి
నేలఁ గూలెను దేజి యన్నెగులు చూచి
రక్కసుఁడు క్రోధమూర్ఛితుఁ డుక్కుమిగిలి. 136

చ. పిడికిట వాలిపుత్రకుని వీపునఁ గోపకషాయితాక్షుఁడై
పొడిచెను దాన నింత కపిపుంగవుఁ డూర్చియుఁ బేర్చి నేర్చి పెం
బిడుగున కెత్తువచ్చి కడు బింకముఁ గల్గినముష్టి నెత్తి త
త్తడివలెఁ గూలు మం చసుర దగ్గఱి బిగ్గర మొత్తె ఱొమ్మునన్. 137

తే. వజ్రపాతమునన్ గొండ వగులు నట్లు
రావణాత్మజువక్షము రజము వోలె
నయ్యె నెత్తురు గ్రక్కుచు నతఁడు నేలఁ
గూలెనార్చుచుఁ బెనుగొండ గూలినట్లు. 138

తే. వేలుపులు పుష్పవర్షము లీల నంగ
దునిశిరంబునఁ గురిసిరి కని రఘూద్వ
హుఁడును మే లని మెచ్చె నప్పుడు పలాసు
లెంతయును దుఃఖమున డింది రంతలోన. 139

వ. దేవాంతకత్రిశీర్షమహోదరులు గొం తెత్తి పలవించియు ధైర్యంబుఁ దెచ్చుకొని పెచ్చుపెఱిగిన మచ్చరంబున వాలిపుత్రుని మృత్యువున కిల్లటంబుఁ గావింతు మని వాని నెదిర్చి రంత నంగదుండును. 140

సీ. పెనుమ్రానుఁ బెకలించి తనమీఁద వచ్చెడు
దేవాంతకునిమీఁదఁ ద్రిప్పి వైచెఁ
ద్రిశిరుఁ డామ్రానును దిలలంతలుగఁ జేసె
నది చూచి యంగదుం డాగ్రహించి
వృక్షపర్వతముల వెసఁ బూని వానిపైఁ
గుంభవర్షమ్మట్లు గ్రుమ్మరించెఁ
ద్రిశిరుఁ డాద్రుమపర్వతశిఖరములఁ ద్రెంచి
ఖరమార్గణము లేసి తఱిమె వాలి

తే. సుతు మహోదరుఁ డేనుఁగు నతిరయమునఁ
దరియఁగాఁ ద్రోలి యంగదు వరశరముల
నడఁచె వక్షమునందు దేవాంతకుండుఁ
గట్టలుకఁ గొట్టెఁ గుదియతోఁ గాఱ నల్ల. 141

తరు. వారు మువ్వురు తన్ను వడి ముట్టి పోర
వాలిపుత్త్రుఁడు నొవ్వ వడ కఱచేతఁ
గ్రూరు మహోదరుఁ గొప్పయేనికనుఁ
గూల నేసియు దానికొమ్ము చేఁ బూని
పేరురంబున మోదె వెస దాన వాఁడు
పృథివీస్థలిం బడి వెండియు లేచె
వార లంగదుమీఁద వాలమ్ము లెన్నొ
పరగించి నొంచిరి పరిపరిగతుల. 142

వ. అట్లు వాండ్రు మువ్వు రయ్యంగదునిం బట్టి పల్లార్చుచుండం గని హనుమన్నీలు లిర్వురు రివ్వున వచ్చి కవిసి రప్పుడు నీలుండు. 143

ఆ. త్రిశిరునెత్తిమీఁద తెప్పునఁ బడునట్లు
పర్వతం బొకండు పట్టి యెత్తి
వైచె నతఁడు దాని వాలమ్ములం జేసిఁ
ద్రుంచి వైచె నడుమఁ దునియలు గను. 144

తే. అంజనానందనుండు దేవాంతకుపయి
నద్రి శిరమునఁ బిడుగు పైఁ బడినయట్లు -

గ్రుద్దె నందున నొదల బ్రద్ద లగుచు
నేలఁ బడి చచ్చె గుఱ్ఱ డ్లాడ నాలు కాడ. 145

తే. త్రిశిరుఁడును మహోదరుఁడును రేగి యపుడు
మబ్బు లుఱుముచు నద్రిపై మంచి వాన
గుఱియు నట్టులు నీలుపై శరపరంప
రలను నిగిడించి రొప్పుచు నలుకఁ జేసి. 146

ఉ. నీలుఁడు దాన నొచ్చి కడు నెంజిలికై యినుమంతలోపలన్
గాలిలఁగ నై సవృక్ష మగు గ్రావ మొకండు పెకల్చి తెచ్చి కెం
గేల నమర్చికొంచు వడి గిఱ్ఱున ద్రిప్పి మహోదరాసురున్
బోలగఁ జూచి యేసె నది వోయి శిరంబు వగిల్చెఁ బెల్చనన్. 147

ఆ. పిన్నతండ్రి యట్లు పృథివి గూలుటగాంచి
త్రిశిరుఁ డలుకఁజేసి తెగి మరుత్తు
నూఁజు దాఁకి వీఁకఁ బేజు మీఱినవాఁడి
తూఁపుగముల వానిఁ దూల నేసె. 148

సీ. పవనసూనుం డల్గి పర్వతశిఖరంబు
వైచెఁ ద్రిశిరుమీఁద వాఁడు కనలి
దానిని ఖండింప వానరముఖ్యుండు
వృక్షవర్షము కడు రూక్షముగను
గురిసె నావర్షము శరముల నడఁగించి
పెల్లార్చె హనుమంతుఁ డల్ల నెగిరి
వానిపైఁ బడి గోళ్ళ వారువంబును జీల్చెఁ
ద్రిశిరుండు చేఁ బూని దివ్యశక్తి

తే. హనుమపై నేసె నంతలో నతఁడు దానిఁ
బట్టి చేతుల ముక్కలై పడఁగ విఱిచి
సింహనాదము గావించెఁ జేత గొనసుఁ
బూని త్రిశిరుండు హనుమఱొమ్మునను మోదె. 149

మ. తనపై వచ్చుగదాయుధంబు గని వాతప్రోద్భవుం డంత దా
నిని హ స్తంబునఁ బట్టి రావణసుతుం దీక్ష్ణంబుగాఁ జూచి వే
సెను దానన్ మృతుఁడై యతండు నిలఁపైఁ జేరె న్నిమేషంబునన్
గని సుగ్రీవముఖుల్ ప్రమోదమునకై కైసేసి రమ్మారుతిన్. 150

క. తనవారు తెగినదానన్
ఘనుఁడు మహాపార్శ్వుఁ డలుకఁ గద గొని రాఁగన్
గని ఋషభుఁ డెదుర్కొని నిలు
మని వారించుఁడు నతండు నగ్గదతోడన్. 151

తే. ఋషభువక్షస్థలమ్మున నేసె దానఁ
జకితుఁడై యింత సోలితత్ క్షణము తెలిసి
యెగిరి రక్కసిచే గద నెగిచి పట్టి
దాన ఋషభుఁడు వానినిఁ జా నడంచె. 152

వ. ఇట్లు తనవారు దెగుటం గని మగటిమి గలుగు నతికాయుండు కనకరథం బెక్కి వింటినారి మ్రోఁగించుచు వచ్చి తనపేరు విని పించి సింహనాదంబు గావించి కపుల నందఱ గడగడలాడించె నప్పుడు వానిగొప్పకాయంబు గని వారు కుంభకర్ణుండు మఱియు లేచి వచ్చె ననుభయంబునఁ జెట్టొకండుగం బాఱి రామునిన్ శర ణంబుఁ జొచ్చిన నతండు వారి కభయం బొసంగి విభీషణుం గాంచి నివ్వెరం పడుచు ని ట్లనియె. 153

—♦ విభీషణుఁడు రామున కతికాయు నెఱింగించుట ♦—

సీ. వేయివెలుంగులవేల్పుబింబము నాఁగ
వేయిగుఱ్ఱము లూన వెలుఁగురథము
రథముపైఁ గాలుని వ్రాలునాలుకలునా
నలరుచు వెలుఁగుశక్త్యాయుధములు
శక్త్యాయుధంబుల సరస నింద్రధనస్సు
లన నొప్పుపెద్దపెద్ద లగుధనువులు
ధనువులచెంగటఁ బెనుకాలసర్పము
లొకో నాఁగ జ్వలియించునురుశరములు

తే. శరములం గూడి మెఱపులకరణి మెఱయు
చిల్లకోలలు శూలముల్ శితకృపాణ
ములునుఁ దూణీరశతములు గలిగి లోక
భీకరుం డయి వచ్చునావీరుఁ డెవఁడు. 154

సీ. రాహుకేతనమున రాణించురథ మది
వెలుఁగుచున్నది వహ్నివలె దెసలను
గర్జాధ్వనిం గల్గి కదలునీరథమును
నలువురు సారథుల్ నడుపుచుంద్రు
మూఁడు నాలై దాఱు మూరలమెత్తు లా
వును గల పెంగదల్ దనరు రెండు
ముప్పది నల్వది గొప్పయమ్ములపొదుల్
గలవల్లె త్రాళ్లు పెక్కులు దలిర్చు

తే. సర్వరత్నకిరీటభూషణవిరాజ
మానుఁడై సూర్యుఁడో యని మానసమునఁ
దోపఁ జేసినవిధమున నేపు మీఱి
నేగుదెంచునతం డెవ్వఁ డెఱుఁగఁ జెపుమ. 155

వ. అనిన విభీషణుండు రఘుకులభూషణుం గాంచి యి ట్లనియె. 156

తరు. దశశిరంబులవాఁడు ధాన్యమాలినిని
దయితగాఁ గొని కాంచె దానియం దితనిఁ
బశుపతిభక్తునిఁ బరఁగు నితండు
ప్రధనంబుల నసాధ్యపద్ధతివాఁడు
విశదంబు గా శాస్త్రవిధుల నెఱింగి
వెలయుచుండినవాఁడు పేరువిల్కాఁడు
దశదిశలం బేరు దనరినవాఁడు
తగు నతికాయుఁడన్ దైత్యవల్లభుఁడు. 157

తే. తేరిపై నెక్కి శరము సంధించుపట్లఁ
దేజిపై నెక్కి కత్తినిఁ ద్రిప్పుపట్ల

నేన్నుపై నెక్కి పాశంబు సేయుపట్ల
వీనికిన్ జాలుమొనగాఁడు పృథివి లేఁడు. 158

తే. వీనితపమునకర్కుఁ మెచ్చి విధి యితనికి
నినసదృశతేజముం గలయీరథంబు
కవచము నొసంగి దేవదానవుల కితఁడ
సాధ్యుఁ డని మున్ను వర మిచ్చె చనవు హెచ్చ. 159

క. ఈయతికాయుం బోలిన
శ్రీయుతుఁ డీలంకలోనఁ జెప్పఁగ నెవఁడున్
నాయెడఁదకుఁ దోఁపఁ డితని
సేయుము నీవిక్రమంబు నేర్పడ రామా. 160

—♦ అతికాయునితో లక్ష్మణుండు మార్కొనుట ♦—

వ. అని వారు ప్రసంగించుకొనుచుండ నతికాయుండు ధనుష్టంకారంబు సేయుచు వానరసేనాముఖంబునం జొచ్చినఁ గుముద ద్వివిద మైంద నీల శరభులు వృక్షపర్వతాదులం గొని యొక్కుమ్మడి వాని నెదుర్కొనిన నతండు దర్శనమాత్ర వారికరంబుల నుండువృక్షపర్వతాదుల నెగురంగొట్టి బెట్టంపసెలకట్టియలు పై నేసిన వారెల్ల నొల్లబోయి వెరచఱచి పఱచి రంత నతండు శ్రీరాముని సమీపంబునకు వచ్చి యెల్లరు విన ని ట్లనియె. 161

శా. విల్లమ్ముల్ గొని వచ్చినాఁడ నిదిగో విఖ్యాతశౌర్యంబునన్
విల్లమ్ముల్ గొననట్టివార లలఁతుల్ వే వచ్చినన్ వారితో
సల్లాపించుచుఁ బోరుకోఁ దలఁప నాస్వాంతంబునన్ వేఁడు మేల్
విల్లుం బట్టినవాఁడు న న్నెదురుగా విచ్చేయ వచ్చున్ వడిన్. 162

క. అతికాయుపల్కులన్ విని
మతిమంతుఁడు లక్ష్మణుండు మార్వోధ్వానం
బతులితగతిఁ గావించుచు
బ్రీతిగా నాతనిని గాంచి రావణి యనియెన్. 163

శా. సౌమిత్రీ! పసివాఁడ వీవు బలమున్ శౌర్యంబునున్ ధైర్యమున్
నీమైఁ జాలినయట్లు లే వగుట నిర్ణిద్రప్రభావాఢ్యుఁడై

భూమానందము నందియున్నను సంస్ఫోటంబునన్ దాఁక లే
వేమాత్రంబును విల్లువెట్టి చను మొండేఁ గాచికోఁ బ్రాణముల్. 163

వ. అనిన రోషకషాయితాక్షుండై లక్ష్మణుండు. 164

క. మాటలఁ జూపెదు శౌర్యం
బేటులఁ జూపంగ నెంచు మే నిదె నేలన్
మేటివిలు పూని నిలిచితిఁ
బోటరివై రథికుఁడగుచుఁ బోరుము నాతోన్. 165

మ. పసివాఁ డంచుఁ బరాకునొందకుము నాబాణంబు లివ్వేళ నీ
యసువుల్ దీయఁగఁ దొంగి చూచెడిని మూర్ఖా! నీవు నిష్ణాతుఁడై
మిసిమిం జూపుము గర్వివై చెడకు మేన్ మేలెంచి భాషించితిన్
బసికిం బోలినధర్మమున్ గొని యిటం బ్రాల్మాల కోబాలిశా. 166

సీ. అతికాయుఁ డత్యాగ్రహావిష్టుఁడై యంత
నెక్కువెట్టినవింట నెక్కటి శర
మొక్కఁడు సంధించి యుక్కమై సౌమిత్రి
పై నేసి పెల్లార్చెఁ బగులఁ గొండ
లతఁ డర్ధచంద్రబాణాభిహతిం జేసి
ఖండించె ముక్కముక్కలుగ దాని
యలిగి రావణసూతి యైదుబాణములను
భరతానుజునిమీఁదఁ బడఁగ విసరె

తే. అతఁడు తనపైకి వచ్చెడునాశరముల
నడుమ న య్యైదు పది చేసి కడిమి మెఱసి
వాఁడియలు గొండు రాక్షసప్రవరునొసట
నాటఁగా నేసె నటఁ బాఱె నల్లవెల్లి. 167

మ. అతికాయుండు బలీ యటంచు రఘువంశాంభోధిచంద్రా! నినున్
స్తుతియింపం దగు నీదుకౌశలము సంస్తోత్రాతిపాత్రంబు నీ
వతి తేజస్వివి కాచు కొమ్మనుచు దివ్యాస్త్రంబు లెన్నని యం
చితరీతిన్ నిగిడింప లక్ష్మణుఁ డొగిన్ ఛేదించె నయ్యన్నిటిన్. 186

క. తనయమ్ము లట్లు వమ్మై
చనఁటకు నతికాయుఁ డల్గి సౌమిత్రిపయిన్
ఘనశస్త్ర మొండు విడువన్
జని యయ్యది రాముననుజు జత్రువుఁ దాఁకెన్ 170

వ. దాన నించుక చలించి యతండు. 171

మ. నియతిన్ వింట సమంత్రకంబుగను నాగ్నేయాస్త్రసంధానమున్
నయ మొప్పన్ బచరించి రక్కసిమొయిన్ నాటం బ్రయోగించె నా
భయదూరుం డతిలోకసూర్య మనుగు ష్టంబైన దివ్యాస్త్రమున్
రయముం జూపుచు నేసె లక్ష్మణునిపై రాత్రించరుల్ మెచ్చఁగన్.

తే. రెండుబాణము లొండొంటి నెండుకొనుచు
నింగిపై నంటి మండుచు నేలఁ బడియెఁ
గ్రిందనుండిన సైనికు లెంద ఱెంద
ఱో మృతించి రాబాణము లామెయిఁ బడ. 173

—♦ లక్ష్మణుఁడు బ్రహ్మాస్త్రమున నతికాయు సంహరించుట ♦—

సీ. అపు డల్క రాక్షసుఁ డైషీక మడరించె
నైంద్రాస్త్రమున దాని నడిచె నృపతి
యమదేవతాకాస్త్ర మసుర గీలించిన
వాయవ్యమున దాని వ్రాల నేసి
రామానుజుఁడు క్రోధరక్తాస్యుఁడై వేయి
బాణముల్ సంధించి వైచె విసరి
క్రవ్యభక్షుఁ డభేద్యకవచుఁ డౌట నొకింత
యే నొవ్వ గలుగమి యెసక మెసఁగె

తే. అపుడు లక్ష్మణునకు విన నయ్యె గాలి
వాకు వీఁడు బ్రహ్మవరప్రభావమునను
బాదలు నితరాస్త్రములు వీనిఁ జిదుమ లేవు
దండి కెక్క బ్రహ్మాస్త్ర మొక్కఁడు గాక. 174

తే. అనుడు బ్రహ్మాస్త్ర మరివోసి యసురమీఁద
విడిచె రఘురాముతమ్ముఁ డప్పుడు కడింది

మంట లెసఁగంగ దివియును మహియు వడకఁ
బాఱఁ జొచ్చె నది సురారి వఱలుదెసకు. 174

తే. అసుర దిగులొంది శక్తితో నసులతోడ
గదలతోడను నినుపరోకళ్ళతోడఁ
దాని వారింప నెంచెను గాని వాని
వీఁకఁ బడఁద్రోచి కొనిపోయి తాఁకె వానిఁ 175

చ. కనుమెదలించులోన నతికాయునిశీర్షము రత్నభూషణా
ప్రిణుతము గ్రత్తరించి సురవర్త్మము నంటి గమించె నంత మే
లని సుర లంతరిక్షమున నాడుచు నుండఁగఁ గృత్తశీర్ష మొ
య్యన ధరణీతలంబున మహారవ మేర్పడఁ గూలె ధూళియై. 173

వ. హతశేషు లగుదైత్యులు దైన్యంబు నొంది వెఱచఱచి పఱచి రావణున కంతయు నెఱింగించిన నతండు చింతాక్రాంతచిత్తుండై తత్తఱంపడుచు హత్తియున్నమిత్రులం గాంచి మంత్రులారా! మహాబలపరాక్రమశాలు లగు ధూమ్రాక్ష కంపన ప్రహస్త కుంభకర్ణ ప్రభృతియోధానుయోధు లెల్లరు లోకంబు లెల్లం బఋుం బడినఁ జలింపనివా రట్టిమహావీరు లందఱు మృందిరి బ్రహ్మదుల కైనవిడిపించుకొనశక్యమ్ముగాని యింద్రజిన్నాగాస్త్ర బంధమ్ము లింతలో వీడిపోయిన వన రామలక్ష్మణులు మనుష్యు లయ్యును మహానుభావులు కావలయు గానిండు వానికై చింతిం చినఫలంబు లేదు మనప్రారంభంబున కంతరాయంబు గలిగింపం జెల్ల దిపుడు మనలో శత్రుసంహారంబు గావింపం జాలినవాఁ డొక్కరుండును గానిపించుట లేదు కార్యం బెట్లు కొనసాఁగునో తెలియకున్న దని ఖిన్నుండై పుత్రశోకోపహతచేతస్కుండై లేచి లోనగరికిం బోయి శయనించి చింతించుచుండె నయ్యవసరంబున నింద్రజి త్తయ్యెకడకు వచ్చి త న్నెఱింగించిన నతం డతని నాదరిం చుచు ని ట్లనియె. 178

సీ. నీవ కదా దేవదేవుని మెప్పించి
వరము లందినయట్టివరసుతుఁడవు

నీవ కదా తొల్లి దేవేంద్రు నోడించి
నాకుఁ జే రెచ్చిననందనుఁడవు
నీవ కదా యెల్లదేవళ్ళచే వర
వుడము నందినయట్టిపుత్త్రకుఁడవు
నీవ కదా బహుభావంబులఁ మాయ
లన్నియు నెఱిఁగినయాత్మజుఁడవు

తే. నీకు దివ్యాస్త్రములు ధన మోకుమార!
రామలక్ష్మణసుగ్రీవు లీమొయిఁ గడుఁ
గ్రొవ్వి కుంభకర్ణాదులఁ గూల్చినారు
వారి మార్గాన నీవు గా కేరు తండ్రి! 179

తే. వినుము నీబారిఁ బడి వారు మసఁగ నోప
రీవు కట్టాయితం బయి యేగి పగఱ
నేర్చి హతు లైననీవారిఋణముఁ దీర్చి
నామనం బలరింపవే నాకుమార! 180

వ. అనిన నింద్రజిత్తు తండ్రి కి ట్లనియె. 181

సీ. ఇంద్రజి జీవించి యి ట్లుండ నోతండ్రి
యిట్లు చింతించుట కేమి వచ్చెఁ
బంపు మీతనిఁ బోయి పగర సాధించి నీ
హృదయశల్యముఁ బాపుఁ నింతలోన
నని యాజ్ఞఁ గొని రావణునిపుత్త్రుఁ డాతండు
ధైర్యసాహసములు శౌర్య మెసఁగ
సైన్యసమేతుఁడై సమరాంగణమునకు
నరుదెంచెఁ బహుళతూర్యములు మొఱయ

తే. దివ్యతేజము లభియింపఁ దివిరి యచట
నగ్ని వేలిచి తనదు బ్రహ్మాస్త్రమునను
రథము రథ్యము లస్త్రముల్ రమణ మెరయు
నట్లు లతఁ డభిమంత్రించె నధికశక్తి. 18:

—♦ ఇంద్రజిత్తు సన్నద్ధుండై వచ్చి మహాయుద్ధము చేయుట ♦—

వ. ఇట్లు కావించి ధనుర్బాణఖడ్గాదులు ధరించి దివ్యరథం బధిష్ఠించి.

శా. అంతర్ధానము నొంది మేఘములలో నాకాశ మందుండి దు
ర్దాంతంబుల్ బహుశస్త్రముల్ పఱపుచున్ బ్రత్యర్థి సంఘంబులన్
జింతాక్రాంతులఁ జేయుచున్ జిదుముచున్ జీడ్రంబు గావించుచున్
గొంతల్ గానిపరాక్రమక్రమములన్ గోపించి దీపించుచున్. 184

ఆ. ఇంద్రజిత్తుసేన సాంద్రపరాక్రమ
మెసకమెసఁగ బాణవిసరములను
జిత్తజల్లుఁ బోలె నత్తఱిగుఱియుచుఁ
జెల్లఁ జెదరు గాగఁ జేసె నరుల. 185

క. శిలలన్ వృక్షములన్ గపి
బల మది రాక్షసులమీఁదఁ బడి ఘోరరణం
బలయికలు పుట్టఁ జేసెన్
బలుమఱు త న్నింద్రజిత్తు బడలుపఱచినన్. 186

సీ. గంధమాదనుఁ బదికాండంబులన్ మోదె
నలునిఁ డొమ్మిదిశరంబులను నొంచె
మఱి యేఁడుతూపుల మైందుని నోనేసె
గజు నైదుకోలల గండడంచెఁ
బదిబాణముల జాంబవంతుని నొప్పించెఁ
ముప్పదమ్ముల నీలుఁ బొడ వడంచె
సుగ్రీవు నాఱింట సుక్కించె నంగదుఁ
బదియాఱుతూపులఁ బడలుపఱచె

తే. ద్వివిదఋషభాదులను బెక్కువిశిఖములను
బ్రళయకాలాగ్నిరుద్రుఁడై బ్రజ్వరిల్లి
యింద్రజియు ఋక్షవానరసాంద్రబలము
నొచ్చియుం జచ్చిపో నేసె హెచ్చి యపుడు, 187

వ. మఱియు హనుమత్సుగ్రీవాంగద గంధమాదన జాంబవ త్సుషేణ వేగదర్శి మైంద ద్వివిద నీల గజ గవయ గవాక్ష గోముఖ కేసరి హరిలోమ విద్యుద్దంష్ట్ర సూర్యానన జ్యోతిర్ముఖ దధిముఖ పావకాక్ష నల కుముద ప్రభృతివానరవీరుల బ్రహ్మాస్త్రమంత్రాభిమంత్రిత మార్గణజాలంబులఁ దూలనేసి సూర్యకిరణోపమంబు లగువజ్రబాణంబుల రామలక్ష్మణుల లక్షించి ప్రయోగించె నప్పుడు రాముండు లక్ష్మణుం గాంచి యి ట్లనియె. 188

— రామలక్ష్మణులు సర్వసైనికులతో బ్రహ్మాస్త్రబద్ధులగుట —

తరు. తమ్ముఁడా రావణతనయుండు వీఁడు
తనదుబ్రహ్మాస్త్రంబు దార్ఢ్యంబువలన
నిమ్మెయి సేనల నేచియు మనల
నీరీతిఁ బ్రహరించె నిప్పుడు మనము
బ్రహ్మవరంబును బట్టి శాంతింప
వలసినట్లుండె నేపగిదిని గాని
బ్రహ్మవ్రాల్ తుడువంగ వశ మన రాదు
వలయు విశ్రాంతిని వహియింప మనకు. 189

వ. అని తమసైనికులుం బోలె రామలక్ష్మణులు తాము నాబ్రహ్మాస్త్రప్రభావంబున మూర్ఛ మునింగి రప్పు డింద్రజిత్తు సర్వసేనామూర్ఛం దెలిసి సింహనాదంబు గావించుచు నాసాయంసమయమున లంకాపురంబునకుం జని తండ్రికావృత్తాంతం బంతయు నెఱింగించి పరమానందతరంగితాంతరంగుం గావించె నంత నిక్కడ మూర్ఛంబడి యున్నసర్వసైన్యంబుం గాంచి బుద్ధిమద్విభూషణుం డగువిభీషణుండు వానరవీరుల నెల్ల నాదరించుచు ని ట్లనియె. 190

— ఆంజనేయవిభీషణులు సర్వసేనం జూడ నరుగుట —

సీ. ఘనులార! రామలక్ష్మణులు మూర్ఛిలి రంచు
వగవకుఁ డాబ్రహ్మవరమును వారు
గౌరవించిన వారు గావున నింద్రజి
స్త్రంబునకు బద్ధు లైనయట్లు

వర్తింతురే కాని వారికి బ్రహ్మాస్త్ర
భయ మింతయే లేమి వాస్తవంబు
వెలుపు దక్కఁ డటంచు వినిచెడునంతలో
బ్రహ్మాస్త్రముక్తుఁడై పవనసుతుఁడు
తే. రావణానుజుఁ గాంచి సుగ్రీవసైన్య
మిట్లు పడియుండె నిందులో నెవ్వఁ డెవ్వ
డిపు డుసురు గల్గి యుండెనో యెవ్వఁ డెట్టు
లుండెనో చూచి వచ్చుట లొప్పు మనకు. 191

వ. అనినంత వా రిరువురు గొఱవులం గొని యూనడిరేయిఁ గాళ్ళను జేతులును డొక్కలును బిక్కలును తలలును మొలలుం దెగి పడినశవంబులతో రక్తమాంసాదులతో నస్త్రశస్త్రశకలంబులతో నిండి యున్నపొలికలనెల్లం గలయఁ బరికించి యం దందు నొడ లెఱుంగక మృతప్రాయులై యున్నసుగ్రీవాంగద నీల శరభ గంధమాదన గవాక్షాదులం గాంచి యింద్రజి త్తవ్వేళ నొక్క ముహూర్తంబున నఱువదియేడుకోట్ల వానరులం గూల్చి యుండు నని నిశ్చయించు కొనుచుం జని చని యొక్కచో గొనయూపిరితో నున్న బ్రహ్మపుత్రుం డగుజాంబవంతుం గాంచి చింతించుచు నెట్ట కేలకు విభీషణుం డిట్లనియె. 192

—♦ విభీషణుఁడు కొంత జ్ఞప్తిగలిగిన జాంబవంతునిం గనుట ♦—

తే. ఇంద్రజిద్బాణహతిఁ జేసి యెల్లసేన
తెళ్ళనయ్యెను నీ వెట్లు దేవురించు
చుంటివో ప్రాణములు కెట్టివెంటనేని
యెట్టువచ్చెనో తెలుపు నా కింత తెలిసి. 193

వ. జాంబవంతుం డంత దెప్పిఱిల్లి మెల్లన నిట్లనియె. 194

చ. స్వరమునఁబట్టి ని న్నెఱిఁగి సాళ్వడిపోయినకన్ను విచ్చి ని
న్నరసి వచింపనుంటి నిటు లాహనుమంతుని మేనఁ బ్రాణముల్
పరఁగునో చెప్పు మిప్పు డని పల్క విభీషణుఁ డాంజనేయు ని
క్కరణి వచింతు రాఘవులకష్టసుఖంబుల నెత్త వక్కటా. 195

ఆ. వాయుసుతునియందు వర్తించుప్రేమ సు
గ్రీవునందుఁ గాని దైవతేంద్ర
పౌత్రునందుఁ గాని ప్రభు వగురాముని
యందుఁ గాని లేనియట్లు తోఁచు. 196

ఉ. కారణ మానతి మ్మనినఁ గంటఁ గనుంగొని జాంబవంతుఁ డా
కారణమున్ వచింతు విను గాలిసుతుం డతఁ డొక్కఁ డుండినన్
వీరును వారు నాక పదివేవురు నుందు రతండు వోయినన్
వీ రెవ రున్నలాభ మొకవీసము లేదు సుమీ విభీషణా. 197

తే. వీర్యమునఁ జేసి నగ్నికి వెలితి గాక
వేగమునఁ జేసి గాలికిన్ బెచ్చి యుండు
నతఁడు బ్రతికిన మే మెల్ల బ్రతికినట్ల
యనివచింతు విభీషణా ! యరసి కొనుము. 198

మ. అనినంతన్ బవమానసందనుఁడు తత్ప్రాంతాగతుండై కృతుల్
తనచే ముట్టుచు గోత్రమున్ బ్రవర మాస్థం బల్కుచుఁ బాదముల్
గొని సాష్టాంగనమస్కృతిన్ సలుప భల్లూకేశ్వరుం డంత మొం
దినయట్లుండియు వెండి ప్రాణములు రా దీపించున ట్లొప్పుచున్.

—♦ జాంబవంతుఁడు హనుమంతుని సంజీవనికింబుచ్చుట ♦—

ఉ. దగ్గఱ రమ్ము తండ్రి ! నిను దైవము సూపెను రక్షకుండు గా
నిగ్గతిఁ మి త్రివాతఁబడునిందఱు మ్రిందక యుండఁ గావఁగాఁ
దగ్గజనుండ వీ వొకఁడు దక్క మఱొక్కఁడు లేఁడు నేను నీ
దగ్గఱచుట్ట మట్టిఁ డని తత్పరతన్ విను నాదువాక్యమున్. 200

తే. రామలక్ష్మణులును వానరప్రవరులు
నొచ్చిపడియుండి రిచ్చట హెచ్చు లుడిగి
యీవు నేఁ జెప్పినటు జేసి యెల్లవారి
స్వస్థులుగఁ జేయఁ జూడవే వాయుపుత్ర. 201

సీ. ఉత్తరదిగ్భూమి నుండుహిమాలయ
మనెడుపర్వతరాజ మందు ఋషభ

కైలాసములు నాఁగ ఖ్యాతముల్ శిఖరము
లాశిఖరముల కభ్యంతరమున
నోషధి పర్వత మొప్పెడు నందు మూ
లికలు నాలుగు గల వొకఁడు నొకఁడు
నిం తింత మాహాత్మ్యవంతము లనఁ జాల
మవి తెచ్చి యందఱప్రాణములను
తే. గావు మయ్యవి సంజీవకరణి యనియు
వరవిశల్యకరణియు సౌవర్ణ్యకరణి
యనియు సంధానకరణి నా నాఖ్యలఁ గొని
యలరుచుండుఁ దృణజ్యోతు లగుచు నెపుడు. 202

—♦ హనుమంతుఁడు సంజీవకరణిం దేఁబోవుట ♦—

వ. సంజీవకరణి మృతసంజీవినా నొప్పి జీవనంబు లిచ్చు విశల్యకరణి విరిగినశల్యంబులం జక్కఁ జేయు సంధానకరణి విడినచర్మశల్యాదుల సంధానించు సౌవర్ణకరణి వ్రణవైల్యంబు వాయఁ జేయు నని చెప్పిన నప్పవమాన నందనుం డానందంబున జాంబవంతునకు మ్రొక్కి విభీషణుననుమతిం బడసి త్రికూటపర్వతం బెక్కి యక్కడ నుండి మలయపర్వతంబునఁ గాలూఁది కుప్పించి యెగసి యుప్ప రంబు మార్గంబున సముద్రంబు దాఁటి పర్వతంబులునదంబులు నతి క్రమించి వాయువేగంబున హిమవంతంబునకుం జని దేవబుషులు వసించునట్టిపుణ్యప్రదంబు లగుదివ్యాశ్రమంబులును బ్రహ్మకోశా శ్రమము గైలాసము నిందాశ్రమము రుద్రబాణాశ్రమము హయ గ్రీవారాధనాశ్రమము రుద్రచ్ఛిన్నబ్రహ్మశిరస్థాపనాశ్రమము యమ కింకరాలయమువజ్రాలయము కుబేరాలయము సూర్యనిబంధనాశ్ర మంబును బ్రహ్మాసనమును శివధనుఃప్రదేశమును బాతాళప్రదేశ రంధ్రంబును దిలకించి హనుమంతుం డందుఁ బ్రధానంబు లగుకైలా సంబును హిమవచ్ఛిలయు బుషభపర్వతంబును గాంచనశైలంబును జూచుచు నోషధిపర్వతంబునకుం జని యగ్నిజ్వాలాజాలజాజ్వల్య మానం బగునప్పర్వతంబున జాంబవదుక్తదివ్యౌషధంబుల వెదకి

వెదకి కానక విసికి వేసారి మహాగ్రహంబునఁ గన్నుల నిప్పుక లుప్ప
తిల్ల నప్పర్వతరాజము నుద్దేశించి యి ట్లనియె. 203

—♦ హనుమంతుఁ డోషధిపర్వతంబు పెల్లగించి తెచ్చుట ♦—

శా. ఓరీ! పర్వతరాజ! నే నెవఁడనో యూహింపవా సర్వలో
కారాధ్యుం డగురామచంద్రునకు వేడ్కన్ గూర్చు భృత్యుండ సా
మీరిన్ వచ్చితి నోషధుల్ గొనఁగ నామీఁదన్ దయం జూప వే
నే రడ్డం బవుదెంచినన్ విఱువ ని న్నేఁ బెల్లగింతుం జుమీ 204

వ. అని ప్రార్థించియు ఫలంబు గాన కాగ్రహంబున. 205

క. ఓషధిపర్వతశిఖరం
బీషత్కాలమునఁ బెఱికి యెదఁ గొని తేజో
భూషితుఁడై లంకకు సం
తోషము దొలుకాడ వచ్చె దోరపుశక్తిన్. 206

వ. అట్లు వచ్చి వానరసేనామధ్యంబున దానిని నిలిపి విభీషణుం గౌఁగి
లించుకొని జాంబవంతునకు మొక్కి నంతలో నాదివ్యౌషధుల
మీఁదిగాలి తాఁకునం జేసి రామలక్ష్మణులును దక్కినయెల్లకపులును
మూర్ఛం దేరి రదియుం గాక మును్న మృతులైనవానరులును
రేయి నిదురించినవారుం బలెఁ బునర్జీవితులై లేచి నిలిచి రి ట్లెల్ల
వారిం బొదలించి హనూమంతుం డప్పటియ ట్లపర్వతంబుఁ బెట్టివచ్చి
రామునిం దర్శించి కృతకృత్యుం డయ్యె. 207

తే. అంతఁ గపిరాజు సుగ్రీవుఁ డాగ్రహమునఁ
గపులఁ గనుగొని మీ రెల్లకడలుఁ గాల
లంకకున్ నిప్పు పెట్టుఁడు శంక విడిచి
గవనులం గాఁచి చంపుఁ డాక్రవ్యభుజుల. 208

—♦ సుగ్రీవుని పంపున వానరులు లంకాదహనముచేయుట ♦—

వ. అని యాజ్ఞాపించుటయు. 209

ఉ. వారక వారు దివ్వటులు వాల్మొకలకచ్చులు గొంచు పోయి త
ద్ద్వారములందు రక్షకులఁ బట్టి వధించియుఁ జొచ్చి లోనికిఁ

మేర యొకింతలేక చని మేడలు మిద్దెలు గోపురంబులున్
దోరణముల్ గృహాంగణములును దొడ్లులపట్టులు గాల్చి రుద్ధతిన్. 210

సీ. ప్రాసాదములుకాలి బసుమమై యిలఁ గూలె
గృహములయం దగ్ని కేళి సలిపె
నాయుధశాలలు నశ్వశాలలు గజ
శాలలు పానీయశాల లెల్లఁ
బరశురామవిహారభవనములై పోయె
ధాన్యాదిరాసులు దగ్ధ మయ్యె
రత్నాంబరాదులరాసు ల వన్నియు
భస్మసాత్కృతములై పడటఁ గలసె

తే. నింగి పొడు గయి మంట లుప్పొంగి లేచె
ఫెళఫెళధ్వని దిక్కులఁ బిక్కటిల్లె
రోదనారవ మది పర్వె రోదసిపయి
వానరులు లంకఁ గాల్చునప్పట్టునందు. 211

ఆ. అట్లు పురము గాల్చునావానరులు పెచ్చు
పెఱిగి కానఁబడినవీరభటుల
నెల్ల నొల్లఁబోవ నేయుచుండుట విని
రావణుండు మిగుల రవరవపడె. 212

## —♦ కుంభ నికుంభాదులయుద్ధము ♦—

వ. కుంభకర్ణపుత్రు లగుకుంభనికుంభులం బిలిచి వారికిం దోడుగ యూపాక్ష శోణితాక్ష ప్రజంఘ కంపను లనువారిని మఱికొందఱ రాక్షసులం దోడిచ్చి పుచ్చుటయు వారు వివిధాయుధంబుల ధరించి చతురంగబలంబులతోడ రణరంగమునకుం జని వానరవీరులం దాఁకి గదాసితోమరభిందివాలాద్యాయుధంబులం జేసి పోరాడుచుండ వృక్షచరాగ్రసరులును బాషాణవృక్షపర్వతాదులతో వారినెదిర్చి పేర్చి ఘోరయుద్ధంబు గావించి రప్పుడు తలలు పగిలియు గుత్తుక లుత్తరింపం బడియుఁ జేతు లూడియుఁ గాళ్ళు

తెగియు నడుములు విఱిగియు నుదరంబులు బ్రద్దలయ్యు ననేకవీర భటులు నేలం బడిరి మఱియు రథగజాశ్వాదులు శకలంబులై సంగ రాంగణంబెల్ల నిండె వివిధాయుధంబులును వృక్షపర్వతాదులును విశీర్ణంబులై నేల నల్లాడె రక్తంబు సువ్యక్తంబై ప్రవాహరూ పంబు నందె నట్లిరువాఁగు వారును బీరువోని పరాక్రమంబునం బోరుచున్నయప్పు డంగదుండు. 213

ఉ. శూరునిఁ గంపనుం గదిసి శూలము వోనికరంబునన్ విశా
లోరమునందుఁ బొడ్చి కను మోరి! నిశాచర నన్ను నంగదున్
నీరసవానరావళుల నే నొకఁజోఁదు నటంచు నోర్వఁ గాఁ
జేరితి రమ్ము నిన్నిపుడ చేరగఁ బుచ్చెదఁ గాలువీటికిన్. 214

ఆ. నాగఁ గంపనుండు నాగమువలె కన్ను
మనుచు లేచి వాలితనయుఁ బొమ్ము
గదను మొత్తె దానఁ గపివర్యుఁ డొకకొంత
సోలి తెప్పిఱిల్లి వాలు వెఱికి. 215

—♦ కంపనశోణితాక్షాదులయుద్ధము ♦—

క. కంపనునినెత్తిఁ బగులఁగఁ
గంపించుచు నొక్కకొండఁ గైకొని వేసెన్
గంపనుఁడుఁ దాన నిలఁపైఁ
బెంపుగ నార్చుచునుఁ గూలె బెదరఁ బరిజనుల్. 216

సీ. కంపనుం డీల్గుటఁ గని శోణితాక్షుఁడు
ధీరుఁడై యంగదుదెసకు నడిచెఁ
బ్రళయకాలాగ్నినాఁ బ్రజ్వరిల్లెడువాఁడి
యమ్ముల నంగదు నడల నేసెఁ
గలఁగ కాతఁడు వానితలఁ దన్ని ఖడ్గము
వడి లాగికొని సోఁకుపై నిగిడ్చె
నతఁడు గదం గొని యంగదుపై నేసి
స్యందన మెక్కెఁ బ్రజంఘుతోఁడ

తే. ద్వివిదమైందు లంగదునకు దిట్ట నిలువ
శోణితాక్షుఁడు లప్పు డాశూరవరుల
మువ్వురఁ దాఁకి పోరినపోరు ఘోర
మై భయంకర మయ్యె నయ్యవసరమున. 217

తే. వృక్షచరులు రాక్షసులపై వృక్షచయము
వేయఁగఁ బ్రజంఘుఁ డన్నింటిఁ బాయ నఱకె
నవలఁ గొండల నేయ యూపాక్షుఁ డేచి
యమ్ములం జేసి పడఁ ద్రోచె నచ్చెరువుగ. 218

ఉ. అంతఁ బ్రజంఘుఁ డుగ్ర మగునట్టినరాజి ధరించి క్రిందికిన్
వింతగ దూఁకి యంగదునివీపున వైచెను వైచినంత నా
గాంతకు నట్టిఁ డంగదుఁడు నాతనిచెంత నెసంగ ఖడ్గ మొ
క్కింతటిలోన లాఁగికొని యేత్తెఱఁ జూపుచు మొత్తె నెత్తిపై. 219

క. అంతఁ బ్రజంఘుఁడు పిడికిట
నింతింతనరానియట్లు వృక్షచరునివ
క్షోంతరమందుం బొడువఁగ
నింత నతం డొల్లఁబోయె నెల్లరుఁ దలఁకన్. 220

ఆ. సన్న వడసి వాలికన్నకుమారుండు
వడిఁ బ్రజంఘుదెసకు నడరి తిరిగి
చేతనున్నకత్తి నాతనితలఁ గోసి
వాఁడు నేలఁ గూలెఁ దాఁడివలెను. 221

మ. పినతండ్రిం బ్రహరించిరన్నపగతో వేళంబ యూపాక్షుఁ డా
ర్తిని దేర్దిగి గదాయుధంబుఁ గొని నర్తింపంగఁ గోపంబుపెం
పున వానిన్ ద్వివిదుండు ఱొమ్మ పగులన్ ముష్టిప్రఘాతమ్మునన్
బొనరింపం గని శోణితాక్షుఁడు గదన్ మోదెం గపీంద్రోత్తమున్.

తే. ద్వివిదుఁ డాశోణితాక్షునిదెబ్బ దినియుఁ
జలన మందియు మఱి యేయఁ దలఁచువాఁ

గదను వడి లాగికొనె మైందుఁ డద నెఱింగి
యసుర వక్షము నఱచేత నప్పళించె. 223

వ. ఇట్లు యూపాక్షశోణితాక్షులు మైందద్వివిదులతో ఘోరయుద్ధంబు గావించి రప్పుడు ద్వివిదుండు శోణితాక్షునిం బట్టి బిట్టేసి గిట్టించె మైందుండును యూపాక్షునిబాహుమధ్యంబునం బెట్టి పిండిగావించి నేలం బడవైచె నిట్లు సేనాధిపతు లీల్గ రాక్షససైన్యంబు దైన్యంబు నొంది కుంభునికడకు వడివడిం బాఱె నాకుంభుండును. 224

సీ. పిక్కబెదురు లేక యెక్కటిపూనికి
మర్మభేదము లైనమార్గణమ్ము
లాకర్ణపూర్ణము లగునట్లు గావించి
ద్వివిదునిపై నేసి తివిరి యార్చె
ద్వివిదుఁ డందున నొచ్చి వివశుఁడై ధర వ్రాలెఁ
బర్వతశిఖరంబు పగిది నపుడు
మైందుఁడు పెనుఁగొండ మచ్చరంబునఁ బట్టి
కుంభునినెత్తిపైఁ గూల వైచె

తే. నైన నించుక చలియింపఁ బోవ కసుర
వాడిగలయేనుబాణముల్ వైచి దానిఁ
దుత్తునియలై పడం జేసి యత్తఱి నొక
వజ్రతుల్యాస్త్రమును వానిపై నిగిడ్చె. 225

క. అట్టియెడ మైందుఁ డాయువు
పట్టుఁ గుంభామరారిబాణము తాఁకన్
దిట్టచెడి సోలి నేలకు
నట్టూర్పుచుఁ గూలెఁ దనదునెయ్యులు తలఁకన్. 226

ఉత్సాహము. అంగదుండు మేనమామ లట్లుపడుట కెంతయే
నంగలార్చి ధైర్యసాహసాంకితుండు గావునన్
సంగరాంగణంబునందు సారు మీఱఁ గుంభునిన్
భంగపాటు నొందఁ జేయువాఁడ నై యెదుర్చుడున్. 227

ఉ. కుంభుఁడు వాడికోలలను గొన్నిటి నెన్నుదుటం బడంగ సం
రంభముఁ జూపుచున్ విసరె రంహముగా నవి వచ్చి తాఁకినన్
స్తంభము నాఁ జలింప కొకసాలము గైకొని యంగదుండు వి
స్రంభము గల్గుఁ గాత మని చయ్యన వైచెను గుంభుపైఁ బడన్.

తే. కుంభు డంగదుఁ డేసినకుంభినీరు
హమ్ము నడుమున ఖండించి యతనినుదుట
వేఁడిపిడుగుల కెనవచ్చువిశిఖములను
నెవ్వరా నాటె నాటున నెత్తు గాఱ. 229

ఉ. కన్నుల రక్తధార లవి కాలువ గట్టుచుఁ గ్రమ్మకొఁగఁ జే
సన్నల నొక్క వృక్షమును సంధిలఁ జేయుచు వాలిపుత్త్రుఁ డా
సన్ననిఁ గుంభకర్ణసుతు సాల్వడ నేయుఁడు నాతఁ డప్డు వే
రెన్నికగన్నతూపుల నొకింతటిలోఁ దెగనేసె నీసునన్. 230

—♦ అంగదుఁడు కుంభునిచే మూర్ఛితుండగుట ♦—

ఆ. అంత వివశుఁ డగుచు నంగదుఁ డనువేది
చేష్ట దక్కియుండఁ గష్టపాటు
గదుర రాఘవునకుఁ గలరూప దెంతయుఁ
దెలియఁ జెప్పి రప్డు తెల్లముగను. 231

వ. రామచంద్రుండును జాంబవదాదివానరవీరుల నెల్లం బిలిచి మీరు పోయి మనయంగదునకుఁ దోడ్పాటుఁ గావింపుం డనిన వా రందఱు రామునాజ్ఞ శిరసావహించి వృక్షపాషాణపాణులై కుంభునిమీఁది కింబోనెంచి యంగదునికటంబునకుం జని రప్పుడు జాంబవత్సుషేణవేగదర్శులు మువ్వురు నాగ్రహభరితులై చనిరి కుంభుండును.

మ. తనపై వచ్చెడు మువ్వురం గని కడుం దర్పంబునన్ గుంభక
ర్ణునిపుత్త్రుండు శరంబులన్ గురియుచున్ రూక్షప్రకారంబుఁ జూ
పిన వా రాశరపాతఘాతములచేఁ బెం పేది యుండంగఁ గ
న్గొని సుగ్రీవుఁడు వాలిపుత్త్రునకు ము న్మన్నై మహాద్రిక్షుఁడై. 233

క. బలవంతుఁడు సుగ్రీవుఁడు
బలువగువృక్షములు ఱాలు పర్వతములు నా
పలలాశిమీఁద నేసెఁ
జలము బలం బేర్పడంగ శౌర్యధనుండై. 234

తే. వాఁడిబాణములను వాఁడు వానినెల్ల
నడుమ శతధా సహస్రధా నఱికి వైచె
సత్త్వసంపన్నుఁ డగుకపిసత్తముండు
సరకుగొన కసుర శరంబు లరయ లోన. 235

వ. వానిచేతివిల్లు లాగి ఫెళ్లు మనన్ విఱిచి రెండు గావించి మహాగ్రహ
గ్రహావిష్టుండై యి ట్లనియె. 236

సీ. ఓరి సురారి ని న్నేరునుం బోలరు
తండ్రికిఁ జాలినతనయుఁ డీవు
విలుకాఁడ వీవు నీ కెల బలభేది యైనను
గెలువఁ జాలఁడు బాహుబలము గలదు
నీపరాక్రమ మెల్ల నేఁ బరికించెదఁ
జూపుము నాచెంత శూరుఁడ వయి
నీపెదతండ్రియు నీతండ్రియును దేవ
తాసాధ్యు లని పేర్మి నందినారు

తే. వారిపుత్త్రుఁడ వీవు నవార్యశౌర్య
ధుర్యుఁ డవు మేఘనాథుఁడు ధైర్యగరిమ
నిన్నుఁ బోలినవాఁ డని యెన్నవచ్చు
నో నికుంభ సహోదర యోరి కుంభ. 237

. నీవిలువిద్దె నేరుపు గణింపగ వచ్చెఁ గపిప్రవీరులన్
వేవురఁ గూల్చినాఁడ వొకవ్రేల్మిడి నెల్లరు చూచి మెత్తు రి
ప్డీవు ననున్ జయింపు మిదె యే నరుదెంచితి నింత సేపిటన్
జేవ మెయిన్ బొనర్చి తనిఁ జేరును బో నల పింత యుండు మా. 238

క. అలయుట నోడె నతం డను
పలుకేటికి నాకు రాగఁ బలలాశి ననున్

దలపడు మలయిఁక వో నా
బల మెట్టిదో నీకుఁ దెలియ వచ్చుం జుమ్మీ. 239

వ. అవమానకరంబు లగుసుగ్రీవునిపలుకుల కలుక వొడమఁ గుం
భుండు బగ్గున మండి. 240

—♦ కుంభనికుంభుల ఘోరయుద్ధము ♦—

సీ. రా ర మ్మనుచు వానరప్రవరునిచేయిఁ
బట్టిన సుగ్రీవుఁ డట్టె పట్టె
మదగజంబులమాడ్కి మాటికి మాటికిఁ
బట్టుచు విడుచుచుఁ బట్టు విడక
బడలికల్ జెందుచుఁ బడి నూర్చుకొంచును
బేర్చుకొంచును వడిఁ జేర్చుకొనుచుఁ
బట్టుచు నెట్టుచుఁ బాయుచు డాయుచు
గుప్పిళ్ళ నొండొరు గ్రుద్దుకొనుచుఁ
తే. గఱచి పఱచుచు నఱచుచుఁ గట్టుకొనుచుఁ
గొట్టుకొనుచుఁ జపేటముల్ పెట్టికొనుచు
మెట్టికొనుచును విడి పోనియట్టు పట్టి
పెనఁగి రాతఁడు నాతఁడుఁ గినుక గదుర. 241

తే. అపుడు కుంభుని సుగ్రీవుఁ డట్టె పట్టి
విసరివైచెను సాగరవిషమునందు
నాతఁ డడుగంటి నీటితో నాకసమున
కెగసి సుగ్రీవుతలపయిఁ దగుల దుమికి. 242

క. పిడికిటితోఁ గీశేశుని
వడిఁ బొడిచెను వక్షమందు వఱ్ఱయి రక్తం
బడుగంటఁ గాఱె నతఁ డ
ప్పుడు పొడిచెన్ వానిశిరము ముష్టితలమునన్. 243

ఉ. పాటున నొచ్చి హా చ్చుడిగి భూమిపయిన్ బడి వెచ్చనూర్చుచున్
నోటను ముక్కులం జెవుల నూతులనుండి జలంబు చాడ్పునన్

మేటిగ నెత్తు రూఱ వడి మే న్వడకంగ నొకింతలోపలన్
బాటవ మేది కాలగతి పాలయి పోయె సురారి పౌత్రుఁడై. 244

ఆ. అన్న పాటు జూచి యపుడు నికుంభుఁడు
గదనుఁ బూని కోపకలితుఁ డగుచుఁ
గహకహారభటులు గావించుచు నోరు
తెఱచుకొనుచు జమునికరణి వచ్చె. 245

క. వానిం గనుగొని వానరు
లానిక యింతయును లేనియట్టిర యగుచున్
నానాదిశలన్ బట్టిరి
తా నొక్కఁడు వాయుసుతుఁడు తఱలక నిలిచెన్. 246

మ. గుదియలఁ బోలుబాహువులఁ గుంభునితమ్ముఁడు ముమ్మరంబుగాఁ
గుదిరినశౌర్యసంపదల ఘూర్ణిలుచున్ బవమానసూనునిన్
గుదియను బూని వక్షమునఁ గొట్టెను గొట్టిన నూఱువ్రయ్యలై
గుదియ విశీర్ణమై పడియె క్షోణితలంబున మండుచున్ గడున్. 247

తే. గుదియ వ్రేటున హనుమంతుఁ డదరినట్టిఁ
డగుచు వడియును విక్రమ మడరుకొనఁగఁ
గినుకఁ బిడికిట నానికుంభుని యురంబు
పగులఁగా నేసెఁ జల్లని పాఱె నెత్రు. 248

చ. ఘనుఁడు నికుంభుఁ డించుక ప్రకంపము నొందియు డింద కంతలోఁ
గినుక వహించి వాయుసుతుఁ గేల్దుగ గట్టిగఁ బట్టుకొంచుఁ బో
గని దనుజుల్ ముదంపడుచు గంతులు వేయుచు నానికుంభునిన్
వినుతి యొనర్చుచున్ దెసలు బీటలు వాఱఁగ నార్చుచున్నచోన్.

ఆ. హనుమ తెప్పిఱిల్లి దనుజుని వడి వజ్ర
పాతతుల్యమైనబాహుముష్టిఁ
బట్టి బిట్టు ఘొడిచ్చి పట్టువిడం బాసి
ఘుళుకు దుమ్మికి ఘానిఁ గలిఘుఁ బడుచు, 250

తే. క్రిందఁ బడఁ ద్రోసి కాలితో డొంద రాసి
యెగిరి మీఁదికి బొమ్మపైఁ బగుల వ్రాలి
చేతితోఁ బట్టి మెడ ద్రిప్పి శీర్ష మవియ
నేసి యమపురి కతిథిగాఁ జేసె వాని. 251

—♦ రావణుఁడు మకరాక్షుని యుద్ధమునకుఁ బుచ్చుట ♦—

ఉ. కుంభనికుంభు లిగ్గతినిఁ గూలినవార్త దశాననుండు సం
రంభముతోడ వచ్చినసురద్విషు లాడగ వించు నగ్ని నా
సంభృతకోపుఁడై వెలిఁగి చక్కటికిన్ ఖరపుత్రు శౌర్యసం
స్తంభితశాత్రవుం బిలిచి తత్పరతన్ వచియించె నిగ్గతిన్. 252

ఉ. ఓమకరాక్ష! నీబల మహో యని మెత్తురు లోకు లెల్ల నా
రాముని లక్ష్మణుం గపివరధ్వజినిన్ దునుమాడి రమ్ము నీ
నామము మ్రోయు నెల్లెడల నా మకరాక్షుఁడు సేనతోడ సం
గ్రామము సేయ నేగె రణరంగముఁ జేర రథస్థుఁ డై వడిన్. 253

సీ. ఉక్కుతునకలఁ బోలురక్కసిమూకలు
మకరాక్షుతో రణమహికి నేగి
కపిసైన్యములనెల్ల కసిమసంగఁగఁ జేసె
దివ్యాయుధంబుల తేజు చూపి
పులిఁ గన్న లేడులపోల్కి వానరవీరు
లడలు గుడ్చుచుఁ బాఱి రట్టు నిట్టు
రాముఁ డాపఱచువా రలఁ జూచి చే వీచి
నిలువరించుచు శత్రునిచయముపయి

తే. శరపరంపర గుఱియుచు సమరమునకు
మొనసి యుండినఁ గని ఖరపుత్రుఁ డతనిఁ
బలికె నాతండ్రిఁ జంపి తప్పట్ల నేను
లేకపోయితిఁ గద కానిలే! యిపు డిడె. 254

మత్త. వచ్చితిన్ మకరాక్షనాముఁడ వాసి గల్గినవాఁడ నా
కెచ్చుచున్నది నిన్నుఁ జూచినయంతలోపలఁ గోప మే

నిచ్చఁ జేసితి నిన్ను మార్కొన నేర్చునాకట సింహ మే
మచ్చున న్నడయాడు నట్లగు మామకం బగుచిత్తముల్. 255

క. నాదునదృష్టము పండుట
కాదే నీదర్శనంబు గలిగె న్నాకున్
నీదైననెత్తుఁ ద్రావుచు
నాదీవ్యచ్ఛరము గట్టునన్ ద్రేచు ననిన్. 256

వ. ఇప్పు డీయుద్ధంబున మన యిద్దఱసామర్థ్యంబును జగం బెఱింగెడుం
గావునఁ బోరుకొందఱ మీవు నాతో నస్త్రయుద్ధంబు గావింతువో
గదాయుద్ధం బొనర్తువో బాహుయుద్ధంబు సేయుదువో చెప్పు
మట్లు నేనును సన్నద్ధుండ నయ్యెద ననిన రామచంద్రుం డు మంద
హాసంబు సేయుచు మకరాక్షుం గని యి ట్లనియె. 257

శా. ఓరీ రాక్షస! మాటలేమిటికి నేదో యుద్ధముం జేయు మే
నారాత్రించరులన్ ఖరాదులను నొక్కం డైనలి ప్తన్ యమ
ద్వారంబున్ గన జేసినాఁడఁ బదునా లైనట్టివే ల్వారు నీ
వో రవ్వంతకు రావు నోర్దెఱవ కేవో పల్కరా కిం కిటన్. 258

క. నీకాయ మిపుడు గ్రద్దలు
కాకులు నక్కలునుఁ బీఁకి క్రవ్యము మెసవున్
బోకుము నాశరములరుచి
నీకుం జూపెదను జక్క నిలువుము పెనఁగన్. 259

మహాస్ర. అనుచుండన్ రాక్షసేంద్రుం డలుక నతనిపై
నస్త్రశస్త్రంబు లెన్నేఁ
దనువెల్లన్ నిండఁ జేసెన్ దశరథసుతుఁ డా
దానవాస్త్రంబు లెల్లన్
దునియల్ గావించి పైపై దొనల వెలుఁగుచున్
దోచునారాచ పంక్తుల్
కనుఱెప్ప ల్విప్పుమాత్రన్ గనలి విడిచెఁ ద
త్కాయ మూఁగాడి పోవన్ 260

క. ఒండొరులు డాక నేసిన
కాండంబులు కొండపోడుగు గాఁ బడె నవనిఁ
మెండుకొని వా రొనర్చిన
భండనమును జూడ నింగిఁ బలసిరి వేల్పుల్. 261

సీ. అంత రాఘవుఁ డెన్మిదమ్ముల మకరాక్షు
వింటెని ఖండించి వెంట వెంట
సారథితలఁ ద్రుంచి సాయకాష్టకమునఁ
దేరి గుఱ్ఱంబులఁ ద్రెళ్ళ నేసి
తెగితిరా మకరాక్ష! తెలిలకుండు మనంగ
వాఁ డరదము లేనివాఁడ యగుచుఁ
బ్రళయాగ్ని వలె నేల నిలిచి శూలముఁ ద్రిప్పి
రవ మెసంగఁగ నేసె రాముమీఁదఁ
తే. దాని మూఁడమ్ములం ద్రుంచి దానవుండు
తనదుమీఁదికి రాఁ జూచి దానవారి
వింట నాగ్నేయ మస్త్రము వేగఁ గూర్చి
విడిచె మకరాక్షుపైఁ బడ కడిమి మెఱసి. 262

వ. దానంచేసి మకరాక్షుండు వక్షంబు పగిలి నేలఁ గూలి కాలధర్మంబు నొందె నందు బ్రమందగా నున్నరక్షోబృదంబు లంకాపురమార్గంబు పట్టె నట్టియెడ రావణుండు మకరాక్షుండు మడియుట విని మండి పడుచు ననంతరకర్తవ్యకార్యపరతంత్రుండై యుండె నని చెప్పిన విని నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును. 263

— ఆశ్వాసాంతము —

శా. గోసేవం బొనరించు టాతనికినుగ్గుంబాలతో నబ్బెసం
బై సొంపొందినవిద్దెయై తనరు నట్లానాఁడు మాతామహో
ల్లాసస్థానమునందుఁ గా కిపుడు హేలాపత్తనంబందు నా
గోసేవం బొనరించుచుం బ్రబలు నాక్షోణీసురుం డాఢ్యుఁడై. 264

ఇది ద్వితీయాశ్వాసము

శ్రీరస్తు.

# శ్రీకృష్ణరామాయణము

——:o:——

## యుద్ధకాండము

### తృతీయాశ్వాసము

—



లకుఁదానక మగున
వ్యేలూరుపురంబునందు నెంతయుఁ బేర్మిం
బోలింప నగుచు నర్థులఁ
బాలించెడునీదరాన్వవాయుఁ డెసంగున్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె నట్లు మకరాక్షుండు మడిసిన పదంపడి రావణుండు వీరవిహారప్రమత్తుం డగు నింద్రజిత్తుం బిలువ నంచి యి ట్లనియె. 2

—♦ రావణుం డింద్రజిత్తును యుద్ధమునకు బుచ్చుట ♦—

తే. తండ్రి! నీ విందు నోర్చినధన్వి వరయ
నీవుగా కొక్కఁ డిప్పు డాదేవవిభుల
రామలక్ష్మణులను గెల్వఁ బ్రజ్ఞఁ గలిగి
యుండఁ డని నే నెఱింగితి నోయి బిడ్డ! 3

తరు. నీ వేగి వారల మేపు మాపంగ
నేఁ గోరుచుంటి నోయింద్రజిత్పుత్ర!
తావిని యాదలం దండ్రియానతిని
ధరియించి యింద్రజి తనయింటి కేగి

పావకు నర్చించి బ్రహ్మాస్త్రమంత్ర
పరిచితిం గలఁ డయి భండనస్థలికిఁ
బోవు చంతర్ధానమును బొంది వ్యోమ
మునసుండి నృపతుల ముంచె బాణముల. 4

తే. రాజపుత్రులు దివ్యాస్త్రరాజి నేసి
రవి దివిన్ మబ్బుమాటున నడఁగి యున్న
రావణాత్మజునిం దాకఁ బోవ లేని
దయ్యెఁ గంటికిఁ గానరానట్టి డగుట. 5

మహాస్ర. మొగి నిట్లారామబాణంబులు చనె దివిపైఁ
బొంచియున్నట్టివానిన్
దగులం బో లేక వమ్మై ధరపయిఁ బడుటన్
దైత్యవర్యుండు మాయన్
దగి వీఁకన్ వేయుదివ్యాస్త్రము లశనిసమ
త్వంబుఁ గైకొంచుఁ బెంపె
చ్చఁగ వేవే వచ్చి రామున్ సకలకపుల నే
చంగ నై తాఁకుచుండెన్. 6

ఆ. శబ్దభేదు లయినసాయకంబులు రామ
లక్ష్మణులు సురారిలక్ష్యముగను
జేసి యేసి రవియుఁ జెచ్చెరఁ జని వానిఁ
జెండిపసిఁడియె రక్తసిక్తము లయి. 7

—♦ ఇంద్రజిత్తు మేఘములచాటున నుండి యుద్ధము చేయుట ♦—

ఉ. చప్పుడు గూడఁ గానియటు స్యందనము న్నడిపించుకొంచు న
య్యుప్పరవీథి నొక్కకడ నుండక నల్గడ సంచరించుచున్
ము ప్పగుడెంచునట్లు శరముల్ నిగిడించుచు రామ లక్ష్మణున్
గప్పుతడంగఁ జేసె నధికం బయి మేన స్రవింప నెత్తురుల్. 8

తే. వానరులు మారిమాటికి వంద వంద
లుగను వేలువేలుఁ గఁ గూలి రగణితముగ

నిమిషనిమిషంబునకు సేన క్రమము దప్పి
క్షైణ్యమును బొంద సాఁగె నాసమయమందు. 9

తరళము. అలిఁగి లక్ష్మణుఁ డన్నతో నను నార్య యిట్టు లుపేక్షమై
మెలఁగుచుంటిమ యేని రావణి మీఁదుమిక్కిలి యై కడున్
తలఁకు గూర్చును గాన సైఁచుట త ప్పటంచు వచింతు నేఁ
దలఁచుచుంటిని బ్రాహ్మ్య మస్త్రము దైత్యుపైఁ బడ నేయఁగన్. 10

చ. అనవుడు రాముఁ డిట్లనియె నక్కట యొక్కనికై బహుప్రజా
దునుముట దోష మూలమునఁ దోపనివానిని జేయి మోడ్చువా
నిని శరణన్నవాని నొరునిం దలకొంచు బెనంగువానినిన్
గనుకనిఁ బాఱువాని నొకకాలమునాఁటికిఁ జంప రుత్తముల్. 11

వ. కావునసర్వరాక్షససంహారకం బైనబ్రహ్మాస్త్రంబు ప్రయోగింప
నొప్ప దిప్పు డాశీవిషోపమంబు లగునాదివ్యాస్త్రముల వానియే
పడంచెద నాకర్ణింపుము. 12

క. పాతాళంబున దూరిన
భూతంబులలోనఁ జేరి పొంచిన నింగిన్
బాతరలాడుచు నుండిన
ఘాతుకు సవ్వానిఁ గూల్పఁ గల వస్త్రంబుల్. 13

వ. అని రామలక్ష్మణులు నిశ్చయించుకొని నంత వారినిశ్చయంబు
గుఱుతించి కుంభకర్ణాదులవధంబుం దలంచి పశ్చిమద్వార పరిస
రంబున నికుంభిలాలయముకడ నింద్రజిత్తు హోమంబు సేయనెంచి
హోమకార్యంబు నిర్విఘ్నపరిసమాప్తి నందుట కుపాయంబు వన్ని
రాజపుత్రు లొండెఱుంగక పరవశులై యుండుటకై మాయాసీత
నొక్కదానిని సృష్టించి దానిఁ దనరథంబుపైఁ బెట్టుకొని రణరం
గంబునకు వచ్చి వానరసైన్యంబుపై శరవర్షంబు గురియుటయును. 14

—♦ ఇంద్రజిత్తు మాయాసీతను సృజించి తెచ్చుట ♦—

వారలు వృక్షము ల్కటియుఁ బర్వతముల్ గొని యింద్రజిత్తుపైఁ
జేరఁగ నేయుచున్ రణము సేయుచు నుండఁగ నాంజనేయుఁడున్

భూరిశిలన్ గరంబునను బూని వరూథిని ముందు నిల్చి దో
స్సారమెసంగఁ జేయుచును సైనికులన్ నడిపించునట్టిఁడై. 15

సీ. డబ్బాట హనుమంతుఁ డబ్బాహుబలశాలి
యగు నింద్రజిత్తుని స్యందనమున
మాసినయొకచీర మైఁ దాల్చి వాఁడిన
మోమున దైన్యము పొదలఁ గంట
నశ్రువుల్ వెడలంగ హా!రామ! యనుచుండు
చాన నొక్కతెఁ జూచి జానకి యని
వెతజెంది కన్నీరు విడుచుచు నేమియుఁ
దోపనివాఁ డయిఁ దొట్రుపడియె

తే. అపుడు రావణపుత్రుఁ డయ్యతివ కేశ
పాశమును బట్టి తల దన్ని పాదమునను
దిగిచె రామా! యటంచును దేవురించు
శాంబరీసీతఁ గని హన్మ సంభ్రమించి. 16

శా. ఓరీ! రాక్షసవంశపాంసనుఁడ లో యుక్తం బయుక్తంబునుం
బారన్ జూడ వయోనిజన్ గరిత రామస్వామికిం బత్ని నీ
వీ రీతిం బొనరించుచుంటి విది యెంతే పాపకార్యంబు ని
న్నేరున్ మెచ్చరు నీ యటండ్రు నిరయంబే నీకు వ్రాకో నగున్.

మ. అనుచున్నంత నరాజి దూసి యమరేంద్రారాతి తచ్ఛీర్షమున్
దునుగం జేసి కరంబునందుఁ గొని సంతోషంబునన్ వానరేం
ద్రునిపై దృష్టి నిగిడ్చి యోరి యిది యేదో నీవు పోలించితే
జనకక్ష్మావరకన్యకామణియె నేఁ జా నేసితిన్ జూచితే. 18

—♦ ఇంద్రజిత్తు మాయాసీతం దన్ని చంపుట ♦—

క. దీనికతంబునఁ గాదే
దానవులకుఁ జెడ్డదినము దాపర మయ్యెన్
దానన్ దెఁగ నేసితి నిటు
మానసశల్యంబు గడపు మాదిరిగాఁగన్. 19

తే. అవల రాముని లక్ష్మణు నంగదునిని
ఖలు విభీషణు సుగ్రీవు గండడంచి
నాదుతండ్రిఋణంబు నే నీదినమునఁ
దీర్చినట్టిఁ డైతి నటంచుఁ దెలియఁ బలికి. 20

వ. చేత నున్నమాయాసీతశీర్షంబు శరీరంబుపడినచోటన పడవైచి యేచి సింహనాదంబుఁ జేసి చిత్తజల్లుగానమ్ముల మొత్తమ్ముఁ జల్లుచు వానరులనెల్ల నొల్లబోఁ జేసి రావణాత్మజుండు నికుంభిలాదేవాలయంబునకుం జని విధివిహితంబుగ నగ్నిహోత్రంబునందు రక్తమాంసమద్యాజ్యంబులు వేల్చుచుండె నంత నిక్కడ హనుమంతుండు చింతాసాగరనిమగ్నమానమానసుండై నిట్టూర్పు నిగిడించుచుఁ గన్నీరు మున్నీరై గాఱుచుండ రాఘవునిచెంతకుం జనిన నతం డతనిం గని గడగడవడంకుచు. 21

క. మిను విరిగి మీఁదఁ బడినను
వనటం బడనట్టినీవు వనరుచు ని ట్లీ
యనువున దీనముఖుఁడ వయి
కనుపట్టెద మేమికతము గలిగెం జెపుమా. 22

చ. అనుటయు వెక్కి-ఱ్ఱమింగుచును హన్మరఘూద్వహుఁ గాంచి యింద్రజి
త్తనెడుకిరాతుఁ డిప్డు రథమందు ధరాత్మజఁ దెచ్చి యెల్లరున్
గనుఁగొనుచుండ ఖడ్గమునఁ గంధరమున్ వడిఁ ద్రెవ్వనేసె నా
జనని మృతించె నేమని ప్రశంస యొనర్చెద నక్కటక్కటా. 23

—♦ విభీషణుఁడు రామునకు మాయ నెఱింగించుట ♦—

వ. అనిన రాఘవుండు మొదలు నఱికినభూరుహంబు వలె గుభిల్లున భూమి వ్రాలిప్రాణంబులు వోయినవానిచందంబున మూర్ఛిల్లె నంత లక్ష్మణుండు వచ్చి రామునిం గట్టికొని వాపోయె సుగ్రీవాంగద జాంబవదాదులు డిల్లపడి జీవచ్ఛవంబులు నా నొప్పి రప్పుడు విభీషణుండు వచ్చి వాయునందనునివలన సర్వవృత్తాంతంబును విని శైత్యోపచారంబుల సీతాపతి నేదఁ దేర్చి సుఖాసీనుం గావించి యెల్లరు విన ని ట్లనియె. 24

మ. కరవాలంబున నింద్రజిత్తు జనకక్ష్మాజానికన్యామణిన్
గర మల్కం దెగఁగోసె నన్ననుడి నల్కం దేని సత్యార్థముం
దొరయం బోదది మాయసీత పలికిన్ దుఃఖంబుగా నెల్లవా
నరులున్ జూడఁగఁ గోసె రావణి యనిన్ స్వార్థంబు సంధింపనై.

తే. ఇంద్రజిత్తు నికుంభిల నిద్ధహోమ
మును బొనర్పఁగ నెంచినమనముతోడ
దాని కింతయు విఘ్నంబు దగులకుండ
మనల మోహపెట్టఁగ నిట్టిపని పొనర్చె. 26

వ. మన మీమోహంబున మునింగి యుండ నికుంభిలాహోమం బంత
రాయంబు లేక నివర్తిల్లు ననియు దాన నజయ్యుండై శత్రుసంహా
రంబు గావింతు ననియు వానిసంకల్ప మిపుడు సీతాదేవి సురక్షి
తయై యున్న దిదిగో నాతన్వి తిరస్కరిణీప్రభావంబున నెవరి
కంటం బడకుండ వచ్చి చెప్పి పోయిన దచ్చట నికుంభిలాహో
మంబు కొనసాగుచున్నయది హోమపరిసమాప్తి కాకుండఁ జేయ
వలయుఁ గావున హనుమజ్జాంబవదంగదసుగ్రీవాదులతో లక్ష్మణుం
బుచ్చు మతండు సర్వసమర్థుం డనిన రామభద్రుండు లక్ష్మణుం
గాంచి. 27

మ. అనుజన్మా! వినుదే విభీషణునిసద్వ్యాహార మియ్యంతయున్
దనుజుం డెంతకుఁ జాలఁ డెంతపనికిం దాఁ బూనెఁ గానిమ్ము నీ
వును నీవానరులున్ విభీషణునితోఁ బోనై సురారిన్ వధిం
పను గ మ్మీవు మెలంకువన్ మెలఁగు మాపట్లన్ మహాస్త్రజ్ఞతన్.

—♦ రాముఁడు లక్ష్మణుని నికుంభిల కడకుం బుచ్చుట ♦—

తే. అనిన సంతోషితస్వాంతుఁ డగుచు లక్ష్మ
ణుండు సన్నద్ధుఁడై లేచె గండుమిగిలి
యెల్లసేనలు వెంట రా నేగె నావి
భీషణునిఁ గూడి శౌర్యవిభూషితుఁ డయి. 29

వ. హనుమదాదులును సౌమిత్రి ననుసరించి రంత వా రందఱును
నికుంభిలాలయంబుం దరియ నరిగి రప్పుడు. 30

ఉ. దానికిఁ జుట్టునున్ మిగుల దట్టముగా నివసించియున్నర
క్షోనిచయంబు గంటఁ బడ శూరవరేణ్యుఁడు లక్ష్మణుండు లో
నారయుచో విభీషణుఁ డనంతబలం బది దీనిఁ గూల్చినన్
ధీరునియజ్ఞవేది యది దృష్టిపథంబునఁ జేర వచ్చెడిన్. 31

సీ. నీవు దివ్యాస్త్రముల్ నిగిడింపఁ గా నగు
వానరవీరులు వాసిమీఱ
వృక్షపర్వతముల రాక్షససైన్యము
సర్వశూన్యమ్ముగా సలుప వలయు
నావుడు నాతఁడు నానావిధాస్త్రముల్
పరఁగించి నొంచె వానరులు వరులు
చెలరేఁగి పర్వతాదులతోడ మూఁకలఁ
జెల్లచెదరుగాఁగ జేసి రపుడు

తే. రాక్షసబలంబు వానరప్రవరులపయి
ముద్గ రాసి గదా కుంత ముసల ముఖ్య
ములు మహాయుధములు నేసి పోరి రుభయ
బలము లెంతయు పంతము గలిగికొనుచు. 32

తరు. తనసేన లారీతిఁ దరలి పోవంగ
దశముఖతనయుఁ డధ్వరము సంపూర్తిఁ
గొనకుండ విఘ్నముఁ గూడినయట్లు
క్రోఁతిమూఁకలు వచ్చి గురుతరభీతి
పొనరింప నెట్లును పొడకట్టమి మన
మున నెంతయుం జింత ప్రోగు పడంగఁ
దనయజ్ఞపూర్తికై తగినయత్నంబుఁ
దా సల్పుచుండె నాతరుణంబునందు. 33

తే. పిడుగులం బోలువాలమ్ము లడరి రాము
ననుఁజుఁ డాతనిపై నేయ నలుక గదుర
చేతిలో నున్నజన్నంపుచేఁత మాని
వడిగ రథమెక్కి యాయుధావళి ధరించి, 34

వ. రాక్షసావళిం గూడి కయ్యంబునకుం గట్టాయితంబై శత్రుసమూహంబుపైఁ జిత్తజల్లుగ శరపరంపరలం బరఁగించె నప్పు డాంజనేయుండు. 35

——♦ వానరు లింద్రజిత్తు నికుంభిలాయాగముం జెఱచుట ♦——

మ. పెనువృక్షం బొక డెత్తి రాక్షసులపై వే వేసి తూలించుచున్
దనుజుల్ పెక్కుశరంబు లాహనుమమే న్దాకం బ్రయోగించియున్
ఘనశక్త్యాయుధముల్ నిగిడ్చియును ఖడ్గంబుల్ వడిన్ వైచియున్
దనునొప్పించిన వాయునందనుఁడు క్రోధస్వాంతుఁడై వింతగన్.

తే. కాళులం ద్రొక్కి చేతులఁ గట్టి నులిమి
పిడికిటం బొడ్చి యఱచేతఁ బిడుగు లట్లు
చఱచి రాక్షససైన్యము సమయఁ జేసెఁ
బ్రళయకాలాగ్నిహోతృని పగిది హనుమ. 37

వ. అప్పు డింద్రజిత్తు క్రోధసంరక్తలోచనుండై. 38

క. సారథిదిక్కు మొగంబై
ఘోరక్రియ గాలికొడుకు క్రోధస్ఫూర్తిన్
వీరుల మనసైనికులన్
బారం బొందించుచుండె బరికించితివే. 39

క. వీని నుపేక్షించిన యే
వానరబల మతిశయించి వడి మనబలమున్
మానటి పోవం జేయును
గాన నరథ మతనిదిక్కుగాఁ బో నిపయ్మా. 40

వ. అనిన నతం డట్ల కావించుటయు నింద్రజిత్తు గదాసిపరశ్వథతోమరభిందివాలకరవాలాదులతో హనుమంతుం బ్రహరించిన నతండు వానిన కొని వాని నో నేసె నాసమయంబున విభీషణుండు సౌమిత్రిం జూచి చూపుచు ని ట్లనియె. 41

ఉ. ఇంద్రుని దూలపుచ్చి దనుజేంద్రుల కందఱకాదిమూర్తియై
సాంద్రతపఃప్రభావమున సర్వవరాయుధముల్ గణించి ని

స్తంద్రయశోవిశేషమున సర్వజగంబులఁ బేరుగొన్న యీ
యింద్రజి నీవు గాక మఱి యెవ్వఁడు గెల్వఁగఁ జాలియుండెడిన్. 42

క. ఆశీవిషోపమంబులు
నీశరములు విడిచి వాని నీల్గింపుము కీ
శేశుని హనుమం బట్టెడు
నాశం జనుదెంచుచుండె నఱు మవ్వానిన్. 43

వ. లనిన లక్ష్మణుండు డాఁ గాల మని ధనుష్టంకారంబు చేసి సింహ
నాదంబు గావించె విభీషణుండు నతని వెంటం బెట్టుకొని కొంతచని
నికుంభిలాసమీపంబున హోమమొనర్చుచోటం గలమఱ్ఱిచెట్టుం
జూపి యి ట్లనియె. 44

—♦ లక్ష్మణుఁ డింద్రజిత్తుతో ఘోరయుద్ధము చేయుట ♦—

మ. కను మోలక్ష్మణ రావణాత్మజుఁడు యాగం బైనపై నావటం
బున భూతంబులకున్ మహాబలి యిడం బోవున్ బయిన్ వేరికిన్
గనరా కాలమునన్ మహామహుల నైనం దూలిపోఁ జేయుఁ గా
వున వృక్షంబును జేరకున్నమును పే పోలున్ ఖలున్ ద్రుంపఁగన్.

ద్వి. అన నారి సారించు చాలక్ష్మణుండు
కనుఁగొనుచుండె నక్కాలంబునందు
ధనువు చేఁ బట్టి కన్దమ్ముల నగ్ని
కనుపట్ట నింద్రజి గానంగ వచ్చె. 46

క. కని లక్ష్మణుండు వానిన్
కనుఁగొలుకుల నగ్ని రాలఁ గ్రవ్యాద! యిదే
చనుఁదెంచి నాఁడ లక్ష్మణుఁ
డను ర మ్మిటు పో కెటుల్ మడంచెద నిన్నున్. 47

వ. అని లక్ష్మణుండు పిలుచుచుండ నటు కన్నువెట్ట కింద్రజిత్తు వెనుక
నున్నవిభీషణుం గాంచి యి ట్లనియె. 48

సీ. ఓ విభీషణ నీవు నావాఁడవై యుండి
పెరవాఁడ వైతి విత్తరుణమందు

నాతండ్రితోఁ బుట్టువై తండ్రివై నాకు
విద్రోహ మొనరింప వెడలి తకట
సఖ్యము బంధుత జాత్యభిమానము
భ్రాతృవాత్సల్యము పదటఁ గలిపి
పగవారితోఁ బొత్తు పాటించి బంధువి
ద్వేషముఁ గలిగితి దోషి వైతి

తే. ధర్మపరుఁడవు గావు స్వధర్మమందు
నిధనమును శ్రేయ మండ్రిది నీ వెఱుఁగవు
చన్నుఁ బాల్ద్రావి తనతల్లిచన్ను గ్రుద్ది
నట్లు చేసితి ననుఁ జంప నైతి విట్లు. 49

వ. అని గర్హించి పలికిన విని విభీషణుం డింద్రజిత్తున కిట్లనియె. 50

సీ. బాలభావుఁడవు నాభావ మెఱుఁగ నట్లు
పలుకుచుం టేమనవలయు నిన్నుఁ
దగవు చెప్పిన నన్నుఁ దమ్మునిఁ దా నిట్లు
వెడలించు టది ధర్మవిధమ యందె
వెన్నంటుపామును విదళించుకొని నట్లు
ధర్మహీనుని విడఁ దగును గాదె
పరధనపరదారహరణము పురుషుని
నశియింపఁ జేసెడు నాఁగ వినవె

తే. ఖలుని విడుచుట తప్పనఁ గలరు వేరు
తండ్రిఁ బోలితి వన్నింటఁ దగును నీకు
నెట్టు లాడంగ నైన నిం కీవు నీదు
తండ్రియును నుండఁ బో వని తలఁతు నేను. 51

ఆ. త్రాఁచునోటిలోన దగిలినకప్ప య
ట్లయితి నన్ను నేమి యనిన నను మ
శిరసుమీఁద మిత్తి చేసినప్పై నాడు
చున్న దిపుడు నీకు నెన్ని చూడ. 52

ఆ. మఱ్ఱిచెట్టుకడకు మఱి యేగఁ జాలవు
లక్ష్మణుం డితండె లావు మెఱసి
యున్నవాఁడు పోర నుండుము వీనితో
యమునివార్త వచ్చు నంతలోన. 53

వ. అనిన నింద్రజిత్తు పాదతాడితభుజంగంబు భంగి బుస్స కొట్టుచు హనుమంతుని వీఁపుమీఁద నెక్కి వి ల్లెక్కు పెట్టి కొట్ట నున్నలక్ష్మణుం దిలకించి యి ట్లనియె. 54

శా. ఓరీ నిన్నును నీదునన్నను గపివ్యూహంబు నానాఁటి రే
యేరీతిం బొనరించినాఁడనొ ననున్ వీక్షింపవో యిట్లు నే
నేరో చూడక పోర వచ్చితివి రా యి ప్డెట్లు గావింతునో
వీరు న్నీవును జూడకుండెదరొకో వీరాధివీరున్ ననున్. 55

వ. అనిన లక్ష్మణుండు వాని కి ట్లనియె. 56

శా. అంతర్ధానము నొంది చేసితివి నాఁ డ ట్లద్ది యుద్ధంబు నా
నంతర్వాణులు చెప్పఁ జాలుదురె వీరాగ్రేసరుం డైన నా
చెంత న్నిల్చి పరాక్రమింపవె కడున్ సిగ్గైన తత్కార్య మి
ట్లైంతో పెద్దగఁ జెప్పుచుంటి వది నిస్సీ దొంగకర్జం బగున్. 57

క. మగటిమి గలిగిన నే నిదె
నుగముడ్డనై యెదుట నిలిచి చూపట్టితి నీ
యగణితబాణాతిశయం
బగు నగు ననఁ జూప ర మ్మహంయువు వగుచున్. 58

—♦ లక్ష్మణుఁ డింద్రజిత్తుం జా నేయుట ♦—

సీ. అన నల్గి రావణి ప్రణుతశరంబు లా
సౌమిత్రిపై నేసి చచ్చితి వనె
మేన నె త్తూఱ సౌమిత్రియుం గొంకక
వాలమ్ము లాతనివక్షమూఁద
నేసె నీసున రావణాసురతనయుండు
మూఁడమ్ము లాతనిఁ గాడ నేసెఁ

దుల్యపరాక్రముల్ తొడరి వా రిర్వురు
జడివానవలె బాణ:మితి: గురిసి

తే. కొనుచు సింగము లట్టుల ఘోరయుద్ధ
మాచరించిరి యప్పు డారాచమేటి
మేటి బాణము రావణిమేన నేసె
సోలె నాత: డొకింతలో సొక్కి-కొనుచు. 59

మత్త. వాఁడిబాణము లేసులక్ష్మణు వక్షముం బదియేడు:వాల్
వేఁడితూపుల నాంజనేయునివెన్ను భిన్నము భిన్నమై
వీడిపో వఁగ నేసి యార్చి విభీషణుం బదితొమ్మిదుల్
బోడికోలలఁ దూలనేసెను బోటరుల్ గని మెచ్చఁగన్. 60

ఆ. లక్ష్మణుండు వాని లక్షించి పదునాల్గు
కఱకు టమ్ము లసురఁ గాడ నేయ
వానికవచ మపుడు వ మ్మయి నిలఁ బడె
సూక్ష్మఖండము లయి చుక్క- లట్లు. 61

ఆ. కదల కతఁడు వేయికాండంబులను వైచి
భరతుననుజుమరువు పగులు నట్లు
సలిపె వారి కపుడు బలివాసవుల కట్లు
పోరు ఘోరమగుచుఁ బొగడ నయ్యె. 62

చ. ఇరువురబాణజాలముల నిర్గుబడెన్ నభ మెల్ల నిండుటన్
మఱి మఱి నార్తిమోఁత లవి ఘోరతల మంతయు నిండ నయ్యె నె
త్తురు ప్రవహించె నొండొరులు దొడ్డశరంబుల మేను లుచ్చిపో
ధరణిని జొచ్చి నాగులకుఁ దాఁకిన వయ్యె ననంగ నయ్యెడిన్. 63

వ: అప్పుడు విభీషణుండు వానరసైనికులవంకకం జూచి చేయియెత్తి పిలు
చుచు సైనికోత్తములారా! కుంభకర్ణ నికుంభ ధూమ్రాక్షాది
రాక్షసవీరుల నోడించినమీ కిది యొకలెక్క-లోనిది కాదు లంకా
పురంబున వీఁ డొక్కఁడ యుక్కు-మిగలినరక్క-సుండు వీని సంహరిం
చిన రావణుని సదిహరించిన ట్లగును గావున మీ రెల్లరుఁ బరాక్ర

మించి యింద్రజిత్సైన్యంబు దైన్యంబు నొందింపు డింతలో లక్ష్మ ణుండు వీని నుక్కడంచు ననుచున్నంత హనుమజ్జాంబవదాది యోధు లాయోధనంబునకుం గట్టాయితంబై చెట్టు చేమలు ఱాలు అప్పలుం గొని రాక్షససేనలం జిందువందు గావించి రప్పు డింద్రజి ల్లక్ష్మణు లక్షీణపరాక్రమంబునం బోరుచున్న సమయంబున లక్ష్మణుండు. 64

చ. వడి గల నారసంబు వరవజ్రనిభం బగుదానిఁ బట్టి బి
ట్టడరుచు వాజుల న్నడపునాసురసారథి నట్టె కొట్టుడుఁ
బుడమిపయిన్ బడెన్ దనుజపుంగవుసారథి తేరినుండి న
ప్పుడు సమరాంగణంబు నలుమూలలు నిండె రవంబు మెండుగన్.

తే. సారథి మృతింపఁగాఁ దానె సారథి యయి
రథికుఁడై రశ్మములఁ బట్టి రథ్యములను
నడపుచున్ మేఘనాథుఁడు కడురయంబు
మెఱయ సమర మొనర్చె మే ల్మేలు నాఁగ. 66

చ. సమయ మెఱింగి లక్ష్మణుఁడు సారథియై రథరశ్మ లూను నా
సమయమునందు వానిమెయి సాల్వడ నేయుచు విల్లు వట్టునా
సమయమునందు రథ్యములఁ జర్జరితంబుగ నమ్ము లేయుచున్
సమర మొనర్చె దేవతలు సంతసమందుచు పైఁ గనుంగొనన్. 67

వ. అప్పుడు ప్రమాథి శరభ రభస గంధమాదను లింద్రజిత్తు గర్వం బున కోర్వఁజాలక నభంబున కెగిరి యటనుండి వానిగుఱ్ఱంబుపైఁ బడినంతఁ బర్వతములం బోనిఫానరవీరులపాటున నాల్గు గుఱ్ఱంబు లును నెత్తు గ్రక్కుకొనుచు నేలం గూలె రథంబునుం బిండి యయ్యె నయ్యెడ రథరథ్యంబులు నేలపాలగుటం జేసి యింద్రజిత్తు ధరణికిం దిగి లక్ష్మణునిపై వాలమ్ములం గురిమ్మరించె నంత లక్ష్మ ణుండును వాడికోలలు నిగిడించె నపుడు వారిరువురును గుసుమిత పలాశభూరుహంబు లన నలరారుచుండి రపుడు రావణి రాజధానికిం జని సకలాయుధసంభరితం బగు నొక్క సాంగ్రామికరథం బెక్కి

మొక్కలీఁడై సంగరాంగణంబునకు వచ్చి లక్ష్మణ విభీషణుల
నెదుర్కొనియె నంత. 68

తర. బహువిధమ్ములు సాయకమ్ములు పర్వఁ జేయుచు నెల్లెడన్
తహతహంపడు న ట్లొనర్చుచు దావ మట్లు వెలుంగుచున్
బహుళవానరసైన్యముల్ కడు బమ్మరిల్లి చనం జనన్
కహకహధ్వని సేయుచుం గడు గండుమీఱె నతం డనిన్. 69

క. కపిసేన లెల్ల నింద్రజి
కపు డోర్వఁగ లేక రామునను జుని శరణం
బపలాపించుచుఁ జేరిరి
కృప నాతఁడు వారి కభయ మిచ్చి రయమునన్. 70

తే. కనుల నంగారకణములు గార రాము
ననుజుఁ డలుక మెయిం దనహస్తలాఘ
వమ్ము చూప నగ్గింపంగ వానిచేతి
విల్లు దునుమాడె నొకవాఁడిభల్లమునను. 71

సీ. విల్లు విర్గినఁ గాని నల్లద్రావుడు దొట్రు
పడక వేఱొకవిల్లు కడకఁ దాల్చి
సజ్యంబు గావించి సాయకంబు నిగుడ్చి
నంతలో దానిమూఁడమ్ము లేసి
తెగఁ జేసి మై దైనఖగముల నింద్రజి
యుమ్మ్రాడఁగా నేసె నమ్మెయి నవి
రక్తసిక్తము లయి త్రోఁచులునా నేలఁ
బడె వానికవచంబు బ్రిద్ద లయ్యెఁ

తే. గనుల నెత్తురు గ్రిక్కుచుఁ గ్రిక్కన మఱి
యొక్క విల్లు గొని రావణి పెక్కుతూపు
లొక్కమొగిఁ జిత్తజల్లు నా నుర్వి నిండఁ
గుఱిసె లక్ష్మణప్రభృతులు వెఱఁగు పడఁగ. 72

చ. వెఱవక లక్ష్మణుండు కడు వేఁడివెలార్చెడుబాణపంక్తులన్
బఱపుచు వాని నన్నిటిని వమ్ముగఁ జేయుచు నెల్లవారికిన్

కటకరి మూడుమూడయి నకాండముల నొ్నగిలించి యింద్రజి
ద్వరరథసారథిం దునిమె వాఁడిశరంబుల వేఁడిఁ జూపుచున్. 73

క. సారథి లేకుండిన న
త్తే రెప్పటియట్ల లాగెఁ దేజులు తేజ
స్సారమున లక్ష్మణుం డటు
లారసి నో నేసె వాని నంబకవితతిన్ 74

తరు. అదిగాంచి యింద్రజి త్తారఘువరు
నాగ్రహించుచుఁ గెంపులై కన్ను లొప్పఁ
బదిశిలీముఖముల వర్మంబు పగులు
పగిది నేసెను గాని పగల దామరువు
మదిఁ గిన్క వహియించి మనుజాసి రాజ
మణినుదుటన్ మూడుమార్గణములను
గదియ నాటె నతండు గన వచ్చె నపుడు
ఘనశృంగములు మూడు గలకొండ నాఁగ. 75

—♦ లక్ష్మణుఁ డింద్రజిత్తుం జంపివచ్చి రామునకు మ్రొక్కుట ♦—

ఉ. పూచినకింశుకంబు లనఁ బూరుషసింహులు వార లిద్దఱున్
రాచరికంపుఁ దేవ లవి గ్రాల రణం బొనరించున ప్డటన్
దోఁచినరావణాత్మజుని దొడ్డశరంబుల నింద్రజిత్తు లో
నేచినకిన్కఁ గొట్టె నతఁ డేడ్తెఱఁ జూపెడునట్టివాఁడ వై. 76

మ. గదతో వానిరథాశ్వసారథుల నల్కంజేసి నుగ్గాడ దు
ర్మదుఁ డారావణి తేరు డిగ్గి పగకున్ మారొడ్డి శక్త్యాయుధం
బది చేకొంచు విభీషణోరమున వ్రేయన్ దాని సౌమిత్రి బ
ల్లిదుఁడై భల్లయుగంబునం దునిమె దోర్లీలన్ బ్రదర్శించుచున్. 77

తే. వడి విభీషణుఁ డల్కఁ బెన్బిడుగు లట్టి
యైదు బాణంబులన్ మేఘనాథు నేయ
నవి యతనిమేనిలో దూఱి యంతలోన
రక్తసిక్తములై వ్రాలె వ్యక్తము లయి. 78

సీ. అలుక రావణి యామ్యమస్త్రము సంధించి
పినతండ్రిపై వైచెఁ బిలుకుమాలఁ
గని లక్ష్మణుఁడు దాని ఖండింపఁగా వైచెఁ
గౌబేర మస్త్రంబు గాఢశ
నారెండునున్ మింట నంటి మంటలు పర్వఁ
బోరాడి పోరాడి పుడమిఁ బడియె
సౌమిత్రి వారుణాస్త్రము పూని యపు డేసె
యింద్రజి రౌద్రాస్త్ర మేసి దాని
తే. పాలు పుచ్చఁ జేసి యాగ్నేయమును శరమునఁ
గడక సంధించి లక్ష్మణుఁ దొడర నేసె
నతఁడు సౌరాస్త్రమున దాని నడఁచి వైచె
నింద్రజి త్తాసురాస్త్రము నేసె నంత. 79
శా. ఆయస్త్రంబుననుండి శూలముసలాఖ్యాకాయుధంబుల్ కడున్
బ్రాయఃప్రక్రియ నుద్భవించి ఘనసంరంభంబునన్ లక్ష్మణున్
డాయన్ వచ్చుడు నాఘనుం డెటేఁగి యుంటన్ దాని మాహేశ్వరా
స్త్రీయత్తప్రతిభన్ క్షణార్ధమున మాయం జేసె నీ సేర్పడన్. 80
స్రగ్ధర. అంతన్ రామానుజుం డాయసురవరుపయిన్
హావడిం గూర్పనై కొం
డంతల్ గోరరితలై పో నతిజవమునఁ జే
యంగ నాశక్తితో దు
ర్దాంతంబై పొల్చునైంద్రాస్త్రము శరమున సం
ధానముం జేసి రాముం
డెంతే ధర్మాత్ముఁ డౌనే నెయిది తునుము నీ
యింద్రజిత్తున్ దురాత్మున్. 81
తే. అనుచు నస్త్రాధిదేవత నాత్మఁ దలఁచి
విడుచునంత నయ్యస్త్రము వడి వడిఁ జని
రావణాత్మజు శీర్షము రంహముగను
దునిమి పోయి భూమిం బొచ్చె ఘనరవమున. 82

క. సకిరీటదనుజశీర్షము
సకలాశలఁ దెలిసి కొనుచు జయ్యన నిలపై
నొకచోటఁ బడియె దేహము
నొకచోటం బడియెఁ గొండయో యనురీతిన్. 83

తే. ఇంద్రజిన్మరణమున కెంతేని సంత
సమున వానరు లుప్పొంగి సంతతముగఁ
గిలకిలారావములుఁ చేసి కేళ్ళువాఱి
చుట్టుకొని లక్ష్మణుని మెచ్చి రట్టియెడల. 84

ఉ. అత్తఱి నంతరిక్షమున యం దమరావళి దుందుభిధ్వనుల్
చిత్తము లుల్లసిల్లునటు చేసెను వాసిగ నాడి రచ్చరల్
క్రొత్తలు పుష్పవర్షములు క్షోణిపయిం బడె దివ్యగంధముల్
గుత్తగఁ గొంచు మారుతము కోర్కుల నీనుచు వీచె నల్లడన్. 85

ఉ. కొందఱు శస్త్రముల్ విడిచి కొందఱు వస్త్రము లూడిపోవ గాఁ
గొందఱు లంకలోపలికిఁ గొందఱు సంద్రమునందు డాఁగుకో
కొందఱు సర్వమున్ మఱచి కొయ్యలు నాఁబడి రప్డు కొంద ఱా
నందలి రాక్షసుల్ పఱచి రాదశకంఠసుతుండు గూలుటన్. 86

మ. హనుమజ్జాంబవదంగదాదికపు లత్యానందముం బొందుచున్
ఘను నాలక్ష్మణుఁజుట్టు వాఱుకొని వేడ్కన్ నెయ్యముం జూపుచున్
వినుతుల్ సేయ విభీషణాంసమున నావీరుండు చే వైచి రా
మునిఁ జూడం జనుదెంచె నెల్లరును దన్ బూజించుచున్ వెంటరాన్.

మ. ప్రవరం జెప్పుచు లక్ష్మణుండు తనయగ్రభ్రాతృపాదాబ్జముల్
దవులన్ శీర్షము నందు వందన మొనర్పన్ రామచంద్రుండు దా
నవనాథాత్మజుఁ డీల్గె నన్ననుడి వింటన్ హర్షవారాన్నిధిన్
బ్రవణంబై మది యూఁదులాడ నతనిన్ గౌఁగింటఁ జేర్చెం గృపన్.

ఉ. తమ్ముఁడ మూఁడునాళ్ళు కడుదర్పము సూపుచు లోకకంటకుం
డమ్మనుజాసి శీర్షము రణాంగణమందుఁ బడంబొనర్చి నీ
విమ్మెయిఁ గానవచ్చుటకు నెంతయు సంతస మయ్యెనింక స
ర్వమ్ము జయంబుగాఁ దలఁప వచ్చు నటంచును గారవంబునన్.

తే. అక్కునం జేర్చుకొని శిరమందు ముద్దు
పెట్టుకొని మేను నిమురుచు నిట్టియెడల
నీవు చేసినకార్యము దేవతలును
మెచ్చునట్టిద తమ్ముఁడా! మేలు మేలు. 90

క. అని మేనఁ గలుగునలుగులు
తనచేతం దీసి వైచి తనువెల్లఁ గరం
బున నిమిరి శిరము పుడుకుచు
ననురాగము చూపుచుండె నతులిత గతులన్. 91

ఉ. ఇంచుక సోలి లక్ష్మణుఁ డొకింతయుఁ బల్కక రామచంద్రపా
దాంచలమందుఁ గన్నుదుగ హర్షజలంబు స్రవించుచుండఁ గాఁ
గాంచి సుషేణు లక్ష్మణునికాయమునం గలయెల్ల గాయముల్
మంచిగ నౌషధంబునను మానెడునట్లుగఁ జేయు మింతలోన్.

క. అని రాముఁ డానతిచ్చిన
గనుఁగొనుచు సుషేణుఁ డెంచఁ గలమూలికలం
గొని తెచ్చి యిచ్చినంతన
ఘనుఁ డతఁడు విశల్యుఁ డగుచుఁ గానఁగ నయ్యెన్. 93

— రావణుఁ డింద్రజిత్తు మృతికి దుఃఖించుట —

వ. అక్కడ రావణాసురుండు మంత్రులవలనఁ దనయుం డింద్రజిత్తు నికుంభిలాభవనంబుకడ రామానుజునిచే వధింపఁ బడినవృత్తాంతంబు విని యంతన మూర్ఛమునింగి పుడమిం బడి కొంతవడికి లబ్ధసంజ్ఞుండై.

సీ. హా! నాకుమారక! హా! యింద్రజిన్నామ!
నన్నుఁ బాసి పోయితే నాకమునకు
నాకాధిపతి నొక్కపీఁకునం గెలిచిన
నీమహితక్రమ మేమి యయ్యెఁ
గొండ విఱిగి మీఁదఁ గూలెనేనియు నింత
జంకు డొం కెఱుఁగనిశౌర్యనిధివి
మనుజమాత్రుండు లక్ష్మణుఁడనఁగా నెంత
యులఁటిచేఁ దెగఁ టాఱ నైతి వయ్యొ

క. సకిరీటదనుజశీర్షము
సకలాశలఁ దెలిసి కొనుచు జయ్యన నిలపై
నొకచోటఁ బడియె దేహము
నొకచోటం బడియెఁ గొండయో యనురీతిన్. 83

తే. ఇంద్రజిన్మరణమున కెంతేని సంత
సమున వానరు లుప్పొంగి సంతతముగఁ
గిలకిలారావములుఁ చేసి క్రొళ్ళువాఱి
చుట్టుకొని లక్ష్మణుని మెచ్చి రట్టియెడల. 84

ఉ. అత్తఱి నంతరిక్షమున యందు దమరావళి దుందుభిధ్వనుల్
చిత్తము లుల్లసిల్లునటు చేసెను వాసిగ నాడి రచ్చరల్
క్రొత్తలు పుష్పవర్షములు క్షోణిపయిం బడె దివ్యగంధముల్
గుత్తగఁ గొంచు మారుతము కోర్కులు నీనుచు వీచె నల్గడన్. 85

ఉ. కొందఱు శస్త్రముల్ విడిచి కొందఱు వస్త్రము లూడిపోవ గాఁ
గొందఱు లంకలోపలికిఁ గొందఱు సంద్రమునందు డాఁగుకో
కొందఱు సర్వమున్ మఱచి కొయ్యలు నాఁబడి రప్డు కొంద ఱా
నందలి రాక్షసుల్ పఱచి రాదశకంఠసుతుండు గూలుటన్. 86

మ. హనుమజ్జాంబవదంగదాదికపు లత్యానందముం బొందుచున్
ఘను నాలక్ష్మణుఁజుట్టు వాఱుకొని వేడ్కన్ నెయ్యముం జూపుచున్
వినుతుల్ సేయ విభీషణాంసమున నావీరుండు చే వైచి రా
మునిఁ జూడం జనుదెంచె నెల్లరును దన్ బూజించుచున్ వెంటరాన్.

మ. ప్రివరం జెప్పుచు లక్ష్మణుండు తనయగ్రభ్రాతృపాదాబ్జముల్
దవులన్ శీర్షము నందు వందన మొనర్పన్ రామచంద్రుండు దా
నవనాథాత్మజుఁ డీల్గె నన్నునుడి వింటన్ హర్ష వారాన్నిధిన్
బ్రివణంబై మది యూఁదులాడ నతనిన్ గాఁగింటఁ జేర్చెం గృపన్.

ఉ. తమ్ముఁడ మూఁడునాళ్ళు కడుదర్పము సూపుచు లోకకంటకుం
డమ్మనుజాసి శీర్షము రణాంగణమందుఁ బడంబొనర్చి నీ
విమ్మెయిఁ గానవచ్చుటకు నెంతయు సంతస మయ్యెనింక స
ర్వమ్ము జయంబుగాఁ దలఁప వచ్చు నటంచును గారవంబునన్.

తే. అక్కునం జేర్చుకొని శీర్షమందు ముద్దు
పెట్టుకొని మేను నిమురుచు నిట్టియెడల
నీవు చేసినకార్యము దేవతలును
మెచ్చునట్టిద తమ్ముఁడా! మేలు మేలు. 90

క. అని మేనఁ గలుగునలుగులు
తనచేతం దీసి వైచి తనువెల్లఁ గరం
బున నిమిరి శిరము పుడుకుచు
ననురాగము చూపుచుండె నతులిత గతులన్. 91

ఉ. ఇంచుక సోలి లక్ష్మణుఁ డొకింతయుఁ బల్కక రామచంద్రపా
దాంచలమందుఁ గన్నుదుగ హర్షజలంబు స్రవించుచుండఁ గాఁ
గాంచి సుషేణు లక్ష్మణునికాయమునం గలయెల్ల గాయముల్
మంచిగ నౌషధంబునను మానెడునట్లుగఁ జేయు మింతలోన్.

క. అని రాముఁ డా నతిచ్చిన
గనుఁగొనుచు సుషేణుఁ డెంచఁ గలమూలికలం
గొని తెచ్చి యిచ్చినంతన
ఘనుఁ డతఁడు విశల్యుఁ డగుచుఁ గానఁగ నయ్యెన్. 93

— రావణుఁ డింద్రజిత్తు మృతికి దుఃఖించుట —

వ. అక్కడ రావణాసురుండు మంత్రులవలనఁ దనయుండింద్రజిత్తు నికుంభి లాభవనంబుకడ రామానుజునిచే వధింపఁ బడినవృత్తాంతంబు విని నంతన మూర్ఛమునింగి పుడమిం బడి కొంతవడికి లబ్ధసంజ్ఞుండై.

సీ. హా! నాకుమారక! హా! యింద్రజిన్నామ!
నను బాసి పోయితే నాకమునకు
నాకాధిపతి నొక్కపీఁకునం గెలిచిన
నీమహితక్రమ మేమి యయ్యెఁ
గొండ విఱిగి మీఁదఁ గూలెనేనియు నింత
జంకు డొం కెఱుఁగనిశౌర్యనిధివి
మనుజమాత్రుండు లక్ష్మణుఁడనఁగా నెంత
యలఁతిచేఁ దెగఁ బాఱి నైతి వయ్యొ

తే. నిన్ను మృత్యువు ముట్టెనే నన్ను మఱచి
పన్ను లూడంగఁ గొట్టినపాటు తెలియఁ
దోటు జమునకుఁ బొగ రెక్కె నో కదయ్య
దైవ మీరీతిఁ దెచ్చెనే నావధాత్మ ! 95
తే. అని వగచి పుత్రశోకసంజనితరోష
రూషితస్వాంతుఁడై కడురోజు చున్న
సమయసంజ్వలితాగ్నినాఁ జాల మండి
శత్రునకు మున్ను తత్పత్నిఁ జంపు టొప్పు. 96
వ. అని జానకిం జంప నెంచి ఖడ్గంబుచేత నుంకించి సీత యున్నవనంబు దారిం బట్టి పోవుచుండ నతనియుద్యమం బెఱింగి మిత్రులును గళత్రంబులును వెంట నంటి రప్పుడు సుపార్శ్వుం డనుమంత్రి రావణుం దరియ వచ్చి యి ట్లనియె. 97
తే. బ్రహ్మవంశమునం బుట్టి పరఁగునీవు
వేదవేదాంగవేత్తవై విజ్ఞుఁడ వయి
స్త్రీవధముఁ జేయ నెంచుట చిత్తమందుఁ
బాపహేతు వయ్యెది యని తోఁప దకట. 98
క. నీకొడుకు మృతిని హెచ్చిన
నీకోపము రామునందు నిలుపుము వానిఁ
వీఁక మెయిఁ గోసి చంపుము
నీకందఱు సాయపడఁగ నిల్తురు కలనన్. 99

—♦ రావణుఁడు మూలబలంబునుయుద్ధమునకుఁ బుచ్చుట ♦—

వ. అంతలో శాంతుండై స్వాంతంబు చక్కఁ జేసికొని మరల పురంబునకుం జని కుదిరియుండం జాలక సభాభవనంబున కరిగి సింహాసనాసీనుండై సేనానులం గాంచి యి ట్లనియె. 100
తే. ఏకముఖముగ మీ రెల్ల రేగి రామ
లక్ష్మణుల మాఱుకొని జయలక్ష్మిఁ గాంచి
రండు పొం డిదె యాజ్ఞ నా గండు మిగిలి
వారు నానా విధా యుధపాణు లగుచు, 101

సీ. అరదంబు లెక్కి యాహవభూమికిం జని
పరిఘాదులను సేనపై నిగిడ్చి
బిగువుఁ జూపినఁ గపివీరులు వృక్షప
ర్వతముల రాక్షసప్రవరులపయిఁ
బరఁగించి రప్పుడుఁ బవరంబు భీకర
మై యొప్పె తేరులు నశ్వములును
గజములునుం బంట్లుఁ గడికండ్లై నేలఁ
జిందునందై పడె సందు లేక
తే. ఒకొక్కకరిమీఁద నూఱుగు రెక్కి కపులు
రాక్షసుల నొంచి రప్పు డారాక్షసులును
జెల్లచెదరగు నటు చేయ నెల్లవాన
రులును రాముని మఱువు చేరుకొని రార్తి. 102
శా. మౌర్వీనాదము సేయుచుఁ దశరథక్ష్మాజానిపుత్రుండు తా
నార్వం బట్టులు మండుచున్ దనుజసేనాంభోధిభాగంబునన్
గర్వస్ఫూర్తి నఖర్వశౌర్యమెసఁగన్ గాండోగ్రకీలౌఘమున్
సర్వస్థానములందుఁ గ్రమ్ముకొనఁగా సాగించె సంగ్రామమున్. 103

—♦ రాక్షసవీరులు రాముని యెదుట నిలఁ జాలక నిహతులగుట ♦—

తే. రామబాణాభిహతు లయి రాక్షసప్ర
వీరు లెంతయు భీతిల్లి విడిచి పోరు
పాఱనై రప్డు పాఱెడు వారి నరసి
సింహనాదము గావించెఁ జెల్ల నృపతి. 104

వ. అట్లు విఱిగి పాఱినరాక్షససేనలు సేనానులప్రేషణంబులం జేసి మరలి వచ్చి హెచ్చి రామునిపైఁ జిచ్చుటంపరం బ్రయోగించు చున్నంత రాముండు గాంధర్వాస్త్రంబు ప్రయోగించుటయు నది మంటలు గ్రక్కుకొనుచుఁ బోయి వారి నందఱం గాల్చిపుచ్చె నప్పుడు రాఘవుని సుదర్శన చక్రంబు పదివేవుర రథికులను బదు నెనిమిదివేల యేనుంగులను బదునాలుగువేల గుఱ్ఱంపురౌతులను రెండులక్షలకాల్బలంబును రణంబున మరణంబు నొందించె నంతఁ

ప్రళయకాలరుద్రునివలె రౌద్రమూర్తి యైనరామమూర్తిఁజూడం
జూడఁ జాలక రాక్షసులు లంకాభిముఖంబు వెట్టి రపుడు దేవ
గంధర్వప్రభృతు లారామునిపరాక్రమంబు మెచ్చుకొని రనంత
రంబ లంకాపురంబునఁ బ్రతిగృహంబునం గలరాక్షసాంగనలు పితృ
పుత్ర భ్రాతృ భర్తృ ప్రభృతుల మృతికిం బరిపరివిధంబులఁ బరిదే
వనంబుఁ గావించుచు. 105

## —♦ రావణాంతఃపురంబున నార్తనాద ముప్పతిల్లుట ♦—

సీ. అయ్యయ్యో యేమందు మెయ్యెడ మూఁడుపు
వ్వులు పూచి నాఁలుకాయలను గాచు
నట్టుండుమనలంక కరయ నెంతటికర్మ
మరుదెంచె నిప్పు డేమందు మమ్మ
మనచుప్పనాతి రామునిఁ గని మోహించి
పరిభవింపంబడి భ్రాతవలన
సీతాపహరణంబుఁ జేయించె నద్దాన
వేనవేల్ హతులైరి వీథి వీథి
తే. నార్తనాదము విన వచ్చె నయ్యొ కొడుక
నయ్యొ తమ్ముఁడ యయ్యయొ యయ్య యన్న
యనుచు పెక్కుతెఱంగుల నడలుఁ గుడుచు.
నట్టివారైరి మనలంకయందు నిపుడు. 106

వ. అట్లప్పౌరవరంబున నలుగడ నార్తరావంబు పెల్లుప్రోయుట
లాలించి రావణుండు భయశోకామర్షంబు లినుమడింప మహోదర
మహాపార్శ్వ విరూపాక్ష దుర్ధర్షు లనుమంత్రులను బిలిచి నే నిదె
సమరంబునకుం బోవుచుంటి మీరు మీమీ సేనల నెల్ల సంతరించు
కొని పయనంబు కం డని నియోగించి తాను సర్వాలంకారాలం
కృతుండై సర్వాయుధంబులం బూని జవనాశ్వోహ్యం బగుసాంగ్రా
మికరథం బధిష్ఠించి లంకాపురోత్తరద్వారంబునుండి రామలక్ష్మణు
లున్నచోటికిం జనియె నప్పుడు.

—♦ రావణుఁడు యుద్ధభూమికరుదెంచుట ♦—

తే. దెసలఁ జీకట్లు గ్రమ్మెను వసుధ యదరె
రక్తవర్షము గురిసెను గ్రద్దలాడె
వలఁదు లఱచె నమంగళకరము గాఁగ
దురమునకు రావణాసురుఁ డరుగునపుడు. 108

మ. అపు డావానరరాక్షసుల్ కదిసి ఘోరాకార మేపాఱఁగాఁ
గుపితస్వాంతములం బరస్పరము పెక్కుల్ వృక్షభూధ్రాదులన్
సుపృషత్కాసిగదాదులన్ మిగుల సంస్ఫోటంబుఁ గావించుచున్.
విపులాచక్రము దద్దిఱన్ దిరిగి రావేళన్ రణాగ్రంబునన్. 109

తే. రావణుఁడు కపిబలమున రథము నడిపి
కఱకుటమ్ములఁ గొందఱకాళ్ళు నఱకి
కొందఱశిరంబులం ద్రుంచి కొందఱకర
ములను ఖండించి నశియింప సలిపె నపుడు. 110

ఉ. దావము మండుచున్ మివుల దగ్గరకున్ జనుదెంచుచో మహా
రావముతో మృగవ్రజము రంహముగాఁ బరువెత్తుచాడ్పునన్
రావణువేఁడికిన్ సమరరంగమునన్ నిల లేక వానరుల్
దావులఁ బాఱఁ జొచ్చిరి ముఖం బఱి చెట్టొకఁడై వడిన్ వడిన్.

సీ. అపుడు సుగ్రీవుఁ డత్యంతరోషంబున
వృక్ష మొక్కఁడు గొని రాక్షసులను
దాఁకువాఁడై నిల్వఁ దర లేదుకపు లెల్ల
మరలి మూఁగిరి బలుమ్రాఁకులు గొని
సంవర్తమునను జంఝూమారుతము చెట్లఁ
గూల్చెడు నట్లుగాఁ గూల్చి మూఁకఁ
ముందఱకుం జోయి క్రమ్మందించి రాక్షస
బృందము లన్నియు డిందు పడియె

తే. అప్పు డప్పిరూపాక్షుఁడు గొప్పరథము
నుండి క్రిందికి దిగి పర్వతోన్నత మగు

తనదునేనికపై నెక్కి ఘనతరముగ
నార్చుచుం బేర్చి నగచరు లడలుఁ గుడున. 112

శా. ఆసుగ్రీవుఁడు తన్నుఁ దాఁకుటకునై స్వాంతంబుఁ గావించి య
త్యాసన్నుం డయి యమ్ము లేసెఁడు విరూపాక్షున్ నిరీక్షించి మే
ధాసంపన్నతఁ గ్రాల వానిగజమున్ ధాత్రీజముం బెట్టి పై
ల్లేసెన్ దానగజంబు త్రెళ్ళినదియై పృథ్విం బడెం గొండనాన్. 113

తే. ఆ విరూపాక్షుఁ డాక్షణమందు నిలక
దుమికి ఖడ్గము చేఁ బూని దోర్బలంబుఁ
జూప సుగ్రీవుఁ డొకశిల నేపుమీఱ
వానిపై నేయ దానికి వాఁడు తొలఁగి. 114

మ. ప్లవగాధీశునిమీఁద ఖడ్గమును జేవం జూపుచున్ వైవ గొం
త వివర్ణత్వము నొంది మైమఱపుపో దర్పోద్ధతిన్ రాక్షస
ప్రవరున్ ఱొమ్మున నొక్కపోటు పొడిచెన్ రాత్రించరుం డుగ్రుఁడై
కవచంబుం దెగనేసి తన్నెఁ దలపైఁ గాల్వొట్టి సుగ్రీవునిన్. 115

తే. క్రిందఁ బడి లేచి సుగ్రీవుఁ డందఱుఁ గన
వజ్రమునుఁ బోలు నఱచేత వాని మొత్తె
సరకుగొన కది పిడికిట సురవిరోధి
వానరేంద్రుని ఱొమ్ముపై వడిగఁ బొడిచె. 116

తే. కాంచి కన్నుల నంగారకణము లొలుక
నలుక రక్కసి మోముపై నతఁడు గ్రుద్దె
గ్రుద్దునం దలవ్రీలి ముక్కులను నోట
నెత్రు గక్కుచు సురవైరి నేలఁ గూలె. 117

మ. సురవైరివ్రజ మప్డు బెండువడుచున్ సుగ్రీవు నెమ్మోమునన్
దురమున్ జేయఁగ నోడి పాఱె నచటన్ దోషాచరేంద్రుండు సం
గరవృత్తాంత మెఱింగి క్రోధమున రక్తం బొల్కఁ గంటన్ మహో
దరునిం గాంచి పరాక్రమింపు మరి ప్రమందం జేయు మిప్పట్టునన్.

— ♦మహోదరుఁడు పరాక్రమించి పోరొనర్చుట♦ —

తే. అధిపు ప్రేరేపణంబు వీర్య మభిమాన
మును దనకుఁ దోడుపాటుగా దనుజవరుఁడు
ప్లవగులం బట్టి సుగ్గాడఁ దవిలె వాని
నరసి సుగ్రీవుఁ డొక్కని యసురఁ గదిసి. 119

మ. పెనుగొండం దలపించు గండశిలతో విద్వేషినిం గొట్ట నా
ఘనబాహుండు సహస్రధా తునియలై క్ష్మామండలిం గూలి పోఁ
బొనరించెన్ గపినాథుఁ డొక్క తరువున్ బూన్కిన్ సురద్వేషిపైఁ
దునుముంబొమ్మని యేసియార్చె మిగులన్ దోదూయమానంబుగన్.

సీ. అద్దాని ఖండించె నసుర మూడమ్ములఁ
గని యటఁ బడియున్న గదను దాల్చి
సుగ్రీవుఁ డాతని సుగ్రీవరథరథ్య
ములఁ గూల్చె నసురయు నిలకు నుఱికి
తాను గదం గొని వానరవీరునిఁ
దాఁకుదెంచి కడంక దాని వాని
పైఁబడ విసరె సుగ్రీవుఁడు గదను శూ
లమ్మున ఖండించి వమ్ముఁజేసి

తే. ఇనుపఱోకలి నొకదానిఁ గొని రయమున
నమ్మహోదరుపై నేసె నాతఁ డొండు
గదను గైకొని సుగ్రీవుఁ గదిసి యేసె
రెండునుం దాకి యవి నేల మండుచుఁ బడె. 121

తరు. పోర నాయుధములై పోవఁగా వారు
పోరిగనట్టిరై భుజయుద్ధ మపుడు
కోరి సేయుచుఁ బట్టి కొట్టుచుఁ గ్రింద
కుం ద్రోయుచుక్ మట్టికొంచును సార
సారెకుఁ జేతులు సంధించుకొంచుఁ
జయ్యన విడుచుచు సరిపట్లు పట్టి

మేలు మీఱుచుఁ జాల మిసిమింతు లగుచు
మిక్కిలి తేజున మెఱసి రప్పట్ల. 122

ఆ. ఎడమనుండి కుడికిఁ గుడినుండి యెడమకు
నడవడిం బ్రదక్షిణములు చెలఁగ
మెలఁగికొనుచుఁ బట్టి మొట్టుచు నెట్టుచుఁ
బోరి రపుడు వారు పోటరు లయి. 123

— సుగ్రీవుఁడు మహోదరునిఁ జావనేయుట —

మ. ఒరలో ఖడ్గము వెట్ట రాక్షసుఁడు తా నున్నంతలో వానరే
శ్వరుఁ డొండొక్క పరశ్వథంబున సుపర్వద్వేషిశీర్షంబు భా
సురచామీకరకుండలద్వయముతో క్షోణీస్థలిం గూలఁ జె
చ్చెరఁ జెర్లాటగఁ జేసె నింగిపయిఁ జేజే లెల్ల మేల్ మే లనన్

మనోజ. ఉగ్రు మహోదరు నొఱఁగించిన య
వ్యగ్రుని వానరపతి రాముఁడు వీ
రాగ్రణి యంచు నయము దోఁప మహో
దగ్రకృపం గనెఁ దగ గారమునన్. 125

వ. అట్లు మహోదరుండు కూలినపదంపడి మహాపార్శ్వుం డంగదుం డున్నదిక్కున మొక్కలంబుగం బోరుచు శాఖామృగంబులశిరంబులు బాహువులు పార్శ్వంబులు ప్రక్కలు డొక్కలు దెగ నఱకి ఘోరయుద్ధంబు సేయుచున్నంత నంగదుండు పర్వదినంబుల సాగరంబుచందంబున నుప్పొంగి. 126

సీ. ఇన్పుగుదెం బూని కన్నుఁగొట్టుచు మూఁక
వడి మహాపార్శ్వునిఁ బొడిచెఁ దాన
వివశుఁడై యతఁడు పృథ్వింబడె నాలోఁ గ
వాక్షుఁడు చనుదెంచి వృక్షమునను
రథరథ్యములు ద్రెళ్ళి పృథివిఁ బడం జేసె
నవల మహాపార్శ్వుఁ డసువు లొంది
జాంబవంతుని మూఁడువాడికోలల నంగ
ధుని బెక్కుములుకులఁ దూల నేసె

తే. అంగదుం డంతఁ బ్రతిఘాసమంచితుఁ డయి
గదనుఁ గైకొని త్రిప్పుచుఁ గ్రవ్యభుజుని
ధనువుఁ దెగనేసి మకుటము ధరను గూల్చె
నలుకమైఁ ఖడ్గమును బూని యసుర వైచె. 127

క. అది యంగదునిభుజంబున
నదవద లగునట్లు దాఁకె నందున నలుకన్
గదిరినమనమునఁ బిడికిట
నదిమి మహాపార్శ్వవక్షమందునఁ బొడిచెన్. 128

ఉ. వక్షము గాజుకాయ వలె బళ్ళనుశబ్దము పుట్ట బ్రద్దలై
రాక్షసుఁ డీల్గి నేలఁ బడె రక్తము పెద్ద ప్రవాహ మట్టులై
యాక్షితి నాల్గుమూలల భయంకరమై పడె దానిఁ గాంచుచున్
వృక్షచరప్రవీరు లట వేడుకఁ జేసిరి సింహనాదముల్. 129

వ. అట్లు మహోదరమహాపార్శ్వవిరూపాక్షులు తన సమక్షంబునఁ జచ్చుటంజేసి హెచ్చిన క్రోధంబున రావణుం డాయోధనంబునం బగదీర్చుకొన నెంచి సారథిం దిలకించి యి ట్లనియె. 130

శా. స్ఫీతాదిత్యకులావనీరుహము పృథ్వీనాథబీజోద్భవం
బాతంకాతివిహీనవర్ధితము కీశానేకశాఖాంకమున్
సీతాపుష్పఫలంబు రామతరువున్ ఛేదించి రక్షఃకుల
ప్రీతిం గూర్చెదఁ జేర్చి తోలు రథమున్ వేవేగ నావంకకున్.

వ. అని సారథికిం దరిమిచెప్పిన నతం డట్లొనర్చె నంత రావణుండు ధనుష్టంకారంబు చేయుచు నెదురుపడినవానరవీరులం గాంచి. 132

ఉ. తామస మస్త్రరాజము నుదారగతిన్ శరమందుఁ గూర్చి తే
జోమహితంబుఁ జేసి కపిశూరులపైఁ బడ నేసె నేసినన్
రాముఁడు చూచుచుండఁగ నరంబుగ నెందఱొ మ్రింది రెందఱో
భూమి నిలంగ లేక వెఱ గొందుచుఁ బాఱిరి చెట్టొకండుగన్. 133

మ. తనపై వచ్చెడురావణాసురునిపై దర్పోద్ధతిం జూపుచున్
ఘనమార్వోరవ మాచరించుచును గ్రీగంటన్ నిరీక్షించుచున్
గనులన్ నిప్పుల రాల్చుచున్ పొలుచునాకాకుత్స్థవంశోద్భవున్
గని రక్షోగణ మెల్ల బెంషువడియెన్ గాలాంతకభ్రాంతిమై. 134

వ. అయ్యవసరంబున లక్ష్మణుండు. 135

క. తా నాది రావణాసురు
తో నని సేయంగ నెంచి దోర్బల మెసఁగన్
బూని విలు వాఁడిశరములు
పూనిక నిగిడించె నసురపుంగవు మీఁదన్. 136

చ. నడుమన లక్ష్మణుండు విడునారసముల్ తనవాఁడికోలలన్
నడిమికి రెండుగా నఱికి నల్గడలం బడఁ జేయు చాశరేం
ద్రుఁడు తనమీఁది కొక్కటియుఁ దోఁపఁగ రా నని లక్ష్మణేషువుల్
కడు నిరసించి వాని దెసఁ గన్గొన నెంచక రాము నెంచుచున్. 137

తే. రామునిం గాంచి బాణవర్షంబు గురిసె
నాతఁ డవ్వారమునఁ దననూతనాస్త్ర
ములను వారించి వానిపై మునుఁగఁ జేసె
నస్త్రశస్త్రపరంపర నతిరయమున. 138

—♦ రామరావణులు ఘోరయుద్ధము చేయుట ♦—

వ. ఓటమి యెఱుంగని మేటు లగురామరావణు లిరువురు నొండొరు
లపై నానావిధాస్త్రశస్త్రంబులు గుప్పించుకొనుచు ఘోర
యుద్ధంబుఁ గావించుచుండి రపుడు రావణుండు గండుమిగిలి. 139

ఉ. మాలిక లట్లు బాణములు మస్తకలనాథునికంత సీమపైఁ
గ్రాలఁగ నేసె నేయ నవి రామునికంఠమునందు మల్లెపూ
మాలికలై విరాజిలెఁ గ్రమంబున రాముఁడు వేఁడిబాణముల్
జ్వాలలు నాఁగ రావణునివక్షముపైఁ బడనేసె నీసునన్. 140

తే. శరపరంపరచే నిండి చదలు మెఱుఁగుఁ
దీవియలతోడ నొప్పుమొదిరము నాఁగ
నొప్పె నప్పుడు సంధులచొప్పు లరయ
నంబరమున గవాక్షులయట్లు తోఁచె. 141

తర. అలుకఁ జేయుచు లక్ష్మణాగ్రజుఁ డస్త్రమేయుచు శస్త్రముల్
ఝులుక నేయుచు రావణాసురుసూర్యసన్నిభ వర్మముల్

నలగ నేసెను గాని యించుక నల్గ దయ్యాది శస్త్రముల్
కలియవచ్చియు నేలవ్రాలెను గాని నొంప వోకింతయున్. 142

సీ. మఱియు దివ్యాస్త్రముల్ పరఁగింప వానిని
బ్రత్యస్త్రముల నేసి వ్రాల్చె నసుర
ప్రతిఘమై నాసురాస్త్రము ననేకాస్త్రముల్
కాకగృధ్రాదిముఖములు గలిగి
నెఱపిన రాముఁ డాగ్నేయము నరివోసి
యేసి తదస్త్రము లెల్లఁ దునియ
లై ప్రయ్యలై పోవునట్టులు పొనరించె
నలుకమై బెక్కస్త్రములను వైచి
ఆ. నిట్టు లాసురాస్త్ర మింతలోఁ బ్రత్యస్త్ర
ములను సంహరింప ముదము పొదలఁ
బ్లవగబలము కిలకిలరవంబు లొనరించి
మెచ్చె రఘువరేణ్యు నిచ్చ కోలఁది. 143

తే. అంత మయనిర్మితంబు రౌద్రాస్త్ర మసుర
రాఘవునిపైఁ బ్రయోగించె నాఘనాస్త్ర
మున జనించెను శూలముల్ ముసలములును
గదలు కూట ముద్గరములు మొదలగు నవి. 144

శా. ఆరౌద్రాస్త్రము మింట మంట లెగయన్ వ్యాపించియున్నంతటన్
శ్రీరాముండు మహాస్త్రవేది యగుచుం జెల్వొంది గాంధర్వమున్
ఘోరాస్త్రంబు సమంత్రకంబుగను శక్తుల్ మీఱఁగాఁ జేసి తా
నారౌద్రాస్త్రము పెంపు డింపఁ గలఁడై హర్షొందె నప్పట్టునన్.

ద్విపద. ఆరావణుండు సౌరాస్త్రము నేసె
సౌరాస్త్రమునఁ బుట్టె చక్రరాజములు
ఘోరరూపముఁ దాల్చి కుంభినియు నభ
మూర నిండెను వాని నడఁచె రాముండు. 146

ఉ. మర్మము లుచ్చిపోవుగతి మార్గణపఙ్క్తులు రాముపైఁ బడన్
గర్మితుఁ డాసురారి భుజగర్వ మవార్యముగాఁ దలిర్చుచున్

శర్మము నల్లకుండునటు సంతన చేయుచు రామచంద్రుపై
దుర్మనుఁడై పడఁగ విసిరె దోర్బల మేర్పడఁ బెంపు పేర్పడన్. 147

ఆ. దాని కించుకంత తలఁకక రాఘవుం
డశనిసమము లైనయస్త్రములను
విబుధవైరి బాణవితతివ్యర్థముఁ జేసి
వాని నొంచె వజ్రబాణములను. 148

శా. ఆలోలక్ష్మణుఁ డల్కఁజేసి పదియే డమ్ముల్ ప్రయోగించి దో
ర్లీలం జూపుచు నుత్తమాంగమునఁ బేర్మిం గన్నరత్నోవిభున్
శ్రీలక్ష్యం బగుటెక్కియంబు ధనువున్ జెల్వొందుసవ్యేష్టునిన్
గాలుం గోల్వగఁబుచ్చి రథ్యములఁ దుంగంజేసెఁ దద్రాథతయున్.

తే. తేరి గుఱ్ఱము లీరీతిఁ దెరలిపోవ
రావణుఁడు భూమిమీఁది కాగ్రహము హెచ్చ
నుఱికి వజ్రాయుధంబున కుద్దియైన
శక్తి నెత్తి విభీషణుఁ జదియనేసె. 150

తే. అది విభీషణుపైఁ బడునంతలోన
లక్ష్మణుఁడు దాని మూఁడమ్ములం ద్రిఖండ
ములుగ ఖండించెఁ జూపఱు వొగడుచుండ
రావణునికోప మినుమడి యై వహింప. 151

సీ. తనశక్తి వమ్మౌటఁ గనిరావణుఁడు కోప
మున మఱియొకశక్తిఁ గొని రయమునఁ
దమ్మునిపై నేయఁ దలఁచునంతటిలోన
వాని కడ్డముగ రామానుజుండు
రావణాసురుఁ బెక్కుప్రదరంబుల నొంప
నాతఁ డుగ్రుం డయి యతనిఁ గాంచి
నడుమ వచ్చితి వీవు నాశక్తి కెఱ యయి
పోదు లక్ష్మణ యని పూని వైచె

తే. మయువినిర్మిత మగుశక్తి మహిత మగుచు
గడునడిన్ లక్ష్మణునిమీఁదఁ బడియెఁ నహుకు

రాముఁ డీక్షించి మిక్కిలి దేవురించె
శక్తి మందుచు నతనివక్షంబుఁ జొచ్చె. 152

—♦ రావణశక్త్యాయుధముచే లక్ష్మణుఁడు మూర్ఛ నొందుట ♦—

శా. దానం జచ్చినవాఁడు నా నతఁడు చైతన్యంబు లేనట్టిఁడై
హా నాదం బొనరించుచున్ ధరణిపై నస్త్రప్రవారంబులో
మానేదం బడె రామచంద్రుఁ డతనిన్ మండాడుచుం జూచి యెం
తే నీ గ్గారఁగఁ గన్నుదోయి నవలం దీపింపఁ గోపం బెదన్. 15

ఉ. తమ్మునిసొమ్మ కోప కటు తాండవముం బొనరించి మించి శౌ
ర్యమ్మున వానరావలిని రాల్చుచునుండిన రాక్షసేంద్రు దూ
రమ్మునఁ జూచి వాఁడిప్రదరంబులు వానిమెయిన్ నిగిడ్చి రా
రమ్మని హుంకరించుచుఁ బరాక్రమ మేర్పడఁ బిల్చె నాజికిన్. 154

తే. రావణుఁడు మర్మభేదకప్రదరములను
రామచంద్రునిపై నేసి రవళిఁ జూప
నతఁడు వానరవర్యుల నరసి మీరు
జాగరూకులై లక్ష్మణుజాడఁ గనుఁడు. 155

ఉ. ఎవ్వనికారణంబునన యిట్లు సముద్రము గట్టి వత్తుమో
యెవ్వఁడు లోకకంటకత నేర్పడి యుండెనో యెవ్వఁ డిగ్గతిన్
జివ్వ మదీయసోదరునిఁ జేర్పడఁ జేసెనో వాఁడు దా
దవ్వులఁ గాన వచ్చెడిని దానవనాథుఁడు పైచి యుందునే. 156

ఆ. తనదువిషపుఁగోఱ జనులఁ గూల్చినపాము
బిలమునుండి వెలికి వెడలి వచ్చె
కంటఁ బడియెఁ దానిఁ గడదేర్చి వచ్చెదఁ
గపివరేణ్యులార! కనుఁడి మీరు. 157

వ. అని రఘురాముండు రావణుదిక్కు మొగంబై ధనుష్టంకారము
చేయుచు శరంబు సంధించునంతలో రావణుండు వార్షికజలధరంబు
వర్షధారలం బలె రామునిపై శరపరంపరం గురియుచు ముస్లల
ముద్గర కరవాల బిందివాలాదులం బ్రయోగించిన ఘోగీశ్వరుం

డగురాముండు వానినెల్ల నడుమన ఖండించి ప్రళయకాలగర్జా
సదృక్షంబుగ మౌర్వీనాదంబు గావించుచు మేదురంబుగ బాణా
సారంబు బరఁగించె దానంజేసి యసురచక్రవర్తి వర్తింపం జాలక
ఝంఝూవాతంబున మేఘవ్రాతంబు వోలెఁ దూలి లంకాభి
ముఖుండై పఱచి మందోదరిం దరియ నరిగి దానితో ని ట్లనియె.

—♦ రావణుఁడు యుద్ధ మీఁగి లంక కరుగుట ♦—

ఉ. సిగ్గిసుమంత లేనిమతిఁ జెప్పుచునుంటిఁ బయోరుహాననా!
యెగ్గతి నేను రాముని జయింతునొ గాని యెఱుంగ నింత నేఁ
డగ్గికి నెత్తువచ్చి యతఁ డాహవమందు జయించి పుచ్చె నన్
సగ్గ మదీయవీర్య మది చచ్చిరి మిత్రులు పుత్రు లందఱున్. 159

చ. నయవిదుఁడై విభీషణుఁడు నాహిత మెంచి వచించె మున్ను నే
నయమని వాని నెన్నక మహాగ్రహ మెచ్చఁగ వానిఁ దన్నితిన్
భయరహితుండు వాఁడు ననుఁ బాసి చనెం బరు నాశ్రయించె నేఁ
డయయొ దురాసదంబు లరయన్ రఘురాముని బాణజాలముల్.

మ. యమదండంబును వల్లెత్రాడు కులిశం బాశూలిశూలంబు శ
క్తిమహాస్త్రంబును బ్రహ్మదండము సముద్దీప్తామరార్యుగ్రచ
క్రము నాగోటికి జాల వయ్యొ నకటా! కాలప్రభావంబు లో
కములన్ గెల్చిననే నలంతి నరువంకం గూలనై యుంటినో. 161

తే. వేఁడిపిడుగుల నైనను వెలఁదిమిన్న
సైఁప వచ్చును గాని యీజానకీశు
వింటి యందుండి వచ్చినవిశిఖము లవి
సైఁప రానివి చెప్పితి సత్య మనుచు. 162

వ. దేవీ! నే నిపు డేదే నొకయాభిచారికహోమంబు చేసి దేవతానుగ్ర
హంబు వడయఁ బ్రయత్నించుచుంటి నన విని కంట నీరు వెట్టు
కొనుచు మందోదరి మందస్వరంబున ని ట్లనియె. 163

ఉ. చెప్పితి నెన్నియోపరులు చేయఁ దలంపవు మోహబుద్ధి నీ
విప్పుడునే ఋజుత్వమున నేగవు పాపము లైనహోమముల్

తప్పన కాచరింపఁగఁ దలంతువు వింతగ సర్వశూన్యమై
నప్పుడి దేటిచేయుట లయారె భుజాబల మేమి యయ్యెనో. 164

క. సమరమున విజయ మందుట
యమపురి వసియింపఁ జనుట యనునివి రెండే
సమకుఱెడి గాని పెర లెవి
సమకూడ వటంచు నాదుస్వాంతం బనఘా. 165

క. నీకుఁ గలబలఁగ మంతయుఁ
బోకాడెగా నన్ను విడుముపోయెద నెట్లో
శోకం బేమిటి కిం కిట
వాకోఁ గాలమున కేగు పనిఁ జూడు మెదన్. 166

వ. అని వారు సంభాషించుకొనుచుండి రప్పు డక్కడ రామచంద్రుండు
లక్ష్మణుం దరియ వచ్చి దుఃఖించి సుషేణుం గాంచి. 167

—♦ రాముఁడు మూర్ఛితుండైనలక్ష్మణుకడకు వచ్చి వగచుట ♦—

సీ. రావణుశక్తిచేఁ జేవచెడెన్ లక్ష్మ
ణుఁడు నెత్తుటం బ్రుంగి పడియె నిట్లు
వీనిఁ జూచిన నాదుప్రాణముల్ వోయెడు
సంగ్రామ మేరీతి సలుపఁ గలను ?
తమ్ముకుఱ్ఱఁడు వీఁడు తరలిపోయిన నాకుఁ
బ్రాణము లేటికి రాజ్య మేల ?
విల్లమ్ము లివి చేయి విడిచిపోయెడుఁ గంట
నీరు ప్రవాహమై కారుచుండె

తే. అనుచుఁ దనబహిఃప్రాణమై తనరు ననుజు
నరసి చింతయు శోకము నధిక మగుట
నింద్రియస్వాస్థ్య మొకయింత యేని లేని
వాఁడయ్యె నిట్లు పలవించెఁ బోడిమి చెడ. 168

ఆ. దేశదేశములను దెలియవత్తురు పత్ను
లాత్మజులును బంధు లక్కటకట

యన్నదములు గలుగునట్టిదేశ మొకండు
క్షోణియందు నెందుఁ జూడఁ బోము. 169

వ. అని నితాంతచింతాసాగరనిమగ్నమానమానసుండై యున్నరామ
చంద్రునిమే నంటి నిమిరి యోదార్చుచు సుషేణుండు. 170

సీ. లక్షణంబులఁజేసి లక్ష్మణుం డిప్పుడు
మృతుఁడు గాఁ డని చెప్ప మతి యొనర్తుఁ
గాయము కందదు గాజువారదు వికా
రము నొంద దింతయుఁ గ్రమము చెడదు
మోమును పద్మంబునాఁ గోమలమై యుండెఁ
గన్నులు కల్వల గ్లిన్న నయ్యెఁ
బ్రాణవాయువు లోనఁ బరఁగుచు నున్నది
వగవకు మిది మూర్ఛ వనజనాభ

ఆ. గుండె కొట్టుకొనుచు నుండె హనూమంతుఁ
బుచ్చి యోషధులను దెచ్చి వీని
బ్రతుకు న ట్లొనర్ప వలయును మన కిప్పు
డనుఁడు నాంజనేయుఁ డరుగుదెంచె. 171

—♦ సుషేణుఁడు సంజీవనిం దేర హనుమంతుం గోరుట ♦—

వ. సుషేణుండు వానిం దిలకించి నీవు మున్ను జాంబవంతుండు చెప్పిన
చొప్పున హిమవంతంబునకుం జని సంజీవకరణ్యాదిమహౌషధులు
తెచ్చితి విప్పుడును వానిం దెచ్చి మనసౌమిత్రిం బ్రదికించుకొనునవ
సరంబు వచ్చినది గావునం జెప్పెద వినుము. 172

తే. తొంటివలెఁ బోయి నీ వోషధులు గ్రహింప
ననువు పడ దిప్డు గంధర్వు లాదినంబు
మొదలుగాఁ గాచుకొనియుంద్రు కదన మగును
జాగరూకత నోషధుల్ వేగఁ దెమ్ము. 173

తే. వెజ్జు నగుట నీకు వివరించుచుంటిని
వేగక్కుండ మాదు తేఁగ వలయుఁ

ప్రొద్దు పొడిచె నేని పోయివచ్చినకర్జ
మద్ది వ్యర్థ మందు నాంజనేయ. 174

వ. అంత సీతాకాంతుండు హనుమంతుం గాంచి కౌఁగిలించుకొని యి ట్లనియె. 175

శా. నాకుం దమ్ములలోనఁ దమ్ముఁడ వికన్ నాపాలిభాగ్యంబ వో
లోకైకస్తుత నిన్నుఁ బోలుఘను లేలోకంబునన్ లేరు నా
శాకాలంబున సీతవార్త చెవి కత్యానందసంధాయి గా
వాకోనై బ్రదికించినాఁడవు ననుం బ్రత్యక్షదైవంబవై. 176

తే. అపుడు బ్రహ్మాస్త్రబద్ధులై కపులు నేను
లక్ష్మణుండును సొమ్మసిల్లంగ నీవు
పోయి సంజీవనిం దెచ్చి పోయినట్టి
యెల్లవారల ప్రాణము లిచ్చితి కద. 177

ఆ. ఇప్పు డట్టికార్య మే వచ్చెఁ దమ్ముఁడా!
మసల కీవు పోయి మందుఁ దెచ్చి
చచ్చిపోవునట్టి సహజన్ము ప్రాణము
లిచ్చి నాదుప్రాణ మిమ్ము తండ్రి. 178

వ. అనిన నాంజనేయుండు విజృంభించి రామున కభివందనం బాచరించి నే నిదె పోయి వచ్చెద నని ప్రదక్షిణపూర్వకంబుగా నుత్తరాభిముఖుండై మింటిమార్గమ్మునం జనియె నంత నక్కడ రావణుండు మందోదరితోఁ బ్రసంగించుచున్నప్పుడు వేగరులు వచ్చి పక్షికం బునకు నావృత్తాంతం బెఱింగించుటయు నతండు తల్లడిల్లుచు నాయర్ధరాత్రంబునఁ గాలనేమిం బిలువ నంచి యి ట్లనియె. 179

—హనుమంతుని మార్గనిరోధంబు గావింపఁ గాలనేమిం బుచ్చుట—

సీ. సంజీవనిన్ దేర సామీరి యేగెను
దెల్లవారకమున్న తెత్తుననుచు
నేవెంటనైన నీ వేగి ప్రత్యూహము
గావింపు మతనికిఁ జేవఁ గలిగి

ద్రోణగిరికిఁ జెంతఁ ద్రోవలో నొకసరో
వర మగు నందుండు భయదనక్ర
మది పెద్దయేనిక నైన నొక్కింతలోఁ
బట్టి మ్రింగెడు దానిపజ్జ కతని

తే. నంపు మనఁ గాలనేమి యి ట్టనియె ననఘ
న్నాఁడు మారీచునకు నెట్టి గోడు పుట్టె
నేఁడు నాకట్టు పుట్టుట నిజ మటంచు
వెఱపు జనియించె నెంతయుఁ బెచ్చిన దయి. 180

వ. నాఁడు ఖరదూషణాదులం గాక నేఁడు కుంభకర్ణ కుంభ నికుంభాదుల నెందఱనో వారు మ్రందించియున్నవారు సర్వనాశనం బైన యీ లంకాపురంబున రాజ్యం బేలుచుండు నను నాశ విడిచి విరక్తుం డవై సీత రాముని కర్పించి శరణు వేఁడు మట్లు కాదేని తెగి రణంబు గావింపు మింతియ కాని యిట్టియవీర్యకార్యంబు లేమి టికిం జేయ నెంచెద వనిన రావణుండు కుటిలభ్రూకుటియై కటంబు లదరఁ బండ్లు పటపటం గొఱుకుచు ని న్నిదె నాకరవాలంబున కాహుతిం గావింతు నని వాలు వెఱికం గాంచి కాలనేమి నాపై నాగ్రహింపకుము పోయి నీచెప్పినట్లు చేసెద నని నిమేషమాత్రం బున నాంజనేయునికన్న మున్న చని యొక్కకాననంబున. 181

—♦ కాలనేమి మునివేషము వేసికొని హనుమ నాపుట ♦—

సీ. జోడైయె మేనెల్ల బూదిపూతలు పూసి
కొని కుట్టుపోగులు కూడఁ దీసి
కాషాయవస్త్రంబుఁ గట్టి గోచినిఁ బెట్టి
యోగదండంబును నొడిసి పట్టి
చంకను బులితోలు లంకెను దగిలించి
తుంబి చెంబుం జేతఁ దూఁగఁ బట్టి
కకపాల లాతామునకు వ్రేలఁగా గట్టి
పావకోళ్ళం గాళ్ళ పట్టి మెట్టి

తే. తలకుఁ గంఠమునకును జేతులకును రుద్ర
రాక్షపేరులు చుట్టి దోరమ్ముగఁ గుడి
కేలివ్రేళుల జపమాల లోలిఁ దిరుగ
యోగియై కాలనేమి దా నుల్లసిల్లె. 182

వ. ఇట్లు మునివేషంబు ధరించియున్నసమయంబున నాంజనేయుం డా
కాశమార్గమునం బోవుచు నాశ్రమంబు దెస కన్నునిగిడించి చూచి
తనమనంబున. 183

మ. ఇది యేయాశ్రమ మెవ్వరో మునివరుం డీయాశ్రమం బందు ని
ష్ఠ తపంబుం బొనరించునట్టిడగుచున్ సాక్షాత్కృతిం జేయు ని
య్యది ము న్నే నరుదెంచినట్టిపథమం చధ్యాత్మ నూహింప నే
నదటుం గల్గుట దారి తప్పితినో దూరాధ్వంబు పెంజీఁకటిన్. 184

ఉత్సాహము. ఐన వీని నడిగి పోవ నౌ నటంచు క్రిందికిన్
వానరేంద్రుఁ డరుగుదెంచి వానిఁ గాంచి మ్రొక్కి నేఁ
బూని రామకార్యమునకుఁ బోవుచుంటి మారుతిన్
మౌనివర్య ! దారితప్పినాఁడ నంచు నెంచెదన్. 185

ద్విపద. ఈవు రామునిదూత వే నెఱుంగుదును
పావని లక్ష్మణస్వామి దా నిప్డు
జీవము ల్గలఁ డయి శ్రీరాముచెంత
భావ మెలర్పఁగ వర్తించుచుండె. 186

వ. వానికై నీవు వేగిరింప నక్కఱయుండదు స్థిమితచిత్తుండవై యీ
ఫలంబుల భక్షించి జలంబులఁ ద్రావి పొమ్మదె ద్రోణాచలం బనిన
నాంజనేయుం డతనికిఁ బునఃపునః ప్రణామంబు లాచరించుచుఁ దృషి
తుండనై యున్నవాఁడ నా కీకమండలుజలంబులు సరిపడవు సమీ
పంబున సరోవరం బున్నం జెప్పు మనిన నమ్మాయామానుషా
దనుండు. 187

చ. కల దదె సాగరం బనఁగఁ గ్రాలుతటాకము తేటనీటనిం
గలిగి మనోహరంబు లగు కల్వలతో నలరారుచుం గపీ

ద్విలకమ ! నీవు పోయి యటఁ దీయని చల్లని నీరుఁ దాఁవి ర
మ్మలసటఁ దీర్చుకొంచుఁ జన నయ్యెడు నియ్యెడనుండి పావనీ. 188

వ. అని శిష్యునిఁ బిలిచి నీవు పీనికిం జలాశయంబుఁ జూపు మని యంపి
పుచ్చిన నాంజనేయుండు వానితోడం జని జలంబులం డిగి జలపా
నంబు సేయుచున్నంత. 189

ఉ. గ్రాహము వచ్చి గాలిసుతుకాళులఁ బట్టియు నట్టె లోనికిన్
సాహస మేర్పడంగఁ గొని చయ్యనఁ బోయెడున న్నెఱింగి త
ద్గ్రాహముఁ బట్టి చీల్చె నది తత్క్షణమం దొక దేవకన్యయై
దోహ మ దంతయుం దెలిపె దోయరుహానన మింటికేగుచున్. 190

మ. పవమానాత్మభవా ! వచింతు విను మావాచంయమీంద్రుండు ని
క్కువ మా మాని యటంచు నెంచకుము నీకున్ హానిఁ గూర్పంగ దై
త్యవిభుం డంచినకాలనేమి యనుమాయావాది మారీచసం
భవుఁ డీదుష్టుని సంహరించి చను మీమార్గంబె ద్రోణాద్రికిన్,

తే. అనుఁడు నాశ్చర్య భరితుఁడై యాంజనేయుఁ
డీ విచిత్రుఁ గోర్కెసలివయి యేటి కుంటి
వేటి కీరూపు నీ కయ్యె నెఱుఁగఁ జెప్పు
మనిన నాదేవవనిత యి ట్లనియె మఱియు. 192

సీ. ధాన్యమా ి యనఁ దనరినదాన నే
స్సరసలయందు నైనఁ దాన
నాలాస్యమునకు ము న్నటరాజు మెచ్చి నా
కిచ్చె విమానము నిచ్చఁ జేసి
యది యెక్కి జగముల నరయుచు నిట వచ్చి
జలము లాడుచు నుండుసమయమందు
శాండిల్యుఁ డనుముని చనుదెంచి ననుఁ గాంచి
మదనవ్యథాతప్తహృదయుఁ డగుచు

తే. నన్నుఁ గోరిన గా దని నను విడు మని
నే రజస్వల నాల్గాళ్లపై రమింత్రు

ననిన నా నన మానియాజ్ఞను ధరించి
గంధమాదనమున కేను గదలి పోతి. 193

శా. ఆలో రావణుఁ డేగుదెంచి నను నాయద్రిం బ్రతీక్షించి నా
కేళిం గోరి బలాత్కరించి కలిసెఁ గ్షిప్ర చట్టికాలంబునన్
బాలుం డుద్భవ మయ్యె నయ్యెడ జగత్ప్రఖ్యాతకాయుండు శౌ
ర్యాలంకారవిభూషణాఖ్యుఁ డతికాయాఖ్యుండు ప్రఖ్యాతికై. 194

వ. అంత వానిం గొంచు దశగ్రీవుండు నిర్గమించె నేనును జతుర్థదివ
సంబున గృతస్నాతనై విమానం బెక్కి శాండిల్యుం డున్నకడకుం
బోయిన నతండు న న్నెఱింగి నీవు నన్ను వంచించి యొరు వరించితివి
గావున గ్రాహంబవై యీసరోవరంబున నుండు మని శపించి నా
ప్రార్థనంబునం జేసి కరుణార్ద్రభావుండై రామకార్యార్థియై వచ్చిన
వాయుపుత్రునికారణంబున శాపవిముక్తిం గాంతు వని యను
గ్రహించె నీప్రసాదంబున నేను గృతార్థ నైతిఁ బోయి వచ్చెద నని
నభోమార్గంబున నిర్గమించె నంత హనూమంతుండును. 195

## హనుమంతుఁడు కాలనేమిన్ సంహరించుట

ఉత్సా. కాలనేమికడకు రాఁగఁ గాంచి వాఁడు మారుతిన్
గాల మయ్యె జాల మింతకాల మాలసింపఁ గా
నేల వచ్చె నిచ్చ వచ్చె నిత్తు నీకు మంత్రి మేఁ
బోలు నీకుఁ గొనఁగఁ దానఁ బొంద నౌ శుభంబులన్. 196

వ. శిష్యుండవై గురుదక్షిణ యిట్టు మనిన నాంజనేయుండు. 197

శా. ఘోరాకారము దాల్చి కో మ్మదిగో యోకూరాత్మ సద్దక్షిణన్
బారం బందెదు దీన నంచు సుదృఢాబద్ధంబు ముష్ట్యస్త్రమున్
వీరాగ్రేసరుఁడై నిశాటునితలన్ వే వ్రేసె నావ్రేటునన్
శూరత్వంబున నొప్పునాతఁడు మృగేంద్రుండై గజేంద్రున్ వడిన్.

క. కైకొని మ్రింగఁగ నేంచెడు
రాక్షసిఁ గాంచి హనుమ శౌ రమ్ము నినున్

పీఁక మెయిఁ గాలుపోర్లిలికి
నీకాలమునందు పుత్త్రు నీశిష్యులతోఁన్. 199

ఆ. అనుచు వానిశిరమునందు వజ్రమునకు
నెత్తువచ్చుముష్టి నెత్తి పొడిచె
నంతవాఁడు మాయ మగుచు సుగ్రీవుని
కరణి వచ్చి హనుమ నరసి యనియె. 200

—♦ మాయాసుగ్రీవుఁ డాంజనేయుని వారించుట ♦—

మ. హనుమా! లక్ష్మణమూర్తి మూర్ఛవిడి సౌఖ్యంబుండె నీకోషధుల్
గొని తే నక్కఱలేదు ర మ్మనుచు నాకోదండరాముండు న
న్ననిచెన్ నీకు వచింప నీ విట వృథాయాసంబు పొందం బ్రయో
జన మొక్కింతయు లేదు పోదము మహాసంగ్రామ మి ద్దయ్యెడున్.

వ. అనిన నాంజనేయుండు. 202

ఆ. ఇంచుకంత సంశయించి సుగ్రీవుఁడు
కాఁడు మాయలాఁడు వీఁ డటంచు
ముష్టిఘాతములను బొట్టయుం దలయును
బగుల నేయ వాఁడు పడియెఁ బుడమి. 203

ఉ. ముక్కుల నోట నెత్తురులు పూరములై పడఁ గ్రక్కుకొంచు నా
రక్కసి ప్రాణము ల్విడిచె రాక్షసశిష్యులు పాఱి పోయి రే
దిక్కును లేనివా రగుచు దేవురులాడుచు నాంజనేయుఁడున్
చక్కని మార్గముఁ దెలిసి చయ్యన నేగె నభంబు వెంబడిన్. 204

వ. ఇంతలో ద్రోణాద్రికిం జని తొంటియ ట్లోషధులం గాన కమ్మహీ
ధరశిఖరంబు పెఱికి నెత్తిం బెట్టికొనివచ్చుచున్న సమయంబునఁ జిత్ర
సేనాదు లైనత్రయోదశకోటిసంఖ్యాకగంధర్వులు పరశు పట్టస
ముసల ముద్గరాదిసాధనంబుల హనుమంతుం జుట్టుముట్టి. 205

ఉ. దొంగవు మున్ను మే మిచటఁ దోఁపనియప్పుడు వచ్చి యోషధుల్
సంగడిఁ గాఁగఁ గైకొనుచు సాఁగితి విప్పుడు సాఁగ దట్లు నీ
సంగతి మేము చూచెదము సారశిలీముఖశస్త్రవహ్ని నీ
యంగము కాలి బూది యగు నట్లు పొనర్చెద మోయి వానరా.

♦ హనుమంతుఁడు చిత్రసేనాదుల నోడించి ద్రోణాద్రిం బెల్లగించుట ♦

మ. అని యమ్మారుతి నడ్డగించుటయు నాహాంవీరుఁ డోరోరి రం
డని వాలంబునఁ జుట్టి కొట్టియును బాదాఘాతంబులం జేసియున్
ఘనబాహార్గళపాశముల్ సలిపియున్ గాళ్ళన్ వడిన్ మట్టియున్
దనుముం దైనసుపర్వయోనులను డిందం జేసె నొక్కింతలోన్.

వ. వారును వెఱచి వానికిం దెఱు విచ్చి తారు యథాయథలై చని రంతలో హనూమంతుండు గగనమార్గంబున నందిగ్రామంబు మీఁదుగా నఱుగుదెంచుచుండె నాసమయంబున. 208

—♦ నందిగ్రామంబుననున్న భరతుఁడాంజనేయుం జూచుట ♦—

చ. భరతుఁడు నాఁటిరేయిఁ గడువందురి వందురి రామలక్ష్మణుల్
ధరణిజయున్ సుఖంబునకుఁ దక్కి మహాపదనొందుచున్నయ
ట్లరుదుగ స్వప్నముం గని మహావ్యథలై నిదురం త్యజించి పు
ష్కరము జూచుచున్ నిలిచె గన్నులఁ గన్నఁ గార నస్రువుల్.

మ. ఉదితార్కుం డనఁ గాంతు లెల్లెడల సంయుక్తంబులై పర్వ ను
ర్విదరిం బోయెడు నాంజనేయు నెదుటన్ వీక్షించి రామానుజం
డెదలో నియ్యది భూతమో యనఁగ నేగు న్నభోవీథి దీ
నిదెసం గొండొకకీడు నేఁ దలఁచెదన్ జెండాడెదన్ దీనినిన్. 210

మ. భరతున్ గంధవహాత్మజుండు ధరపై వర్తించుటం గాంచి యీ
పురుషుం డారఘురాము నట్లు మదికిం బోలంగ వచ్చెన్ రణాం
తరమందున్ భరతానుజుం డిలుగుటం దా దుఃఖభారంబునన్
గరితన్ సీతనుఁ బెట్టి వచ్చెనొకొ నాకర్మం బ దెట్టున్నదో. 211

తే. అరసి చూచి యితండు రామాకృతి గల
పురుషుఁ డొం డొక్కరుఁడు ధర్మమూర్తి సత్య
ధనుఁడు శ్రీరామునట్టి దేతన్నికృష్ట
కార్యమును జేయనుండునే కాని మాట. 212

వ. వాచిత్తంబు ప్రమాదాయత్తం బైన దని తలంచుచున్నసమయంబున. 213

క. భరతుఁడు విల్లంబుల్ గొని
శర మరి వోయంగ నున్న సమయమునందున్
సురవర్త్మమ్మునయం దీ
పురుషుఁడు మీకాత్మబంధువులలో వాఁడే. 214

ఆ. వలవ దుడుగు శరము వదలకు మనె నంత
భరతుఁ డమ్మ విల్లు పట్టు విడిచి
కన్నుదోయి కచటఁ గానవచ్చెడు నంత
వటుకుఁ జూచుచుండె కరము మోడ్చి. 214

—♦ హనుమ దారిలో మాల్యవంతునితోఁ బోరి చంపుట ♦—

దండకము. వాతాత్మజుం డంత వాతాతివేగంబుతో వార్ధిఁ జేరంగఁ బో
నంతలో మాల్యవంతుం డనంతాతిశౌర్యుల్ మహాధైర్యధుర్యుల్
సమస్తాయుధోపేతు లౌరక్కసుల్ పెక్కువేల్ తన్నుఁ గూడంగ
నీరాశిమధ్యంబునన్ మూఁగి పోనీక పోరాడఁగా నుండినన్ గొం
డతో నుండునవ్వాన రేంద్రుండు లో మేఘజాలంబొ కో
యంచు మున్మున్ను శంకించియున్ సింహనాదంబులున్ జ్యాని
నాదంబులున్ శస్త్రసంపాతము ల్గాంచి నక్తంచరుల్ దన్నుమా
ర్కొఁగ నై రంచుఁ దా నెంచి యున్నంత వా రెంతయే పాత
మొప్పన్ గదాఘాతముల్ బాణవిన్యాసముల్ పాశచక్రప్రయో
గంబులుం జేసి నొప్పింప నప్పావకాభుండు నాజ్యాహుతిన్ వర్ధ
మానుండు వైశ్వానరుండో యనన్ మండి మెం డైనసత్వంబునన్
దండి కెక్కంగనై కల్పమం దబ్ధిలో నాడునయ్యాదిమీనంబునుం
బోలి గానంగనై లేళ్ళపైఁ బాఱుహర్యక్షముం బోలి లీలన్ సమీ
రాత్మజుం డెల్లరక్షోబలంబున్ గలంగన్ జలం బేర్పడం జేయుచున్
వాలపాశంబునం జుట్టి బిట్టేపునం ద్రిప్పి వారాశిలో వైచుచుం
బాదయుగ్మంబునం దన్ని ప్రాణంబులం దీయుచుం బార్శ్వముం
దాఁకి వీకం బడం జేయుచున్ జానుఘాతంబులం జంపుచు న్నొంచ
సైన్యంబు దైన్యంబు నొందంగనై నంత నమ్మాల్యవంతుం డటన్.

మ. ఉదయాదిత్యనిభాతి దీధితులు హర్యాందంగఁ గావించుచున్
పదునుం బెట్టిసవేఁడి వాఁడి శరముల్ వాతాత్మజోరస్సుపైఁ
జిదురన్ వ్రేసిన వాలచాలనములం జెండాడె నయ్యన్నిటిన్
విదితౌజుం డగునాంజనేయుఁడు జగద్విఖ్యాతశౌర్యోద్ధతిన్. 217

మత్త. మాల్యవంతునిశీర్షముం బవమానసూనుఁడు తన్నిసా
కల్యమేర్పడ వానివింటిని ఖండఖండములై పడన్
దుల్యవిక్రము వానివక్షము దోర్బలంబున నేయుఁడుర్
గుల్యఁబోలె స్రవించె నచ్చటఁ గ్రొత్తనెత్తురు మొత్తమై. 218

ఆ. వాఁడు హనుమఫాలభాగముపై శూల
మునను బొడిచె బిట్టుపోడమ నెత్రు
హనుమ దానిఁ బట్టియవలీల నరకాల
విఱిచె నదిమి పట్టి పెటిలు మనఁగ. 219

సీ. గద దానవుఁడు వైవ గాలిపట్టి పదంబు
లను దాని విదళించి దునిమి వైచె
నవశక్తి దనుజుండు నవయ నేయఁగ హన్మ
కడకాలదానిని గండరించెఁ
గఱివాలమున వాఁడు కసలి హనుమవక్ష
మున నేయ నది గూలె ముక్కలగుచు
వాలపాశంబున వానికంఠముఁ జుట్టి
గాలికొడుకు వాని లీలఁ ద్రిప్పి

తే. వైనతేయుఁడు భుజగము వైచునట్లు
వారినిధిమధ్యమునయందు వాని వైచె
ముక్తకేశాంబరుం డయి ప్రొలుపు దప్పి
కూలి వాఁ డేగె వేగఁ బాతాళమునకు. 220

ఆ. మాల్యవంతు నట్లు మడియించి హనుమంతుఁ
డంబరంబుదారి నరిగె శిఖరి
శిరమునందుఁ బూని సురుచిరౌషధదీప్త
తెల్లకడలు నింపి వెల్లివిఱియ. 221

—♦రాముఁడు తృణజ్యోతులవెల్గుచూచి భీతిల్లుట♦—

చ. గగనమునందు వెల్గు లవి కంటికిఁ దోఁప రఘూద్వహుండు రా
త్రి గడచెఁ దెల్లవాఱు నటు తెల్లమ యయ్యెను దూర్పుకొండవై
మొగుళను దాఁటె వచ్చెడిని మ్రొక్కులదేవర లక్ష్మణుం డిఁకన్
దెగియెడి నంచు నెంచి యతనిం గని బెంగ వచించు నిగ్గతిన్. 222

తే. పంచుకొని నెత్రు పుట్టితి మెంచ నీవు
నేను నీ విట్లు పోయిన నేను మాత్ర
మెట్లు జీవించి యుందునో యెఱుఁగఁ జాల
నేను వత్తును నీతోడ నిలుము కొంత. 223

తే. నాబహిఃప్రాణమై యెప్డు నాదుకన్ను
సన్నల మెలంగుచు న్నాకు నన్నిపనులు
దీర్చు చుండెడి వాఁడ వేదెసను గాని
యిప్పు డిట్లైన నాకు ది క్కెవరు చెపుమ. 224

చ. తెలతెల వోయెఁ దూర్పుదెస దీనత నొందెను జిమ్మచీఁకటుల్
వెలవెలఁ బోయె దీపములు విన్ననఁ దారలు చెన్ను దప్పెఁ బు
ల్గులు రొదసేయుచున్ విడుచుఁ గూళ్ళను గో ళ్లవి కూయు వేవెలుం
గులదొర తొంగి చూచు నిదిగో ననుజన్మనివంక నిత్తతిన్. 225

క. నేను బ్రియూణం బయ్యెద
వానరపతి నీవు సర్వవనచరతతితో
నీనగరి కేగి సుఖివై
సానందము గాఁగ మనుము సతతశ్రీలన్. 226

క. నిజవంశీయుఁడు రాఘవుఁ
డజపౌత్రుం డనుచుఁ గరుణ నరయుచు నన్నున్
స్వజనంబు గాఁగ నెమ్మది
నజస్రము దలంచుచుండు మా కపినాథా. 227

—♦ సుగ్రీవుఁడు తెల్లవారుట కాదని రామునకుఁ జెప్పుట ♦—

వ. అనిన సుగ్రీవుండు రామదేవున కి ట్లనియె. 228

ఉ. చుక్కలు చెప్పుచున్న యవి శుక్రుఁడు తూరుపుకొండ ప్రక్కనే
నక్కె నసూరుఁ డశ్వముల నైపుణిఁ జూపఁగ నెక్కఁ డానొగల్
చుక్కలతేఁడు మాయఁ డదె చూడుము గూఁబపులుంగు తిండికై
దిక్కుల సంచరించెడి నిదే యొకహోరకుఁ బ్రాహ్ణ మయ్యెడిన్.

క. వెలు గరయ వచ్చుచుండుట
దెలియుము ద్రోణాచలౌషధిద్యోతు లగున్
బలవంతుఁడు హనుమంతుఁడు
బలుకొండం గొనుచువచ్చుపథ మిది దేవా. 230

ఆ. అంతలో సుషేణుఁ డరుదెంచి రాఘవా
వాయుపుత్రుఁ డదిగొ వాయువేగ
మునను గొండ నెత్తిఁ గొని వచ్చుచుండెను
బలికి కొనుచు "రామ పాహి" యనుచు. 231

మ. అనుమాటల్ వినఁ బోక రాఘవుఁడు మోహావేశముం గాంచి పో
ల్చెను మార్తాండుఁ డటంచు వానిపయికిం జేరంగ రౌద్రాస్త్రమున్
గొని యేయం గమకించె భూతతతి సంక్షోభించె నప్పట్టునం
జని సుగ్రీవముఖప్లవంగవరు లశ్రాంతంబు శాంతింపఁగన్. 232

క. పలుకుచు రౌద్రాస్త్ర మ్మిది
వెలలించిన లోకమెల్ల వేఁగి నశించున్
దెలియుము సూర్యుఁడు గాఁ డదె
బలయుతుఁ డగువాయుసుతుఁడు వచ్చెడి నిదిగో. 233

తే. అంతలో సూర్యబింబ మయ్యావనికిఁ దిగి
వచ్చుచున్న నద్రితో వాయుసుతుఁడు
రామచంద్రునిసన్నిధి వ్రాలి ద్రోణ
గిరి నచట డించి రాముని కెఱఁగె భక్తి. 234

## ఆంజనేయుఁ డోషధిపర్వతముం దెచ్చుట

వ. అంత సుషేణుం డాపర్వతమునం గలయోషధుల రసంబుఁ దీసి
లక్ష్మణునిముక్కులం బోసె నంతలో నతండు ప్రాణవంతుం డై

సుప్తోత్థితుండు వలె లేచి రామునిపాదారవిందంబుల కభివందనం
బాచరించిన నతం డతని నక్కునం జేర్చుకొని మూర్ధాఘ్రాణంబు
సేయుచు ని ట్లనియె. 235

క. తమ్ముఁడ మఱియు న్నిను నే
నిమ్మెయిఁ జూడంగఁ గంటి నీమారుతి తే
జమ్మున ధన్యుఁడ నైతిన్
ముమ్మాటికిఁ జెప్పుచుంటిఁ బుట్టితి మరలన్. 236

వ. అని యాంజనేయు నభినందించుచు. 237

క. తమ్మునిప్రాణము నాప్రా
ణమ్మట్టు లొసంగిమా కనంతోపకృతిన్
సమ్మతిఁ జేసిననీఋణ
మెమ్మెయి నేఁ దీర్చుకొందు నిద్ధచరిత్రా. 238

వ. అని మఱియు నీ వీపర్వతం బెప్పటి యట్ల పెట్టి ర మ్మనిన నతం
డౌఁ గాత మని దాని నౌదలం గొని తారాపథంబునకుఁ జనె
నప్పుడు రావణుం డావృత్తాంతంబు విని వాయుపుత్త్రున కవరో
ధంబుఁ గావింప స్థూలజంఘ మహానాద మహాదంష్ట్ర మహోర
స్కోల్కాముఖమహావీర్యప్రభృతు లగు పెక్కండ్ర నక్తంచరుల
నియోగించిన వారు నానావిధప్రహరణపాణులు నానావరూథినీ
సహస్రసమంచితులు నై ప్రభంజనసుతున కడ్డుపడి హుంకారంబు
లినుమడింప నార్చుచుం బేర్చి తాఁకి గదాముసలతోమరాదిసాధ
నంబులం బ్రహరించిన నతండు తనవాలం బాభీలంబుగఁ బెంచిన
నదియు. 239

—♦హనుమంతుఁడు స్థూలజంఘాదులఁ జంపుట♦—

సీ. కాలదండం బయి కడతేర్చెఁ గొందఱఁ
గాలుసేతులు విఱుగంగ వైచి
ప్రళయకాలానలజ్వాలనై కొందఱ
బసుమంబు గావించి వార్ధిఁ గలిపె

మృత్యుదేవతనాల్క కెత్తయి కొంఱలు
నాఁకి వైచెను బేరు లేక యుండ
సంవర్తసమయజంఝూనిలమై కొంద
ఱను నెట్టె నస్త్రాద్రి వెనుకఁ బడఁగఁ
తే. బిడుగువలెనయి కొందఱ బిట్టు మొత్తెఁ
గాలసర్పమై కొందఱఁ గఱచి వైచె
వల్లెత్రాడయి కొందఱఁ బట్టి కట్టె
నట్టిమెడ శూన్యముగఁ జేసె నసురబలము. 140

వ. ఇట్లు విజయంబు గాంచి హనుమంతుం డెప్పటియట్ల పర్వతంబు బెట్టి వచ్చె నంత రావణుండు దనప్రయత్నంబు లన్నియు విఫలంబు లగుటం జేసి విగతమనోరథుం డయి తల్లడిల్లి ధైర్యస్థైర్యంబులు వెచ్చఁబెట్టి దైన్యంబు మోమున దాండవింప మంత్రతంత్రవిధిజ్ఞుం డగుదైత్యగురుం జేరి నమస్కరించి యి ట్లనియె. 241

చ. రఘుకులసింధుసోముఁ డగురాముఁడు భూరికపీంద్రసేనతో
మఘవునిశత్రుమో యనఁగ మండుచు వచ్చి సమస్తసైన్యమున్
బ్రఘణము మట్టికుండబలె బ్రద్దలు చేసెను నాపరాక్రమం
బఘముల కయ్యె నే మని మహాత్ములకున్ వచియింతు నిత్తఱిన్.

క. బ్రదికెడు తెఱఁ గుండినచో
నెద సంతస మంద నాకు నెఱిఁగింపుఁడు లే
నిద యగునే నిప్పుడ నే
నదమదమై పోవువాఁడ సంయమిచంద్రా. 243

—♦ రావణుఁడు పాతాళగుహం జేరుట ♦—

సీ. అనిన గురుం డను నల్లుల పలికెదు
పగఱ సాధించునుపాయ మొండు
కలదు చెప్పెద విను ఘనగుహాంతరమున
సలుపంగ నగుహోమ మలరు నొకఁడు

నిర్విఘ్నముగ నది నెఱవేఱునే నందు
శరచాపఖడ్గముల్ స్యందనంబు
కవచకుండలములు గలుగు నసాధ్యము
లరి జయంబున కవి యనువు పడును

తే. నీవు పాతాళ గుహలోన నీ విధమున
నొఱుఁ దెలుఁగకుండ హోమము నొనరుపు మని
యంపి పుచ్చిన రావణుఁ డపుడ లేచి
కదలి చనుదెంచి పాతాళగహ్వరమున. 244

వ. ప్రవేశంబు గావించి గంధాక్షతాలంకృతం బైనవేదియం దగ్నిం బ్రతిష్ఠించి భల్లాతకాదిసమిధలు సర్షపాదులు గుగ్గులు ప్రభృతి ధూపద్రవ్యంబులు దధిమధుఘృతరుధిరమాంసాశనంబులును గాక గృధ్రకంకమకరమేషమహిషాదిపశుసమూహంబును లోనగు సంభారంబులునంతరించి హోమవిధిం బేర్చుచున్నంత నాహోమధూమంబు నింగికి నిష్క్రమించుటం గాంచి విభీషణుండు రామునకి ట్లనియె. 245

లయవిభాతి. నిను సమరమందుఁ గనుగొని నిలుప లేక మన
మున బెగడి రావణుఁడు తనగురువు మాటన్
గొని పుడమిలోన నగుఘనగుహను హోమమును
బొనరుచుచు నుండె నది కొనవఱకు విఘ్నం
బునఁ బొరయకున్న నని ఘనకులిశచక్రధరు
లును నతనితో రణముఁ బొసరుపఁగ లేరం
దున నటకు దాని నుడుపను బనుపు మెల్లకపు
లను హనుమదాంగదుల మునుగలుగు వారిన్. 246

—♦ రాముఁడు హోమవిఘ్నంబుగావింపనంగదాదులంబుచ్చుట ♦—

వ. అనిన రామచంద్రుండు హనుమదంగదజాంబవదాదులం బిలిచి కార్యం బెఱింగించిన వారు వానరబలసమేతులై సింహనాదములు సెలంగ లంకాపురంబు సొచ్చి. 247

సీ. ఎదురైనవారల నెల్లఁ బట్టి వధించి
గుడులు గోపురములు గూలఁ ద్రోచి
ప్రాకారతోరణపరిఘాదులం ద్రెంచి
ప్రాసాదముల నెల్లఁ బడఁగఁ జేసి
స్యందనాశ్వగజాదిశాలలు రగులించి
పురవీథులన్నియు నురుము చేసి
యాయుధాగారము లగ్నిహోత్రున కిచ్చి
ధనధాన్యతతు లెల్ల ధరణిఁ జల్లి
తే. రావణుం డేడి తెం డని రాక్షసులను
బట్టి వేధించి బాధించి పడఁతు లేడ్వ
దైత్యవీరులఁ బడఁ ద్రొబ్బి తన్ని యెవ్వొ
చేసి రవ్వీటఁ వానరశ్రేష్ఠు లపుడు. 248

తే. వానరులభీతి రాక్షసుల్ పాఱి సందు
గొందులం దూఱి రార్చుచు నందుఁ గలుఁగు
వార లీరీతినుండఁగా దారి సరమ
తారసించె విభీషణుధర్మపత్ని. 249

క. అడిగెయాలంబుల నక్కనఁ
బడునద్ది విభీషణుండు వసియించుగృహం
బొడికఁ దెలిపెడునాయమ
యడరెడు నాతనివెలంది యని యెఱిఁగి రొగిన్. 250

క. ఆయమకు మ్రొక్కి వానరు
లాయెడ నని హస్తసంజ్ఞ యుజనస్థలముకె
బోయుని కూర్మిం దెలుపఁగ
వాయుజముఖు లామె కెఱిఁగి పఱచి రచోటికిన్. 251

—♦ అంగదాదులు పాతాళగృహంబుఁ జొచ్చుట ♦—

ఉ. అంగదుఁ డగ్నిహోమఋషునం దగుగ్రావము వెల్లగించి లో
నం గలరావణుం గని ఘనంబుగ హోమమునేయుపద్ధతుల్

ముంగలఁ జూచి వానరుల లోనికి రండని పిల్చి వారితో
డం గుహ నున్నరావణుని డగ్గఱి బిగ్గరగాఁగ నార్చుచున్. 252

తే. అంతఁ గొందఱు హోమాగ్నియందు రావ
ణునకుఁ దోడ్పడువారు నాఘునఖరోష్ట్రి
మహిషమృగశీర్షములు మద్యమాంసములును
వేల్చి రెన్నొ స్వాహాకృతుల్ పెచ్చు పెఱుఁగ. 253

వ. మఱియు గదాసికుంతాదులును స్రుక్స్రువంబులును నాజ్యాదిపాత్రములును లోనగునానావస్తుసముదయంబు లగ్నిముఖంబునం బడవైచి యట్టహాసంబులు సేయుచు నార్చుచు నల్లకల్లోలంబు గావించుచు నడ్డవచ్చినవారి నడ్డంబుగం బట్టి విఱిచి వషట్కారంబులు గావించుచున్న సమయంబున. 254

క. రావణుఁ డంతయుఁ జూచుచు
నేవిధమునఁ జేయరామి నెంతయు భీతిన్.
పావకుని విడిచి యవలకుఁ
బోవఁగ రామిం గలంగి పొడ నఱి యుండెన్. 255

ఉ. నవ్విధిఁ ద్రుళ్లినక్ మఱియు నాలుఁగుమూలలు పెల్లగించినన్
గ్రొవ్వులు మాంసముల్ రుధిరకోశములుక్ మలవస్తుసంతతుల్
నివ్వటిలంగఁ జల్లుచును నింగియు నేలయు నిండ నార్చుచున్
నెవ్వగఁ మీఱ సల్పినను నేమము తప్పఁడు రావణుం డటన్. 256

మత్త. ఎవ్వ రెవ్విధిఁ జేసినం గను చేమియుం బొనరింపఁ డే
నొవ్వు నొంద కమర్షదృష్టిఁ గనుంగొనం గ్రియ వీడి పో
నవ్విరోధి పొనర్పకుండుట లంగదుండు నెఱుంగనై
యెవ్వగం బొనరింతు మంచు నొకింత చింత పొనర్చుచున్. 257

—♦ అంగదుఁడు మందోదరిని రావణు నెదుట పరాభవించుట ♦—

వ. మగఁడు చూచుచుండ మగువ నొరుఁ డంటి పరాభవించుట కోపకారణంబు కాకుండ దనియుఁ దానం జేసి రావణుండు కోపంబున నియమంబు విడిచి వచ్చు ననియు నిశ్చయించి యంతిపురినుండి

మందోదరి కొప్పుపట్టి తిగిచి రావణునిముందర కీడ్చుకొని వచ్చి
యుచ్చైస్స్వరంబున ని ట్లనియె. 258

మ. ఒరుఁ డెవ్వాఁడును లేనియ ప్డొక తెయై యుండంగ సీతాయుఁ ద
స్కరవృత్తిం గొనివచ్చినాఁడ విట కోక్రవ్యాద! నీముందటన్
బురుషుల్ స్త్రీలును జూచుచుండ నిదె నీప్రాఁబోడినిన్ గొప్పు వ
ట్టి రహిం దెచ్చితి నీడ్చికొంచుఁ గనుగొంటే రాక్షసాధీశ్వరా. 259

క. మానసము నీకు లేదా
మానిని నీరీతిఁ బట్టి మగవాఁ డెదుటన్
గానంగ వచ్చుచుండఁగఁ
గానని య ట్లుంట పురుష కారమె చెపుమా. 260

వ. అనుచున్నంతఁ గన్నీరు మున్నీరై పాఱ గోఘుగోడున నేడ్చుచు
మందోదరి రావణు దెసం గాంచి. 261

—♦ మందోదరి దుఃఖించుచుఁ బతిం జెందనాడుట ♦—

చ. ఘనులగునింద్రముఖ్యులు నికారము లేక మహేశుఁ గా ననున్
మనమున నెంచుచుఁ గొలిచి మన్ననలం బచరింతు రట్టి నే
వనచరుఁ డొక్కరుం డిటులు పట్టి సభాస్థలి నీడ్చుచుండఁగాఁ
గని మగఁ డైనవాఁ డురక కట్టె తెఱంగున నిట్టు లుంటనే. 262

క. స్థాయత్తేజము శౌర్యము
పోయెను నాకొడుకుతోడఁ బోరుల నింకన్
మాయలు మారణహోమము
లీయెడ శరణంబు లయ్యె నే మందు నయో. 263

క. నీపౌరుషంబు కాలిన
రూపంబును బొందె నింక రోషము విడి నీ
వీపాటి "పాహి" యనుచున్
శ్రీపతి శరణంబు వేడి శ్రేయముఁ గొనుమా. 264

వ. అనిన విని దశగ్రీవుండు సహసముత్పాటనామర్షితహర్యక్షంబు చం
దంబున మ్రండిపడి కుటిల భ్రూకుటిగ్రాయె కటంబు లదర లేచి కర

వాలం బంకించుచు నంగదుభుజాంతరంబున బిట్టేసి జీవితేశ్వరి విడి
పించిన నామె కేశపాశంబు వీడి పాదంబులం బడ విగళితచేలాం
చలయై గజగజ వడంకుచుఁ బరిచారికలపరిచయంబున నేమియుం
బలుక కంతిపురికిం జనియె నంత. 265

—♦ రావణుఁడు హోమవిధి విడిచి వానరుల నోడించుట ♦—

తే. అంగదుఁడు కరవాలప్రహారమునను
సోలి నేలకు వ్రాలె నవ్వేళ వాయు
పుత్రుఁ డశనిఁ బోలినదృఢముష్టిఁ బొడిచె
రావణునిమస్తకంబులు చేవ చెడఁగ. 266

ఉ. అంతటిలోన నంగదుఁ డహంయువు సొమ్మ విడంగ లేచి మే
నంతయు రక్తసిక్తమయినట్లు కనంబడి రావణాసురుఁ
బంతము మీఱ హస్తతలపాతమునన్ విదళించె నంతలో
నింతఁగఁ దూలి పఙ్క్తిముఖుఁ డేచి గదం బ్రహరించె నంగదున్.

తే. అలుకఁ ఘనచెంతకుం జేర నైనహనుమ
ఘనభుజాంతరమునయందు ఖడ్గధార
దాఁకగా నేసె నెంతయు దర్పమునను
దాన నాతఁ డోకించుక తరల నయ్యె. 268

సీ. ముసలమున నీలుపస యడంగించెను
బరిఘంబున నలుఁ బరిభవించె
నంకుశంబున గజు నట్టిట్టుపడఁ జేసె
శక్తిచే శతబలిఁ జదియ నేసె
ముద్గరంబున మైందు ముష్టిటి యడఁగించెఁ
దోమరంబున ద్వివిదుని నడంచె
గద గవాక్షుని మొత్తె గంధమాదను గుంత
మున సోలి పడ నేసె మొనసి మఱియుఁ

తే. దక్షిణం గలవారలఁ దక్షిణాయు
ధముల నో నేసె రావణుం డమితశక్తి

వానరులు ముష్టితలఘాత పార్ష్ణిఘాత
ములను సురవైరి నొప్పించి రలఘుశక్తి. 269

వ. ఇట్లుచేసి హనుమదంగదాదులు కృతకృత్యులై గుహాగేహంబు వెలువడి రామచంద్రునిపాలికిం జని పాతాళహోమంబు పరిసమాప్తి గాకుండ నంతరాయంబు నొందుట నెఱింగించిన నతం డంగదాదులచేఁతలకు మెచ్చె నట రావణుండును మందోదరి మందిరంబునకుం జని సాంత్వనపూర్వకముగా ని ట్లనియె. 270

మ. అతివా ముందల బట్టి యీడ్చి ఖలుఁడం చారాటముం బొంద కే
నతినిష్ఠన్ జప మాచరించుచును హోమాగారమం దుంఁడుటన్
గత మి ట్లయ్యెను దీన నిట్లు వగవం గాఁ బోకు మాదుర్మతిన్
వితతాయోధనమందుఁ దున్మెదను నీవేండ్రంబు చల్లారఁగన్.

తే. ఈవుఁ జెప్పినరీతి నోయిందువదన
తపము జపమును హోమముల్ దర్పణములు
వృథలు నాబాహుబలమునఁ బెనఁగి రామ
లక్ష్మణులఁ గూల్తు నంచుఁ దలంపు మీవు. 272

—♦ మందోదరి రావణు మందలించుట ♦—

వ. అనిన మందోదరి మందస్వరంబున ని ట్లనియె. 273

చ. పలుకులు వేయునేమిటికిఁ బ్రాణవిభూ విను మొక్కమాట నేఁ
బలికెద రామచంద్రుఁ డనువాఁ డొకమానవమాత్రుఁ డంచు నీ
తలఁ పగు నేమొ కా దటులు దానవదైత్యసమూహమృత్యువై
వెలసిన దేవదేవుఁడు త్రివిక్రముఁ డంచు మదిం దలంపుమా. 274

క. ధర్మగ్లాని ఘసంగిన
ఘర్మము గనిపట్టి దనుజమర్దనుఁ డవనిన్
గర్మమున కనువుపడియెడు
ధర్మమ్మున నవతరించు దానవనాథా. 275

సీ. చేఁపయై శ్రుతిచోరు నేపుమాపెను వార్ధిఁ
గూర్మమై మందరకుధర మెత్తెఁ

గిటియై హిరణాక్షుఁ గీటడఁచె నృసింహుఁ
డై హిరణ్యకశిపు నాహరించె
వడుఁగై బలీంద్రుని వసుధ మూఁడడుగుల
నడిగి బ్రహ్మాండము లాక్రమించె
భార్గవరాముఁడై పార్థివులం బట్టి
ముయ్యేడుమాఱులు పొలియఁ జేసె

తే. రాఘవుం డయి యిప్పు డరాతు లైన
ఖలుల ఖరదూషణాదుల గండడంచెఁ
గుంభకర్ణాదులం గూల్చెఁ గొంతలోన
నినుఁ గనుంగొన నుండె నోదనుజనాథ. 276

క. భ్రాంతిపడి శలభ మగ్నిన్
గొంతటిలో వ్రాలి చచ్చుకోపున సీతా
కాంతుని సాయకవహ్నిన్
గంతుం గొని చావనేల క్రవ్యాదపతీ. 277

క. నామాట వినుము నా కీ
భూమిన్ వైధవ్యదుఃఖముం బెట్టకు షూ
రాముని శరణము వేఁడుము
శ్రీమహిళను సీత నిచ్చి చేయుము వినతుల్. 278

క. కరుణాసముద్రుఁ డాతఁడు
కరుణించు నిన్ను నన్నంగఁ గ్రవ్యాదవిభుం
డరమరలు విడిచి సతికిన్
గరుణరసం బొలుకఁ బలికె గడునయ మెసఁగన్. 279

♦ రావణుఁడు మందోదరితోఁ దనమనోనిశ్చయము చెప్పుట ♦

మ. గరితా నీ విపు డిట్లు పల్కుట వృథా గాదే సమస్తంబు నే
గరిమం గాంచి య కాదె చేసితిని లోకఖ్యాతికిన్ మూలమై
వరబాహాబలశాలి రావణుఁ డనన్ వర్తించి లోకోన్నతిన్
శరణం బిప్డారు నాశ్రయించి మనఁగా స్వాంతంబుఁ గావింతునే.

చ. విను మొక మాట చెప్పెదను వీరవధూమణి నే నెవండనో
మును పెటు లుండి యిప్పు డెటు పోల్పఁగ నుంటినొ నీ వెఱుంగ వే
మును జయుఁ డన్నవాఁడ హరిపొంత వసించెడివాఁడ నక్కటా
సనకసనందనాదిముని శాపమునన్ ధర నిట్లు పుట్టితిన్. 281

తే. విష్ణుతో మూఁడుజన్మముల్ వేరముపడి
చచ్చితిన యేని మంగళస్థాన మేను
బొంది ముక్తిభామినితోడ మోద మందు
చుందు నని చెప్పుచుందు నో యిందువదన. 282

మ. పదివేలేండ్లకు మున్ను రాముఁడు జనిం బ్రాపించు చున్నప్పుడే
మదిలో సింత యెఱింగి తత్ప్రభృతి తన్మార్గోత్సవం బెప్పుడో
కద యంచుండ లభించె నేఁటి కని వేడ్కం బొందు డెందంబుతోఁ
దుది లాభంబు నపేక్ష సేయ నయి తోడ్తో నిట్లు వర్తించితిన్. 283

క. హరిజన్మ మపేక్షించుచు
దురితము లెన్నేని జేయఁ దొడరితి హరికిన్
బరిజనకోటికి నాపయిఁ
బరివర్తింపం గఁ గినుక పరిపరిగతులన్. 284

మ. చెఱఁ బట్టెన్ జనకాత్మజాత నని కొంచెం బేనియుం గాన కి
త్తెఱఁగుల్ పల్కుచునుండు రీ లోకు లెద నింతే దోషమూహింప నే
నెఱుఁగం జాలుదు నన్నుఁ గన్నతలియై యేవేళ నే బిడ్డనై
మెఱఁగం బోవుదుఁ గాని యొండుగతిగా నేఁ బో నెఱుంగం జుమీ.

క. ఎఱిఁగియె చేసితి నింతయు
నెఱుఁగుదు జనకాత్మజాత నిందిరయని నే
నెఱుఁగుదు రాముఁడు హరి యని
యెఱుఁగుదు నాచావు నిక్కమే యని గరితా. 286

త. నాయంశోద్భవు లెవ్వరు
నీయుర్విఁ మెలంగ రామ నేఁ దలఁచి యిటుల్

మాయింప నేన చేసితి
నోయువిదా యింక పల్క నుండుమె చెపుమా. 287

ఆ. ఇపుడ పోయి నేను సుపరిష్కృతం బైన
ప్రధనభూమియందు రామచంద్రు
చేతిహేతివలనఁ జేతన విడ నాడి
ముక్తికాంతపొత్తుఁ బొందఁ గలను. 288

వ. అని యనేకవిధంబులం దనమనోనిశ్చయం బంతయు నెఱింగించియు మించుఁబోఁడీ నీవు నాకై చింతింపకు మింకనీమనోవ్యథలన్నియుం దీఱ నామార్గం బనువర్తింపుము నీకును మోక్షంబు కరతలామలకం బగు నని లాలించి బోధించె నని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలి వృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును. 289

— ఆశ్వాసాంతము —

మత్త. రామభక్తసమాజ మేలురుగ్రామమం దగు దాని కా
రామభక్తుఁడు కార్యదర్శిగ రక్షకుండుగ నై సదా
రామనామసహస్రకోటులు వ్రాయఁ జేయుచు వ్రాయుచున్
రామభక్తి జగన్నుతం బయి క్రాలఁజేయు నజస్రమున్. 290

గద్యము.

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ, కవి
సార్వభౌమాంధ్రవ్యాసాభినవశ్రీనాథ వేదవిద్యావిశారద
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతం బైన శ్రీకృష్ణ
రామాయణంబునందు యుద్ధకాండంబునఁ

దృతీయాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# శ్రీకృష్ణరామాయణము

—:o:—

## యుద్ధకాండము

### చతుర్థాశ్వాసము



వైకుంఠపురంబును
జేవ మెయిం గట్టి యందు శ్రీవిభుఁ డన నై
తేఁవఁ జనురామునునుమం
డా వేంకటరాయఁ డందు నభ్యుదయములన్ .1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు రావణుండు మందోదరికి భక్తిమార్గం బుపదేశించి నే నింకఁ బోయివచ్చెద ననుజ్ఞ యిమ్మని ప్రస్థానభేరి వేయించి నానాలంకారాలంకృతుండై చంద్రహాస ప్రాస భిందివాల కరవాల ముసల ముద్గరాది సాధనంబులతో రథం బధిష్ఠించి చతురంగబలసమేతుండై రణాజిరంబునకుం జని వానరసైన్యంబుపై బాణవర్షంబు గురిసె నప్పుడు ఖడ్గరోమ వృశ్చికరోమ సర్పరోమాగ్నివర్ణులు తనవెంట నంటి నడువ రణంబు గావించె నపుడు ఖడ్గరోముండు ఘోరంబుగాఁ బోరుచున్నం గని. 2

—♦ రావణుఁడు ఖడ్గరోమాదులంగూడియుద్ధము చేయుట ♦—

చ. పవనతనూజుఁ డంతకుని భాతి వెలుంగుచు ఖడ్గరోముపైఁ
బవనజవంబునం గవిసి బాహుబలంబు చలంబు పేర్పడన్

ఒపరము సేయు చున్నతఱి బమ్మఱిలం బడ కాతఁ డాతనిన్
సవిధమునందుఁ జేరఁ బరుషందన మేర్పడఁ బల్కె నల్కమై. 3

క. ఎక్కడి కేగెదు నిన్నున్
జక్కాడెదఁ బట్టి నిలుము సామీరి! ననున్
నెక్కటికలనన్ మార్కొన
ముక్కంటికి నేని శక్తి మొలయదు వింటే. 4

తే. అనినఁ గోపము పెంపున ననిలతనయుఁ
డాజ్యమును వేల్వ మండెడునగ్ని వోలె
నగుచు ఘోరశబ్దము పుట్ట నసుర మీఁది
కుఱికె రయమేర్పడఁగ నరివ్యూహ మడల. 5

సీ. నక్తంచరునిరోమరాజి యంతయు ఖడ్గ
సముదయం బగుట నాశ్వసనసూతి
తనువంతయును ఖడ్గధారలం దెగుటచే
ధాతురంజిత మగుధరము పగిది
నింతింత మూర్ఛిల్లి యింతలోఁ దెప్పిల్లి
కులగోత్రమును బోలుకుధర మెత్తి
దనుజుపై వైవ నాతఁడు దానిఁ దునియలై
పడఁ జేసెఁ దనచేతియసిదమునను

తే. బవనపుత్రుఁడు వేఱొక్కపర్వతంబు
తెచ్చి దైత్యునిపై నేసి హెచ్చి యార్చె
దాన నాతని శీర్షము తనువునుండి
వేఱుపడ నార్చుచుం గూలెఁ బృథివి నతఁడు. 6

—♦ హనుమంతుఁడుసర్పరోమాదులసంహరించుట ♦—

మత్త. సర్పరోముఁడు సర్వవానరసంఘమున్ దరలించుచున్
దర్ప మేర్పడ వాయుపుత్రునిఁ దాఁకి వీఁక వెలార్చుడున్
గూర్పవేర్పన లేచి యాతఁడు కొట్టె నెట్టన వానినిన్
గూర్పరంబున దాన నొవ్వనఁ గోపఘూర్ణితనేత్రుఁడై.

తే. దానవుఁడు వాయుపుత్త్రుని దరిసి యేసె
నినుపఱోకట నాతఁడు కనలి వాని
శిరము ముష్టిఘాతంబునఁ జిదుకఁ జేసె
నందునన్ వాఁడు నిలఁ గూలె నార్చుకొనుచు. 8

తే. అంత వృశ్చికరోముఁ డయ్యరిబలముల
నొంచుచు న్నీలుపైఁ బడి పంచవదన
మట్లు శౌర్యముఁ జూపంగ నతఁడు కనలి
వృక్ష మొక్కఁడు వానిపై విసరి వేసె. 9

ఉ. తోరపుశక్తి దానవుఁడు దొడ్డశరంబున దాని ముక్కలై
ధారణిపైఁ బడన్ సలిపి దర్పము సూపిన నీలుఁ డల్గి పెన్
భూరుహముం బెకల్చుకొని పోయి సురారిశిరంబుపైఁ బడన్
బోరునఁ ద్రిప్పి వైచె నది పోకడఁ జేసెను దైత్యుప్రాణముల్. 10

వ. అనంతరంబ. 11

తే. గ్రీష్మకాలమునన్ గడు రేఁగి వనులఁ
గాల్చుదావము తెఱఁగునఁ గనలు వొడమ
నగ్నివర్ణుఁడు పేర్చి పెల్లార్చి కొనుచు
రాఘవుం డున్నదెసకు రా రథముఁ దోలె. 12

వ. రాఘవుండును వానిం గాంచి విభీషణుం బిల్చి వీఁ డెవ్వఁడు భీకరా
కారంబునఁ బఱతెంచుచున్నవాఁ డనిన నతండు. 13

— శ్రీరాముఁ డగ్నివర్ణుని సంహరించుట —

సీ. వీఁ డగ్నివర్ణుఁ డన్వాఁడు రావణునకుఁ
గుడిభుజం బనియెడునుడుగువాఁడు
మూలబలాధిపుఁ డాలము వీనికి
గేళివిహారము వోలెఁ దోఁచు
ననుపంతలోన వాఁ డతిరయంబున వచ్చి
క్ష్వేళానినాదము చేసి వడిగ
వజ్రకఠోరాస్త్రపాతంబునన్ రాము
నకు వేఁడి గలిగించె నవయ నేసి

తే. నవ్వుచున్ రామభద్రుఁడు నవశిలీము
ఖములు నిగిడించి క్రవ్యాదుకార్ముకంబు
రెండు గావించె నాతఁడు బెండువడక
ఖడ్గముం బూని రామునిం గదియ వచ్చె. 14

ఉ. రాముఁడు వానిఖడ్గము శరంబులఁ జూర్ణముగా నొనర్ప వాఁ
డామెయి భీమ మైనగద హస్తములం గొని కాలకాలుఁడో
నా మదికిన్ భయాకృతి గ నంబడఁ జేసిన మెచ్చి రాఘవుం డా
మనుజాసిపైఁ గడురయంబున వైచెను వారుణాస్త్రమున్. 15

తే. దాన జలదము పుట్టి పెన్వానతోడ
మెఱుము లుఱుములు పిడుగులు తఱచు గాఁగఁ
బోయి రక్కసిపైఁ బడఁ బొడ వడంగి
వాఁడు ధరఁ బడె బూరువు పడినయట్లు. 16

వ. అట్లగ్నివర్ణుండు వడినం గని రావణుండు మండుచు వానరసైన్యం
బెల్ల దైన్యంబు నొంది డింద బాణవర్షంబు గురియుచుం గరంబు
దీపించె నప్పుడుః 17

—♦ రావణుఁడు ఘోరయుద్ధముచేయుట ♦—

చ. గుండెలు బ్రద్దలై తలలు కుత్తుకలుం దెగియుం గరంబులున్
తుండెములై పదంబులును దొప్పలు దోరలు భూమిఁ గప్పియున్
మొండెము లై శరీరములు ముక్కలు ముక్కలు గాఁగనై కపుల్
భండనభూమిపైఁ బడిరి పాఱిరి కొందఱు ప్రాణభీతిమై. 18

తే. వానరుల నట్లు కావించి దానవేంద్రుఁ
డుగ్రుఁడై రామచంద్రున కాగ్రహంబు
గలుగ వజ్రంబులం బోలుకాండసమితిఁ
దెంపు లేకుండ వడిఁ బ్రయోగింపఁ దొడఁగె. 19

వ. రథారూఢుండై రావణుం డిట్లు పోరుచుండ రామచంద్రుండు భూమి
నుండి పోరుట పొసంగియుండ దని దేవేంద్రుండు మాతలిప్ర
యుక్తం బగుతనదివ్యరథంబు రణభూమికిం బుచ్చె నదియును. 20

—♦ రామున కింద్రుఁడు మాతలితో రథంబునంపుట ♦—

సీ. పసిపచ్చవన్నెతో మిసిమిఁ గూర్చెడుమేటి
గుఱ్ఱంబులం బూన్చి గొనబు మీఱి
బాలసూర్యునిఁ బోలుబంగారుచక్రముల్
పగడంపుకంబముల్ దగులనొప్పి
వైడూర్యకూబర దేదీప్యమానమై
స్వర్ణదండధ్వజచామరములు
కింకిణీశతభూషణాంకితఫలకముల్
చాపబాణసహస్రసంభృత మయి

తే. కన్నుఁదోయికి మిఱుమిట్లు గలిగికొనఁగ
సలుపుచును దేవయానము వలె నెసంగి
చూపఱకు నద్భుతం బెసఁ దోఁపఁ జేయు
నట్టిదై యొప్పె నప్డు రామాంతికమున. 21

వ. మాతలి రామున కంజలి ఘటించి. 22

ఉ. మాతలి నే రథం బిది కుమారపరాక్రమ సీనిమి త్తమై
యాతరుణంబునందు విబుధేశ్వరుఁ డంచెను దీని నెక్కి యీ
పూతపపిండిబొందళముఁ బూని శరాసన మిద్ది తాల్చి యీ
శాతశరంబు లందుకొని సంగరముం బొనరింపఁ జెప్పెఁ బో. 23

వ. రామచంద్రుండు నొండాడక దానికిఁ బ్రదక్షిణనమస్కారంబు
లొనరించి యధిష్ఠించి యుద్ధసన్నద్ధుండై యున్నంత. 24

—♦ రా మ రా వ ణు ల యు ద్ధ ము ♦—

సీ. దశవదనుండు గాంధర్వము నిగిడింప
నతఁడు గాంధర్వము నంది సైచె
దైవాస్త్ర మడరింప దైవాస్త్ర మడరించె
రాక్షసాస్త్రం బంతఁ రావణుండు
పైవ నానావిధప్రహరణంబులు రేఁగి
రామునిపైఁ బడ రాముఁ డలిని

ప్రత్యస్త్రములు వాని బడలువడం జేసి
నాగాస్త్ర మేసిన వేగ దాని
తే. గారుడాస్త్రంబునం జేసి ఖండరించి
రామచంద్రుఁడు దీపింప రావణుండు
కట్టలుక బూని మాతలి నట్టె కొట్టి
ఱెక్కియముఁ ద్రుంచి తేజులఁ జక్కనేసె. 25
మత్త. రామరావణయుద్ధముం బొనరంగఁ జూచెడునిచ్చమై
వ్యోమమార్గమునందు వేల్పులు పొల్పుగా నివసించి శ్రీ
రాము గెల్చును గోరుచుండిరి రావణుం డపు డుగ్రుఁడై
దీమసంబున నేసె శూలముఁ ద్రిప్పి గొప్పగ నార్చుచున్. 26
మ. తనపై వచ్చెడుశూలముల్ గని రఘూత్తంసుండు శస్త్రంబులన్
దునుగం బోవనిదాని గన్గొని సురేంద్రుం డిడ్డశక్త్యాయుధం
బును గైకొంచు నమస్కరింఛి విసరెన్ బో శూలమున్ దాఁక రెం
డును డీకొంచు వెలింగె నాకసమునందుం గొంతసే పెంతయున్.
తే. నృపతి పెక్కమ్ము లారాక్షసపతిమీఁద
నేసి గుఱ్ఱంబులం గొట్టి యేడుబాణ
ముఁల నతనిఱొమ్ము గాడంగ సలిపె నపుడు
పాఱె వఱ్ఱు నల్ల రావణునిమేన. 28
సీ. కనుఁదోయి గెంజాయ గలుఁగ రక్కసి రాము
ముంచె నమ్ములవాన నెంచ కవ్వి
కదలక పెనుగొండ కైవడి రాఘవుం
డరయనై వానిపై నట్లవైచి
యిట్లను నే లేనిపట్ల నాసతిఁ దెచ్చి
పోటరి ననుచుంటి వేటిమాట
సిగ్గింత వేనట్టిచెన్నటిఁ వోరోరి!
నిలు మొక్కక్షణములో నీదుమేను
తే. కంకగృధ్రముల్ కాకముల్ గాక మఱియుఁ
కుక్కలును నక్కలును బీఁకి కొని భుజించు

నంచు రాముఁడు దూరుచు నమరవైరి
మీఁద శస్త్రాస్త్రవర్షము మించఁ గురిసె. 29

—♦ రావణుఁడుమూర్ఛితుండగుట ♦—

తే. కపులు పాషాణవర్ష మాకర్వ్యభోజి
మేనఁ బరఁగించి రప్డు డామానధనుఁడు
చేయునది లేక యుండినచెయ్వు లెఱిఁగి
వానిసారథి రథము నవ్వలకుఁ దోలె. 30

శా. పౌలస్త్యుం డలసారథిం గని యిటుల్ పల్కె ఖ్యాతి వో స్యందనం
బాలంబున్ విడునట్లు తోలుకొని రా న్యాయంబె నీ కిట్లు పోఁ
గాలం బేటికిఁ పుట్టినో యనుచుఁ బల్కన్ వాఁడు నే నన్యథా
శీలంబుం గొని సంచరింప ననుచుం జిత్తంబునం దెంచుమా. 31

ఆ. నీవు డస్సినట్లు వావురంబులు సోలి
యున్నయట్లు దోఁప నుచితరీతి
సైనసాదుధర్మ మనుసరించుచు నిట్లు
తొలఁగివచ్చితి నని తలఁపు మనఘ. 32

వ. అని యతనిప్రేరణంబున సారథిరథంబు రామచంద్రునిసవిధంబు నకు నతిత్వరితగతిం దోలుకొనిపోయిన రావణుండు పెచ్చుపెఱిఁగిన మచ్చరంబున నచ్చమూసమూహంబు నొప్పించుచుండం గని రాముండు వీఁడు సామాన్యుండు గాఁడు వీని జయించుట కష్టం బగుచున్న దని మనంబునం దలపోయుచున్నసమయంబున నగ స్త్యభగవానుం డరుదెంచి రామచంద్రుని సమీపించి యి ట్లనియె.

—♦ ఆ ది త్య హృ ద య ము ♦—

సీ. శ్రీరామ! జయరామ! చెవి యొగ్గి వినుము గు
హ్యము సనాతనము జయావహంబు
సర్వశాత్రవవినాశము శివంకర
మాదిత్యహృదయ మా నఘహారంబు
పుణ్యప్రదము దీనిఁ బూని జపింపుము
సర్వదుఃఖంబులు సమసి పోవు

సర్వమంగళములు సమకుఱు సాధులు
వ్యాధులు సడఁగు దీర్ఘాయు వగును

తే. రశ్మిమంతుఁడు దేవాసురవినుతుండు
సకలభువనేశ్వరుఁడు వివస్వంతుఁ డతిస
ముద్యతుండు భాస్కరుం డగు. ద్యుమణి నీ వ
జస్రమును బూజసేయుము స్వాంతమందు. 34

దండకము. ఆదిత్యుఁడే సర్వదేవాసురవ్రాతమున్ భూతజాతంబు నీలోక సంఘాతముం బ్రోచి రక్షించెడుం ఘృష్టులం జేసి యీ సూర్యుఁడే బ్రహ్మయున్ విష్ణుఁడున్ రుద్రుఁడున్ ధాతయున్ నేతయున్ స్కందుఁడుం జంద్రుఁడున్ దేవతేంద్రుండు కాలుం డపాన్నాథుఁడుం యక్షుఁడుం సిద్ధసాధ్యాదులుం మాతరిశ్వాశ్వినుల్ వహ్నియుం బ్రాణముల్ ప్రాణులుం లోఁగనౌసర్వముం దానయై కాలముం జేయుచుం బచ్చ నౌనేడుగుఱ్ఱాల తేరెక్కి సంచారముం జేయుచుం ధ్వాంతముం బాపుచుం శంభువై త్వష్టయై యంశుమంతుండు మార్తాండుఁడై భాస్కరుండై హిరణ్యాగ్నిగర్భుండు నై శీతముం గొట్టువాఁడై తమోభేదియై వ్యోమనాథుండునై ఋగ్యజుస్సామపారంగతుండై యపాంమిత్రుఁడై వింధ్యవీథీప్లవంగుండు నై మృత్యురూపుండు నై సర్వసంతాపనుండై కవీంద్రుండు నై పింగళుండై ద్విజుండై మహాతేజుఁడై విశ్వుఁడై విశ్వభూతుండునై తారకాధీశుఁడై ద్వాదశాత్ముండు నై యొప్పు తేజస్వికిం జోత పూర్వాపరాద్రిస్వరూపుండు జ్యోతిర్గణేశుండు నౌమూర్తికిన్ మ్రొక్కు భద్రింబులంగూర్చు నాదిత్యుఁ డౌమేటికిం వందనం బుగ్రుఁడుం వీరుఁడుం సారసంచారుఁడై పద్మబంధుండు నౌషాళికిం నిత్యదండప్రణామంబు బ్రహ్మచ్యుతేశానరూపుండు రౌద్రస్వరూపుండు నౌ దేవతామూర్తి కాత్మాభివాదంబు వైశ్వానరాఖ్యుండు నై విశ్వకర్ముండు నై తప్తచామీకరాభుండు దేవుండు నౌసూరికిన్ వందనంబెల్ల లోకాళిఁ గావించియుం బెంచియుం ద్రుంచియుం లీల నొండించియుం వావల న్నించియున్

భూతముల్ నిద్రింపో జాగరూకుండై యంతట న్నిండి తా
నుండి దీపించుచుం గర్మసాక్షిత్వము గాంచి యుక్ లోకమి
త్రుండునై వేదముల్ యజ్ఞముల్ యజ్ఞకర్తల్ ఫలంబుల్ సమ
స్తంబునై తా సమస్తేశ్వరుండై వెలుంగొందు ప్రద్యోతను ధాతను
న్నేతనున్ భక్తి భావించి సేవించెదన్. 35

తే. ఆపదలయందుఁ గృచ్ఛ్రము లరుగుదెంచు
నపుడుఁ గాంతారముల భయంబైనయపుడు
మనుజుఁ డాదిత్యహృదయ మిమ్మాడ్కిఁ దలఁచి
ఘనవిపత్తుల దాటంగఁ గలఁడు రామ. 36

క. ఏకాగ్రచిత్తుఁ డగుచున్
లోకేశ్వరుఁ డైనరవిని లో భక్తి మెఱుం
గైకొని దీనిఁ ముమ్మా
ర్వాకొనిన జయింతు విపుడ రావణు నినిలోన్. 37

వ. అని యాదిత్యహృదయం బగస్త్యుం డుపదేశించి చనినంత సీతా
కాంతుండు దానిం జపించి ప్రభాకరప్రసాదంబునఁ బ్రికృష్టమనో
దార్ఢ్యంబు గలండై రథం బధిష్ఠించి రథారూఢుండై మచ్చరించి
వచ్చు రావణుం జూచి మాతలిదిక్కు మొగంబై. 38

—♦ రావణుండుపురికొనిరామునితోఁబోరుట ♦—

మ. అడుగో పఙ్క్తిముఖుండు తేరిపయి ధైర్యస్థైర్యమంథాద్రి నా
నుదితార్కుం డనఁ దోఁపవచ్చెఁ గను స న్నోహర్యంగ గర్వంబునన్
మది నోక్కింత యెఱుంగనట్టిగతిఁ గై మాతులాడి నీవున్ రథం
బడటుం బుట్టఁగ వానివైపునకుఁ బో నల్లంతలోఁ దోలుమా. 39

తే. అపుడు మాతలి రక్కసి కభిముఖముగఁ
దనదురథమును నడిపించె ఘనులు వారు
విహితలోకభయంకరవిధముఁ దోఁప
రణముఁ గావించి రపుడు దారుణముగాఁగ. 40

మ. అధికక్రోధసమగ్రవిగ్రహుఁడు దైత్యాధీశుఁ డాశావకా
శధృతజ్వాలము శూలమున్ భుజబలస్ఫారప్రభా భ్రాజిత
ప్రథితప్రక్రియ నెత్తి మొత్త నశనిప్రఖ్యంబునున్ బ్రహ్మాదం
డధురీణం బగుదాని రాముఁడు వడిన్ ఖండించె రెండై పడన్. 41

క. వానరరాక్షసబలములు
మానసముల నొండు మఱచి మాని రణంబుల్
మానక చూఁచుచు నిలిచిరి
మానితముగ వారు పోరుమార్గం బెల్లన్. 42

వ. అంతఁ గొంతలోన. 43

సీ. మగఁటిమి గలఁ డయి మండి రావణుఁడు రా
మునిపెక్కియముమీఁదఁ జొనిపెఁ దూఁపు
లతఁ డగ్గి పేర్లు లతనిసిడంబుపై
నేసి ఖండించె నొక్కింతలోనఁ
బౌలస్త్యుఁ డారామువాజులపై మేలు
కోల లేయఁగ నవి తూలి పోయె
గదలను గుదెలను గండ్రగొడ్డళ్లను
రావణుం డడరించె రామునిపయి

తే. అతఁడు ప్రత్యస్త్రముల నేయ నలుకఁ జేసి
వారికొం డ్రోరులకుఁ బోరు ఘోర మయ్యె
నపుడు రాముఁడు నాల్గునశనికల్ప
శరములం జేసి రావణాశ్వములఁ ద్రోలె. 44

చ. తడవకు నూర్లు వేలుగ నుదారుఁడు రాముఁడు వాఁడిబాణముల్
వడివడి రావణాసురుని వారువముల్ రథసారథుల్ గడున్
బడలువడంగఁ జేయుచును వానిగదాపరిఘాదు లొల్లఁ బో
గడువడి హస్తలాఘవముఁ గన్గొనఁ జేయుచుఁ బోరె నయ్యెడన్. 45

తే. అంత రఘువంశమణి యగునతఁడు కనలి
సర్పమును బోనియొకదివ్యశరముఁ దొడిగి

వేసి రావణుతలఁ దెగ నేసె నతఁడు
గాని మఱియొక్కశిర మటఁ గాన వచ్చె. 46

— శ్రీరాముఁడు నఱికిన రావణశిరస్సు వెండియుం బుట్టుట —

మహాస్ర. కని శ్రీరాముండు దానిన్ గనలువడ మఱొ
క్కండు కాండంబు వింటన్
దనరం గా ద్రొక్కి వేసెన్ దశవదనునిపై
దాన రెండైన శీర్షం
బును ద్రెస్సెన్ ద్రెస్సినంతన్ మొలచెను మఱియుఁ
బొంకముం గల్గి కొంచుఁ
ఘనుఁ డాసీతావిభుం డీక్రమమున శిరముల్
ఖండరించెన్ గడంకన్. 47

క. శిరములు పోలెం గరములు
నిరువదియుం దునిమి తునిమి యేడ్తఱఁ జూపఁ
ధరణిపయిఁ గొండపాడువునఁ
గరములు శిరములును బడియె గడు నద్భుతమై. 48

తే. నూటయొకనూఱు శరముల నూటయొక్క
శిరము లిలఁ గూలఁగా నేసి చిత్తమందు
నివ్వెఱంపడి రాముండు నిలిచి చూచు
చుండె నాతఁడు చావమి కుహ్వ యనుచు. 49

తే. వాలిమారీచదూషణప్రభృతివీర
వరులఁ జానేసినట్టిమేల్ శరములఁ గొని
విడక గడిదైన నేడునాళ్ళడరి దురము
సలిపియును రావణుం జంపఁ జాలఁ డగుచు. 50

వ. రామచంద్రుండు చింతాక్రాంతచిత్తుండై యున్నసమయంబున విభీ
షణుండు వచ్చి రామున కిట్లనియె. 51

క. నవకోటిశివాలయముల
దివసమ్ము దివసమ్ము నితఁడు దేవరపూజం

దవిలి మెలంగెడు నపు డొక
దివసంబున శిరము నఱికి దేవున కిడియెన్. 52

చ. నఱికినఁ గంఠనాళమున నల్ల స్రవించెను వఱ్ఱువాఱుచున్
దఱచయి యింతయేనియును దానఁ జలింప కితండు దేవునిన్
నెఱి నుతియించె సామమున నేర్పునఁ జేసి నికృత్తకంఠముల్
గుఱుకొని తచ్ఛ్రుతిం జదివె గొంతటిలో శివుఁడుం బ్రసన్నుఁడై.

క. ఏమి యిటు చేయుచుంటివి
నీమదిఁ గలకోర్కె యేమి నేఁ దీర్చుటకై
నీముం దిటు లైతి ననన్
సామమున నితండు వినుతి సల్పుచు ననియెన్. 54

క. తల లిట్లు నఱికి నీకున్
సలలితగతిఁ గోటిపూజ సలుపఁగ మనమున్
సలిపితి ననవుడు శంకరుఁ
డలరెడుమతి వానిఁ జూచి యనుకంపమెయిన్. 55

—♦ రావణునినాభికడ నమృతకలశము కలదనిచెప్పుట ♦—

వ. వీనినాభిప్రదేశంబున నమృతకలశం బొండు ప్రతిష్ఠించి చనియె
దానం జేసి వీనికి శిరంబులు వోయిన మఱియు శిరంబులు పుట్టు
చుండు నేతత్కారణంబున నీరావణుండు ప్రతిదినంబును నవకోటి
దేవాలయంబుల కోటి కోటి శిరంబులఁ బూజ గావించుచుండు. 56

ఉ. కావున నగ్నిబాణమునఁ గ్రన్ననినాభి విభిన్నమై పడన్
జేవ మెయిన్ బొనర్చు మటు చేసినవిమ్మట నెట్లు చేసినన్
రావణుఁ డీల్గినట్టేఁ డన రాముఁడు రమ్యగుణాభిరాముఁడై
పావకబాణరాజమును బ్రస్ఫురితం బొనరించి యేయుఁడున్. 57

ఆ. నాభి బ్రద్ద లగుచు నాభిస్థకలశము
పేరు లేనియట్లు పేలి పోయె
నపుడు రావణుండు నట్టిట్టు పడియును
పోరు విడనియట్టిధీరుఁ డగుచు. 58

— ♦ రాముఁడు బ్రహ్మాస్త్రమున రావణుని జంపుట ♦ —

చ. వివిధవిధాస్త్రశస్త్రములు వీరవరేణ్యుఁడు రాముమేనిపై
దవులఁగ నేయుచున్నతఱి దాపయి మాతలి రామమూర్తికిన్
జెవి నను వీనిపట్ల నిటు చేసి యుపేక్ష వహింప నొప్ప దో
సవభుగధీశ్వరా ఖలుని జంపఁగఁ బూనుము బ్రాహ్మ్య మస్త్రమున్.

వ. అనిన నాఁ గాత మని రామభద్రుండు ప్రళయకాలరుద్రుండై బ్రహ్మాస్త్రం బభిమంత్రించి మార్గసంధానంబు గావించె నప్పుడు.

శా. భూతంబుల్ వెఱఁగందె భూమి వడఁకెన్ భూధ్రంబు లల్లాడె లో
కాతీతాతిభయంకరద్యుతులు భూమ్యాకాశమధ్యంబులన్
ఖ్యాతం బయ్యె నభంబు మాసెఁ దపనుం డట్టిట్టు కంపించె నా
సీతానాథుఁడు బ్రాహ్మ్య మస్త్రము నొగిన్ జేఁబూని యున్నంతటన్.

శా. ఆకర్ణాంతముఁ గాఁగ నారినడుమన్ హత్తించి బ్రహ్మాస్త్రమున్
లోకారాధ్యుఁడు రామచంద్రుఁడు కృథన్ లోఁ గొంచు నేయంగ భీ
మాకారంబును దాల్చి భూతములు హాహాకారముం జేయుచో
వీఁకన్ బోయి విభీషణాగ్రజునిమేన్ వ్రీలంగఁ జేసెన్ వడిన్. 62

చ. శర మది వానిదేహమును జయ్యన వ్రచ్చి యురంబుఁ జొచ్చి నె
త్తురు కడుపాఱఁ గ్రోలి వెను దూసి ధరాస్థలిఁ జొచ్చి వచ్చి భా
స్కరకులరత్నతూణమునఁ గ్రన్ననఁ జేరెను రావణుండు న
య్యరదమునుండి భూమిఁబడె హా యని భూతము లెల్ల నార్వఁగన్.

క. హతశేషు లైన రాక్షసు
లతివేగముతోడఁ బఱచి రార్తరవంబుల్
మితిమీఱఁ జేయుచుం దమ
పతి ప్రాణము వీఁగి నేలఁ బడు టారయుచున్. 64

— ♦ దేవతలు పుష్పవర్షము గురిపించుట ♦ —

సీ. అపు డంతరిక్షమునం దుండి దేవతల్
దుందుభిధ్వానముల్ తోఁపఁ జేసి

రచ్చర లాడిరి హెచ్చి గంధర్వులు
గానంబు చేసిరి సూనవృష్టి
మొత్తమై పడె నేల నత్తటి కమ్మతా
వులు గుబ్బిమ్మరించుచు మలయవాత
మాకసము వినిర్మలాకారమునఁ బొందె
డెలు నిర్మలములై తేజరిల్లె
తే. వేల్పులు మానులును రఘువిభుని వివిధ
వాక్యముల సంస్తుతించిరి పరమఘాతు
కుం డయి జగంబులకు హాని గూర్చినట్టి
ఖలుని రావణుఁ గూల్చినకారణమున. 65
క. కేలను వృక్షములం గొని
వాలమ్ముల నెత్తి కొనుచు వానరవీరుల్
మే లని మెచ్చుచు రాముని
మోాలన్ వర్తించి రవుడు ముద మెసఁ బొడలన్. 66
వ. అప్పుడు విభీషణుండు వచ్చి భూమిపయిఁ బడి యున్నయన్నం
గాంచి కన్నుల నీరు నించుచు. 67

—♦ విభీషణుం డన్నపాటునకు వగచుట ♦—

సీ. ఎల్లలోకములకు నెఱగలి యన నైన
భీమరూపుం డిట్లు భూమిఁ బడియె
నిందాదిబృందారకేంద్రుల నోడించి
పుచ్చినమేటి యి ట్లెచ్చు వీడె
వివిధవైభవముల వెలయుచుండిన తేఁడు
దుమ్మునఁ బొరలాడఁ దోప వచ్చె
నన్న కా ది ట్లని యెన్నొ చెప్పినఁ గాని
విన నొల్లఁ డయ్యె నివ్విధము నచ్చె
తే. అనుచు విలపించుచుండెడునతనిఁ జూచి
రాముఁ డిట్లను ధర్మసంగ్రామమందు

వీర్యమును జూపి పోయిన శౌర్యనిధికి
వగచు టెది పోల దని నేను బలుకుచుంటి. 68

చ. అనుడు విభీషణుం డనియె నన్నయ్యఁ దమ్ముఁడ నౌట నిట్లు గా
వనట యొకింత వచ్చి యిటు పల్కితి దేవ యితండు యజ్వయై
ఘనతప మాచరించె నొకకాలమునన్ ఘ్రుతులెల్ల నేర్చె నీ
తని కపరక్రియల్ సలుపుదాసి కనుజ్ఞ నొసంగ వేఁడుదున్ 69

వ. ఆసమయంబున నంతఃపురాంగన లెల్ల హాహారవంబులు సేయుచు వచ్చి మగనిం గట్టుకొని బిట్టువాపోవుచు దుఃఖించుచుండె రప్పుడు రావణునిపట్టంపుదేవి యగు మందోదరి వచ్చి బహువిధంబులఁ బరిదేవనంబు సేయుచు. 70

—♦ మందోదరి రావణుమృతికి దుఃఖించుట ♦—

మ. నిను మర్త్యుం డొకరుండు చంపు ననుటల్ నిక్కంబుగా దీమహా
జనుఁ డావిష్ణువు లోకరక్షణ మిటుల్ సల్పంగ లోనెంచి మ
ర్త్యనిరూపంబును దాల్చి వచ్చె నని ము న్నూహించితి న్నేను మీ
యనుజన్మన్ ఖరునిఁ వధించె నవువృత్తాంతంబు విన్నప్పుడే. 71

తే. సీత యనుమృత్యుదేవతఁ జేరఁ బిలిచి
యొడకుఁ దగిలించుకొంటి నాపడఁతిమిన్న
నామెఁ బతి కిచ్చి సేవింపు మన్ననాదు
మాట విన కిట్టు లైతి వీమాద్రి నకట. 72

తే. తండ్రి దానవపతి భర్త తలఁపరాక్ష
సాధిపుఁడు కన్నబిడ్డ తా హరిహయు నని
నొర్చినట్టిఁ డటంచు నే నుల్లమందు
గరువ మందుదు నది గంగఁ గలసె నకట 73

తే. మృత్యుదేవత మునిపండ్లు మెఱకగలుగు
నిన్ను మృత్యువు ముట్టెనా నేను నమ్మ
కున్న దానను నావ్రాఁత లున్న విట్టు
లేమి సేయుదు నే మందు నేది దిక్కు. 74

మ. నను నీతోఁ గొనిపొమ్ము నే నిచట నానాకష్టముల్ బొందుచున్
వనటం గుందుచు భర్తృహీన నగుచున్ వర్తింపగాఁ జాల నిన్
గని ప్రార్థించిన నన్ను రా వల దనంగాఁ జిత్తముం జేయ వం
చు నెడందం గడు నమ్మి వచ్చితిఁ గృపం జూడంగదే వల్లభా. 75

ఉ. నీ వనిఁ ద్రెళ్లుటం దెలిసి నీరజమిత్రుఁడు నిర్భయంబుగా
నీవరసౌధమధ్యమున నిల్వఁగఁ జాలెఁ గరంబు లగ్నియున్
భావమునందు నిర్భయము పర్వ వెలింగెడి వాతపోతముల్
కేవలగర్వభావమునఁ గ్రేళ్ళుఱుకుం జుమి యేమి చెప్పుదున్. 76

వ. అని యనేకవిధంబులం బలుకుచు రావణునివక్షస్థలంబునం బడి మూర్ఛం బొందె నంత లో రామచంద్రుండు విభీషణుం బిలిచి యంతఃపురాంగనల వీరి మరలించి పుచ్చి రావణశరీరంబున కూర్ధ్వదైహికంబుం గావింపు మనిన విభీషణుండు రాక్షసాంగనల నెల్ల వేర్వేఱ ననునయించి యంతిపురికింబుచ్చి ఋత్విజులం బిలువ నంచి బ్రహ్మమేధవిధిం జేసి పైతృకంబు నిర్వర్తించె దేవతలు నది యంతయుం గని రామునిపరాక్రమం బగ్గించుచు స్వర్గంబునకు నిర్గమించిరి రాముండును మాతలిం గారవించి రథంబుతో నంపిపుచ్చి సుగ్రీవాంగదలక్ష్మణాంజనేయాదులతోఁ బటకుటీరంబునకుం బోయి లక్ష్మణునిం గాంచి యి ట్లనియె. 77

క. మన కుపకార మొనర్చిన
ఘనుఁడు విభీషణున కిపుడు కౌతుక మెసఁగన్
బొనరింపుము లంకాపుర
మున వరరాజ్యాభిషేకమును విన మన వా. 78

విభీషణుఁడు లంకారాజ్య పట్టభద్రుండగుట

సీ. అన నాజ్ఞ నాదలఁ గొని లక్ష్మణుఁడు విభీ
షణునితో సుగ్రీవుఁడును సుషేణుఁ
డును నంగదుండును హనుమంతుఁ డాదిగా
కపివరులల గూడి కదలి లంక

కరిగి కపులఁ బుచ్చి యబ్ధిజలముఁ దెచ్చి
సర్వసుహృజ్జనసమ్మతముగ
వీధ్రాసనమున విభీషణుని వసింపఁ
జేయుచుఁ బట్టాభిషేకవిధులు

తే. నడపెను విభీషణుండును నమ్రభావ
మున జనులఁ బల్కి మంగళ మని యొసంగు
యెల్లవస్తువులుం గొని యేలిక యగు
రామచంద్రునికడ కేగి ప్రణుతిఁ జేసి. 79

వ. ప్రజలు తన కొసంగినగంధపుష్పాదు లన్నియు రామలక్ష్మణుల కొసంగిన వారు వానిం బ్రేముడించుచు స్వీకరించి రంత శ్రీరామచంద్రుం డాంజనేయుం బిలిచి మిత్రమా! పట్టభద్రుం డైనయున విభీషణుననుమతిం బడసి నీవు సీతాదేవికడకుం బోయి మనవిజయవార్త నెఱింగించి ర మ్మనిన నతండు చెప్పినచొప్పున నశోకవనంబున నున్నసీతకడకుం జని ప్రవరం బఱించి నమస్కరించి నిలిచి నమ్రుండై చేతులు జోడించుకొని. 80

—♦ ఆంజనేయులు సీతకు రామవిజయంబు దెలుపుట ♦—

శా. అమ్మా! రాముఁడు రావణుం గెలిచె ని న్నారీతిఁ దో తెచ్చి బ
న్నమ్ముం గూర్చినదూరదైత్యుఁ డవనిన్ వ్రాలెన్ వడిన్ వీడి ప్రా
ణమ్ముల్ నీ కిది యంతయుం దెలిపి రా నన్ బుచ్చె రాముండు సౌ
ఖ్యమ్మున్గాంచు మెంభంచుచుం జెనని నే వ్యాహారముం జేయుదున్. 81

ఉ. నావ్రుఁడు సంతసంబున మనంబు చలించుచునుంట నెద్దియున్
భావనఁ జేసి పల్కుటకుఁ బాల్పడ కుండినసీతఁ గాంచి నా
కేవచనంబుఁ జెప్ప విది యేమి వచింపుము తల్లి నాఁగ నా
దేవి కుమార! నీనుడి మదిం గలఁగించెను సంతసంబునన్. 82

ఆ. దాన మాట రానిదానన యైతిని
గాని వే ఱొకండు గాదు తండ్రి!
యిట్టిమేలువార్త యెఱిఁగించు నీకు నా
యాత్మ నిడుటకన్న నగునె యొండు. 83

వ. కుమారా! నీవు మాకాత్మబంధుండవు పోయి రమ్ము సీత జీవించి యున్నదనియు ధర్మనంబుఁ గోరుచున్న దనియు జీవితేశ్వరున కెఱింగింపు మని యంపిపుచ్చె నప్పుడు. 84

క. త్రిజటం గను గొని జానకి
నిజమై కీర్తింప నయ్యె నీకల తరుణీ
రజనిచరాంగన వయ్యును
సుజనులలో నగుచు నన్నుఁ జూచితి కరుణన్. 85

ఉ. ఆతఁడు రామమూర్తి కడ కాగతుఁడై శుభవార్తఁ దెల్పెతి-
సీత నినుం గనుంగొనఁగ జిత్తము సేయుచునుండె నావు డున్
భూతలనేత భూమిసుతపుణ్యచరిత్ర మెఱింగి యుండియున్
ఘాతుకునింట నున్నదనుకారణముం గొని సంశయించుచున్. 86

వ. లోకాపవాదభయంబునం జేసి శంకితుం డయ్యు విభీషణుం బిలిచి నీవు పోయి సీత నిటకుఁ దోడితె మ్మనుటయు నాతండు సరమా త్రిజటలకుం జెప్పి జానకి నందలంబునం గూరుచుండం బెట్టి రాముని కడకుం దోడుకొని వచ్చి యొక్కచో నందలంబు నిలిపి యవ్వలన నున్నపరిజనంబు నవ్వలకుం బొ మ్మని తోలుచుండుటం దెలిసి రామచంద్రుం డి ట్లనియె. 87

ఉ. ఓయి విభీషణా! ప్రజల నుండఁగ నీయక త్రోయుచుంటి వి
ట్లీయెడ సీత వచ్చి దిగ నెవ్వరు పూరుషు లుండరాదు పొం
డేయెడ కైన నంచు వచియింతువె యిట్లు పౌనర్చు టొప్పు నే
నాయెడ గౌరవంబు గలనాప్రజ లిందఱు వీరు లాతులే. 88

సీ. వీరంద ఱెన్న నావారలే కాని పై
వార లెవ్వా రిందు లేరు తెలియ

శీల మావరణమై చెల్లుఁ గులస్త్రీకిఁ
దెర లిండ్లు వస్త్రము లరయఁ గావు
వ్యసనము లిడుమలు వాటిల్లునప్పుడు
రణములందు స్వయంవరములయందు
సమరమందు వివాహసమయములను స్త్రీలు
పరుకంటఁ బడుట పాపంబు గాదు

తే. యుద్ధధర యిద్ది విరహము నొంది యుండె
నాసమక్షమునందు వానరుల కంటఁ
బడుట సీతకుఁ దప్పు నాఁ బడదు వచ్చి
చుట్ట లందఱిలో నన్నుఁ జూచుఁ గాక. 89

వ. అనిన విభీషణుండు సరమాత్రిజటాదులతోడ జానకిం దెచ్చి
రామునియెదుట నిలిపె సీత సిగ్గుచేత తలవంచుకొని యుండె నపుడు
రాముం డామెం దిలకించి యిట్లనియె. 90

చ. పరుఁ డొకరుండు వచ్చి తనభార్యను దొంగిలి పోయె నన్ సడిన్
ధరణి భరింపఁ జాలనికతంబున వారిధిఁ గట్టి వచ్చి దు
ర్భర మగుపోరొనర్చి పగవాని వధించితి నీదుబంధముల్
తరలెను నీకు నిష్టమగుతావునకుం జని యుండ నొప్పెదున్. 91

—♦ రాముఁడు పరుషములు పలుకుట ♦—

తే. బందుగులు లేనిచో టిది సుందరివి మ
నోరమవు రావణుఁడు తెచ్చె మారబాణ
విద్ధుఁడై యొంటి నుంచె వివిక్తమందు
నబల వగునీకు తప్పైన నగు నన నగు. 92

వ. అని పలికినఁ గర్ణకఠోరవాక్యంబులు విని సహింపఁ జాలక చెవులు
మూసికొని హరస్మరణంబు సేయుచు నేలపై వ్రాలి కన్నీరుకాల్వ
పాఱుచుండ సరమాసమాశ్వాసితయై యింత తెప్పిఱిల్లి మెల్లన
ని ట్లనియె. 93

తే. చంద్రదర్శన మొనరించి స్వాంత మిపుడు
చల్లబడియెడునట్లుగా సలుపుకొనఁగ
నెంచి వచ్చిననామీఁద నిట్లు పెద్ద
పిడుగు పడె నేమిసేయుదు విధివిధంబు. 94

మ. వసుధాగర్భమునం దయోనిజ యనన్ బ్రఖ్యాతికై పుట్టి దే
వసదృక్షుం డగుమైథిలేశ్వరునకున్ వర్ణింపఁగా బిడ్డనై
వసుతుల్యుం డగునాజికోడ లయి విష్వక్సేనుఁడే నాఁగ నై
వసుధం బుట్టినరాముపత్ని నయి దుష్పంథం బ్రవర్తింతునే. 95

తే. రావణుఁడు తెచ్చె నన్నుఁ బట్టి యీవసుధకుఁ
గాని వానిశరీరము గాని గాలి
గాని నా కంట లేదని కలదు చెప్ప
దేవి యనసూయ దీని నేఁ దెలుప నేల. 96

ఆ. ఆఁడు దన్నయట్టు లంటి వింతియె కాని
యెవరొ నేను నాదుభవ మదెట్టి
దో యెఱుంగ వైతి వో నాథ! ని న్నేమి
యనఁగ నేను నేర్తు నక్కటకట. 97

తే. అగ్నిసాక్షిగ నుద్వాహ మైతి నన్ను
నాస్వభావ మెఱింగి తినాళ్లు గడువ
బేలనో కానో నీమీఁద బాళి కలదొ
లేదొ తెలియంగ లేనియం బేద వైతి. 98

వ. అని కన్నీరు మున్నీ రగునట్లు దుఃఖించుచు లక్ష్మణుం గాంచి. 99

—♦ సీత మండుచున్న చితాగ్నిం బ్రవేశించుట ♦—

శా. అన్నా లక్ష్మణ! నీ వెఱుంగ వఁటె? న న్నాబాల్యముం గోలె మీ
యన్నన్ నే నెటు లెంచుచుంటినో మదీయప్రాణనాథుండె నా
కెన్నన్ దేవుఁ డటంచు నుండుటలు నీ వేనాఁడునుం జూడవో
నన్నుం బొమ్మనె నిష్ట మైనకడకున్ నాకిష్ట మీయగ్నియే. 100

క. కడుమున్ననిడు నప్పుడు గైకొని నాతండ్రి
హవ్యవాహుఁ డిప్పు డాదరించుఁ

దానఁ జితినిఁ జేర్చి మానందముగఁ బోయి
యందుఁ జొచ్చి సుఖము నందఁ గలను. 101

వ. అనిన లక్ష్మణుండు దుఃఖాక్రాంతచిత్తుండై తత్తఱంపడుచు రాముని వంకఁ జూచుచున్నంత నతనిచిత్తంబును దానికాయత్తం బగుట యెఱింగి తఱుగనితాపంబునఁ దపించుచు నతఁ డం దొక్కమహాచితిం బేర్చి నంత నక్కాంతయు నింతేనియు జింత లేనిస్వాంతంబున రామునకు ప్రదక్షిణంబు గావించి కొండపొడువున మండుచున్నచితిసమీపంబునకుఁ జని వలఁగొని ప్రాఙ్ముఖంబుగ నిల్చి చేతులు జోడించుకొని. 102

మ. తెగువం జేయుమఖంబులన్ ముఖమవై దేవళ్ళకున్ హవ్య మీయఁగమర్త్యాళికి నన్న మీయఁ దగుముఖ్యంబైన దైవంబవై
తగి లోకంబుల నుద్ధరించుటకు నై తళ్కొత్తి తో దేవ! నా
దగు దేహం బిదె స్వీకరింపుము కృపాయత్తైకచిత్తంబునన్. 103

ఉ. ఏను మహాపతివ్రతన యేని పరార్తినిఁ గోర నేని నా
మానస మెప్పుడున్ సుకృతమార్గమునం దగు నేని రాము నే
ప్రాణముగాఁ దలంచుచుఁ బరాత్పరు నేని దలంపకుండున
ద్దానన యేని నన్ను దయ దార్కొనఁ జూడవె హవ్యవాహనా. 104

వ. అని ప్రార్థించుచు నెల్లరు నివ్వెఱంపడి చూచుచుండ గుభుల్లున నయ్యగ్నిహోత్రంబునం బడియె నపుడు. 105

తే. హవ్యవాహుండ నయ్యు నిరంతరంబు
సర్వభక్షకుఁ డగుటచే సతత మశుచి
నట్టి నాలోన సతిఁ జేర నగుట నిరత
శుచి ననుచు బొంగు పన లేచె నచట నగ్ని. 106

చ. వెలయఁ బ్రివర్గ్యమందువలె వెల్గుచితాగ్నిచయాంతరంబునన్
నిలిచి కరంబులన్ మొగిచి నింగి గనుంగొనునామె కీలలన్
గలయఁగఁ జర్చనై కళలఁ గ్రాలెడుబంగరుబొమ్మ నాఁగనై
వెలుఁగుటలోన నొక్కఁడగు వెల్గన వెల్గె మహాద్భుతంబుగన్. 107

—♦ బ్రహ్మేంద్రాదులు రాముసకు దర్శనమిచ్చుట ♦—

వ. అప్పుడు సుగ్రీవాంగదహనుమజ్జాంబవదాదివానరులును విభీషణాది రాక్షసులును నివ్వెఱం పడి చూచుచుఁ గన్నుల నీరునించుచుఁ దెరమీఁద్రిబొమ్మలునాఁ గదల మెదల కుండి రాసమయంబున నింద్ర వరుణ యమ కుబేర శంకర బ్రహ్మలు విమానంబు లెక్కి వచ్చి రామచంద్రు నెదుట సాక్షాత్కరించి సాష్టాంగనమస్కారంబు గావించువానిం గాంచి యి ట్లనిరి. 108

సీ. ఎల్లలోకములకు సృష్టికర్తవు నీవ
జ్ఞానులలోన విజ్ఞాని వీవ
వసువులలోఁ బ్రజాపతి యగుఋతధామ
వీ వాదికారణ మెల్లరకును
రుద్రులలోపల రుద్రుండ వగు దెన్మి
దవవాఁడ వెన్న సాధ్యజనసమితి
నైదవసాధ్యుండ వశ్వులు నీచెవుల్
చంద్రసూర్యులు నీదుచక్షువులును

తే. ఈవు సర్వజ్ఞుఁ డవును సర్వేశ్వరుఁడవు
సర్వశక్తి వెఱుంగనిచందమునను
సీత వహ్నిప్రవేశము చేయుచుండఁ
జూచుచు నుపేక్షసేయుట చోద్య మరయ. 109

వ. అని లోకపాలురు ప్రశంసించుచుండ శ్రీరామచంద్రుండు వారి దిక్కు మోము పెట్టి యి ట్లనియె. 110

తే. నేను మానవమాత్రుఁడనే యటంచు
దశరథాత్మజుఁ డంచు నేఁ దలఁతుఁ గాని
మీరు పలికినభావము తీ ఱెఱుంగ
ననుచుఁ బరమేష్ఠి రాముస కనియె నిట్లు. 111

ఉ. నీవు చరాచరంబులకు నేతవు త్రాతవు సంవిధాతవున్
నీవు రమావిభుండవును నీవు చతుర్భుజుఁ డైనవాఁడ వీ

భూవలయంబుఁ బ్రోచుటకుఁ బుట్టితి విట్టు రఘూద్వహుండవై
నీవనితావతంసము గణింప రమాంశజ యంచు నెంచుమా. 112

ఉ. నీవ సహస్రశీర్షుఁడవు నీవ సహస్రదృగంచితుండవున్
నీవ సపర్వతావనిని నెత్తి ధరించి భరింతు వెంతయున్
నీవ విరాట్స్వరూపుఁడవు నీవ జగత్పతి వీవ సర్వమున్
నీవలనన్ సమస్త మగు నిక్కము నిక్కము విశ్వసింపుమా. 113

—♦ అగ్నిహోత్రుండు సీతం దెచ్చి రామున కిచ్చుట ♦—

వ. అంత సర్వలోకసాక్షియు సర్వజ్ఞుం డగునగ్నిభట్టారకుండు మనుష్య రూపంబునఁ జెక్కుచెదరక చక్కని కనకశలాకవలె దేదీప్యమాన యగుజానకీదేవిం దనకరంబులం గొని తెచ్చి రామునకు సమ ర్పించి యి ట్లనియె. 114

శా. ఓరామా! యిదిగో భవద్వనిత యీయోషామహారత్నమం
దేరూపం బగుపాపముం దలఁపఁ లే రేవారు నిర్దోషు రా
లీరామామణి యీమెఁ బోలుసతు లేరేలోకమం దేనియున్
లే రంచున్ వచియింతు నిక్కమును నే లేఖాముఖుం బై ప్రభూ. 115

సీ. నినుఁ గాక వేఱొక్క జను నెట్టివానినేఁ
గాంచి యెఱుంగ దీకలికిమిన్న
త్రికరణశుద్ధిగా సకలకాలములందు
నిన్నె తలంచు నీనీరజాక్షి
నినుఁ బాసినదిమొదల్ నిద్ర యాహారము
పొంది యెఱుంగ దీపూవుఁబోడి
రసనాగ్ర మెప్పుడు రామమంత్రమునంద
కదలించుచుండు నీకాంచనాంగి

తే. రావణునిఁ గంటఁ జూడ లే దీవరాంగి
తృణము గా నెంచి భాషించె దినము దినము
నీమహాసాధ్వి నిదిగొ నే నిట్లు తెచ్చి
నాఁడ దయ స్వీకరింపు మోనలిననాభ. 116

ఉ. నేను మఖాధినాథుఁడను నిర్జరకోటికి మోము గావునన్
నేను వచించుమాట లివి నిర్జరు లెల్లరు నన్నమాట లే
నీనగు లెల్లఁ దీర్చుకొని నీరజనేత్రను భూమిపుత్రికన్
మానసవీథి నెంచుకొని మాఱు వచింపక పొందు మీసతిన్. 117

వ. అనినం గంట నీరు వెట్టుకొనుచు శ్రీరాముం డగ్ని కిట్లనియె. 118

ఉ. భూసుత దోషముల్ సలుపఁ బోదని నెమ్మది నే నెఱింగియున్
దోసము లోక మెంచు నని తోయరుహానన నిన్నుఁ జేరఁగాఁ
జేసితి జాతవేదుఁడవు చెప్పితి వెల్లరు నాలకింప నో
భాసురమూర్తి యీాగరితఁ బావనగాత్రిఁ బరిగ్రహించితిన్. 119

—♦ పార్వతీపరమేశ్వరులు రాము నగ్గించి పలుకుట ♦—

వ. అప్పుడు పార్వతీసహితుం డగు పరమేశ్వరుండు జానకీజానిం గాంచి యి ట్లనియె. 120

సీ. నాకు మిత్రుఁడ వీవు లోకరక్షార్థము
ప్రభవించి తి ట్లు శ్రీరాముఁడ వయి
లోకభీకరుఁ డైన రాకాసి రావణుఁ
జానేసితివి మేలు జగతి కయ్యె
నీ వయోధ్యకు నేగి నీకై వగఁ బొగలు
నీబంధుమిత్రుల నెగఁలు దీర్చి
పట్టభద్రుఁడ వయి ప్రజ నేలి సంతతిఁ
బడసి వంశము నిల్పి ప్రబలుఁడ వయి

తే. అశ్వమేధమహాధ్వర మాచరించి
బ్రాహ్మణులఁ దన్పి సుతునకు రాజ్య మొసఁగి
స్వర్గపురమున కరుదెంచి సకలలోక
పాలన మొనర్చుచుండు మోప్రభువరేణ్య. 121

వ. అని పలికి యంగుళినిర్దేశంబు చేయుచు నదిగో నీతండ్రి దశ
రథుండు విమానారూఢుం డయి నిన్నుఁ జూడ వచ్చి యున్న
వాఁడు నీవు నీతమ్ముండునుం గొమ్మయు నమ్మహాత్మునకు

నమస్కరింపుఁ డనిన శ్రీరామచంద్రుండు తండ్రిం గాంచి సంతసిం
చుచు సీతాలక్ష్మణులతో సాష్టాంగనమస్కారంబు గావించిన
నాతండు వారిం గాంచి రామచంద్రునిఁ దనతొడపైఁ గూరుచుండం
బెట్టికొని మూర్ధాఘ్రాణంబు సేయుచు ని ట్లనియె. 122

—♦ స్వర్గస్థుఁ డగుదశరథుఁడు వచ్చి రాము నూరార్చుట ♦—

సీ. కన్నబిడ్డా! నిన్నుఁ గానని స్వర్గని
వాసము మేటి నాఁ బడదు నాకు
శత్రుసంహారంబు సలిపి కృతప్రతి
జ్ఞుఁడ వైతి విట్లు నిన్ జూడ నైతి
సుఖి వైనని న్నిట్లు చూచుట నా కైన
యానంద మింతని యనఁగఁ జాల
సత్పుత్రు నినుఁ గాంచి స్వర్గాదిసౌఖ్యము
లందుచుంటినిఁజువ్వె యమలచరిత
తే. నాకు నిరయముల్ రాకుండ నాదువాక్య
పాలన మొనర్చి నాఁడ వీపడఁతి సీత
సతులలో నాదిలెక్క కౌసాధ్వి దీనిఁ
గూడి పోయి పట్టాభిషిక్తుండ వగుము. 123

ద్విపద. అని లక్ష్మణునిఁ గాంచి యన్న! మీయన్న
మునిలోకవంద్యుఁ డౌపురుషోత్తముండు
ఘనుఁడవు నీ వెన్నఁ గైంకర్య మితని
కిని సీతకుం జేసి కీర్తింప నైతి. 124

ద్విపద. అని జానకిం జూచి యమ్మ! నీభర్త
నిను నెఱుంగక కాదు నీకీర్తి జగతి
ఘనతరంబై మ్రోయఁ గా నిన్ను నగ్నిఁ
జొనిపె నింతేకాని చూడ మిం కొండు. 125

—♦ దేవేంద్రుఁడు దర్శనమిచ్చి మృతులైనవానరుల బ్రతికించుట ♦—

వ. మీరు సుఖంబుండుఁ డని వారి నాశ్వాసించి స్వర్గంబునకు నిర్గ
మించె నంత దేవేంద్రుండు రామచంద్రుని సమక్షంబున కరుదెంచి

లోకవిద్రావణుం డగురావణునిసంహరించి సకలలోకంబుల కానంద మాపాదించితివి మావలన నీ కే దేని కాగలది యుండె నేని చెప్పుము చెప్పినట్లు చేసెదమ యనిన రాఘవుం డి ట్లనియె. 126

శా. ఆలుం బిడ్డల వీడి వానరులు నాయం దెంతయేఁ బ్రేముడిన్
నేలన్ మెట్టుచు వచ్చి చచ్చిరి మహానీకంబునం జొచ్చి జీ
వాళిం బాసి పురందరా మఱియు వా రంతంతలం బ్రాణముల్
గ్రాలం బొల్చెడు నట్లు గా సలుప సంప్రార్థింతు నే నంతయున్.

ఆ. అనిన నింద్రుఁ డట్ల యగుఁ గాత మని వరం
బొసఁగ నపుడు చచ్చియున్నవారు
కాలు చేయి తలయుఁ గాయము దెగినట్టి
వారు లేచి రపుడు బ్రదికి మఱియు. 128

వ. అంత మఱియు నెల్లవేల్పులు నేకగ్రీవంబుగా సీతాలక్ష్మణులతో సమస్తపరివారవృతుండనై సాకేతంబున కేగి పట్టాభిషిక్తుండనై భూతలంబున నేలికనై పదునొకండు వేలసంవత్సరంబులు మని ప్రజలం బాలించుచుండు మని పలికి యథాగతకృతగమనులై రంత మఱునాఁ డరుణోదయంబున హనుమజ్జాంబవదంగదాది పరివృతుండై విభీషణుం బిలిచి మీయన్నచేఁ జెఱం బడియున్న గరుడ గంధర్వ కిన్నర యక్ష రాక్షసాంగనల నెల్లం బిలువ నంచి మీవదిన మందోదరి నా పంపునం దోడి తెమ్మనిన నతం డట్లు గావించుటయు రామచంద్రుండు దేవకాంతలం గాంచి. 129

మ. నెలఁతల్ మీ కిటు లోకకంటకునిచే నిర్బంధబంధంబులున్
గలిగెన్ దోషము దాన మీకును గతుల్ గాకుండఁ బో నెట్టి చిం
తలకున్ మీమది చోటు వెట్టక భవత్స్థానంబులం జేరి మున్
వలె సౌఖ్యంబున నుండుఁ డాత్మ విభులం బ్రాపించి యంచద్గతిన్.

వ. అనిన వా రందఱు రాముని పాదారవిందంబులకు వందనం బాచరించి విభీషణ ప్రేరితులై స్వర్గంబునకు నిర్గమించి రప్పుడు రఘురాముండు మందోదరిం దరియ నరిగి యి ట్లనియె. 131

—♦ శ్రీరాముఁడు మందోదరి నూరార్చి గౌరవించుట ♦—

శా. తల్లీ! నీవు సతీవతంసమవు నాత ప్పిందు శంకించి నీ
యుల్లంబందు మఱొండుగాఁ దలఁతు వేమో నీమగం డుద్ధతిన్
ముల్లోకంబుల కార్తి గూర్చుఖలుఁడై పొల్పేదుటం బోరునన్
ద్రెళ్ళం జేసితి లోకరక్ష కయి దోర్వీర్యం బవార్యంబుగన్. 132

క. అలుకం బూనకు నాపైఁ
దెలియుమి న న్ననిన మ్రొక్కి దేవారిసతీ
తిలకం బి ట్లను సర్వముఁ
దెలిసిన నావిభున కెంతొ తెలిపితి హితమున్. 133

క. నామాట వినఁడు నిన్నున్
దామోదరుఁ డని యెఱింగి తాఁ దెగ నీచే
నీమెయిఁ గావించి పరం
ధామముఁ జనె సుకృతి యగుచు దైవలలామా. 134

వ. దాని కింతయుఁ జింతింపం గాని నాదౌర్భాగ్యంబునకె చింతించు చుంటి ననిన రాఘవుండు నీవు సంతతసుమంగలివి పతిచితి గాలు చున్నంతకాలము సతికి వైధవ్యంబు పట్టదు గావున నీపతి చితి సతతంబు వెలుంగుచుండు నట్లు చేసెద దాన నీకు వైధవ్యంబు లేదు నీ వింక నీపతిహితం బనుసరించి పరమతపంబు గావించి పరంధామంబు నొందు మని యంపిపుచ్చి విభీషణుం బిలిచి నిజ ప్రియాణం బెఱింగించి యి ట్లనియె. 135

మ. పదునాల్గేడులు నిండునంత నగునాప్రత్యాపకాలంబునన్
ముద మొప్పన్ భరతాఖ్యసోదరునకున్ మోమున్ బ్రదర్శింప నొ
నది గాకుండిన నాతఁ డగ్నిఁ బడున ట్లానాఁడు భాషించె నో
సదయాత్మా! మము సాగనంపు మనుచున్ సౌహార్దముం జూపుచున్.

క. తల్లులు గురువులు పౌరులు
తల్లడపడుచుందురు నన్ను దర్శించుటకున్
సల్లలితహృదయ! నిలుపఁగ
నుల్లము గావింప కనుప నుండుము మమ్మున్. 137

వ. అనిన విభీషణుం డి ట్లనియె. 138

—♦ రామాదులు విమానంబెక్కి ప్రయాణంబగుట ♦—

చ. అఱరువిమానరాజ మది యక్షవిభుండను నాదునన్నయున్
సలలితమూర్తి యైనధననాథుని దద్ది హరించె రావణుం
డెలమిని దాని వాని కిడ నెంచితి నీవగునాజ్ఞ పూని నీ
పలికినరీతి సల్పెదను బార్థివతల్లజ! విన్నవించితిన్. 139

లయగ్రాహి. దానిపయిఁ గోటు లయి దానవులు మేటు లయి
వానరులు లో నయినసేన లవియెల్లన్
మానుగను గూడుకొని మానసము లొప్పునటు
లానభమునందు జన నౌను సుఖరీతిన్
గాన రఘురామ మన మేనిఁ గొని పోవ నగు
నేని విడ నౌను విన నే నడుగుచుంటిన్
నా నచిఁకు సంతసము గానఁబడఁ జేయుచును
నానగరి కందఱును రా నభిలషింతున్. 140

వ. అనిన నొండు పలుకక విభీషణుండు. 141

సీ. స్వర్ణమయంబు లౌసౌధంబులం బొల్చు
సోమార్కవీథుల సొంపు గలిగి
యమృతోపమానజలాశయములు గల్గి
నానావిధోపవనములు గలిగి
బహుధపచిత్రరత్నవిరాజితంబు లై
చెలువారు మంటపశ్రీలు గలిగి
వైదూర్యకుడ్యముల్ స్వర్ణావయవములు
సమలంకృతము లగుస్థలులు గలిగి

తే. ధవళవర్ణపతాక లంతటను గలిగి
నలుగడల గజ్జెలును గింకిణులును గలిగి
ముత్యములహారములుగల్గి ముద మొసంగ
దేవయానముఁ దైస్త్రి తెచ్చె నటకు. 142

వ. ఇట్లు విమానంబు దెచ్చి విభీషణుండు రామచంద్రానుమతంబున సుగ్రీవాంగదహనుమజ్జాంబవదాది సమస్తవానరులకును దత్తదుచితవిధంబునఁ గర్పూరతాంబూలజాంబూనదాంబరాభరణాదులు బహూకరించి సీతారామలక్ష్మణులకు నభివందనంబు లర్పించె నప్పుడు రామచంద్రుండు జానకీలక్ష్మణసహితుండై విమానం బెక్కి యొక్కచోఁ జక్కనిసింహాసనంబున నధిష్ఠించి సుగ్రీవాదులకు నాజ్ఞ యొసంగిన వారు ననుక్రమంబున విమానం బెక్కి తత్తదుచిత స్థలంబుల నాసీను లయిరి విభీషణుండును దనమంత్రిప్రభృతులతో నధిరోహణంబు గావించె నప్పుడు సీతాదేవి క్రింద నిలిచి తనపై దృష్టి నిగిడించి చూచుచున్న సరమాత్రిజటలం జూచి రామునకుం జూపి యి ట్లనియె. 143

—♦ సీత త్రిజటాసరమలతో విమానం బెక్కుట ♦—

క. సరమాత్రిజటలు వీరలు
పరమోత్తమురాండ్రు నాకుఁ బరగృహమందున్
బరిపరివిధముల నుపకృతు
లరుదుగ నొనరించిరట్టి రని నే నందున్. 144

మ. సరమాదేవి విభీషణాంగన మహాసామ్రాజ్యపూజ్యోన్నతిన్
సిరులం బొల్చు నికృత్తమాయశిరమున్ వీక్షించి నే నెంతయే
దురపిల్లం గని సర్వముం దెలిపి నాదుఃఖంబు వోకార్చు టొ
క్కరుఁడే కా దిటుఁ గన్ను దెప్పవలె నన్ గాపాడె నెప్పట్టునన్.

ఆ. త్రిజట యీమె నాకు దిక్కు మొక్కను లేని
చోట దిక్క యగుచు మాటి కెపుడు
రక్కసులభయంబు రాకుండఁ జేసిన
పుణ్యమూర్తి యీమె పొగడ నొప్పు. 146

క. వీరలు నాతోఁ బుట్టువు
లీరనుమతి యీయ రాఁగ నెంచుచు నున్నా
రారయ సాకేతంబున
నోరాఘవ యాజ్ఞ వేఁడు చుంటి ననుఁబడయున. 147

వ. రామచంద్రుం డోంకారంబు గావించి లేచి వారివంకఁ దిరిగి చేతు లెత్తె సీతయు నట్లు గావించె నప్పుడు విభీషణుండు విమానంబు వారికడకుం జని తోడితెచ్చె నంత సీత వారికిఁ జేయూఁత యిచ్చి యెక్కించుకొని తనచెంతం గూరుచుండ బెట్టుకొనియె నప్పుడు ఘంటానాదం బయ్యె నయ్యెడ దివ్యయానం బాకాశం బంట నెగిరె నప్పుడు రామచంద్రుండు సీతాదేవి కంగుళినిర్దేశంబు చేయుచు నిట్లని చెప్పందొడఁగె. 148

## —♦ రాముఁడు సీతకు వివిధవిషయంబులు చూపి చెప్పుట ♦—

క. కైలాసంబున కెత్తయి
క్రాలుఁ ద్రికూటాద్రి విశ్వకర్మ పొనర్చెన్
శైలం బోల్చెడు నిదె కను
మా లంకాపురము సర్వమాన్యంబ యగున్. 149

ఉ. రావణరాజధాని యయి క్రాలుపురం బిది యిప్పురంబునన్
దేవవరాదిలోకములఁ దేజరిలంగలయెల్లసంపదల్
దేవవిరోధిగేహములఁ దేజరిలుం జుమి దీనివైభవం
బీవు కనుంగొనం దగు ని దెల్ల విభీషణుపాలిపం పగుఁ౯. 150

వ. అని యంతలో నశోకవనంబు లోచనగోచరం బగుట్చయు. 151

మ. పెనుమ్రాకుల్ ధరణిం బడెన్ దునుకలై వీక్షింప నొండొక్కెడా
వనమధ్యంబునఁ జూడవచ్చెడి నటన్ నీపాదచిహ్నంబు లో
ప్పును నీ వున్నమహీరుహం బది యటంచున్ గూలుచె ట్లన్నియున్
హనుమంతుండు నశింపఁ జేసినవనం బం చేను భావించెద౯. 152

వ. అని చూపినం జూచి తాను నాప్రదేశంబుం జూపుచు. 153

చ. విఱుఁగనిచెట్టుక్రిందఁ గడువింతగఁ దోఁచెడుపల్లె మద్ది నీ
శిర మని కృత్రిమం బయినశీర్షముఁ జూపినఁ జూచి నే నట౯
ఖరముగఁ గూలుట౯ గలిగె కన్గవఁ గారిననీళ్ళ నిండె న
ప్పరిసరమందు నెత్తు రది పాటినజూడ గనంగ వచ్చెడి౯. 154

తే. మాంసమస్తిష్కశోణితమాంసల మగు
పాలికలను జూపి రాముండు పలికె నిట్లు
కంటె యిది రావణునిచితి గాలుచుండెఁ
గుంభకర్ణుఁడు పడి యుండెఁ గొండ వలెను. 155

సీ. కుంభనికుంభులు గూలినతల మిద్ది
యది నికుంభిల చూడు మబ్జవదన
నాగపాశములచే నాతమ్ముఁడును నేను
బడియున్నతల మిది పడఁతి కంటె
యచట మందులకొండ హనుమంతుఁ డిడె తెచ్చి
యతికాయుఁ డెక్కుడునరద మిదిగొ
వేవురుసవతులు బావురు మనుచుండ
నిచట మందోదరి యేడ్చె నిన్న

ఆ. కొండవోలెఁ దోఁచుచుండెనిచ్చటఁ జూడు
మతివమిన్న రావణాసురుశిర
ములను గరము లవ్వి పోఁగుగా వేసిరి
నాఁగ సీత బీతునను దలంకె. 156

వ. అంతలో సముద్రము సందర్శించి రాముండు. 157

మ. అదిగో సంద్రము నీదు రాకఁ గని మిన్నంటెఁ దరంగంబులన్
సుదతీరత్నమ నీవు కూఁతు రనుచక్షుఃప్రీతియే కారణం
బదిరా నీ కిది యింతయేఁ దెలియునో యన్నం ధరాపుత్రి స
మ్ముదమారం బతి వంకఁ జూచి నగుమోమున్ జూపె రూపించుచున్.

ఉ. ఱాలను బేర్చి నీటిపయి ఱాపుకు వెట్టుచుఁ గట్టె సేతువున్
వేలుపుశిల్పిపుత్రుఁ డయి విశ్రుతి కెక్కిన యీనలుండు వే
వే లోకపట్టునంద జను విశ్రుతి గల్గెడు నట్లు దీనికిన్
లీలను రామసేతు వను పేరు మఱి న్నలసేతునామమున్. 159

మ. అవిగో దర్భలు వానిమీఁద వ్రతనిష్ఠావాప్తి నే నుండఁ గా
భువనాధీశుఁడు మానవాకృతిని నాపొంతం గనన్ వచ్చి నా

దవ్వువిల్లమ్ములు చూచి బీతుపడి యిట్లాదేశముం జేసె సే
తువు గట్టం బరికించితే గరిత యెంతో వింత చేకూరెడిన్. 160

క. తెక్కలకొండం జూచితె
యెక్కాలమునందుఁ గాని యిదిగో మనకుఁ
బ్రక్క మెలఁగు మైనాకము
మక్కువమైఁ జూడ వచ్చె మసలం గంటే. 161

వ. అని పలుకుచుండ విమానంబు సముద్రోత్తరతీరంబు సేరుటయు రామనరేంద్రుం డట దేవయానంబు నిలువరించి బ్రహ్మవంశ సముద్భవుం డగురావణుం జంపినపాపంబుఁ బరిహరించుకొన నొక్కమహాజ్యోతిర్లింగమూర్తి ప్రతిష్ఠంగావింప నెంచి. 162

తరువోజ. ఆమహి నుత్తము లగుభూమిసురుల
నాహ్వాన మొనరించి యాగమోక్తముగ
రామలింగేశ్వరప్రఖ్యాతి గలుగ
రాజార్ధమౌళిఁ బరఁగఁ బ్రతిష్ఠించి
యామూర్తికిఁ మహిమాతిశయంబు
ప్రాపింప శ్రీయంత్ర మటఁ బొందు పఱచి
వేమాఱు పూజించి వేడ్క సేవించి
వెడలి పోయెను వినువీథి నవ్వేళకు. 163

వ. అంతలో దేవయానంబు కిష్కింధాపురప్రాంతకాంతారంబు సేరుటయు రామచంద్రుండు చంద్రముఖిం గాంచి. 164

తే. ఇదిగో కిష్కింధ సుగ్రీవుఁ డేలుపురము
వాలి నీపాంత నే నేను గూల నేసి
నాఁడ నీకొండకడ నంజనాసుతుండు
నన్ను దర్శించి సుగ్రీవు నెన్ని తెలిపె. 165

ఉ. నా విని సీత యిట్లనియె నాథ మనోరథ మాలకింపు సు
గ్రీవునికాంతలున్ మఱియు గీశసతుల్ కలవార లందఱుఁ
దేవరతో నయోధ్యకరుదేర నెఱుంగఁగఁ జేయ వేడుదుఁ
గావున గోర్కి దీర్చు మనఁగా రఘునాథుఁడు నిల్పి యానముఁ

వ. సుగ్రీవునిం జూచి సీతామనోరథం బెఱింగించిన నతండు పోయి యెల్లవారిం దెచ్చి విమానం బెక్కించె నంత విమానంబు ఋష్యమూకపర్వతంబు దాపునకుం జనినంతఁ బంపాసరోవరంబు లోచనగోచరం బగుటయు రామచంద్రుండు చంద్రముఖిం గాంచి యి ట్లనియె. 167

సీ. ఆసరోవరము పంపాఖ్య నెసంగు నా
గట్టుమీఁదను మూఁడుకాళ్ళముసలి
శబరి యన్ యోఁగిని సాఁపడన్ రుచి చూచి
తియ్యనిపం డ్లిచ్చె నెయ్య మెసఁగ
నదె కబంధుఁడు పడ్డపథము తలోదరీ !
యిఁదిగో జనస్థాన మదిగో మఱ్ఱి
యిచట నీకై ప్రాణ మిచ్చె రావణునకు
నాచుట్టము జటాయునామఘనుఁడు

తే. అపుడ చూపితి ఖరదూషణాదులఁ దెగ
నేసినతలంబు మనయాఁకుటిల్లు చూఁడు
మదిగో కన్పట్టుచున్నది యనుఁడు సీత
దిగి కనుఁగొని పోనెంచి తెలిపెఁ బతికి. 168

— ♦ సీత త్రిజటాసరమలతోఁ బర్ణశాలకడ దిగుట ♦ —

వ. రామచంద్రుండు దేవయానంబు నిలువ నియమించిన సీత త్రిజటాసరమాదులతో దిగి నలుమూలలుం జూచి యొక్కచో నొడలెఱుంగకున్నంతఁ ద్రిజట సేదఁ దేర్చి యేమి తల్లి ! యి ట్లైతి వనిన సీత సాధ్వస స్వరంబున. 169

ఆ. ఇదిగో గోయి చూతువే త్రిజటా! యిట
నేను డాఁగియున్న మాని వోలె
వచ్చి రావణుండు వసుమతిం బెకలించి
కొంచుఁ బోయె నన్ను నొంచి పొంచి. 170

వ. ఇది నాకు భయస్థానం బని నాఁడు ఋషిపత్నులు తన కిచ్చిన పసుపుకుంకుమంబు లటుం దాచియుంచినవానిం బుచ్చుకొని వారితో విమానంబెక్కె నది నేలదాపుగ నేగుచుండ రాముఁడు రామామణిం గని యిదిగో గౌతమీనది మనము ప్రత్యహంబు నిందు స్నానంబు చేయుచుండు వారము నమస్కరింపు మన నామె చేతులు జోడించుకొని. 171

శా. బమ్మం గన్నది కమ్మనై హరికినిం బాదంబునం బుట్టి గా
రమ్మం బ్రిక్కకుఁ ద్రోసి యీశుశిరమం దావాసముం గాంచి పా
పమ్ముల్ వాప ధరిత్రి గౌతమమునిం బాలింప వేంచేయు మా
యమ్మా ! గంగమతల్లి ! మ మ్మరయ రా వమ్మా శుభాకారతన్.

వ. అంతలో రామచంద్రుం డిది యగస్త్యాశ్రమం బిది శరభంగాశ్రమం బిది మునిపల్లె యిది యత్రిమున్యాశ్రమం బదిగో యనసూయ యనిన చేతులు జోడించుకొని. 173

—♦ విమానమునుండి సీత యనసూయంగని మ్రొక్కుట ♦—

సీ. వేదశాస్త్రాది సద్విద్యార్ణవముతోడ
కమ్మనిహోమధూమమ్ముతోడ
స్వాహాస్వధావషట్కార శబ్దముతోడ
నిష్ఠాసమాత్తసద్గోష్ఠితోడ
స్నానసంధ్యాదిక సత్క్రియాసమితితోఁ
గాళ్ళముంగల మెట్టులేళ్ళతోడ
స్థలతత్త్వంబు విచ్చెడుచల్లవాయువులతో
నంభా యనుచు నార్చు నాలతోడ

తే. పత్తనంబులఁ గా దనుఫక్కి నగుచు
నలరుచుండెడు వనుల ఋష్యాశ్రమములు
జపతపంబులు గా నొకం డెపు డెఱుఁగని
ఋషులు బ్రహ్మణ్యు లివె వారి కేటికోళ్ళు. 174

వ. అనసూయ దిక్కు మొగంబై. 175

క. అనసూయయమ్మ ! నా కీ
వనురాగముతోడ నిడినయది వల్కల మే
ననయముఁ దాల్చుట నాకలి
యును దప్పియు లేక వనుల నుంటిని దల్లీ. 176

ఆ. అంగరాగ మిదిగో నపుడు నీపూసిన
యదియ యిపుడు పూసినట్టు లుండి
పరుఁడు ముట్ట వానిస్పర్శము నాకు లే
కుండఁ జేసె నమ్మ దండ మిదిగో. 177

—♦ భరద్వాజాశ్రమమున నెల్లరు విందారగించుట ♦—

వ. అని పలుకుచుండ విమానంబు చిత్రకూటంబునకుం జనియె రామ చంద్రుండు జానకిం గని మన మిదిగో చిత్రకూటంబునకు వచ్చితి మిదె యమునానది యదె భరద్వాజాశ్రమం బని చూపుచుఁ దవ్వల నున్నగంగానదిని శృంగిబేరపురంబును సరయూనదిని గోసలరాజధాని యగు నయోధ్యాపురంబును జూడుం డని చూపిన నెల్లవారుం జూచి సంతసించి రప్పుడు రాఘవుండు మన మీభర ద్వాజాశ్రమంబున నేఁ డుండి రేపకడ నయోధ్యకుం బోవుద మని విమానంబు క్రిందికిం దింపె నంత భరద్వాజుం డెదురేగి రాముని దోడితెచ్చి సుఖాసనాసీనుం గావించి. 178

క. రామా! సుఖివై వచ్చితె
నీమనమున మునులఁ బ్రోచునెఱి సఫలంబై
నేమముగఁ బరిణమించెనె
నీమహిళయు సోదరుండు నెగు లెఱి యుండే. 179

క. అనినన్ రాఘవుఁ డను నో
మునిచంద్రా! నీకటాక్షమున సేమమునన్
మని యున్నవార మిగ్గతి
ననుజుఁడు భరతునకు సౌఖ్యమా మునిచంద్రా. 180

వ. నీకుఁ గర్ణగోచరంబైనఁ జెప్పు మనుగ్రహింపు మనిన భరద్వాజుండు.

ఉ. నీవు బలెన్ మునీశ్వరులనేమము సెల్ల జటాజినంబులన్
నీవరసోదరుండును ననింద్యచరిత్రి మెసంగఁ దాల్చి నీ
పావనపాదుకల్ గొలుచు వాఁడయి పిదగురాకఁ గోరుచున్
జీవములన్ ధరించి ధరణిం దనుయాత్ర యొనర్చు చుండెడిన్. 182

తే. జనకునానతి రాజ్యంబుఁ గొనుట మాని
వనములకు నేగి పదునాల్గువర్షములును
వనటలం బడి వచ్చినవాని నిన్ను
నరయ నాసించి యున్నవా రచటివారు. 183

వ. రాఘవా! నీ వరణ్యంబులం బడినకష్టంబు లెల్ల నెఱింగియుంటి లోకకంటకుం డగురావణునిసంహరించుట సామాన్యంబు గాదు నీ వట్టివాని సంహరించి లోకోపకారంబు గావించి నీజన్మంబు సార్థకంబు గావించుకొంటివి నేఁడు నాయింట నాతిథ్యం బెల్లవారితోడం గూడి స్వీకరించి రేపకడ లేచి నీయింటికిం బోవ ననుగ్రహింపు మనిన రామచంద్రుండు నేను నీ ప్రసాదం బర్థించియున్నవాఁడ నయోధ్యాపురమార్గంబునందలివృక్షంబు లెల్ల వానరోపభోగ్యంబులై ఫలభరితంబులై యుండునట్లు వరం బనుగ్రహింపు మనిన వతం డట్లు కావుత మని పలికె యారాత్రి సర్వవానరరాక్షససైన్యంబులకు బృందారకులు మెచ్చువచ్చున గొప్పవిందు గావించె నప్పుడు రామచంద్రుం డాంజనేయుం గాంచి యిట్లనియె. 184

— రాముఁడు భరతునొద్ద కాంజనేయుం బుచ్చుట —

శా. సాకేతంబున కర్ధయోజనమునన్ సాకూత్కృతిం జేయుచున్
పీఁకం గూర్చుచు నిప్డు రాట్పదము నందిగ్రామ మొక్కం డగున్
నాకుం దమ్ముఁడు కైకపుత్త్రుఁ డచటన్ వర్తించు నాతండు నా
రాకం గోరుచు నుండు నీ వరిగి వార్తం జెప్పుమా వానికిన్. 185

క. పదునాల్గేడులు గడచిన
పదపడి నే వత్తునంచుఁ బలికితి నానాఁ
డది తప్పె నేని భరతుఁడు
సొదఁ జేరెద నని భావించె సోదర! చనుమా. 186

మత్త. ఏగునప్పుడు దారిలో నలశృంగిబేరపురంబుగ
నాఁగ వచ్చు గుహుండు డనంగ నొకండు నాప్రియమిత్రు మా
వేగవానికి నాదురాకను వించి పిమ్మటఁ దమ్మునిక్
బాగుగాఁ గనుపట్టి చెప్పుము నాశుభాగమ మంతయుక్. 187

వ. అనిన హనుమంతుండు మానవరూపంబు ధరించి వియద్గమనం బవధరించి గంగాయమునలన్ దాఁటి ప్రయాగపురం బతిక్రమించి శృంగిబేరంబున గుహునకు రామవృత్తాంతం బెఱింగించి పరశు రామతీర్థంబును వాలుకీనదిని గోమతీనదిని సాలవనంబునుం దాఁటి నందిగ్రామంబున నవతరించె నంతలోన. 188

తరువో. అనుకొన్ననాఁటికి నారామచంద్రుఁ
డరుదేరమిన్ వ్యసనాతురుఁ డయి
మునివృత్తి వల్కలంబులు గట్టి పత్రి
ములు నీళ్ళు నాహారముగఁ గొనుభరతుఁ
డనలచితిం బేర్చి యందుఁ బ్రవేశ
మాచరింపఁగ నెంచి యగ్రజు నతని
మనమున వినుతించి మఱి తల్లులకు న
మస్కృతులం జేసి మండెడునగ్ని. 189

క. దరికొలిపి మ్రొక్కి యురుకం
బరికించుచు నుండ గరుడి పఱతెంచుగతిక్
గరువలిపట్టి కడున్ వడి
ధరణికి లంఘించె వలదు తాళు మటంచున్. 190

—♦ హనుమ చితింబడనున్న భరతుకడఁబోడసూపుట ♦—

చ. వడి వడి వచ్చువాయుజుని బాహువు లెత్తి రఘూద్వహుండు నా
కెడ గలిగింపఁ బోకు మిఁక నేఁటికి జీవిత మిద్ది రామచం
ద్రుడుఁ గనరాఁడు వర్షములు తొమ్మిదియైదును డొల్లిపోయె నా
నుడిఖినరీతిఁ జేయుటఁ గనుంగొన నొప్పెడు నెల్లవారికిన్. 191

ఉ. ఎవ్వరు మీరు పేర్లు లని యెంచెద నా కిపు డేమి చెప్పఁగా
నివ్విధి నేగుదెంచితి రిఁకేమని చెప్పుదు రారఘూద్వహుం
డవ్వనితాశిరోమణియు నాతనితమ్ముఁడు నెమ్మిమీఱఁగా
నవ్వనవాస మీఁగికొను నట్టిరయై చనుదెంతు రందురే. 192

తే. అందు నట్టుల నే వాయునందనుండ
రామచంద్రుఁడు చనుదెంచె రమణితోడ
లక్ష్మణునితోఁ భరద్వాజులగృహమందు
నతిథియై యుండె నరుదెంచు నవలినాఁడు. 193

వ. అనిన భరతుం డానందభరితాంతరంగుండై వహ్నిప్రవేశోద్యమం
బున విముఖుండై వాయుపుత్రుం జూచి యతనివృత్తాంతం బడిగి
తెలిసికొని ప్రాణమిత్రమా! రామునివృత్తాంతం బొకింత తెలియం
జెప్పు మనిన యప్పావని యాతని కిట్లనియె. 194

సీ. చిత్రకూటమునందుఁ జేరిననినుఁ బుచ్చి
దండకారణ్యము దరియ నేగి
పెక్కురాక్షసులను నుక్కడంగించియు
మాయలేడిం జంపి మగువఁ గోలు
పోయి సుగ్రీవునిపొత్తున వార్ధిపై
సేతువుం గట్టి యాసేతుమార్గ
మున లంక కేగి సీతను జెరగొన్నరా
వణుఁ జంపి సీతతో వానరాళి

తే. తో విమానముపై వచ్చి త్రోవ నేఁటి
నిశ భరద్వాజగృహమున నిలిచి రేపు
పంచమీతిథి గావున వచ్చునిటకుఁ
దల్లులన్ నిన్ను జూచెడు తలఁపుఁజేసి. 195

వ. అనిన భరతుండు సంతోషభరితుండై. 196

ఆ. సీతవార్త తెలిపి శ్రీరాము నెట్టులు
నాఁడు తేర్చి తివు నేఁడు రాము

వార్త తెలిపినన్ను బ్రతికించినాఁడవు
నీఋణంబు తీర్ప నేతు నెట్లు. 197

వ. అని గారవించి వాని నంపి పుచ్చి శత్రుఘ్నుం బిలిచి. 198

—♦ భరతుఁడు పురాలంకారము గావించుట ♦—

సీ. మన కార్యదర్శనమహితభాగ్యం బెల్లి
యగు నయోధ్యాపుర మన్నికడలఁ
గయిసేయఁ బంపుము కలగుళ్ల వేల్పులఁ
గొలువంగఁ బుచ్చుము కులగురువుల
వైతాళికులు స్తోత్రపాఠకుల్ వివిధవా
ద్యంబులు నృత్తగీతాదికములు
తగిలి యుండెడు నట్లు తనరింపు మందఱ
మును వేదఘోషము వినుచు నడచి

తే. యుదయమున వచ్చురాముల కెదురుకోలు
సేయవలయును గాన నుచితము లయిన
యెల్లసంభారములు గూర్పఁజెలు దేశ
మునఁ గలుగువారిఁ దేవేఁగులను బనుపుము. 199

వ. మనసైనికు లెల్లసైన్యంబులం గూడి మనతో నుండునట్లు చెప్పుము రామచంద్రునితో వచ్చిన సర్వసైన్యంబునకుం దగిన శయనాసన భోజనభాజనాది సౌకర్యంబులు సంఘిల్లంజేయు మని నియోగించి తన తల్లులకా వృత్తాంతంబు తాన పోయి యెఱింగించి గడియ యొక మహాయుగంబుగ నా రేయిం గడపి మఱునాఁ డరుణోదయం బున లేచి కాల్యకరణీయంబుల నిర్వర్తించి సకలపరివారపరివృ తుండై శ్రీరామపాదుకలు శిరంబునం బూని పాదచారియై యెదురు కోలు సేయఁ బయనం బయ్యె నట రామచంద్రుండును భరద్వా జుండు సేసినవిం దారగించి వానరయూథసమన్వితుండై మఱు నాఁడు ప్రాహ్ణంబునఁ బుష్పకాధిరూఢుండై బయలుదేరి వచ్చుచు మధ్యేమార్గంబున గుహుం గాంచి సంభాషించి తన ప్రక్కం గూర్చుండం బెట్టుకొని నందిగ్రామంబునకు వచ్చుచుండె నప్పుడు.

## భరతశత్రుఘ్నులు రాము నెదుర్కొనుట

సీ. శిరమునఁ బాదుకల్ పరమభక్తిం గొని
వెన్నంటి తమ్ముండు వెనుక బంధు
గులు చను దేరగా గూడి రా మంత్రులు
పురజనులం గూడి భరతుఁ డపుడు
కోశమాత్రముగ నేగుడు నంతలో విమా
నధ్వని చెవుల కానంగ నచ్చె
నందఱు నాకాశ మరయుచు నుండఁగా
దింపిరి కని వారి దేవయాన

తే. మెదుటఁ గూరుచున్న సదమలాత్ముఁడు రాముఁ
డరయ వచ్చె మున్ను భరతున కపు
డంజలిఁ ఘటించి యరయుతమ్ముల రాముఁ
డరసి యెత్తె తనదు హస్తములను. 201

వ. భరతుండును వశివసిం బఱచి వచ్చి విమానంబెక్కి రాముని పాదారవిందంబులం బడి నమస్కరించి సీత కభివందనం బాచరించె నంత రాముండును. 202

ఉ. ఆతని నక్కునం గదియునట్లుగఁ జేసి శిరంబు చేతులన్
బ్రీతిమెయిఁ స్పృశించుచును బెల్లుగఁ గాఱెడుహర్షవారిచే
నాతనువెల్లఁ దడ్పుచుఁ బ్రియంబు నయంబు బెనంగొనం దగం
జేతమునం దోకించుకయుఁ జేయక యుండెను వాక్ప్రసంగతిన్.

చ. భరతుఁడు నట్టెఁ డయ్యుఁ గడ ప్రాలినలక్ష్మణుఁ గౌఁగిలించి బి
గ్గరగ సహోదరా! సుఖముగం బచరించితె యెల్లకాల మీ
శ్వరునకు సేవ చేయుచుఁ బ్రశంస యొనర్పఁగ వత్తు వెన్న నీ
ధర భవదీయ జన్మము కృతార్థము ధన్యము రామసంగతిన్.

వ. అని సుగ్రీవాదులం జూచి వీరు వీ రెవ్వ రెవ్వ రని లక్ష్మణునివలన సుగ్రీవజాంబవదంగదనీలనలాదుల వృత్తాంతం బెఱింగి వారి వారి దిక్కుమొగంబై. 205

—•భరతశత్రుఘ్నులు విమానమెక్కి సీతారాములం దర్శించుట•—

సీ. సుగ్రీవ ! నీవు మాసోదరుఁడవు మాకు
నీవు చేసినమేలు నెత్తి వహించు
నోవిభీషణ ! శత్రుసోదరుఁ డయ్యు నీ
వుపకరించితి మాకు నపరిమితము
జాంబవన్నామ ! యోషధులఁ దెప్పించి చ
చ్చినవారి బ్రదికింపఁ జేసి తహహా
నలవిశ్వకర్మ నీ విలను బొనర్చిన
సేతువినిర్మితి చెప్ప వచ్చె

తే. అంగద ! నికుంభిలాహోమ మందు నీవు
తెగి పొనర్చినకార్యము తెలియ వచ్చె
నీల ! నీచమూపాలన పోలి యుండె
నోసుషేణ ! నీవైద్యము భాసుర మగు. 206

వ. అని మఱియుం గలమైంద ద్వివిద గజ గవయ గవాక్షాదులం బ్రశంసించుచు జానకిదిక్కు మొగంబై చేతులు జోడించుకొని. 207

శా. అమ్మా ! వందన మెందు కన్నెఱుఁగ వీ వాయాయరణ్యానులం
దెమ్మాడ్కిన్ మెలఁగంగఁ జాలితివొ లంకేశుండు నిన్నట్లు క్రౌ
ర్యమ్ముం బేర్పడఁ గోసిపుచ్చుటల కెట్లోర్చిం బ్రవర్తింతువో
యిమ్మై నెంచిన గుండె బ్రద్దలగు నే నేమందు నీచందముల్. 208

ఆ. కన్న బిడ్డ నేను గడనుండ లే నైతి
హనుమమాత్ర మైన నాచరింప
లేనివాఁడ నైతి నోనాదుతల్లి నా
మనుగడ యిది వ్యర్థ మని తలంతు. 209

వ. అంత శత్రుఘ్నుండును రామలక్ష్మణులకును జానకికిని సాష్టాంగ నమస్కృతులాచరించిన రాముండు వానిం గ్రుచ్చిఁ కౌఁగిలించుకొని తనతొడమీఁదం గూర్చుండం బెట్టుకొనియె నంతలో విమానంబు నందిగ్రామంబున కఱిగినంత నెల్లరు నవరోహణంబు గావించి

రప్పు డటం గదియ వచ్చినతల్లులు లోనగువారిం గాంచి రామ
చదు్రిందు, 210

—♦ రాముఁడు నంది గ్రామమున తల్లులులోనగువారిం దర్శించుట ♦—

సీ. వగడాకు వలె నయి వగచు తల్లిఁ
కాళ్ళపైఁ బడి యేడ్చి గొల్లు మనఁగ
నామె కౌఁగిటఁ జేర్చి యనుము మినుము నాక
కనుల నీ ర్నించుచుఁ గాంచుచుండె
రాముఁ డప్పుడు సుమిత్రికును గైకేయికి
సాష్టాంగవందన మాచరించి
ప్రివరం బఠించుచుఁ బరిసరగతుఁ డైన
గురువసిష్ఠునకు మ్రొక్కం బోనర్చి
తే. పౌరులుం జానపదులును బంధుజనులు
మంత్రిసామంతులును మూగి మఱియు మఱియుఁ
బొగడుచును మోడ్పుగే ల్ఫాలమునను జేర్చ
వారి నందఱ మన్నించె స్వాగతముల. 211

వ. అప్పుడు కైకేయి రాము నక్కునం జేర్చుకొని దుఃఖించుచు ని
ట్లనియె. 212

సీ. ఆనాఁడు వని కేగునపుడు నీతో నాదు
నిశ్చయస్వాంతము నేఁ దెలిపితి
నీ వెఱింగితి వెల్ల నే నట్టిదాననో
కాని లోకము నన్నుఁ గాని దానిఁ
గాని శంకించెను నే నేమిసేయుదు
నాపురాకృత మిట్లు వేప నయ్యోఁ
బుట్టఁబుట్టవు వాచ్య ముగ సేయక నిగూఢ
ముగనుంచె నదియె నాపాలువు దులిపె
తే. తండ్రిఁ నే నిప్డు బ్రిదికితిఁ దావక మగు
నాగమంబున్ఁ జేసి నీయనుజ్ఞఁ డింక

నన్నుఁ గరుణించి చూచెడు నాదుబిడ్డ
రాజ్యభర మూని యేలుమీ ప్రజల నెల్ల. 213

ఉ. అంత సుమిత్ర రాఘవుని నక్కునఁ జేరిచి తండ్రి ! లక్ష్మణుం
డెంతయు భక్తితో మెలఁగెనే నిను నీసతి దండ్రిఁ దల్లి నా
స్వాంతమునం దలంచుచు నజస్రసపర్యల నాచరించెనే
మంతు వొకింతయే గలుగుమార్గమునం జన నెంచ లేదుగా. 214

వ. సీతం జేరఁ బిలిచి. 215

క. కారడవులందుఁ గాకా
క్రూరులకడ నుండి యెంత కుతిలఁ గుడిచితో
రా రమ్మ తల్లి లక్ష్మణుఁ
డేరీతిన్ నిన్నుఁ గొలిచె నెఱిఁగింపు మిటన్. 216

వ. అనిన సీతాదేవి సగౌరవంబుగ నిట్లనియె. 217

శా. అత్తా! లక్ష్మణమూర్తి నీదుకొమరుం డం చీవు భావింతువో
చిత్తంబందును వాక్క్రియాగతుల నన్ సేవించుచుం దల్లిగా
నత్తీర్ణాటవిఁ గంటి ఱెప్పవలె న న్నాలించి పాలించి పెన్
ముత్తో! నాకుఁ గుమారుఁ డయ్యె ననుచున్ ముమ్మాటికిం జెప్పుదున్.

వ. అని పలికి సీత కైకేయిఁ గదియ వచ్చి నమస్కరించి యిట్లనియె.

శా. ఏదో తప్పొనర్చి యుంటి నని నీహృత్పద్మమం దెంచుటన్
గాదే జంకునఁ బోలెఁ బల్కెదవు వాక్యంబుల్ తల్లీ! ముప్పునే
నేదో యెంచితిఁ గాని సర్వమును నా కీనాటికిం దెల్లమై
నీదోషం బిసుమంతయు లే దనియె మానివ్రాత మే వింటెఁ బో. 220

తే. లోకకంటకు లెల్లరు నీకతమునఁ
జెగిరి లోకము లన్నియుఁ దేజరిల్లె
దీన నింతని చెప్పఁగా లేనిపుణ్య
ఫలము నీ కబ్బె నని చెప్పవచ్చు నమ్మ. 221

వ. అనంతరంబ. 222

మ. తనకాళ్ళం బడి లేవకుండఁ నలసీతం జేతులన్ లేవ నె
త్తి నెనర్వెట్టగఁ గోసలేంద్రసుత యార్తిం జూపుచుం దల్లిరో
నిను సాక్షాత్పరదేవతామతిమెయిన్ నేనెంచి భావింతు మా
ఘనవంశంబు సముద్ధరించుటకు నై కన్పట్టితీ విట్టులన్. 223

తే. కూడుగుడ్డలు లేకుండఁ గుతిలఁ గుడుచు
నటవి నుండుటె కాక సంకటముపడుచు
రక్కసులు కోయుకోఁతల కెక్కరణిని
దాళఁ జాలితో తల్లి! కాంతామతల్లి! 224

వ. అని యందఱు నన్ని చందంబులం బల్కుచు నున్నసమయంబున భరతుండు రామపాదుకలు శిరంబునం గొని వచ్చి రామునిపాదం బులకుం దొడిగి సవినయంబుగా ని ట్లనియె. 225

—♦ భరతుఁడు రామునకు రాజ్య మప్పగించుట ♦—

మ. ప్రభువా! నాకడ నిల్లటం బిడిన నీరాజ్యంబు నీ కిచ్చితిన్
విభవం బేర్పడ స్వీకరించి త్రిజగద్విఖ్యాతిమై నొప్పుచున్
ఋభురాజప్రతిమానతేజమున నై యేలం దగున్ భూతలం
బభయం బేర్పడ సర్వసౌఖ్యములకై హాయిం బ్రవర్తిల్లుచున్. 226

మ. అనుచున్ ముద్రిక చేతి కిచ్చి భవదీయాశీఃప్రభావంబునన్
గొని నీపాదములన్ శిరంబునఁ గనుంగో నేలితిన్ లెంకనై
నను నీదాసునిఁ గా గ్రహించి పనులం గైకొమ్ము లోకేశ్వరా
నిను సేవించుచు నేను దమ్ములు మనన్ మే లెంతు ముల్లంబులన్.

వ. అని భరతుండు పలికినపలుకుల కెల్లవా రామోదతరంగితాంతరం గులై రంత రామచంద్రుండు విమానము దిక్కుమొగం బై. 228

తే. ఓవిమానమ! నీ విప్పు డుర్వి విడిచి
చని కుబేరునిచెంత కాతని వహించు
చుండు మని యంపి పుచ్చుడు నుత్తరంబు
నట్టి చనె నద్ది యెల్ల రబ్రంబు వడఁగ 229

వ. అంత వసిష్ఠానుమతంబున రామలక్ష్మణభరతశత్రుఘ్నులు జటావల్కలంబులు విసర్జించి దివ్యాంబరభూషితు లైరి సీతయు సకలవానరకాంతాపరివృతయై మంగళస్నానంబు గావించె నంత నొక్క శుభముహూర్తంబున. 230

సీ. కైసేసి రథ మెక్కఁ డాసుమంతుఁడు దేర
రాముఁడు గరిమతో రమణ నెక్క
వాలిపుత్రాదులు భద్రగజమ్ముల
నెక్కిరి వేర్వేఱ యొసక మెసఁగ
వానరరాక్షసేశ్వరు లొండురథముల
పై నధిష్ఠించిరి ప్రమద మెసఁగ
రాజమాతలు సీతతో జవరాండ్రతో
దివ్యరథము లెక్కి తెలువు వట్టి

తే. రట్లు పరివార మంతయు నయ్యయోధ్య
కరుగు నది యయి తూర్యముల్ మొరయ వంది
మాగధులు జయధ్వనుల సమంతము గను
సలుపుచుండఁ బ్రయాణము సాఁగ నయ్యె. 231

చ. భరతుఁడు తేజివార్వములపగ్గములం గొనె శత్రుసూదనుం
డరుదగునాతపత్రమును నప్పుడు వట్టెను లక్ష్మణుండు సుం
దర మగునాలవట్టమును దాలిచి వీఁచె విభీషణుండు చా
మరము మఱొండు వైచె సురమాన్యుఁడు రామనృపాలమౌళికిన్.

## —♦ శ్రీరామపట్టాభిషేకమహోత్సవము ♦—

వ. ఇట్లు సకలపరివారపరివృతుండై మహావైభవంబున రామచంద్రుండు దివ్యాలంకారాలంకృతం బైనసాకేతంబునకుం జని రాజమార్గంబునం బోవుచుఁ దనవెంట నంటి యాశీర్వదించుబ్రాహ్మణుల నాదరించుచుఁ బౌరుల నామంత్రించుచు హజారంబుకడ రథావరోహణంబు చేసి పాదచారియై కొన్నికక్ష్యాంతరంబులు దాఁటి తాను

దనతండ్రిగృహంబునకుం జని సుగ్రీవాదులం బరితుష్టులం గావించె
నంత మఱునాఁడు. 233

సీ. శ్రీరామపట్టాభిషేకంబు సలుప నై
భరతుండు వానరవరులఁ బంచెఁ
బ్రాక్సముద్రజలంబు వడి సుషేణుఁడు దెచ్చె
దక్షిణసాగరాంతరజలంబు
వడిఁ దెచ్చె ఋషభుండు పశ్చిమాంబుధిజల
ములు దెచ్చె గవయుండు ముదము పొదల
నుదగబ్ధిజలముల నొగిఁ దెచ్చెను నలుండు
నదులజలంబులు నాల్గుకడలు

తే. తిరిగి హనుమంతుఁ డాదివానరులు దెచ్చి
రపుడు బ్రాహ్మణపరివృతుం డై వసిష్ఠుఁ
డాదిగర్భేశ్వరి యనఁగ నైనసీత
తోడ రాముని దోతెచ్చి వేడుకమెయి. 234

వ. భద్రాసనంబున నాసీనులఁ గావించి వసురుద్రాదిదేవతలు దేవేం
ద్రునకుం బోలె వామదేవకాత్యాయనాదులం గూడి వసిష్ఠుండు
సామ్రాజ్యపట్టాభిషేకమంత్రంబులతో నభిషేకించె ననంతరంబ
మంత్రిసామంతాదులు పుణ్యాంగనలు నభిషేకించి రంత సీతా
రాముల రాజసింహాసనాసీనులం గావించి రనంతరంబ. 235

సీ. గురువు మంత్రులతోడఁ గోసలాధీశుశి
రమ్మున మణికిరీటమ్ము వెట్టె
భరతలక్ష్మణు లిరుపార్శ్వంబుల నిల్చి
వింజామరలు వైచి రంజిక మెయి
వెనుకచక్కి నిల్చి వేడ్క శత్రుఘ్నుఁడు
తెల్లనిఛత్రము నల్లఁ బట్టె
వానరరాక్షసేశ్వరు లాలవట్టముల్
వైచిరి విడకుండ పార్శ్వములను

తే. ఆంజనేయుఁడు కాళ్లొత్తునట్టి దగుచుఁ
బాదపీఠముకడ నుండె వాయుదేవుఁ
డిందుప్రభఁబున రత్నసమిద్ధతార
హారముం దెచ్చి రాముని యురుత వైచె. 236

క. దివి నుండి దేవదుందుభు
లవిరళముగ మ్రోసె నాడి రచ్చరలు కడున్
భువిఁ బడియెఁ బుష్పవర్షము
ప్రవిమల మయి దిక్కులెల్ల భాసిల్లె నొగిన్. 237

—♦ శ్రీరాముఁడు సుగ్రీవాదులకు బహుమతు లొసంగుట ♦—

వ. ఇట్లు పట్టాభిషిక్తుం డైనరామచంద్రు నభినందించువారై నానా దేశంబులనుండి మహర్షు లెందఱో చనుదెంచి దీవించి రంత రాముండు వారినెల్ల యథార్హంబుగ బూజించి సేవించి యంపి పుచ్చె వేదవేదాంగవేత్త లగు బ్రాహ్మణోత్తములకు గోవృషం బులు నశ్వరాజంబులు రత్నరాసులు నాభరణాంబరంబులు దానం బొసంగి పొసంగినసంతసంబున సుగ్రీవునికంఠంబున సూర్యప్రభా భాసమానంబగు దివ్యస్వర్ణరత్నమాలికను వైచి వాలిపుత్రునకుఁ బచ్చలభుజకీర్తుల నొసంగి చంద్రప్రభం బగుముక్తాహారంబు సీతా దేవిచేతి కిచ్చి తక్కినవారిం దగునట్లు సత్కరించె నప్పుడు సీత రామచంద్రుండు తన కిచ్చినతారహారంబు చేతం బట్టుకొని రాఘ వునివంక మొగంబు పెట్టిన నతం డింగితజ్ఞుండు గావున నీసంతో షంబు నాసంతోషమ యనిన నామె హనూమంతుం జేరఁ బిలిచి. 238

—♦ సీత హనుమంతునికి ముత్యాలహార మొసంగుట ♦—

శా. నాప్రాణేశ్వరువార్తఁ దెచ్చి చెవికిం బర్వంబు గావించియున్
నాప్రాణంబులు నిల్పివట్టితనుఁడై నాప్రాణబంధుండ వై
సుప్రేష్యుం డగునట్టినీ కిదిగో జిష్ణుం డీయఁగా నైనది
వ్యప్రేప్సం బగుతారహారమును నే నర్పింతుఁ గొమ్మా హరీ. 239

ఆ. అనుచు నాంజనేయుహ_స్తంబునం దేవ
తావిభుం డొసఁగిన తారహార
మిడిన నతఁడు దాని గడుభ క్తిమైఁ గన్ను
దోయిఁ గప్పుకొనియె దోయిటఁగొని. 240

వ. అంతరామచంద్రుండు తక్కు_వం గలజాంబవదంగదనీలనలవిభీష
ణాదులకు నుచితసత్కారంబులు గావించె నయ్యవసరంబున. 241

మ. హనుమంతుండు రమార్పితంబును వరంబైయొప్పుహారంబునన్
ఘన మానాయకముం గ్రహించి పగులంగా నల్పుచుండఁగ నే
మని సుగ్రీవుఁడు ప్రశ్న సేయుటయు నిం దారామనామంబు నుం
డెనో లేదో యని చూడ నిట్లు సలుపన్ నే నెంచుచుంటిం జుమీ.

తే. అనుఁడు సుగ్రీవుఁ డనియె నోయాంజనేయ
జాతిలో అప్పలోపల రామనామ
ముండు నని యెంతె నీలోన నుండునోయి!
చెప్పు మనుటయు హనుమంతుఁ డప్పు డడరి. 243

—♦ ఆంజనేయుని హృదయములో రామతారక మగపడుట ♦—

చ. తనహృదయంబు గోరుల నుదారతఁ జీల్చి కనుం డటంచుఁ జూ
పిన నట నున్న యెల్లరును వేడుకఁ జూచిరి సూర్యపుత్రుఁడున్
హనుమశరీరభాగ మది యంతయు రామమయంబుగాఁ గనుం
గొని కడువిస్మయంపడుచుఁ గౌల్చెను రామునిఁ బోలె నాతనిన్.

తే. రాముఁ డాతనిభ_క్తికి ర_క్తి కెంచి
నాచరిత మెంతకాలము దోచుచుండు
తన్మతలంబున నీవంతకాలము మని
యవల సామ్రాజ్య మొందుదు వని వర మిడె. 245

క. నీమది బ్రహ్మత్వంబును
గామించె నటింగి యుంటి కాలాంతరమున్
దామహితాశయములు నీ
కామెయి లభియింపఁ గలుగు నని వర మిడియెన్. 246

వ. ఇ ట్లెల్లవారి బహూకరించి వారి వారి పొందుపట్లకుం బంపుచున్న యప్పుడు విభీషణుండు విన్నబోయినమొగంబున నున్నం గని రాముం డి ట్లనియె. 247

ఉ. ఏ మిటు లుంటి తమ్ముడ! హృదీప్సిత మెయ్యది చెప్పు మన్న నా
రామునిమోముఁ గాంచుచును రావణుతమ్ముఁడు పల్కఁ బోయి యే
దేమగునో యటన్నమతి నించుక సందియ మందుచున్నచో
రాముఁడు తన్మనోరథ మరంబుగ నెర్గినవాఁడు గావునన్. 248

తరువోజ. నే నెఱుంగుదునోయి నీ యాశయంబు
నీవు నాతో రంగనిం గొల్చునపుడు
మానసం బది నీది మానాథు మీఁద
నాటి యున్నవిధంబు నాటికిం దెలిసె
నే నాఁటినుండియో యిక్ష్వాకునింట
నిది రంగనాథాఖ్య నెసఁగుచు నుండె
వానిపై నీకోర్కి వఱలుచు నుండె
వలయునేఁ గొను మిత్తు వాని నీ కిపుడు. 249

—♦ రాముఁడు విభీషణునకు రంగనాయకు నొసంగుట ♦—

వ. అని చెప్పి రంగనాథవిమానంబు దెప్పించి వాని కిచ్చి యి ట్లనియె.

మ. ఇది యిక్ష్వాకులనాఁటినుండియును మాయింటం బ్రపూజింప నై
పొదలుం దీనిమహత్వ మింత యనుచున్ బోలించి చెప్పంగ నే
రెది వాంఛించిన నద్ది వారి కగు నీ కే నిచ్చితిం గొమ్ము నీ
హృదయార్థంబు ఫలించె నం చిడి దయ న్వీక్షించె రక్షోవిభున్.

వ. అ ట్లిచ్చి యెల్లవారల నంపిపుచ్చి రామచంద్రుఁడు భరతుని యావ
రాజ్యపట్టభద్రుం జేసి లక్ష్మణశత్రుఘ్నులు తనకు నిరంతరపరిచర్య
లం జేయుచుండ సర్వజనరంజకంబుగఁ బ్రజాపాలనంబు గావించు
చుండె నని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు సెప్పు
మని సూతు నడుగుటయును. 252

—♦ ఆశ్వాసాంతము ♦—

సీ. రావణాపహృతయై దేవి జానకి లంక
నుండుట వాయు పుత్రుండు దెలుప
లక్షోపలక్షులై లక్షింపఁ దగు కపి
సేనతో వేసి ప్రస్థానభేరి
నీరధిపై సేతు నిర్మాణ మొనరించి
లంకాపురముఁ జొచ్చి శంకదక్కి
కుంభకర్ణాది రక్షోగణంబులతోడ
దశకంఠుఁ దెగ నేసి తత్పదంబు

తే. అనఘుఁడు విభీషణునకిచ్చి యతివఁగొంచు
దేవయానముతో వచ్చి దేశమునకు
రాజ్య పట్టాభిషిక్తుఁడై రమణమెఱయు
రాముఁ డీదర వేంకటరాయు నేలు. 253

గద్యము.

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ, కవి
సార్వభౌమాంధ్రవ్యాసాభినవ శ్రీనాథ వేదవిద్యాశారద
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన శ్రీకృష్ణ
రామాయణంబునందు యుద్ధకాండంబున
సర్వంబునుఁ జతుర్థాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# శ్రీకృష్ణరామాయణము

## ఉత్తరకాండము

### ప్రథమాశ్వాసము



శ్రీమద్వైకుంఠపుర
గ్రామణి యగురామమంత్రి ఘనమాహాత్మ్య
శ్రీమించుసీదరాన్వయ
మీమహిమండలమునందు నెసక మెసంగన్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు రామ భద్రుండు కోసలరాజ్యపట్టభద్రుండై వేదోక్తధర్మప్రతిష్ఠాపన క్రియాభిరతుండై రాజ్యభారంబు వహించి. 2

— శ్రీరామరాజ్యపాలనము —

సీ. వ్రతముగా వేగుచు బ్రత్యూషంబున లేచి
నిత్యకృత్యంబుల నియతిఁ దీర్చి
వేలిమి గావించి వేల్పుటింటికిఁ జని
వేల్పులం బితరులఁ బిలిచి కొలిచి
భరతాదిసోదరపరివృతుండై మంత్రి
సామంతులం గూడి చదురుఁ జేరి
దేశాగతులను బ్రాహ్మణాదులం గౌర
వించి పౌరుల నెల్ల వేడ్కఁ

తే. రాజకీయంబు లెల్ల మంత్రజ్ఞు లైన
మంత్రివర్యులు చేసినమంతనములఁ
జక్కఁబెట్టియు బంధుల సంతరించి
రాజ్యపాలన మొనరించెఁ బూజ్యుఁ డగుచు. 3

సీ. విధవలై వెలఁదుకల్ వెదకినం గన రారు
పుత్రుఁ డీల్గఁగఁ దండ్రి పుడమి లేఁడు
వ్యాధు లాధులు లేవు వసుమతిపై నిప్డు
నెల మూఁడువానలు నిలిచి కురియుఁ
బాడిపంటలు హెచ్చె ఫలపుష్పభరితముల్
తరుగుల్మలత లెల్ల ధరణి నెందు
జారచోరభయంబు జాడ చూపట్టదు
ధర్మము నాల్గుపాదముల నడచుఁ

తే. దలఁప వర్ణాశ్రమాచారములకు నెపుడు
లోటుపా టింతయే లేక పాటి గలిగి
యుండె వేదవేదాంగము లొప్పు మిగిలెఁ
గౌసలేయుఁడు ధర నేలుకాలమందు. 4

వ. ఇట్లు పూర్వరాజమార్గం బనుసంధించుచు రాజ్యపాలనంబు గావిం చుచున్నసమయంబున నొక్కనాఁడు కశ్యపాత్రి భరద్వాజ విశ్వా మిత్రాదిమహర్షు లగస్త్యపురస్సరంబుగా శిష్యప్రశిష్యగణంబుతో విద్యావినోదంబులం దేలుచు రాజమందిరంబుకడకు వచ్చి ద్వార పాలకముఖంబునం దమరాక రామున కెఱింగించి గృహప్రవేశంబు గావించిన రాముండు వారి కర్ఘ్యపాద్యంబు లిచ్చి పూజించి సుఖా సీనులై విశ్రమించి యున్నవారిం గాంచి నమస్కరించు చున్నసమ యంబున నెల్లమునులముఖ్యులై యగస్త్యుం డతనిదిక్కు మొగంబై యి ట్లనియె. 5

♦ రామునికడకుమహర్షులువచ్చి రావణాదులవృత్తాంత మెఱింగించుట ♦

శా. ముల్లోకంబుల నేచురావణు ననిన్ బుత్రప్రపౌత్రాళితోఁ
ద్రెళ్ళం జేసితి వెల్లలోకములకున్ దీపించె సౌఖ్యంబు మే

మెల్లన్ పోయిగ సత్తపోనియమముల్ పెచ్చంగ వర్తింతు మే
యల్లాటంబును లేక నీమహిమ మత్యంతంబుఁ గీర్తించుచున్. 6

వ. దేవా! లోకవిద్రావణుం డైన రావణుం డొక్కరుండ కాదు ఖర
దూషణ ప్రహస్త విరూపాక్ష మహోదర మహాపార్శ్వ కుంభక
ర్ణేంద్రజిత్ప్రభృతులు నట్టివారే వారిం జక్కాడి జగత్కల్యాణంబు
గావించితివి నీ వాదినారాయణుండవు ధర్మసంస్థాపనార్థం బి ట్లవత
రించితి వని రావణకుంభకర్ణాదులయు నింద్రజిదాదులయుఁ గుబేర
మాల్యవదాదులయు వృత్తాంతంబును వేదవతీచరిత్రంబును బలి
చక్రవర్తివర్తనంబును మందోదరివివాహంబును దేవేంద్రబంధనం
బును గార్తవీర్యార్జునచరిత్రంబును వాలిసుగ్రీవాంజనేయాదుల చరి
త్రంబులును లోనగుననేకవృత్తాంతంబులు చెప్పి రామాజ్ఞం గొని
వారు నిర్గమించి రంత రాముండు రాజ్యపాలనంబు చేయుచున్నంత
నొక్కనాఁడు పూర్వాహ్ణికంబు నిర్వర్తించి రామచంద్రుండు
మంత్రిసామంతపరివృతుం డై కొలువుకూటంబునకుం జని ధర్మా
సనం బధిష్ఠించి నానావిధాభియోగంబులు తీర్మానించుచు లక్ష్మ
ణుం బిలిచి యి ట్లనియె. 7

మ. భటులను విశ్వసించు టది పాడి యనంబడ దీవు పోయి ముం
గిటికడ నెవ్వరెట్టిపనికే నరుదెంచి మెలంగుచుండ్రొ ప
స్ఫుటముగఁ బిల్చి వారి నిటఁ జొప్పడఁ జేర్పుము నా నతండునున్
దటుకున ద్వారదేశము గనం జనె రామునిశాసనంబునన్. 8

—♦ రామునిసభకడ కొకకుక్క వచ్చుట ♦—

క. చని కార్యార్థుల నెవ్వరిఁ
గనఁ జాలక నొక్కచోట ఘనరవ మెసఁగన్
గొనకొని మొఱిగెడు కుక్కన్
గని యి ట్లని పల్కె దాని కడ కేగి తగన్. 9

తే. శ్వానమా! రాజసభ నీకు వలయుకార్య
మెద్దియే నుండెనో చెప్పు మేను దీర్తు

ననుచు కుక్కుర మి ట్లను ననఘుఁ డైన
ధర్మమూర్తికిఁ దెలుప నేఁ దలఁచి నాఁడ. 10

తే. అనుచు లక్ష్మణుఁ డోఁగాత మనుచు లోని
కఱిగి కుక్కురవాక్యము లనియెఁ దెలియ
రాముఁ డచ్చెఱుపడి విని రాఁగఁ బిలుము
వచ్చి యది నాకు నెఱిఁగింప వచ్చు ననియె. 11

వ. లక్ష్మణుండు మరలి వచ్చి కుక్కుం గని లోనికి రా రామాజ్ఞ
యనిన నది వాని కి ట్లనియె. 12

సీ. దేవాయతనములు ద్విజగేహములు రాజ
సభలు వేల్పు లెఱంగుస్థానము లట
కధమజాతికిఁ బోవ నయితి గా దని ధర్మ
శాస్త్రముఁ దెలుపు నోసదమలాత్మ!
ధర్మాత్ములకు దీనితత్వము తెలియును
దెలియకుండును నృపశీలకునకును
నా నివ్వెఱంపడి లోనికిఁ జని కుక్క
పలికిన పలుకులు దెలియఁ జెప్పెఁ

తే. దెలిసి రాముఁడు మంత్రులుఁ దివ్యమునులు
వెంట రాఁగ హజారము వెలికి వచ్చి
దీనదీనముగా భాంకృతిం బొనర్చు
దాని నెత్తుటఁ జొత్తిల్లుదానిఁ గాంచి. 13

వ. కరుణాతరంగితాంతరంగుండై శ్వానంబుదిక్కు మొగంబైయి
ట్లనియె. 14

శా. ఓసీ కుక్కురమా! భవచ్ఛిరమునం దువ్వెత్తుగా నెత్తురుల్
దోసిళ్ళాదిగఁ గాఱుచున్నయవి నీదుఃఖప్రకారం బదే.
మా సర్వంబు వచింపు మింతయు భయం బుండంగఁ బో దిట్లు నీ
కేసంబంధమునన్ ఘటిల్లినదియో యేనై విచారించెదన్. 15

వ. అనిన సారమేయంబు రామునిదిక్కు మొగంబై యిట్లనియె. 16

—♦ కుక్క తనదుఃఖం బెఱింగించుట ♦—

సీ. ప్రజ నిద్రఁ బోవుచో రాజు మేల్కొనియుండు
నతఁడె కర్తయు భోక్త యఖిలమునకు
నతఁడెఁ దల్లియుఁ దండ్రి యతఁడె సర్వంబును
ధర్మరక్షకుఁడు నాతండె సూవె
ధర్మముచేఁ బ్రజల్ ధరియింపఁ బడుదురు
ధరియించు ధర్మ మాధరణివిభుఁడు
ధర్మమునం బొందఁ దగనివస్తువు లేదు
దావదయాదులే ధర్మమగును

తే. ఐహికాముష్మికము లొందఁ నైనవాఁడు
ధర్మరక్షణ మొనరింపఁ దగును నీవు
పరమధార్మికుఁ డవు సత్యవారినిధివి
సువ్రతుండవు నిన్నెంతు సుగుణధామ. 17

క. నాపైఁ గోపము సేయకు
మేపాపము సేసి యెఱుఁగ నే నోదేవా!
బాపనయ యొకఁడు నాతల
నీపగిదిన్ బగుల నేసె నిపు డేమందున్. 18

వ. ఆతండు సర్వార్థసిద్ధి యనుపేరివాఁ డీయూర నొక్కబ్రాహ్మణ
గృహంబున నివసించుభిక్షుకుం డనిన రాముండు ద్వారపాలకునిం
బుచ్చి వానిం దెచ్చి యిట్లనియె. 19

క. నీ వీకుక్కను గొట్టితి
వే విప్రుఁడ కుక్క నీకు నేయపచారం
బేవిధముగా నొనర్చిన
దో వివరముగా వచింపుఁడో యని మఱియున్. 20

ఉ. కోపము ప్రాణవాయువులఁ గ్రోలెడు సర్పమువంటిశత్రువౌ
గోపము పాపమూలక మగున్ మఱి కోపము గల్గినట్టి డె

నెవ్వరు లెన్నొ జన్మములు నోపి పొసర్చినవాఁడ వైన నా
యాపరమార్థ మెల్ల నదులందున కల్పిచయట్టివాఁ డగున్. 21

క. చదివినవాఁడవు వోలెన్
మదిఁ దోపఁగ వత్తునీవు మర్యాద చెడన్
గదిరినకోపభరంబున
నిది చేసితి వని తలంతు నెఱుఁగం జెప్పుమా. 22

తే. అనిన బ్రాహ్మణుఁ డి ట్లను వనఘ! నేను
గోపమునఁజేసి యీకుక్కఁ గొట్టినాఁడఁ
దప్పు చేసితి దీనికిఁ దగినదండ
మును విధించి పునీతుఁగా నొనరుపఁ దగు. 23

— బ్రాహ్మణుఁడు తనతప్పుం జెప్పుట —

చ. బికిరము నెత్తఁగాఁ దిరిగి భిక్ష లభింపక కొట్టుకొంచు నే
నొకచిఱుసందుదారిఁ జనుచుండఁగ నడ్డయి పొమ్మనంగఁ బో
వక యిది నిల్చినం గినుక పర్వఁగ దండము వెట్టి కొట్టితిన్
సకలము సాక్షిగాఁ దెలిపి నాఁడను రాజసభాస్థలంబునన్. 24

వ. అనిన రాజేంద్రుండు సభాసదులం గలయఁ బరికించి యీ బ్రాహ్మణున కెట్టిశిక్ష విధింపవచ్చుం జెప్పుఁ డనిన దండనీతిజ్ఞ లగునంగిరఃప్రభృతు నెద్దియో పలుక నున్నసమయంబునఁ గుక్కు- రం బి ట్లనియె. 25

చ. వినుము నృపాల! చెప్పెదను వీనికి మీ రెదియేని శిక్ష సే
యను దలపోయుచుంటి రటు లైనను నేను వరంబు గోరుదున్
ననుఁ గరుణింపుఁ డీతనికి నానుడికారముఁ బట్టి కర్జముల్
బొనరుప నిచ్చగింపుఁడని మ్రొక్కి వచించుచు నాజ్ఞ వేఁడుదున్. 26

క. నావుడు రాముం డి ట్లను
నీ వనునది యేమి చెప్పు మే నది తగునేఁ
గావింతు నట్లు నా నది
యీవిధముగఁ బలికె నబ్రి మేర్పడుగతిగన్. 27

సీ. కాలంచరం బనఁ గల్గు ప్రదేశము
నందు సత్యాఖ్యదేవాలయ మగు
దానికి నీతని ధర్మకర్తగఁ జేసి
నియమించి పుచ్చుట నేఁ దలంతు
మా జాడ కిద్దాని కీ రట్లు గావింపుఁ
డనిన రాముఁడు వల్లె యనుచు నపుడు
కులపతిత్వం బది గలుగ విప్రుని నభి
షిక్తునిఁ గావించి చెప్పి పుచ్చె

తే. విప్రుఁ డేనిక నెక్కి వివిధవిభవము
లెసక మెసఁగంగఁ జనె నంత నిచటివారు
నివ్వెరం బడి నవ్వుచు నృపతిఁ గనిన
నాతఁ డాకుర్కురముఁ గాంచి యనియె నిట్లు. 28

మ. నిను హింసించినవానికిం దగినటుల్ నే హింసఁ గావింప నుం
డినయ ట్లేవిధి నెట్లు కోరితివొ వానిన్ శిక్షితుం జేసి న
ట్లనుకో నొప్పునొ చెప్పు మన్న శునకం బారాముసిం గాంచి నే
మును పచ్చోటఁ బతిత్వముం బడసి పెంపుం గాంచి యున్నట్టిఁడన్.

తే. దేవతారాధనము చేసి తిని విశిష్ట
మన్న మర్థము స్వామికి నరుగుదేరఁ
బబ్బములయందు దానిని వ్యయము చేసి
ధర్మతత్పరతఁ నేను దవిలి యుంటి. 30

వ. ఇట్లు స్వామిభక్తుండనైయుండియు నేనెప్పు డెట్టి విత్తాపహారణంబు
నుం జేయకుంటి నేది యెటు లయ్యెనో చెప్పఁ జాలం గాని దానం
జేసి నా కీనీచజన్మంబు సంప్రాప్తం బయ్యె నీబ్రాహ్మణుం డిపు డేనిక
నెక్కినను బైపయి నెట్లగునో జగం బెఱుంగు ననిన నెల్లరుం బర
మాశ్చర్యంబు నొంది రలర్కంబును రామునాజ్ఞం గొని పూర్వ
జ్ఞానంబు గలదిగావున వారాణసికిం బోయి ప్రాయోపవేశంబు చేసి
ప్రాణంబులం బాసి పరంధామంబు నొందె నంత గొంతకాలంబున
కొక్కఁడ. 31

మ. ఒకనాఁ డర్కకులావతంసము సమస్తోర్వీసుపర్వాల్ గురుల్
సుకవుల్ రాజవరేణ్యులున్ సచివులున్ జూపట్టుగోష్ఠిన్ బ్రపం
చకవృత్తాంతము లాలకించుచు మహోత్సాహంబునన్ బొల్చున
ప్పాకచారుం డరుదెంచె నచ్చెరువు దా నొయ్యొయ్య మాసెత్తఁగన్.

—♦ వేఁగులవాఁడు శవభక్షణ వృత్తాంతము చెప్పుట ♦—

క. వచ్చిన వేఁగులవానిన్
సచ్చరితులు మంత్రివరులు చయ్యనఁ గని యో
పచ్చర యెచ్చటికిం జని
వచ్చితి వచ్చెరువు లెవ్వి పలికెదొ తెలియన్. 33

వ. అనిన వాఁ డిట్లనియె. 34

ఆ. ప్రెగడలార! నేను బహుదేశములు మెట్టి
పోయి పోయి మంచుభూధరంబు
కడను కొన్నినాళ్ళు కాలాపి యుండితి
నపుడు వినఁగఁ గనఁగ నయ్యె వెఱపు. 35

సీ. ఉర్వీధరముచెంత నొలికిమిట్ట యొకండు
కల దందు శవ మొండు గానఁ బడును
నిలువెల్లఁ దానిపై మెలఁగును లుకలుక
మని పురుగులకోటు లనవరతముఁ
గాలు ముక్కుపుటములఁ గాల్చునట్టిద యయి
నలుమూలలుం దాఁక నడచుచుండు
నట భూమి యంతయు నత్యసహ్యం బయి
ప్రాణికోట్లకు బహుభయద మగును

తే. దాని కెడ యయి లోకులు దారివట్టి
ముక్కులన్ వస్త్రములతోడ మూసికొనుచుఁ
బోవుచుండెద రిట్టటు చేవ చెడఁగ
కుణప మద్ది నశింపదు కుళ్లి యుండి. 36

ఉ. ఆశవ మట్టు లాపొలమునందు బడల్పడి పాడె నుండ నా
కాశమునుండి ప్రత్యహ మొకానొకదివ్యశరీరధారి స
ర్వాశల వెల్గఁ జేయుచు నిజాభరణంబుల నప్సరోజనా
భ్యాశము గల్గి దేవవరయానముపైఁ జనుదెంచి కించు నాన్. 37

తే. కుణపముం గోసి మాంసము కుళ్ళియున్న
దానినిం దిని యటఁ దొట్టెలోన నున్న
నీళ్ళు ద్రావి యానం బెక్కి వెళ్ళుచుండు
నప్సరోగీయమానుఁడై యనుదినంబు. 38

వ. అని చెప్పిన రామచంద్రుం డత్యంతాశ్చర్యమగ్నాంతరంగుండై దేవమునీంద్రులం గాంచి యిది యేమిప్రకారం బిట్టి దివ్యపురుషుం డట్టిగిట్టనిపీనుఁగుం దినుటఁ జూడ మహాద్భుతం బూహింప వచ్చెడిం గావున మన మందఱము నందుఁ బోయి విచారించి వత్తమని కుబేర పుష్పకంబు నాహ్వానించి వచ్చినదానిపై సకలపరివారపరివృతుండై చారసూచితమార్గంబు ననుసరించి మంచుకొండప్రాంచలంబున శ్మశానవాటిక కింతదూరంబున విశ్రమించి రింతలోన. 39

—♦ రామచంద్రుండు దేవర్షి సమేతుఁడై యటఁజనుట ♦—

సీ. కంకణఝుణఝుణత్కారంబు లెసఁగ న
చ్చర లిరుచక్కి చామరలు వీవఁ
గింకిణీధణధణాంకృతు లొప్ప రంభాద్య
నిమిషకామినులు నాట్యములు సలుప
నమరగంధర్వవిద్యాధర కిన్నర
ప్రముఖులు జయజయధ్వను లొసంగఁ
గమనీయతరఘంటికాక్వణక్వణముల
దశదిశల్ కడుఁ బ్రతిధ్వనుల నీన

తే. లలితమాల్యాదిదివ్యభూషలు ధరించి
వివిధమణిగణఖచిత నవీనరుక్మ
మయువిరాజితదివ్యవిమాన మెక్కి
దివ్యపురుషుఁడు చనుదెంచె దివమునుండి. 40

క. వచ్చి వియచ్చరయానము
చెచ్చెర డిగి రుద్రభూమిచెంగట గబ్బల్
హెచ్చగ నుండినకుణపం
బిచ్చం దిని నీళ్ళు ద్రావి యేగుచు నుండెన్. 41

వ. రామచంద్రుండు వానిం జూచి నివ్వెఱంపడి వానిం బట్టుకొని
రమ్మని యానవెట్టిన భటుండు వానిం జేరి. 42

ఉ. రాముఁడు నిన్నుఁ బట్టుగొని రం డని పంచెను మమ్ము రమ్ము నా
నామహితాత్ముఁ డెంతయును స్వాంతమునం గడుచింత సేయుచున్
మై మదియున్ వడంకికొన మాట యొకింతయు లేక సిగ్గునన్
రామునిమ్రోలకుం జని కరంబులు మోడిచి నిల్చెఁ బెల్చనన్. 43

వ. రామభద్రుండు వానిం జూచి కృపాంతరంగితాంతరంగుండై నీ
వెవ్వండవు నీవృత్తాంతం బెట్టిది చెప్పు మన నతండు గడగడ వడం
కుచు ని ట్లనియె. 44

—♦ దండికుని వృత్తాంతంబు విని వాని ననుగ్రహించుట ♦—

సీ. దేవ నే నిక్ష్వాకుదివ్యవంశంబునఁ
బ్రభవించినట్టేడఁ బ్రభువరుండ
దండికుం డనుపేరఁ దనరినవాఁడ నా
నాధ్వరంబులు చేసినట్టిఘనుఁడ
వివిధదానంబులు వేనవేలు పొనర్చి
నాఁడ వ్రతంబులు నాకు లెన్న
సలిపితి ధర్మముల్ నలువురు మెచ్చంగ
నిలుపరించితిఁ బ్రజానిచయమందు

తే. నెన్నియే ధర్మకార్యము లేఁ బొనర్చి
నాఁడ నే నెట్టిప్రాణి కేనాఁడు గాని
యింత యన్నము పెట్టుట నెఱుఁగు నట్లు
కాళకపోయితి దాన నీగతి లభించె. 45

తే. అపుడు నాపౌనర్భినయితరాతిధర్మ
కార్యములఁ జేసి స్వర్గతి కలిగెఁ గాని
యన్నదానము సేయనియట్టిదాన
నాకు క్షుద్బాధ యధికమై తాఁక నయ్యె. 46

సీ. దేవత్వ మంది నే దేవురించుటఁ జేసి
విధివిహితం బయి వెలయ నయ్యె
శవభోజనము నాకు క్ష్మాతలంబున నున్న
యిది నాశవంబ యే నెల్లనాఁడు
దివినుండి దిగి వచ్చి తిని పోవుచుండెద
యోరఘురామ యోభూరిధామ
నిను నే నెఱుంగుదు నేను నీవాఁడ నా
దుఃఖంబు చల్లార్పఁ దొడఁగు మనఘ

తే. ఏటికోళ్లు పొనర్చెద హీనుఁడ నఖు
దేవురించెద నన రామదేవుఁ డతనిఁ
గాంచి కరుణారసార్ద్రహృత్కమలుఁ డగుచు
నెల్లరు వినంగ నిటు చేసె సల్లపనము. 47

శా. ఏ రాజన్యుఁడ లోకమేలుదొర నింతే కాక నీవాకునర్
గూరెర్ బంధుత నీకు నాకు నిఁక నీ కుందెల్లఁ బోనాడు మే
నీరోగంబున కౌషధంబు వెదుకన్ వీక్షింతు నీ వేగుమా
స్వారావాసముఁ బొంద నం చనిచి తా సాకేతమున్ జేరియున్. 48

వ. పేరోలగం బుండి తద్విషయవిచారముఁ గావించునప్పుడు వసిష్ఠుండు
రామచంద్రునిదిక్కు మొగంబై యి ట్లనియె. 49

క. అన్నోదకసమదానం
బెన్నఁ ధరయందు నెందు నేనియు లే దో
సన్నుతమతి దండికుఁ డతఁ
డెన్నఁ సత్క్రియలఁ జేసె నే కా నెపుడున్. 50

వ. అన్నదానంబు చేయనికతంబున నిట్లు వచ్చెం గావున నీవు వాని పేర నన్నసత్రంబులు వెట్టించినఁ దత్ఫలంబు నాదండికునకుం జేరు దాన వానికిఁ క్షుధాభరంబు దీఱు ననిన లోకేశ్వరుండు లోకంబునం దెల్లెడ నన్నసత్రంబులు పెట్టించె దానం జేసి దండికున కాదోషంబు నిశ్శేషం బయ్యె నది మొదలతండు నివృత్తక్షుత్పిపాసుండై భూలోకప్రయాణంబు మాని స్వర్లోకంబున సుఖంబుండె నంత నిక్కడ రాముండు కొలువుకూటంబున నిండోలగం బున్నయవసరంబున విజయుఁడు మధుమత్తుఁడు కాశ్యపుఁడు పింగళుఁడు కుటిలుఁడు సుధాముఁడు కాళియుఁడు భద్రుఁడు దంతవక్త్రుఁడు సుమాగధుఁడు లోనగుచారులు నానాదేశంబుల సంచారంబు గావించి వచ్చి సభామధ్యంబున విశ్రమించియున్నయప్పుడు రామచంద్రుండు వారిం జూచి మీ రేయేదేశంబుల సంచరించితి రేయేవిశేషంబు లెఱింగితి రెవ్వ రేని మమ్ము గాని మాపరిపాలనంబును గాని యెట్లుచెప్పుకొనుచుండిరో చెప్పుఁ డనిన వారు వారాయాతెఱంగులను క్రమంబుగాఁ దెలియ విన్నవించినంత భద్రుం డనువాఁడు లేచి భయం బభినయించుచున్నం గని రామభద్రుండు. 51

—♦ భద్రుం డనుచారుఁడు చాకలివానిమాట లెఱింగించుట ♦—

చ. భయపడుచుంటి వేమి విని వచ్చితి విచ్చటమమ్ము లోకు లే
దయినను దూల నాడుకొనునట్టి ప్రసంగము లాలకించి తే
భయ మఱి చెప్పు మిప్పనికె వార్తికులన్ నెలకొల్పుచుండు టే
ర్లయ మది యైన నాగ మది యైననుఁ జెప్పుట చారధర్మమే. 52

క. నా విని భద్రుం డిట్లను
దేవా నా విన్నదెల్ల దేవరయెదుటన్
నే విన్నవింతు నెందున్
నావలనన్ దప్పయైన నతి యొనర్తింతున్. 53

వ. నే నీవారం బుత్తరకోసలంబుల సంచారంబు సేయ నియమి
తుండ నై నానాస్థలంబుల నరయుచుం బోయి యొక్కచో
నొక్కచాకిపేటం గనుంగొంటి నదియును. 54

సీ. పులిసినకల్లు లొట్టెలనుండి మీఁదికిఁ
జాలువాఱుటఁ గడల్ గవులుకొనఁగ
నూసి వాసనఁ గొట్టు మైలబట్టల మూట
లం దందు వాకిళ్లయందు వ్రేల
నావిరితోఁ బాగ లావరింపఁగ వస్త్ర
ముల నుడికించుబానలు దలిర్ప
గూనసీళుల ముంచికొని గుడ్డ లుదుకుచో
ఛీఛీ రవము పుట్టి బిట్టుమ్రోయ

తే. గంజికుండలు నలుగడఁ గలిగి యుండఁ
గోళ్ళు కుక్కలు ముంగిళ్ళఁ గూత లిడఁగఁ
ద్రాఁగి కొందఱు తందనాల్ వాఁగికొనఁగ
నాఁడఁ గనవచ్చె చాకలిగూడె మొకఁడు. 55

శా. ఏ నాప్రాంతమునుండి పోవునపు డెంతే శబ్ద ముద్భూతమై
కానన్ వచ్చెను నాదుజానుఁగులకుం గౌతూహలం బేదు న
ల్లై నిల్వం బడి వింటి దంపతుల కన్యోన్యంబు పోరాటమై
యే నాఁటన్ గడ తేలనట్టి దని యూహింపంగ నయ్యెం బ్రభూ. 56

వ. ఆరజకదంపతుల కలహంబున నొక్క దుర్వచనంబు నాశ్రవణ
విదారణం బొనరించునట్టి దయ్యె నయ్యది విన్నవింపఁ జాలకున్న
వాఁడ ననుగ్రహింపు మనిన రామచంద్రుండు. 57

క. సందేహ మేల యది నా
కుం దాఁకెడినట్టి దైన కొదుకక చెప్పన్
డెందంబు సేయు మెల్లరు
విందురు చర్చింతు రట్టి విధముం దెలియన్. 58

ఆ. అనిన భద్రుఁ డనియె నడలు గుదుర్చుచు రామ
చాకివాఁడు తనదు చాన పోరుగు
వానియింటి కేగుదాన ని న్నొల్ల నే
రాముఁ డనుచుఁ దలఁప రాకు పొమ్ము. 59

వ. ఆమాట నాకుఁ గర్ణశూలం బైనంత నే నెంతయు సంతాపించుచు
నిట రా నైతి ననిన లక్ష్మణుం డాగ్రహించుచు లేచి హు
మ్మనుచు ని ట్లనియె. 60

మ. ఎవఁ డాకర్ణరుఁడు వానిఁ బట్టుకొని ర మ్మెక్క వాని నాల్కన్ నరా
జి వెసం గోసెదఁ గొ ర్తవేసెద ననం జిత్రంబు వోలెన్ సభా
భవనం బెల్ల చలంబు లేని దగుచున్ వ్యాహారముం జేయ నో
డి వగం గూరినచిత్తముం గలిగి యుండెన్ దెప్పపా ళ్లేగఁగన్. 61

తే. అంతలో విల్లునమ్ములు నసులుఁ బూని
భరతశత్రుఘ్నులు సుమిత్రపట్టిచెంత
నిలిచి ర మ్మని పిల్చి రాఘలునినాల్కఁ
గోయుటకుఁ బోవువా రయి కొంతలోన. 62

వ. రాముఁ డెల్లవారి వారించి మంత్రులదిక్కు మొగం బై. 63

ఉ. చాకలి యేమికారణము స్వాంతమునం గొని పల్క నయ్యెనో
చాకిత వాని కెగ్గతి పొసంగఁగ జేసెనొ దాని నంతయున్
మీకు నెఱుంగఁగాఁ దగును మీఁదటికార్య మ దెట్టిరీతిగా
నీకడ విశ్వసించెదరొ యింతయుఁ జూడక వేగిరింతు.రే. 64

—♦ చాకలివానిం బిలిచి విచారించుట ♦—

వ. అని రామభద్రుండు పలుక మంత్రులాభద్రునిం బిలిచి నీవీ వీరభటు
లం గూడి పోయి యీచెప్పిన చాకలిని జాకెతను వారి బందుగులను
మఱియు నా గూడెంబునం గల కొందఱను బిలువ నంచి తెచ్చి
నంత సుమంత్రుండు చాకలిం బిలిచి యిట్లనియె. 65

శా. నీపే రేమి? కులంబు వృత్తి మఱియు న్నీగ్రామముం జెప్పుచున్
నీపెండ్లామును నీవు పోరుకొనుచున్ నిత్యంబు ఘూర్ణించుటల్

రూపింపం దగుఁ గార్యకారణములన్ రూహింపఁ బ్రదర్శించుచున్
నీపట్లం గరుణింతు మెట్టి దయినన్ విఖ్యాతముం జేయుమా. 66

వ. అనినం జాకి వీఁక మెయి వెట్టి నభినయించుచు ని ట్లనియె. 67

ఉత్సాహ. తల్లి లేదు నాకు మొదలె తండ్రి లేఁడు చూడఁ గా
వల్లకాటఁ బండుకొందు వట్టిగడ్డఁ దిందు నా
కిల్లు లేదు పేరు లేదు వృత్తి రాజ్య మేలుటల్
కల్ల గాదు పెండ్లి లేదు గాని పెండ్ల ముండెఁ బో. 68

తే. కుక్క పెండ్లాము సంకటికూటికుండ
మఱొక పెండ్లాము దానితో మాటి కేను
బోరుచుందును నా కది ఘోరరాక్ష
సి వలెఁ దోఁచెడు విడిచితిం జిన్ననాఁట. 69

తే. నన్ను మీ రేమిచేయఁగా నున్నవారొ
యనుచు బీతింతయును నాదుమనమునందు
లేదు నే రావణునిఁ జంప నాదునింటఁ
గట్టి నాఁడను దత్పత్ని నుట్టిమీఁద. 70

వ. అని మఱియు ననేకాసంగతప్రలాపంబు లాడువానియెడల నప
స్మారరోగంబు స్థిరీకరించియు వాని నవుల నుండం జెప్పి వాని
పెండ్లాముం బిల్చి వీఁ డెవ్వఁడు వీనిస్థితిగతు లెట్టివి మీ కిరువుర
కేమిటికిఁ గలహంబు వచ్చినది చెప్పు మనిన నప్పడంతియు. 71

క. నామగఁడు వీఁడు వీనికి
నేమాత్రము గాని తెలివి యేర్పడ దెడఁదన్
నామాట యన్న మండెడు
తామస మది పెచ్చి మొఱఁగుఁ దబ్బిబ్బులుగన్. 72

— ♦ చాకలివాని దుండగములు ♦ —

సీ. కలు ద్రావు నిచ్చలు కడవలకొలఁదిగా
నోడ తెఱుంగక నేలఁ బడి పొరలును

గోచియుం బెట్టక గొన్నాళ్ళు దిరుగును
　　గొన్నాళ్ళు నారల వెన్నొకట్టు
వల్లకాటికిఁ బోయి వచ్చును రేలెల్లఁ
　　గుక్క నా నార్చును గునుకఁ డెపుడు
కూటికుండలు ప్రీలఁ గొట్టును ననుఁ బట్టి
　　వాతలు వెట్టును గోత కోయుఁ

ఆ. గూరుచున్నఁ దిట్టుఁ గుసిచినం దిట్టును
నడవఁ దిట్టు లేవ నడలఁ దిట్టు
వీథి కేగఁ దిట్టు వెడలకున్నం దిట్టుఁ
దిట్టకున్నఁ దిట్టుఁ దిట్టఁ దిట్టు. 73

ఆ. కట్టుకొన్న మగఁడు గా యని నే నెంత
సైచి యున్నఁ గాని సైపఁ డితఁడు
చిన్నతనమునుండి యెన్న నే నె ట్లుంటి
నో జగంబు సాక్షి యోనరేంద్ర. 74

క. తనచావు పెరలచావున్
మనమున నెఱుఁగండు నెట్టి మచ్చుటికము లేఁ
బొసరించు నెఱుఁగఁ డెద్దియు
మనుజాకృతి నున్నమృగము మానవనాథా. 75

వ. అంత నా చాకలితల్లిదండ్రులం బిలిచి మీకొడుకు నడవడి యెట్టిది మఱియు మీ కోడలిగుణం బెట్టిది యెఱింగింపుఁ డనిన వా రి ట్లనిరి. 76

సీ. వీఁడు మాకొమరుండు వీని కై దేవులు
　　వచ్చినదాదిగాఁ బిచ్చిపనులు
చేయ నారంభించె జేయించితిమి వైద్య
　　మెంతయో ద్రవ్యము నేటఁ గలిపి
పెండ్లి చేసినఁ బిచ్చి వెడలెడు నని దీనిఁ
　　దెచ్చి కట్టితి మది హెచ్చి పోయె

మేనరికం బిది మేనకోడలు దీని
వంక నల్కంతయు వంక లేదు

తే. మగని దైవముగాఁ జూచు మమ్ముఁ గన్న
తల్లిదండ్రుల వలెఁ జూచుఁ గల్ల కపట
మెఱుఁగ దెప్పుడు పెరచోట్ల కేగఁ బోదు
మాగతియు దానిగతి యిట్లు మంట గలసె. 77

వ. అంత వారిలో వృద్ధు లగువారిం బిలిచి యీచాకి యెట్టివాఁడు చెప్పుం డనిన వా రి ట్లనిరి. 78

సీ. ఈచాకలికిఁ బిచ్చియే కా దపస్మార
రోగము హెచ్చె నుగ్రుండు వోలె
రేపుఁబు న్మాపులు మాపల్లె గడగడ
లాడున ట్లార్చు నం దందు మెట్టి
కంటినిండ న్మాకుఁ గలుగదు కును కెప్పు
డెవని జంపునో యని యెద భయ మగు
నాలు మంచిది దానినాలుకఁ గోయును
నని క త్తిఁ గొని వచ్చు ననవరతము

తే. వానిపలికెక్కి పలుకు లెవ్వాఁడు గాని
సరకు సేయఁగ రాదు వాఁ డరయ నొక్క
కుక్క యనుచు దలంచి మే మొక్కమొగినిఁ
గూడి కాపురముంటి మాగూడెమందు. 79

వ. అంత మఱియు నాపిచ్చివాని బోనునం బెట్టి యోరీ నీవు నిన్న నీ పెండ్లాముతో నేమేమొ వాకొంటివఁట యందలి యాథార్థ్య మెఱింగింపు మనిన వాఁ డి ట్లనియె. 80

ఆ. నిన్న నేను బుట్ట నే లేదు లేనప్డు
నాదుభార్యతోడ వాదులాడ
నెట్లు వెఱవు[illegible]గలుగు నేర్పడఁ జెప్పఁడీ
యడఁగుచుంటి నేన యొడయఁడ నయ్య. 81

ఆ. ఒలికిమిట్టచెంత నున్నది నాభార్య
దానితోడ నేను దాండవంబు
సలిపి నాఁడ నచటఁ జచ్చినదామె నే
నిచటఁ జచ్చినాఁడ నిది నిజంబు. 82

—♦ వసిష్ఠవామదేవాదులు తీర్మానించుట ♦—

వ. అట్లున్నసమయంబున వసిష్ఠవామదేవాదులు మంత్రులతో నింక నీ విచారణతో నవసరంబు గాన్పింపదు విరమింపుం డని రామమూర్తి దిక్కు మొగంబై. 83

మత్త. వీఁడు వేదురు నిశ్చయం బిఁక వీని వీడుట పోలు నే
నాఁడు నేని ధరాత్మజామణి వంక వంక సుమంతయేఁ
గూడి యుండు నటంచుఁ బల్కఁగఁ గూళ యై పచరించునో
వీఁడుఁ డిట్టివిచార మిం కిట వెట్టు లీ రని యెంచెదన్. 84

సీ. విశ్వంభరాగర్భవివరంబునం దయో
నిజ యయి వెలసినసుజనవినుత
పరమవేదాంతియై ప్రస్తుతి కెక్కిన
జనకునికూఁతురై మనినసాధ్వి
యాదివిష్ణ్వవతార మై దిక్కులన్ మ్రోయు
శ్రీరాముపత్నియై చెలఁగెడుసతి
సాక్షాన్మహాలక్ష్మి జానకి యనిపేరు
ముజ్జగంబుల మ్రోయఁ బొదలు గరిత

తే. అగ్నిహోత్రములోఁ జొచ్చి యైక్య మంది
యువల వెలుఁగుచు వెలివచ్చి యతనిచేతఁ
బరమపావనశీల యన్ ప్రస్తుతులను
గాంచి మించినదా యమ్మ కనవె రామ. 85

తే. బ్రహ్మదేవుఁడు శివుఁడు నప్పట్ల వచ్చి
నీదునర్ధాంగి యెన్న నయ్యాదిలక్ష్మి
యామెయెడ నావగింజంత యైన దోష
ముండు నని చెప్పఁ డెట్టి మూర్ఖుండు గాని. 86

ఉ. పావనశీల రావణునిపాల వసించుటఁజేసి దోష మా
దేవికడన్ వచింపఁగలదే బె యొకండును లేదు లేదు మే
మావిధ మంతయుం గనుచు నామెను గాచుచు నుంటి మింక నీ
భావమునందు సంశయము పట్టఁగ నీమకు మేలు మాయమర్. 87

క. అని పలికి రపుడు నీరగు
జనకుం డరుదెంచి యెట్టిసంభాషణముల్
పొనరించెనో కోడలినిం
గనుఁగొనుచున్ వాని మఱతె కరుణావార్ధీ. 88

తే. బ్రహ్మలంతలు పలికినపలుకు లెల్లఁ
ద్రోసిరా జని యెవ్వఁడో క్రూరుఁ డైన
పిచ్చిచాకలి కలు ద్రావి ప్రేలినట్టి
మాట పాటించి యీరీతి పాటు తగునె. 89

క. జానకియెడ రాఘవ! నీ
మానసమునయందు నింతమాత్రమ మైనం
గానిగతిఁ దలఁచితే నధి
కేన స్నది చుట్టుకొనెడు నీ వెలుఁగు మెదన్. 90

వ. అనిన రామచంద్రుం డొండాడక గురువులకు నమస్కరించె నప్పుడు సుమంత్రుం డెల్లవారి నామంత్రణంబు చేసి పిచ్చిరజకుని వైద్యాలయంబునకుం బుచ్చి వైద్యంబు గావించె నంత. 91

—♦ రావణుండు యమునితోఁ బోరిన కథ దుర్వాసుండు చెప్పుట ♦—

మ. మునివంద్యుం డగు రామచంద్రుఁడు సముద్భూతప్రభావంబునన్
వినతప్రక్రియ లెల్ల విస్తరిలఁగాఁ బేరోలగం బున్నయ
ప్డనఘుల్ పెక్కురుమానివర్యులొకనాఁడామ్నాయముల్ పల్కుచున్
జనుదేరం గని రాముఁ డెల్లర నమస్కారంబులం గొల్చుచున్. 92

వ. సుఖాసీనులం గావించి యున్నంత దుర్వాసుండు రామచంద్రుని దిక్కు మొగంబై యి ట్లనియె. 93

మ. అజరుఁడై యింద్రముఖాదిదేవతల నీహామాత్రి నోడించి తా
నజితుండై చనుటొండె లేక సకల ప్రాణ్యంతకుండై సమ
స్తజగంబున్ దిగమ్రింగు మృత్యు వెపుడుం దన్నంటి యుండన్ భట
వ్రజ యుక్తుం డగుకాలు నోర్చి ననుచోఁ బాలస్త్యుఁ డల్పుండొకో.

ఆ. పిడుగు వానిఁ బట్టి కడకేల విఱిచితి
చొప్పు బెండు వోలెఁ జెప్ప నేల
నీ పరాక్రమంబు నిఖిలలోకములు నీ
కతన శాంతి నొందెఁ గాదె రామ. 95

వ. అనిన విని రామచంద్రుండు దుర్వాసుని దెసం గని మునీంద్రా!
మృత్యుముఖాదిభృత్యవర్గంబును గాలదండాది మహాసాధనంబు
లుం గలిగి కాలాంతకుండు నా నొప్పుకాలుండు నాదశకంఠునిపాల
జాలిం బడుట యెట్టిది తద్వృత్తాంతంబు వినం జిత్తం బయ్యె
నియ్యెడ నించుక చెప్ప ననుగ్రహింపు మనిన నతం డిట్లనియె. 96

తే. నారదమహర్షి తా నొక్కనాఁడు సకల
భూతలంబును దిరుగాడుబుద్ధిఁ జనుచు
రావణుఁడు చేయు ఘోరకార్యములు నెఱిఁగి
ప్రజల రక్షింపఁ దలపోసి ప్రజ్ఞమీఱ. 97

తే. దర్శనం బిచ్చి దశకంఠధరణిపతికి
నీ పరాక్రమమునకును నీదు ప్రతిభ
కలఁతియు నలంతి యగు నేలఁ గలుగు జనుల
నోర్చునది యెట్టిపాటి యౌ నో తలంప. 93

పంచ. రసాతలంబునందు శక్తి రక్తి యుక్తి భుక్తులం
బసం జెలంగుయోధు లెంతమంది యైనఁ గ్రిందు మీఁ
దెసంగుటల్ గనంగ లేక హెచ్చి పెచ్చి యున్నవా
రసిప్రభావ మందుఁ జూప నౌ బళా! యనం బ్రజల్. 99

క. ఆపయనమునకు మునుమున్
దాపగుసంయమని యందు దర్పోద్ధతుఁడై

దీపించుఁ గృతాంతుం డను
కాపురుషుం డొక్కఁడు వానిఁ గని పో మ్మనలన్. 100

వ. అని చెప్పిన రావణుండు మంత్రిపరివృతుండై చతుర్విధసేనాసమేతుండై కదలి కతిపయప్రయాణంబుల సంయమనీపురంబునకుం జనియెనదియును.

—♦ యమలోకవర్ణనము ♦—

ఉ. నిప్పులయేఱు నల్గడల నిండి వెలుంగుచుఁ బాఱుచుండు నె
ల్లప్పుడు గొప్పకోటయు ననంత మగాధము నౌనగడ్తయై
యొప్పెడు నంచుఁ జెప్పనయి యుండును మృత్యువు లోనిభృత్యు లె
ట్లెప్పు డె దేది ఱేఁడు వచియించునొ యంచు మెలంగుచుండ్రటన్.

సీ. ఎఱ్ఱఁగాఁ గాలినయినుపస్తంభంబులఁ
గౌఁగిలింపం జేయఁ గ్రాగువారు
నసిపత్రవనమునం దట్టిటు మెట్టింప
మేయి నెత్తురు వాఱంగ మిడుకువారు
కుంభీపాకమునందుఁ గూలింపఁ బడి బడి
యడలు గుప్పుచు మొఱ్ఱోయనెడువారు
నినుపకోఱలకుక్క లెగిచి మర్మంబులు
పట్టి పీఁకఁగఁ గుయిపెట్టువారు

తే. ఇనుపతొండుగులు కాలిచి మెఱియ లింగ
ములకుఁ దొడుగంగ మొఱపెట్టి పొగులువారు
మఱియు నె న్నెన్ని యాతనల్ మఱియు మఱియు
నొందుపాపులు చూపట్టుచుందు రందు. 103

వ. అట్టిసంయమనీపురంబు వరణకవాటంబు ఛేదించి లోనికిం జని కావలివారలం గడతేర్చి రావణుండు నానావిధనిరయంబులఁ దీవ్రవేదనలం బొందువారి నెల్ల బంధవిముక్తులం గావించి కొండ లవియ ధనుష్టంకారంబు సేయుచుండె నది విని దండధరుండు వివిధపరివారపరివృతుండై రణరంగమునకుం జని రావణుం గాంచి యి ట్లనియె. 104

చ. ఎవఁడవు రోరి నీ విటులు మృత్యుముఖాదిమహాబలాన్వితుం
డవునను దాఁక వచ్చితె కటా యెవఁడో యొకపాటి యంచు నెం
తువ యనుకొందు నాదయిన దోర్బలసార మెఱుంగ వక్కటా
భువి నగుపీరివారిపయిఁ బోవుట గా దిది వేఁడి పిడ్గురా. 105

క. నాదండశక్తి యెఱుఁగవు
నాదండ వసించు మిత్తి నాకై పెనఁగన్
నీదగుసామర్థ్యం బది
యేదో చూచెదవు గాక యెల్లరు మెచ్చన్. 106

క. అనుచుం గ్రోధము పెంపున
ధనువున్ సారించుకొనుచు దైత్యునిమీఁదన్
ఘనతరశస్త్రాస్త్రంబులు
గనుఁగొనుచుండంగ వర్ష గతిగాఁ గురిసెన్. 107

శా. పౌలస్త్యుం డవి యెల్ల లీలమెయి విధ్వస్తంబు గావించుచున్
జ్వాలాజాలముఁ గ్రుమ్మరించునిషువుల్ చాల్వారఁగా నేయుచున్
గాలుం బిట్టవియంగ మొత్తుటయు నక్కాలంబున న్మిత్తి ముం
దై లా వెన్నఁగఁ జూపుచున్ దనుజుపై హా!హా! యనన్ వ్రాలుచున్.

చ. ఒకపరి మ్రింగివేయుటకు నుల్లమునేయుచుఁ జెంతఁ జేర రా
సకలసురాసురప్రకరసాంద్రభయప్రదుఁ డైనరావణుం
డకటకటా! యటంచు శమనాదులు కుందఁగ మృత్యుదంతముల్
తుకతుక రాలఁ గొట్టి వడితోఁ దరిమెక్క రణ మీఁగి పాఱఁగన్. 109

ద్విపద. యముఁ డంతఁ గోప మత్యధికమై సర్వ
సుముఖంబు లగుశరస్తోమముల్ వైచి
క్రమముగా బహుళశస్త్రము లస్త్రములను
సమరారిపై వైచి యార్చె బిట్టేచి. 110

ఆ. కనలి దశముఖుండు ఘనశస్త్రముల వానిఁ
దోలఁగ నేసి శమను దొడ్డవాతి
ములికి నొవ్వ నేసి పోకారి తని పెద్ద

111

పంచ. పరేతరాట్టు బిట్టురేగి బ్రాహ్మ్య మాదు లస్త్రముల్
సురారిపై నిగిడ్చి చూచి చూచి వ్యర్థ మాట లా
పరుండు దోర్బలంబు హెచ్చఁ బర్వుచుంట కాత్మలోఁ
గరంబు చింత చేసె నిట్లు కాలవైపరీత్యమున్. 112

క. నాయస్త్రంబులు శస్త్రము
లీయెడ నొకయింతయేని యేడ్తెఱఁ జూపం
గా యశముఁ గూర్పఁ జాలని
వై యుండె నిఁ కేమి సేయ నగునో తెలియన్. 113

మత్త. కాలదండ మొకండు నాకడఁ గ్రాలుచుండెడు దాని నీ
వేలుపుంబగపైఁ బడ న్వడి వేయుదున్ సుర లెన్నఁగాఁ
గాలధర్మము నొందు వాఁ డని కైవడిం గొని దండముల్
బూలఁ బత్తిరి బూజసేయుచుఁ బోవఁ జేసెడు నంతలోన్. 114

వ. బ్రహ్మదేవుండు ప్రత్యక్షంబై నీకాలదండంబు వ్యర్థంబు గా నొప్ప
దిప్పు డీతనిపై నేయకుందుము నీ విప్పటి కితనికి లోఁబడి యుండు
మని యాదేశించిన నతండు పోరు మాని రావణుం జేరఁ బిలిచి
తన యోటమిం బ్రకటించుచుం గప్పంబు గట్టి యంపిపుచ్చె రావ
ణుండు నట నట్లు విజయంబు గాంచి పాతాళలోకవాసులం గాక
పదునాలుగులోకంబులవారిఁ జయించి మొక్కలీఁడై యుండె నని
చెప్పి మునులు రామాజ్ఞం గొని తమతమపొందుపట్లకుం జని
రనంతరకాలంబున. 115

## —♦ గృధ్రోలూక సంవాదము ♦—

తే. ఒక్క కాననమున గూబయును గృధ్ర
యును నిరంతరమును గూడుకొనుచు నుండు
నని మదీయకులాయ మియ్యది మదీయ
మనుచు నొండొరు వాగ్వాద మతిశయిల్ల. 116

వ. అంత నారెండును రామునికడకు వచ్చి తమవివాదం బెఱింగించి
నంత గృధ్ర యి ట్లనియె. 117

సీ. ఈవు దేవుళ్ళకే దేవుఁడ వగుదువు
నీతి శుక్రునికంటె నెఱి గలాఁడ
వెల్లభూతములకు నీవె ముఖ్యుండవు
చంద్రుని మించినచల్లఁదనము
సూర్యుని మించినచుఱుకును గలవాఁడ
వబ్ధి బోల్ గాంభీర్య మంది యుందు
యమధర్మమున నొప్పు నట్టిఁడ వయ్యు నో
రిమిని భూదేవికి సమత వత్తు

తే. సర్వసంపన్నుఁడవు నీవు సర్వగురుఁడ
వీవు దుర్జయుఁ డ వమర్ష మీాన యగుదు
చెప్పి నిను మున్ను వేల్పొండు చెప్ప నొప్పు
నిట్టినీకు నావిన్నప మిదె మహీశ. 118

శా. నే నెంతో శ్రమచేసి చేసి యొకయిల్ నిర్మించుకొన్నాఁడ మున్
జానొందంగ వనంబునం దోకమహోత్మ్రజంబుపై నింత లో
దానిం దేహబలంబుపెంపునఁ గడున్ దర్పంబునన్ గూబ గై
కో నయ్యోం గరుణించి నాగృహము నాకుం జెందఁగాఁ జేయవే.

వ. అని గృధ్రము చెప్పుచుండ దివాంధం బి ట్లనియె. 120

సీ. చంద్రదినేంద్రదేవేంద్రయమాంశముల్
గొని రాజు జన్మించుఁ గుతలమందు
రాజు మనుష్యుఁ డన్ రమణయే కాని సా
క్షాద్దేవదేవుఁడు సత్యసరణి
నారయ మూరట నారాయణుఁడ వీవు
నీదు సౌమ్యత జగన్నిభృత మయ్యె
నీవు దాతవు నేత వీవ ప్రజాపతి
నీవ యిందుండవు నీవ శుచివి

తే. నీవు ధనపతివే పద్మ నీగృహమున
నుండె శత్రుమిత్రులు నీకు నొక్కరూప

నీదుశాసన మది ధర్మనిరతి నుండు
నీదుకోపము మిత్తికి నెలవ యగును. 121

ఆ. దుర్బలులకు రాజె దొడ్డబలం బగుఁ
గన్ను లేనివారి కన్ను రాజె
నీదుతేమయు వర్ణనీయము గావున
విన్నవించు చుంటి వినుము దేవ. 122

క. ఏనాఁడో నేఁ గట్టిన
నానీడం బాక్రమించి నన్నుఁ దోలె నయో
యీనాలి గ్రద్ద నాకున్
నానీడము గలుఁగునట్లు నడపుము చర్యన్. 123

వ. అనిన విని శ్రీరామచంద్రుండు తనమంత్రులం బిలిచి మీ రీ
గృధ్రోలూకంబులవివాదమ్ము విన్నవార కదా యని గృధ్రంబుం
దిలకించి. 124

ద్వి. ఎన్నేండ్లనుండి నీ వీయింటిలోన
నున్నవాఁడవో చెప్పు మోగృధ్రరాజ
యన్న వచించె ని ట్లని గ్రద్ద భూమి
యెన్నఁడు జనులతో నెసక మెసంగి
యున్నదియో నాఁటనుండియు నందు
నున్నవాఁడ నటంచు నొప్పించి పలికె. 125

తే. గూబ యి ట్లను నేనాఁడు క్షోణి చెట్లు
చేమలుం గల్గి యుండెనో ప్రేముడిమెయి
నేను గట్టించి కట్టినదానియందు
న్నాఁటి నుండియు నే నుందు మేటిఱేఁడ. 126

వ. అనిన రామచంద్రుండు మంత్రులదిక్కు మొగంబై. 127

—♦ శ్రీరాముఁ డులూకపక్షము తీర్పుచెప్పుట ♦—

సీ. అతిగహనము ధర్మ మతిసూక్ష్మ మయి యుండుఁ
దెలియ వచ్చినదానిఁ దెలుపుదు నిట

గ్రిద్ధ జగత్సృష్టి క్రిమము దప్పించెను
దెలిపె యథాక్రిమస్థితిని గూబ
కావున గూబదే కాని గృహంబు
గ్రిద్దది కాదని రాముఁ డనియె
మంత్రు లందఱు రాముమాటయె సరి యని
గ్రిద్దను శిక్షింపఁ గడఁగి రపుడు

తే. నింగివా కయ్యె నీగ్రిద్ద సంగత మగు
నిద్ది మును బ్రిహ్మదత్తుఁడన్ నృపుడు గౌత
ముఁడు శపించుట ని ట్లయ్యెఁ బొమ్ము నీవు
దీని స్పృశియింపు మంత ము క్తిని గమించు. 128

వ. అనిన రాముండు గృధ్రిరాజంబు మేనిపైఁ జేయివేసినంత నది శాపమోక్షంబు నొంది దివ్యపూరుషుం డయి నమస్కరించి స్వర్గంబునకు నిర్గమించె నులూకంబును రామానుజ్ఞంజేసి నిజనివా సంబునకుం జనియె నంతఁ గొంతకాలంబున కొకనాఁడు యమునా తీరంబునుండి భార్గవచ్యవనపురస్కృతు లగునూర్గురు తాపసులు వచ్చి రామదర్శనంబు గావించి మధుఁ డను రాక్షసునిపుత్రుండు లవణాసురుని దౌర్జన్యం బంతయు నెఱింగించి వాని శిక్షించి మమ్ము రక్షింపు మని ప్రార్థించిన రాముం డట్లు గావుత మని వారి నంపి పుచ్చె ననంతరంబ సుమంత్రుండు వచ్చి రాముం గాంచి యి ట్లనియె. 129

—♦ సీతాదేవికి సీమంతోత్సవము చేయుట ♦—

శా. సీమంతం బొనరించుచుండి రిపు డాసీతామహాదేవికిన్
ధీమంతుండు వసిష్ఠుఁ డెల్లరు పురంధ్రిరత్నముల్ మూగికో
క్షేమారోగ్యజయాభయాదు లొదవం జేయంగ నౌ హోమముల్
నీమాతల్ నినుఁ బిల్వఁ బంచిరి ననుం విచ్చేయవే వేడుకన్. 130

వ. మఱియు సీతాసీమంతోత్సవమునకు మిథిలాపురంబునుండి సుమేధా జనకులును దక్కనుంగలబంధువర్గంబును వచ్చియుండె. 131

క. అనవుడు రాముఁడు నగుమో
మునఁ దమ్ములతోడ నంతిపురి కేగి వసి
ష్ఠున కెఱఁగి తల్లిప్రక్కఁ
గన నట్టులు గనుచునుండెఁ గౌతుక మెల్లన్. 132

క. అపుడు వసిష్ఠుఁడు హోమము
లపురూపముగా నొనర్చినంతట రాజుల్
నృపమణి స్పృశియించినపయిఁ
గృపమై జానకికిఁ దొడిగి రెల్లపురంధ్రుల్. 133

తే. అంతఁ గల్యాణవేదికయందు నిలిపి
జానకీరాముల వసిష్ఠసంయమీంద్రు
డంబువుల గుశలవముల మఱియుఁ జదివి
వేదమంత్రాల నభిషేక విధు లొనర్చె. 134

వ. అంతవసిష్ఠాదులును బురంధ్రీరత్నంబులును నరిగినపదంపడి కౌసల్య
రామచంద్రుం గని యిట్లనియె. 135

క. చూలింతరాలు సతి కీ
కాలంబున బుణ్యకథలు కడుమోదము గా
బోలించి చెప్ప నొప్పును
శ్రీ లెసగుం దీన ననుచు సీతం గనియున్. 136

శా. అమ్మా నీ విపు డేమహామహులపుణ్యాఖ్యాన మాలింపఁ గా
నెమ్మిం జేయుచు నుంటొ చెప్పుమనుచుం బ్రీతిం బ్రదర్శింపఁగా
నమ్మేధావిని యత్తదిక్కుమొగమై హస్తంబులన్ మోడ్చి స
త్యమ్మైన సొమ్ముగ నెంచులోకవిభువృత్తం బేను కీర్తించెదన్. 137

ఉ. ఎవ్వఁడు రావణాదు లగుహీనకిరాతులఁ గూల్చి లోకమున్
నెవ్వగ తేక యుండఁగ గరుణించెనొ మించినమైథిలేశ్వరుం
డెవ్వనికాళ్ళులం గడిగె నెవ్వఁడు సీతకుఁ బ్రాణవల్లభుం
డవ్వరమూర్తిదివ్యకథ యా నది గా కితరం బెసంగునే. 138

తే. అనినఁ గౌసల్య రాముని గని కుమార!
లెస్స వచియించె జానకి లేకు లెన్న
నాదికవి చెప్పె దాని నయ్యనఘమూర్తిఁ
బిలువ సంపుము ప్రార్థించి పిలువ వచ్చు. 139

—♦ వాల్మీకులు సీతకు రామాయణ మెఱింగించుట ♦—

వ. అనిన రామచంద్రుండు తల్లియాజ్ఞంజేసి వాల్మీకుల నాహ్వానించి పూజించి సీతాభిప్రాయం బెఱింగించిన నతండు తన రచించిన రామాయణము నంతయు నెఱింగించు వాఁడై చిత్రపటంబులతో నున్న గ్రంథంబు విప్పి సీతముందు వెట్టి తల్లీ! చూడు మిది మద్విరచిత రామాయణకావ్యంబు చిత్తగింపుము. 140

ఉ. అనవుడు సీత యి ట్లనియె నార్యచరిత్ర మదెల్లఁ బుట్టకుం
డినమును పే రచించి తని నే వినియుంటిని జూచినట్లు లే
యనువునఁ జేసియుంటి వెటనైన విభేదపదంబు లయ్యె నే
కనుఁగొన నబ్బి మిట్టిపని కావ్య మొనర్చితి రీర లెంతలో. 141

తే. అనిన వాల్మీకి యనుఁ దల్లి ! హరి జనించు
టకు నయుతవర్షములకు ము న్నొకదినమున
బ్రహ్మ నాకడ కరుదెంచి పలికె నెల్లఁ
బూస గుచ్చినమచ్చునఁ బుణ్యచరిత. 142

క. కరబదరసదృశముగ నే
నరసి రఘూద్వహునిచరిత మంతయుఁ గృతిగా
విరచించి నాఁడ నెందే
నెరసంతయు నెరసుఁ జూప నేరరు పేరున్. 143

చ. మునులకు సందియంబులను బోకడఁ బెట్టఁగఁ జాలినట్టియా
జనకునియజ్ఞవాటమున సంభవ మంది పవిత్ర మైన మి
త్రునికులమందు విష్ణు వనఁ దోఁచెడురామునిధర్మపత్నివై
పొనరిననిన్ను లక్ష్మి వనఁ బోలును గాదె సతీవతంసమా. 144

వ. నీ వీరామాయణ మంతయు వేదమయం బని విశ్వసింపు మిది గో
చూడు మీతండు మీమామగారగు దశరథమహారాజేంద్రుం డిం
ద్రునర్ధాసనంబునం గూరుచుండి ప్రసంగించుచున్నవాఁ డనిన సీత
చేతులు జోడించుకొని. 145

ఉ. ఎంతటిపుణ్య మేయెడల నీమహితాత్మ్కుఁ డొనర్చియుండెనో
యెంతల కైన దర్శనము నేనియు నీయనియట్టిబ్రహ్మముక్
బొంత మెసంగఁ గాఁ దనదుబోజ్జను గాంచెను మేలు మే లహో
స్వాంతము శాంతభావమున సంతస మందుచునుండె నెంతయున్.

వ. అని యంతలో శాంతాఋశ్యశృంగులం జూచి యీమిథున మెవ్వరు
మహాత్మా చెప్పు మనిన నతండు. 147

క. శాంతయును ఋష్యశృంగుఁడు
కాంతామణి ! నీదుమామగారిసవనముక్
సంతసముతోడ నరయుచు
శాంతిం గొనియున్నవారు జననీ ! కనుమా. 148

వ. అనినన్ జానకి సంతోషితాంతరంగయై కన్ను విచ్చి కాంచి. 149

ఉ. నాకు ననంద యీయమకు నాదగువందన మీమహాత్మ్మరా
లేకరణిం దపించినదో యిట్టిమహోన్నతు బ్రహ్మకల్పునిన్
గైకొనఁ గల్గె వల్లభునిగా నిటు వీరలు పుణ్యదంపతుల్
నాకనుదోయి నేఁడు సఫలం బని లోనఁ దలంతు నెంతయున్. 150

వ. అంతం బ్రాచేతసుం డమ్మా ! యదె యజ్ఞపురుషుండు పాయసం
బొసంగుచున్నవాఁడు చూచితే యనిన సీత హర్షసమేతయై. 151

క. చేసేతఁ బాయసం బిటు
నీసదమలమూర్తి యొసఁగు నీరాయనికిన్
నాసంతసంబు చెప్పన్
గాసంతయుఁ జాలకుంటిఁ గ్రతుభుగ్వినుతా. 152

వ. అనిన నతండు మఱికొంత గ్రంథంబు చదివి తాళపత్రంబు ద్రిప్ప నంతలో లోచనగోచరుం డైనకౌశికుం జూచి వీ రెవ్వరు కాలాగ్ని రుద్రులవలెఁ గానవచ్చుచున్నవారనిన నతండు వీరు విశ్వామిత్రులు నిజయజ్ఞసంరక్షణార్థము రామచంద్రుం గోరి పంపు మని పంప సందేహించుదశరథుం గాంచి కనలుచుండి రనిన జానకి చేతులు జోడించి. 153

మ. జననాథాగ్రణివై మహేంద్రునివలెన్ క్ష్మామండలం బేలి స
న్మునిసంస్తుత్యమహత్వ మేర్పడఁగఁ బెంపుం గాంచి బ్రహ్మర్షివై
ఘనతేజంబున నొప్పి దేవమునులం గాదాఁడి లోకత్రయం
బున విఖ్యాతినిఁ గొన్నకౌశికుని నెవ్వున్ భక్తి భావించెదన్. 154

వ. అమీఁద నాదికవి మఱియొకపత్రంబు దీసి కూలియున్నయొక రాక్షసిం జూపి. 155

తే. ఇదియె తాటక చూడు మిప్పదమునందుఁ
గూలియున్నది నేలపై ఘోరరూప
మునను శ్రీరామచంద్రునిములుకు లిదిగో
యురమునం దాఁకి వీఁపున నుచ్చి పోయె. 156

వ. అని సర్గాంతరంబు చదువుచు ఱాయి రమణి యగుసందర్భంబు చెప్పిన విని సీత యి ట్లనియె. 157

చ. జగమున నీయహల్య యొకసాధ్వి యటంచును గన్య యంచుఁ జె
ప్పఁగ వినుచుందు మిట్టిసతి స్వఃపతితోడ రమించె నంచు ని
ష్ఠాగి వినినంత నాదుమన మొప్పక యున్నది మాని మీఁదికిన్
దగఁ జను మన్న నాతఁడు ముదం బఱి జానకిఁ జూచి యి ట్లనున్.

తే. తల్లిరో! నాదువ్రాఁతలఁ దప్పు వడదు
గరితకర మంటె నోరుఁ డంట దురిత మగుట
నట్లు వర్ణించుటే కాని యమరవిభుఁడు
కలసె నని తలంచుట తప్పె తెలియ వినుము. 159

వ. అని మఱి కొంతగ్రంథంబు చదివి యిది మిథిలానగరంబు వీ రందఱు
నెందును సందు లేకుండ సందడించుచు శివధనుర్భంగంబు సేయు
రామునిం జూచుచున్నవా రిదిగో విదేహపురాధీశ్వరుండు రామ
చంద్రునికాళులం గడిగి కన్యాదానము చేయుచున్నవాఁడు చూడు
మనినం జూచి జానకి. 160

శా. ధన్యాత్ముండగు నాదుతండ్రి త్రిజగద్వంద్యుండు బృందారకే
ణ్మాన్యుం డైనమహానుభావుఁ డగుశ్రీనారాయణుం గొల్చి తా
నన్యాసాధ్యతదంఘ్రియుగ్మమును హస్తాబ్జంబుల న్మట్టుచుఁ
గన్యాదాన మొసంగెఁ దత్సుకృతమున్ వర్ణింప సామాన్యమే. 161

వ. అని తత్సమీపంబునన రామునకు వైష్ణవధనుర్వరం బొసఁగుచున్న
పరశురాముం గాంచి సంతసించుచు. 162

మ. అవతారంబులలోన నాఱవది యై హర్షొందగాఁ బొల్చు భా
ర్గవరాముం డితఁ డుగ్రకర్ముఁ డని పల్కం జెల్లునే కాని వి
ప్లవముం గల్గుట ధర్మరక్షణ మొనర్పం బుట్టె నంచెంచ దీ
భువి నా వైష్ణవతేజ మిచ్చె నిదె రాముం జేర ధన్వంబుతోన్. 163

తే. అంతలోఁ బుట్టుపుట్టువు నాఁడు త్రిప్పి
సీతమా! చూడు మీయుర్వరాతతాయి
ను లగుమంథర కైకనాఁ దెలియఁ దగిన
వారు నా సీత యను వామలూరుజునకు. 164

మత్త. ఆతతాయిను లంచుఁ బల్కఁగ నౌనె వీరలు రామునిన్
బ్రీతిఁ జూచెదువారు వీరికి వేల్పు లగ్గతి మంత్రమున్
చేతముల్ గలఁగంగఁ జేయుటఁ జేసి రట్టులు వారలే
భూతలంబు నభస్థలంబును గాచినట్టి రనం దగున్. 165

క. ముల్లోకంబుల బాధలు
ద్రెళ్ళం గాఁ జేయఁ గలిగె దేవఋషుల్

వెల్లడిచేసిరి వారిని
ధల్లు లనన్ జగము తెల్లఁదలపఁగ వలయున్. 166

వ. అనినం బ్రాచేతసుం డీపట్లం బరిశీలించిననామతంబు నీమతంబు నొక్కటి యని తెల్లంబు కాక పో దని మఱి కొంత గ్రంథంబు చదివి యీతండు గుహుండు. 167

క. భాగీరథిఁ ధరియించెడు
చో గుహుఁ డీతండు మీకుఁ జొప్పడురీతుల్
తాఁ గలిగించెఁ దలంపఁగ
నీగుణనిధిఁ బోలువార లెవ్వరు ధరణిన్. 168

వ. అని సర్గాంతరంబుం దీసి నిదిగో మాయాకురంగం బనిన సీత దానిం జూడ నొల్లక యి ట్లనియె. 169

శా. మారీచుం డనువీఁడు లేడియగుచున్ మాయాశ్రమప్రాంతమున్
జేర న్నేఁ గని పట్టి తె మ్మనుచు నాజీవేశ్వరుం బుచ్చితిన్
ఘోరారణ్యమునందు నందునను మాకుం గష్టముల్ వచ్చె నీ
క్రూరుం డింతకు హేతు వయ్యెను గనుంగో రాద యీదుర్మతిన్.

వ. అంతం గవిరాట్టు దానిం ద్రిప్పి దశగ్రీవుం జూపినం జూచి సీత వాల్మీకిదిక్కు మొగంబై యి ట్లనియె. 171

—♦ సీత రావణుని బ్రశంసించుట ♦—

తే. లోకవిద్రావణుం డని వాకుపడినఁ
గ్రూరుఁ డై నను నన్నుఁ బట్టికొనుచుఁ బోయి
లంకలోఁ బెట్టి నను వీనివంక నాకుఁ
బుత్రభావంబునం జాలి పుట్టు వినుఁడు. 172

సీ. ఋషివేషమున వచ్చి యే మూర్ఛమునిఁగిన
తఱి నన్ను ముట్టక ధరఁ బెకల్చి
కొనిపోయె నౌదలఁ గొనెఁ గాని దారిలో
నేఖింతతప్పును జేయఁ డయ్యెఁ

దనయింటిలోఁ బెట్టుకొనినఁ దప్పగునని
యుపవనంబునయందు నునిచి మనిచె
నాదురక్షణమున కేది లోపము లేని
గతిఁ గూర్చెఁ ద్విజటాదిసతుల నిల్పి

తే. ఎన్ని యెన్నియొ వారము లేగుదెంచి
బెదురు వచ్చునట్టు లేవియో వదరుఁ గాని
యొక్కనాఁడును దుష్టత్వ మొందె కాని
పనికి జతనింపఁ డయ్యె నీప క్షిగళుఁడు. 173

క. నను మాతృభావముం గొని
కనుఁగొనెనే కాని తప్పుగతి కేనాఁడుఁ
మనముం జేసి యెఱుంగఁడు
ఘనుఁ డాతం డందుఁ గాని ఖలుఁ డన నయ్యెన్. 174

వ. అనుడు నతండు నీ వనినట్లు రాక్షసేంద్రుఁడు తొల్లి నీయిల్లు కాచెడు కావలివాఁడు సేవకుండు వానిచిత్తంబు నీపయి మాతృభావంబుననే యుండె ననుట నిక్కంబనుచున్నంత గర్భంబున నర్భకులూఁకొట్టుచున్న సన్న యెఱింగి యతం డామె కిట్లనియె. 175

తే. సుదతి నీయుదరంబున సుతు లిద్దరు
కలరు రామాయణము వారు తెలియ వినుచు
నుంకె రిదె రెండుశబ్దము లూహామునకు
వచ్చెఁ బండితు లగుదు రావత్స లవల. 176

వ. అని మఱునాఁడు మఱియుఁ బురాణకాలక్షేపంబున కుపక్రమించి చదువుచు నొక్కప్రక్కం బడియున్న పక్కిఱేనిం జూపి యాతండు జటాయు వనిన సీతాదేవి కన్నుల నీరు నించుచు. 177

చ. ఖలుఁ డగుపక్షికంధరుఁడు కర్కగనఁ జానక నన్నుఁ గొంచుఁ బోఁ దెలిసి యితండు శౌర్యమున దిక్కులు పిక్కటిలంగ నార్చుచున్ గల నొనరించి రాక్షసుని గం డడఁగించియు మించి నాకుఁ గా నిల నిటు తెళ్ళ నయ్యె నయొ యే మని చెప్పుదు దైవనిర్మితిన్.

తే. అంత వాల్మీకు లానాఁడు కొంత చదివి
నిలిపి మఱునాఁడు సీతతోఁ బలికె నిట్లు
తల్లి! నానాఁటికిని నీకు దౌహృదమున
బడలికలు పెచ్చునట్లయ్యె నొడలియందు. 179

వ. సర్వవిషయంబులం గాక ముఖ్యవిషయంబులు మాత్రము ముచ్చటింతు నని యిదిగో నీవార్తం దెలిపి రామున కానందం బాపాదించిన హనుమంతుం డనిన సీత వానిం జూచి నాకన్ను లెంత ధన్యంబు లీపరోపకారపరాయణు నీయసహాయశూరుంజూడఁ గంటి నని. 180

ఉ. దిక్కును మొక్కు లేనికడ దీనదశం బడి పొక్కుచున్ననా
కిక్కపివర్యుఁ డారఘుకులేశ్వరుచల్లనివార్త దెల్పి న
న్నక్కట మిత్తివాతఁ బడునట్టియెడం బడకుండఁ గాచె నా
కెక్కువచుట్ట మన్న నితఁడే యగుఁ గాదె తలంచి చూడఁగన్. 181

వ. అంత మునీంద్రుండు కొన్నిసర్గలం జదివి యిది కిష్కింధాపురం బిది వానరసైన్యం బిది సేతుబంధం బిది లంకాపురం బిది సమరాంగణం బని చెప్పి వేలకొలందిగం బడియున్న రావణుశిరంబులం జూపుచు. 182

క. శివునిశిరంబునయందున్
బ్రవిమలమతిఁ బూజ సేయఁ బడయెడిశిరముల్
శివ!శివ! గ్రద్దలు దన్నగ
భువి దొల్లెడు కర్మఫలము పో యిది తెలియన్. 183

వ. అని మఱియు నిది కుబేరపుష్పకం బిది యయోధ్యాపురం బిది పట్టాభిషేకోత్సవం బని చెప్పి నీ కిప్పు డుత్తరకాండంబు సవిస్తరంబుగం జెప్పు టొప్పదు కావున నించు కించుకఁ జదివి రామాయణకావ్యం బంతయు సమాప్తి నొందించి శాంతిం గావించె నంత సీతాదేవికి నవమాసంబులు నిండ నొకనిశాసమయంబున నవ

గ్రహంబు లేకాదశస్థానఫలంబు లిచ్చుచుండ నొక్కశుభలగ్నం
బునఁ గుమారయుగ్మంబుం గాంచె నంత. 184

—♦ సీతకుఁ గుశలవులు పుట్టుట ♦—

సీ. మంత్రసాని కుమారమణులకు నాభులు
గోసి లాలం బోసి వేసెఁ బొగలు
బొత్తిళ్ళనుండినఁ బుడుతలకున్ రక్ష
లం గట్టె వాల్మీకు లంగనలును
బాటలు పాడిరి వచ్చి వసిష్ఠులు
సీతాపతిం దెచ్చి జాతకర్మ
మాచరించె నృపాలుఁ డవనీసురుల కెన్నొ
దానంబు లొనరించెఁ దనియ నట్లు

తే. చేసి పుత్రోత్సవము పురసీమలందు
మేళతాళము లొప్పఁగ వేలకొలఁది
విత్తమును వస్త్రములుఁ బండ్లు వీటఁ గలుగు
వారికిం బంచిపెట్టి రవ్వారి గాఁగ. 185

—♦ శ్రీరాముఁడు సుయజ్ఞాదుల కనేకదానంబు లిచ్చుట ♦—

వ. పదిదినంబులు కడచినపదంపడి వసిష్ఠానుమతంబునఁ గుమారులకు
బారసాలం జేయ నెంచి బ్రాహ్మణోత్తముల నెల్ల నాహ్వానంబు
గావించె నప్పుడు పురోహితుండు పుణ్యాహవాచనపురస్సరంబుగా
నామకరణంబును గావించి కుశలవు లని కుమారులం బిలిచి రయ్యా
వసరంబున రామచంద్రుండు. 186

సీ. గురువసిష్ఠునిపుత్రకుని సుయజ్ఞునిఁ బిల్చి
మణికుండలంబులు మఱియు హేమ
మయవలయంబులు మణులు సువర్ణముల్
పీతాంబరము లిచ్చి ప్రేమఁ జేసి
కౌశికాగస్త్యాదిఋషుల నాహ్వానించి
పూజించి బహురత్నముల నొసంగి

గోసహస్రము లిచ్చి కొంతసువర్ణము
రజతంబును నొసంగి రమణఁ గొలిచి

తే. అవలఁ దైత్తిరీయాచార్యు నటకుఁ బిలిచి
స్వర్ణకౌశేయవస్త్రముల్ వాహనములు
పశుధనంబు నొసంగి సంపన్నుఁ జేసి
పుచ్చి మఱియును గలవారిఁ బూజ చేసి. 187

వ. మఱియు గార్గ్యఘాలకుద్దాలప్రభృతు లగుమునిసత్తములకు నుత్తమ గోభూ హిరణ్యవాసోధాన్యాదుల నొసంగి పూజించె నంతఁ ద్విజ టుం డనుభూసురుండు భార్యాప్రబోధితుం డయి రామునిసమ్ము ఖమ్మున కరుగుదెంచి దీవించి యి ట్లనియె. 188

మ. బహుపుత్రుండ నిరర్థకుండ నటవిన్ బాధోంఛవృత్తిన్ దినం
బు హరిధ్యానపరాయణత్వమునసే పోఁ జేయుచున్నాఁడ స
న్మహము నీకు శుభాశిషంబులను జేయం జాలియుందున్ రఘూ
ద్వహ నన్నుం గరుణించి నాకుబహులార్థంబుల్ బ్రసాదింపవే. 189

వ. అనిన రాముం డతని కి ట్లనియె. 190

శా. ఓశత్రుంజయ నీకు నాలఁ గయికో నుల్లంబ యౌ నేని బా
హాశక్తిం గొని దండముణ్ విసరి కో మ్మాలోనిధేన్వాదులన్
నా శాటిం గటిఁ జుట్టి బ్రాహ్మణుఁడు ప్రాణం బ్రిప్పి వైచె న్నదీ
దేశం బంటెడు నట్లు దండము వడిణ్ దీపించుచున్ దిక్కులన్. 191

వ. రామచంద్రుం డాలోఁ గలధేనువుల నన్నింటినిం గోపాలురం బుచ్చి త్రిజటునింటికిం దోలించె నప్పుడు కినుకం జూపుగార్గ్యునిం గని రామభద్రుండు. 192

చ. కనలకు మీవు నీకుఁ గనకంబు నొసంగుదు నీమణిం గరం
బునఁ గొని మీఁదికిన్ విసరి పొందుము పొందుగ నంతమొత్తు కాం
చన మన నట్లు గర్గ్యుఁడును సల్పి కొనెం ధనరాశి నంతయుణ్
మునులకుఁ గోరిన ట్లపుడు సొల్పి పొనర్చెను భూరిదానముల్. 193

వ. ఇట్లనేకదానంబు లొనర్చి సర్వభూతసంతృప్తి గా నన్నదానంబునుం గావించి పదంపడి తాపసులసందేశంబునంజేసి లవణాసురసంహారంబు సర్వప్రయత్నంబునం జేయ నెంచి. 194

—♦ లవణాసుర సంహార ఘట్టము ♦—

ఉ. దీక్షితుఁ డయ్యెఁ గావునఁ బ్రదేశము మాఱి మఱొండుచోటికిన్
రాక్షసునిన్ వధించుటకు రాముఁడు పోవుట కైతి గామి దా
నాక్షితి నేలునాలవణు నార్పుటకుం గడగొట్టుతమ్మునిన్
శిక్షితుఁ బంపగాఁ దలఁచి చేరఁగ ర మ్మని వాని కి ట్లనెన్. 195

శా. శత్రుఘ్నా! వ్రతదీక్షితుండ నగుటన్ సంగ్రామముంజేయ నే
మాత్రంబున్ దగ దంచు దేశికుఁడు సంభాషించుటన్ నాకు నా
శత్రుం జంపఁగఁ బోవ నొప్పమి మహాసైన్యంబుతోఁ బుచ్చెదన్
శత్రుఘ్నుండవ వై తదీయనగరీశత్వంబు గైకొ మ్మొగిన్. 196

తే. అనుచుఁ దేజోమయంబగు నస్త్రరాజ
మొక్కఁ డాతని కిచ్చి యో మొక్కలీఁడ
యిది మహావైష్ణవాస్త్రము పద నెఱింగి
యేయ నఖిలప్రపంచము మాయ మగును. 197

వ. దీని నీకడ నుంచుకొనుము లవణాసురునికడ రుద్రదత్తంబును రౌద్రంబు నగు శూల మున్నది యది వానిచేత నుండెనేని జయించుట రుద్రునకును సాధ్యంబు గాదు నీవు జాగరూకుండ వై వాని సంరంభం బంతయు నెఱింగి సంహరించి రమ్మని యంపి పుచ్చుటయు నతండు తల్లులకు నన్నలకు గురువులకు నమస్కరించి నానావిధసేనాసమేతుండై పోయి లవణాసురుం డూర లేనికాలం బెఱింగికొని మధురాపురబహిర్ద్వారంబు ముట్టడించియున్నంత లోన.

చ. వడివడి రాక్షసుల్ పఱచి వన్యమృగంబుల వేటలాడఁగా
వెడలినవాని కంతయును విన్నపముం బొనరింపవాఁడునున్
నిడుపఁడు వోలె కన్ను మని నెట్టన రోజుచు నట్టె వచ్చి యె
వ్వఁడవుర దారి నిల్చి తని పల్కుచు నల్క జనింప నుండుఁడున్. 200

వ. శత్రుఘ్నుండు వాని నెఱింగి యి ట్లనియె.

ఉ. రావణమారకుం డయినరామునితమ్ముఁడ నిన్నుఁ ద్రుంపఁగా
నీవఁగ వచ్చినాఁడ నెట కేఁగెదు నే నిటు నిల్చియుండఁగాఁ
బోవఁగ శక్యమే యనుచుఁ బొల్లులు వోసిశిలీముఖంబులన్
రావణునల్లు నాలవణు రాత్రిచరుం బ్రహరించె నెంచఁగన్. 201

మ. లవణుం డిట్లను నాసమక్షమున నీలా వెంత నీ వెంత రా
ఘవు లన్నన్ దృణ మట్టు లేఁ దలఁప నోకాకుత్స్థవంశాధమా!
తవు నీచెయ్దము లేను పోయి యిడె శస్త్రం బంది వే వచ్చి నీ
దవుప్రాణంబును దీయువాఁడ నని పో నట్టిట్టు వీక్షించుచున్. 202

ఆ. నిన్నుఁ బోవ నిత్తునే క్రూర యని శత్రు
సూదనుండు వేఁడిఁ జూపుతూపు
గములు వానిమేనఁ గడునొవ్వ పుట్టఁగఁ
జొనిపె నంత రాక్షసుండు కనలి. 203

సీ. వృక్షమొక్కఁడు దీసి రూక్షముగా శత్రు
సూదనుపై వైవఁ జూచుచుండ
దాని శత్రుఘ్నుండు దఱిగె ముక్కలు గాఁగ
వాలారుతూపుల వడిగ నేసి
మఱియు నెన్నెన్నియో తొమ్మిరుహంబుల నేయ
నన్నింటి నపుమన యతఁడు నఱికి
లవణుని నొప్పింప లవ మైన జంకక
పెనుమ్రాఁకొకఁడు దెచ్చి పెట్టి కొట్టె

తే. దానఁ నాతఁడు మూర్ఛితుండై నెఱి చెడి
పడి యొకింతతటిలో నిల్చి కడువడి మొఱ
తనకు రాముఁ డొసంగినదారుణాస్త్ర
మును బ్రయోగించె వేల్పుల మ్రొక్కికొనుచు. 204

- అది యాతనివక్షమందున్
భిదురము గిరిమీఁదఁ బడినవిధమునఁ బడియెన్

మదమత్తుఁ డాతఁ డత్తఱి
హృదయము పగులంగఁ గూలెఁ బృథివీస్థలిపై. 205

వ. ఇట్లు శత్రుఘ్నుండు లవణాసురు సంహరించి పిదప మధురాపుర ప్రవేశంబు చేసి కైవసంబు గావించుకొని సేన నందు విడియం జేసి తాను రామదర్శనలాలసుండై సాకేతంబునకుం జనియె నక్కడ.

—♦ రాముఁడు మృతుండైన విప్రబాలుని బ్రదికించుట ♦—

సీ. ఒకనాఁ డు మృతుఁ డైన సుకుమారదేహునిఁ
బంచాబ్దములవాని బాలు నొకనిఁ
గొని దంపతులు మోచికొని వచ్చి రాజగృ
హంబుముంగిట వైచి వ్యథ మునింగి
హా! కుమారక! చచ్చితే కన్న మముఁ బాసి
యేలోకమున కేగి తీవు చావుమ
నేను నీతల్లియు నీతోడ రానున్న
వారము నే పింత దారి నిలుము

తే. రాఘవులు రాజ్యమేలుఘుస్త్రంబునందు
నిట్టివిద్దూర మెన్నఁడు పుట్ట దకట
రాముఁ డేలెడునప్పు డక్రమ మిదిట్లు
కలిగె నేమన వచ్చు నాకర్మమునకు. 207

తే. ఇది మదీయదోషము కాదు మదిఁ దలంపఁ
జేయలే దింతతప్పును నాయతివయు
రాజ్యపాలుర దోష మీక్రమము దెచ్చె
దీని రాజు విచారింపఁ బూనఁ డేని. 208

వ. మే మిద్దఱము నీబాలునితో నిటఁ బడి చచ్చెద మని గోల్లున నేడ్చుచున్నంత రామచంద్రుం డయ్యార్తధ్వని విని భరతలక్ష్మణ

శత్రుఘ్నులతో వసిష్ఠవామదేవాదులతో సుమంత్రాదిమంత్రులతో నట వచ్చి నచ్చటిదృశ్యం బంతయుం గని మిగుల వగలం బొగులుచు. 209

శా. నారాజ్యంబునఁ బెద్ద లుండ నిటు పిన్నల్ పోవుటల్ చూడఁగా
నే రా జొటకు నర్హతం గలిగి లేనే యంచు దుఃఖంతు నీ
ఘోరత్వం బెటు బాపరించెనో కనుంగో నెంతు కా దేని నే
నీరాజ్యంబును బ్రాణము న్విడుతు నొక్కింతైనకాలంబునన్. 210

వ. ఆవాక్యంబు విని మంత్రులను సామంతులను భ్రాతలను బరిపరి విధంబులఁ బరితపించుచున్నసమయంబున నారదమునిచంద్రుండు రామచంద్రున కిట్లనియె. 211

సీ. వినుము చెప్పెద రామ! మును బరమేష్ఠి తా
నాల్గువర్ణములకు నలువు మీఱ
ధర్మములం జెప్పెఁ దత్క్రమంబునఁ బ్రజల్
వర్తిలుచుండి రేయార్తిలేక
యిపు డందు నందు నొక్కించుక ధర్మవి
ప్లవ మగుచుండుటల్ వచ్చెఁ గనఁగ
నొక్కశూద్రుఁడు శైవలోత్తరపార్శ్వము
నందు ఘోరము తపం బాచరించు

తే. నద్ది విప్రోత్తములు చేయునట్టి దితరు
లెవ్వరుం జేయ నొప్ప దీహేతువున న
ధర్మ మిలఁ బర్వె దాన నీధరణిసురుని
బాలుఁ డీలిగె నిది నిన్నుఁ బట్ట వచ్చె. 212

వ. రాజ్యపాలనంబున రాజునకుఁ బ్రజ లొనర్చినపుణ్యంబున నాఱవ పాలు ప్రాప్తించు నట్ల పాపంబు నిపుడు నీవాశూద్రమునితపం

బుజిగించితివేని యీవిప్రబాలుండు పునర్జీవితుం డగు నిది నీకుం జెప్పుటకై యీనాఁడు నీకడకు వచ్చితి నని నారదుం డరిగె నంత రాముం డావిప్రబాలుని కళేబరంబు చెడకుండఁ దైలగుప్తమ్ముగావింపం జెప్పి యప్పుడు తలంచినంత వచ్చినకుబేరపుష్పకంబుపైఁ దమ్ములతో నధిష్ఠించి దక్షిణదేశంబున నున్న సరోవరంబుకడఁ దలక్రిందుగం దపించు వానిం గాంచి యిట్లనియె. 213

ఉ. ఎవ్వఁడ వీవు నామ మది యెట్టిది యేఫల మాసఁ జేసి నీ
వివ్విధి ఘోర మైనతప మిట్లు పొనర్తువు చెప్పు మన్న వాఁ
డవ్వరమూర్తి గాంచి నిజ మాడెద నేనుఁ జతుర్థజాతుఁడన్
నెవ్వగఁ దీర స్వర్గమును నే మెయితోఁ జననై తపించెదన్. 214

వ. నాపేరు శంబూకుం డనిన రామచంద్రుండు నీవు శూద్రుండవై మహర్షులలో నగ్రగణ్యులు పొనర్పం దగుదుష్కరతపంబుఁ పొనర్చుచుంటి విది ధర్మవిప్లవంబు నేను దశరథాత్మజుం డగు రామభద్రుండ దీని నిప్పుడ విడనాడి స్వసర్మనిరతుండ వగు మట్లుకాని నాఁడు నిన్ను శిక్షింతు ననిన శంబూకుం డొండాడ నోడి తన మనోరథం బంతయు నింతటిలోనం జాపుకొని నిష్ఠయు నియమంబును విడనాడి శూద్రధర్మం బంగీకరించి రాముని పాదారవిందంబుల కభివందనం బాచరించి చనియె రాముండు నిట్లు వాని తపోభంగంబు గావించి నిజపురంబునకు నిర్గమించె నప్పు డాశూద్రుండు స్వధర్మనిరతుం డయ్యె నంత నావిప్రబాలుండు పునర్జీవితుం డయ్యె దాన నయ్యెడ మహోత్సవంబు సాకేతపురంబునం బ్రవర్తిల్లె నక్కాలంబున రామచంద్రుండును. 215

—♦ శ్రీరాముఁ డశ్వమేధము గావించుట. ♦—

తే. నాకులంబున నిక్ష్వాకునాఁటినుండి
యాయజూకులై రాజేంద్రు లైనవార

లెల్లరును వాజిమేధము లెన్నొ చేసి
దురితములఁ బాసి పర మరది గరిమ గనిరి. 216

వ. నేను నాపూర్వులు నడచినమార్గంబున నడచువాఁడం గావున నధ్వరకర్త నగుట విధ్యర్థం బని నిశ్చయించుకొని మించినవేడ్క నశ్వమేధంబు సేయనెంచి తమ్ములం గాంచి తల్లులసమక్షంబునఁ దనమనోరథం బెఱింగించి వసిష్ఠవామదేవాదుల నామంత్రణంబుఁ జేసి శుభసమయంబున నశ్వమేధ సంకల్పంబు గావించి సుగ్రీవ విభీషణాదుల సపరివారంబుగ రాఁ బిలువం బుచ్చి దేశంబులం గల తపోధనుల నెల్ల రావించి నటనర్తకాదుల నాహ్వానించి నైమిశంబునం గల గోమతీతీరంబున యజ్ఞశాలలు వేయించి వేలకొలఁది బారువులధాన్యాదులును బుట్లకొలఁది ఘృతాదులు నర్బుదంబులు న్యర్బుదంబులు సువర్ణరత్నాదులును సంతరింపంజేసి సర్వంబును భరతుండు సంరక్షించు చుండు నట్లును సమాగతు లగురాజాధిరాజులఁ బౌరజానపదులఁ దక్కినవారిం బాలింప శత్రుఘ్ను నియోగించి ఋత్విగ్వరణం బైనపదంపడి సవనాశ్వంబు విడిచి దానిసంరక్షణంబునకై ససైనికుం డగులక్ష్మణుం బుచ్చి సప్తతంతుతంత్రంబు ప్రవర్తింపఁ జేయుచుండె నప్పుడు. 217

సీ. విధివిహితాధ్వరవిధులు ప్రవర్తిల్లె
నెల్లెడ సర్వసమృద్ధ మయ్యె
నెందు లే దనుశబ్ద మేవేళ విన రాదు
విన వచ్చు వలదు మా కనెడునుడుగె
యపు డందుఁ దృషితుండు నాఁకలి గొన్నవాఁ
డర్థార్థి యగువాఁడు నరయ రాఁడు
వేరికి నెయ్యది కోరిక యో యది
వారికి నప్పుడ వచ్చియుండు

తే. అన్నరాసు లాకాశము నంటియుండు
నాజ్యము తటాకరూపము నంది యుండు
స్వర్ణ మది మేరుసామ్యము వడసి యుండు
గౌసలేయునిహయమేధకాలమందు. 218

ఉ. ఆసవనాంతరాంతరములందుఁ గుశీలవు లైన రామనా
మాసురవైరినందను లహర్నిశ మాదికవీంద్రుపంపునన్
భాసురతీలఁ దాళలయవాద్యసమంచితరీతి గానమున్
జేసిరి రామచంద్రుకథ చెప్పినచొప్పున నొప్పు మీఱఁగన్. 219

సీ. సమయముల న్యజ్ఞశాలలం దితరకా
లములందు రథ్యల సుముఖు లైన
బ్రాహ్మణగృహముల రాజమార్గములందు
ఋషులు ఋత్విజు లుండుగృహములందు
రాజమాతలకడఁ బూజాగృహంబుల
గోమతీ నదిచెంత గోష్ఠములను
దంత్రీలయసమన్వితముగ వీణావేణు
సాధనంబుల శాస్త్రసమ్మతముగఁ

తే. గుశలవులు రామచరితంబు కొనవఱకును
మధురగాన మొనర్చి రామఘుదినముల
దేవతాగాన మిది యని భావలయము
వార లెల్లరు సంతోషభరితు లైరి. 220

వ. అట్లు నానాప్రదేశంబుల రామాయణగానంబు ప్రవర్తిల్లుచుండ రామచంద్రుండు భరతలక్ష్మణశత్రుఘ్నసమేతుండై ప్రతిదినం బును గర్మావసానంబున మహామునులు రాజులు పండితులు పౌరా ణికులు శబ్దవిదులు వృద్ధబ్రాహ్మణులు స్వరలక్షణజ్ఞులు కావ్యలక్ష

ణజ్ఞులు కవులు గాయకులు పదాక్షరవిచక్షణులు ఛందోజ్ఞాన నిధులు జ్యోతిషికులు భాషాతత్త్వవేత్తలు హేతువాదకుశలులును గీతనృత్తవిశారదులు లోనగునెందఱనో సమావేశంబు గావించి వాల్మీకిసమక్షంబున నతని శిష్యుల కుశలవులచే దినదినమున కిరువదిసర్గలవంతున గానంబుఁ జేయించె నిట్లు హయమేధసమాప్తిం గావించిన యనంతరంబ. 221

సీ. పదునొకండగువేలు వర్షము లిల రామ
చంద్రుఁడు పాలించుసమయమందు
నూఱశ్వమేధముల్ భూరిదక్షిణలతోఁ
బొనరించె మఱియు నప్పుడును నపుడు
వాజపేయంబులు పౌండరీకంబులు
విశ్వజిత్ప్రభృతులు వివిధసవము
లెన్నియేనియుఁ జేసె నెన్న దేవతలు భూ
దేవతలును జగద్విశ్రుతముఁగ

తే. మునుల మన్నించె వాల్మీకిముఖ్యకవుల
నాదరించి బహూకృతు లాచరించె
భూప్రజలఁ గన్నప్రజ లట్లు ప్రోచెఁ గాచి
రామచంద్రుఁడు పూజ్యసామ్రాజ్యమునను. 222

క. తల్లులు తమ్ములు కొమ్మయుఁ
బిల్లలు బందుగులు సఖులు ప్రెగడలు ప్రజలున్
మొల్లముయి కవియ రాముం
డెల్లజగం బేలె సౌఖ్య మెసక మెసంగన్. 223

సీ. వాల్మీకిమునిరాజకృతమై మహితం బగు
నాదికావ్యంబు రామాయణంబు
వినినఁ బఠించిన వివిధపాపవిముక్తి
యగు సుకృతము నరు నంట వచ్చుఁ

బుత్రకాముఁడు పుత్రుఁ బొందు ధనార్థియు
ధనధాన్యముల నొందు ఘనతరముగ
విజయ మాయుష్యము వి స్తరించును గీ ర్తిఁ
గలిగి సౌఖ్యంబునఁ గ్రాలుచుండు

తే. బుద్ధి సౌభ్రాత్ర మారోగ్యమును యశంబు
నాయువును శ్రీయు బలము సౌఖ్యము కుటుంబ
వృద్ధియును గోసమృద్ధియు బుద్ధిభద్ర
ములును రామాయణశ్రుతివలనఁ గలుగు. 224

సీ. ఆదికవీంద్రరామాయణార్థము గల
దయ్యు శ్రీకృష్ణరామాయణంబు
సకలార్థముల నెప్డు సమకూర్చుటయు కాక
కొన్నివిశేషము లెన్ని తెలుపు
రావణాసురదోషరాహిత్యముం జెప్పఁ
గైక త ప్పట లేమి వాకొను నొగి
సతి యహల్య యటంచుఁ జాటించు ననసూయ
యంగరాగమహత్వ మనువదించు

తే. రజకవాగ్గతరఘురామవృజిన మడఁచు
శంబుకవధంబు గానట్టిచక్కిఁ జూపు
నెందు నెందును గుణముల నేరి చెప్పఁ
గృష్ణరామాయణం బిది కీ ర్తితంబు. 225

తే. శాలివాహనశకవర్షసంఖ్య విశ్వ
సృ ద్రుతు గ జోర్వ్యాలం బొంది చెలఁగుచుండ
సర్వజిద్వర్షమునఁ గవిసార్వభౌమ
కృష్ణశాస్త్రి రచించె నీకృతివరంబు. 226

క. అని శౌనకాదిమునులకు
వినిపించెను సూతుఁ డిట్లు వినయముతోడన్
జనులార ! మీరు దీనిఁ
గని చదువుఁడు వినుఁడు శుభము కలిగెడు మీకున్. 227

—♦ ఆ శ్వా సాం త ము ♦—

మంగళమహాశ్రీ.

పట్టమును గైకొనినపై ప్రజలు రాజులును
భ్రాతలును బెగ్గడలతోడన్
దిట్టపడి రాజ్యమును దేజమున నేలుచును
దివ్యసవముల్ సలుపుకొంచుం
బుట్టినకుమాళ్ళు గల పూరుషుఁడు తానగుచుఁ
బొల్పెసఁగురాఘవుఁడు పేర్మిన్
మెట్టెడు నుదారగుణు మిక్కిలి దయ న్మనుచు
మేల్గలుగ నీదరకులేంద్రుడున్. 228

గ ద్య ము.

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ, కవి
సార్వభౌమాంధ్రవ్యాసాభినవ శ్రీనాథ వేదవిద్యాశారద
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన శ్రీకృష్ణ
రామాయణంబునం దుత్తరకాండంబున
సర్వంబును బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

పుట పంక్తి తప్పు ఒప్పు
208–18 వవసితాభ్యం–దవసితాభ్యం
,, –18 విశేషణంబులును–విశేషంబు
లును
205–23 నిట్టులాడ–లిట్టులాడ
206–26 ద్వంద–ద్వంద్వ
208–4 శ్రుతి–శ్రుత్రి
209–2 సేరిని–సేవిని
,, –5 నొదలించు–నొదవించు
,, –22 గావలి–గావర
210–19 నీకింక–నీవింక
213–22 దివ్యి–దివ్య
215–12 సమయ2–సమయం
216–18 సారిదించెప్పుచు సత్పురోహి
తునితో శోభావహంబౌనిశం
226–8 దాని–వాని
246–16 యంతము–యంతయు
,, –21 తులువలువెల్ల–తులువలకెల్ల
247–25 వరంబునయి–వరంబుపయి
248–7 కదు–కడు
,, –15 బలికించి–బలికి
250–15 చెట్టునన్–బెట్టునన్
253–18 నిండెనంగ–నిండెననంగ
261–8 మునీంద్రుఁడవై–మునీంద్రుఁ
డనై
271–6 గిట్టిను–గిట్టును
298–3 సేత–సీత
,, –12 దీపించె–దీవించె
,, –13 భరితాంగుండయ్యె–భరితాంత
రంగుండయ్యె
,, –17 డెదియజేయు–డెఱియఁజేయు
804–10 కట్టు–కట్టి
806–4 మిమ్ము–మిమ్ము
,, –18 నేసినది–నేసెనది
807–15 తన్మస్థితివై–తన్మస్థలిపై
810–7 సలిలా–సలిలా

పుట పంక్తి తప్పు ఒప్పు
312–24 నీరిబాధ–వీరిబాధ
331–19 సారద–సాదర
349–13 ధరఁగయిసేయు సారథులఁ
దారయిపోరిరి వీరులుద్ధతిన్.
350–18 క్రమార్వ్య–డోగ్రమార్వ్య
355–7 పురస్తరంబుగ–పురస్సరంబుగ
359–10 పడక–పడఁగ
374–22 రుసిమై–రుసియై
375–11 తపోమానులార !–తపోధనా
నూనులార !
376–27 రేఁబళ్ళను–రేఁబవళ్ళను
377–27 మణియంబులు–
మణిమయంబులు
380–8 దవానలంబు–దవానలంబు
380–14 పృథులో–తృథులో

కిష్కింధా కాండము

9–16 వారికి–వానికి
10–11 నతండును–నితండును
10–21 జనిప్రార్థించి–జనివారం
బ్రార్థించి
11–13 నిర్ణవించె–నిర్గమించె
24–17 గలగు–గలదు
38–10 బొదవిన–బొదలిన
42– 2 బెంచి–చెంది
45– 9 నిశ్చమెయి–నిచ్చమెయి
,,–17 వలను–వలసు
,,–20 యుండియున్–యుండినన్
46– 1 వేనవేటోళ్ళ–వేనవేలోళ్ళ
47– 6 వధనిధి–వననిధి
51–18 సుపర్ణ–సువర్ణ
52–11 అసురా–అగురా
55– 4 సమగ్రమలు–సమగ్రములు
,,–27 సదసద్వృత్తము–సదసద్వ్రృ
త్తము
56–15 వేసి–వేసి

| పుట పంక్తి | తప్పు ఒప్పు |
|---|---|
| ,,-23 | నింక-నాక |
| 57-18 | జిలువన్-విలువన్ |
| 62-16 | తండ్రి-తంద్ర |
| 64-21 | ప్రాన-స్థాన |
| 69- 9 | పతనప్ర-పతనాత్ర |
| ,,-12 | లిచ్చిబ్రచ్చు-లిబ్బిబ్రబ్బు |
| 70- 5 | దుండునడుగు-దుండుమతియు నడుగు |
| ,,-23 | విక్రమూర్తి-విక్రమమూర్తి |
| 71-18 | వీల-లీల |
| ,,-,, | వేడొకండు-లేడొకండు |
| 72-18 | లేక-పీక |
| ,,-,, | మళ్ళ-మళ్ళి |
| 73-27 | వడకి-వడికి |
| 74-24 | ఈపంక్తి తీసివేయవలెను. |
| 78-18 | నాద్యుత్తర-వాగ్యుత్తర |
| 79-19 | చుండెప్పుడున్-నెల్లప్పుడున్ |
| 81-15 | సురయను-సురసను |
| 82-21 | జోఁడు-వాఁడు |
| 82-26 | సుర-సురస |
| 84-13 | కార్యములం-కావ్యములం |
| 92-10 | నీపతి-నీసతి |
| ,, -20 | మండోదరి-మందోదరి |
| 93- 8 | బతి-బ్రతి |
| ,, -17 | యంకిలి-యంగిట |
| ,, -23 | నూది-నూటి |
| 96-11 | కన్నీరు-కన్నీ |
| ,, -18 | చక్కని-చక్కని |
| 97-17 | నాకుగండు-నామగండు |
| 98- 8 | కొంక-కొంత |
| 99-14 | ప్రఘణాది-ప్రఘసాది |
| 100- 5 | వైతివ-లైతివ |
| 101-28 | వల్లని-నల్లని |
| 102- 6 | జలును-జలుల్ |
| 105-20 | వలువు-వలువ |

| పుట పంక్తి | తప్పు ఒప్పు |
|---|---|
| 110-14 | నరయు-నరచు |
| ,, -17 | వమ్మ-నమ్మ |
| 112-11 | గొంత-గొండ |
| 118- 8 | నేతకన్-నేతకున్ |
| 136- 6 | నుడుఁవ-నుడుఁప |
| 144-21 | గాంచి-గాచి |
| 145-21 | యాత్ర-యంత్ర |
| 159-16 | ఘనులు-ఘనుల |
| 161- 7 | నియ్యాది- నయ్యాది |
| 162- 6 | బెంచగ-బెంచంగ |
| 167-18 | దరులు-రులు |
| ,, -19 | సైన్యంబుపార-సైన్యంబపార |
| 171-19 | ధైర్యా-ధైర్యా |
| 174- 4 | సౌరణుండు-సారణుండు |
| ,, -20 | విటకు-వటకు |
| 176- 3 | మంగసూత్రము-మంగళ సూత్రము |
| 184-25 | చకగుడోపల-చక్రగుడోపల |
| 191-10 | వరములు-వర్షముల్ |
| 201-19 | రావణుఁడ-రాక్షసుఁడ |
| 216-15 | లేని-లేచి |
| 272- 7 | రఘువరు-రఘువీరు |
| ,, -18 | రావణాత్మజుని-రావణానుజుని |
| 315-8 | వినరి-విసరి |
| 317-14 | అంజిలి-అంజలి |
| 318-10 | నేసె-నేసె |
| 319-12 | నీపు-నీవు |
| 326-18 | పెచ్చుచు-మెచ్చుచు |
| 343-4 | పడియుండె-పడెనిట |
| 351-15 | గూర్పఁజెలు-గూర్పఁజెల్ల |
| 352-7 | నచ్చె-వచ్చె |
| 372-11 | కృపాంత-కృపాత |
| 377-8 | పెడ్డాము-పెండ్లాము |
| 406-4 | శిష్యులలగు-శిష్యులగు |